# శ్రీ దేవీ భాగవతము (ఆంధ్రము)

## ప్రథమ భాగము

ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ స్కంధములు




రచయిత

**విద్వాన్ అగస్త్యరాజు సుబ్బారావు**

11-33-991/6, బాలాజీ వీధి, వెంగళరావునగర్,

కావలి, శ్రీపొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా.

ఫోన్ : 9441767160



ప్రథమ ముద్రణము : 2011, జూలై

ప్రతుల సంఖ్య : 1000

ముద్రణాలయము పేరు : అబిగ్రాఫిక్స్
పంజాబ్‌నేషనల్ బ్యాంక్ ఎదురుగా,
స్వాతీ కాంప్లెక్స్, ట్రంకురోడ్డు, నెల్లూరు

ప్రాప్తి స్థానము : **అగస్త్యరాజుసుబ్బారావు**, రచయిత
బాలాజీవీధి, వెంగళరావునగర్,
కావలి, శ్రీపొట్టిశ్రీరాములు నెల్లూరు జిల్లా.



మూల్యము
రూ. 150/-



# ఆశాసనము



**డాక్టర్ చీమకుర్తి వేంకటేశ్వర రావు**
యం.ఎ., పిహెచ్.డి
విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు
దొడ్లకౌసల్యమ్మ ప్రభుత్వ మహిళా పి.జి. కళాశాల
ఆస్థాన పండితులు, శ్రీ సత్యానందాశ్రమము
ఇనమడుగు, నెల్లూరు జిల్లా

ప్రపంచాన్ని మైమరపింప చేస్తూ హృదయాన్ని పరిశుద్ధం చేసేవి లలితకళలు. సుకవితాయద్యస్తిరాజ్యేనకిం అన్న మహాకవి సూక్తి ననుసరించి లలితకళలలో అగ్రస్థానాన్ని పొందిన కవిత్వం ఉంటే ఇక రాజ్యసుఖం అక్కర్లేదని తెలుస్తూఉంది. అంటే రాజ్యసుఖంకంటె కవితా సుఖం చాల గొప్పదని స్పష్టంఅవుతుంది.

కేవలం ధనసంపాదనే ధ్యేయంగా వ్యవహరించే ఈ రోజుల్లో కవిత్వాన్ని ఎక్కువగా ఆదరించడం లేదు. పఠించడం లేదు. అయినా కొందఱు మహానుభావులు భగవంతుడిచ్చిన ప్రతిభాసంపదను, కష్టించి సంపాదించిన పాండిత్యాన్ని వ్యర్థం కానీయక కొన్ని గ్రంథాలను వ్రాస్తూనే ఉన్నారు. గేయకవితాప్రాచుర్యంగల ఈ ఆధునిక కాలంలో గూడా, పద్యకవిత్వానికి ఆదరణకరవైనా ఆవాగ్దేవి కొందఱిలో ఆవహించి చక్కనిరసరాజములగు కావ్యాలనేకాక భక్తి ప్రధానములగు కావ్యాల్నిగూడ వ్రాయిస్తూవుంది. సంగీతము భక్తివినాశోభించదని త్యాగరాజు పల్కినట్లుగా సాహిత్యంగూడా భక్తిసమన్వితమైనపుడు చక్కగా శోభిస్తుంది. ఆవిధమైన భక్తి సమన్వితగ్రంథ రచయితలలో శ్రీ అగస్త్యరాజు సుబ్బారావుగారొకరు.

వీరు చిరకాలమిత్రులు బాల్యంనుండీ తెలుగు భాషాభిమానులు. తెలుగు భాషాసాహిత్యాలను క్షుణ్ణంగా చదువుకొన్నారు. తెలుగు భాషాబోధకులుగా పనిచేయడమేగాక ఆధ్యాత్మిక సందేశాలనిస్తూ సాంసారికబాధాతప్తచిత్తులైన ప్రజలకు ఆహ్లాదంతోకూడిన ఆనందాన్ని అందించి ఆదర్శప్రాయులైనారు. వీరుఎన్నో కృతులను రచించినప్పటికి, పద్యకవితకు ఆదరణకరవైందని సంకోచించకుండా, అఖిలలోకారాధ్య, సృష్టిస్థితిలయకారకురాలైన ఆజగన్మాత వైభవాన్ని గూర్చి సుమారు 3575 పద్యగద్యాలతో ఒక ఉద్గ్రంథం వ్రాయబూనడం దుస్సాహసమే అవుతుంది. శ్రీ సుబ్బారావుగారు గట్టిపట్టుదలతో, భారమంతా శ్రీదేవిపై వదలి, ఆహోరాత్రములు శ్రమించి, విశ్రాంత సమయాన్ని కూడా రచనావ్యాసంగానికే వినియోగిస్తూ, దేవీ వైభవాన్ని తెలుగులో రచించడం సంపూర్ణమైన దైవయత్నమేగాని కేవలం పురుష ప్రయత్నంకాదు.

'శ్రీ దేవీభాగవతము' అనే పేరుతో సుబ్బారావుగారు తెలుగులో రచించిన ఈ గ్రంథంలో అయిదు స్కంధములున్నాయి.

పురాణవివరణ, హయగ్రీవచరితము, మధుకైటభ వృత్తాంతము, శక్తి స్తవము, శుకజనక సంవాదము, దేవీస్తోత్రము, వ్యాసజననము, భీష్మ, కర్ణ, పాండవుల జననము, తక్షకకశ్యప సంభాషణ, ఉదంకోపాఖ్యనము, దేవీయజ్ఞభేదములు, సుదర్శనోపాఖ్యానము, సుదర్శనుడుచెప్పిన దేవీమహిమలు, దేవీనవరాత్రిమహిమ, దేవకీవసుదేవుల జన్మవృత్తాంతము, ప్రహ్లాదుని రాజ్యపాలన, దేవీస్తుతులు, కృష్ణజననము, మహిషాసుర మర్దనం ఇత్యాది రామాయణ మహాభారత భాగవతాంతర్గత కథలెన్నో ఉన్నాయి.

ఈ ఉద్గ్రంథరచనలో శ్రీ అగస్త్యరాజు సుబ్బారావుగారు సంప్రదాయ బద్ధంగా ఇష్టదేవతాస్తుతి, సుకవిప్రశంస, మొదలైన వాటితోప్రారంభించి, సందర్భోచితంగా వర్ణనలు చేస్తూ ప్రతిక్షణపరివ్యాప్త అభినయసూచకంగా రచన చేశారు. ప్రతి స్కంధం చివర తన్నుగూర్చి పరిచయం చేసుకుంటూ, ఆ స్కంధంలోని ముఖ్య ఘట్టాల్ని తెలియజేస్తూ మహాకవి సంప్రదాయాన్ని చక్కగాపాటించారు. తాను దేవీ కరుణా కటాక్షలబ్ధ విభవుండనని, కమలాంబా సుబ్బరాయుల ద్వితీయపుత్రుడనని, కౌశికసగోత్రుడనని అగస్త్యరాజవంశోద్భవుడనని తన్ను పరిచయం చేసుకున్నాడు. నిజంగా ఇంతటి ఉద్గ్రంథరచనమానవ ప్రయత్నంతో జరిగేదికాదు. దేవీకరుణా కటాక్షలబ్ధ జ్ఞాన ఫలస్వరూప కవితాప్రవాహమే అని తెలుసుకోవాలి. ఈ గ్రంథాన్ని చదువుతూ ఉంటే ఒకవిధమైన భక్తి రసం ఉప్పొంగుతూ ఉంటుంది. చక్కని కవితాధారతో, సరళసుందరమైన వర్ణనలతో, సందర్భోచితవృత్తరచనావిలాసంతో హృదయంగమమైన కథాకధనంతో, సులలితసంస్కృత నమాస పదసంయోజనంతో, సుస్పష్ట భావప్రకటనా సామర్థ్య ధీపటిమతో, చక్కని పలుకు బళ్ళు, జాతీయాల సొబగులతో ఆపరాశక్తి అసమాన సౌందర్య పరాక్రమ మాహాత్మ్య, దీన జనరక్షా దక్షతలనూ సర్వవ్యాపకత్వాన్ని, వివరిస్తూ వృత్తవైవిధ్యంతో అలంకారయుక్తంగా, పఠితలకు కరతలామలకంగా ఈ గ్రంథం శోభిల్లుతూఉంది. సందర్భోచితముగా ధర్మ స్వరూపము, త్రిగుణముల స్వభావములు, మహాపాతకములు మొదలైన ఎన్నో విశేషవిషయములను వీరు చక్కగా వివరించారు. శైలి ద్రాక్షా పాకంలోనే సాగింది. దీర్ఘ సమాసాలు లేకుండా అలతి అలతి పదములతో సాగిన ఈ క్రింది పద్యాల్ని గమనించండి.

అతనియాజ్ఞ దాల్చి యక్రూరు డప్పుడ
గోకులమ్ము వెళ్ళి కూర్మితోడ
కంసుడంపినట్టి కార్యమ్ము వివరింప
రామకృష్ణు లపుడె రథము లెక్కి 4-629

కాలయవనుని పురికొల్పి కలను సేయ
పంపెమధురకు చతురంగ బలములొసగి
యవను దేతెంచువార్త న య్యదువరుండు
మున్నెపసికట్టి కర్తవ్యమును దలంచి 4-635

చక్కని పదబంధమునకు, సరళమైన సంస్కృత సమాసములతో అలవోకగా సాగిన ఈ పద్యం ఎంతో మధురంగా ఉంది.

అతసీపుష్ప నిభాభ దేహుడును, పద్మాక్షుండు పీతాంబర
ద్యుతి సంశోభితు దండజ ప్రవర విద్యోతాంస భాస్వంతు డు
న్నత దీర్ఘోరు చతుర్భుజుండు, విలసన్మాణిక్య భూషాన్వి తుం
డతి సౌందర్యయుతుం డొకండగపడెన్ హర్మ్యాంతరోద్భాసియై! 3-55

ఈ పద్యం చదువుతూ ఉంటే నన్నయగారు తప్పక స్మృతికి వస్తారు.

హరివిచిత్ర హేమ కవచావృతు డున్నత చాపచారు దీ
ర్ఘోరుభుజుండు భాస్వదసితోత్పల వర్ణు డుపేంద్ర చాపశం
పారుచి మేఘమోయనగ పాండవ మధ్యము దొప్పి బద్ధ తూ
ణీరుడు రంగమధ్యమున నిల్చె జనంబులు తన్నుచూడగన్ (భార.ఆది)

చక్కని పదబంధంతో అలరారుతూ ఉండే ఈ పద్యం వారి సరళమధుర శైలికి ఒక ఉదాహరణ

ఆయభిమన్యు భార్య కమలానన యుత్తర గర్భ సీమలో
పాయక వృద్ధిచెందు కురు వంశ వివర్ధను నల్పదేహుఁగ్రూ
రాయత బుద్ధి ద్రోణసుతు డస్త్రమునన్ విదళింప నప్పుడా
తోయజనేత్రి గర్భమును తోయజ నాభుడు చక్కఁజేసినన్ 2-264

తోయజ శబ్దంచేత వారిమధ్య గల సన్నిహిత సంబంధాన్ని కవిచక్కగా తెలియజేశాడు. పరాశక్తియైన ఆ దేవీవైభవాన్ని అలతి పదములతో కంద పద్యంలలో హృద్యంగా వివరించారు.

సావిత్రివి గాయత్రివి
భావింపగ వేదకళవు భగవతివీవే
నీవేస్వాహా స్వధలును
నీవే పరదేవివమ్మ నిఖిలారాధ్యా! 3-100

సకలము నీలో పుట్టును
ప్రకటంబగు నవియె వివిధ భంగుల నీలో

నిక విలయాంతంబున తత్
సకలము నీలోన నడగు సదసద్రూపా! 3-101

దేవీ స్తోత్రములను మహిమలను వర్ణించడమే కాక పిల్లలలో దేవీ స్వరూపాన్ని ఏవిధంగా ఊహించవలెనో, ఎట్లు వారిని పూజించవలెనో, ఏఏఫలితములను పొందదగునో ఈ కవి స్పష్టంగా తన కవితా పటిమతో వివరించారు. అంతేగాక ఆయాస్తోత్రములను పేర్కొంటూ పఠితలకు చక్కనివెసులు బాటును కల్పించారు.

సీ. దారిద్ర్యదుఃఖముల్ దలగి దీర్ఘాయువుల్
గలుగు కుమారిని కొలిచి నంత
ధనధాన్య పుత్రపౌత్ర సమృద్ధియు త్రివర్గ
ఫలము గల్గు త్రిమూర్తి భజన వలన
విద్యాభివృద్ధియు విభవమ్ములున్ గల్గు
కల్యాణిఁ బూజించు కారణమున
కాళికఁ బూజింపఁ గలుగును విజయమ్ము
చండికా పూజ యైశ్వర్యమొసగు

గీ. శాంభవీ పూజ మోహమున్ సలిపి నృపుల
వశమొనర్చుట కుపయోగపడెడి మందు
రౌద్ర గతి దుర్గఁ బూజింప రణమునందు
శత్రు నాశన మౌను నిస్సంశయముగ 3-817

సౌమ్యగతి దుర్గఁ బూజింప సౌఖ్యమబ్బు
రోహిణీ పూజ లడగించు రోగములను
వాంఛితార్థ ప్రదాయి సుభద్రయౌను
అంబ ప్రతిరూపములటంచు నాత్మఁ దలచి
కన్నియలఁ గొల్చు భక్తి సంపన్నులకును. 3-818

పై పద్యాల సారాంశాన్ని గమనిస్తే ఆ పరాశక్తి అంతటానిండి యున్నదని కనిపించేవారిలో కనిపించని ఆ ఆదిశక్తిని చూడడం అలవాటు చేసుకోవాలని తెలుస్తూఉంది. అంతేగాక పిల్లలను చూచునపుడు దేవీభావన కలుగుతూ ఉన్నందువల్ల, వారిని చీటికిమాటికి కోపించడం, పరుషంగా మాట్లాడ్డం, కఠినంగా దండించడం చేయకుండా, ఆప్యాయత, ఆదరణలతో చూడగలరని గూడా ఈ విధమైన పూజలోని రహస్యంగా మనం భావించవచ్చు. అన్ని విధములైన రోగములు తొలగి ధనధాన్య సమృద్ధి, విద్యా విజయములు కలిగి ప్రజలు సుఖసంతోషములతో తులతూగెదరని దేవీ మహిమ స్పష్టంఅవుతూ ఉంది.



శ్రీదేవీ మహిమలేగాక సందర్భోచితంగా ధర్మముయొక్క స్వరూపాన్ని వివరించారు.

"అలసినవానితో, కదుభయాతురుడై పరువెత్తువానితో
పలుకుల ముద్దులొల్కు పసిబాలురతో, రణమందు శస్త్రమున్
దొలగిన వానితో పడతితో కదనంబొనరింపరెందు వి
జ్ఞులనుచు ధర్మముల్ దెలుపు జువ్వె సనాతనధర్మశాస్త్రముల్ 1-216

యుద్ధంచేసేటప్పుడుగూడా ఎదుటివాడి పరిస్థితిని అర్థంచేసుకొని వ్యవహరించాలి. అనే విషయం ఈ పద్యంద్వారా అర్థంఅవుతుంది.

సందర్భోచితంగా రమ్యంగా రసపోషణ గావించి ఈ కవి మహాకావ్యలక్షణాలను తన కావ్యంలో ప్రదర్శించాడు. శృంగారంగూడ భగవదాయత్తమైనపుడు మనోహరంగా ఉంటుందనేది ఈ పద్యం ద్వారా వ్యక్తంఅవుతుంది.

ఆయలివేణి చూపులకు, నాయమ మేని సువర్ణ కాంతికిన్
ఆయనురాగవల్లరి యొయారపు భంగిమ కామునీంద్రు డ
త్యాయత మై చలించునటు లంగజుతూపులు గూడ నెక్కుడై
సాయమొనర్ప స్వేదములు జార, వివర్ధ సరాగ బద్ధుడై 1-261

దేవీ ప్రసాదలబ్ధమైన సరళసుందర కవితాధారతో సాధారణవృత్తాలనే కాక, విశేషవృత్తాలను సందర్భోచితంగా ప్రయోగించి, ఛందో వైవిధ్యాన్ని ప్రదర్శించి, పాఠకులకు ఆనందాన్ని ఆహ్లాదాన్ని కలిగించారు. అటనట చక్కని అచ్చతెలుగు పదాలను ప్రయోగిస్తూ, జాతీయాలను, లోకోక్తులను ప్రకాశింపచేస్తూ ఒక మహాయజ్ఞంలా ఈ గ్రంథాన్ని పూర్తిచేసి శ్రీ సుబ్బారావు గారు భక్త లోకానికి ఈ కావ్యాన్ని అందించారు.

ఆ దేవీ సత్కృప వీరికి ఇతోధికంగా కలగాలని, ఈ కావ్యం భక్త సమాజంలో చిరకాలం విలసిల్లుతూ ఉండాలని, శాశ్వత యశస్సు వారికి లభించాలని మనసారా ఆ కాంక్షిస్తూ వారిని ఆశీర్వదిస్తున్నాను.

**ఇట్లు**
**భక్తజనవిధేయుడు**
**డాక్టర్. చీమకుర్తి వేంకటేశ్వరరావు**

# శుభాక్షతలు



## చలంచ్యాల వేంకట సుబ్రహ్మణ్యశర్మ

రాష్ట్రప్రభుత్వమునుండి
ఉత్తమ ప్రధానోపాధ్యాయుడుగా అవార్డు పొందిన
రిటైర్డ్ హెడ్ మాస్టర్

శ్రీ అగస్త్య రాజు సుబ్బారావుగారు నాకు చిరపరిచితులు. దైవ చింతనలతో నిగర్విగా, నిరాడంబరుడుగా జీవితమును గడుపు ఒక మహనీయమూర్తి. తెలుగు భాషా పండితులుగా నెల్లూరు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలందు సమర్థ వంతముగా పనిచేసి, విద్యార్థుల, తల్లిదండ్రుల, అధికారుల ప్రశంసలను పొందిన ఉత్తమ ఉపాధ్యాయుడు. పురాణగ్రంథములలోని సారాంశములను ఔపాసనపట్టి, అందలి అనేక అంశములను సామాన్య ప్రజలకు కూడ అర్థమగురీతులలో వివిధ సందర్భములలో పురాణ ప్రవచనములు గావించి, పేరెన్నిక గన్న పౌరాణికుడుగా ప్రఖ్యాతి గాంచినాడు. కవిగా గ్రంథకర్తగా అందరికి సుపరి చితుడయిన శ్రీ సుబ్బారావు గారు పిన్ననాటినుండియు ఆధ్యాత్మిక చింతనా తత్పరుడు. నిత్యము సత్సంగములను నిర్వహించుచు, ప్రజల మనసులందు ఆధ్యాత్మిక బీజములను అంకురింపజేయు మహాను భావుడు. ఒక రకముగా ఇతను దైవాంశ సంభూతుడనియే చెప్పవలసి యున్నది. అందువలననే అమ్మలగన్న అమ్మయయిన ఆమూలపుటమ్మ యొక్క వైభవంబును విశదముగా వర్ణించు దేవీభాగవతమును పద్యరూపముగా వ్రాయ సాహసించినాడు. ఆయమ్మ యొక్క అనుగ్రహము, కృప, ఆశీస్సులు లేనిదే ఇట్టి సంకల్పము ఆయనలో కలుగనేరదు. ఆయనకలమునుండి ప్రవహించిన కవితాధారనుండి నిత్యపారాయణయోగ్యమైన దేవీభాగవతము వెలువడి ఉండెడిదిగాదు. ఇది ప్రతి ఇంట ఉండదగిన ఉత్తమ గ్రంథము. నిత్యపారాయణకుయోగ్యమై, పూజామందిరమున ఉండి నిత్యపూజకు అర్హమైన పవిత్ర గ్రంథము. ప్రతి గ్రంథాలయమునందు తప్పక ఉండవలసిన గ్రంథరాజము. ఇంకనూ ఎన్నో ఆధ్యాత్మిక గ్రంథములను ప్రజలకు అందించుటకు ఆయన ఉపాసనాదైవము ఆయనకు ఆయురారోగ్య, శక్తి యుక్తులను ప్రసాదించగలరని నాగాఢవిశ్వాసము.

ఇట్లు
చలంచ్యాలవేంకటసుబ్రహ్మణ్యశర్మ

కావలి 14-03-2011



ఓం

# అభినందన



## "అరుణశ్రీ" విద్వాన్ అల్లంపాటి వేంకటేశ్వరరెడ్డి బి.ఏ.

అల్లంపాటి రామాయణాది గ్రంథకర్త
విశ్రాంత తెలుగు పండితులు
పరికోట గ్రామం-కలిగిరిమండలం,
శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా.

శా. శ్రీలంజిందెడు సింహమండల యశ శ్శ్రీచంద్రికామోహము
గ్ధాలంకార కవీంద్ర! శ్రీ మృదు వచో గాంధర్వ సంభాషణా!
మేలుంగూర్చెడు సత్క వీంద్రునిగ మిమ్మే దేవి దీవించె నో!
చాలన్ గల్గ అగస్త్య రాజుకడలిన్ జాబిల్లివైయొప్పగన్

కం. సుబ్బారావు కవీంద్రా!
కబ్బపు కవితా గతులను కరముగ మెరయన్
తబ్బిబ్బిందక గ్రంథము
నిబ్బరముగ వ్రాసినావు నేర్పరివబ్బా!

శా. దేవీభాగవతమ్ము తెన్గునిడ యాదేవీ కటాక్షమ్ము, వా
గ్దేవీ సత్కరుణా సుధారసము దేదీప్యమ్ముగా గల్గ, శ్రీ
భావప్రస్ఫుట కావ్యసంపద యశోభాగ్యమ్ము వర్ధిల్లె మీ
పావిత్ర్య ప్రతి భాంధ్ర సత్కవిత కే భావించి కేల్మోడ్చెదన్

మ. కలమున్ గైకొని వ్రాయఁబూన మిగులన్ కావంగ శ్రీవాణి వా
గ్బలమున్, సత్కవితా ప్రదీప్తమగు శ్రీ పాండిత్య లాలిత్యమున్,
విలస ద్భావ చమత్కృతుల్ విమలమౌ వేదోక్తులన్ గూర్చి స
ద్వెలుగున్ తెల్గునిధానమౌ కవిగ దీవించెన్ మిమున్ మిత్రమా!

చం. గుణముల మిన్నవన్న! కనుగొల్కుల మంచుల చిన్నెవన్న! రా
జనముల వన్నెవన్న! శుభ జన్ముల కాశల దీర్తు వన్న! పా
వనముల కాప్తివన్న! తెలివన్నెల మిన్నుల మిన్నువన్న! జీ
వనముల దీప్తి వన్న! కవిభాస్కర! మీకునమస్కరించెదన్

కం. ముని "సుందరేశ శతకము"
వినయంబున కృష్ణునకు "నివేదన"నిడి, యీ
ఘన "దేవీభాగవతము"
తెనుగున రచియించి తిప్ప తిరమైయొప్పన్

మ. తలిదండ్రుల్ మరిమీదుపెద్ద లరయన్ ధన్యాత్ములే సుమ్ము, మీ
లలనారత్నము, దివ్య సంతతియు, మేలౌ శిష్య బృందమ్ము, మీ
తొలి జన్మార్జిత పుణ్యమో యన మరెంతో విశ్వకల్యాణియై
తెలుగున్ జేసిన దివ్య భాగవతమే తేజంబుతో వర్ధిలున్

తే.గీ. సీ.వి.యస్. శర్మయు ప్రకాశరావు ప్రభృతి
యున్నత శ్రేణి గురువుల యొద్ద నేను
మీరు తెలుగును బోధించి నారముగద!
వారి దీవనల్ మన భాగ్య భాగ్య మయ్య!

తే.గీ. భాగవతము పోతన రచింపగ; రచింప
నతుల భక్తి దేవీ భాగవతము మిమ్ము
శ్రీ అగస్త్యరాజ! విధి సృజించె నేమొ?
కాక సాధ్య మగునె యన్య కవుల కివియు

కం. విభవపు సంస్కృతిఁ దెల్పుచు
ప్రభ దేవీ భాగ వతము వ్రాయగ సుకవీ!
"అభినవ పోతన" బిరుదిడి
అభినందన తెల్పుచుంటి "అల్లంపాటిన్"

ఇట్లు
బుధ జన విధేయుడు
**"అరుణశ్రీ" విద్వాన్ అల్లంపాటి వేంకటేశ్వరరెడ్డి**



# అభినందన చందనం



సరసకవి, కవిభూషణ, అనుమునిగిరి ఆస్థానకవి, అష్టావధాని
**పణిదపువీరబ్రహ్మం**
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులు
చాకలకొండ, నెల్లూరు జిల్లా

1. కం. శ్రీవాణీ విఘ్నేశుల
దీవెనలన్ సుబ్బరావు ధిషణకు పదునై
దేవీ భాగవతరచన
యీవిధి వెలుగొంది వెలిగె నీశునికృపచే

2. శా. దేవీ భాగవతంబు కావ్యరచనన్ దేదీప్యమానంబునై
తావుల్ నల్దిశలెల్లఁ బ్రాకి యశమున్ దట్టించియున్ క్షేమమున్
ప్రోవై వంశము వర్ధిలున్ జగతి సమ్మోదంబునందన్ కదున్
నీవైశిష్ట్య మగస్త్యరాజ శుభముల్ నిండార పొంగారుగా

3. తో. విబుధాళియు మెచ్చగ వేల్పులహో
శుభమంచు వచింపగ శోభిలగన్
అభినందన చందన మందు సఖా;
విభవంబది మీకిక వెల్గు లిడన్

4. కం. పలుచందము లందముగా
అలఘు నలంకారతతియు నార్యులు మెచ్చన్
వెలయగఁ జేసెను మిత్రుడు
కలకాలం బితనికీర్తి ఘనతను గాంచున్

5. కం. సుబ్బారావు సఖుండిటు
లబ్బురముగ కావ్యరచన నలరించెనికన్
ఇబ్బడి ముబ్బడి రచనల
కబ్బము లలరించుగాత! ఘనతర కీర్తిన్

ఇట్లు
**పణిదపువీరబ్రహ్మం**

# ముందుమాట

సనాతన భారతీయ సంస్కృతీ సంప్రదాయములకు నిలయములైన మన వేద వాఙ్మయము, పురాణములు, ఉపనిషత్తులు ప్రపంచమానవ జీవిత పథ నిర్దేశ్యములై యలరారుచున్నవి. అందునను భారత, భాగవత, రామాయణములు తలమానికములై యలరారుచున్నవి. వేద వ్యాస విరచితంబైన శ్రీదేవీ భాగవతమున్ను పంచమవేదమని బుధులచే పరిగణింపబడుచున్నది.

అట్టి పంచమ వేదమనంబడు శ్రీదేవీ భాగవతమును తెలుగులో పద్యకావ్యముగ రచించ వలయునను సంకల్పము కలిగి నేను తద్రచన కుపక్ర మించితిని అట్లు నాకు సంకల్పము కలుగుటకు నన్ను ప్రేరేపించిన ఒకముఖ్య సన్నివేశముగలదు. శ్రీ సర్వజిత్తునామ సంవత్సరము ఆశ్వయుజ మాసము శుద్ధ పాడ్యమి నుండి విజయ దశమివరకు కావలి శ్రీకలుగోళ శాంభవీ దేవాలయమున శ్రీ దేవీ భాగవతము ప్రవచనము చేయ వలసినదిగా శ్రీ సి.యస్. ప్రకాశరావుగారు నన్ను ప్రోత్సహించిరి. వారి కోర్కెననుసరించి నేను శ్రీదేవీ భాగవత ప్రవచనమునకుఁ గడంగి దానిని 5 స్కంధములు ప్రవచించితిని. విజయదశమి దినమున నాకు అమ్మవారి అనుగ్రహమోయున్నట్లు నామనసులో దీనిని తెలుగులో పద్యకావ్యముగా వ్రాయవలయునను సంకల్పము కలిగినది వెంటనే రచన కుపక్రమించితిని శ్రీ దేవీ అనుగ్రహమువలన 5 స్కంధములు పూర్తిగా వ్రాయగల్గితిని. సరళమైన భాషలో అందరికి అర్థమగు రీతిన వ్రాయ వలయునని పూనుకొని నాప్రయత్నములో కృతకృత్యుడ నైతినని భావించు చున్నాను. ఇది ప్రతియొక్కరు నిత్యము పారాయణముచేయుటకు అనుకూల ముగనున్నదని వినిన పెద్దలు తమ అభిప్రాయములను వెలిబుచ్చిరి. ప్రస్తుతము రచించిన 5 స్కంధములు ముద్రించి విడుదలచేయదలచితిని. మిగిలిన ఏడు స్కంధములు గూడ రచించ వలయునని నాదృఢ సంకల్పము. అమ్మవారి అనుగ్రహమువలన నదియును శీఘ్రకాలమున పూర్తి చేయగలను.

నాయీరచనకు అనునిత్యము నన్ను ప్రోత్సహించిన శ్రీ సి.వి.యస్.శర్మ, శ్రీ సి. సుధాకరరావు, శ్రీశరత్ బాబు గార్లకు నాకృత జ్ఞతాభివందనములు.

ఈ గ్రంథమును ఆమూలాగ్రము పరిశీలించి నాకు తగిన సూచన లిచ్చిన డా॥ శ్రీ చీమకుర్తి వేంకటేశ్వరరావు గారికి, నాకృతజ్ఞతాభివందనములు



ఈ గ్రంథమును గూర్చి తమ అమూల్యమైన అభిప్రాయములనొసంగిన శ్రీ డా॥ చీమకుర్తి వెంకటేశ్వరరావు గారికి, శ్రీ సి.వి.యస్. శర్మగారికి శ్రీ అల్లంపాటి వేంకటేశ్వరరెడ్డి గారికి, శ్రీ పణిదపు వీరబ్రహ్మంగారికి నాకృతజ్ఞతాభివందనములు. దీనిని శ్రద్ధతో అనుకొనిన సమయమునకు అందముగా గ్రంథములను ముద్రించి ఇచ్చిన అబిగ్రాఫిక్స్, నెల్లూరు వారికి, గ్రంథముద్రణకు తోడ్పడిన టి.టి.డి. వారికి ఇతర దాతలకు నా కృతజ్ఞతాభివందనములు.

పాఠకమహాశయులు దీనిని సహృదయతతో పఠించి యిందలి గుణదోషములను తెలియ పరచవలసినదిగా కోరుచున్నాను. ఇంకను తగిన సూచనల నొసంగినచో తదుపరి రచనకు నాకు సహాయపడిన వారగుదురు.

సీ. ధర కౌశికస గోత్ర వరనందనోద్యాన
వనకల్పకంబన ప్రగతిఁగన్న
రామయాఖ్యునకు తద్రమణికిచ్చమ్మకు
పుత్రుడై జన్మించె భూరి గుణుడు
వీర రాఘవశర్మ విబుధ వరేణ్యుండు
బసవమ్మ యతనికి భార్యయయ్యె
వారి కుద్భవమందె పావనచరితుండు
సుబ్బరాయాఖ్యుడు సుగుణవనధి

గీ. అతని యర్ధాంగి కమలమ్మ నుతచరిత్ర
అట్టి పుణ్యదంపతులకు నాత్మజుడను
సుబ్బరావాఖ్యుడన్ సాధు సూరిజన వి
ధేయుడ, అగస్త్యరాజవంశాయతాబ్ధి
విమలతటమున రాజిల్లు ఫేన మేను

సీ. ధరణి నాత్రేయస వరగోత్రసంభవుం
డార్యనుతుండు కృష్ణయ్యఘనుడు
ఆతని భార్య వెంకచ్చమ్మ మిక్కిలి
గుణవతియన కీర్తి గొన్నమహిళ
ఆదంపతుల గర్భమందు జన్మించిన
వేంకటనరసయ్య విమల చరితు

దతనికి కామాక్షి యర్ధాంగియైయొప్పి
పతిసేవలందునఁ బరగుచుండు

గీ. వారి కుదయించె ముద్దుల పట్టి యౌచు
అమల నెల్లూరు వంశాబ్ధి కమల యనగ
నెమ్మి ననుగన్న కమలమ్మ సుమ్మియామె
పుట్టినిలు మెట్టినిలు బెంచు పుణ్యమహిళ

తే. అవని శతమర్షణ సగోత్రమందు పమిడి
పాటి వంశాబ్ధి చంద్రుడు భవ్య చరితు
డైన లక్ష్మీ నరసయాఖ్యుడతని ధర్మ
పత్ని రాజ్యలక్ష్మమ్మకు పట్టియైన
అతివరత్నమ్మ నాకు నర్ధాంగి యయ్యె

ఉ. అమ్మచరిత్ర వ్రాయుట కహర్నిశముల్ నను ప్రోత్సహించి ని
త్యమ్మును నాప్రయత్నమున కడ్డము చెప్పక వెంటనంటి శ
బ్దమ్మున కర్థమట్టు లెడ బాయక యున్న మదీయపత్ని ర
త్నమ్మ సుశీల, యామెను సతంబును దేవి యనుగ్రహించుతన్!

ఇట్లు,
రచయిత
**అగస్త్యరాజు సుబ్బారావు**
**విశ్రాంత ఆంధ్రోపాధ్యాయుడు**





# విషయసూచిక

## శ్రీ దేవీ భాగవతము (ఆంధ్రము)

# ఇష్ట దేవతా ప్రార్థనము

1. ఉ. శ్రీరమణీ వరాంకమునఁ జెన్నుదలిర్ప విలాసకేళి సం
చారత నొప్పు వేళ నిభ చంద్రుని ప్రార్థనలాలకించి దు
ర్వార రయమ్మునన్ జల చరమ్మును ద్రుంచి గజేంద్రుఁగాచు నా
సారసలోచనుండు హరి సత్కృప నన్ను ననుగ్రహించుతన్

2. అ.వె. పాలసంద్రమందు పవళించు హరిపాద
పద్మ భృంగమైన పంక జాక్షి
కలుములమ్మ హస్త జలజముల్ నాపైన
నుంచి బ్రోచుగాత! నంచితముగ

3. మ. హరి నాభీకమలోద్భవున్ సకల సృష్ట్యారంభు, వాణీశు, ని
ర్జరసందోహ నిరంతరార్చితు సదాశాంతస్వరూపున్ మదిన్
స్థిరమౌ భక్తినిఁగొల్తు మామక వచశ్శ్రీ సిద్ధి కెల్లప్పుడున్
వర దివ్యార్థములొప్పఁ జేసి, సుమనోవంద్యమ్ముఁజేకూర్పగన్

4. అ.వె. వనజ భవుని రాణి వాణి వీణాపాణిఁ
జదువులమ్మనెపుడు మదిని నిలిపి
కొలుతు నాదు కవిత విలసిల్ల సద్భావ
సంపదలకు భువిని సదనమగుచు

5. చం. అడిగిన యంతనే వరములర్థి జనాళికిఁ గ్రుమ్మరించు నా
బడుగుల జంగమయ్య విషభక్షణఁ జేసిన లోకరక్షకుం
డెడమొకయింత లేక మది నెప్పుడు నిల్చి మదీయ యత్నమున్
వడి నెరవేర్చుఁగాక సుర వంద్యు డుమాపతి సంతసమ్మునన్

6. మ. రవిచంద్రాది ఖగోళముల్ మఱియు సర్వప్రాణులున్ లోకముల్
జవసత్వమ్ములు గల్గి వర్తిలుటకున్ శక్తిన్ బ్రసాదించుచున్
శివ తత్త్వమ్మున నర్థమైనిలిచి రాశీభూతచిచ్ఛక్తియై
యవలోకామృత వృష్టులన్ గుఱియునయ్యంబన్ మదిన్ గొల్చెదన్

7. శా. శ్రీకారం బొనరించుచుంటి జననీ శ్రీచక్ర సంచారిణీ
నీకై యొక్కటి కావ్యమున్ మధురమున్ నీ దివ్యగాథా సుధా
స్తోకంబున్ భవదీయ తత్త్వవిలసద్రూపంబు రూపింపగన్
నాకున్ శక్తి నొసంగుమమ్మ! దయతోనన్నున్దరింజేర్చుమా!

8. కం. భువినెల్ల కార్యములకే
యవరోధము గలుగకుండ యారంభమునం
దెవనికి పూజలొనర్తురొ
సవినయముగ నట్టి విఘ్న సంహరుఁదలతున్

9. ఉ. పంచమవేదమై పరగు భారతమున్ దెనిగించినట్టి యా
సంచిత పుణ్యకర్ములకు సత్కవి వర్యుల కంజలించి, ప్రా
పంచిక భోగముల్ విడిచి భాగవతమ్మును తెల్గువారికిన్
బంచిన పోతనార్యునకు భక్తి నమస్కృతులందఁజేసెదన్

10. తే.గీ. ఆది కవియైన వాల్మీకి కంజలించి
బాదరాయణు పరమపావనునిఁ గొలిచి
సకల సుకవివరులమది సన్నుతించి
రచన సాగింతు మోక్షసంప్రాప్తి కొఱకు

11. శా. నాకీదేహ మొసంగి; కష్టముల నానందమ్మునన్సైచి, నన్
సౌకర్యంబునఁ బెంచి సంఘమునఁ బ్రాశస్త్యంబుఁ గల్గించి స్వ
ర్లోకంబందు సుఖించు నాపితరులన్ రూఢిన్సదా కొల్చెదన్
బ్రాకామ్యాదులికేలయంచుఁ గమలాంబా సుబ్బరాయాఖ్యులన్

12. కం. గురువుల కెల్లను గురువై
గురుతరమగు యోగవిద్యఁ గురు వీరునకున్
గురువై బోధించినయా
గురు వంద్యున్ గృష్ణుఁగొలుతు గురుదైవంబున్

13. కం. వ్రాయుటనేనే యైనను
వ్రాయించుచు చెంతనుండి వదలక మదికిన్
ధ్యేయంబౌ శ్రీదేవికి
నాయీకృతినిత్తు నర్పణంబుగ భక్తిన్

# ప్రథమ స్కంధము

1. కం. శ్రీకరి, శాంకరి, భగవతి
ప్రాకటముగ సహకరించి భవ్యంబగున
ట్లీకృతికి నెల్ల వేళల
నాకిడుఁగావుత సముచిత నవ్యపదంబుల్

2. ఉ. శౌనకుడాదిగా గలుగు సన్మునివర్యులు నైమిశమ్మునన్
ధీనిధులై విరించికి విధేయులునై సవనమ్ములెన్నియో
మానితరీతిఁ జేయుచును మాన్యుని సూతుని గాంచిప్రీతిమై
వీనుల కింపు సేయు మని వేడిరి దివ్య పురాణ గాథలన్

3. ఉ. ఆకలిఁగొన్నవాడు మధురాన్నములన్ బరితృప్తిఁజెందున
ట్లాకులమైన మానస మనంత సుఖమ్మును బొందకుండునే
శ్రీకర శాంభవీ మధుర చిత్ర విచిత్ర మహత్త్వముల్వినన్
ఓకరుణార్ద్రమూర్తి! చతురోక్తుల తచ్చరితమ్ముఁజెప్పుమా!

4. తే.గీ. వ్యసన సంసక్తి కొందరు; వ్యర్థమైన
అర్థవాదంబులను కొంద రవని యందు
కాలయాపన చేయుటేగాని సుంత
దైవ తత్త్వమ్ము నెఱుగంగఁదలపరకట!

5. కం. శ్రీదేవీభాగవతము
భూదేవులు పరమపుణ్య పురుషులు యోగుల్
మోదమ్ముగ పంచమమగు
వేదమ్మని సన్నుతింప వింటిమి గానన్.

6. మ. భవదావాగ్ని దురంత కీలలను నార్పంగన్ సుధావృష్టి లీ
యవనిన్ గల్గునె? శాంభవీ మధుర దివ్యాఖ్యానముల్గాక; సం
స్తవనీయుండవు, వాక్సుధా మధుర విస్పష్టంపు పౌరాణి కుం
డవు మాకున్ దయతోడ తత్కథల నిష్టం బౌనటుల్ చెప్పవే

7. మ. త్రిగుణం బైన ప్రపంచ సౌఖ్యములలో తీవ్రంబుగా మున్గుచున్
విగతిన్ బొందరె మూఢ మానవులు; భావింపంగ నేవేళలన్





త్రిగుణాతీతము జ్ఞాన సాధ్యమగు ముక్తిం బొంద వాంఛింతురే?
సుగుణోత్తంసమ! మాకు ముక్తి నిధియౌ సుజ్ఞానముంజెప్పవే.

8. శా. ఆమాటల్ వినిరోమహర్షణ సుతుండానంద సంధానుడై
శ్రీమంతంబును వేద సమ్మతము రాశీభూత శాస్త్రార్థమున్
భూమానంద విధాయకంబును మహాపుణ్యావలోకంబునున్
ప్రేమన్ మీకు నెఱుంగఁజెప్పెదను దేవీ తత్త్వమున్ లెస్సగన్

9. కం. అని పలికి త్రిగుణ యుతమగు
ఘన శక్తిన్ సకల జగతిఁ గల్పించుచు, పో
షణ లయముల గావించెడి
జననికి తా వందనంబు సలిపెను నాత్మన్

10. సీ॥ ఏ తల్లి యాజ్ఞచే నెల్ల లోకంబుల
సృజియించు చుండు నయ్యజుడునియతి
నే తల్లి యాజ్ఞచే నిందిరా రమణుండు
పోషించు చుండునీ భువన తతుల
నే తల్లి యాజ్ఞచే నీశ్వరుం డనయమ్ము
విలయమ్ముఁగా వించు విశ్వమెల్ల
నే తల్లి యాజ్ఞచే నెల్ల దిక్పాలాది
దేవతల్ తమ విధుల్ దీర్చుచుందు

గీ॥ రట్టి భువనైక మాతకు నాదిశక్తి
కఖిల భూతాంతరాత్మకు ననవరతము
నింద్రియ మనఃప్రవృత్తుల నెల్ల నిలిపి
అంజలించెద బుద్ధి నేకాగ్ర శుద్ధి

11. ఆ.వె. శివుని యాజ్ఞలేక చీమైన కుట్టదు
అతడు గూడ నంబ యండలేక
కదల లేడటన్న కనగ సాధ్యం బౌనె
అంబ తత్త్వమహిమ హరికి విధికి

## పురాణ వివరణము

12. వ. అని ప్రార్థించి శౌనకాది మహామునులంగాంచి

13. మ. పదిపైనెన్మిది వేలు శ్లోకములతో వ్యాసుండుతానీకృతిన్
పదియున్‌రెండును స్కంధముల్ గలుగ గీర్వాణమ్మునన్ వ్రాసె, న
య్యది సర్గప్రతి సర్గలాది గల పంచాంగంబులన్ గూడి యొ
ప్పిద మయ్యెన్ బృథివిన్ పురాణవరమై విజ్ఞాన వారాశియై

14. సీ. సృష్టి కార్యమునకై సృజయించుకొనె నాది
శక్తి తనకుఁదానె సగుణయౌచు
తనదైన సాత్విక తత్త్వమ్ముచే మహా
లక్ష్మిగా మారె విలాసముగను
తన రజోగుణమునఁదాల్చె సరస్వతీ
రూపమ్ము శ్రుతిహిత రుచులుగలుగ
తన తమో గుణముచే ధరియించె రూపమ్ము
కాళికాంబగ లయకారిణియన

గీ॥ శాస్త్ర విదులెల్ల దీనినే సర్గ మనిరి
అంబ సృజియించె నటుపైన నబ్జనాభు
కమలభవు రుద్రులన్‌తన కార్యమునకు
నిదియె ప్రతిసర్గయని బుధు లెంతురవని

15. తే.గీ. ఇనశశి వరవంశమ్ముల కనక కశ్య
పాది దైత్య ప్రభువుల పూర్వాన్వయముల
వర్ణనముసేయుటదియెల్ల వంశ మనగ
గణుతికెక్కెను భువి బుధ గణములందు

16. కం. వినుమా స్వయంభు వాదిగ
మనువుల కాలములు దెలుప మన్వంతరమౌ
మనువంశ క్రమముఁ దెలుప
ననబడె వంశానుచరిత మనగ బుధులచే

17. కం. అని చెప్పికొంత తడవా
మునివంద్యుండాగినంత మోదముతోడన్





గని శౌనకుడిట్లు పలికె
వినయమ్మున సూతుగాంచి విజ్ఞతయొప్పన్

18. కం. అయ్యా! సూతమహర్షీ!
నెయ్యమున పురాణములను నిఖిలంబుగ మా
కయ్యెపేర్లను సంఖ్యను
తియ్యమ్ముగఁ జెప్పుమయ్య తీరగ తృప్తిన్

19. కం. కలిదోషంబుల మనముల్
కలతల్‌చెందంగ మేము కమలజుతోడన్
కలిలేని చోటు లెవ్వియొ
తెలియంగన్ జెప్పు మనుచు దీనత వేడన్

20. మ. కరుణన్ పద్మభవుండు మానసమునన్ గల్పించి చక్రంబొకం
దురు తేజంబగుదాని నిచ్చియనె "మీరుత్సాహవంతుల్, తపో
వరులున్, దీనిని నెట్టు కొంచుఁజను, దే ప్రాంతాన తన్నేమి పా
దరి శైథిల్యము నొందు నా స్థలమె మీకత్యంత సౌఖ్యంబగున్"

21. తే.గీ. పరమ పావనమైన యా ప్రాంతమునకు
కలి సమీపింప గాలేదు కాన, సత్య
కాలము వరకును నచట గడపు మనుచు
నాజ్ఞనిడి పోయె నబ్జజుం డంత మేము.

22. తే.గీ. అతనియాజ్ఞాను సారమ్ము ననుసరింప
నేమి శైథిల్యమందె యాభూమియందు
కాన నైమిశ మంచు నీ కాననమ్ము
ఖ్యాతి గడి యించె మునుల కాకరమునగుచు

23. ఉ. ఇచ్చట మేము యజ్ఞముల నెన్నియొ లోకహితార్థమై సురల్
మెచ్చగ భూతహింసలను మెచ్చక సాత్విక రీతిఁ జేయుచున్
పుచ్చుచు నుండ కాలమును, పూర్వభవంబుల పుణ్యరాశిచే
వచ్చితిరయ్య! మీరలిటు, వాంఛితముల్ నెరవేర్పరేయనన్.

24. కం. సంతోషమ్మున సూతుం
డంతన్ బ్రవచింపఁగడగి యయ్యా! మీకున్

సాంతమ్ముగఁ దెల్పెద శ్రీ
మంతంబగు మహిషదైత్య మర్దనిగాథల్

25. కం. అష్టాదశ సంఖ్య కథా
పుష్టిన్ స్థిరముగ పురాణముల నావ్యాసుం
డిష్టంబౌ కవితాగతి
స్పష్టంబుగ సకల ధర్మ చయముగగూర్చెన్

26. వ. అవియును మత్స్య, మార్కండేయ, భవిష్య, భాగవత, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, వామన, వాయు, విష్ణు, వరాహ, అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాంద, పురాణములన పదునెనిమి పేర్లతో ప్రసిద్ధి కెక్కె. నివిగాక సనత్కుమార, నారసింహ, నారదీయ, శివ, దౌర్వాస, కాపిల, మానవ, ఔశనస, వారుణ, కాళికా, సాంబ, నంది (కృత), సౌర, పారాశర, ఆదిత్య, మాహేశ్వర, భాగవత, వాసిష్ఠంబు లనంబడు పదునెనిమిది ఉపపురాణాలుగా ప్రసిద్ధికెక్కె

27. మ. ప్రతి మన్వంతర మందు ద్వాపరమునన్ వ్యాసుండు విష్ణ్వంశ న
ద్భుత విజ్ఞాన పయోధియై జనన మందున్; పూర్వకల్పోక్తముల్
ద్యుతి రాహిత్యములై యనేకములుగా ద్యోతంబు లౌచున్న సం
స్తు తవేదంబుల నాల్గుగాగ విభజించున్ ధర్మరక్షార్థమై

28. చం. కలియుగమందు మానవులు కారు సమర్థులు, మంద బుద్ధులై
యలఘుతరోగ్ర రోగముల నాయువుఁబాయుదు రల్పకాలమం
దిలపయినంచు నెంచిరచియించు పురాణములెల్ల; వాని నిం
పొలయగ విన్నచో గనెద రుత్తమ దివ్య పదంబు లెల్లరున్

29. కం. అరయగ నేడవ మన్వం
తరమిది, వైవస్వతాధినాయకయుతమం
దిరువది యెనిమిదవది యీ
జరిగెడిదౌద్వాపరంబు సమ్మునులారా!

30. చం. విమల తపోధనుండు కృత వేద విభాగుడు దివ్యయోగిహృత్
గమనుడు మద్గురుండు గుణగణ్యుడు సాత్యవతేయుడైనయీ
ప్రముఖుడె యిర్వదెన్మిదవ వాడయి యిప్పటి ద్వాపరమ్మునన్
ప్రముదిత మానసుండగుచు భాసిలె వ్యాసుడు విష్ణు నంశతో

31. కం. నేటికి నిరువది యేడ్గురు
దాటిరి వివిధార్థ వేదధర్ములు వ్యాసుల్
పాటవమున సకలాగమ
కోటుల విరచించి మించి గురు వర్యులునై

32. కం. ఈ వ్యాస విరచితంబిది
దివ్యంబైయలరుచున్న దేవీ తత్త్వం
బవ్యవ హితముగ మీకున్
శ్రావ్యంబుగ విన్నవింతు సన్మునులారా!

33. చం. అనవిని యమ్మునీశ్వరు లనంత మనః పరిపూర్ణహర్షులై
వినయ వివేక వర్తనము వేయి విధమ్ములఁదొంగలింప తా
మనిరిటు దివ్యకాంతి సముదంచిత నిర్మలు సూతుఁజూచి యో
ముని వర! తెల్పు మయ్య! యల పూర్వయుగమ్ముల వ్యాస సంగతుల్

34. తే.గీ. అంత సూతుండు సంతోష మంది యిట్టు
లనియె వైవస్వతాఖ్య మన్వంతరమున
బరగు నిర్వదియేడ్గుర వ్యాసమునుల
వరుసఁదెల్పెద వినుడు స త్పాత్రులార!

35. వ. శౌనకాది మహర్షి సత్తములారా! వైవస్వత మన్వంతరంబున మొదటి ద్వాపరంబున స్వయంభువు, రెండవద్వాపరంబున ప్రజా పతియు, మూడవ ద్వాపరంబున ఉశనసుడు, నాల్గవద్వాపరంబున బృహస్పతి అయిదున సూర్యుడు (సవిత) ఆరున మృత్యువు, ఏడున మఘువుడు, ఎనిమిదిన వసిష్ఠుడు, తొమ్మిదవ ద్వాపరంబున సారస్వతుడు, పదిన త్రిధాముడు, పదకొండున త్రివృషుడు, పన్నెండున భరద్వాజుడు, పదమూడున నంతరిక్షుడు, పదునాల్గున ధర్ముడు, పదునైదున త్రయ్యారుణి, పదునారున ధనంజయుడు, పదునేడున మేధాతిథి, పదునెనిమిదినవ్రతి, పందొమ్మిదిన అత్రి! ఇరువది యవద్వాపరమున గౌతముడు; ఇరువది యొకటిన ఉత్తముడు, ఇరువదిరెండున వేనుడు, ఇరువది మూడున సోముడు, ఇరువది నాల్గున తృణబిందువు, ఇరువది యైదున భార్గవుడు,

ఇరువది యారున శక్తి, ఇరువది యేడవ ద్వాపరమున జాతుకర్ణ్యుడు, వ్యాసులై తమ తమ కార్యంబుల నిర్వహించిరి

ఇప్పటి ఇరువది యెన్మిదవ ద్వాపరంలో కృష్ణద్వైపా యనుడనబడు పరాశరాత్మజుడు వ్యాసుండై వేదముల విభజించి నిఖిల పురాణములు రచియించె.

36. కం. ఇతనికి శుకుడను నొక సుతు
డతులిత వైరాగ్యవిభవు డఖిలా త్ముండున్
మతి మంతుడు గల డతనికి
హితముగనీ భాగవతము నెల్లన్ జెప్పెన్

37. చం. శుకునికి చెప్పుచుండ పరిశుద్ధ మనంబున వింటినేను తత్
సకలము వ్యాసమౌని విలసన్ముఖ పద్మవినిర్గతోక్తులన్
బ్రకటితమైన దెల్ల, వివరమ్ముగ మీకును దానిఁదెల్పెదన్
సుకరము ముక్తి దంబునయి శోభిలుగాన వినుండు భక్తితో

38. మ. స్తుతియింపందగు స్కంధ పత్రమయి, సంతుష్టాత్మ సౌగంధసం
గత సద్భావ విశాలమై, బహు విధాఖ్యానోల్లసత్ కేసరా
న్వితమై హృద్యమరందబిందు పరదేవీ తత్త్వ విజ్ఞానసం
తతమై భాగవతాఖ్య కల్పక లతాంతం బొప్పు సత్ సేవ్యమై

39. శా. వేదోక్త క్రియలందలభ్యమగు సంవిత్ సౌఖ్యసంధానమౌ
శ్రీదేవీ వరనామభాగవతమున్ శ్రీదమ్మునున్, కర్ణముల్
మోదంబంద వినంగలేని నరు బాముల్ వ్యర్థముల్‌గావె దు
ర్వాదా సక్తమదాంధులై యముని యావా సంబునంద్రెళ్ళరే,

40. కం. అనవిని శౌనకుడిట్లనె
యనఘా! శుకుడెట్లు పుట్టె నావ్యాసునకున్
ఘన సంసార విదూరున
కనితర నియమాన్వితునకు నకలంకునకున్

41. కం. ఆగర్భ యోగిపుంగవు
డాగమ శాస్త్రములనెట్టు లవలీలగ స
ద్యోగతి నేర్చె శుకుడు స
ద్యోగివరా! తెల్పు విపుల యుక్తి దలిర్పన్





## వ్యాసుని సంతాన వాంఛ

42. చం. అనియడుగంగ సూతుడిటు లాముని వర్యుల తోడఁజెప్పె నో
యనఘ చరిత్రులార! ముసు నా మునివంద్యుడు బాదరాయణుం
డిన సమతేజుడై తపము నెంతయు నిష్ఠ సరస్వతీ నదీ
ఘనతట మందు నాశ్రమముఁగట్టి యొనర్చుచునుండె నిత్యమున్

43. కం॥ తనయాశ్రమ పరిసరముల
ననయము కలకలముతోడ నానందమునన్
వన తృణములతో పిచుకలు
నెనరున గూళులనుగట్టి నివసించునెడన్

44. కం. మదనాను రాగసంగతి
ముదమొనరిచె వానిజంట ముని వర్యునకున్
పదిలమ్ముగ నండమ్ముల
నుదయించిన పక్షిపిల్ల లుల్ల మలరిచెన్

45. ఉ. ఱెక్కలు రాని పిల్లలకు ఱేపును మాపును పిచ్చుకల్ గడున్
నిక్కపు రాగ బంధమున నిత్యము నెట్టులో ఓగిరమ్ములన్
బుక్కిటఁబట్టి తెచ్చి పరి పుష్టిగఁబెట్టుచునుండ నంతయున్
జక్కగఁజూచుచున్న మునిసత్తము డాత్మఁదలంచె నిట్టులన్

46. చం. పలుకగలేని పక్షులును పాయని వేడ్క తదీయ సంతతిన్
పలుగతులన్ శ్రమించి యన పాయముగా పరిపోషణంబులి
ట్లలయక సల్పుచుండ నిక నన్నిట నుత్తమ జీవనంబులన్
సలిపెడి మానవుండు తన సంతతిపై నెనరెంతఁజూపునో

47. చం. వినయ వివేక సంపద భివృద్ధిగలట్టి సులక్షణాంగియౌ
వనితను బెండ్లియాడి యనవద్య పరస్పర రాగబద్ధులై
మనమలరంగ సత్సుతుల మాన్యులఁబొంది తదీయ గాత్రముల్
గొనకొని ముద్దు లాడగల కూరిమిగల్గుట దెంతసౌఖ్యమో!

48. చం. కొడుకులు గల్గినన్ వయసు గోల్పడువేళల నండనుండి ప్రే
ముడి తలిదండ్రులన్ గనుచు మోదము గూర్చెద రిష్టసేవలన్
జడ మతులై యొకప్పుడటు సద్విధులన్ బచరింపకుండినన్
పడి శవమైన వేళ చితిపైనయినన్ వెలిగింతురగ్నులన్

49. కం. సతికిని సంతతికిని భో
జ్యతతిని గూర్ప నిలువెడలి యాతనబడుచున్
ధృతిసెడి వచ్చిన మనుజుడు
సుతులను గనినంతఁ బొందుఁ జువ్వెసుఖంబుల్

50. కం. ధరణి నపుత్రకునకు గతి
నరకము పున్నామమని వినంబడు గానన్
వరగుణుడౌ సుతుఁ బడయగ
స్థిరముగ నే నింక తపముఁజేయుదు ననుచున్

51. మ. మదిఁజింతించి పరాశరాత్మజుడు నిర్మాత్సర్యుడా మేరువున్
సదయుండెక్కి తపమ్ము సేయుటకు లక్ష్యంబెవ్వరా విష్ణువో,
మదనధ్వంసియొ, ధాతయోయనుచు నాత్మన్ యోచనల్సేయ, నీ
రద మధ్యంబున నుండి యొక్క మధురారావంబు వీతెంచినన్

52. కం. అచ్చెరు వందుచు నాతం
డిచ్చకమునఁ జూచి యిద్ది యేమౌ నొక్కో
హెచ్చుగ డెందము పొంగెను
మచ్చిక నీ వాద్యనాద మాధుర్యమునన్

53. కం. అని సంభ్రమంబు మనమున
జనియింపగ ముని వరుండు శబ్దము వలనున్
గనుచుండ మేఘ మండల
మున నొక పురుషుఁగనె దివ్య మూర్తిన్ మౌనిన్

54. వ. అంత

55. సీ. సకలేంద్రియోద్వేగ సంచార మడగించి
ముడి వేసె ననఁగొప్పుముడి దలిర్ప





నిరత మాత్మానంద పరవశుండన నర్థ
మీలిత నేత్ర దృగ్జాల మమర
మాయా ప్రపంచమ్ము మాధవా ధీనమే
యనిదెల్ప నారాయణాఖ్యలొప్ప
భవ బంధములఁజిక్కు వడిన వారి పరిహ
సించెడుగతి దరస్మితములమర

గీ. మూడు జగముల వార్తలు ముడిచి మెడను
విరుల దండగఁదాల్చిన విధముఁ దోప
మేఘ మధ్యంబు నుండి తా మెఱపువోలె
మహతి మీటుచు నారద మౌనివచ్చె

56. ఉ. వచ్చిన నారదుం గని యవారిత భక్తి విశేష సంపదన్
మెచ్చుగ నాతిథేయముల మెల్పున సల్పుచు వాని క్షేమముల్
ఇచ్చనెఱింగి వ్యాసుడొకయించుక మిన్నక యున్న నంత తా
మచ్చిక నారదుండతని మానస శంక యెఱింగి నవ్వుచున్

57. తే.గీ. "నీ మనంబునగల బాధయేమి" యనిన
అయ్య పుత్రార్థినగుచు నే నమల మతిని
తపము సేయంగ లక్ష్యమౌదైవ మెవరొ?
తెలియఁ జాలక యుంటిని తెలుపు మనుచు.

58. తే.గీ. పలుకు వ్యాసునిఁ జూచి వేల్పుల మునీంద్రు
డిట్టులనియెను నోయయ్య! యిట్టి ప్రశ్న
ధ్యాన నిర్మగ్ను విష్ణు విధాతయడిగె
వినయ వినమిత గాత్రుడై ప్రీతి నిట్లు

59. మ. సృజియింతున్ భవదాజ్ఞ నీ జగములన్ శ్రీనాథ! నీ నాభి పం
కజ సంజాతుడ నేను; నామదికి నిక్కంబున్ వచింపంగదే
త్రిజగన్నాథుడ వేమి కోర్కెగల దేదేవున్ మదిన్ నిల్పి పం
కజనాభా! తపమిట్లొ నర్చెదవు నీ కంటెన్ ఘనుండెవ్వడో

60. కం. కర్తవు నీవే జగతికి
హర్తవు పోషకుడవీవె యబ్జదళాక్షా!

వర్తింతుము భవదాజ్ఞన్
కర్తవ్యంబులను నీల కంఠుడు నేనున్.

61. చం. అనవిని కైటభారి దరహాసము సేయుచు నోయి పుత్రకా!
వినుము జగంబులన్నిటిని వేయి విధంబుల నీవు, నేను, నా
త్రినయనుడున్ సృజించుచు ప్రదీప్తమొనర్చి లయింపఁజేయుచున్
పనిగొని యుందు మంచు మదిఁ బాయక నెంచెదరెల్ల వారలున్

62. కం. మన మివ్విధుల నొనర్చుట
కనయము నా యాదిశక్తి యగు కారణ మం
చను కొన రజ్జులు; బుధులున్
మనములగణియింతురామె మాహాత్మ్యంబుల్

63. కం. సగుణాత్మకమగు దేవీ
త్రిగుణంబుల శక్తులబ్బి తిరముగ మనమీ
జగముల సృష్టి స్థిత్యం
తగతుల నిరతము సలుపగ తగుదుము గాదే

64. ఉ. రాజస శక్తితోడ కదురమ్యముగా సృజియింతు వీవు; వి
భ్రాజిత సాత్వికమ్మున వివర్ధితమేనొనరించుచుందు; నీ
రేజ భవా! లయమ్మునొనరించు తమమ్మున రుద్రు; డింతయున్
ఆజగదంబ శక్తి మన యండన నుండు కతంబుననగదా!

65. కం. ముదమున మధుకైటభులను
విదళించితి నంబ శక్తి విభవముననె; నీ
విదియెల్ల మఱచినావో!
మదితెలియక పోయినావొ మాన్యచరిత్రా!

66. ఆ.వె. గొప్పవాడవంచు చెప్పుదునను గూర్చి
శిరముఁ దెగుట నశ్వశిరముఁదెచ్చి
అతుకనీవు నేహయగ్రీవుడను నైతి
నాటి విధము మఱచినావె నలువ!

67. ఆ.వె. వేయు మాట లేల వినవయ్య నేనెప్డు
శక్తి వశుడఁగాన సర్వకాల





మాది శక్తిఁ గూర్చి యాచరించెద తప
మదియె పరమగతి యటంచు దలచి

68. కం. అని తెలిపె పద్మనాభుడు
ఘనముగ మా తండ్రియైన కమల భవున, క
య్యనఘుడు నాకున్ ముదమున
వినిపించెను దీని నెల్ల, వివరము గాగన్

69. కం. కావున వేద వ్యాసా!
నీవును నాదేవిఁగూర్చి నిష్ఠగ తపమున్
భావించి చేయు మయ్యా!
దీవించును నిన్ను నామె, తీరును కోర్కెల్

70. కం. అని నారదుండు దెలుపన్
విని సాత్యవ తేయుడపుడు విమల మతుండై
యొనరింప బూనెతపమును
ననయము నాదేవిఁగూర్చి యలమేరువునన్

71. మ. అని సూతుండిటు వ్యాస నారదుల దివ్యంబైన సంభాషణల్
విని పింపన్ విని శౌనకుండమిత సంప్రీతిన్ మహోత్సాహుడై
వినయస్వాంతుడు నౌచు నిట్లనియెనో విద్వన్మణీ! నీవు ప
ల్కిన యా సంఘటనమ్ము దెల్పుము హయగ్రీవాద్భుతాఖ్యానమున్

72. కం. ఏ విధమున శిరము తెగెను
నావైకుంఠున, కటుపయి నయ్యబ్జ భవుం
డే విధమున నశ్వశిరము
భావించి తగిల్చె తెల్పు పావనచరితా!

## హయగ్రీవ చరితము

73. కం. అనిశౌనకాది మునులడి
గిన విని సూతుడు విధాత కిల్బిషుడనియెన్
వినుము హయగ్రీవ చరిత
మును వినిపించెద ననంత పుణ్య ఫలదమున్

74. శా. దేవాధీశుడు పద్మనాభు దురు దై తేయాంతకుండొక్కచో
నే విఘ్నంబులుఁబొందకుండ పది వేలేడుల్ మహా యుద్ధమున్
దేవారాతులతోడ సల్పి యట నిద్రించెన్ ప్రగాఢంబుగా
జ్యావేష్టంబగు వింటి కొప్పుపయి నాశ్వాసంబునుంబొందుచున్

75. తే.గీ. వింటి కొప్పుకు గడ్డమ్ము నంట నిలిపి
భారమంతయు దాని పైఁ బడగ నిల్పి
గాఢ నిద్రను బొందె నా కంజనాభు
డకట! చిఅకాలమట్టులే యరిగెనంత

76. చం. విషయ సుఖమ్ములన్ మునిగి వీడక మోహముతోడ సంసృతిన్
తృషతఁజరించు నజ్ఞుని సుదీర్ఘ తమంబది యే మహాత్మ్ము స
త్పృషి జపియింపఁబర్విదునొ; తేజముగల్గునొ; నామహాత్ముడే
యిషుయుత సజ్యచాపమున నిట్టుల నిద్రను బొంద చిత్రమౌ!

77. వ. అది యట్లుండె నట దేవతలెల్లరు.

78. మ. సవనంబొక్కటిఁజేయ నెంచి దివిజుల్ సంఘమ్ముగా నబ్జజున్
శివునిన్గైకొని యజ్ఞమూర్తియగు లక్ష్మీనాధు నాజ్ఞన్ గొనన్
వివిధంబౌ శ్రుతి సూక్తమంత్రములతో విస్పష్టమౌ పద్ధతిన్
స్తవముల్ సేయుచు విష్ణు లోకమునకున్ దారేగిరుత్సాహులై

79. చం. అటఁజనిచూడ నాయసుర హంతకు నెందును గానలేక వా
రటు పయి దివ్యదృష్టిఁగని రా జగదీశు, ననంతు, నొక్కచో
పటురణ నైపుణీ విభవ భంజిత దైత్యసహస్రవీరు, ప్ర
స్ఫుట రణవిక్రియాజనిత పూర్ణ పరిశ్రమ సుప్తదేహునిన్

80. చం. కని సుర సంఘముల్ భవుని కంజభవున్ మునుసేసి యందరున్
జనిరి మనోజవంబున నిశాచర సంహరు దున్న చోటికిన్
జనియును నిద్రలేపుటకు జంకుచు శంకరుడుండ; బ్రహ్మతా
మనమున చింతసేసె నొక మంచి యుపాయముమెచ్చ సర్వులున్

81. వ. ఇట్లు పాయమాలోచించి





82. తే.గీ. వమ్రినొక్కటి సృష్టించి వనజభవుడు
వింటి నారిని భక్షించి వెళ్లమనుచు
నాజ్ఞ యిచ్చెను, నేచెప్పి నట్లు సేయ
విల్లు జారును మేల్కొను వెన్నుడంత
దేవకార్యమ్ము నెరవేరు దీప్తి తోడ
ననగ దివిజులు సంతోష మందిరపుడు
సంది యంబంది యావమ్రి సరసిజాత
భవునిగని యిట్లు పల్కె సంభ్రమము తోడ

83. శా. నిద్రాభంగము, సత్కథా మధుర వాణీ శ్రావ్య భంగమ్ము, సౌ
భద్రంబైవిలసిల్లు దంపతుల దంపత్ సౌఖ్య భంగమ్మునున్,
సద్రాగాంచిత మాతృ పుత్ర విలసత్ సంబంధ భంగమ్ము లో
భద్రాకార! యొనర్చుటెల్ల ఘనపాపంబుల్ గదా! తెల్పుమా

84. తే.గీ. సర్వ పాపమ్ములకు మూల మూర్వియందు
స్వార్థ మౌఁగాన నిటుచేయు మనుటతగునె
యింత పాపమ్ముఁజేసి నేనేమి ఫలముఁ
బొంద గల నయ్య! చేప్పుమో పుణ్యచరిత!

85. కం. అని యట్లాక్రిమి యడిగిన
విని చతురాననుు డిటులనెఁ బ్రీతిన్ యజ్ఞం
బున నీకును దగు భాగం
బొన, గూడును నిక మనమున నుడుగుము శంకన్

86. తే.గీ. హోమ కార్యమ్మువేళల హుత మొనర్చు
నాహవిస్సులు చెదరియిట్టట్టు చెంతఁ
బడిన యవి యెల్ల నీవౌను బాధపడకు;
నిద్ర లేపుము వెన్నుని నీవువేగ

87. తే.గీ. అనగ నావమ్రి యజుని యాజ్ఞాను సార
మరిగి యావింటి నారిని నగ్రమందు
చటుకు మనికొరుక నపుడు పటురవమున
నెగసి పడెవిల్లు వజ్రమ్ము పగిదిఁదోప

88 శా. కంపించెన్ భువనత్రయంబు; దివిజుల్ గాసిల్లి నల్వంకలన్
గుంపుల్ గట్టుచు పర్వులెత్తిరి దిశాకుంభీసమూహమ్ములున్
సొంపుల్‌దప్పుచు ఘీంకరించె; నుదధుల్ చోద్యంబుగా ఘూర్ణిలెన్
ఫంపంఫం ఫెళుఫెళ్లు ఫెళ్ళనెడి నా బాణాస నోద్యధ్వనిన్

89. మ. ఇదియేమీ! యిటులయ్యెనంచు దివిజాధీశుల్ శివాబ్జాసనుల్
మదిలోహెచ్చిన దుఃఖ తాపమున పల్మారుల్ భయోద్వేగులై
వెదుకన్‌గుండల మండితం బయి ప్రభావిస్తారమై యొప్పుశా
ర్జ్గిదరస్మేరముఖాబ్జ శీర్షమటుచక్కిన్ గాన లేకెల్లరున్

90. తే.గీ. చేష్టలుడిగిరి దేవతల్, చివర కెటులొ
తేరుకొని దేవదేవుని దీనబంధు
నఖిలహృదయాంతరాత్ముని నాదిపురుషు
నిట్లువేడిరి దీనులై యెల్లవారు.

91. శా. అయ్యా! నీవు సనాతనంబయిన దివ్యాత్మస్వరూపుండ, వే
యయ్యల్ నీకిటు లాపదల్ గడగి సేయంజాల; రాద్యంతముల్
వియ్యంబుల్ మరికయ్యముల్ గలవె భావింపంగ మీకెప్డు; ది
క్కయ్యా! యెవ్వరు మాకికన్ విపదనంతాంభోధిదాటింపగన్

92. కం. ఛేదింపవు శస్త్రంబులు
బాధింపవు నిన్నునెపుడు పావకకీలల్
వేధింపవు మారుతములు
శోధింపగ నాత్మతత్త్వ శుద్ధుడవగుటన్.

93. కం. సాత్త్విక రాజస తామస
తత్త్వములౌ మాయలెల్లఁ దగిలియు త్రైగు
ణ్యత్వమున కతీతుని యీ
తత్త్వజ్ఞుని శిరముఁద్రుంచ దక్షములౌనే

94. కం. ఇది యెవ్వని పనియోయని
మదిలో చింతింపఁదగదు మనకైమనమే
మదనజనకు శిరము నిటుల
విదళించితి మయ్య దిక్కు వేరెవరింకన్





95. చం. అనియిటు వేల్పులెల్లరు ననంత విచార వికంపమానులై
ధనమును గోలుపోయిన విధంబున నుండ వివేక శీలి య
య్యనఘుడు దేవ వంద్యుడు బృహస్పతి వారలఁ జూచి మీరు మీ
మనములచింతలన్ విడిచి మార్గము యోచనసేయుడింతటన్

96. ఉ. దేవతలైన మీరెయిటు దీనతనుండుట భావ్యమౌనె, ధై
ర్యావహులైయుపాయమును నాత్మ విచారము సేయబూనుడీ
దైవబలంబుతోడయిన తప్పక మానవ యత్నముల్ సదా
యేవిధినైన సత్ఫలములిచ్చుట సిద్ధమదట్టులుండినన్

97. ఆ.వె. దైవబలము కంటెఁ దగనన్నివేళల
పురుష కారముననె జరుగు పనులు
కాన మీరలిపుడు కర్తవ్యమును గూర్చి
చింతసేయుడయ్య చింత తీరు

98. మ. అనినన్ దేవ విభుండు మానసమునం దావేశ ముప్పొంగ; నో
యనఘా! నీకిటు లాడగాఁదగునె, దైవానుగ్రహంబెప్పుడున్
ఘనమై యుండునెగాని; పౌరుషము తాఁగన్పట్ట దాధిక్యమై
ఘనులిట్లిందరు దేవతల్ గలిగియున్ గంజాక్షు రక్షించిరే!

99. కం. అని దేవేంద్రుడు పలికిన
విని కంజజు డిట్టులనియె వేదాంతోక్తిన్
వినుడుశుభా శుభముల నే
ర్పున సహియించుటయె మిగుల మోదముగూర్చున్

100. ఆ.వె. దైవ నిర్ణయమ్ము తప్పింప నెవరికి
సాధ్యమౌను? మునుపు శంకరుండు
నాదు శిరము ద్రుంచెగాదె, యాతండును
శాప వశత లింగ రూపుఁగొనడె

101. ఆ.వె. ఇన్ని మాటలేల యింద్రుండ వగునీకు
కన్నులయ్యెగాదె కాయమెల్ల
అసురవరుల కోడి యాసనమ్మునువీడి
ఎన్నిమార్లు పరుగు లెత్త లేదు

102. ఉ. కావున నింకఁజేయఁదగు కార్యముఁజెప్పెద నాలకింపుడీ
భావములన్ సనాతనిని పాయక నాపరమాంబికన్ మహా
పావని నాదిశక్తిని శుభంకరి నిర్గుణిఁగూర్చినిష్ఠతో
ధీవరు లార చేయుడు విధేయత దోప తపంబు నిచ్చలున్

103. కం. అనియిట్టు లజుడు పలికిన
విని దివిజులు సమ్మతించి వినయాన్వితులై
మనమున దేవీ స్తోత్రము
లనయముఁగావించ సాగిరతి నిశ్చలతన్

104. తే.గీ. నలువ నాలుగు ముఖములన్ గొలువు దీరి
యున్న వేదమ్ములవినాల్గు నుత్సహించి
యాలపించెను సుమధురమైనయట్టి
మాతృసూక్తమ్ములెల్ల సంభావితముగ

## దేవీస్తుతి

105. కం. విశ్వోత్పత్తికి తత్ స్థితి
నశ్వరములకీవె కారణమ్మగుదమ్మా!
శశ్వత్ శుభదవు నిర్గుణ
వీశ్వరి వాధారమీవె యీజగములకున్

106. కం. తెలివియు కలిమియు బలిమియు
వెలుగును శాంతియును శ్రద్ధ వివిధంబులుగా
గల మావైభవములు మీ
కళలేగద విశ్వజనని! కారుణ్య నిధీ!

107. కం. సావిత్రివి గాయత్రివి
శ్రీవాణివి నీవయమ్మ! శ్రితహిత వరదా!
మా వివిధ బంధనములన్
నీవే మాయింపగలవు నిర్మల చరితా!

108. చం. అగణిత సర్వకార్యముల కాదిమ కారణమీవెయయ్యు; నీ
త్రిగుణములన్ జగంబులను ద్రిప్పుచు కారణమింతలేని య





ట్లగపడు నీ మహత్వ ముల నల్పమతిన్ తెలియంగ బూనువా
డెగయు పయోధిఁదెడ్డుఁగొని యీదఁ దలంచిన వాని చందమౌ

109. ఉ. చీమ చిటుక్కు మన్న నది సిద్ధము నీ చెవిఁజేరు, నైన నీ
వేమి యెఱుంగ నట్లునికి కేమికతంబు; వికుంఠుడీ పరం
ధాముడు నీకు భక్తుడిటు దైన్యముగాపడి యుండ లోకముల్
తామస మగ్నమయ్యె వరదా! పరమేశ్వరి! చూడుమింతయున్

110. కం. దివిజులు చేసిన పాపము
లవియెల్లను పంక జాక్షు నంటు కొనియెనో?
ప్రవిమల సుధాబ్ధి సుతపై
నవిధేయతమోపి యిట్టు లలిగితివేమో!

111. ఉ. భక్తులు నీకు దేవతలు పాయక యెప్పుడు నీదు నాజ్ఞ లా
సక్తి నొనర్తు రెల్లెడల, శౌరిని జీవితుఁజేయుమంచు వే
దోక్తులు కీర్తనల్ సలుప నుత్సవమంది త్రిలోకమాత ది
వ్యోక్తుల తోడ నిట్లు దివిజోత్తములంగని పల్కెనాదృతిన్

112. ఆ.వె. విష్ణు మూర్తి శిరము విదళింపబడుటకు
కారణంబొకండు కలదు వినుడు
కారణమ్ములేక కార్యమేదైనను
జరుగ దెపుడు మూడు జగములందు.

113. మ. ఒకనా డబ్ధి సుతాననాంబుజము, తేజోద్దీప్తముంగాంచి యీ
యకలం కాత్ముడు పద్మనాభుడు పరీహాసంబుగావింప, తా
వికలత్వంబును జెంది యిట్లు మది భావించెన్ మహాలక్ష్మి, నే
డకటా! యీతడు నన్నుఁజూచి యిటులన్ హాసింపగానేలొకో

114. చం. వికృతముగాఁగనంబడెనొ వెన్నున కిప్పుడు నాముఖంబు; వే
రొకవనితన్ సపత్నిని యనూహ్యముగా గొని వచ్చెనేమొ మె
చ్చకనను; కానిచోనిటు లసంగత హాస్యము సేయనేల దీ
నికిక కతంబు లేదనుచు నిండిన దుఃఖ పరీత కోపయై.

115. కం. నీ శిరము తెగును గాక! ని
యాశశిముఖి శాపమిచ్చె నబ్జాక్షునకున్

హా! శంక యెంతవారిని
నాశనమొనరించు గాదె నరులన్ సురలన్

116. తే.గీ. తనకు వైధవ్యమగునని తలప దాయె
భర్తృసౌఖ్యము తొలగునన్ భయమువీడె
సవతిపోరున కవి రావు సాటి యనుచు
తమము నిండగ శాపమ్ముఁదానొసంగె
క్షణిక కోపమ్ము తగదెంత సాధ్వులకును.

117. కం. శరవేగమ్మున నెగురుచు
శిరమిప్పుడు పడియె లవణసింధువు నందున్
సురకార్యార్థమె యిట్టుల
జరిగెను; బ్రతికింతు నిపుడె శౌరిననంతున్

118. కం. సురసత్తములౌ మీరలు
జరుపన్ దలపెట్టి నట్టి సత్కార్యంబున్
జరుగును; నీవిఘ్నమునకు
మరియొక కారణము గలదు మక్కువ వినుడీ

119. కం. రక్కసుడు హయగ్రీవుం
డొక్కడు "హ్రీం"కార జపము నొనరించెను మున్
పెక్కేండ్లు ఘోరతరముగ
నక్కజమును బొంది నేను నాతని కపుడున్

120. ఉ. తామస శక్తి రూపమున దర్శన మిచ్చుచు సింహవాహనై,
యేమి వరమ్ముకావలయు నేర్పడఁదెల్పుమటన్న నాతడున్
ప్రేమదలిర్ప బాష్పజల బిందుయుతంబుగ భక్తియుక్తుడై
నామహిమల్ స్తుతించుచు ఘనంబుగఁగోరె వరంబు నిట్టులన్

121. తే.గీ. మరణ మెన్నండు లేనట్టి వరము నాకు
నిమ్ము; దేవదానవవీరు లెపుడు నన్ను
నాజి గెలువంగఁ జాలని యట్లు సేయు
మమ్మ! జగదంబ! ప్రణతి శతమ్ములమ్మ!





122. చం. అనియడుగంగ నేనును హయాననుఁ జూచి జగంబులందు పు
ట్టినయది గిట్టకుండుట ఘటింపదు; మృత్యువదెంత వారికై
నను సహజమ్ము కావున మనంబున నిట్టియసంభవంపు కో
ర్కెను విడి కోరుమింకొకటి కీర్తులు దిక్కుల వెల్గునట్టుగన్

123. మ. అననాతండిటు పల్కె నట్లయిన నన్నశ్వాననుండే వధిం
పను సాధ్యంబగునట్లు, తక్కుఁగల యెవ్వారైనఁజంపంగ జా
లని యట్లిమ్ము వరమ్మునా నతని యుల్లంబందు నానందమున్
గనునట్లిచ్చితి నే వరంబు నటు లౌగాకంచు; తానంతటన్

124. మ. వరగర్వంబున నేగి వేదవిదులన్ భాస్వత్తపోదీక్షులన్
సురలన్ దారుణ హింసలన్ నిరతమున్ స్రుక్కించు చున్నాడు; వా
ని రణంబందు జయింపనేరరెవరున్ నిక్కంబు; శీఘ్రంబుగా
తురగంపుంశిర మొందు తెందు; కడు చాతుర్యమ్మునన్ త్వష్టయున్

125. తే.గీ. దాని నతికించు వెన్నుని మేనికిపుడు
దేవదేవు డంతట హయగ్రీవుడనగ
బరగి రక్కసు హతమార్చు; పరమశాంతి
యగును జగతికి, దేవ కార్యమునుదీరు

126. కం. అని జగదీశ్వరి పల్కగ
విని దేవతలెల్ల రపుడు వినయాన్వితులై
చని చెంత నశ్వమొక్కటిఁ
గని తెచ్చిరి దానిశిరము ఖండించి వెసన్.

127. ఉ. దేవత లెల్ల వేడిరి విధేయతతో నల దేవశిల్పి; నో
దేవర! యశ్వశీర్షమును దెచ్చితి మా జగదంబ పంపునన్
నీవును దీని మొండెమున నిల్పి రయమ్మున విష్ణునిన్ పున
ర్జీవితుఁ జేయుమయ్య! యనఁజేసె నతండును నట్ల నేర్పునన్

128. ఉ. అంతట దేవదేవుడు హయాననుడై యుదయించె దీప్తు లా
శాంతములన్ వెలుంగ; సురలాత్మల సంతసమంది; రాపయిన్
గొంత సనంగ కాలమటు గూల్చె హయానను డాహయాననున్
శాంతమునొందె లోకములు సర్వము రక్కసుడుక్కడంగుటన్

129. తే.గీ. ఈహయగ్రీవు చరితమ్ము నెల్లవారు
తెపు మాపును చదివిన పాపచయము
తొలcగి సురలోక సుఖముల వెలయగలరు
వినిన వారికినైన తద్విధమెగల్గు

130. మ. అని సూతుండిటు లశ్వశీర్షు చరితంబత్యంత హృద్యంబుగా
వినిపింపన్ విని శౌనకాది మునులో విద్వన్మణీ! యాకథల్
వినగా నింకను కోరికల్ గలిగెడిన్ విన్పింపు మా వీనులున్
తనివిన్ జెందగ మీకథామృత రసా ధారాభిషేకంబునన్

131. తే.గీ. పూర్వ పుణ్యమ్ము వలన మీ పొందు గలిగె
అమృత సమము సత్పురుష సమాగమమ్ము
జగతి మూర్ఖులతోడి సంసర్గమెపుడు
విషము కంటెను మిన్నయై వెఱపుcగొలుపు

132. చం. అనఘులు మిమ్ముబోంట్లు సకలార్థవిదుల్ వివరించు ధర్మముల్
వినగల వారె ధన్యులు; వివేకమె మానవ జన్మకున్ వరం,
బనిశము, సత్కథల్ వినక హాయనముల్ వృథసేసి యంగనా
ధన విషయానురక్తులగు తామసు లాపశుతుల్యులేగదా!

133. కం. శ్రవణము జిజ్ఞాసువులకు
నవిరళమౌ జ్ఞానమొసగి యఘములcబాపున్
భువి సత్త్వ రజస్తమములc
ద్రి విధములుగ శ్రవణగతుల తెలిపిరి విబుధుల్

134. తే.గీ. సకల వేదార్థశ్రవణమ్ము సాత్వికమ్ము;
రాగసంబంధ సాహితీ శ్రవణ మదియె
రాజసంబయ్యె; యుద్ధవార్తలు కుజనుల
చరితలు వినుట యది తామసంబు నయ్యె

135. కం. త్రివిధములగు నాశ్రవణము
లవియును నుత్తమము మధ్య మాధమములనన్
త్రివిధములై యొక్కొక్కటి
ప్రవిభక్తము చేయబడియె బ్రహ్మజ్ఞులచే





136. తే.గీ. ముక్తి కొఱకైన శ్రవణమ్మె యుత్తమమ్ము
స్వర్గ సుఖదమ్ము మధ్యమ శ్రవణమగును
సకల భోగమ్ములకునైన శ్రవణ మధమ
మనగ త్రివిధమై సాత్వికంబది తలిర్చు

137. తే.గీ. అగ్నిసాక్షిగcగొన్నయర్ధాంగి తోడ
నుత్తముల వలపు వినుట యుత్తమంబు;
మధ్యమమగు వేశ్యల సంగమముల వినుట;
అధమ మక్రమ సంబంధ విధము వినుట;
శ్రవణ గతులొప్పు నివ్విధి రాజసమున.

138. తే.గీ. ధర్మ సంస్థాపనార్థమ్ము, ధరణి జరుగు
యుద్ధవార్తలు వినుటది యుత్తమంబు
ద్వేష భావమ్ముతోడ విద్విషులcజంపు
వార్తలను విన్న మధ్యమ పద్ధతియగు
కారణమ్మింత లేక యకారణముగ
సేయు యుద్ధంపు వార్తలు చెవినిc బెట్ట
నధమమౌశ్రవణ మనెదరార్యులెపుడు
తామసంబిట్లు త్రివిధమై తనరుచుండు.

139. ఉ. కావున నోమహర్షి! బహుకాలము మాకిటు ముక్తి దమ్ములౌ
పావన సత్పురాణము లపారముగా వినిపింపుమయ్య; వా
గ్దేవి వసించు మీరసనcదేలు సుధామయ సత్ప్రసంగముల్
గావె! నిరంతరమ్మఖిల కల్మషభేదన గాంగ తోయముల్

140. కం. బుధవినుతుడు విమల తపో
నిధియౌవ్యాసుండు తెల్పె నీకె ట్లట్లే
మధుకైటభ వృత్తాంతము
మధురముగా తెలుపు మయ్య మధువాగ్భూషా!

## మధుకైటభ వధ

141. కం. అని శౌనకు డడిగిన నా
మునివర్యుడు సూతుడమిత మోదము తోడన్

విని‌చె నిటుల మధుకైటభు
లనియెడి రక్కసుల చరితమతి మధురముగన్

142. మ. జగతిన్ మున్ను మహాజలప్రళయమై సర్వంబు నేకార్ణవం
బుగ నుండన్; హరి యొక్కడే మిగిలె నంభోమధ్యమందిద్ధ ప
న్నగ పర్యంకము నందు యోగమున నానందించుచున్ దివ్య దీ
ప్త గభస్తిన్‌బలె; నట్టులే సనగ నంతన్ కొంత కాలానకున్

143. ఉ. అమ్మహితాత్ము కర్ణయుగ ళాంతర నిర్గత కల్మషమ్ము గో
ళమ్ములవోలె వెల్వడ జలంబుల; నమ్మల మందు నుగ్రదే
హమ్ములతోడ నిర్వురు మహాబలవంతులు పుట్టి వారు ని
త్యమ్ము విహారముల్ సలిపిరంబుధిలో మధుకైట భాఖ్యలన్

144. కం. ముదమున మధుకైటభు ల
ట్లుదకములన్ దిరుగు చుండ నొక సందేహం
బుదయించె వారిమనముల
నెదియాధారము జలముల కిచ్చట యనుచున్

145. కం. ఆధారము లేనియెడల
నాధేయంబుండదందు రార్యులు జగతిన్
బోధపడదు మనజన్మల
కాధారంబైనహేతు వరయగ నిచటన్

146. మ. అనివారిర్వురు పెద్దయున్ దడవు నట్లాలోచనల్‌సల్పి తీ
రని సందేహముతోడ నుండ నట నీరంబందు; తాకైటభుం
డనియెన్ దీనికి కారణంబొకటి లేదన్యంబు; ముల్లోకముల్
తన శక్తిన్ నడిపించు దేవియనియే తథ్యంబుగా నెంచెదన్

147. చం. అనియనుచుండ నాకసము నందొక రావము శ్రావ్యమౌచు వి
న్పిన వినివారు దాని నతి నిష్ఠ జపించిరి; యంతలోన, త
ళుక్కన మెరసెన్ నభంబున వెలుంగుచుకాంతులు; నంత పూర్వపున్
ధ్వని యొక దివ్య మంత్రమె నిబద్ధిగనంచు దలంచిరాత్మలన్

148. కం. ఆ వాగ్బీజంబును శ్రీ
దేవీ మంత్రంబెయనుచు దీక్షందమలో





భావించి జితేంద్రియులై
కావించిరి వేయి యేండ్లు కఠిన తపంబుల్

149. కం. ఘోర తరంబుగఁ జేసెడి
వారల తపమునకుమెచ్చి ప్రత్యక్షంబై
కోరుడు వరముల ననుచున్
సారసముఖియంబ పలికె సత్కృప తోడన్.

150. మ. అనినన్ వారలు మానసమ్మున నమందానందమున్ జెంది, యో
జననీ! మమ్మునజయింపవేరెవరికిన్ సాధ్యంబుగాకుండ స్వే
చ్ఛను మేమున్ మరణించునట్టులుగ నే సందేహమున్ లేక నీ
వనుకంపన్ వరమిమ్ము వేడెదము దీవ్యత్ పూర్ణచంద్రాననా!

151. చం. అనిన తథాస్తటంచు జగదాదిమ శక్తి యదృశ్యమయ్యె; వా
రనయము తద్వరమ్మున నహంకరణోద్ధత మందబుద్ధులై
వనధిఁ జరించు చుండ నలువన్ గని రొక్కదినమ్ము పంకజా
సనుని నిమీలితాక్షు, విలసద్ఘన దివ్యతపోవిరాజితున్

152. కం. కని కమల భవుని మదమున
నని యొనరుచు మనుచు పలికి రసురులు, తమతో
నని యొనరుప తగనిపుడని
యనెదవా; సరసిజము విడిచి యరుగు మెచటికేన్.

153. తే.గీ. బలము గలిగిన వానికే భావ్యమగును
నుచిత సింహాసనం బెక్క నో విధాత!
వీరులుండంగఁదగు పద్మవేదిపైన
భీరుడవు నీవునెక్కంగఁగోరఁదగునె

154. కం. అని మధు కైటభులనగా
మనమున చింతించి నలువ మఱుమాటాడన్
గననేఱక కర్తవ్యం
బును దెలియక కొంత తడవు మూర్ఛిలి నట్టై

155. కం. తేరుకొని; యిప్పుడేనున్
వీరల శక్తులు చరితలు వీరత్వంబుల్

నేరక దండోపాయము
సారించుట తగదటంచు సాలోచనుడై

156. కం. సామోపాయంబున నే
నేమేమో పొగడి వీరి నెట్టులనైనన్
ప్రేముడి వశమొనరుతమన
నీముదుసలి పిరికి యంచు నెంతురొయేమో!

157. అ.వె. ఇంత దనుక వచ్చి యిపుడు దానమ్మున
వీరి నడప నాకు వీలు గాదు
దైవ నిర్ణయమ్ము తప్పదెట్టైనను
భేదమొకటె తగును వీరి కిపుడు

158. చం. అనియొక నిశ్చయమ్ము మన మందు గుదిర్చి సరోజనాభునిన్,
ఘనబల శోభితున్, విమత గర్వవిభంజను, నాదిశేషశా
యిని, నిరతమ్ము యోగమున నిమ్ముగ నిద్రను జెందియున్న వె
న్నునిఁగని దక్షు డీతడెననున్ దగఁబ్రోవనటంచునెంచుచున్

159. శా. భద్రాకారుని పాపనాశనుని సద్భక్తావనున్ విష్ణునిన్
నిద్రన్ లేపగ నిశ్చయించుకొని యా నీరేజ గర్భుండు తా
ఛిద్ర వ్యాకుల మానసంబొకట నిశ్చింతంబుగా నిల్పి యా
చిద్రూపున్ స్తుతియించె నిట్లు మధురశ్రీ రమ్యవాక్యంబులన్

160. మ. హరి! దీనావన! వామనా! సకల భూతాత్మస్వరూపా! ననున్
కరుణన్ జూడుము సర్వలోకవినుతా! కారుణ్యమూర్తీ! శుభం
కర! దుర్బుద్ధులు రాక్షసాధములు నన్ గయ్యంబునం దిర్వురున్
పరిమార్పం గమకించు చుండిరరుగో పాటించి రక్షింపవే!

161. కం. జగముల ననవరతము కను
యుగ సంజ్ఞల బ్రోచెడి పురుషోత్తమ! నా యీ
యగచాట్లు గనగ నేరవొ
నిగమ వినుత! తగునె యిట్లు నిద్రన్‌బొందన్

162. కం. తల్లియు తండ్రియు నీవే
ముల్లోకము లందు నాకు భువనైకవిభో!





కల్లలనుచు మదినెంచకు
తెల్లంబిది నిదురలెమ్ము త్రిగుణాతీతా!

163. చం. అనియిటు లెంతయున్ దడవు హాటక గర్భుడు పద్మనాభునిన్
వినయముతో స్తుతించినను వీడక నిద్దురఁగూరి యుండుటన్
గని యిపుడేది మార్గ మదె కర్కశదేహులు వచ్చుచున్నవా
రనితరసాధ్యులంచు కడు నార్తి విరించి తలంచె నిట్టులన్

164. శా. విశ్వాత్ముండును విశ్వరూపుడును నౌ విష్ణుండె నేడిట్లు తా
వశ్యుండయ్యెను యోగనిద్రకనినన్ భావింప నానిద్రయే
విశ్వంబందధికాధికంబనుచు సంవిత్ పూర్ణసంపన్నుడై
విశ్వాసంబున యోగ నిద్రనిటు తావేడెన్ మదిన్ నిల్పుచున్.

## కంజజుడొనర్చిన యోగనిద్రాస్తుతి

165. శా. దేవీ! నీవె సమస్తలోకముల కాదిన్ కారణంబంచు నే
నీవేళన్ గ్రహియింపఁగల్గితిని తల్లీ! వేదముల్ స్తోత్రముల్
గావించెంగద నీదు వైభవములం; గల్యాణ సంధాయినీ!
భావింపందరమే త్వదీయమహిమల్ స్వల్పజ్ఞు లాద్యంతముల్

166. కం. జగతికి కర్తవు నీవే!
సగుణవు నిర్గుణవు నీవె చైతన్యంబై
యగణిత రూపంబులలో
నగపడుదువు నీవె నిర్మలాత్మస్థితిలోన్

167. కం. నామము రూపము లెఱుగని
నీ మాయలు తెలియలేక నిరతము నానా
నామమ్ముల రూపమ్ముల
తామేకల్పించి నిన్ను తలతురు మౌనుల్

168. కం. బుద్ధివి సంధ్యాదేవివి
శ్రద్ధయు సంపదయు నీవె సకల జగములం
దిద్ధమతివి ధృతివి యశ
శ్శుద్ధచరిత నీవె యగుదు శుభవరదాయీ!

169. శా. అమ్మా! నీదగు నామధేయమును స్వాహాశబ్ద చిహ్నాంబుగన్
సమ్మానించుచుఁ జెప్పుచున్ మునివరుల్ జన్నమ్ములన్ జేయగా
సుమ్మీ; చెందును గాదె దేవతలకున్ జోద్యంబుగా యజ్ఞ భా
గమ్ముల్; లేని యెడన్ హవిస్సులవి చక్కం జెందునే వారికిన్

170. కం. అదె మధుకైటభు లిటు దు
ర్మదమున నరుదెంచిరమ్మ రణమున నన్నున్
విదళింప; విష్ణు మూర్తికి
నిదియెల్లను తెలియ దంచు నే తలతు మదిన్

171. కం. నీకున్ వశుడై యీతడు
సేకొనియెన్ గాఢనిద్ర శీఘ్రంబుగ నీ
వీ కమలేశుని విడువుము
కాకున్నను చంపు మీవ ఖలుల నసురులన్

172. కం. కమలయు నీవశమౌటన్
కమలాక్షుని నిద్రలేపఁగలదే చెపుమా!
కమలేశుడె యిటులయ్యెన్
కమలానన! నీదు శక్తిఁ గనగ తరంబే

173. ఉ. ఆదియుగంబునన్ మొదట నంబుజ నాభుని సృష్టిఁజేసి యా
వేదమయున్ జగమ్ములను విజ్ఞతఁబ్రోచుచు నుండు మంచు నీ
వే దయతోడ నాజ్ఞయిడి యిప్పుడు నిద్రను గూర్చినావు, నీ
వేదెపుడెట్లు సేయ మదినెంతువొ యద్దియెఱుంగ శక్యమే!

174. కం. నిను నాజ్ఞాపింపగ నే
ఘనుడీ ముజ్జగములందుఁగన్పడడొండున్
అనయము స్వతంత్రురాలవు
కన నీవేయగుదు కార్యకారణ శక్తుల్

175. సీ. ఇటు నన్ను సృజియించి యీనీచ రాక్షస
ద్వయముచే చంపింపఁదలచి నావొ?
నను నవజ్ఞసలుప పనిబూనితివిగాని
యీరక్కసుల సృజియింపనేల





నీ యద్భుతంబైన నిఖిల చేష్టితములు
మహిమలు తెలియంగ మాతరంబె
ఇపుడు నీయెదుటనే యీరాక్షసాధముల్
నను జంప మౌనమ్మ జనునె పూన
అట్లు జరిగిన యపకీర్తి యౌను నీకె
కాన వీరల ఖండించి కావుమమ్మ
లేక విష్ణుని నిద్దుర లేపు మిపుడ
వీరిఁబరిమార్చు నాతడు వేగిరమున

176. కం. ఏదైనను నీదయ యిక
మీదన్ నన్నెట్లు సేయ మేలగునోయం
చాదేవిన్ భక్తి నజుడు
సాదరమున వేడ; నామె సత్కృపతోడన్

177. తే.గీ. ఉరగశయనుని విడిచె న య్యోగ నిద్ర;
కదలికలు గల్గె నాతని కాయమందు
పద్మగర్భుడు సంతోష భరితుడయ్యె
నాల్గు ముఖముల చిఱునవ్వు నాట్యమాడ

178. వ. ఇట్లు నిఖిల పురాణ ప్రవచన దక్షుండైన సూతుండు మధుకైటభ వృత్తాంత
మును కొనసాగించుచుండ శౌనకాది మహర్షులలో నొకరి కొక సందేహంబు
రాగా సూతుని నాతండిట్లభ్యర్థించె

179. శా. అయ్యా! నాకొక సందియ మ్మొదవె నీయంభోజ గర్భాండమం
దయ్యబ్జోదరు, డబ్జగర్భుడు, శివుండన్ ముష్వరే నిత్యమౌ
నయ్యల్; వీరలె సృష్టియున్ స్థితియు సంహారంబులన్ జేయుచున్
నెయ్యంబొప్ప త్రిమూర్తులైరనుచు మున్వింటిన్ బ్రసిద్ధంబుగా

180. ఉ. అందును విష్ణుమూర్తి మహితాత్ముడు దక్షుడు, దివ్యతేజుడం
చందరుఁజెప్ప వింటిని; మహామహిమాన్వితుడాతడే యిటుల్
బందిగ యోగ మాయకిట పట్టు వడన్ బహుచిత్రమయ్యె, నీ
చందమునన్ శవమ్మువలె శౌరి యిటుండ కతంబుఁదెల్పుమా!

181. ఉ. అంతటి విష్ణుమూర్తి నిటులాత్మవశంబొనరించినట్టి య
త్యంత సమర్ధశక్తియు ననంతయు నైనపరాత్పరాంబ; యే
చెంతన నెట్లు పుట్టె, యెటు సేకొనెనింతటి దివ్యశక్తి, యీ
వింత యెఱుంగఁదెల్పుమని వేడె వినమ్రత తోడ సూతునిన్

182. కం. అని యమ్ముని యడుగగ తా
మనమున నొకకొంత తడవు మౌనయుతుండై
వినిపించె సమాధానము
ననఘుడు సూతుండు శౌనకాదులకిటులన్

## సూతుడు శక్తిని స్తుతించుట

183. చం. మునివరులార! నాకుఁగడు మోదము గల్గెను, మీదు సందియం
బును సరిదీర్ప నెవ్వరును మూడు జగంబులఁజాలరంచు నే
ననియెద; నారదుండు కపిలాది మహర్షులు నైన నిద్ది యి
ట్లనుచు తిరంబుగన్ దెలియ రైనను నొక్కటి యాలకింపుడీ;

184. ఉ. కొందరు విష్ణుమూర్తి నిక గొందరు శంకరు, గొందరర్కునిన్
గొందరు దేవనాథు మఱికొందరు వారుణు నగ్నిఁగొందరున్
అందరిలో వెలుంగు విభు డంబుజనాభుడె యంచుమౌను, లి
ట్లందరు నన్నిరీతుల ననంతు భజింతు రనంత రూపులన్

185. శా. ప్రత్యక్షం బనుమానమున్ మఱియు శబ్దం బౌపమానంబులున్
అత్యంతానుభవమ్ము లాపయిన నర్థాపత్తి దృష్టాంతముల్
ప్రత్యేకంబుగ నీప్రమాణములతో ప్రాజ్ఞుల్ విశేషజ్ఞులై
సత్యంబున్ దెలియంగ వేరుగతులన్ చర్చింతురాద్యంతమున్

186. తే.గీ. ఈ ప్రమాణంబులకు నెల్ల నెంతమాత్ర
మంద దాపరబ్రహ్మమంచార్యులనిరి
బుద్ధిపరిధికి నావలఁబొల్చునట్టి
సూక్ష్మమిట్లని బుద్ధితోఁజూడఁదరమె

187. కం. సృజన స్థితి లయ శక్తులు
నజ హరిహరులకును, దహనమగ్నికి; నినునకున్
త్రిజగత్ప్రకాశ శక్తియు
నిజగుణములు తొలగెనేని నిర్వీర్యులునౌ

188. తే.గీ. శక్తిలేకున్న శివుడైన శవమెయౌను
అబ్జ గర్భాండమున చిన్నయణువుమొదలు
పర్వతమ్ముల వరకును పరమమైన
శక్తి మయమని తెలియుటే సమ్మతమ్ము

189. చం. సగుణము నిర్గుణంబనుచు శక్తియు రెండు విధమ్ము,లందు నా
సగుణముఁగోరికల్ గలిగి సన్మతి రాగులు పూజసేతు, ర
య్యగణిత నిర్గుణమ్మును విరాగులుపాసన సేతు, రాది వా
క్యగతి సకాములున్, విగత కాము లనంగ నుపాసకుల్ధరన్

190. మ. పురుషార్థంబు లొసంగు నట్టిదియు సంపూర్ణమ్ముగా కోరికల్
స్థిరమున్ దీర్ప సమర్థమైన పరశక్తిన్ గానగా జాలరీ
ధర మూఢుల్ కలియందు కొంద, రటు శాస్త్ర గ్రంథయుక్తంబుగా
పరమున్ గొందరెఱింగి మోసములతో బాధింతు రన్యప్రజన్

191. ఉ. మువ్వురు మూర్తులెల్లపుడు మోదముతో జపియించు శక్తి యీ
యవ్వయె; యజ్ఞయాగముల నామెకటాక్షముఁ గోరియేగదా
యెవ్వరునైనఁజేతు; రిదియెల్లను శాస్త్ర సుసమ్మతమ్మటం
చవ్వనజాసనుండు తెలియన్ వివరించెను దేవమౌనికిన్

192. తే.గీ. అతడు దెల్పెను వ్యాసున కమలమతికి
నతడు వివరించె మాకును నాదిశక్తి
మహిమలెల్లను; మీ యభిమతము కతన
తెలియఁజెప్పెద వినుడు నే తెలిసినంత

193. కం. అనియిట్లు సూతుండు శౌనకాదిమహా మునులంగాంచి; ఓ
మునివరులారా! మీ సందియంబులెల్ల తీరెను గదా! అని
మఱియు నిట్లు చెప్పందొడంగె

194. కం. వనజభవు స్తవమునకున్
మనమున పరితోషమంది మాధవుదేహం

బునువిడిచి వెలుపల గగన
మున నిలిచెన్ యోగనిద్ర; మురహరుడంతన్

195. తే.గీ. ఆవులించుచు లేచి యయ్యసురవైరి
మేఘ గంభీర రవమున మిన్నులదర
పలికె; దవ్వుల భయము విభ్రాంతి గలుగ
తనను వీక్షించు నలువను గనుచునిటుల

196. కం. సరసిజభవ నీవిట్టుల
పరమ తపో దీక్షవీడి వచ్చితివేలా!
అరయగ నీ ముఖపద్మము
కరము విచారసరణిఁగన కతమెయ్యేదియో!

197. చం. అనియడుగన్ విరించి యిటు లంబుజనాభుని తోడఁబల్కె; నో
యనఘ! భవత్ శ్రుతిద్వయ గుహాంతర నిర్గత దుర్మలమ్మునన్
ఘన బలశాలు లిర్వురతి గర్వయుతుల్ ప్రభవించి నన్నుఁజం
పను సమకట్టి వచ్చిరదె భక్తశరణ్య! సురారి భంజనా!

198. కం. అనియొనరింపుము మాతో
నని వారలు వెంటనంటి యరుదేరగ నే
మనమున భయమున్ జెందుచుఁ
జనుదెంచితి మీదు దివ్య సన్నిధి కనఘా!

199. కం. శరణము నీవే నాకిక
పరులెవ్వరు లేరు వారి వారింపంగన్
కరుణించిబ్రోవు మయ్యా!
పరమాత్మా! యసురవరుల భంజించి కృపన్

200. మ. అనివేడన్ పురుషోత్తముండు గృపతో నబ్జాసనుంజూచి నీ
మనమందెంతయుఁజింత వీడు మిక నేమర్దింతు నవ్వారలన్
వినుమీ వారికి నాయువుల్ గడచె నీవేళన్; మదోన్మత్తులై
చనుదేరంగ మదీయ ముష్టి హతులన్ సంహారమున్ జేసెదన్

201. కం. అనిహరి యిట్లనుచుండగఁ
జనుదెంచిరి సంభ్రమెల్ల చటులతరంగ





ధ్వని యెసగ కలయఁదిరుగుచు
ఘన ఝషముల బోలియపుడు కైటభ మధువుల్

202. తే.గీ. వచ్చి నలువను జూచుచు పలికిరిట్లు
పాఱి వచ్చితె యివ్విధి పందవోలె
యుద్ధమొనరింప రమ్ము నిన్నుక్కడంతు
మిపుడె యీ యురగ శయను నెదుటమేము

203. కం. అటుపై యీఫణిశాయిని
పటుతర విక్రమము దోప పరిమార్తుము; "మా
కిట నడ్డం బెవరని"యు
త్కటమున చరియింతు మింక కడలిన్ బలిమిన్

204. అని పలికిరయ్యవసరంబున

205. కం. మదమున కన్నులు గానక
వదరెడి యారక్కసులను వరగర్వితులన్
గదనము తనతోఁజేయగ
ముదమున రండనుచు విష్ణుమూర్తి పలుకగన్

206. ఉ. దిక్కులు పిక్కటిల్ల మదితీవ్ర తరాగ్రహ జాత రావముల్
పెక్కులు సేసి యయ్యసురవీరులు వెన్నునిఁదాకి, రందు నొ
క్కొక్కడె యుద్ధమున్ సలుపు టొప్పిద మంచుఁదలంచి ముందు తా
నెక్కొని దూకెనమ్మధువు నీరజనాభుని తోడఁబోరగన్

207. చం. మధువటు కొంతకాలము రమాపతితోడ జలంబులందుఁబ
ల్విధముల మల్లయుద్ధమతి భీకరమై యొనరించి డస్సినన్
మధు సహజాతుడప్పుడసమాన పరాక్రముడైన కైటభుం
డధరము పంట నొక్కి కమలాధిపుఁదాకె నుదగ్ర రోషుడై

208. కం. కైటభుడలసిన మధువును
కైటభుడును మధువలయగ కదనమిరువురున్
పాటించి చేయ వారల
పాటవమొకయించు కైనఁబాడఱకుండెన్

209. ఉ. పంచసహస్రవర్షములు పాయకనిట్టుల పద్మనాభుడొ
క్కించుక యంతరం బెఱుగ కిర్వురతోడను బోరిపోరి తా
కొంచెముడస్సి దేహమునకున్ శ్రమయౌట యెఱింగి "నాబలం
బించుక తగ్గఁగారణ మదేమొకొ" యంచుఁదలంచెనాత్మలోన్

210. కం. ఈ మధుకైటభు లేమియు
తామలసిన జాడలేదు తఱుగవు శక్తుల్
నామదికి శ్రమముఁదోచుట
కేమాయాజాలమౌనొ యెఱుగగ నైతిన్

211. కం. అని శౌరి యివ్విధంబున
మనమునఁ జింతించుచుండ మధుకైటభులున్
గని యలసె యీతడించుక
ననుకొని జయగర్వమొదవ నానందమునన్

212. వ. హరినిగాంచి

213. చం. అలసిన యట్లు గన్పడెదవంబుజనాభ యిదేమిటయ్య! నీ
వలయుట? రాక్షసాంతకుడ వంచు జగమ్ములపేరుఁబొంది యి
ట్లలయుట నీకు భావ్యమె? యటైనను నోటమి నొప్పుకొంచు నౌ
దలనిటునొగ్గి దాస్యమును దాల్పుము; లేక రణంబు సేయుమా!

వ. అని

214. చం. ప్రళయ మహాబ్ధి ఘోషసమ వాక్కులఁబల్కెడి వారి పల్కు లా
దళిత సురారి వీనులకు దారుణ శూలములట్లుదాక తా
గళమున కోపమాపుకొని కన్నుల శాంతమునిండ సత్పదా
వళుల వచించె నిట్లు సురవైరులతో కడు సామ్యపద్ధతిన్

215. శా. న్యాయంబౌనెసురారులార! యిటులాద్యంతమ్మునన్యోన్యసా
హాయంబేర్పడ మీరలిర్వు రనిసేయన్ సుంతకష్టంబు మీ
కేయంశంబున లేక పోయె; మఱి నేనిట్లొక్కడన్ యుద్ధమున్
జేయంగా నిరతంబు నాతనువు డస్సెన్ సుంత యోచింపుడీ.





216. చం. అలసిన వానితో కడుభయాతురుడై పరువెత్తువానితో,
పలుకుల ముద్దులొల్కు పసిబాలురతో, రణమందు శస్త్రముల్
దొలగిన వానితో, పడతితో, కదనంబొనరింప రెందు వి
జ్ఞులనుచు ధర్మముల్ దెలుపుఁజువ్వె సనాతన ధర్మ శాస్త్రముల్

217. కం. మీరును వీరులు గావున
మీరఁదగునె, ధర్మగతుల మేరలనిశమున్,
మీ రణ సంరంభములిక
వారింపుడు, నేశ్రమంబుఁబాయుదొకింతన్

218. చం. అనిహరి పల్క నొప్పుకొనిరామధుకైటభు; లంత వెన్నుడున్
జని యొక కొంత దవ్వసుర జన్మములన్ చరితంబులెల్లఁదా
మనము నెఱింగి "వీరు వరమత్తులు దేవియొసంగె వీరికి
ట్లనితరలభ్యమైన వర మన్యులచే మరణించకుండగన్

219. కం. కావున వీరలఁజంపుట
కే వీరుడుఁ జాలడిప్డు, డిన్నిదినంబుల్
నే వీరలతోఁ బోరుట
భావింపన్ వ్యర్థమయ్యెఁ బరిభవమయ్యెన్

220. ఉ. కావున సర్వసౌఖ్యశుభకామదయౌ పరదేవతన్ గృపన్
గావుమటంచు వేడెదనికన్ మది నేనని యెంచి తానిజ
గ్రీవమునెత్తి చూడనటఁగేవల శక్తియు యోగనిద్రయున్
శ్రీవరు గన్నుదోయికిఁబ్రసిద్ధిగఁ గన్పడె నాకసమ్మునన్

221. తే.గీ. కని నమస్కారమున్ జేసి కమలనాభు
డంబనిట్లని స్తుతియించె నార్తి తోడ
నీదు రూపము సగుణమోనిర్గుణంబొ
యెఱుగ భవదీయచరితంబు లింతయేని.

222. కం. చలనం బొకింత లేకయు
తలపులు నశియించి గాఢ తమముగలుగుటన్
తెలియుదు నయ్యను భవమే
తెలియను నేనింక నీదు దివ్యచరిత్రల్

223. చం. తెలిసెను నీప్రభావము మదిన్; సకలేంద్రియ చేతనత్వమున్
దొలగి సుషుప్తి నున్ననునుఁదోయజ గర్భుడు లేపుచుండినన్
మెలకువ లేకపోయె, నెలమిన్ నను వీడిన యంతనీవు, నే
నులియుచు నిద్రలేచితిని యుద్ధము వీరలతోడఁజేసితిన్

224. ఉ. నీవు వరంబొసంగ మదినిండిన గర్వముతో సురారులి
ట్లీవనజాతగర్భు వధి యింపఁదలంచిన యంతనీతడున్
గావుమటన్న నేను బహుకాలము యుద్ధముఁ జేసియెంతయున్
జేవదొలంగి యుండితి నజేయులు వీరని యెంచితిన్ మదిన్

225. కం. ఇదియెల్ల నీవెఱింగియు
మదినిట్టులఁదాల్పఁ దగునె మౌనము తల్లీ!
మదయుక్తులు వీరలు మము
విదళింతురు మౌనమీవు వీడక యున్నన్

226. ఉ. దీనత తోననిట్లు పరిదేవనముల్ హరిసల్పియంత, న
మ్రాననుడై నిలంబడగ నా పరదేవి ప్రసన్న చిత్తయై
మౌనమువీడి విష్ణుఁగని మంద మనోహర హాస యుక్త చం
ద్రాననయై మరంద మధురాన్విత వాక్కులఁబల్కెనిట్టులన్

227. ఉ. వీరిని ధర్మ మార్గమున వేయి యుగంబులకైనఁ జంపగా
నేరము మాయఁ జేసికడు నేర్పునఁ జంపుట యుక్తమౌను, నే
నారసి వక్రవీక్షణ సుమాస్త్రములన్ గడు మోహమందగా
వీరలఁ జేసెదన్ భయమువీడి రణంబున కుద్య మింపుమా!

228. కం. ఆమాటలు వినినంతనె
యామాధవు డమితమైన యానందమునన్
తా మధుకైటభులను సం
గ్రామము సేయంగఁబిలువ రయమున వారున్

229. చం. హరినటఁగాంచి "యోదనుజ హంతక! నీకు భయంబదేల సం
గరమున గెల్పునోటములు గావు తిరంబులు; వీరుడే నిరం
తరము జయింప; దర్భకుడుఁదానొక వేళ జయించుగాన, నె
వ్వరి కెటు నిర్ణయించె విధి వారికి నట్లగు చింతయేటికిన్





230. కం. రక్కసుల పెక్కుమందిని
నుక్కడగించితివి పూర్వ యుగములయందున్
నిక్కము దనుజాంతకుడని
చక్కని బిరుదమ్ము నీకు సమకూరె హరీ!

231. చం. అటుల మహోద్ధతిన్బలుకు నయ్యసురేంద్రులఁగాంచి వెన్నుడున్
బటుతర కోపవేగమున బాహువునెత్తి బిగించి వ్రేళులన్;
దిటవుగ నిచ్చె నిర్వురకు తీవ్ర తరంబగు ముష్టి ఘాతముల్
అటమటఁ జెంద కయ్యసురులంతట నా తని గ్రుద్ది రిర్వురున్

232. మ. అటులన్యోన్యము ముష్టి ఘాతముల పోరాటమ్ములన్సల్ప, ను
ద్భటవేగస్థిత పాదఘట్టనల సంద్రం బల్లకల్లోలమై
పటు ఘోషంబొనరింప వారిచరముల్ బర్వెత్తెనిట్టట్టు; సం
కటమున్ జెంది జనార్దనుండు గనియెన్ గామాక్షినూర్ధ్వంబునన్

233. ఉ. వెన్నుని యీయవస్థఁగని వేగ దయాపరిపూర్ణ చిత్తయై
కన్నులఁగెంపు నిండ మధుకైటభులన్ సుమ బాణ తుల్యమౌ
తిన్నని చూపులన్ వలపు దెల్పెడియట్టులఁ జూచి దేవి తా
మిన్నున నుండి నవ్వె శ్రుతిమించి సురారులు మోహమందగన్

234. ఉ. కామము ప్రేమమున్ గలుగు కంజదళాక్షి విలోకనాస్త్రముల్
కాముని తూపులట్లు మధుకైటభులన్ సరిదాక వారలున్
కామవికార చిత్తములఁ గన్నుల ఱెప్పలు వాల్చ కట్టులే
యామెను చూచు చుండ హరి యాత్మనెఱింగె తదీయభావముల్

235. తే.గీ. ఎఱిగి చిఱునవ్వు చిందించి యిదియె సమయ
మనుచు నసురులఁజూచి తా ననియెనిట్లు
వీరవరులార! మిముబోటి ధీరమతుల
నెందు మును జూడ; సంతస మందెమనము.

236. చం. వరమొకటిత్తు మీకిపుడు వాంఛిత మెద్దియొ తెల్పుమంచు, నా
హరియడుగన్, సురారులపుడాత్మల యందభిమాన జన్యులై
స్మరశర తాపవేగమున శాంకరిరూపము నట్టె చూచుచున్
స్థిరముగ నిల్చి పల్కిరిటు శ్రీపతి తోడ నలక్ష్య చిత్తులై

237. ఉ. నీవు వరమ్ములీయఁగొను నీచులమంచుఁ దలంచితే, రణం
బీవొనరింప మాకెదిరి యెంతయు సంతసమయ్యెఁగాన, మే
మే వరమీయనెంచితిమి యెయ్యది కావలె కోరు కొమ్మనన్
శ్రీవరుడంతఁగోరె తనచే మరణింపుడటంచు వారలన్

238. కం. అనియడుగ వారలప్పుడు
మనమున తబ్బిబ్బు వడుచు మాధవు చేతన్
మనమే వంచింపఁ బడితి
మనుచున్ దుఃఖమ్ముఁజెందిరటు కొంతవడిన్

239. తే.గీ. తేఱుకొనియంత మనములన్ స్థిరముఁ జేసి
అంబువులు లేనిచోటు లేదంచుఁ దెలిసి
ఒక యుపాయమ్ము యోచించి యురగశయను
తోడ నిట్లని పలికిరా దురిత మతులు

240. ఉ. ఇంతయుఁజింత లేదు, మరణించుట కేమును సిద్ధ, మైనచో
నింతకు ముందు నీవు వరమిచ్చెద నంటివి మాకుఁ, గాన దై
త్యాంతక! సత్యమూర్తి! యిట నంబువులేమియు లేనిచోట, న
త్యంత విశాలమౌ స్థలమునందు, వధింపు, మనంగ నంతటన్

241. కం. వారల యమాయకతకును
నీరజ నాభుండు నవ్వి నిఖిల దనుజ సం
హారక మౌ చక్రంబును
నోరిమి మదిఁదలచి పెంచె నూరువులఁ గడున్

242. ఉ. అవ్విధిఁ బెంచి యూరువుల నయ్యసురాంతకు డాసురారులన్
నెవ్వగ నున్న వారిఁగని నిర్జల మీ స్థలమంచుఁ బల్క వా
రవ్విధిఁ గాంచి యచ్చెరువు నందుచు నైజ శరీరముల్ గడున్
దవ్వగు నట్లు పెంచి రతి దర్పితులై బహు యోజనాయతిన్

243. శా. అంతన్ వెన్నుడు తానిజోరువుల నత్యంతమ్ముగాఁబెంచి శ్రీ
మంతంబై వెలుగొందు చక్రమున నున్మత్తోగ్ర దార్ఢ్యాంగులన్
జెంతన్ నిల్పుచు తత్ సురారులను ద్రుంచెన్ శీర్షముల్ మొండెముల్
వింతల్ గొల్పుచుఁ ద్రెళ్ళ యూరువులపై వేర్వేర శీఘ్రంబుగన్





244. ఉ. వారి కళేబరమ్ముల నవారితరీతి ద్రవించి 'మేద' య
వ్వారిధి యెల్ల నిండ; నటుపైనది మేదిని యయ్యె; కాన నె
వ్వారికి నైన మృత్తికను భక్షణ సేయుట కూడదందు రా
భూరిమహర్షు; లయ్యదియె భూమియు, పృథ్వియునంచునొప్పెడిన్

245. మ. అరిషడ్వర్గములందుఁగామమది యత్యంతంబు దుష్టంబగున్
బరమర్షుల్ సురలున్ ద్రిమూర్తులును తన్మాయా వికారమ్ములం
దరిదిన్ జిక్కిరనంగ నన్యులకు సాధ్యంబౌనె తప్పింపగా
ధరణిన్ గామమె యెల్ల కష్టములకున్ దార్కాణ మంచెంచుడీ

246. కం. అనిసూతుం డిట్లని తా
వినిపించెన్ కైటభ మధు వృత్తాంతంబున్
వినినన్ వినిపించిన యే
ఘనుడైనను బొందు ముక్తిఁ గడు శీఘ్రముగన్

## శుకమహర్షి జననం

247. ఉ. అంతట శౌనకాది మును లాత్మల సంతసమంది, సూతున
త్యంత వినమ్రతన్ గనుచు, నయ్యరొ!, యింతకు మున్నునీవు మా
కెంతయుఁ బ్రీతి, వ్యాసుడపు డిష్ట సుతున్ బడయన్ దపం బవి
శ్రాంతముగా నొనర్చెనని, చక్కగఁజెప్పుచు నాపి యంతటన్

248. కం. మధుకైటభ వృత్తాంతము
మధురముగాఁజెప్పితీవు మనము లలరగన్
సుధలను జిందెడు పలుకుల
వ్యధలు దొలగఁజెప్పు మింక వ్యాసునిచరితల్

249. చం. అనియడుగంగ సూతుడిటు లాదరమొప్పగఁ జెప్పె; దేవతా
మునియిడినట్టి మంత్రమును పూర్ణ మనమ్మున నేక దీక్షతో
నొనరిచె తా జపమ్ముఁ, గడు నుజ్జ్వల తేజు, సుపుత్రుగోరి, య
య్యనఘుడు వ్యాసమౌని జగదంబను మానసమందు నిల్పుచున్

250. తే.గీ. పంచభూతాల తేజంపు సంచయమును
పుత్ర రూపమ్మునన్ దాను బొందఁగోరి

మేరు శిఖరాగ్రమున "కర్ణికార" వనము
నందు సాగించెఁ దపమును వ్యాసమౌని

251. తే.గీ. బ్రహ్మవేత్తలు దేవతల్ పరమ ఋషులు
సంచరించెడి నిర్మల స్థలము నందు
ప్రకృతి శోభల వెలిగించు రమ్య భూమిఁ
దపసు సాగెను విఘ్నముల్ దరియఁబోక

252. శా. అత్యుగ్రంబుగ సాగు వ్యాసముని దివ్యంబౌ తపస్తేజముల్
ప్రత్యబ్దమ్ము వివర్ధమై జగములన్ వ్యాపింప దేవాధిపుం
డత్యంతంబు భయంబుఁజెంది తగు విఘ్నాయత్తుడై యుండ, తా
సత్యంబున్ గ్రహియించి శంకరుడు ప్రస్తావించె నీరీతిగన్

253. చం. తపసుల పట్ల మత్సరము ధర్మము కాదు మహేంద్ర! నన్ను త
ద్విపుల వివేకు లెల్లపుడు వేడ్కఁ దలంతు; రనంత శక్తితో
నెపుడును గూడి యుండెడి మహేశ్వరుడంచు; ననుగ్రహించి సత్
కృపఁగనుమంచు; బుద్ధులను కేవల తత్వమునందు నిల్పుచున్

254. కం. శతవర్షమ్ములు నిండెను
సుతుఁ బడయన్, తపముఁజేయు చుండెన్ స్థిరుడై
ఇతనికి శుభలక్షణు డౌ
సుతునీయగఁ బోవుచుంటి సురలోక విభూ!

255. చం. అనిశివుడట్లుఁ దెల్ప నమరాధిపుడంతట శంక వీడి తాఁ
జనియె; మహేశుడున్ జని ప్రసన్న ముఖుండయి బాదరాయణున్
గని; "ఋషి సత్తమా! ముదముగల్గెఁ ద్వదీయ తపః ప్రవృత్తికిన్
తనయుడు మౌనిసత్తముడు దాంతుడు శాంతుడు గల్గు లె"మ్మనెన్

256. చం. వరము నొసంగి భక్తజనవంద్యుడదృశ్యుడుగాగ, మౌనియున్
కరము ముదంబుఁ బొంది బహుకాలతపశ్శ్రమ దేహుడయ్యుఁదా
సరగున యాశ్రమమ్ముఁజని సత్క్రియలన్ బొనరింప మెల్లగా
నరణి మథించి కాష్ఠమున నగ్నిరగుల్పఁదొడంగె నిష్ఠతో

257. మ. అరణిన్ మంథముతో మథించి నపుడే యగ్నుల్ జనించున్; సుతుం
డరయన్ నాకెటులుద్భవించు నిపుడత్యంతాను కూలంబునై





తరుణీ రూపమునన్ వెలుంగు నరణిన్ దథ్యంబుగాఁబొందకే;
సరిపో పొందెదమన్ననో మరల సంసారాంబుధిన్ ద్రెళ్లనే!

258. కం. అనుకూల వతియు, దక్షయు
వనజాక్షియు నయ్యు పత్ని ప్రతిబంధమెయౌ
తనయులఁ గనుటయె తప్పన్,
గననౌనే ముక్తి మార్గ గమ్యంబులిలన్

259. కం. అనయము శివుడైనను తాఁ
దనుమధ్యల బంధములను దప్పింపగ లే
దన; నరులము మనమెక్కడ
యని మనమునఁదలచి మౌని యతిదైన్యమునన్

260. చం. అరణి మథించుచున్ మునియనంత విచారము తోడనుండ; న
ప్సరస "ఘృతాచి" తామెఱపు చాడ్పున నాకసమందుఁదళ్కునన్
సుర విభుడంపెనో యనగ చూడ్కుల సొంపలరన్ విలాసమై
సరగున యాశ్రమోపరి దిశన్ గనిపించె నొయార మేర్పడన్.

261. ఉ. ఆయలివేణి చూపులకు, నాయమ మేని సువర్ణకాంతికిన్,
ఆయనురాగ వల్లరి యొయారపు భంగిమ, కామునీంద్రుడ
త్యాయతమై చలించునటు లంగజు తూపులు గూడనెక్కుడై
సాయమొనర్ప; స్వేదములు జార, వివర్ధిత రాగ బద్ధుడై

262. చం. మనమున నెంచెనిట్లు "బహుమాత్రము సంకటమయ్యె నిప్పు డీ
వనజ ముఖిన్ గనన్ మదన భావము నిండెను; దీనిఁ బొందితే
ననయము నాతపమ్ముఁజెడు; నాశ్రమ ధర్మము బుగ్గియౌను; స
న్మునులపహాస్యముల్ సలుప మోమెటులెత్తుదు నంచు నెంచుచున్

263. ఉ. ఐనను పుత్ర వాంఛయధి కాధిక మయ్యె; గృహస్థధర్మమెం
తైనను మేలు; తత్సుఖవిహారము ముందొక నింద యెంత; వి
జ్ఞానులు పుత్రవంతులకు స్వర్గ సుఖమ్ములు, మోక్షధామమున్
మానకఁగల్గు నందు; రనుమాన మికేటికి దీనిఁబొందెదన్

264. ఉ. పొందితిఁబో మనోరథము పూర్ణముగా నెరవేరదేమొయన్
సందియ మొందు గల్గు, ముసు జవ్వని యూర్వసి యా పురూరవున్,

డెందము మెచ్చఁ బ్రేమలు నటించి యనంత సుఖమ్ములన్ గదున్
బొందియు మోసగించి విడి పోయిన యట్టుల యామెపోవునో!

265. కం. ఇవ్విధిఁబరి పరి విధముల
నవ్వనజాక్షిని తలచుచు వ్యాకులమతుడై
యెవ్విధినైనను దీనికి
దవ్వుల నుండుటయె మేటి ధర్మంబనుచున్

266. తే.గీ. తలచి యమ్మౌని యరణిని ద్రచ్చుచుండె,
నతడు శపియించు నేమొయంచాత్మఁ దలచి
అప్సరస యును దరిఁ జేరదయ్యె భీతి
అంత శుకరూపమును దాల్చి యాఘృతాచి

267. ఉ. ముద్దులు గుల్కు పల్కులును ముచ్చటఁగొల్పెడి మేని చాయయున్
దిద్దిన యెట్ట రంగువలె తీర్చిన ముక్కును గల్గి యాశుకం
బద్దిర! యిట్టు నట్టు తిరుగాడుచు నుండగఁ జూచి మౌనికిన్
సుద్దులు దప్పె బుద్ధి; స్మరసూన శరాహతి సంచలించుచున్

268. ఉ. ఐనను ధైర్యమున్ సడలకయ్యరణిన్ మథియించుచుండెనే
గాని; శరీరభాగములు గంపము నొందుచు నుండె తీవ్రమై
మానసమున్ గలంగగ నమాంతము గుండెలుగ్రుంగ యంతటన్
మౌనికి వీర్యమున్ స్ఖలనమైయరణిన్ బడె; నైన నిల్పకన్

269. తే.గీ. అరణి మథియించుచుండె సంయమి వరేణ్యు
డంతనుదయించె నటనుండి యద్భుతముగ
మూడు మూర్తుల వ్యాసుని బోలు సుతుడు
అగ్నితేజమ్ము ముఖమున నవఘళింప

270. ఉ. అచ్చెరు వంది వ్యాసుడపు డాత్మనెతింగె వరమ్మునీశ్వరుం
డిచ్చిన సంగతిన్; తనయుడిప్పుడు గల్గుట తత్ప్రభావమే
యచ్చుగ నంచుమెచ్చి; యపుడాత్మజు గాంగ జలంబులందు, తా
నిచ్చను స్నానమారిచి మునీంద్రుడు సల్పెను జాతకర్మలన్

271. ఆ.వె. ఆకసమున నుండి యమరులు సుమవృష్టిఁ
గురియఁ జేసిరపుడు కూర్మితోడ





దేవదుందుభులును తీవ్రంబుగా మ్రోగె
అప్సరసలు నాట్యమాడిరపుడు

272. కం. ఆ తండ్రిని కొడుకును నపు
డాతుంబుర నారదాది యమర ముని వరుల్
ప్రీతిన్ స్తుతియించిరి సం
గీతములన్ పాడు కొంచు; గీష్పతి మెచ్చెన్

273. కం. దండము కమండలమ్మును
నిండగు కృష్ణాజినమ్ము నింగి వెడలి భూ
మండలమున శుకునికొఱకు
నండజములయట్లువ్రాలె నమరులు పంపన్

274. కం. శుకరూపి నప్సరన్గనఁ
బ్రకటితమై వీర్య మరణిఁ బడిన కతమునన్
సకలాగమ విదుడగు న
య్యకలంకుడు పుట్టి "శుక"వరాఖ్యన్ బొందెన్

275. కం. అనుదిన వివర్ధ మానుం
డనుపమ తేజుండు నైనయతనికి వ్యాసుం
డొనరిచి యుపనయనంబును
పనిచెన్ గీష్పతినిఁజేరి పడయన్ విద్యల్

276. చం. అతివినయాన్వితుండయి బృహస్పతి చెంతన బ్రహ్మచర్యస
ద్వ్రతమును బూని వేదముల ధర్మచయమ్ముల శాస్త్రసంగతిన్
సతతము నేర్చి యాశుకుడు; సన్మతి దక్షిణలిచ్చి యంతఁదా
నతులిత భక్తి తోడ గురునాజ్ఞను గైకొని చేరె నింటికిన్

277. చం. కొడుకును జూచి వ్యాసుడతి కూరిమితో నెదురేగి మూర్ధమున్
గడువడి మూరు కొంచు తన కౌగిటఁజేర్చి ప్రమోద బాష్పముల్
ఎడనెడఁజాలువార మది నెంచె నొకానొక మౌని కన్యకన్
దడయకఁ దెచ్చి పెండిలి ముదమ్మునఁ జేయుదు నంచు నయ్యెడన్

278. కం. అనిమది ననుకొని వ్యాసుడు
తనయునిఁగని పల్కెనిట్లు ధార్మికదృష్టిన్

వినయ వివేకాన్వితు, ముని
జన మాన్యుని భూత మయుని సద్యోగి వరున్

## శుక వ్యాస సంభాషణము

279. మ. తనరన్ సంతసమయ్యె నామదికి పుత్రా నీవు శీఘ్రంబుగా
ఘనవిద్యల్ గ్రహియించి మౌనిజన సంఘంబందు విన్నాణివై
యనయంబున్ యశమందుటన్; ఇక వివాహంబై గృహస్థాశ్రమం
బును గైకొమ్ము, సురావలిన్ పితరులన్ బూజింపు మత్యంతమున్

280. చం. ముదమున సత్సుతున్ బడసి ముద్దుల పౌత్రునిఁ జూచుభాగ్యమున్
మది కొదవంగఁజేయు; మది నాకు పితౄణ విముక్తి హేతువౌ
సదమల తేజ! ధారుణి ప్రశస్తము "పుత్రులు గల్గ సద్గతుల్
గదియునటన్న పల్కు", లటుగాన నవశ్యముఁబెండ్లియాడుమా!

281. మ. తనయా! నిన్‌బడయంగఁ జేసితిని నే దాంతుండనై సత్తపం
బును నూఱేండ్లు; శివుండు మెచ్చి నిను సత్పుత్రున్ బ్రసాదించె; నే
ధనమున్ దెచ్చెదనేమహీశుకడనో; తన్వంగియౌ కన్యకన్
గనితెత్తున్ దగఁ బెండ్లియాడి సుఖముల్ గైకొమ్ము క్రొంగ్రొత్తలన్

282. కం. ఆమాటలు వినినంతనె
యామాన్యుడు శుకుడు తండ్రి నడిగెను, మదిలో
నామాయా సంసారం
బామయ మయమంచుఁదలచి యడకువ తోడన్

283. మ. జనకా! ప్రాజ్ఞులరైన మీరలిటు సంసారంపు సౌఖ్యంబులే
ఘనమంచున్ వినిపించుటొప్పగునె? లోకంబందు భోగంబులె
ల్లను రోగమ్ముల కాలయమ్ములు గదా! లౌల్యంబులీ సౌఖ్యముల్,
జనునే వీనికినై యహర్నిశము లశ్రాంతంపు టారాటముల్

284. ఉ. నీమది కిష్టమౌనటుల నేను వివాహముఁజేసికొన్నచో,
నా మదిరాక్షికిన్ వశుడనౌదు; సుఖమ్ములఁ బొందునే ధరన్
కామవశుండు; జవ్వనుల కౌగిళులెన్నగ పూల తీవెలే?
ఓమహితాత్మ! అయ్యవి దృఢోగ్ర తరంబగు నుక్కుసంకెలల్





285. తే.గీ. దారుయంత్రమ్మునన్ ద్రెళ్లి దడియువాడు
ఇనుపసంకెలలన్ జిక్కి యేడ్చువాడు,
విడువఁబడునెప్పుడైనను; విడువఁబడడు
సంసృతిన్ జిక్కనేని సంస్కారియైన

286. మ. మలమూత్రావిల దేహ భావనరతిం బ్రాజ్ఞుల్ ప్రవర్తింతురే?
తలపన్ జాలను నే నయోనిజుడనై తద్యోని సంబంధ సం
చలితోత్తుంగ తరంగ తుల్య బహు సంసారంపు సౌఖ్యంబులన్
కలలోఁ దోచిన రీతిఁ దోచి చను జాగ్రత్‌కాలమందన్నియున్

287. కం. మరుజన్మంబొకటున్నను
వరియించెదనపుడు గూడ పావనమగుచున్
వరలెడు నయోని జత్వము
స్మరియింపను సారహీన సంసారంబున్

288. ఉ. వేదములన్ బఠించితిని విస్తృత కర్మవిధి ప్రబోధముల్;
పాదులు హింసకయ్యవియు, భౌతిక నాకసుఖానుచింతనా
వేదనలన్ నిరంతరము వెట్టులఁజేయుచు జన్మమృత్యుశో
కాదుల కాలయమ్ములయి యంతముఁజూపవు ముక్తిగమ్యమున్

289. ఉ. మద్గురు వైన గీష్పతియు మగ్నుడె సంసరణాంబుధిన్; అవి
ద్యోద్గమ చేతసుండెటుల నుద్ధరణంబొనరించునన్ను; తా
సద్గతిఁ జూపదక్షుడె నిజంబు, విడంబన మౌనుగాక; రో
గోద్గతినున్న వైద్యుడెటు లూరట నిచ్చు మరొక్క రోగికిన్

290. కం. కాననొక నమస్కారం
బేనతని కొనర్చి వచ్చి యిటుఁజేరితి, నా
మానసముననెపుడు భయం
బౌ, నదె సంసార సర్ప మనినంజనకా!

291. ఉ. అంతము లేదు దీనికి, నహర్పతి వోలె నహర్నిశంబులున్
సుంతయు శాంతి లేక మనుజుండు పరిభ్రమణంబొనర్చు న
త్యంతము పుత్ర దార ధన యౌవన పూర్ణ విశాల సంసృతిన్,
వింతగ పేడయందె కడుఁబ్రీతిగ దిర్వెడు పుర్వు కైవడిన్

292. ఉ. వేదములున్ బురాణములు వేడుక శాస్త్రములెల్ల నేర్చి వా
గ్వాదములందు గెల్చినను పండితుడౌనె? అతండెవండు దుః
ఖోదయ కారణంబగు మహోగ్ర భవాబ్ధిఁదరించి భేద మిం
దేదియు గాన కాత్మమయమేయని వర్తిల పండితుండగున్

293. తే.గీ. అవని "గృహ్ణాతియితి గృహ" మనిరి బుధులు
జనులచేపట్టి బంధించుఁ గనక గృహము
కాననది యొప్పె బంధనాగారమనగ
అందు సుఖమేది తండ్రి! నాకౌనుభయము

294. కం. శుకుడిట్లు పల్క వ్యాసుం
డకలంక మనస్కుడనియె నాత్మజుతోడన్
ప్రకటించి ధర్మ సూక్ష్మము
లొక కొన్నిటిఁదెల్పఁబూని యుజ్జ్వలమతుడై

295. ఉ. కాదు గృహంబు బంధనము కాదది కారణమున్ గుమార! యీ
మేదిని బంధనమ్ములకు మేళ్ళకుఁగీళ్ళకు వేదనాళికిన్
మోద విభూతికిన్ మనసెపో తగు కారణ; మెల్లబంధముల్
పోఁదొలగింప నయ్యదియె పో గృహమేధికి హేతు విద్ధరన్

296. ఉ. న్యాయముగా ధనార్జనము, నధ్యయనమ్మును, సత్యవాక్యమున్,
బాయనియాతిథేయములు, భాసిల వర్తిలు గేస్తుకైన శీ
ఘ్రాయిత మౌను మోక్షమనయంబును; తక్కిన యాశ్రమంబులన్
బోయెడి వారి కాశ్రయము పొల్పుగ నీగృహమేధియే యగున్

297. తే.గీ. మెట్టు మెట్టును నెక్కిన గట్టుఁజేరు
నెగిరి గంతిన నేమౌనొ యెఱిగికొమ్ము
బ్రహ్మచర్యాది యాశ్రమ పారగుండె
తగును సన్యాసి యౌటకు ధరణియందు

298. కం. తనమనసు నింద్రియములున్
మనుజుని మత్తిలగఁజేసి, మాదకములయ,
ట్లనయం బవివా హితునిన్,
కనుకట్టొనరించి మిగులఁగాసింబెట్టున్





299. సీ. గాధిరాట్ సూనుండు కఠిన తప మొనర్చి
తుదకుమేనక యొడిన్ దూలలేదె?
పడవ నడపు సత్యవతిఁగాంచి నా తండ్రి
యినతేజుడయ్యు కామించలేదె?
నిజతనయఁగని మున్నజుడు స్మరశర సం
హతి నొచ్చి సంగమం బడుగలేదె?
గురుపత్నియని యైన కొంకక చంద్రుండు
తారతోఁజేరి తైతక్కయనడె?
ఎంతవారికినైనను నింద్రియములు
ఎప్పుడో యొకప్పుడటుల యెగసిపడును
కాన ననుకూల వతియైన కన్యఁజూచి
పెండ్లియాడుము సలుపుము వేద విధులు.

300. కం. విపులంబుగ తానిట్టులఁ
కృపతో వ్యాసుండు పల్కఁగించిత్తును తా
నపకర్ముడుగాక శుకుం
దపనయదోషుండు పలికె వ్యాసునకిటులన్

301. ఉ. లక్షలు వేలు చెప్పినను లక్ష్యముమారదు నాకు తండ్రి! యీ
యక్షయ దుఃఖ సంచయ భవాంబుధిఁద్రెళ్ళను; నిత్యబంధనం
బీ క్షితి నంతకంటె మఱియెద్ది; ధనార్జనకై స్వపక్షులే
కక్షలు గట్టి హింసలకు కాళులఁద్రవ్వుదు రెంత వింతయో!

302. ఆ.వె. ధనమదేల యన్న ధనహీనుడౌగేస్తు
చిల్లి గవ్వకైన చెల్లలేడు
ధనము గల్గెనేని దాని సంరక్షణ
సేయ నెన్నిపాట్లు చెందవలెనొ

303. కం. అరయగ జన్మము దుఃఖము
జరయును రుజయులును దుఃఖ సంబంధములే
మరణంబది యొక దుఃఖము
సరి దుఃఖములేని దెచట సంసారమునన్

304. చం. అనయము వేదశాస్త్రముల నధ్యయనంబొనరించు పండితుల్
ఘనయశులయ్యు సత్సుతులఁ, గాంతలఁ బ్రోవ ధనమ్ములేమిచే
ధనికులపంచఁజేరి కడుదైన్యముతో చెయిచాపి వారలన్
అణకువ సంస్తుతింతు రనఘా! యది చావునకంటె హీనమౌ

305. కం. ధనికుల కడ ధనములకై
యనయము యాచించు కంటె యడవులలోనన్
దిన దినము పండ్లు నీళ్ళును
గొనిబ్రతుకుట మేలుగాదె కోరికలుడుగన్

306. కం. త్రివిధములగు కర్మములన్
నవయింపగఁ జేయగల సనాతన యోగం
బవధారణఁ జేసి తెలుపు
మవగత మౌనట్లు నాకు నమల చరిత్రా!

307. మ. ఇటు వైరాగ్యముతోడఁబల్కు సుతుఁదానీక్షించి వ్యాసుండు ప్ర
స్ఫుట దీనాననుడై చలించి కనులన్ పూర్ణాశ్రుధారల్ జొటల్
జొటలైపారగ మీదికార్యమెటులంచున్ చూచుచుండన్, శుకుం
డటువీక్షించె మునీశ్వరున్ జనకు దుఃఖాంభోధి నిర్మగ్ననిన్

308. మ. కనియాశ్చర్యమునంది, వేదముల విఖ్యాతిన్ విభాగించి, వి
ష్ణుని యంశోద్భవుడయ్యు, మాయకిటు వశ్యుండయ్యె నీవ్యాసుడే
యనినన్, జెప్ప తరంబె యింక ఘనమాయా శక్తి సామర్థ్యముల్,
గన నద్దాని జయింప నేరికగు శక్యంబెల్ల లోకంబులన్

309. కం. అని నిశ్చయించి శుకుడున్
మనమున నొకకొంతవడిని మాయాశక్తిన్
వినయమ్మున ధ్యానించుచు
తనతండ్రిన్ దుఃఖమగ్నుఁ దాఁ గని పలికెన్

310. శా. అయ్యా! సాత్యవతేయ! యెల్లరకు వేదాంతార్థ విజ్ఞానముల్,
నెయ్యంబొప్పగఁ జెప్పదక్షుడవు; కన్నీరిట్లు గార్చంగ, నా
కయ్యెన్ జోద్యము; నీకు నేసుతుడనే యౌదున్ నిజంబిప్డు; కా
నయ్యె పూర్వపు జన్మలందు; నికపైనౌ జన్మలందేరికో!





311. ఉ. భ్రాంతిఁదొలంగి నీహృదయ పద్మమునన్ వసియింపఁ జేయుమ
శ్రాంతము ధైర్యలక్ష్మిని; విషాదము మానసమందు వీడి నీ
వెంతయు బుద్ధి మేల్కొలుపు, మియ్యది యెల్లను మోహమంచు ని
శ్చింతగ నాత్మలోఁదెలియఁజేరవు దుఃఖము లెల్లవేళలన్

312. సీ. ఆకలి దీరంగ నన్నమ్ము వలయును
అంబువుల్ వలయు దాహమ్ముఁదీర్ప
ఘ్రాణ సౌఖ్యమునకు గంధమ్మువలయును
కామసౌఖ్యమునకు లేమవలయు
అందమ్ము వలయును నక్షులు ముదమంద
సంగీతమునగల్గు శ్రవణ సుఖము
దానగుణము గల్గ ధన్యమౌహస్తముల్
హరికీర్తనల నాల్క కొనుసుఖము
ఇన్నిసుఖములు గల్గు నిన్నింటిచేత
అన్నియును పుత్రువలననె యౌనటంచు
తలచు టదియెల్లభ్రమయౌను తాపసేంద్ర!
నన్ను నాదారిఁ జననిమ్ము కన్నతండ్రి!

313. కం. అనిశుకుడు పల్క వ్యాసుడు
గని తనయుని పల్కెనిట్లు కల్మషదూరున్
ఘనవైరాగ్యవిభూషణు
ననయము బ్రహ్మాత్మభావనాచల ధీరున్

314. మ. అరణీగర్భజ! యట్టులైన వినుమయ్యా! నీవుశ్రద్ధామతిన్
వెరపై ధర్మయుతమ్మునై దనరి దేవీదివ్య తత్త్వార్థసు
స్థిరమౌ భాగవతమ్ము వ్రాసితిని నే శ్రీమంతమైయొప్పగన్;
నిరతంబున్ పఠియింపుదాని సదసన్నిత్యార్థ సంవేద్యమున్

వ. మఱియు నీదేవీభాగవతావిర్భావంబెట్లనినన్ బూర్వమొక ప్రళయాంతమున

315. చం. ముసిముసి నవ్వులన్వెలుగు మోమున వెన్నుడు మఱ్ఱి యాకుపై
మసలుచు శైశవ స్థితిని; మానసమందుఁ దలంచె "నన్నిటుల్
పసితనమొప్పునట్లు వటపత్రమునన్ శయనింపఁజేసెనే
యసదృశ శక్తి; యేఫలము నాత్మఁదలంచియొ, యెవ్విధాననో"

316. కం. అనియిట్లనుకొను చుండగ
వినువీధిని దివ్యవాణి వినిపించెనిటుల్
"కనఁబడునదెల్ల నేనే,
వినఁబడదు సనాతనమ్ము వేరొకటెందున్"

317. మ. అనినన్ వెన్నుడు నక్కజంపడుచు నాహా యిట్టి పల్కుల్ మునున్
విననట్లున్నవి! పల్కిరెవ్వరిటులన్? విఖ్యాతిమై యొప్పెడున్
గనతానింతియొ, పూరుషుండొ, నుభయుల్ గారో, యటంచట్టులే
మననంబున్మదిఁ జేయుచుండ తనకుంబ్రత్యక్షమై ముందటన్

318. తే.గీ. శ్రీమహాలక్ష్మి శాంత సుస్మిత ముఖాబ్జ
శంఖ చక్రగదా పంకజముల నాల్గు
చేతుల ధరించి భూషణ శ్రీలు వెలుగ
చిన్నివెన్నుని కనులకుంజేసె విందు

319. సీ. రతి, భూతి, బుద్ధియు, మతి, కీర్తి, స్మృతియును
ధృతియు, శ్రద్ధయు, మేధ, గతియు, స్వధయు
స్వాహా, క్షుధా, నిద్ర, క్షమయు, దయయు, తుష్టి,
పుష్టియు, లజ్జయున్, పొసగ జృంభ
యున్, తంద్రయు ననగ నొప్పెడి శక్తులు
నాయుధములఁ దాల్చి యందమైన
భూషణమ్ముల కాంతి పుంజముల్ దనరంగ
ముత్యాల దండలు ముద్దులొల్క
అచ్చ మౌ శ్రీమహాలక్ష్మి యంశతోడ
ఆమె చుట్టును నిల్చిరి యద్భుతముగ
వారి శోభల గాంచి యవారితముగ
చిన్నికన్నయ్య యచ్చెర్వు జెందెనపుడు

320. ఉ. ఎవ్వరు వీరలందరును? నెక్కడనుండిటు వచ్చి? రేను ని
ట్లివ్వనధిన్ చరించుటకు నెద్ది కతం బొక మఱ్ఱియాకుపై?
నెవ్వరు సృష్టిఁజేసి ననునిక్కడనుంచిరి? యీమె తల్లియా!
యివ్విధి దర్శనంబిడె నదేలొకొ? యంచుఁదలంచి నెమ్మదిన్





321. ఉ. ఏమని మాటలాడగల నీయమతోనని విష్ణు మూర్తి తా
నేమియుఁ బల్కకుండె; గమనించిన దేవియు మందహాసముల్
మోమున నంకురింప నవఫుల్ల దళాయత లోచనాబ్జయై
తామరసాక్షు బాలుఁగని తానిటుఁబల్కెను మెల్లమెల్లగన్

322. ఉ. అచ్చెరు వందనేల వనజాక్ష! ప్రతి ప్రళయాంతమందు ని
ట్లచ్చుగ సాగుచుండు నివి యద్భుత మౌపరశక్తిలీల లౌ
మెచ్చుగ నిర్గుణంబును నమేయమునౌ జగదంబ యాజ్ఞలన్
నిచ్చలు నాచరింతు మిటు నీవును మేము గుణాకృతిన్, గడున్

323. చం. తెలియుము నీవు నన్ను భవదీయ యురస్థలి నెల్ల వేళలన్
నిలిచివసించు లక్ష్మినని; నీదగు సాత్వికశక్తినంచు; నా
నలువ జనించు నీ విమల నాభిసరోజము నుండి యంత; ని
శ్చలమతి రాజసంబయిన శక్తిని బొందును సత్తపంబుచే

324. చం. అలసత లేక యాతడునంతము లౌభువనాళినెల్ల ని
శ్చలమతి సృష్టిసేయ, నవి చక్కగ పోషణసేయుదీవు; నా
నలువయు కోపగించిన ఘనంబగురౌద్రముతోడ రుద్రుడున్
వెలువడు ఫాలభాగమున వీడని తామస శక్తి తోడుతన్

325. కం. ఆతడు లయమొనరించును
నాతత భువనాళినెల్ల నంతమునందున్,
ప్రీతిగ నీ వక్షమ్మున
చేతమలర నేవసింతు చేకొనుమనఘా!

326. మ. అనినన్ బల్కెను శౌరియిట్లు "మును సూక్ష్మార్థంబునన్ స్పష్టమై
వినిపించెన్ బర తత్వమున్, శివము, సంవేద్యంబు నౌశబ్దమున్
వినగానయ్యది గుహ్యమంచెఱిగి సంప్రీతిన్ స్మరింతున్ మదిన్
వనజాక్షీ! యెవరట్లు పల్కిరొ కడున్ భావించి చెప్పంగదే!"

327. కం. అనిహరి ప్రశ్నింపగ తా
ననియె మహాలక్ష్మి మంద హాస వదనయై
విను, మాదిపరాశక్తియె
వినిపించెను నీకు గుహ్యవేదార్థంబున్

328. శా. దేవీభాగవతార్థ మయ్యదియె తాఁదెల్పెన్ మహాదేవి; తత్
భావంబేయగు బ్రహ్మవిద్యయు, మహా వాక్యంబు, సూక్ష్మంబునున్,
దావిన్పించెను సర్వలోక హిత సంధానార్థమైనీకు; నీ
వావాక్యంబుల నిత్యమున్జపము సేయన్ లోకకల్యాణమౌ

329. తే.గీ. అట్టు లామహాలక్ష్మి తాననగ, విష్ణు
డాత్మ జపియించుచుండె నయ్యక్షరముల
కాలమటు కొంత సనగ నక్కమల నేత్రు
నాభికమలంబునందుండి నలువపుట్టె

330. కం. మధుకైటభుల భయంబున
విధియును కంపించి విష్ణు వేడగ నతడున్
వధియించి వారి నిరువుర
వ్యధలు దొలగ తిరిగి జపము నారంభించెన్

331. తే.గీ. బ్రహ్మయది గాంచి సందేహపడుచు ననియె
అయ్య నీకంటె లేరెవ్వరధికులనుచు
మదిఁదలంతును, మఱినీవు మనసునందు
జపముసేయుచునుందువే స్వామిఁగూర్చి?
తీర్చుమోత్రండిఁ నాదు సందేహమిదియె

332. కం. అనియడుగ; ముగురుమూర్తుల
కనయము నవ్వలది యౌచు నారాధ్యంబై
తనరెడు నిర్గుణతత్వము
ననవరతము నేజపింతు నాజగదంబన్

333. తే.గీ. ఆమె శ్లోకార్థమున జెప్పె నద్భుతముగ
నదిమహావాక్యమంచు నేమదిఁ దలంతు
నీవు నద్దానిఁజపియించు నిష్ఠతోడ
పరగు నదియె దేవీ భాగవతము పేర
ద్వాపరమ్మున నది గ్రంథరూపమునను
విపుల మౌనంచు బ్రహ్మతో విష్ణువనియె
అజుడదియుఁజెప్పెసురముని, కతడు నాకుఁ





తెలుప వ్రాసితి నేనతి దివ్యమైన
గ్రంథమైయొప్పు ద్వాదశ స్కంధములుగ

334. ఉ. కావున పుత్రకా! పరమగమ్యము, ధర్మము, తత్వశాస్త్రమున్
పావనమున్ శుభావహము భాగవతమ్మిది దీని నెప్పుడున్
నీవును సూతుడున్ గలిసి నెయ్యమునన్ బఠియింపుమంచు స
ద్భావముతో సుపుత్రునకు వ్యాసమునీంద్రుడొసంగెఁదత్కృతిన్

335. ఉ. అంతటనేను, నాశుకమహర్షియు, వ్యాసుడొసంగినట్టియ
త్యంత పవిత్ర సత్కృతి ననారతమున్ బఠియించి నార, మం,
చెంతయు సంతసంబున వచించెను సూతుడు శౌనకాది ధీ
మంతులకెల్ల పుల్కలతి మాత్ర మెసంగగ వారి మేనులన్

336. మ. అరవిందామృత నిర్ఝరుల్ గురియ నాఖ్యానించు నాసూతునిన్
వరమౌనీంద్రులు శౌనకాదులు కడున్ బ్రార్థించి రీరీతిగన్
"పరమర్షీ! దయతోడ నిక్కథలు సెప్పంగావలెన్ పెక్కులున్
కరమున్ దృప్తినొసంగవయ్య వినగా కౌతూహలంబయ్యెడున్

337. కం. అనివారలడుగ సూతుడు
వినిపించెను మీది కథను వివరముగనిటుల్
మునివరుల కెల్ల దేహము
లనయము పులకింప, వెడల హర్షాశ్రువులున్

338. చం. మునివరులార! భాగవతమున్ బఠియించియు నా శుకుండు తా
మనమున శాంతిఁబొందదు; క్రమంబున భావవిహీనమౌవిలో
కనముల నెల్ల దిక్కులను గాంచుచు భోజన విశ్రమాదులం
దనయము వాంఛలన్ విడె, జనాంతిక వాస విరక్తచిత్తుడై

339. ఉ. వీడని బెంగతో నిటుల వెఱ్ఱియుఁ బోలెఁ జరించు నాశుకున్
జూడగఁ దండ్రి యెంతయును శోకిలి చెంతకుఁ జేరి పుత్రకా!
పాడియెయిట్టులుండ మదిఁబాయని వేదనఁగూడి; నేను ము
న్నాడిన మాటలన్ దనివి నందనిచో వినుమొక్కమార్గమున్

340. కం. చనుమయ్య! మిథిల కచ్చట
జనకమహారాజు గలడు సద్యోగివరుం

దనఘుడు జీవన్ముక్తుం
దనిశము బ్రహ్మాత్మభావనారూఢుడిలన్

341. ఉ. ఆతడు నీదు సందియములన్నియుఁ దీర్చ సమర్థుడంచుఁ బ్రే
మాతి శయంబునన్ బలుకు వ్యాసునిఁ జూచి శుకుండు తండ్రి! నీ
వాతనిఁ బ్రస్తు తించినదియంతయు సత్యముగాదటంచు నా
చేతము సంశయంపడెదు; చెల్లునెయాతనిపట్ల నిన్నియున్?

342. శా. సంసారాంబుధిలో మునింగె; ధరణీ సామ్రాజ్య సౌఖ్యంబు లా
శంసించెన్ప్రభువై;యతం డిటుల నిస్సంగుండనన్ జెల్లునే,
శంసింపందగు నట్టులైన సరసిన్ జన్మించి నీరమ్ముతో
సంసక్తంబొకయింతలేని వికచాబ్జంబట్లతండుండినన్

343. ఉ. ఆతడు రాజ్యపాలుడయి యందర నెట్టుల నొక్కదృష్టితో
భాతిగఁ జూడగల్గె; సుఖబంధములెట్టులవీడె; నింద్రియ
ద్యోతక తీవ్రవేగమెటుద్రుంచె; విరుద్ధ వివాద భావసం
జాతుల పాలితప్రజల సాధ్యమె చూడ సమత్వబుద్ధితో

344. ఉ. ఆతనిఁ జూడగా మదికి నౌను కుతూహల; మేను నెప్పుడున్
జేతమునన్ దలంచెదఁ బ్రసిద్ధిగ ముక్తుని లక్షణంబు లే
రీతియొ చూతమంచుమది; బ్రీతి యొకింతయులేక సంసృతిన్
ఖ్యాతిఁజరించునట్టె! యత;డౌనె సుసాధ్యము చూచి వచ్చెదన్

## శుకమహర్షి మిథిలకేగుట

345. కం. అనిపలికి శుకుడు తండ్రికి
వినయమున నమస్కరించి వేడె మిథిలకున్
జన ననుమతి నిమ్మంచున్
గనివచ్చెదఁజనకు ముక్తకల్మషు ననుచున్

346. కం. తనపాదంబులపైబడి
యనుమతి నిమ్మంచువేడు నాత్మజుఁబ్రీతిన్
గనుగొనుచు నెత్తి వ్యాసుం
డినతేజుడు కౌఁగిలించి యిట్లనిపలికెన్





347. మ. తనయా! నీకు శుభంబులయ్యెడును; మోదంబందితిన్ పోయిర
మ్మనుచున్ బల్కి; మరొక్కమాట వినుమయ్యా! నీదు సందేహముల్
జనకోర్వీపతి చెంతఁ దీర్చుకొని నిస్సందేహచిత్తుండవై
మన యీ యాశ్రమ భూమికిన్ దిరిగి రమ్మా! నీకు దీర్ఘాయువౌ!

348. కం. నాపంచ ప్రాణంబులు
నీపైననె నిల్పి యిచట నిలిచితినయ్యా!
ప్రాపై యుండుము నాకెపు
డోపుత్రా! నీవులేక యుండనునేనున్

349. కం. కావున నీ విచ్చోటికి
రావలయును; తిరిగి వచ్చి ప్రత్యహముకడున్
గావింపుము స్వాధ్యాయం
బేవంకకు! జనకుమయ్య యిద్ధచరిత్రా!

350. చం. జనకుని యాజ్ఞనిట్లుఁ గొని సాగె శుకుండు ధనుర్విముక్త బా
ణనిభుడనంగవేగమున, నవ్యములై కనిపించు దేశముల్,
వనముల, నాశ్రమంబులను, వాహినులన్, గడుపుణ్యభూములన్,
గనుచును మేరువున్, హిమనగంబును దాటుచు నచ్చటచ్చటన్

351. కం. తపసుల యోగివరేణ్యుల
విపులములౌ ధర్మశాస్త్ర విదులన్ గనుచున్
తపసి నడచి మూడేండ్లకు
నృపు జనకుని రాజ్యమునకు నెయ్యమునఁజనెన్

352. మ. ధనసంపన్నులు, సత్యసంధులును నిత్యంబున్ సదాచారులౌ
జనులన్ గాంచుచు నా విదేహ నగరిన్ సంచారముల్ సల్పు న
మ్ముని మాన్యున్గని ద్వారపాలుడతనింబోనీక రోధించుచున్
జనరాదిచ్చటి కీవెవండ? వెది దేశంబంచుఁబ్రశ్నించినన్

353. తే.గీ. అట్లు ప్రశ్నింప నిశ్చేష్టుడౌచు శుకుడు
నిలిచి వికటాట్టహాసమ్ము సలుపు చుండె
ఉలుకు పలుకును లేకయ ట్లూరకుండ
ద్వారపాలున కదియు నర్థమ్ముగాక

354. శా. ఓయీ విప్రుడ! మాటలాడవిటులయ్యో! మూగవా తెల్పుమా!
నీయీవాలకమున్ గనంగ మదికిన్వేదాంత విజ్ఞానమే
ధ్యేయంబై చరియించు బ్రాహ్మణుడనన్ దీపింతు, వీరాజ్యమం
దేయర్థంబుఁదలంచి వచ్చితివి? పేరేమీ? యెఱింగింపవే

355. మ. అని దౌవారికుడట్లు పల్క శుకుడయ్యా! నాకు నీమాటలన్
బనులెల్లన్ నెరవేరె, నేనిటకు మీపట్నంబు, మీరాజునున్,
గనగా వచ్చితి; వ్యర్థమయ్యెఁ గద నాకష్టంబు; లిచ్చోటికిన్
జనరాదంచిటు నీవుఁబల్కఁ; గడుమోసంబయ్యెనింకేటికిన్

356. మ. ధనమందాశగలట్టి వారు నృపులన్ దర్శింపగా నెప్పుడున్
వినయంబొప్పగ వచ్చుచుందురటు; నేవేడన్ ధనంబేమియున్
అనయంబున్ మదినాశలేని మనుజుండత్యంత సంతోషియౌ
ననియున్ దల్పక, పూర్వకర్మ ఫలమిట్టై వచ్చితిచ్చోటికిన్

357. ఆ.వె. మిథిల మిథిల యంచు మిన్నంట నెగురుచు
వచ్చి తయ్య! తండ్రి పంపనిటకు
ఒక్క తీర్థమేది? యొనర వేదంబేది?
రాజు ముక్తుడన్న రవమెగాని

358. మ. తనలో తానిటు లాశుకుండనుకొనన్ దౌవారికుండంత నా
తని మాటల్విని యీతడెవ్వరొ మహాత్మజ్ఞాని యౌభూసురుం
డనుచున్ నమ్మి కరంబులన్ మొగిచి యయ్యా! నాదు దోషంబులన్
మనమందెంచక లోని కేగుము క్షమింపన్ వేడెదన్ సత్కృపన్

359. ఆ.వె. ముక్త సంగులైన మునుల కెల్లెడలను
క్షమముగాదె బలము విమల చరిత!
ఇచ్చవచ్చి నట్టు లెచ్చోటికైనను
వెళ్ళుమనఘ! యనుచు విన్నవింప

360. శా. ఆమాటల్ విని యాశుకుండతనితో నయ్యా! నినున్ దప్పటం
చేమందున్ బ్రభు నాజ్ఞసేయుటదిగాదే యుక్తమెవ్వారికేన్
భూమీశుండును దోషియంచు పలుకన్బోనెప్పుడున్, వచ్చువా
రే మాయావులొ, చోరులో, యెఱిగివర్తింపన్ దగున్ నిత్యమున్





361. కం. అననా దౌవారికుడా
మునివర్యునిఁజూచి వినయ ముకుళితకరుడై
యనఘా! విజ్ఞానాంబుధి
వని నినునెఱిగితి, దయగను మజ్ఞుడనన్నున్

362. చం. అరయ సుఖంబు, దుఃఖము, శుభాశుభముల్, రిపు లాప్తు లాదిగా
తిరమయి యున్న శబ్దములఁదెల్పుము భావము లర్థముల్, మదిం
దొరలుచు సందియమ్ములివి నొంచెడు వీడక యెల్లవేళలన్,
పరమ దయార్ద్రచిత్తమున, ప్రాకృతుడన్ నను నుద్ధరింపుమా!

363. చం. అనియడుగన్ దయార్ద్ర హృదయంబున నాశుకుడిట్లనెన్, ధరన్
మనుజులు రెండు రీతు లణుమాత్రము రాగములేని వారలున్
అనయము రాగబద్ధులన, నందు విరాగులు ముప్విధంబులై
విననగు వారి వారి నిజవృత్తి విభేదములెంచి చూడగన్

364. చం. స్థిరములు నస్థిరంబులని చిత్తమునన్ సకలం బెఱింగి త
త్పరముఁగనన్ విరాగులయి భాసిలు వారొక కొందఱైన, నే
మరయని యజ్ఞులున్ భువిని నైరి విరాగులుకొంద; ఱింక న
స్థిరమతులై విరాగులనఁజెల్లిరి కొందఱు డోలికల్బలెన్

365. ఆ.వె. రాగులిలను రెండు రకములై యుందురు
చతురులంచు మూర్ఖజనులటంచు
చతురతయును బుద్ధి జన్యం బటంచును
శాస్త్ర జన్యమనుచు సాగుచుండు

366.ద్విపద. అనియిట్లు లేమేమొ వినిపించు శుకునిఁ
గనుచుఁ బ్రతీహారి యనియె తానిట్లు
ఘనతాపసేంద్రఁ నీ వనిన పల్కులకు
మనమున నర్థంబుఁగనలేక యుంటి
వినిపింపు మింకను విశదమౌరీతి
నని వేడ నాశుకుండనియె తానిట్లు

367. కం. సంసార సాగరంబున
సంసక్తుండగుచు నెవడు చరియించునొ వి

ధ్వాంసుండైనను వానికి
నంసస్థములౌను సుఖము లతి దుఃఖమ్ముల్

368. చం. సతియును పుత్రులెల్లరుఁ బ్రశంసల ముంచెద రాఢ్యుడైనచో
నతిసుఖసంగమం బదియెయౌను; మఱొక్కట సర్వసంపదల్
గతిసెడి యార్జనల్ దఱుగ కాసునకున్ సరిగాదు; పుత్రులున్
సతియును లెక్కసేయ, రది చావునుమించిన దుఃఖమౌగదా!

369. కం. సుఖమున శాంతినిఁ బొందును
సుఖహీను దశాంతిఁ బొందుఁ సుమ్మీ, యెవడా
సుఖమునకు సహకరించునొ
సఖుడతడగు లేకయున్న శత్రుండునగున్

370. ఆ.వె. చతురుడైన రాగి సంసార సుఖముకై
మోహమందడెపుడు; మూర్ఖుడైన
రాగి మోహ మంది భోగమ్ములనుఁ బొంద
నాశఁ జెంది చెంది యటమటించు

371. శా. ఏకాంతస్థిత సౌఖ్య సంయుతులునై యెల్లప్పు డాత్మాను చిం
తాకౌతూహలులై విరాగులటు వేదాంతార్థ చర్చారతిన్
సాకల్యంపు సుఖంబులందెద; రికన్ సంసారముల్ చింతలౌ
నా కామాదులె శత్రువుల్, తమకు నిత్యానందముల్ మిత్రులౌ

372. మ. అనియిట్లాడెడి యాశుకున్ బరమ దివ్యజ్ఞానిగా నెంచి యా
తని నంతఃపుర కక్ష్యలో నునిచె నాదౌవారికుం; దంత నా
ముని వర్యుండతి సుందరంబగు పురంబున్ వింతగాఁ జూచుచున్
జనియెన్ మెల్లగ రాజమందిరము నాశ్వాసమ్మునుంబొందుచున్

373. ఉ. అంతట మంత్రివర్యులొక రచ్చటకున్ జనుదెంచి సాదరం
బెంతయు నొప్ప నంజలి ఘటించి శుకున్ వెనువెంటఁ గొంచు నా
పొంతనె సుందరం బయిన పుష్పవనాంతర మందిరమ్మునన్
సంతసమందునట్లతిథి సత్క్రియలన్ దగఁజేసి నిల్పుచున్

374. ఉ. కామ కళాప్రవీణలగు కాంతలఁగొందఱ నృత్త వాద్య గా
నామృత ధారలన్ దనివి నందగఁ జేయుడు మీరలీశుకున్;





ప్రేమఁ దలిర్ప బోజ్యముల వేడుకతోనిడుడంచు నిల్పి, తా
నాముని యొద్ద నాజ్ఞఁగొని యచ్చటు వీడి యమాత్యుడేగినన్

375. కం. ఆ వారాంగనలంతట
భావంబుల భక్తి నింపి పరిచర్యలతో
నా వైయాసిని శ్రద్ధగ
సేవించిరి నృత్యగీత శిష్టాన్నములన్

376. చం. యువకుని సుందరాంగు మృదులోక్తుల ముద్దులు గుల్కు నాతనిన్
బ్రవిమల తాపసిన్ గన మనంబుల మన్మథ శాతపుష్ప బా
ణ విసరముల్ దృఢంబులయి నాటగ, రాగవిమోహితాత్మలై
దవిలిరిగాని వారవనితల్; శుకుడేమి చలింప డింతయున్

377. ఉ. కొందఱు వార కాంతలటు కూరిమిమీఱ జితేంద్రియాత్ముడీ
సుందరు డంచు భక్తిపరి శుద్ధలునై పరిచర్యలన్ సదా
నందమునన్ జరింప; యెలనాగలు కొందఱు కామ చేష్టలన్
జెంది వికారులై శుకుని చెంగట లాస్యము లాడి రెంతయున్

378. కం. సంతోషింపడు; విసువున
సంతాపముఁ జెందఁ బోడు; సమమౌదృష్టిన్
కాంతలఁ దల్లుల వలెఁదా
స్వాంతమ్మున నెంచె శుకుడు స్వాత్మ రతుండై

379. కం. రవి యస్తమించు వేళకు
ప్రవిమలుడై శుకుడు సంధ్య వారిచి యొకకొం
తవడికి ధ్యానం బొనరిచి
పవళించెన్ బ్రహ్మఘటిక పర్యంతంబున్

380. కం. వేకువ నాల్గవ జామున
ప్రాకటమౌవేళలేచి వారిచి ధ్యానం
బేకాంతంబుగఁ జేయుచు
చీకాకులు లేకయుండె చిత్తమునందున్

381. మ. ఒనరన్ మంత్రి పురోహితుల్ గొలువ నాయుర్వీశుడావ్యాస స
న్ముని పుత్రున్ దరిసింపవచ్చి; భవనంబున్ జొచ్చి; యాతిథ్యముల్

వినయంబొప్ప నొనర్చి; ధేనువును సంప్రీతిన్ సవత్సంబుగా
నొనరించెన్ దగ దాన మాశుకున కత్యుత్సాహ సంసక్తుడై

382. మ. కుశలంబేగద వ్యాస మౌనికిని మీకున్ దాపసేంద్రా! యహ
ర్నిశముల్ రాగ విరక్తులైన తమరీరీతిన్ ననున్ జూడ నీ
దిశకున్ వచ్చుటఁ జేసి నామనముఁ జెందెన్ సంతసంబెంతయున్
వశముల్ గావె సమస్తముల్ దమకు; నేవైనంబు మీరాకకున్

## శుకజనక సంవాదము

383. మ. అని యుర్వీపతి పల్కినంత శుకుడయ్యా! రాజ చంద్రా! ననున్
ముని వంద్యుండగు మద్గురుండు “వనితన్ బూర్ణేందు బింబాననన్
గుణసంపన్నను బెండ్లియాడి సుఖముల్ గొమ్మంచుఁ” బల్కంగ నే
నను మోదింపక పోతి బంధన మదే యంచాత్మలోనెంచుచున్

384. కం. అది బంధన మనినేనును,
అది కాదని తండ్రి, యిట్టులనుకొను చుండన్
మదిలో మీప్రస్తావన
మెదలగ నిటకంపెనన్ను మిథిలాధీశా!

385. చం. జనకుడు రాజ్యపాలనముఁ జక్కగ చేయుచు రాజ్యసౌఖ్యబం
ధనములఁ జిక్కడింతయు, నతండనబోలును ముక్తుడిద్దరన్
వినయముఁ దోప నీవటకు వెళ్ళుము; సందియముల్ దొలంగజే
యు నతడటంచు తండ్రియన నోరిమితో నిటునేను వచ్చితిన్

386. కం. కావున నా సందియముల
నీవే తీర్పంగ వలయు నిర్మల చరితా!
భావింతు ముక్తిఁ బొందగ,
నేవిధమున నదియు సాధ్యమెఱిగింపునృపా!

387. చం. అతులిత దీక్షతో వనములందుఁ దపమ్ములు, వేదపాఠముల్
వ్రతములు యజ్ఞయాగములు పావన తీర్థములందు గ్రుంకులున్
సతతము ముక్తి నీయగల సాధన లివ్వియొ? లేక జ్ఞానమో?
మతిఁదల పోసి తెల్పుమొక మార్గము నాకు విదేహభూపతీ!





388. కం. అనియడుగ శుకున కిట్లనె
జనక మహీపాలు డమిత సంతోషమునన్
విను ముక్తిని గోరెదు నా
మనుజుని కర్తవ్య మెల్ల మనవి యొనర్తున్

389. ఉ. వేదము లభ్యసింపవలె విప్రుడు తానుపవీతుడై గురున్
వేదవిదున్ భజించి; విరివిన్ గురుదక్షిణ నిచ్చి యింటికిన్
మోదముతోడవచ్చి యొక ముగ్ధను సద్గుణ మాన్యఁ బెండ్లియై
వేద విధుల్ నిరంతరము వీడక యుండ వలెన్ గృహస్థుడై

390. కం. అతిథుల నభ్యాగతులన్
సతతము పూజింపవలయు; సరసాన్నములన్
వితతముగఁదృప్తు లౌనటు
చతుర మతిన్ సలుపవలయు సంతర్పణలన్

391. సీ. అగ్ని కార్యమ్ముల నాటంకములు లేక
యాచరింపవలయు ననుదినమ్ము
సత్యవాఙ్నియమమ్ము నిత్యమ్ము సలుపుచు
వాక్శుద్ధిఁబొందంగ వలయునెపుడు
బాహ్య శౌచమ్ము నభ్యంతర శుచియును
గలిగి వర్తింపంగ వలయు నిరత,
మాశ యెక్కుడు లేక యన్యుల నొప్పింప
కనయమ్ము శాంతుడై యలర వలయు

గీ. సుతుల పౌత్రుల గుణశీల యుతులఁ బడసి
పిదప వనమునకేగి తాసుదతిఁగూడి
తపమొనర్పగ వలయును దాంతుడౌచు;
నంత భార్యను కొడుకున కప్పగించి

392. ఉ. శాంతము తో భువిన్ సకల సంపదలందు విరక్తచిత్తుడై
చింత యొకింతయేనియును చిత్తమునందలపోయ కాత్మయం
దెంతయు సన్యసించిన యహీన విరాగి యె మోక్ష మార్గమున్
స్వాంతమునందలంపఁ గడు నర్హుడగున్ శుక యోగిసత్తమా!

393. కం. నలువది యెనిమిది సంఖ్యం
బలికెను సంస్కారములను మనుజులకిలపై
తొలిపలు, కందు గృహస్థుకు
నలువది చెప్పంగఁ బడియె నయమున మౌనీ!

394. తే.గీ. శమ దమాదు లెనిమిది సంస్కారములను
పలికె వేదమ్ము సన్యాస వరుల కొఱకు
ఆశ్రమము నుండి మఱియొక యాశ్రమమును
స్వీకరింపంగ వలెనని శిష్టు లనిరి

395. చం. అని జనకుండు పల్క శుకు డాతనిఁ జూచి నరేంద్ర చంద్రమా!
ఘనమగు జ్ఞాన సంపద వికాసము చెంది తురీయ భావమం
దనయము సుస్థిరుండయిన యట్టి విరాగికి నేల యింకయా
మునుఁగల యాశ్రమంబులవిమూడుఁ గ్రమంబున స్వీకరింపగన్

396. చం. అనినన్ దా జనకుండు పల్కె మునివర్యా! యింద్రియానీకముల్
మనయాజ్ఞన్ వినవేరవయ్యా! బల సంపన్నమ్ములై నిత్యమున్
ఘన మాయన్ మునుగంగఁ జేయు; పరిపక్వస్థాయి లేనట్టి, యా
మనుజున్ బట్టి వికారముల్ సలుపుచుం బాధించి యాడించుబో

397. కం. భోజన శయన సుఖేచ్ఛలు
భ్రాజిత పుత్రేచ్ఛయనగ బహు విధగతులన్
యోజించుచుండ యతులకు
నోజన్ చిర శాంతి యెట్టు లొనఁగూడునికన్

398. చం. క్రమమున నింద్రియాదుల వికారములెల్ల నడంప బూనుటే
సముచితమైన మార్గమది సంయమి వర్య! యదెట్టులన్న వృ
క్షము పయి కొక్కట న్నెగుర సాధ్యమె? యట్లొనరింప కూలదే?
సమముగ క్రింది నుండి తరు శాఖను జేరుట భద్రమౌగదా!

399. ఆ.వె. సన్యసించి మరల సంసారమున మున్గి
భ్రష్టు డైనయోగి పరమగతిని
బొంద సాధ్యమౌనె - పూర్వాశ్రమములందు
వాసనల నడంచి వరల కున్న





400. శా. సంసారంబున నుండియున్ సుమతియై శాంతుండు దాంతుండునై
హింసా మార్గము వీడి ద్వంద్వముల యందెల్లన్ సమత్వంబునన్
హంసజ్ఞానయుతంబుగా వెలుగు కర్మాచారు డౌగేస్తుడున్
సంసారాబ్ధిఁ దరించి తాఁబడయు శశ్వన్మోక్షసామ్రాజ్యమున్

401. శా. ఓవిప్రోత్తమ! రాజ్యభోగములతో నొప్పారునన్ జూడు మా!
భావంబందతి సంగమంబు విడి సద్వ్యాసంగచింతారతిన్
జీవింతున్ సతతమ్ము కర్మవశమై సిద్ధించులాభమ్ముతో;
జీవన్ముక్తుడనై మెలంగెదను వాసిన్ నిత్యసంతోషినై

402. మ. అతిగుహ్యంబగు దానిఁజెప్పెదను నీవత్యంత శ్రద్ధా గతిన్
యతివర్యా! వినుమీ జగంబులను ప్రత్యక్షంబు నౌదానినే
చతురత్వంబునఁబట్ట సాధ్య; మిక నేచందాన బట్టంగనౌ
నతి సూక్ష్మంబును నిర్గుణంబునగు నయ్యాత్మన్ నిరాకారమున్

403. చం. మనుజుడు భ్రాంతియుక్తుడయి మాటికి మాటికి పుణ్యతీర్థముల్
సనిచని స్నానమాడుటలు సర్వము వ్యర్థములౌను మానసం
బున మలినంబునంతయును పూర్ణముగాఁ దొలగింపకున్న; కా
యను గల చేదుదీయక ప్రయస్తమునౌ ననుపానముంబలెన్

404. కం. తన బంధమునకు ముక్తికి
మనసే గద కారణమ్ము మనుజునకెపుడున్
గన నింద్రియ జీవాత్మలు
తనువును కారణములనుటఁ దగదు మహాత్మా!

405. కం. పరిశుద్ధాత్మకు బంధన
మరయంగాలేదు, నిత్యమదిముక్తంబే,
సరియై మనసున శాంతం,
బిరవుగనెలకొనినఁదొలగు నిల బంధనముల్

406. కం. జీవాత్మయు పరమాత్మయు
భావింపగనొక్కటయ్యా! బ్రహ్మంబదియే;
యీవిధము తెలియకాత్మన్
భావింతురవిద్య వలన పలురీతులుగన్

407. చం. వెరవున విద్యయున్ మరి యవిద్యయు బుద్ధి నెఱింగి, విద్యతో
నరసియవిద్యఁ ద్రోలి పరమాత్మ నెఱుంగుదు రెల్ల విజ్ఞులున్;
బరగ నవిద్యలేక యెటు బ్రహ్మసుఖం బనుభూతియౌను; సు
స్థిర మగుఛాయఁబ్రీతి నెటు చెందును నాతప బాధలేనిచో

408. తే.గీ. ఇంద్రియార్థములందెప్పు డింద్రియములు
గుణములవియెల్ల గుణములఁగూడిసతము
వర్తిలుచునుండు దోషమావంతయైన
నాత్మకరయంగలేదందు రార్యులెపుడు

409. చం. అతులిత ధర్మ సూక్ష్మముల నాగమముల్ నిగమాదులెల్ల వి
స్తృతముగఁదెల్పె; మానవులు చేకొని తన్నియమాను సారులై
సతతము సంచరించుటయె సమ్మత; మయ్యది ధర్మరక్షణ
క్రతువననొప్పు లేనియెడ గాసిలుధర్మము, సంకరమ్మౌనొ

410. కం. అనిజనకు డిట్లు చెప్పగ
వినుచుండిన శుకుడు వేద విధ్యుక్తములన్
మనమున మెచ్చక సందియ
మును వెలిబుచ్చెను విదేహ భూపతికిటులన్

411. ఉ. వేదనియుక్త ధర్మముల వింటిని సొంతముగాగ; హింసకున్
పాదులు కొన్ని; తత్క్రియలు పాయక ముక్తిని గూర్పనేర్చునే;
మాదకమైన మద్యమును మాంసములున్ గల కర్మలెన్నియో
వేదములన్ వినంబడును వీడని హింసకు తావలంబులై

412. మ. శశబిందుండను రాజు యజ్ఞముల విస్తారంబుగాఁ జేసి మున్
బశుసందోహములన్ వధింప నటు పైనన్ వాని చర్మంబులున్
భృశమై వింధ్యనగాకృతిన్ బొలిచెఁబృథ్విన్ రక్తమున్ మేదయున్
విశదంబై ప్రవహించె నొక్కనదియై బీభత్సమున్గొల్పుచున్

413. తే.గీ. అదియు చర్మణ్వతియనంగ నవనియందు
పిలువఁబడెనంచు పూర్వము వినగలేదె
హింసకున్ దావలంబైన యిట్టిక్రతువు
లాచరించియు స్వర్గమ్ము నతడుఁ బొందె
నతని కీర్తియు నిలిచె శాశ్వతముగాగ.





414. ఉ. కావున నిట్టిహింసలకు కారణమౌ మన వేదధర్మముల్
గావవి నాకునిష్టములు; కామితముల్ నెఱవేఱ సౌఖ్యముల్
వావిరిఁబొందు; లేనియెడ వంతలఁగుందు గృహస్థు;డట్టిచో
జీవుడు ముక్తిఁబొందు ననఁజెల్లునె ద్వంద్వములన్ మునింగియున్

415. కం. ఇదియున్ సందేహము నా
మదిలో మిగిలినది జనక మనుజాధీశా!
ముదమునఁదీర్పుము దీనిని
సదయుడవై నాకు మిగుల సంతసమొదవన్

416. చం. అనవుడు నా విదేహపతి యాశుకునింగని యిట్లు పల్కె నో
మునివర! యజ్ఞకార్యములఁబొల్చెడి హింస యహింసయౌను, తా
ననయము రాగమున్ మఱియహంకరణంబును వీడిసల్పుటన్;
మనమున రాగబద్ధుడయి మానకసల్పెడి హింస హింసయౌ;

417. కం. మమకార మహంకారము
తమ మనములవీడి ముక్తి ధామము చేరన్
గమకించు వారి కృతములు
క్రమమున నవియెల్ల నకృత కార్యములెయగున్

418. తరల జనక భూవిభుడిట్లు పల్కగ సంతసంబునఁదాశుకుం
డనియె భూపతిఁజూచి యిట్టుల నయ్యరో! మనుజుండిలన్
మొనసి మాయకుఁ జిక్కియెట్టుల ముక్తిఁబొందు విరాగియై
మనసు నందలి మోహమెట్టుల మాయమౌనెఱిగింపవే

419. చం. నిరతము శాస్త్ర చర్చల ననిత్యము నిత్యమెఱింగి పల్మరుల్
స్థిరముగఁబల్కినంత తగ సిద్ధిని బొందునె యాచరింపకే
నరుడిల? దీపశబ్దమును నాల్కను బల్కిన మాటి మాటికిన్
సరగునఁజీకటుల్ సనునె చక్కగఁదావెలిగింపకుండినన్

420. మ. పరనిందాపరిహాసముల్, నిరతమున్ బాపంపు దుష్కృత్యముల్,
పరవిత్తాపహరంబుఁగూడదనుచున్ బల్కుంగదా శాస్త్రముల్;
తరమౌనే గృహమేధికైననవి నిత్యంబున్ దొలంగింప నో
నరవర్యా! యవనీశులైన తమకెన్నన్‌సాధ్యమెట్లొ నికన్?

421. మ. సుమమాలన్ విషసర్పమున్ గనకమున్ స్థూలోచ్చయంబున్ సమా
నముగన్ జూచుచుc బ్రాణి కోటికి ననూనంబౌ హితంబెప్పుడున్
సమదృష్టిన్ సలుపంగcజాలు నతడే సత్పాత్రుడౌముక్తికిన్
సమదృష్టిన్దగ రాజ్యమేలుటది దుస్సాధ్యంబగున్ ఱేనికిన్

422. కం. చోరుల జారుల సాధుల
సారసమతులైన మంత్రిసత్తములను, సే
వారతినుండెడి బంటుల
నారయ సమదృష్టిcజూడ నౌనే నీకున్

423. కం. నరవర! మూర్ఖుని విద్యా
ధరుడన; యంధుని రవియన, ధరణి దరిద్రున్
స్థిరముగ లక్ష్మీధరుడన,
నరయగ నిన్నున్ విదేహుడన నొకటియగున్

424. చం. 'నిమి'యను చక్రవర్తి ధరణిన్ భవదీయ వరాన్వయంబునన్
బ్రముఖుడు, రాజ్యమేలుచు నవశ్యము యజ్ఞముసేయcబూని, తా
విమల తపోధనున్ సకలవేది వసిష్ఠునివేడెc దద్విధిన్
గ్రమమున నిర్వహింపు మనుకంప నటంచు వినమ్ర శీర్షుడై

425. చం. అనిన మహర్షియిట్టులనె "నయ్యమరాధిపుడొక్క యజ్ఞమున్
గొనకొనిసేయ నెంచె, నటకున్ జని కార్యము నిర్వహించి, నే
జననుత! వత్తు శీఘ్రముగ, సన్మతి నీవిట వస్తు సంచయం
బును సమకూర్చుకొ",మ్మనుచుcబోయె దివస్పతిచెంతకంతటన్

426. చం. నిమియు మహర్షిమాట విననేరక వేరొక యాజకోత్తమున్
విమల తపస్విcగైకొని యవిఘ్నముగా జరిపించెయజ్ఞ; మం
త ముని వసిష్ఠు డచ్చటకు తా నరుదెంచి శపించె "నీ శరీ
రము పతనంబుcజెందు"నని ప్రబ్బిన కోపమునన్ ధరాధిపున్

427. చం. నిమియును తాశపించె గురునిన్ "భవదీయ శరీరమట్టులే
సమయును పొమ్మ"టంచు; నిటు సైపక వారు పరస్పరమ్ము శా
పములను బొంది రంత తమ వంశము వారు విదేహులంచు నా
మములధరించి రంతియె క్రమంబున; కారు విదేహులచ్చమున్





428. తే.గీ. పరుష వాక్యమ్ములిట్టులc బలుకుచున్న
శుకునిcగనుగొని యాగ్రహింపక విదేహ
పతియు శాంత చిత్తమ్ముతోcబలికెనిటుల
ఉలికి పడరు జితేంద్రియు లుర్వినెపుడు

429. ఉ. భూసురవర్య! నీవిపుడు పొల్పునcబల్కిన పల్కులన్నియున్
వాసిగనౌ నిజంబు; లవి వంశచరిత్ర లటుండనిమ్ము; నే
గాసిల బోను; నీవునటుc గానలకేగి సమస్తబంధముల్
ద్రోసి తపంబొనర్తు, మదిరోయుదు సంసృతినంతి వైనచో

430. కం. కనిపెంచిన తండ్రిని విడి
తనయులు భార్యయును మిగులcదగులములనుచున్
వనములకేగెద నంటివి
కనcదగులములేని భూమి కలదే చెపుమా!

431. ఉ. ప్రాణులు లేని చోటు భువిపైcగలదేయెటనైనcజెప్పుమా!
కానలకేగినన్ వనమృగంబులతోc గడుబంధమేర్పడున్
గాన నసంగుడైయునికి కాదు సుసాధ్య మదెంతవానికిన్
మానస మందుcజింతయును మానదు దేహముగల్గునంతకున్

432. ఉ. కాయలు పండ్లు దుంపలును గావలె గాదె శరీర యాత్రకున్
బాయక వానికై పడెడి పాట్లును చింతకు కారణమ్ములై
ధ్యేయము నడ్డగించుగద ధీయుత! కానలలోననైన నీ
కేయది శాంతి చెప్పుము మహీసురవర్య! గృహంబువీడియున్

433. కం. దండము,cగృష్ణాజినము, క
మండలమును భద్రపరుప మదిలోనెపుడున్
మెండుగ నాలోచించును
దండి జటాధారియైన తపసియు నడవిన్

434. చం. నిరతము రాజ్యపాలనము నేనొనరింతునుగాని నామనం
బరయగ నిర్వికల్పమున హాయినిcబొందు నదెట్టులన్న నే
నిరవుగ నాత్మతత్వమున నెప్పుడు బంధములేకయుందు, న
స్థిరములు కష్ట సౌఖ్యము లిసీయను జ్ఞానము నాశ్రయించుచున్

435. తర. నిరతమున్ మది నేను బద్ధుడ నేను బద్ధుడ నంచునున్
బరగcబత్నియు పుత్రులున్ గడు బంధనమ్ములు వొమ్మటం
చరసి శోకిలు చుందు వెప్పుడు నాత్మకున్నవె బంధముల్
ధరణి నే సుఖినంచు నిత్యముcదల్ప దుఃఖములేదికన్

436. తే.గీ. బంధమది యౌను దేహ సంబంధముననె
దేహమే నాది కాదను ధీరమతికి
బంధమిక యేది గృహముల వనములందు
నెచట కాపురమున్నను నిద్ధచరిత!

437. చం. అనిజనకుండు పల్క శుకుడాత్మcగడుంగడుcదృప్తుడై విదే
హనృప వరేణ్యు వీడ్కొని నిజాశ్రమ భూమికిcజేరె; సంతసం
బుననెదురేగి వ్యాసుడును బుత్రునిcజూచి కవుంగిలించి తా
ననయము మూర్కొనెన్ శిరము నత్యధికంబనురాగ మేర్పడన్

438. చం. జనకుని కర్మయోగమును చక్కగ తాను గ్రహించి వ్యాసనం
దనుడటు కొంతకాలము ముదంబున నాశ్రమమందె యుండి తా
వినయ సుశీలవర్తనను 'పీవరి' యన్ముగుదన్ వివాహమై
కనియెను నల్వురన్ సుతుల కట్టకడన్ సుత నొక్క సుందరిన్

439. వ. కృష్ణ, గౌరప్రభ, భూరి, దేవశ్రుతులను నలువురు కొడుకులును
కీర్తియనుపేర నొక కుమార్తెయు నాశుకునకు గలిగిరంత

440. కం. కూతును విభ్రాజుండను
నాతని కొడుకునకు "నణుహు"డనువానికి సం
ప్రీతిగ నిచ్చి వివాహము
నాతండొనరించె వేడ్క నార్యులు మెచ్చన్

441. కం. వారల కుదయించెను నొక
ధీరుడు సద్గుణుడు సూర్య తేజుడు సుతుడై
యారసి ప్రజలన్ గాచుచు
ధారుణిc బాలించె "బ్రహ్మదత్తు" వరాఖ్యున్

442. మత్త. ఆ శుకుండును నంత నారదు నానతిన్ గొని ముక్తికై
తాశరీరముపైన భ్రాంతియుc దండ్రిపై ననురాగ మే





కోశమందును లేక భార్యను కూర్మి పుత్రులవీడి గౌ
రీశు శైలముcజేరి చేసె నహీనమౌ తపమచ్చటన్

443. పం. అతండటుల్ దపంబు సేసి యాపయిన్ శరీరమున్
నితాంతయోగ శక్తి తోడ నింగినంటనిల్పుచున్
బతంగునిన్ బలెన్ వెలింగి వాసి సిద్ధిcబొందె; ప
ర్వతంబు పైబడెన్ తదీయ భవ్య దేహమంతటన్

444. చం. తనయుడు సిద్ధిcబొంద పరితాపముcజెంది పరాశరాత్మజుం
డనిల జవంబునంజని హిమాచల శృంగముc జేరియచ్చటన్
గనియె, నిజాత్మజుండఖిల కల్మష దూరుడు నిత్యమున్ దపం
బొనరిచి ముక్తుడై తను వియోగముcబొందిన పావనస్థలిన్

445. చం. సుతుని వియోగ తాపమున శోకిలి బిట్టుగ నార్చుచుండ, నా
యతివరు నార్తనాదము లనంతముగా గిరి గహ్వరంబులన్
సతముcబ్రతిధ్వనించె వరుసన్ బహుకాలము; నంతశంకరుం
డతనిని దుఃఖ మగ్నుcదరియన్ జని యిట్టులcబల్కె నాదృతిన్

446. చం. వివిధ పురాణ ధర్మవిధి వేత్తవు, వేదవిభాగనైపుణీ
ప్రవరుడ, విట్లు శోకిలుట భావ్యమె; యోగివరుండు నీసుతుం
డవికల చిత్తు, డాత దకృతాత్ములుcబొందగరాని సద్గతిన్
బ్రవిమల తేజుడై పడసె; భాసిలcజేసె భవద్యశంబిలన్

447. కం. నీ పుత్రుని నీడ యెపుడు
నీ పొంతనె తిరుగుచుండు నిరతము దానిన్
తాపస వర! చూచుచు దుః
ఖోపశమముcబొందు మిట్టు లొసcగితి వరమున్

448. కం. అనిపలికి శివుడు మాయమ
యినయంతట సుతుని నీడ యిమ్ముగcజెంతన్
గనిపింపc దృష్టిc జెందుచుc
జనియెన్ వ్యాసుండు దుఃఖశమితాత్ముండై

449. ఆ.వె. అనుచు సూతు డిట్టు లద్భుతంబుగ శుక
యోగి చరిత మెల్ల నుల్ల మలరc

బలుక శౌనకాది పరమర్షులాతనిఁ
గనుచు నడిగిరిట్లు వినయమెసగ

450. చం. మునివర! పూర్వమూర్వశియు మోసముఁజేసి పురూరవున్ మహా
గుణయుతు వీడి పోయెనని కొంచెముఁజెప్పితివయ్య! తత్కథన్
వినగ కుతూహలంబగును విస్తృతరీతిగ దానిఁ జెప్పి మా
కనయము సంతసంబు హృదయంబులనింపుము సజ్జనాగ్రణీ;

## తారాశశాంకము

451. చం. అనియడుగంగ సూతుడిటు లాదరమొప్ప వచించెఁదత్కథన్
మునివరులార! మున్ను నవపుల్లదళాంబుజనేత్రఁ బూర్ణ చం
ద్ర నిభవరాస్య రూపవతిఁ 'దార'ను దేవగురుండు నిండు జ
వ్వనిని వివాహమాడి మదిఁబాయని కూర్మిఁజరించుచుండగన్.

452. ఉ. చందురు డొక్క యజ్ఞమును సల్పుచునుండ నెఱింగి యొక్కనా
డిందునిభాస్య 'తార' చనియెన్ సవనంబును జూడనెంచి; యా
సుందరి మేని కాంతులును, జూడ్కులు మారుని తూపులై కడున్
దందడివెట్టుచుండ 'శశి' తామునిగెన్ ప్రణయాబ్ధి, నంతటన్

453. కం. తారయు శశధరు రూపము
సారెకుఁదిలకించి మదన శర పీడితయై
కోరక భర్తను గృహమును,
గోరుచు చందురుని పొందుఁగొన్నాళ్ళుండెన్

454. మ. అటులన్యోన్యము వారలిర్వురును కామాసక్తి నత్యంతమున్
దిటవౌ మన్మథ కేళులన్ మునుగుచున్ దేలంగఁగాలంబటన్
బటువేగంబుగ సాగి పోయె; నిట గీర్వాణార్యుడున్ దుఃఖలం
పటుడై శోకిలు చుండె నిత్యమును తా భార్యావియోగమ్మునన్

455. మ. మదిఁజింతించుచు నొక్కనాడు సుర సంభావ్యుండు శిష్యాళిలో
పదిలుండౌనొక ఛాత్రునిన్ బిలిచి యేవైనంబనేన్ నాకు స
మ్మదమౌరీతిగఁ దార నిప్పుగొనిరా పొమ్మంచు బల్కంగ, పో
యెదనంచున్ జని తారనున్ మఱియు నయ్యిందున్ గనెన్ దానటన్





456. శా. అమ్మా! నీయెడబాటు సైపక గురుండత్యంత దుఃఖమ్ముతో
నెమ్మేనున్ గృశియింప శోకిలుచు నిన్నే గోరుచున్నాడు; నిన్
సమ్మానంబున తాగ్రహించునని తచ్ఛాత్రుండు పల్కంగ; నే
జుమ్మీరానికఁ బొమ్మటంచుఁ బలికెన్ జోద్యంబుగాఁదారయున్

457. ఉ. అంతట శిష్యుడయ్యతివ యాడినమాటల నట్లె చెప్ప, న
త్యంతముఁగ్రుద్ధుడై యట బృహస్పతి వేగమె యేగుదెంచి, యా
చెంతన నున్న పత్నిఁగని చింతిలి మాటలు రాకయుండ, తా
నంత యెఱింగి చంద్రుడపహాస్యము సేయుచు తన్నుఁ జూచినన్

458. చం. అతులిత కోపుడైయతని నట్టులె చూచుచు నోరి ద్రోహి! నీ
వితరుల భార్యలన్ గలియ నెంచుట ధర్మమె! యొజ్జ నైన నా
సతినిటు నీకడన్ నిలిపి సంగమ సౌఖ్యము లొందు నీవు దు
ర్గతులను జెందకుందువె? నిరంతర దుష్కృత పాప సంహతిన్

459. తే.గీ. మద్య పానమ్ము, బ్రాహ్మణ మారణమ్ము,
స్వర్ణ మపహరించుట, గురుపత్ని తోడ
సంగ మించుట, వీరల సాహచర్య
ములు మహాపాతకములని తెలిసికొనుము

460. ఉ. కావున పాతకమ్మొడిని గట్టిన దుష్టుడవీవు, నీకు నీ
దేవతలుండుచోట నిక దీర్ఘపుఁగాలము నుండనౌనె, యే
త్రోవననైనఁబొమ్ము, నిను దోషునిగాఁబదునాల్గు లోకముల్
భావములందెఱుంగునటుఁబల్కెదఁదారను వీడకుండినన్

461. మ. కడుఁగోపమ్మున దేవపూజ్యుడిటుఁబల్కన్ జంద్రుడావంతయున్
దడబాటొందక చిద్విలాసమున నా తారాపతిన్ జూచుచున్
నిడుపున్ గోపము బ్రాహ్మణోత్తములకున్ నింద్యంబుగాదే! మదిన్
విడుమీ కోపము నాలకింపుమిక నావిజ్ఞాపనంబుల్ బుధా!

462. సీ. అక్రోధనుండైన యవనీ సురుండెప్డు
పూజనీయుండంద్రు బుధవరేణ్య!
తార తానై వచ్చె కోరి నాచెంతకు
దోషిని నేఁగాను దురితదూర!

సుఖియింపఁగోరి యిచ్చోటకుఁదావచ్చె
మదినెంచుమిది నీవు మాన్యచరిత!
కొంత కాలంబిందు కూర్మితో వసియించి
వచ్చు మీయింటికి వాగ్విభూష!
గీ. బ్రాహ్మణుని పాపమెల్లను బాయు వేద
విహితమైన పశ్చాత్తాప విధుల వలన,
పరపురుష సంగమంబున పడతికైన
పాప మది తొలగు రజోనిపాతమునను

463. కం. అని మీరేగద! ధర్మము
మును వివరించితిరి యింక మోహంబేలా!
చనుమీ మీగృహమునకిక
దనుజారి వినుత! నిరుపమ ధర్మచరిత్రా!

464. కం. అని చంద్రుడు పలుకగ తా
మనమున నూహించ నట్టి మాటల కపుడ
య్యనఘుడు గీష్పతి శోకిలి
వెనుదిరిగి గృహమ్ముఁ జేరె విధి వంచితుడై

465. ఉ. అవ్విధిఁగొన్నినాళ్లతడు వ్యాకుల మానసుడై గృహంబునన్
నెవ్వగఁగూరి దెందమున నిల్కడ దోపక యున్న, నొక్కనా
డవ్వన జాక్షికై మరల నచ్చుటకున్ జన ద్వార పాలకుల్
దవ్వుల నిల్పి, రంతట నతండును గ్రోధ నిదాఘ తప్తుడై

466. మ. కనులన్ నిప్పులు రాలఁ దీక్షమగు దృగ్జాలంబులున్ జ్వాలలై
తననిట్టూరుపు గాడ్పులన్ దెసల విస్తారంబుగాఁ బర్వ, చ
య్యనభ్రూయుగ్మము గ్రిందు మీదగుచు నాట్యంబాడఁబ్రావృట్ఘనా
ఘన గంభీర రవంబుల ట్లతడు హుంకారమ్ములన్ జేయుచున్

467. మ. మతిహీనుండవు పాప సంచయుడ వేమర్యాదలున్ లేవు నీ
వతి కామాంధుడవై గురుండనగు నా యర్ధాంగినిన్ దల్లిగా
స్తుతియింపన్ దగు దాని నీ గృహము నందున్ నిల్పి యీరీతిగా
రతులన్ సల్పుదె శాపమిత్తు నిటురారా! రమ్మువేగమ్ముగన్





వ. అని బృహస్పతి గద్దించిపలుక

468. శా. ఆ మాటల్ విని చంద్రు డాగ్రహముతో నచ్చోటికేతెంచి, "నీ
వేమేమో పలుమాట లాడెదవు, నీకీ రూపలావణ్యతోఁ
బ్రేమోన్మాద మదేల? వేరొక కురూపిన్ జూచిపెండ్లాడుమా!
కామోత్కంఠత లేని నీకునిక సఖ్యంబేల యిక్కాంతతోన్

469. తే.గీ. సుందరాంగులు గోరుదు రెందునేని
సుందరుండైన పూరుషుపొందునెపుడు
గోరరెన్నడు నిట్టి వికారరూపు
ననుచు కామశాస్త్రముఁదెల్పు వినుము మూర్ఖ!

470. కం. కావున నే నీమెను నీ
కేవిధమున నీయ నింక నెఱిగింపుము నీ
కేవారొ దిక్కు వారికి;
నీ విచ్చెడి శాపమునకు నేవెఱవఁజుమీ!

471. చం. అని పరుషంపుఁబల్కులిటు లాడ నవాక్కయి తద్గురుండు తా
జనియెను వ్రేటువడ్డ యొక సర్పము భంగి మహేంద్రుచెంత, కం
త నమరనాథు డాతని విధంబది యెల్ల గ్రహించి నమ్రుడై
ఘనముగ నాతిథేయముల గౌరవమొప్పనొసంగి యిట్లనెన్

472. చం. గురువర! సేమమౌనె? మదిఁగోరిక లేమియు మీకు లేవుగా?
పరమ తపోధనుల్ తమరు, పాయక మీకను సన్నలందు నీ
సురలును నేఁజరింతుము త్రిశుద్ధిగ; మీ మొగమేల యిప్పుడి
ట్లెరియుచు నుండె, నిట్లునికి కెద్ది కతంబొ యెఱుంగఁదెల్పుమా!

473. చం. హరిహయు డిట్లు వల్కగ బృహస్పతి తానను నోసురాధిపా!
తరుణిని నాదుభార్యను మదంబునఁజంద్రుడు స్వీకరించి సు
స్థిరముగఁగామ సౌఖ్యములఁదేలుచు నన్నవమాన యుక్తమౌ
పరుషపు మాటలాడెనిక "పత్నిని నీ కిడ నేను పొమ్మ"నెన్

474. ఉ. కావున నీకునైన సహకార మొనర్పుము; దిక్కు నాకికన్
నీవె సురేంద్ర! దుఃఖమును నే నవమానము సైపఁజాల నన్

గావు మటంచు దీన పరికంపిత చిత్తముతోడ వేడ, నా
దేవ విభుండు పల్కె గురు దేవుని తో నిటు నమ్రశీర్షుడై

475. మ. గురువర్యా! కడుధర్మ వేత్తలగు మీకున్ దుఃఖిలన్ బాడియే
సుర నాథుండను మీకు శిష్యుడను దాసుండన్ ననున్ నమ్ముమీ!
పరగన్ దూతను బంపి నేనిపుడె మీ పత్నిన్ మిమున్ గూర్చెదన్
సరిగాకున్న ససైన్యమేగి శశిపై సాగించెదన్ యుద్ధమున్

476. కం. అనిపల్కి యాక్షణంబున
వినయాన్వితుడైన యొక్క విజ్ఞునిదూతన్
బనిచెను చంద్రుని చెంతకుఁ
బనియెల్లను జెప్పి గురువు పరితోషింపన్

477. ఉ. ఆతడు శీఘ్రమే చని శశాంకునిఁజూచి మహేంద్రుడంపె నన్
దూతగ చంద్ర! నీమదికి దోచ నతండిటు పల్కుమోయనెన్
నీతియు ధర్మమున్ నియమ నిష్ఠ లెఱుంగుదు వీవు; లోక వి
ఖ్యాతుడు నీదు తండ్రియగు నత్రిమహర్షి వివేక సంపదన్

478. ఉ. కావున నీకు నింద్యమగు కార్యము లిట్లొనరింపనౌనె? నీ
వేవిధి నీదు పత్నికయి యెప్పుడు రక్షణఁగూర్పనెంతువో
ఆవిధి గాదె యెల్లరును నాత్మఁదలంపుము, శాస్త్రమందు సం
భావిత "మాత్మవత్ సకల ప్రాణు"లటన్న ఋషిప్రబోధముల్

479. కం. ఇరువది యెనిమిది మందిని?
కఱవున్ దీరంగ దక్షకన్యలఁబెండ్లై
సరసములాడుట చాలదె
గురుపత్నిన్ గోరఁదగునె కుజనునిఁబోలెన్

480. శా. రంభాయూర్వశి మేనకాది రమణీ రత్నంబు లీస్వర్గమం
దంభోజాననలుండఁ జేకొనక, పూజ్యార్హున్ గురుక్షేత్రమున్
దంభాధిక్యతఁదెచ్చి యేలుటిది యేధర్మంబొ యూహింపుమా
యంభోజాసన తేజుడౌ గురున కిమ్మా! యింక తారన్ శశీ!

481. చం. విపుల వివేక ధర్మనయ విజ్ఞుడ, వీవిటు లాచరించినన్
గృపణతఁ; దక్కువారలు నికృష్టులునై చెడిపోరె, కాననీ





విపుడె బృహస్పతిన్ గలసి యిమ్ముగఁదారనొసంగకున్న స్వ
ర్గపురమునన్ రణంబెయగుఁ గాఱియలౌను దివౌకసాళికిన్

482. కం. ఈ మాటలు వినినంతనె
సోముడు కోపించి యిట్లు సురనాథునకున్
నామాటగఁ జెప్పుమనుచు
మోమోటములేక దూతఁ బొడగని పలికెన్

483. మ. సురనాథా! విను నీవు నీ గురుడు నున్ జూడంగ మేధావులే!
పరగన్ బుద్ధిని నిర్వు రొక్కటనుచున్ భావించెదన్; లోకమం
దరయన్ బెక్కురు సెప్పనేర్తురిటు లెన్నైనన్ ఘనాపాఠులై
గరిమన్ జెప్పిన దానిఁజేయగల విఖ్యాతుండు దుర్లభ్యుడౌ

484. మ. అరయన్ ధార్మిక శాస్త్రమున్నయది బార్హస్పత్య; మద్దాని నో
సురనాథా! పఠియింపుమయ్యా! కలదే సుంతైన నా తప్పు, నన్
గరమున్ గోరినదీలలామ, కనుకన్ గామించితిన్ నేను, దు
ష్కరమెద్దీ? బలమున్నవారి కెపుడున్ స్వాధీనమౌ సర్వమున్

485. కం. బలహీనున కెయ్యదియును
కలనైన స్వకీయ మౌనె? కానేరదు బో
తలపుల స్వీయలు పరకీ
యలునని గిరిగీయుటలవి యజ్ఞులచేష్టల్

486. తే.గీ. తార నాపట్ల ననురక్తిఁ దగిలియుండు
గురువుపట్ల విరక్తయై కోరదతని
నెట్లు విడచెద ననురక్త నింద్రనేను?
విడువ, నీయిచ్చఁ జేయుమేవిధమునైన

487. మ. అనియాచంద్రుడువల్క దూత చని తానటులే సురాధీశుతో
ననగా నింద్రుడుఁ గ్రుద్ధుడై సకల సైన్యాధ్యక్షులన్ బిల్చి మీ
రనయంబున్ రణయత్నమున్ సలుపుమం చాదేశమున్జేయ, నా
దనుజాచార్యుడెఱింగి గీష్పతిపయిన్ దా ద్వేషమున్ బూనుచున్

488. మ. వడిగా చంద్రుని యొద్దకేగి పలికెన్ వాత్సల్యమున్ జూపుచున్
విడువన్ బోకుము తార, నెట్లయిన నా విద్యన్ బ్రదర్శించి నేఁ

గడు సాహాయ్యమొనర్తు నీకనియె; సంగ్రామంబు ప్రారంభమై
కడకున్ మారెను దేవ దానవ మహోగ్రంబైన పోరాటమై

489. ఉ. భీకరమై రణంబటుల పెక్కుదినంబులు సాగ లోకముల్
వ్యాకుల మౌచు భీతిలె; దివంబునఁగల్గిన యట్టి దుస్థితిన్
దా కమలాసనుండుఁగని తద్దయు శాంతిల జేయనెంచుచున్
నాకముఁజేరె వాయుగమనంబున హంసవరాధిరోహుడై

490. శంకరుడును దావచ్చెను
పొంకముగా నందినెక్కి బోరన నటకున్
సంకుల సమరమ్మును ని
శ్శంకన్ దొలగించి శాంతి సమకూర్చుటకై

491. ఉ. వచ్చిన యావిరించి శశివంకకుఁజేరి యిదేమిటయ్య! యీ
పొచ్చెపుఁగార్యమున్ దవిలి పూనుట, నీకిది ధర్మమౌనె, నే
మెచ్చను దీని; గీర్పతికి మెచ్చగునట్టుల, దేవదానవుల్
రచ్చలు వీడ, వీడు మనురాగము, వీడుము తారనింతటన్

492. ఉ. వీడక పోతివేని యిది వెన్నునకున్ వివరించి చెప్పెదన్
బూడిదఁజేసి నిన్ యమునిప్రోలున కంపునతండు పొమ్మటం
చాడుచు, శుక్రుఁజూచి కడునాగ్రహమంది యిదేమిటయ్య యీ
కూడని దుష్ట కార్యమునకున్ సమకట్టుట నీకుఁ బాడియే

493. మ. అని గద్దించి విరించి పల్క విని శుక్రాచార్యుడున్ వేగమే
చని చంద్రుంగని యోశశీ! వినుము విశ్వాసంబునన్ నాదు మా
టను, నీతండ్రియుఁ జెప్పెనిట్టులె యికన్ డంబమ్ముఁబోనాడి తా
రను సేమమ్ముగ నాబృహస్పతినిఁజేరన్ బంపుటే యుక్తమౌ

494. కం. అనిశుక్రుడు పలుకగ తా
వినిచంద్రుడు సమ్మతించి వేగమె తారన్
గొనివచ్చి గర్భవతినిన్
వినయమ్మున నప్పగించె విబుధగురునకున్

495. ఉ. అంత సురాసురుల్ దమ గృహంబులకేగిరి, బ్రహ్మదేవుడున్
స్వాంతమునన్ బ్రశాంతుడయి సత్యపదంబునుజేరె; శంకరుం





డెంతయు మోదమంది చనియెన్ రజతాద్రికి; మానసంబునన్
సంతసమంది తారఁగొని చయ్యన గీష్పతియేగె నింటికిన్

496. ఉ. కాలముఁగొంత సాగె నట గర్భమువర్ధిలి, నిండగా నెలల్
వేలుపు టొజ్జయింతి ప్రసవించెను తామగబిడ్డ, నాశశిన్
బోలెడు సుందరున్; ముదముఁబొంది గురుండును జాతకర్మలన్
జాలనొనర్చె సుంతయును శంకమదిన్ దలపోయ కంతటన్

497. ఉ. చందురు డింతయున్ దెలిసి చయ్యన గీష్పతి చెంతకేగి యీ
సుందరుడెట్లు నీకగును సూను; డితండగు నాకు తారకున్
నందనుడయ్య! నీకు తగునా! జరిపింపగ జాతకర్మ; లిం
పొందగఁ దండ్రియే జరుపుటొప్పను శాస్త్రపుఁబల్కెఱుంగవే,

498. తే.గీ. కాన నేనితనికి జాత కర్మసేయఁ
దగుదు, నీవెట్టు లర్హుడ వగుదు చెపుమ!
అనుచు చంద్రుండువల్క తానమర గురుడు
నాజ్యమున్ బోయఁదరికొను నగ్నిఁబోలె

499. చం. కనలుచుఁ జంద్రుఁ జూచి పలుకన్ దొడగెన్ గురుదేవు డిట్టు, లో
వినయ విదూర! నీకొడుకు వీడెటులయ్యెను, బ్రల్లదమ్ములన్
విని సహియింపఁజాలమది; వీని మొగమ్మును జూడు మచ్చుగన్
ననుఁదల పించుచుండె; నిక నాలుక చీరెద మారువల్కినన్

500. కం. ఇట్టుల వారిర్వురకును
గట్టిగ వాదంబు పెరుగ గాలియువానై,
దట్టించి మోహరించిరి
దిట్టమ్ముగ మరలదనుజ దివిజ గణంబుల్

501. ఉ. శాంతిని గూర్పగన్ మరల సారసగర్భుడువచ్చి యిర్వురన్
పంతము వీడఁజేసి గురుపత్నినిఁబిల్చి నిజమ్ముఁజెప్పు, నీ
వింతయెఱుంగు దీబుడుత దెవ్వనికిన్ జనియించె నన్న, నా
యింతియు సిగ్గునన్ బలికె నిందునకేనని వంచి శీర్షమున్

502. కం. ఆమాటను వినినంతనె
సోముడు సంతోషపడుచు సుతుఁగైకొని తా

గీమునకు నేగి బుధుడను
నామంబును ముద్దులొలుక నందనునకిడెన్

503. శా. సూతుండిట్టుల శౌనకాది పరమర్షుల్ మానసంబందు సం
ప్రీతిన్ జెందగ నాబుధోదయముఁజెప్పెన్, వార లాపిమ్మటన్
ఖ్యాతిన్ గొన్న పురూర వాఖ్యనృపుఁగల్యాణంపు గాథల్ సుధా
పాతంబై చెలువొందఁజెప్పు మనుచున్ బ్రార్థింప నమ్మౌనియున్

## ఊర్వశీపురూరవ వృత్తాంతము

504. కం. మునివరులారా! వినుడీ!
మును నా"బుధు"నకు "నిళ" యను ముగుదకుఁబుట్టెన్
ఘనయశుడు పురూరవుడను
జనవినుతుడు యజ్ఞదాన సద్విధియుతుడై

505. తోదకము ఆతని గాథను నద్భుతరీతిం
బ్రీతి యొనర్పగ మీకిపుడేనున్
భాతిగఁజెప్పెదఁ బాయని కూర్మిన్
చేతము లెల్లను చెందు ముదమ్ముల్

506. మ. చౌరవన్ మున్ను నృపాలు డొక్కడు భువిన్ సుద్యుమ్న నామంబునన్
పరిపాలించుచు నొక్కనాడు తనయశ్వంబెక్కి సైన్యంబుతో
నరిగెన్ దుర్గమమౌ వనంబులకు వేటాడంగ; శౌర్యోన్నత
స్థిరుడై పెక్కు మృగంబులన్ బొలియఁజేసెన్ బెద్దయున్ బ్రొద్దటన్

507. చం. అలసి యతండు కొంత వడి కచ్చట మేరు గిరి ప్రదేశమం
దలరులతా నివర్తిత మహాద్రుమ చారుతరప్రదేశమున్,
ఫలభరితానతద్రుమ విభాసితమున్, నవపుల్ల సారసో
త్పల కలహంస సారసయుత హ్రదమున్ గనె రమ్యదేశమున్

508. మ. అది యుద్యాన వనమ్ము, తీర్చి నటులత్యంతప్రశాంతమ్మునై
హృదయాహ్లాద మొనర్చుచుండగ ధరాధీశుండు సైన్యమ్ముతో
ముదమున్ జెందుచు లోనికేగ నదియేమోగాని యాశ్చర్యమై
ముదితల్గా పరిణామ మొందిరట సంపూర్ణమ్ముగా నెల్లరున్





509. ఉ. సిగ్గును దుఃఖమున్ గలుగఁ; జేయునదేమియులేక యాత, "దె
ట్లొగ్గుదు నింటికేగ, నిక నుర్వర నెట్టుల యేలువాడ, యి
ట్లెగ్గొనరించినట్టి నరులెవ్వరు, నేనిపుడేమిసేతునం
చగ్గలమైన సందియము లయ్యెడ మానసమున్ గలంచగన్"

510. కం. అని యిట్లు పలుకు సూతుం
గని శౌనకు డిట్టులనియె కారణమేమీ!
మునివర! వారట్లగుటకు
వనమాహాత్మ్యమొ ధరాధిపతి దోషంబో?

511. కం. వివరించి చెప్పు మయ్యా!
యవిరళమై మాకు సంభ్ర మాశ్చర్యములౌ
ప్రవిమల ఘన తాపసవర!
యవనీశుండేమి చేసె నాపైన నికన్

512. మ. అనినన్ సూతుడు సెప్పెనిట్లు మునివర్యా! మున్ను ముక్కంటి యా
వనమందొక్కట నిర్జనస్థలమునన్ బ్రాలేయ పృథ్వీధరేం
ద్రుని కన్యామణితో రతిక్రియల సంతోషాత్ముడైయుండ, నా
సనకాదుల్ సనుదెంచి రచ్చటకుఁదేజంబుల్ దిశల్ నిండగన్.

513. ఉ. వచ్చిన వారు వచ్చినటు వైళమయేగిరి తత్ప్రదేశమున్
జొచ్చుట పాడి గాదిపుడు సువ్వె యటంచు మునీంద్రు,లంతఁదా
హెచ్చిన సిగ్గు, కోపము, నహీనపు దుఃఖము డెందమున్గదున్
ద్రచ్చగ పార్వతీసతి పరాఙ్ముఖయై నిలుచుండియుండగన్

514. చం. శివుడది గాంచి పార్వతిని శీర్షము దువ్వుచు బుజ్జగించుచున్
వివిధ మృదూక్తులన్ బలికెఁబ్రీతిగ, నైనను నాగిరీంద్రు పు
త్రి వినక యున్న, నాతడతి తీక్ష్ణ గళంబున "నివ్వనంబునం
దెవడికఁ జొచ్చునో పురుషు డింతిగ మారు నతండు" బొమ్మనెన్

515. ఇంతిగా మారి సుద్యుమ్నుడంత నచటు
విడిచి వెలుపల వసియించె నడవిలోన
రాజ్యమున కేగ మనసు నిరాకరింప
తిరుగుచుండెను 'నిళ' నామధేయయగుచు

516. చం. తన పరివార మెల్లరు ముదంబున నెచ్చెలికత్తెలై 'యిళన్'
వినయముతోడ నిత్యమును వీడక సేవలఁ దన్పుచుండ, న
వ్వనజదళాక్షియచ్చట నివాసముఁజేసె; యటుండ నొక్కనా
డనఘుడు చంద్ర సూనుడు బుధాఖ్యుడు వచ్చెను వేటలాడుచున్

517. ఉ. వచ్చిన యా బుధుండు నవ పద్మదళాయత లోచనన్ గనెన్
నెచ్చెలులున్ సుడిన్గొనుచు నిల్వ నొయారపు సొంపులొల్క, తా
నచ్చరయౌనొ, లేక దివిజాంగనయో, మఱినాగకన్యయో,
యచ్చుగనంచు నొప్పెడులతాంగిని నా'యిళ' నవ్వనంబునన్

518. ఉ. చూచి విమోహి తాత్ముడయి సుందరితోననె నాదు చిత్తమున్
దోచితివీవు నన్ను పరితోషమునన్ వరియింపుమన్న సం
కోచముఁజెంద కామెయును గోరికతో వరియించె నంతటన్
యోచనఁ జేసి రిర్వురును నొప్పుగఁ బెండిలియాడ నచ్చటన్

519. కం. ఇరువురు గాంధర్వ విధిని
పరిణయమైరంత వారి ప్రణయఫలంబై
మురిపెములొలికెడి పుత్రుం
డురు గుణవంతుండు గలిగె నొప్పుగ నచటన్

520. ఉ. ఆతనికిన్ బురూరవు డటంచు సువర్ణవరాభిధానమున్
బ్రీతి నొసంగి ముద్దుమురిపెంబులఁదేలుచునుండ; నొక్కనా
డాతత మైన దుఃఖమున నా 'యిళ' పూర్వపు రూపమున్ గడున్
జేతము నందలంచి యిక జీవితమంతయు నిట్లెయౌనాకో!

521. మ. అని దుఃఖించుచుఁ దావసిష్ఠుఁదన, వంశాచార్యునిన్, నెమ్మనం
బునఁ బ్రార్థింపగ, నాతడున్ గడువడిన్ బూర్వంపురూపమ్ము మా
రిన సుద్యుమ్నుని, యిప్పుడీయిళను, జేరెన్, శిష్యవాత్సల్యుడై
కనియెన్ తత్పరితాప హేతువు నటన్ గారుణ్యచిత్తంబుతో

522. శా. ఆసుద్యుమ్నుని దుస్థితిన్ దొలగఁ జేయన్జిత్త మేకాగ్రమై
భాసిల్లంగ వసిష్ఠ డప్డు శివునిన్ బ్రార్థింపఁ బ్రత్యక్షమై
యాసర్వజ్ఞుడు చంద్రశేఖరుడు దివ్యంబైన తేజంబుతో
వాసిన్ దా నపుడిచ్చినట్టి తన శాపంబున్ దలంచెన్ మదిన్





523. ఆ.వె. తలచి యిట్టులనియెఁ దా వసిష్ఠునితోడ
ఈ వనంబు పురుష డెవడు సొచ్చు
నాత డింతిరూపు డౌనటంచును మున్ను
శాపమిడితి నదియె జరిగెనేడు.

524. ఉ. ఐనను నొప్పిదం బయిన యట్టులఁజెప్పెద నెట్టులన్న నా
దేనును బల్కి నట్టి పలుకెంతయు భంగము గాక యుండున
ట్లీ నర నాథుడింక నిటులే యొక మాసము నాతి రూపమున్
బూనుచు నొక్కమాస మటు పూరుషు రూపముదాల్చుచుండెడున్

525. కం. అని పలికి శంకరుండటు
కనుమరుగైపోయె నంతఁగాయము నందున్
గనుపింపఁ బురుష రూపము
కని రాజ్యము సేరె రాచకార్యము సేయన్

526. శా. స్త్రీరూపమ్మున నున్న మాసమున నేరిన్ జూడ కంతఃపుర
స్త్రీరాజిన్ దరిఁ జేరియుండు, నికవాసిన్ పూరుషుండైన యా
వారంబుల్ దగరాజ్యమేలుచు నిటుల్ వాటించెఁ గొన్నాళ్ళు; నా
పై రాజ్యమ్మున పుత్రు నిల్పి చనియెన్ భాస్వత్తపో నిష్ఠుడై

527. చం. వనముల కేగి దేవమునివర్యు డొసంగిన యా నవాక్షరిన్
మనమున నిల్పి తీవ్రతరమౌ తపమున్ గడు నిష్ఠఁ జేయ, న
య్యనఘుని దీక్షకున్ ముదమునంది భవానియు సింహవాహయై
ఘనసగుణాకృతిన్ భయద క్రమశరీరము తోడఁగన్పడెన్

528. తే.గీ. వారుణీ పాన సన్మత్త వక్త్రయౌచు
వచ్చి నిలుచున్న దేవిని భక్తిఁ జూచి
యువిద యాకృతినున్న సుద్యుమ్నుడపుడు
ప్రస్తుతించెను భక్తి ప్రపత్తి నిట్లు

## ఇళయొనర్చిన దేవిస్తుతి

529. శా. నీ రూపమ్మిది దివ్యమమ్మ జననీ! నీ వెల్ల లోకాలకున్
కారుణ్యాలయవై హితమ్ములను విఖ్యాతిన్ దగన్ గూర్తు, వీ

నీరేజ ప్రభవాండముల్ నిరతమున్ నీయాజ్ఞచే వర్తిలున్
నీరేజాక్షి! త్వదంఘ్రి పంకజములెంతేఁ గామదంబుల్ గదా!

530. మ. సురలున్ దిక్పతులున్ త్రిమూర్తులు, మహర్షుల్ మౌను లెల్లప్పుడున్
పరిపూర్ణంబుగ నిన్నెఱుంగక మహా భ్రాంతిన్ జరింపంగ యీ
నరులింకెంతటివారు నిన్నుఁ దెలియన్ నవ్యాబ్జ పత్రేక్షణా!
పరగన్ సర్వము సృష్టి వైభవము నీభాగ్యంబెగా శర్మదా!

531. ఉ. వెన్ను డెఱుంగు సత్త్వగుణ విగ్రహమై యలరారు లక్ష్మిగా
పన్నుగ వాణియం చెఱుగు పద్మభవుండు రజోగుణాకృతిన్
జెన్నుగ తాను శాంకరిగఁ జేకొను నీశుడు తామసాకృతిన్
నిన్ను; నెఱుంగ రెవ్వరును నిర్గుణ తత్త్వమునన్ శుభంకరీ!

532. కం. కరుణాలయవు నమేయవు
కరుణన్ నను సేవకుడను, గడుమందమతిన్
స్థిరముగ ననుగ్రహింపన్
సరగున దయసేయు టెంత సత్ భాగ్యంబో!

533. చం. నిరతము లక్ష్మితోఁ గలసి నీరజనాభుడు నీ పదాబ్జముల్
కరము భజింప, త్వత్ పదయుగం బొకయింతయు మేనసోకినన్
బొరిఁబొరిఁబుల్కరించు విరఁబూయు నశోకము భంగినన్నచోఁ
దరమె నుతింప నీమహిమ ధాతకు నీశునకైన శాంకరీ!

534. చం. పరమ మునుల్ నిరంతరము భక్తిభజింపగనొప్పు నీవిభుం
డరమరలేక కామవిరహాతురుడై భవదీయ పాద పం
కరుహములన్ భజింప ననుకర్షముఁ బొందక "నీవు, నీవ"టం
చిరవుగ నేక వాచ్యమున నెప్పుడుబిల్తువు సాధికారతన్

535. సీ. మేఘ మధ్యంబందు మెఱపు చందంబున
విష్ణుని వక్షంబు వీడవెపుడు
పర్యంకమది నీకుఁ బద్మనాభుని యురం
బతడె వాహన మాయె నౌర; యెపుడు
కోపించి యతనినిఁ గూడక నీవున్న
శౌరి నెవ్వరునేని సరకుగొనరు
శక్తి హీనుని గతి సకల లోకంబుల
నిట్టులేయగు మది నెంచిచూడ
లక్ష్మిలేనట్టి పురుషుని లక్ష్యపెట్ట
రవని భార్యలు బంధువు లాత్మజులును
బ్రహ్మవిష్ణు మహేశులఁ బరగ నీవె
పురుషులను జేసి యాడించు పుణ్యసతివి.

536. ఉ. అంతము లేని నిన్ను కడునల్పుడ నేను నుతింప నౌదునే
యింతివొ, పూరుషుండవొ, మఱెట్టులొ నే నెఱుగంగలేను, నీ
చెంతనె నిత్యమున్ నిలిచి చేతమునీకిక నప్పగించి నే
నెంతయుఁ గోరెదన్ శరణ మీశ్వరిఁ నన్గృపఁ జూడు మమ్మరో!

537. వ. అని స్తుతియించిన

538. కం. సుద్యుమ్నుని యీస్తోత్రం
బాద్యంతమువిన్నయంబ యతనికి నొసగెన్
సద్యోగుల కందని యన
వద్యం బగు దివ్యపదము వాత్సల్యమునన్

539. కం. అని చెప్పి సూతుడంతన్
ముని వర్యులఁ జూచి పలికె మోదముతోడన్
వినుడింక పురూరవ భూ
పుని చరితముఁ దెలిపెద నని పొలుపొంద నిటుల్

540. చం. తన జనకుండటుల్ పరమ ధామముఁ జేర పురూరవుండు, ధ
ర్మ నయ విధిజ్ఞు డంగజ సమాన మనోజ్ఞుడు, ధారుణీప్రజన్
దనయులరీతిఁ గాచుచు నధర్ములపాలిట రుద్రమూర్తియై
ఘనముగ రాజ్యమేలె గుణగణ్యు డనంతపరాక్రమంబునన్

541. శా. ఉత్సాహ ప్రభు మంత్ర శక్తి యుతుడై యొప్పారి యజ్ఞంబులన్
సత్సంకల్పముతో నొనర్చుచు సదా సద్విప్రసంఘంబు ల
త్యుత్సాహంబులబొంద దక్షిణల వేయున్ రీతులన్ దన్పుచున్
స త్సామర్థ్యముగల్గి యేలె భువి శశ్వత్ఖ్యాతి శోభిల్లగన్

542. కం. సామము భేదము దానము
లీమూడును చాలకున్న నిక దండంబున్
భూమీశు డాశ్రయించుచు
భూమిన్ బాలించె నడఁచి భువిశాత్రవులన్

543. ఉ. ఆతని రూప వైభవము లాతని శౌర్య పరాక్రమంబు లా
భూతల నాథు సద్గుణ విభూతియు,c గీర్తియు నచ్చటచ్చటన్
ఖ్యాతిగ నెల్ల వారు పలుకన్ విని యూర్వశి కాత్మయందు సం
ప్రీతి జనించె నాతనివరింపఁ బురూరవు గౌరవాస్పదున్

544. తే.గీ. అజునిశాపమ్మువలన మున్నవనియందు
వాసముంజేయు నూర్వశిన్ వల్లభుండు
నామె లావణ్యసంపద కాత్మమెచ్చి
తాను వరియించె నిరువురు దగ్గరైరి

545. తే.గీ. ముచ్చటల్ దీర నిరువురు ముచ్చటించు
కొనిరి యూర్వశి యంత నాకువలయేశుఁ
గనుచుఁ బల్కెను నియమముల్ గలవు మూడు
వాని కొడబడుదేని నే వలతుననుచు

546. సీ. భుజియింప నితరముల్ భూపాల! యెల్లప్డు
భుజియింతు నాజ్యమే భోజ్యముగను
సంభోగములు సల్పు సమయమ్ము లందప్డు
కన్పింపవలదు నగ్నముగ నెపుడు
ఉరణముల్ రెండు నాయొద్ద నున్నవి వాని
రక్షింప వలయు సురక్షితముగ
పైమూడు నియమముల్ పాటించి నన్నెప్డు
మన్నించవలయు సన్మతి దలిర్ప

గీ. కాక వీనికి భంగమ్ము కలిగెనేని
వెళ్ళి పోయెద నేను నిన్ విడిచివేగ
ననుచు నూర్వశి పల్క తా నవనిపతియు
సమ్మతించెను; సాగె సంసారమంత.





547. ఉ. అంత పురూరవుండు తన యజ్ఞవిధుల్ పరిపాలనాక్రియల్
స్వాంతమునం దలంపక నహర్నిశముల్ దివిజాంగనారతిన్
భ్రాంతినిఁజెందుచున్ సతత భావజకేళులఁ దేలుచుండె వ
స్త్వంతర సంగతుల్ వదలి యక్కట! కాముని చేష్టలిట్టులౌ!

548. సీ. అధర సుధలుఁ ద్రావ నారాటపడుఁ గాని
మధుఫలరసముల మాటమఱచె
మదిరాక్షి కుచకుంభ మర్దనమ్ములెగాని
శత్రుమర్దనములు సలుపమఱచె
కామాక్షి తోనాడు కామకేళులె గాని
చదరంగములనాడు జాడమఱచె
అతివతో మంతనం బాడఁ గోరునె గాని
మంత్రులతో నాడు మాటమఱచె

గీ. ఇట్లు పెక్కేండ్లు కాపుర మ్మింతిఁ గూడి
క్షణములట్టుల సాగించె సంతసమున
రాజ్యసుఖముల వీడి భూరమణుడకట!
కామవశునకు నింకనే కార్యముండు

549. శా. కాలంబిట్టుల సాగుచుండె నట నాకంబందు దేవేంద్రుడున్
వాలుంగంటిని యూర్వశిన్ గనని యీస్వర్గం బభోగ్యంబుగా
నాలోకించుచు నామెఁదెచ్చుటకుఁ జయ్యన్‌బిల్చె గంధర్వులన్
బోలన్ జూచి సమర్థులన్ బహువిధంబుల్ సేయు మాయావులన్

550. ఉ. వచ్చిన వారలన్ గనుచు వాసవుడిట్లనె, మీరు భూమికిన్
జొచ్చి పురూరవుండెపుడు సుందరి నూర్వశిఁగూడియుండునో
నచ్చిక నట్టివేళ యురణంబులఁజేకొని వత్తురేని తా
నచ్చుగ వానిఁదెచ్చుటకునై యరుదెంచును నగ్నదేహుడై

551. ఉ. ఆ సమయంబునందు దివిజాంగన యూర్వశి చూచి యాతనిన్
బాసి, రయంబునన్ దివికి వచ్చును, పొందని, వాసవుండు వి
శ్వాసము తోడ నాజ్ఞనిడ, వారలు వేఁజని భూమినాథు నా
వాసమునన్ నిశీథమునఁ బట్టిరి యా యురణంబులన్ వడిన్

552. ఉ. పట్టు కొనంగ నప్పుడవి బావురు మంచు భయమ్ముఁ జెంది బల్
గట్టిగ నార్చె; యూర్వశియుఁగారణ మెద్దియొ కానలేక తా
నుట్టిపడంగలేచి భయమొందుచు నా పృథి వీశునెంతయున్
గట్టిగఁ దట్టి లేపి యటుఁ గాంచు మటంచును దీనచిత్తయై

553. కం. అయ్యో! నాయురణంబులు
కుయ్యిడునటు చూడు మెవరొ గొని పోయెద రో
యయ్యా! వేగమె తెమ్మా!
యెయ్యెడలను బిడ్డలట్టు లెంతును వానిన్

554. మ. అనుచున్ వేడగ, నాపురూరవుడు నగ్నాకారుడై వేగమే
జనియెన్ వానినిఁదెత్తు నంచు వెలికిన్; శంపాలతల్‌దళ్కునన్
వినువీథిన్ మెఱయంగఁ జేసి రిదియే వేళంచు గంధర్వులున్;
గనె నంతన్ ధరణీశు నగ్నముగ నక్కాంతిన్ సరోజాక్షియున్

555. కం. అంతట గంధర్వులు నా
చెంతన తగరులను విడిచి చేరిరి నాకం
బింతియు నరిగెను సమయం
బెంతయు భంగమ్ముగాగ నింద్రునిపురికిన్

556. కం. ఉరణమ్ములఁ గైకొని యా
ధరణీశుడు వచ్చి శయన తల్పము చెంతన్
దరుణిన్‌గానక మదిలో
కరము విచారించి వెదుకఁ గన్పడదయ్యెన్

557. చం. అతిశయమైన దుఃఖమున నావిభు డూర్వశికై యహర్నిశల్
వెతకఁదొడంగె తీర్థములు, విస్తృతమౌనగరంబులున్ మహా
ద్భుత మహిమాన్వితంబులగు భూములు పర్వతముల్ వనంబులున్
ధృతిసెడి వెఱ్ఱివాని పగిదిన్ గడు కామవిమోహితాత్ముడై

558. ఆ.వె. వెతకి వెతకి విసిగి వేసారి యా కురు
క్షేత్రమందు తాను చివరకెటులొ
యువిద నూర్వశిఁగని యుర్వీశుడెంతయు
సంతసించి పల్కె నింతితోడ





559. ఉ. దోసమదేమి చేసితిని తొయ్యలి! నీయెడనేను చెప్పుమా
మోసముఁజేసి పోయితివి; మోహమువీడక నిన్నుఁజూడ నా
యాసముఁ జెందుచున్ దిరిగి యాసలు మానితి; దేహమెల్లయున్
గాసిలె; యింకనే నతివఁ గాంతునొ లేదొ యటంచు నెంచుచున్

560. కం. ఇచ్చటకువచ్చి నిన్నున్
ముచ్చటఁ దీరంగఁ గంటి ముదితరొ నీవిం
కెచ్చటి కేగక యెపుడున్
మచ్చికతో నుండుమిందె మరువక నన్నున్

561. కం. లేదా ప్రాణము విడిచెద
నీదయ నాపైన నింక నిలుపకయున్నన్
నాదేహం బటుమీదన్
మేదినిఁబడి కాక గృధ్ర మృష్టాన్నంబౌ

562. చం. అని విలపించుచుండ దివిజాంగన యాతనిఁ గాంచి పల్కె నో
జనపతి! నీకు సుంతయును జ్ఞానములేదని తోచుచుండె; నీ
వనయము నన్నుబోంట్లఁ గని యారటమందుట చోద్యమయ్యె, స్వై
రిణుల మిటారపున్ వలపు రీతులు సత్యములంచు నెంచితే?

563. ఉ. కావున నింటికేగి కులకాంతను పెండిలియాడి రాజ్యమున్
భూవర! యేలుకొమ్మికను, పొందుము సౌఖ్యము లెల్లవేళలన్
నీవిక నాపయిన్ మదిని నిల్పిన మోహము వీడు మంచు త
త్త్వావహమైన పల్కులటు లంగనపల్కి; నిజేచ్ఛ నేగినన్

564. ఉ. ఐనను నాత డంగనకు నై విలపించుచుఁ బెద్దకాలమున్
దీనత నుండె నించుకయుఁ దృప్తి యెఱుంగక; కాన నెంత వా
రైనను కాంతకున్ వశులెయౌట నిజంబని శౌనకాది స
న్మౌని వరేణ్యులెల్లరకు మాన్యుడు సూతుడు సెప్పెనీ కథన్

565. తే.గీ. వేదములయందు నీకథ విస్తృతముగ
చెప్పఁ బడియె; సంగ్రహముగఁ జెప్పితేను
ననుచు సూతుడనగ శౌన కాదులపుడు
హర్షమెసగగ నతనితో ననిరి యిట్లు

566. చం. నిఖిల పురాణ శాస్త్రముల నేర్పునఁ జెప్పగ నిన్ను మించి యీ
యఖిల జగంబులన్ గలరె యన్యులు సూతమహర్షివర్య! నీ
ముఖమున నింకయున్ వినగ బుద్ధిఁ దలంతుము చెప్పుమయ్య! య
య్యఖిల పురాణకర్తయగు వ్యాసుని యాపయి వృత్తమింపుగన్

## ధృతరాష్ట్రాది జన్మవృత్తాంతము

567. కం. అని మౌనులడుగ సూతుడు
వినిపించెను నిట్లు మున్ను వేదవ్యాసుం
డనఘుం డాత్మజుఁ దలచుచు
మనమున; యాశ్రమముఁ జేరె మందగమనుడై

568. కం. ఆయన శిష్యులు వైశం
పాయనుడును దేవలుండు నసిత సుమంతుల్
ధీయుతుడు జైమినియు నా
మ్నాయ పురాణములఁ దెలుప నరుగుటకతనన్

569. ఉ. ఒంటరి జీవితమ్మునకు నోపక నాతడు దుఃఖమగ్నుడై
కంటికి నిద్రరాక బహుకష్టముఁ జెందుచుఁ గొంతకాల మ
ట్లింటనె యుండ,ఁ దల్లి గనిపించె మనంబునఁ దళ్కుమంచు; నా
వెంటనలేచి సత్యవతిఁ బ్రీతిఁ గనుంగొన నుత్సహించుచున్

570. చం. చని యటఁగాంచె నంత విలస న్నవపుల్ల సరోజ భృంగ; దు
ర్జన ఘన పాపపంకిల నిరాసక తుంగ తరంగ; విష్ణుపా
దనళిన సంభవోత్కర సుధాజలసంగ, శుభాంగ, గంగ, నా
మునివినుతుండు వ్యాసుడు ప్రమోద దళన్నవ పద్మనేత్రుడై

571. ఉ. అక్కడఁ దల్లిఁ గానక యనంత విచారమునంది యాతడా
చక్కిన నున్న వారిని విచారణసేయగ; దాశరాజు తా
మక్కువ శంతనాఖ్యునకు మాన్యున కాకురువంశమౌళికిన్
చక్కగ కూతు నిచ్చి కదు సంతసమొప్పగఁ జేసె పెండిలిన్

572. కం. అని వారలెల్ల పలుకగ
విని సాత్యవతేయుడపుడు వినయాన్వితుడై





చనిదాశరాజు చెంతకు
విని పించెను తనవిధంబు వేడుకతోడన్

573. కం. ఆతని కుశలములడిగియు
నాతిథ్యము స్వీకరించి యాతండంతన్
బ్రీతిన్ సరస్వతీతట
శీతల వృక్షములచెంతఁ జెన్నుదలిర్పన్

574. తే.గీ. ఆశ్రమముఁగట్టి యచ్చట ననవరతము
తపము సేయంగఁ బూనె నా తాపసేంద్రు
డంత సత్యవతీ సతి కచట నిరువు
రాత్మజులు పుట్టిరనివిని యాత్మనలరె

575. ఉ. అంతకుముందుఁ గల్గె దివిజాపగయందు కుమారుడొక్క డా
శంతన ధారుణీంద్రునకు శాంతుడు, దాంతుడు సజ్జనుండు, ధీ
మంతుడు భీష్ము డార్యజనమాన్యుడు; నేడిటుగల్గి రిర్వు రీ
కాంతకు దాశరాజు ప్రియ కన్యకు పుత్రులు సద్గుణాంచితుల్

576. వ. ఆశంతనుండంత

577. కం. ఒనరగ విచిత్ర వీర్యుం
డని చిత్రాంగదుడని తన యాత్మజులకుఁతా
నెనరున నామంబులనిడి
దినములు సాగించుచుండె దివ్యవిభవుడై

578. కం. ముగ్గురు కొడుకులఁ జూచుచు
నగ్గలమగు సంతసమున నాశంతనుడే
యెగ్గులు గానక నేలుచు
వగ్గె దేహమ్మువీడి స్వర్గముఁ జేరెన్

579. ఉ. అగ్రసుతుండు భీష్ముడపు డాతనికిందగ నుత్తర క్రియల్
నిగ్రహచిత్తుడై సలిపి నెమ్మిని సత్యవతీ కుమారులం
దగ్రజు రాజుగానిలిపె నన్నిటఁదాను సమర్థుడయ్యు న
త్యుగ్రమునైన నాటి సమయోచిత మౌప్రతినన్ దలంచుచున్

580. కం. తనపట్టిన యా వ్రతమును
వెను దీయక భీష్ముడిట్లు వేడ్కనొనర్పన్
నెనరున దేవవ్రతుడని
వినుతించిరి విబుధులెల్ల వేడుక నతనిన్

581. శా. ఆచిత్రాంగదుడంతఁ దానొక దినం బత్యంత సాంద్రాటవిన్
నీచోచ్చంబగు పర్వతస్థలములన్ దిర్గాడుచున్ శాత నా
రాచశ్రేణులఁ బూని క్రూరమృగ విస్రంభంబు గావించుచున్
జూచెన్ దివ్య విమాన యాను నొకనిన్ జోద్యంబుగానచ్చటన్

582. తే.గీ. అతడుఁ జిత్రాంగ దాఖ్యఁజెన్నలరు వీర
వరుడు గంధర్వు; డీతని పౌరవాన్వ
యుడగు చిత్రాంగదుఁ బరాక్రమోన్నతుఁ గని
వ్యోమ యానంబుఁ దిగివచ్చె నుత్సహించి

583 వ. కురుక్షేత్రమను పేరంబరగు నాయరణ్యంబున నంత

584. చం. ఇరువురు వీరులచ్చట నహీన పరాక్రములై రణంబొన
ర్చిరి వరుసన్ద్రివర్షములు సింహములట్టులఁ బేర్చి; యంతగం
ధరువుని చేతిలో మడిసెఁ దాఁగురువంశ విభుండు; దుఃఖసం
భరితమనస్కులైరపుడు భ్రాతృయుగంబును మాతృదేవియున్

585. కం. గాంగేయు డపుడు వానికి
సాంగమ్ముగఁ గర్మవిధుల జరిపించి యశ
స్సంగుడు విచిత్రవీర్యుని
అంగజ నిభు; రాజ్యమునకు నధిపతిఁజేసెన్

586. ఉ. పేరుకుఁ దమ్ముడే నృపతి; పెట్టని కోటగ నిల్చి ధారుణీ
భారము నెల్ల మోయుచు నవారిత బాహుపరాక్రమంబునన్
వీరుల శత్రురాజులఁ దపింపగఁ జేయుచు భీష్ముడుండ, నా
కౌరవ వంశభూవిభుడు కాలిడె మెల్లగ యౌవనంబునన్

587. చం. అతనికిఁ బెండ్లి సేయవలెనంచుఁ దలంచుచు జాహ్నవీ సుతుం
డతివకునై ప్రయత్న పరుడయ్యెను; నంతట వారణాసిభూ





పతి ప్రకటించె కూతుల వివాహముసేయ స్వయంవరమ్ము; రా
జిత ధరణీశులెల్లరటఁ జేరిరి; చేరెను భీష్ముడున్ వడిన్

588. కం. అంబయు నంబాలికయును
నంబికయన నొప్పువారి నందరుఁ గనుచున్
సంబరమున నను నన్నే
అంబుజముఖి లిపుడు వలతురని తమలోనన్

589. చం. అనుకొను చుండ భూమిపతులట్టుల; దేవనదీ సుతుండు చ
య్యన గ్రహియించి కన్నియల; నడ్డము వచ్చిన ధారుణీశులన్
ఘన భుజ విక్రమంబున కకావికలౌనటు లుక్కడంచి, య
య్యనఘుడు వారలన్ రథమునందిడి తెచ్చె ననంతవేగుడై

590. కం. తమ్ముడు విచిత్రవీర్యున
కిమ్మగువల నిచ్చి పెండ్లి నేనొనరింతున్
సమ్మత మున నని భీష్ముం
దమ్మకు వివరించి యామె యాజ్ఞన్ గొనియెన్

591. ఉ. అంతట విప్రులన్ బిలిచి యాతడు మంచి ముహూర్త మొక్కటిన్
సంతస మొప్ప నిర్ణయము సల్పుడు మీరలటంచుఁ దెల్పి, సా
మంతుల మంత్రి పుంగవుల మాన్యులఁ బెద్దలనెల్లఁ బిల్చి ధీ
మంతుడు భీష్ముడెల్లరకు మన్ననఁ జెప్పెను యోగ్యమౌపనుల్

592. చం. అపుడొకనాడు భీష్ముకడ 'కంబ విచారముతోడవచ్చి, స
త్కృప వినుమయ్య! నే మునుమదిన్ వరియించితి నల్ల శాల్వ భూ
మిపతినిఁ, గాన నాతడె సుమీ యికనాకు మగండు; నామనం
బెపుడునుఁగోరదన్యుల మహీపతులన్ భరతాన్వయాగ్రణీ!

593. మ. అని వేడన్ దివిజాపగా సుతుడు తానయ్యింతి సంప్రార్థనన్
విని ధర్మజ్ఞుల మంత్రి వర్యులను తల్లిన్ గూడి చర్చించి యా
మెను పొమ్మంచు ననుజ్ఞయిచ్చెఁ, గడు సంప్రీతిన్ వడిన్ శాల్వునిన్
గనఁ దానంబయునేగె నంత మది నుత్కంఠాతిరేకమ్మునన్

594. చం. చని యటఁగాంచి యత్తరుణి శాల్వమహీపతికిట్లు వల్కె, నో
జనసుత; పెండ్లియాడుదము సన్మతితో, మన ప్రేమ వృత్తమున్

విని ననుఁబంపె భీష్ముడిటు విజ్ఞతయొప్ప నటంచుఁ దెల్పఁ దా
వినియును శాల్వుడామె యెడఁ బ్రేమ యొకింతయుఁ జూపకిట్లనెన్

595. ఉ. అందరిముందు నిన్నటుల నాతడు భీష్ముడు చేయిపట్టి తా
స్యందనమందు నిల్పుకొని చయ్యన నేగుచునుండ నేమదిన్
గొందల మంది యట్టె కనుగొంటిని; కావున నీకు నాతనిన్
జెందుట పాడి; నేను నినుఁ జేకొన నంచు నిరాకరించినన్

596. మ. కనులన్ గాలువలౌచు బాష్పకణ సంఘాతమ్ము పాలిండ్లపై
వెనువెంటన్ స్రవియింప గద్గద గళావిర్భూత ఖిన్నోక్తులన్
దన దౌర్భాగ్యము నాడుకొంచు నడుగుల్ దట్టాడఁ జిట్టాడుచున్
జనియెన్ భీష్ముని పాలికంబ తన కృచ్ఛ్రంబున్ నివేదింపగన్

597. తే.గీ. వచ్చి భీష్మునిఁ జూచి యవ్వనజనేత్ర
జరిగి నదియెల్ల వివరించి సాంతముగను
నీవె పెండ్లాడవలయు నన్నెట్టు లైన
కానిచో నాకు మరణంబె కార్యమింక

598. మ. అనినన్ భీష్ముడు నవ్వియిట్లనియె నో యంబా! ననున్గోరగాఁ
జననే నాటిప్రతిజ్ఞయున్ గలుగ, నాజన్మంబు నే బ్రహ్మచ
ర్య నిరాయాస హితవ్రతుండ; పురుషుండన్యుండు నీ మానసం
బును దోచెంగద! యెట్టులే పరిణయంబున్ జేతు నీకిచ్చటన్

599. తే.గీ. కాన పుట్టింటి కేగుము కలతమాని
యనిన నవమాన భరమున నంబ యపుడు
విపినముల కేగె తపము గావింపనెంచి
ఎద్ది సాధింప రంగన లెంచి చూడ

600. కం. అంతట విచిత్ర వీర్యుడు
సంతసమునబెండ్లి యాడి సరసిజముఖులౌ
కాంతలనిరువుర; నా భూ
కాంతుడు మరుకేళులందె కాలముఁ బుచ్చెన్

601. కం. రతికేళులందె నిత్యం
బతిసౌఖ్యముఁ జెంది రాజయక్ష్మముతోడన్ (క్షయ)





మృతిఁ జెందెను కురుకుల పతి;
స్థితి మించిన రతి సుఖంబు చేటొనరించున్

602. చం. విలవిలలాడి సత్యవతి విస్తృత పుత్ర వియోగ వేదనన్
కులమిక నంతరించుగద! క్రూరత నవ్విధి యిట్లొనర్చునే!
తిలజల తర్పణంబుల పితౄణముఁ దీర్చెడి వారలేరి? యీ
యలికుల వేణులౌ స్నుషల కప్పుడె చెల్లెనె యైదువన్నెలున్

603. చం. అని విలపించి సత్యవతి యయ్యెడ నొక్క దినంబునందు భీ
ష్ముని తనచెంతకున్ బిలిచి శోకము మ్రింగుచు నిట్లుఁబల్కె నో
యనఘుడ! నీవు శంతనుని యగ్రసుతుండవు ధర్మవేత్తవున్
ఘనుడవు ధర్మమార్గమునఁ గాశ్యపినేలుము రాజువైయికన్

604. ఉ. తమ్ముని భార్యలిర్వురను దద్దయు వేడుకఁ బెండ్లియాడి వం
శమ్మును నిల్పుమయ్య! యిది శాస్త్రములంగల ధర్మమౌను; రా
జ్యమ్మున రాజులేనియెడ సాగవు ధర్మము, లెల్ల పౌరులున్
ద్రిమ్మరుచుందు రిచ్చమెయిఁ దేజముఁ దప్పును రాజ్యలక్ష్మికిన్

605. చం. అనవిని భీష్ముడడ్డముగనప్పుడ శీర్షముఁద్రిప్పి తల్లికిన్
వినయమెసంగఁ బల్కెనిటు వేయును ధర్మము లీవు చెప్పినన్
దనయుడఁ దండ్రికై మును ముదంబునఁ జేసితి నెల్లవారలున్
వినగఁ బ్రతిజ్ఞ; నిప్పుడికవీడఁ ద్రిమూర్తులు వచ్చిచెప్పినన్

606. తే.గీ. అవని నేలంగ నింకనే నాశఁజెంద
బ్రహ్మచర్యంబుఁ బాటింతుఁ బాటవమున
కాన దానికి భంగమ్ము కలుగ నీయ
కమ్మ! చెప్పెద ధర్మమొండాలకింపు
మనుచు భీష్ముండు తల్లితో ననియె నిట్లు

607. తే.గీ. ప్రవిమలాచారు డనుపమ బ్రహ్మతేజు
డైన బ్రాహ్మణునొక్కని నాదరమునఁ
బిలిచి కోడలి నతనితో కలియఁ బంపు
తనయు దుదయింప నతడు క్షేత్రజుడనంగ
నొప్పు, నతనికి రాజ్యమ్ము నప్పగింపు

మమ్మ! వంశమ్ము నిలబడు నతని వలన
నతని యాజ్ఞలనేనును ననుసరింతు

608. మ. అనినన్ సమ్మతమంది సత్యవతి తానాత్మన్ దలంచెన్ మునున్
దనకున్ సన్మునియౌ పరాశరునకున్ ధర్మజ్ఞుడై యుద్భవిం
చిన పుత్రున్ ముని మాన్య వేదవిదు రాశీభూతవిజ్ఞాన రూ
పుని విష్ణుంశభవున్ పురాణకవియౌ పుణ్యాత్ము నావ్యాసునిన్

609. చం. తలచిన యంతనే యజిన దండకమండల హస్తుడౌచు, తా
నిలిచెను తల్లి ముంగల ననింద్యుడు వ్యాసుడు నమ్రశీర్షుడై
వలగొని; యంతసత్యవతి ప్రబ్బిన వేడుక పుత్ర గాత్రమున్
పలుగతులన్ స్పృశించె కరపద్మములన్ బరితోష బాష్పయై

610. తే.గీ. అనల తేజుని మునివరున్ వ్యాసుఁ గాంచి
ఆపగా నందనుడు గౌర వాదరముల
నతనిఁ బూజించి కుశలసంగతుల నడిగె
నంతతల్లియుమెల్లగ ననియెనిట్లు

611. కం. తనయా! నాకోడండ్రకు
తనయులు గల్గకయె స్వర్గ ధామమునకు నా
తనయులు జనిరిక వంశము
కొనసాగ దటంచు మదిని కొఱత గలిగెడున్

612. చం. స్థిరముగ సంతతిన్ గలుగఁ జేయుము తమ్ముని భార్యలందు నో
పరమదయా సముద్ర! యిది భావ్యమునీకని తల్లి పల్కగా
కరమనురాగ చిత్తమున కౌరవవంశ వివర్ధన క్రియా
పరుడయి తల్లిమాటలకు వల్లెయనెన్ మునిచంద్రుడంతటన్

613. ఉ. ఆ తరళాయతాక్షియగు నంబిక యొక్కదినంబునన్ బుతు
స్నాతయునౌట, సత్యవతి చక్కగ నామె నలంకరించి సం
ప్రీతిగ కార్యమెల్ల వివరించి మునీంద్రు పరాశరాత్మజున్
చేతము సమ్మతింపఁ బనిచెన్ వర పౌత్ర ఫలాను రక్తయై

614. తే.గీ. అతని యాకారమును గాంచి యంబికయును
కనులు మూసెను సంగమకాలమందు





అంధుడుదయించు నీయమ కనుచు వ్యాసు
డనియె, సత్యవతియును శోకార్తయయ్యె

615. తే.గీ. అంతగర్భమ్ము ధరియించెనంబికయును
నెలలు నిండగ వ్యాసుండు పలికినట్లె
గ్రుడ్డి వానినిఁ గనియె నా కువలయాక్షి
దైవయోగమ్ముఁ దప్పింపఁ దరమెయెందు

616. అతి దుఃఖమ్మున నంత సత్యవతి యా యంబాలికన్ బంచె నా
యతివర్యున్ గలియంగ, నామెయును నావ్యాసున్ జటాధారునిన్
మతిమంతున్గని వెల్లఁ బాఱుటయు నమ్మౌనీశ్వరుండిట్లనెన్
సుతు డీయింతికిఁ బాండు రోగి కలుగున్ శుద్ధాంతరంగుండునై

617. ఆ.వె. అతడు చెప్పినట్లె యంబాలికకుఁ గూడ
కలిగె సుతుడు పాండు కాయుడగుచు
నిద్దరుండి రాజ్యమేల ననర్హులై
రనుచు సత్యవతియు నాత్మఁ దలచి

618. చం. మరియొక మారు సత్యవతి మానసమందుఁ దలంచి, వ్యాసు స
త్వరమునఁ బిల్వ నాతడును వచ్చినఁ జూచి కుమార! నీవు నా
దరమున చిన్నకోడలికి తప్పక మంచి కుమారు డింకొకం
డిరవుగఁ గల్గునట్టులుగ నిద్ధ చరిత్ర! యనుగ్రహింపుమా!

619. మ. అనినన్ వ్యాసుడు సమ్మతిన్ దెలిపి యయ్యంబాలికాంతః పురం
బునకున్ బోయెను; నామె కాతడన నా మోదంబులేకుండుటన్
తనదాసిన్ బనిచెన్ మునీంద్రుకడకున్; దద్దాసియున్ వేడ్కతో
వినయంబొప్ప సపర్యలన్ సలిపె నావిజ్ఞాన వారాశికిన్

620. కం. వ్యాసుడు సమ్ముద మందుచు
నీ సతికిన్ బుట్టు గొప్ప నీతిజ్ఞుడటం
చా సత్యవతికిఁ జెప్పెన్
వాసిన్ ధర్మాంశ దాసి పడసెను విదురున్

621. కం. అంబిక ధృతరాష్ట్రుని తా
నంబాలిక పాండురాజు నంతట విజ్ఞా

నాంబుధి యౌ విదురుని య
య్యంబాలిక దాసియుఁ గని రాత్మజుల మహిన్

622. కం. ధృతరాష్ట్రాదుల జననము
మతిమంతుడు సూతుడిట్లు మౌనులకెల్లన్
వితతముగఁ జెప్ప వారలు
నతి సంతసమంది యిట్టు లడిగిరి వేడ్కన్

623. తర. సకల సంపద లెల్లవారికి సన్మతిన్ సమకూర్చుచున్
ప్రకటమై పతివక్షమందు నివాసమేర్పడ నిల్చియున్
వికల మానసులైన భక్తుల వేయురీతులఁ బ్రోచు నిన్
ముకుళహస్తుడనై భజించెద మోదమంద సుధాబ్ధిజా!

624 వ. ఇది శ్రీదేవీ కరుణాకటాక్షలబ్ధ విభవుండును కమలాంబా సుబ్బరాయుల ద్వితీయ పుత్రుండును కౌశిక సగోత్రుండును అగస్త్యరాజ వంశోద్భవుండును నగు సుబ్బారావు కవి ప్రణీతంబగు శ్రీదేవీ భాగవతమను మహాపురాణము నందు పురాణ వివరణంబును, వ్యాసుని సంతాన వాంఛ, హయగ్రీవోపాఖ్యానము, మధుకైటభ వధ, కంజజుడొనర్చిన యోగనిద్రాస్తుతియును, సూతుడు శక్తిని స్తుతించుట, శుక మహర్షి జననము, శుకవ్యాస సంభాషణము, శుకమహర్షి మిథిలకేగుట, శుకజనక సంవాదంబును, తారాశశాంకంబును, ఊర్వశీపురూరవ వృత్తాంతంబును, ఇళయొనర్చిన దేవీ స్తోత్రము, ధృతరాష్ట్రాది జననంబును ననుకథలు గల ప్రథమస్కంధము.

**స్వస్తి**





**శ్రీ దేవీ భాగవతము**

# ద్వితీయ స్కంధము

1. కం. శ్రీ కంఠార్ధ శరీరము
శ్రీ కరముగ నాక్రమించి స్థిరముగ నెపుడున్
లోకంబులెల్లఁ బ్రోచెడి
శ్రీకామద నన్నుఁబ్రోచు శ్రీమంతముగన్.

2. ఉ. మంజుల వాగ్విలాస! ముని మాన్య! బుధోత్తమ! మామనంబులున్
రంజిలఁ జెప్పితయ్య ! ధృతరాష్ట్రుడు నాతని తమ్ము లెట్టు లా
కంజ దళాయ తాక్షులకుఁగల్గిరొ యవ్విధ మద్భుతంబుగా
నంజన వేసి చూపినటు లైనను సంశయ మొందుగల్గెడున్

3. ఉ. వ్యాసుని తల్లి సత్యవతి యంటివి, యామెకు నాతడెవ్విధిన్
వాసిగఁ బుత్రుడయ్యె, మఱి పార్థివచంద్రుడు శంతనుండు తా
నాసతి నెట్లుఁ జేకొనియె నాత్మజులిర్వుర నెట్లుఁ బొందె, నా
యాసమటంచు నెంచకివి యన్నియు మాకు నెఱుంగఁ దెల్పుమా

4. చం. అనియడుగంగ సూతుడపుడాత్మ ననంత ముదంబుఁ బొంది నె
మ్మనమున నాది శక్తి నొక మారుఁ దలంచి దయార్ద్ర చిత్తుడై
మునివరులారా! మీరు కదు పుణ్యచరిత్రులు మీకుఁ జెప్పగా
ననయము సంతసింతు, వినరయ్య! యెఱుంగగఁ దెల్పుదంతయున్

5. కం. ఏదో యొక నెపమున నా
శ్రీదేవిన్ మదినిఁ దలప సిరులొనగూడున్
మోదమ్మున వాక్ శక్తియుఁ
బ్రోదిగ సర్వార్థములను బొందు నరు డిలన్

6. శా. ధర్మాత్ముండును, సత్యసంగతుడు, ప్రత్యర్థి క్షితీ శాటవీ
నిర్మూలోగ్ర కుఠారుడున్, విబుధ సన్మిత్రాభి వంద్యుండు, స
త్కర్మాధిక్యుడు చేది భూమిపతి ప్రఖ్యాతంబుగా రాజ్యమున్
నైర్మల్య స్థితి నేలు చుండె "వసు" వానందంబుఁ బొందన్ ప్రజల్

7. కం. ఆతడు తప మొనరించెను
బ్రీతిన్ యమ నియమ విధుల ఁబెక్కేండ్లంతన్

జేతమ్మున నలరి మఘువు
దాతత మహిమంబు వ్యోమయానం బొసగెన్

8. ఆ.వె. ఆ విమాన మెక్కి యత దూర్ధ్వలోకాల
సంచరింప నుపరిచర వసువన
నొప్పె; నింద్రుడతని కొయ్యన మిత్రుడై
యుంట, దివ్య భోగయుతుడు నయ్యె

9. కం. సుర గరుడోరగ కిన్నర
నరకాంతలు సాటిరారు నలినాక్షి కటం
చరుదుగ నెల్లరుఁ బొగడగ
గిరిపుత్రిక భార్యయయ్యె గిరిక యతనికిన్

10. కం. వారికి నేవురు పుత్రులు
ధీరులు జన్మించి రమిత తేజోయుతులై
భూరమణుడు వేర్వేరుగ
వారికి రాజ్యమ్ములిచ్చె ప్రాభవమొప్పన్

11. ఉ. ఆ తరళాక్షియౌ గిరిక హాసవిలాస ముఖాబ్జయున్ ఋతు
స్నాతయు నొక్కనాడు నిజ నాథునిఁ గాంచి మదీయ వాంఛితం
బీతటి దీర్పు మంచుఁగడు నింపును సొంపును గుల్క వేడినన్
భూతల నాథు డయ్యతివ పోడిమి కెంతయు మోద మందుచున్

12. మ. మదనక్రీడకు నై ప్రయత్న మొనరింపన్ బోవు నా భూపతిన్
ముదమొప్పన్ గని తండ్రి యిట్లనె వనంబున్ జొచ్చి నీవిప్డు నా
మదికిన్ సంతస మౌనటుల్ మృగములం బంధించి తెమ్మోసుతా!
పదిలంబై పితృ కార్యమున్ సలుపుదున్ వానిన్ నియోగించుచున్

13. అనిపలికిన

14. మ. వసురా జంతటఁ దండ్రిమాట వినుటే భావ్యంబుగా నెంచి, వా
యుసమంబైన రయంబునన్ వెడలి యయ్యోషా వపు స్సంగమం
బు సతంబున్ మదిలోఁ దలంచుచు వనంబున్ జొచ్చె వేటాడగన్
వెస నంతన్ స్ఖలియించె భూమి పతికిన్ వీర్యంబవశ్యంబుగా





15. తే.గీ. ఆత డంతట నొక మఱ్ఱియాకునందు
వీర్యమున్ బట్టి గట్టిగా బిగియఁ గట్టి
తాను పెంచెడి శ్యేనమున్ దరికిఁ బిల్చి
విషయ మంతయు వివరించి వేగిరమున

16. తే.గీ. నిముసమైనను నెచ్చోట నిలువకుండ
దీనిఁ గొనిపోయి గిరికకుఁ దెలియఁ జెప్పి
యిచ్చిరమ్మంచుఁ బంపె భూమీశుడంత,
నదియు నట్టులె చనుచుండ నాకసమున

17. మ. ఎదురైవచ్చిన శ్యేన మింకొకటి తానీ పొట్లమున్ గాంచి య
య్యది మాంసంబని యెంచి చంచువులతోనద్దాని లాగన్ వడిన్
విదళింపంబడి పత్ర మంతటఁ బడెన్ వీర్యంబుతోడన్ గడున్
పదిలంబై యమునా నదీ పరమ భవ్యంబైన తోయంబులన్

18. మ. సరిగా నంతకు పూర్వమే యొకడు భాస్వత్తేజు డౌబ్రాహ్మణుం
డిరవారం దగ సంధ్య వార్చుటకునై యేతెంచి యర్ఘ్యంబిడన్
కరముల్ మోడ్చి నిమీలి తాక్షుడయి మోకాల్బంటి యౌ నీటిలో
తిరమైయుండగ నొక్కయింతి యట కేతెంచెన్ జలక్రీడకై

19. ఉ. అచ్చరయైన యయ్యతివ యద్రిక నాఁబడు; నీటియందు ని
ర్మచ్చరుడైన విప్రుఁగని మౌనముగాఁ జని వానిపాదముల్
చెచ్చెరఁ బట్టి లాగుచు హసించిన, విస్మయ సంభ్రమమ్ములున్
హెచ్చగ నప్పులన్ గనె మహీసురు డా జలజాయతేక్షణన్

20. కం. కని కోపించుచు విప్రుడు
వనితా! నీ విట్లుసేయ పద్ధతియౌనే
చనుమిక మీనంబ వగుచు
ననయము జలముల వసింపు మని శాపమిడెన్

21. చం. భయమున నంత నద్రికయు బ్రాహ్మణునింగని యోమహాత్మ! నే
నియమముఁదప్పి మీ యెడల నింద్యముగా చరియించి తయ్య! నన్
దయఁగను మయ్య! శాపమును దాల్చి జలంబుల మీనునై యెటుల్
నియతి చరింతు నింక కరుణించి వచింపుము ముక్తి యెన్నడో

22. తే.గీ. అనిన నాతడు శాంతించి యామెఁ జూచి
కాలమొక కొంతయట్టుల గడచినంత
మనుజశిశువుల కవలలఁ గనెదవీవు
అంత శాపమ్ముఁ దొలగు పొమ్మంచుఁ బలికె

23. ఉ. శాపవశంబునన్ వనిత చయ్యన మీనము రూపు దాల్చి, ది
వ్యాపగ నట్టు నిట్టుఁ దిరుగాడుచు నీటనుఁ దేలుచున్న యా
భూపతి వీర్యమొక్కటన పుక్కిటఁ బట్టుక మ్రింగివైచి తా
నాపయిఁ దాల్చె గర్భమును, నంతఁ గ్రమంబున నిండె మాసముల్

24. ఉ. అంతట మత్స్యకారు డొక డానదియందు వలన్ బిగించి యా
చెంతనె యుండ శాపమున చేపగ మారి చరించుచున్న నా
యింతియుఁ జిక్కె జాలమున; హెచ్చిన వేగముతోడ నాతడున్
సంతస మంది దానిఁ గొని చక్కగ నింటికి నేగి యాపయిన్

25. తే.గీ. వంట చేయుటకై సిద్ధ పడుమటంచు
భార్యకున్ జెప్పి మీనమున్ బట్టియతడు
చీల్చ నంతట నిరువురు చిన్న పిల్ల
లాఁడబిడ్డయు మగబిడ్డ లందు నుండ

26. వ. అద్రికయు తన నిజరూపంబు ధరించి స్వర్గంబున కరిగె నంత

27. ఉ. అచ్చెరు వంది జాలరియు నాకవలన్ గొని రాజునొద్దకున్
జెచ్చెరఁ బోయి యంతయును జెప్పి యొసంగిన; దాశరాజు తా
మెచ్చుచు వారి నిర్వురను మెల్పున గైకొని నిత్యమున్ గడున్
మచ్చిక ఁ బెంచుచుండె నణుమాత్రము తక్కువలేక ప్రేముడిన్

28. తే.గీ. కాళి, మత్స్యోదరియు, మత్స్యగంధి యనగ
నామముల నొప్పె కూతురౌ నలిన నేత్ర
మత్స్యరాజను పేరును మానితముగ
కొడుకునకిడి పెంచె మిగుల కూర్మితోడ

29. కం. ఇరువురను కన్న బిడ్డల
సరణిన్ గని దాశరాజు సతతము వారిన్
పరిపోషణ మొనరింపగ
తరుణ వయో విభవులైరి తనుకాంతులతో

30. ఉ. చందురుఁ బోలు మోము; గడు సన్నని కౌనును వల్దచన్నులున్
మంద మరాళయానమును, మాటల మార్దవ మొప్పుచుండ నా
యందముఁ జూచు వారి వివశాత్ములఁ జేయగఁ దాను నెంతయున్
పొందిక మత్స్య గంధి యటఁ బొల్చెను యౌవన మంకురింపగన్

31. తే.గీ. మత్స్య కారుల వంశపుం బ్రభువు దాశ
రాజు నిత్యమున్ బాంధుల నోజ తోడ
యమున దాటించు పడవ నాయత్తపరచి
యదియె వృత్తిగఁ జేపట్టి ముదము తోడ

32. తే.గీ. మత్స్యగంధియు తండ్రి పాల్మాలినపుడు
తాను పడవను నడపుచుఁ దగినయట్లు
సాయపడుచుండుఁ దండ్రికి సంతసమున
సద్గుణంబుల రాశి యీ చానయనగ

## వ్యాసమహర్షి పుట్టుక

33. మ. ఒక మధ్యందిన వేళ నాయతివ తానుత్సాహముప్పొంగగన్
ప్రకటంబైన నదీ తటంబున భుజింపన్ గోరు చున్నట్టి య
య్యకలంకుండగు దాశరాజు కొఱకై యన్నంబు వడ్డించుచున్
చికురంబుల్ సవరించు కొంచుఁ దనరెన్ శీతాంశురేఖాద్యుతిన్

34. ఉ. ఆ సమయంబునన్ మునివరాగ్రణి యైన పరాశరుండు సం
భాసిత దివ్యతేజుడు తపః పరిశుష్క శరీరుడున్ జటా
భాసుర శీర్షు డీభువిని పావన తీర్థములెల్లఁ జూచుచున్
వాసిగ వచ్చె నయ్యమున వైళమ దాట దలంచి వేడుకన్.

35. తే.గీ. వచ్చి దాశరాజునుఁ జూచి పల్కెనిట్లు
వేగమే నేను నది దాటి వెళ్ళవలయు
నవసరంబైన కార్యార్థ మరుగు చుంటి
అవలి యొడ్డుకుఁ జేర్చు కాదనక నన్ను

36. చం. అనియదుగన్ భుజించు సమయంబున లేచుట పాడిగాదు కా
వున మునివంద్యు నీపరమ పూజ్యుని నావలి యొడ్డుఁ జేర్చి ర
మ్మనుచును దాశరాజు తనయన్ గని పల్కగ నామెయున్ ముదం
బునఁ గొని పోయె నమ్మునిని పొల్పుగ నవ్వలి గట్టుఁ జేర్చగన్

37. తే.గీ. పడవ గెడవేసి చక్కగా నడపు చుండె
తరుణి నవ యౌవనాంగి యత్తమ్మి కంటి
వాలుచూపులు మదనుని వాడి తూపు
లట్లు మునివరు నెడద వ్రయ్యంగఁ దాక.

38. తే.గీ. ఒడలు పులకించె తొందర పడియె మనసు
మెల్ల మెల్లగఁ జేరి యా మెలత కడకు
నామె దక్షిణ హస్తాబ్జ మట్టె పట్టె
తనదు దక్షిణ హస్త పద్మమ్ముతోడ

39. ఉ. ఆమెయు నా పరాశరుని యధ్యవసాయ మెఱింగి నవ్వుచున్
స్వామి! యిదేమిటయ్య! మిము వంటి మహాత్ముల కిట్టి కార్యముల్
సేమముఁ గూర్చునే ముని వసిష్ఠుని వంశము మీది; మీకు నీ
కామ వికారముల్ దగునె! కన్యను నన్నిటుఁ గోర ధర్మమే!

40. చం. చదివితి వన్ని శాస్త్రములు సాత్త్వికమైన తపం బొనర్చి తీ,
వదియునుఁ గాక భూసురుడ వార్యనుతుండ వనార్యకృత్యముల్
మదిఁ దల పోయగాఁ దగునె మాన్య చరిత్ర! పవిత్రమైన మీ
హృదయము మెచ్చగాఁ దగిన హెచ్చు గుణంబులవేవి నాయెడన్

41. తే.గీ. మత్స్యగంధిని నేను నామాట వినుము
తగదు మీ కిట్లు కోరుట తాప సేంద్ర!
అనుచు పల్కిన వినిపించు కొనకయతడు
చేయివదలక యింకను చేరువయ్యె

42. చం. కరమును బట్టి యాతడటు గ్రన్న సమీపముఁ జేరుచుండ, నా
సరసిజ నేత్రి భీతిలె; నిజంబుగ నావయుఁ దల్ల క్రిందులై
దొరలు నితండు నీటయని దోపగ నాతనిఁ జూచి సుంత సు
స్థిరముగ నుండు మల్లదె నదీతట మచ్చట కేగునంతకున్





43. అని మత్స్య గంధి పలుకగ
ముని వరుడును సంతసించి ముదిత మనంబున్
తనకను కూలంబని నె
మ్మనమునఁ దలచుచు విడిచె కమలదళనేత్రన్

44. తే.గీ. పడవ దరిఁ జేరి నంతనే తడయ కతడు
మరల గట్టిగఁ బట్టె నమ్మగువ కరము
భీత హరిణమ్ము భంగి తా బెగడువడుచు
నతనిఁ గని యిట్లు పలికె నయ్యలరుఁ బోడి

45. చ. తగునె మునీంద్ర! మీరలిటు ధర్మముఁ దప్పుట, కామసంగతుల్
దగును సమాన రూపులకు; తాపస వర్యులు మీరు విప్రులున్
జగతిఁ బ్రసిద్ధ లిట్టు లొక జాలరి కూతును మత్స్య గంధియౌ
మగువను కోరుటెల్ల నవ మానమటంచుఁ దలంపరేలొకో!

46. చం. అని యనినంతనే మునియు నామె శరీరము నందు నింపుగన్
దన దగు దివ్య శక్తి మృగనాభి పరీమళ మంకురింపగా
నొనరిచె; యోజనమ్ము వర కొప్పుగ గంధమువిస్తరించుటన్
వనితయు నంత భాసిలె ధ్రువంబుగ యోజనగంధి నా ధరన్

47. చం. మదనుడు తొందరింప ముని మాన్యుడు దగ్గఱి మేను మేనితో
గదియగఁ జేయ నామెయును కన్నుల సిగ్గుల మొగ్గలల్లుచున్
నదికటువైపుఁ జూచి వదనం బొకయించుక యెత్తి మెల్లగన్
మృదుమధురోక్తులన్ బలికె మెల్పున నమ్మునిఁ! జూచి యిట్టులన్

48. చం. దినకరు డస్తమింపడు, నదీతట మందదె తల్లి దండ్రులున్
గనెదరు, లోక మెల్లయును గన్పడు చున్నది, సుంత యాగుమో
మునివర! మానవాళికిని మున్నువిధించిరి రాత్రి వేళలం
జను రతియంచు, పక్షి పశుజాతులకెల్ల పగళ్ళుఁ గావునన్

49. కం. అనియామె పలికినంతనె
విను వీధిన మంచుతెరల వెసఁగల్పించెన్
మునివరు, డంతట నెల్లెడ
నొనరగ చీకట్లు ముసరె నొగి నద్భుతమై

50. తే.గీ. ఇంక నాలస్యమెందుకే యిందు వదన
నీవు కోరిన యట్టుల నింగియెల్ల
మంచుఁ గల్పించితిని రాత్రియంచుఁ దోప
ననుచు ముని పల్క నామెయు ననియెనిట్లు

51. చం. మునివర! నేను కన్నియను ముద్దును ముచ్చటఁ దీరినంతనే
చనెదరు మీరు తాపసులు సజ్జన మాన్యులు, నాదు దేహమం
దనయము వచ్చు మార్పుల ననంతరమేమని చెప్పు కొందు నా
జనకునకున్ మదంబకును సమ్మతి యోచనఁ జేయుడింతయున్

52. మ. అనినన్ దాపసవర్యుడిట్లనియె నోయబ్జాననా! భీతిలం
బనిలే దింతయు నీకుఁ గన్నె ఱికమున్ భంగమ్ము గాకుండ, మ
న్నన నిన్నెల్లరుఁ జూచునట్లు మన వైనం బన్య లెవ్వారలున్
గన లేనట్లు వరంబొసంగితిని యింకన్ గోరు మెద్దానినేన్

53. కం. ఇచ్చెదనని ముని పల్కగ
నచ్చిక నీయట్టి సుతుని నాకిమ్మిక నీ
విచ్చిన శరీర సౌరభ
మచ్చుగ చిఱకాల ముండు నటు వరమిమ్మా!

54. చం. అనిన "తథాస్తు" టంచు ముని యామెను జూచి సుతుండుఁ గల్గు నీ
కనితర బుద్ధిశాలి వినయాన్వితు డంబుజ నాభు నంశతో,
మనమున శంకవీడు మిక; మన్మథ బాణ పరంపరల్ మదిన్
ఘనముగ నాటు చున్నయవి కాదన బోకుము నాదుకోరికన్

55. ఉ. చూచితి నప్సరాంగనల సోయగముల్ పలుమారు లైనచో
నే చలియింప నెన్నడును; నిన్నిటుఁ జూచిన యంత చిత్రమై
తోచుచు నామనంబు మరు తూపులచే పరితాప మొందె; న
న్నోచపలాక్షి! నీదు మధురోక్తులతో మురిపింపఁ జేయవే,

56. తే.గీ. దైవ వినియోగ మిదిగానఁ దపసినైన
నాకు మోహమ్ము గల్గెనో నలిన నేత్రి!
యిద్ది దురతిక్రమము సంశయింపఁదగదు
శంక వీడుము నామాట సత్యమింక





57. కం. వేదమ్ముల విభజించును
మోదమ్మున బహుపురాణముల రచియించున్
వేదవ్యాసుండనగా
సాదరమున నీ సుతుండు సద్యశమందున్

58. చం. అనియిటు లా పరాశర మహాముని యయ్యమ కోర్కెలెల్ల కా
దనక యొసంగ; నామెయు ననంత ముదంబును బొంది యానతా
ననశశి బింబమందు చిరునవ్వుల మొగ్గలు చిందులాడ న
మ్ముని వరు కౌగిటన్ గదిసె పొందిక నంగజకేళి కొప్పుచున్

59. చం. ముసరిన మంచు చీకటులఁ బొల్పగు నిర్మల సైకత స్థలిన్
గుసగుస లాడు కొంచు మునికుంజర యోజన గంధు లిర్వుర
య్యసమ శరాను రాగ వివశాత్మయుతుల్ రతి కేళి సల్పుచున్
మసలిరి సాధులోక బుధ మాన్యుని జన్మకు హేతుభూతులై

60. ఆ.వె. అంత కొంత వడికి నా పరాశరముని
పరవశాత్మయైన పడతిఁ జూచి
వీడు కోలు సలిపి వెళ్ళిన యంతనే
యుద్భవించె పుత్రుడువిద కపుడు

61. తే.గీ. మూడు మూర్తుల తండ్రినిఁ బోలి సుతుడు
పెరిగి పుట్టిన యంతనే పెద్దయయ్యె
విష్ణునంశమ్ముతోడ సద్వినుతుడగుచు
అసితవర్ణమ్ము గల్గి తాపసుని భాతి

62. చం. అంతట నాసుతుండు వినయమ్మునఁ దల్లికి మ్రొక్కియిట్లనెన్
చింతిల కమ్మ నే తపము సేయగ వెళ్ళుచునుంటి; నీవు నీ
యంతట యింటికేగు, మెపుడైనను నన్ స్మరియించితేని నీ
చెంతన వ్రాలుదున్ శుభము సేకుఱుగావుత! మంచుఁ బల్కుచున్

63. చం. వికసిత మాన సాబ్జుడయి వేగమె తల్లిని వీడుకొంచు తా
చకచక వెళ్ళె పుత్రుడును; చయ్యన మంచు తెరల్ దొలంగుటన్
బ్రకటితమయ్యె వెల్గులు; సరాసరి యోజనగంధి తండ్రిచెం
తకుఁజనె నావనెక్కివెస; దైవనియోగము లెంత చిత్రముల్

64. కం॥ ద్వీపంబున బుట్టుటచే
ద్వైపాయనుడనియుఁ గృష్ణవర్ణుడు గానన్
ద్వాపర యుగమునఁ గృష్ణ
ద్వైపాయను డనగనొప్పె ధర్మనిరతుడై

65. మ॥ తిరిగెన్ దాపస చిత్తవృత్తుడగుచున్ దీర్ఘంబులున్ క్షేత్రముల్;
స్థిర సత్వంబున సత్తపం బొనరిచెన్ జిన్మూర్తి యై పాదపో
త్కర దుర్గాటవులందు నిశ్చలమతిన్; ధర్మజ్ఞుడై విస్తృత
స్ఫురణన్ వెల్గెడి వేదసంహితలఁ బొల్పొందించె వేర్వేరుగన్

66. కం॥ వేదములను విభజించుట
వేద వ్యాసుండనంగ విఖ్యాతుండై
మేదిని చిరయశముఁ బడసె
భూ దేవులు దివిజ వరులు పొగడ నెగడుచున్.

67. మ॥ అటుపై పెక్కు పురాణముల్ సకల ధర్మార్థ ప్రదీప్తంబులన్
పటుచాతుర్య కవిత్వ వైఖరులతో వ్రాసెన్ జగత్ శ్రేయముల్;
స్ఫుటమై భారత సంహితన్ భువిపయిన్ బొల్పొందగాఁ గూర్చి, ది
క్తటముల్ నిండగఁ జేసె సద్యశము విద్వన్ముఖ్య సంభావ్యమై

68. కం॥ తన శిష్యు లైదుగురకున్
తనయుండౌశుక మునికిని తగ నేర్పించెన్
ముని వర్యుం డా వ్యాసుడు
తన చే విరచింపఁ బడిన తత్తత్ కథలన్.

69. వ॥ అంతట వ్యాస శిష్యులగు సుమంత, జైమిని, పైల, వైశంపాయన, అసిత, దేవలులు లోకమందీ ధర్మమ్ములనెల్ల ప్రచారముగావించిరని చెప్పి సూతుండు శౌనకాది మహర్షులఁ జూచి మరియు తానిట్లనియె.

70. ఉ॥ యోజన గంధి పుట్టుకయు, నొ ప్పుగ వ్యాస సముద్భవంబు న
వ్యాజ గతిన్ గరమ్ము హృదయంబుల కెక్కగఁ జెప్పినాడ; నీ
యోజన గంధియే పిదప నుర్విని సత్యవతీ వరాఖ్య వి
భ్రాజితయై వెలింగెఁ గురు వంశముఁ జొచ్చి జగత్ప్ర సిద్ధిగన్





71. ఉ॥ వీరల పుట్టుకల్ మరియు వీరి చరిత్రలు విన్నయంత దు
ర్వారము లౌచు సంశయ పరం పరలెల్ల మనంబులందు సం
చారము సేయు మీకు, నది సత్యమెయైన; మహాత్ములైన య
వ్వారలఁ గూర్చి తర్కములఁ బాసి గుణంబులఁ జేకొనన్వలెన్

72. కం॥ కారణ జన్ములు వారలు
నేరములని యెంచఁదగదు నియతాత్ములకున్
వీరల చర్యల నిల సా
ధారణ ధర్మములతోడఁ దగ దుపమింపన్.

73. కం॥ ఈ యాఖ్యానము నెవ్వరు
పాయక చదివినను వినిన వారలకెల్లన్
ప్రేయంబులు శ్రేయంబులు
శ్రీయుతముగ గల్గు ధరణి చిర కాలంబున్

74. ఉ॥ సూతుని మాటలన్ వినిన సూరివరేణ్యులు శౌనకాదులున్
చేతములుల్ల సిల్ల ప్రవచించెడి యా మునివర్యుఁ జూచి యో
శీతకరాభ తేజ! కురుసింహుడు శంతనుడెట్లు తాను సం
ప్రీతివహించి సత్యవతిఁ బెండిలి యాడెను మత్స్యకన్యకన్

75. చ॥ అదియును గాక భీష్ముడన నాతని కగ్రసుతుండు మున్ను స్వ
ర్ణదికి జనించె నంచు నొక నాడెపుడో యెఱిగించి యుంటి, వ
య్యది యటులుండ భూపతిగ నగ్రసుతుండగు తాను గాక స
ముద్రమున మత్స్య గంధి ప్రియ పుత్రుల రాజులఁ జేసె. నేలొకో?

76. ఉ॥ సాత్యవ తేయు లిర్వురును స్వర్గముఁ జేరినమీద తత్సతుల్
సత్యవతీసుతాగ్రజుని సంగమమున్గొని పుత్రసంతతిన్
ప్రత్యయమున్ దలంపకయె వక్రగతిన్ బడయంగనేల? సాం
గత్యమునెట్లు సల్పె పరకాంతలతో ముదమార మౌనియున్?

77. కం॥ అని శౌనకాదులడుగన్
ముని వర్యుడు మోదమంది ముని పుంగవులన్
గనియిట్లు పలికె వారల
మనములఁ గల సందియముల మాయింప నొగిన్

## గంగా శంతనుల చరిత్ర

78. మ॥ ధర నిక్ష్వాకు వరాన్వయంబున మహా ధర్మాత్ముడున్ నిత్య స
చ్చరితుండైన "మహాభిషుండు" మును నిష్ఠన్ వాజపేయంబులన్
జరిపించెన్ శత సంఖ్య, నంతట సహస్రం బశ్వమే ధంబులన్
వరుసన్ సల్పి సురేంద్రు మెప్పు వడసెన్ బ్రత్యర్థి రుద్రుండనన్

79. మ॥ అమరేంద్రుండొసగెన్ మహాభిషున కత్యంతాత్మ సంతుష్టుడై
సుమనోలోకనివాస మంత; నతడున్ శోభిల్లె నాకమ్మునం
దమరానీకముఁ గూడి దివ్యమగు సౌఖ్యంబుల్ గడున్ బొందుచున్
గమనీయంబుగ వత్సరంబులిటు సాగన్ గొంత కాలానకున్

80. చం॥ కమల భవున్ గనంగ మది కాంక్ష జనింప మహాభిషుండు తా
నమరులఁ గూడి యొక్క దినమందు దివంబున నుండి సత్యలో
కమునకు నేగె, నంత సురగంగయు నచ్చటి కేగు దెంచె నా
సమయమునందె తామరస సంభవుఁ గొల్వ మదిం దలంచుచున్

81. కం॥ సురకరువలి తాకుటచే
సురనది కపు దంశుకమ్ము చ్యుతమై నంతన్
సురలెల్ల చూడ నొల్లక
పరువడి తమ ముఖము లెల్ల ప్రక్కకు ద్రిప్పన్

82. శా॥ సంకోచింపక నామహాభిషుడు తత్ సౌందర్యమున్ గాంచుచున్
పొంకంబైన తదీయ దేహరుచికిన్ మోహాత్ముడైయుండ నా
పంకేజాక్షియు నద్ధరాధిపుని రూపంబున్ మదిన్ మెచ్చి ని
శ్శంకన్ జూచుచునుండె మన్మథ శరా సారంబు వేధించగన్

83. మ. అటులన్యోన్యముఁ జూచుకొంచు నిజదేహాధ్యానముల్ వీడి;వి
స్ఫుట రాగోదయ భావముల్ దనర నచ్చో నిల్చి యున్నంత ను
త్కట కోపంబునఁ జూచి యబ్జభవుడంతన్ వారి నుర్వీస్థలిన్
పటిమన్ మానవులై జనించుడని శాపం బిచ్చె నుద్వేగుడై

84. తే.గీ. ఆ మహాభిషుండంతట నవనియందు
పూరు వంశమ్మునం బుట్టి పొందె యశము





గంగయును నంత మానవాకార మొప్ప
ధరణి వసియింప మనమునఁ దలచుచుండె

85. తే.గీ. వసువు లెనిమిది మంది యాకసమునందు
అంగనలఁ గూడి స్వేచ్ఛా విహారములను
సల్పు చుండగ నొక నాడు సన్ము నీంద్రు
డగు వసిష్ఠ మహాముని యాశ్రమమున
కరిగిరెల్లరు మునియు లేడచట నపుడు

86. వారలలో ప్రభాసుడను వాని సతీమణి యాశ్రమంబునం
జేరువ నొక్క ధేనువును చెన్ను దలిర్చెడు దానిఁ జూచి వి
స్ఫారిత చిత్తయౌచు తన భర్తకుఁ జూపుచు ధేను వద్ది యె
వ్వారిదొ? తెల్పుమయ్య! కడు బంధురమై మదికింపునింపెడున్

87. మ॥ అనినన్ జూచి ప్రభాసు డిట్లనియె దివ్యంబైన యా ధేను వ
య్యనఘాత్ముండు వసిష్ఠ మౌనిదగు భవ్యంబైన తత్ క్షీరముల్
తనియన్ ద్రావిన వారి కాయువులు నిత్యంబైన తారుణ్యమున్
ఘనమౌ బుద్ధియుఁ గల్గునంచు పలుకన్ గంజాక్షి తానిట్లనెన్

88. కం॥ నా కిష్ట సఖి యుశీనర
భూకాంతుని పుత్రిగలదు భూరిజరా రో
గాకులయై మృత్యువుతో
నేకీ భావంబుఁ జెంద నెన్నుచు దినముల్

89. శా॥ దీనిన్ వత్సముతోడ గైకొని కడున్ దీనస్థితిన్ మృత్యు విం
కేనాడోయని చూచు నా చెలికి నేనియ్యంగ నెంతున్ మదిన్
గానన్ మీరలు దీనిఁ బట్టుకొని వేగన్ రమ్మటంచున్ బతిన్
దా నంభోరుహనేత్రి వేడ నతడంతన్ దత్ప్రయత్నంబునన్

90. ఉ॥ తక్కిన వారికెల్లరకుఁ దద్విధమున్ దెలియంగఁ జెప్ప వా
రుక్కివ మంచు నెంచక మదో ద్ధరులై వడిఁ బట్టి ధేనువున్
చక్కగ వత్సమున్ గొనుచు చయ్యన వెళ్ళిరి, మౌనివర్యుడా
ప్రక్కన పూలు పండ్లు గొని వచ్చుటకై జనియుండె నయ్యెడన్

91. ఉ॥ అంతట కొంతసేపటికి నమ్ముని వచ్చి నిజాశ్రమంబునం
దెంతయు ముద్దు ముచ్చటల నింపొనరించెడి కామధేనువున్
గంతులువేయు వత్సమును గానక కొండలుకోనలున్ గుహల్
సుంత విరామమేమియును చూడక తా వెదకెన్ వసిష్ఠుడున్.

92. చా॥ వెదకియుఁ గానలేక కడువేసరి యాశ్రమ భూమిఁ జేరి తా
కదలక ధ్యాన మగ్నుడయి కాంచెను గోవును దానివత్సమున్
బెదరక తస్కరించుకొని వెళ్ళెడి దేవగణంబులన్ ముదం
బొదవగ వారి వెంటఁ జనుచుండెడి పత్నుల యోగదృష్టిచే

93. ఉ॥ కాంచి వసిష్ఠుడంత తమకంబున వారల నెల్లఁ బృథ్వి జ
న్మించు డటంచు శాప మిడియెన్; విషయమ్ము నెఱింగి వారలున్
మించిన భీతిచే వడకు మేనులతో నతశీర్షులౌచు నా
సంచిత పుణ్యకర్ముడగు సన్ముని చెంతకుఁ జేరి మ్రొక్కుచున్

94. శా॥ మాతప్పున్ క్షమియింపుమయ్య భువి జన్మంబంది కష్టమ్ములం
బ్రీతిన్ బొందగఁ జాలమయ్య యవధిన్ మీరల్ ప్రసాదింపుడీ
నీతిన్ దప్పి చరింపమింకనని మౌనిన్ వేడగా నాతడున్
చేతో మోదముఁ జెంది శాపమునకున్ జెప్పెన్ విముక్తిన్ దయన్

95. తే.గీ. శాపవశమున భూమిపై జన్మమెత్తి
వత్సరమ్మున కొక్కరు వరుస మీరు
ముక్తిఁ బొందెద, రీ కార్యమునకు ముఖ్య
కారకుడు ప్రభాసుడు చిరకాల మవని
యందె యశమువడసి యంతఁ బొందు ముక్తి

96. చం॥ అనియిటు వారికెల్లరకు నమ్ముని వర్యుడు శాప మోక్షమున్
వినిచిన నొక్కవత్సరము పృథ్వి జనించి వసించు టెట్టులో
యనుచుఁ దలంచుచున్ వసువు లయ్యెనమందుగు రప్డు దీనులై
వెనుకకు నేగు చుండ వినువీథిన గంగను గాంచి ముందటన్

97. చం॥ చనియట వారలెల్లరును జాహ్నవి చెంతకు నేగి మ్రొక్కుచున్
మునివరు శాపముందెలిపి మోదముతో నమృతాశనంబునన్





దినములు పుచ్చు మేమెటుల దీనులమై పృథివీతలంబునన్
మనగలమమ్మ సౌఖ్యములె మానవజన్మలు కష్ట మూలముల్

98. ఉ. నీవు విధాత శాపమున నేల పయిన్ నివసింప నెంచుచున్
బోవుట మే మెఱుంగుదుము పున్నెము గట్టుము, మాకు మోక్షమున్
నీవె యొసంగ వేడెదము నెట్టన నొక్కొక యేడు మేము మీ
పావన గర్భమందు భువిపై జనియింతుము మమ్ము నంతటన్

99. కం. పుట్టిన వారిని పుట్టిన
యట్టుల నీజలములందు నను కంపమెయిన్
నెట్టుము పాపంబని యే
పట్టున తలపంగవలదు పంకజనేత్రా!

100. కం. అనివేడిన గంగమ్మయు
తన మనమున సంతసించి తత్ ప్రార్థనముల్
దనరగ నెర వేర్చెదనని
యనినన్ వసుగణము దివికి నరిగె ముదమునన్

101. మ. పురు వంశోద్భవు డౌ ప్రతీపుడు ధరన్ బుత్రార్థియై జాహ్నవీ
వరతీరమ్మునఁ గూరుచుండి ద్యుమణిన్ బ్రార్థించుచుండంగ సుం
దర రూపమ్మున నొక్కయింతి యటకున్ ధైర్యమ్ముగా వచ్చి యా
నరపాలోత్తము దక్షిణోరువున విన్నాణంబుగా గూర్చొనెన్

102. ఉం. అంతట నాప్రతీపనృపు డచ్చెరువందుచు సుందరాంగి యౌ
యింతిని గాంచి నీ వెవతె విట్టుల నా తొడపైన స్వేచ్ఛమై
సుంతయు తారతమ్యమును జూడక కూర్చొన నేమి కారణం
బింతటి సాహసమ్ము తగునే నిను బోంట్ల కటంచుఁ బల్కినన్

103. తే.గీ. దివిజ గంగను నేను నిన్ బ్రవిమలాత్మ!
వలచి వచ్చితి కాదనవలదు నన్ను
స్వీకరింపు మటంచు సుస్మిత ముఖాబ్జ
యౌచు నయ్యింతిపలుక నయ్యవని విభుడు.

104. ఉ. అచ్చెరువంది యిట్లనియె నన్నర పాలుడు మచ్చె కంటితో
పొచ్చెపు పల్కు లేమిటికి పొల్తిరొ! యిట్లన నీకుఁ జెల్లు నే

యచ్చుగ దక్షిణోరుతల మందున నెక్కితిగాన నీవు నా
కచ్చము కూతువో మరియు నాత్మజు భార్యవొ యౌదుగావునన్

105. చం. ఒనరగ నాకు నొక్క సుతుడుద్భవమందిన వానికిన్ దగన్
వనరుహనేత్రి! భార్యవయి వంశము వర్ధిలఁ జేయుమమ్మ, నీ
వొనరిచినట్టి పూర్వ సుకృతోన్నతినైనను నాకుఁ గల్గు బో
తనయుడు సద్గుణాంచితుడు తప్పదు శంక యొకింత లేదికన్

106. కం. అనిపల్క సుందరాంగియుఁ
జనియెను నిజవాసమునకు సమ్మతి తోడన్
జనపాలు డా ప్రతీపుడు
తనతపమును మాని రాజధానికి చేరెన్.

107. ఉ. అంతట కొంతకాలమున కాతని కొక్క సుతుండుపుట్టగా
శంతను డన్నపేరునిడి చక్కగ ముద్దులు మూటఁగట్టు నా
కంతు సమానదేహు నయగారము మీరగఁ బెంచు చుండ, తా
నంతకు నంతకున్ బెరిగి యౌవనమున్ ధరియించి నంతటన్.

108. కం. ఒక్క దినమ్మునన్ గొడుకు నొయ్యనఁ జెంతకుఁ జేరఁ బిల్చి తా
నక్కునఁ జేర్చి నేనిక మహాటవికిన్ జని తాపస క్రియన్
జిక్కిన కాలమున్ గడప చేతమునందు దలంతుఁ గాన నీ
విక్కడ రాజ్యభారము వహింపు మికన్ జనరంజకమ్ముగా

109. ఉ. అనిపల్కి ప్రతీపుడు తా
ముసు గంగా తీరమందు మోదముతోడన్
గని నట్టి యువతి సంగతి
వినిపించుచు నిట్టులనియె వేడ్క సుతునితో

110. కం. తనయా! నీవెపుడైన వేటకొఱకై తత్ప్రాంతమున్ జొచ్చినన్
గనిపించున్ యువతీలలామ, నిను తా కామించినన్ నీవు కా
దనబోకయ్యా! వివాహమాడు మది నాకత్యంత సంతోషమౌ
మన వంశమ్మును కీర్తిఁ బొందునని సంభావ్యంబుగా పల్కుచున్

111. కం. అంతట నాతడు రాజ్యము
శంతనునకు నప్పగించి శమితాత్ముండై





కాంతారమ్ములకుం జని
సంతసమున తపమొనర్చి సద్గతిఁ బొందెన్

112. ఉ. అంతట శంతనుండు వినయాన్వితుడై తన పూర్వవంశ భూ
కాంతులఁ బోలె ధర్మముగఁ గాశ్యపినేలుచు సద్యశమ్ము నా
శాంతములందునిల్పె; దివిజావళి మెచ్చగ యజ్ఞ యాగముల్
సంతస మొప్పఁ జేయుచు విశంకట శౌర్య జితాన్య భూపుడై

113. చం. అతడొక నాడు వేటకొఱకై విపినమ్ములకేగి జాహ్నవీ
వితత తటంబునందు కదు వేడ్క విహారముసల్పుచుండ త
త్పితరుడు చెప్పినట్లు యువతీ మణి నొక్కతె సుందరాంగిఁజా
రుతర సువర్ణగాత్రిని సరోరుహ నేత్రను గాంచె నయ్యెడన్

114. ఉ. కాంచి తదీయ దివ్య తనుకాంతుల కద్భుత మంది కన్నులన్
కాంచనగర్భు డిచ్చుటకుఁ గల్గె ఫలంబఖిలంబటంచు తా
నించుక యైన కన్నులటు లిట్టులఁ ద్రిప్పక చూచుచుండె రో
మాంచ శరీరుడై నిలిచి మారుని తూపులు సందడింపగన్.

115. ఉ. ఆ లలితాంగి శంతన ధరాధిపు చూడ్కులలోని భావముం
బోలనెఱింగి యీతడగుబో ముసు తన్ను సరోజ గర్భు పే
రోలగమందు మన్మథ శరోరుతరాహతిఁగామపూర్ణ దృ
గ్జాలము లొప్పఁ గాంచిన ప్రశస్త చరిత్రుడె నిశ్చయంబుగన్

116. చం. అనితలపోసి యాతని మహాభిషుగా మదిలోననెంచి య
వ్వనితయు నా నృపున్ మదన భావమునన్ గనుచుండ నప్పుడ
య్యనఘుడు శంతనుండు మధురామృత పూరిత వాక్య పద్ధతిన్
వనజదళేక్షణన్ గనుచు పల్కెనిటుల్ గదురాగ బద్ధుడై

117. ఉ. సుందరి! నీ వెవర్తుకవు? చూడగ నాక వధూలలామ వో?
పొందుగ మానవాంగనవొ? భోగి వరాన్వయ కన్యవౌదువో?
ఎందుల కిట్టు లొంటరిగ నిచ్చట యీ సురనిమ్నగా తటం
బందు చరించు చుంటివి సితాబ్జముఖీ! తెలియంగఁ జెప్పవే.

118. తే.గీ. ఎవతె వైనను నాకేమి యిందు వదన
నీదు లావణ్య గరిమంబు నిట్టలముగఁ

దోచె నామనంబు నిక దోబూచులేల
పెండ్లి యాడుము నన్ను సంప్రీతి తోడ

119. మ. అనినన్ గంగయు తా మనంబున నితం డానాటి నా రూపమున్
గనజాలండని యెంచి చిర్నగవు సింగారమ్ము తళ్కొత్తగా
మనుజాధీశుని గాంచి యిట్టులనియెం బాటించి భవ్యాత్మ! నిన్
జనమాన్యున్ పతిగా వరించుటకునై శంకింపగా నేటికిన్

120. ఉ. ఐనను నాదు విన్నపము నాత్మఁదలంపు మొకం డదెట్లనన్
నేనొనరించు కార్యమది నీమది కొప్పిన నొప్పు కున్న స
మ్మానముతోడఁ జూడవలె మాన్యచరిత్ర! యొకప్పుడేని నా
పూనిక నీవు కాదనిన పోయెద నిన్విడనాడి స్వేచ్ఛమై.

121. చ. అని నియమంబుఁ జేసె దివిజాపగ యష్టవసు ప్రయోజనం
బును మది నెంచి; శంతన నృపుం డనుమోదముఁ దెల్పి, యంతటన్
వనితను వెంటఁ బెట్టుకొని పాయని వేడుక రాజధానికిన్
జని కడు వైభవంబలర శాస్త్రవిధిన్ గొనె ధర్మపత్నిగన్

122. చ. శచియు పురందరుండనగ, సాగరకన్యయు విష్ణువన్న య,
ట్లుచిత గతిన్ దినంబులను నొప్పుగ నిత్య వసంత శోభలన్
ప్రచుర పరస్పరోద్గత సరాగములన్ వడిఁ బుచ్చుచుండి రా
ఖచర నదీలలామయును కౌరవ వంశ వివర్ధ మానుడున్

123. ఉ. ఇమ్ముగఁ గొంతకాలమున కిందునిభాస్య ధరించె గర్భమున్
సమ్ముద మందె శంతనుడు; చంద్ర వరాన్వయ దీపకుండు గం
గమ్మకు పుట్టు నంచు పురమంతయు శోభిలె సంతసమ్మునన్;
సమ్మతి రాణి వాసమున సాగె నిరంతర పర్వ భోజ్యముల్

124. ఆ.వె. అంత నెలలు నిండ నాయమ్మ కప్పుడు
పుట్టె పండు వంటి పుత్రుడొకడు
పుట్టినంత యింతి పుత్రుని గైకొని
గంగలోన వైచె కరుణ మాలి

125. ఉ. అడ్డముఁ జెప్పడయ్యె పతియామెకు; చెప్పిన వెళ్లునంచు తా
గ్రుడ్డియుఁ బోలె చూచుచు నిరుద్ధ మనః పరితాపుడయ్యె; నీ





యెడ్డియ కృత్యమున్ గనిన యెల్లరు విస్మయ మంది రాపురిన్
బిడ్డలఁ జంపు తల్లులిటు పృథ్వి నెఱుంగ మటంచు నెంచుచున్

126. కం. ప్రతియేట నిట్లె యొక్కొక
సుతునిన్ గని విడచుచుండె చోద్యముగ నదిన్
మతితప్పి సంచరించెడి
సతిఁ గని శంతనుడు మిగుల సాలోచనుడై

127. చం. కొడుకుల నేడ్గురన్ మిగుల క్రూరముగా నదిలోనవైచె; వం
గడమిక యెట్లునిల్చు కలకాలము మౌనముఁ దాల్చియున్న; నే
తడయక నింక నడ్డుపడెదన్ నను వీడిన వీడుగాక యం
చెడదఁ దలంచె రోయుచు మహీపతి తత్సతి దుష్టచేష్టలన్

128. ఆ.వె. అంతఁగొన్ని నాళ్ళ కష్టమ గర్భమ్ముఁ
దాల్చి నెలలు నిండ తనయు నొకని
ముద్దులొల్కఁ బడసి మునుపటి వలె యింతి
సాగె నదికి సుతుని చంకఁ గొనుచు

129. చం. అదిగని శంతనుండతి రయంబున నడ్డము వచ్చినిల్చి నీ
కిదితగునే కుమారులను నేడ్గురఁ జంపితి వాసురీమతిన్
వదలుము వీనినైన నిక వంశమునిల్పుము; నాడు నీకు స
మ్మదమున నిచ్చినట్టి యొక మాటకు నిల్చితి నింతకాలమున్

130. ఉ. ఇంక సహింపఁ జాల కరుణింపుము వేడెద, వీనినైన వం
శాంకురమున్ దయార్ద్రమతివై బ్రతికింపుము పుత్రహీను డో
పంకజనేత్రి! దుర్గతులఁ బాయకఁ ద్రెళ్ళునటంచుఁ దెల్పు ని
శ్శంకగ సర్వ శాస్త్రములు; సత్కృప సద్గతి నాకొసంగవే

131. తే.గీ. అనికడు దీనచిత్తమున నాతడు వేడిన యామెనవ్వుచున్
"మును వసువుల్ వసిష్ఠుని యమోఘపుశాపము చేతఁ బృథ్విపై
జననమునందగా వలసి సత్కృప మాకిల తల్లి వై మమున్
గనిన మరుక్షణంబుననె గంగఁ బడన్ విడు"మంచు వేడినన్

132. తే.గీ. వారి ప్రార్థ నలాలించి వసుధయందు
నిన్నుభర్తగఁ బొంది నే కన్నసుతుల

నేడ్గురన్ గంగ కర్పించి తిటుల; నితని
నెన్మిదవవాని విడువ నే నిద్ధచరిత!

133. చం. పుడమి చిఱంబితండు పరిపూర్ణతరాయువుఁ బొంది కీర్తులం
బడయును గాన నీ తనిని భావజ రూపునిఁ బెంచి విద్యలన్
బడయగఁ జేసి నీకు పిదపన్ ప్రియ మారగ నప్పగింతు; నేఁ
దడయక మున్ను కోరిన విధంబున నిన్విడనాడి వెళ్ళెదన్

134. చం. స్మరణకు రాదు నీకు, నొక మాట వచించెద విన్ము మున్ను నే
సరసిజ గర్భునొద్ద పరిచర్యలు సేయుచునుండ గాలికిన్
సరగున నంశుకమ్ము దిగఁ జారగ కామ వికార దృష్టితో
నరమరలేక చూచిన మహాభిషభూపతి వీ వెఱుంగుమా!

135. తే.గీ. అజుని శాపాన నిట్టు లీ యవని యందు
జన్మమెత్తిన వాడవో సచ్చరిత్ర;
అష్టమ వసువితండు వీరాగ్ర గణ్యు
డౌను దుఃఖమ్ము వీడు మో యవని నాథ!

136. మ. అనినన్ సంతసమంది శంతనుడు భార్యన్ బుత్రునిన్ వీడి దై
వ నియోగంబిది తప్పదంచు మదిలో భావించుచున్ రాజ్యపా
లనయందున్ గడుశ్రద్ధఁ బూనె, బహుకాలంబిట్లు సాగించుచున్
జనియెన్ దానొకనాడు వేట కొఱకై సాంద్రాటవీ భూమికిన్

137. మ. చని యా ఘోర తరాటవిన్ మృగములన్ శౌర్యోన్నతిన్ జంపుచున్
దిన మధ్యంబగు వేళకున్ ద్రిపథగా తీరంబునన్ జేరి యా
మనుజాధీశుడు గాంచె నొక్క యువకున్ మార్తాండ తేజోనిభున్
ఘన బాణాసనహస్తు శాతశర సంఘాతప్రయోగోద్యతున్

138. సీ. మునుతాను గంగను మోహించి తనవెంట
నిడికొని యేగిన కడు పవిత్ర
భూమి యిదియటంచు బుద్ధి నెఱుంగడు
జరిగిన విషయముల్ జ్ఞప్తిలేవు
మన్మథా కారుడై మానవ వీరుల
కాదిత్యులకు నైన నలవి కాని





బాణ ప్రయోగ సత్పాటవంబునఁ గడు
మిన్నయై వెలుగొందు చున్నవాడు

గీ. ఎవ్వడీత డటంచు తదేక దీక్ష
చూచి నిశ్చేష్టుడై మది చోద్యమంది
యతని దరిఁ జేరి మెల్లగ నడిగె నిట్లు
ప్రేమ మీఱంగ శంతన భూమి ధవుడు

139. ఉ. ఎవ్వరి వాడ వీవు దివిజేంద్రుని మించిన లాఘవమ్ముతో
నివ్విధి బాణముల్ వరుస నేయుచు నుంటివి, రూప సంపదన్
పువ్విలు కాని చందమునఁ బొల్చుచునుంటివి చెప్పుమయ్య! నీ
కివ్విలు విద్య నేర్పిన యహీన పరాక్రముడెవ్వరిద్ధరన్.

140. కం. అని యాతడడుగు చున్నను
వినియును విననట్టుఁజూచి విశిఖమ్ముల న
ట్టును నిట్టును వేయుచు తాఁ
జనియెను నబ్బాలకుండు సంభ్రమ మొదవన్

141. ఉ. అంతట శంతనుండు హృదయమ్మున నయ్యతిలోక శూరు వృ
త్తాంత మెఱుంగ నెంచుచు నిజాంగన యౌ సురగంగ నాత్మలో
చింతన సేయ నాక్షణమె స్నిగ్ధ మనోహర దివ్య గాత్రయై
చెంతన నిల్చె నవ్వనిత చిర్నగ వొల్కెడు ముద్దు మోమునన్

142. తే.గీ. వచ్చి యయ్యమ సుమధుర వాగ్విలాస
మమర నిట్లని పల్కె నయ్యవని పతిని
గాంచి రాజేంద్ర! యితడు నీకన్న కొడుకు
సకల విద్యల నేర్చె ధీ శాలి యనగ.

143. చం. మునివరుడౌ వసిష్ఠుకడ మోదముతో నిగ మాగమమ్ములన్
వినయమెలర్పనేర్చె; విలువిద్యల భార్గవరాముడోయనన్
వినుతికి నెక్కె నీ సుతుడు, వీనిని గైకొని పొమ్మటంచు తా
తనయుని నప్పగించె వనితామణి శంతన చక్రవర్తికిన్

144. కం. అనియప్పగించి గంగయు
కనుమరుగైపోయినంత కౌరవ నాథుం

డెనలేని సంతసమ్మున
తనయుని గైకొంచు రాజధానికి నరిగెన్

145. శా. సంతోషించుచు శంతనుండు తనయున్ శౌర్యోన్నతున్ బ్రేమతో
పొంతన్ జేర్చుక మూర్ధమున్ బలుమరున్ ముద్దాడుచున్ పట్టణ
ప్రాంతంబంతయు తోరణావళులతో భాసిల్లఁ జేయించి శ్రీ
మంతంబైన గజోత్సవంబు జరుపం బంచెన్ మహా మాత్యులన్

146. మ. తన పౌరోహితులన్ బుర ప్రముఖులన్ ధర్మాత్ములన్ మంత్రులన్
జననాథుం డొక నాడు బిల్చి సభలో సత్పుత్రు నవ్వారికిన్
వినయంబొప్పగఁ జూపి వారలును సంప్రీతిన్ వహింపన్ ముదం
బున గట్టెం దగ యౌవరాజ్యమునకున్ బొల్పొందగా పట్టమున్

147. మ. కమనీయంబుగ సూతుడిట్లు తెలుపన్ గాంగేయ వృత్తాంతముం
దమలో శౌనక ముఖ్యు లెల్లరు మహానందాత్ములై తత్కథన్
క్రమమున్ దప్పక సావధానులయి "మాకర్ణంబు లేపాటిపు
ణ్యములన్ జేసెనొ నే" డటంచు వినుచుండన్ జూచి తానంతటన్

## శంతన మత్స్యగంధుల వృత్తాంతము

148. వ. శంతనుండు యోజన గంధిని వివాహం బైన విధంబు తెల్పెద వినుండని యిట్లు చెప్పందొడంగె

149. మ చనియెన్ శంతను డొక్కనాడు మృగయాసక్తిన్ సుతున్ వెంట గై
కొనుచున్; దుర్గమ వన్య భూముల మహాక్రూరంపు సత్వంబులన్
ఘన శస్త్రంబుల నేయుచున్ దుదకు నక్కాళిందికిన్ మెల్లగాఁ
జని తత్తీరము నందుఁ గూర్చొనియె విశ్రాంతిన్ మదిన్ గోరుచున్

150. ఆ.వె. అంతకొంత వడికి నదియేమి చిత్ర మో
పరిమళమున మలయ పవన మచట
వీవ శంతనుండు వెఱగంది వెలుపల
కరుగు దెంచి చూచె నచ్చటచట

151. సీ. మందార సుమగంధ మారుతంబా? కాదు
కాదు కస్తూరి సుగంధ మిద్ది
చంపక మాలికా సౌరభంబా? కాదు
కాదు మల్లియల సౌగంధ్య మిద్ది
మాలతీ సుమముల గాలియౌనా? కాదు
కాదు బో కేతకీ గంధమిద్ది
శ్రీ చందనపుగంధ సిక్తమౌనా? కాదు
కాదు నీరేరుహ గంధ మిద్ది

గీ. ఇన్నియును కాక మఱియిద్ది యేమి చిత్ర
మనుచు నచ్చెరు వందుచు నవని విభుడు
తత్ సుగంధమ్ము వీచెడి దారి వట్టి
చనియె చకచక సౌరభాస్వాదియగుచు.

152. మ. చని కాంచెన్ యమునా నదీ తటమునన్ చంద్రాన్వయోద్దీపకుం
డినతేజుండు సరోరుహాక్షి నొక తన్వీరత్నమున్ మీనకే
తన బాణాసన ముక్త పుష్పనిశితాస్త్రంబోయనన్ సౌరభం
బనయంబున్ వెదజల్లు దేహరుచితో నాసీనయౌ కన్యకన్.

153. కం. అచ్చెరు వందుచు "నీయమ
అచ్చర యౌ; కాక మాన వాంగన యైనన్
హెచ్చగు సుగంధ పరిమళ
మచ్చుగ నరుదెంచు టెంత యాశ్చర్యంబో"!

154. కం. అని తనమది నను కొనుచున్
మనమున కడు శంతనుండు మదనాతురుడై
చని చెంతకు తానిట్లని
వన జేక్షణతోడఁ బల్కె వాగ్వైచిత్రిన్

155. ఉ. ఎవ్వరిదానవీవు హరిణేక్షణ? నిర్జన భూమియందు నీ
వివ్విధి నేక తంబ వసియింపగ నేలొకొ? నీదు చూడ్కులో
జవ్వని! నన్నులోఁగొనియె; చయ్యన నీవిధ మెల్లఁదెల్పు; మే
నివ్వసుధాధి నాయకుడ నిందుకులోద్వహుడన్ తలోదరీ!

156. మ. అనియిట్లాతడు పల్కరింప మదిలో నత్యంతమున్ సంభ్రమం
బొనగూడన్ నృపుఁ జూచి యిట్లనియెనయ్యోషా వరారోహ"యో

జననాథోత్తమ! దాశరాజునకు నే సత్పుత్రి నౌదున్ తదా
జ్ఞను నే నద్దరిఁ జేర్చుచుందు జనులన్ సవ్యంబుగా నావపై

157. కం. యోజన గంధిని నేనో
భూజానీ! తండ్రి చాటు ముగుదన్ కన్యన్
మా జనకుం డీ వేళన్
నైజగృహంబునఁగలందు నయధర్మజ్ఞా

158. కం. అనిపలికి సిగ్గుపైకొన
వనజేక్షణ నిల్చియుండ పార్థివుడంతన్
మనసిజ సుమశర సంహతు
లనయము మదినాట నిట్టులనియెన్ బ్రీతిన్

159. తే.గీ. భూమి పాలుడ నేను నో పూవుబోణి!
శంతనుండంద్రు నన్నునో సన్నుతాంగి!
నాకు నీమీద మనసయ్యె నళిన నేత్రి!
దాసుడను నేను నీకిక నో సుగంధి!

160. ఉ. పెండిలియయ్యెనాకు మునుఁబ్రీతి సురాపగ తోడ,cగాని య
య్యండజ యాన నన్విడిచె నాత్మజు నొక్కని నాకొసంగి; నిన్
బెండిలియాడగా తలతు; ప్రేముడి నన్ వరియించియింక భూ
మండల మందు రాణివయి మానిని! పొందుము రాజ్య భోగముల్

161. చం. మధుర సుధాప్రపూర్ణమగు మానవ నాధుని పల్కు లామె క
త్యధిక ముదమ్ము గొల్ప హృదయమ్మునధైర్యముఁ గూడఁ గట్టి భూ
మి ధవునిగాంచి యిట్లనియె మెల్లగ సాత్త్విక పద్ధతిన్ వచ
స్సుధలురల న్నొయారముగ చూడ్కుల నేలకు వంచి చూచుచున్

162. శా. నీ మాటల్ సకలమ్ము సత్యమనుచున్ నే నమ్మితిన్ నెమ్మదిన్
భూమీశోత్తమ! తండ్రిచాటు తనయన్, బోజాల నిచ్ఛాగతిన్,
మోమోటంబిక యేల, మాజనకు డామోదించినన్ నేను నిన్
బ్రేమింతున్; దడవేల పొమ్మతనికిన్ విన్పింపు మీ కోరికన్.





163. కం. మదనుడు నిన్నెటు లటులే
పదిలంబుగ నన్ను గూడ వాడి శరములన్
విదళించు చుండె నిర్దయ
నిదె సమయంబంచుఁ దలచి హృదయ కుహరమున్

164. కం. విను మైనను మన కెల్లర
కనువంశక్రమములైన యాచారములన్
మనమున నెంచక స్వేచ్ఛన్
జన నౌనే యిందు వంశ జననాధ ధృతిన్

165. చం. అనవిని శంతనుండు మది నక్కమలాక్షిని మెచ్చుకొంచు తాఁ
జనియెను దాశరాజునకు సొంతముగా విషయమ్ముఁ దెల్పి యా
తని యనుమోదమున్ గొన, నతండును శంతను రాకఁ గాంచి యా
తనికెదురేగి తోడ్కొని ముదంబున లోనికి స్వాగతించుచున్

166. చం. వినయముతోడ నమ్రుడయి వేడ్కయు, భీతియు మానసంబునన్
గునియగ దాశరాజు కడుకూరిమిఁ దోప మహాను భావ! మీ
రినసమతేజు లిప్పుడిటు లిచ్చటకున్ గృపనేగుదెంచుటన్
మనమున సంతసంబొదవె; మానిజవాసము పావనంబయెన్

167. తే.గీ. పేదయింటికి వచ్చిన పెన్నిధియనఁ
దోచుచున్నది మీరాక దొసగులెంచ
కయ్య! కారణమేమియో యానతిమ్ము
దాసుడను మీకు మీ యాజ్ఞ తప్పగలనె

168. కం. అనియడిగిన శంతనుడున్
మనమున సంతోషమంది మాన్య చరిత్రా!
వనజదళేక్షణ యౌ నీ
తనయను పెండ్లాడ మదినిఁ దలచితి నయ్యా!

169. కం. మనమున శంకింపక నీ
తనయను నాకిమ్ము రాజ ధానికిఁ జనినే
ఘనముగఁ బెండిలియాడుదు
ననఘా! పట్టమహిషియగు నయ్యమ యికపై

170. శా. ఆమాటల్ విని నంత దాశవిభు దత్యంతంబు మోదమ్మునన్
భూమీశాగ్రణిఁ జూచి యిట్లు పలికెన్ భూనాధ! నీ వన్నయ
ట్లామోదంబున నిత్తు నాసుతను నీ; కైనన్ వినంగాఁ దగున్
మోమోటంబును వీడి యొక్కనియమంబున్ జెప్పెదన్ సత్కృపన్

171. కం. నాతనయకు పుట్టుకొడుకె
నీ తదనంతరమున ధరణీతల మెల్లన్
భాతిగ నేలగ వలయును
ప్రీతిగ నొడఁబడుదువేని ప్రియసుతనిత్తున్

172. మ. అనియిట్లాతడు వల్కగా కురువిభుం డాలోచనా మగ్నుడై
మనమందున్ సురనిమ్నగాసుతుని సంభావించి మార్మాటలన్
వినిపింపన్ దలపోయ కాతడు కడున్ వేగంబ రాజ్యానకున్
జనియెన్ పుత్రునిఁ దోడు కొంచు తరుణీ సౌందర్య చింతామతిన్

173. చం. చనియెనె గాని సుంతయును స్వాంతమునంగడు శాంతిఁ బొంద డా
జనపతి, రాజకార్యములు సల్పడు, స్నాన మెఱుంగ డెప్డు, భో
జనమును సేయ బోడు, పరిచర్యలు గైకొన నిచ్చగింప డ
వ్వనజ దళాక్షి పైన నెడబాయక వర్ధిలు మోహ చింతనన్

174. కం. నిరతము చింతాకులుడై
స్థిర చిత్తములేకయతడు దీనత నుండన్
పరికించి సురనదీ సుతు
దరమర విడి తండ్రిఁ జేరి యడిగెవినతుడై

175. మ. జనకా! యెందులకిట్లు శోకిలుట; యీసామ్రాజ్యమందెవ్వరేన్
నిను ధిక్కారము సల్పిరో తెలుపుమా! నే వాని ఖండించెదన్
తనయుండుండుట తండ్రికిన్ గలుగు సంతాపంబు బాపన్గదా!
విను నే తండ్రిఋణంబు దీర్చుటకె పృథ్విన్ మీకు జన్మించితిన్

176. సీ. దశరథ రాముడు తండ్రి యాజ్ఞనుదాల్చి
విపినమ్ములకు వేడ్క వెళ్ళలేదె
అలహరిశ్చంద్రుండు నర్ధాంగినమ్మగా
కొమరుడున్ విప్రునిఁ గొలువ లేదె





అయ్యజీగర్తుని ఆత్మజుండును తండ్రి (శునశ్శేపుడు)
యాజ్ఞ యజ్ఞ పశువై యరుగ లేదె
పరశురాముడు తండ్రి పల్కుల తలఁదాల్చి
తన తల్లి శిరమును తరుగలేదె

గీ. అట్టి వారల మార్గమే ననుసరించి
మీదునాజ్ఞను తలదాల్తు నేదియైన.
వెనుక ముందులు గణియింప; వేగనాకు
తెలియఁ జెప్పుముతండ్రి! మీ దిగులదేమొ!

177. కం. మీరొసగిన యీదేహము
మారాడక మీకెయిత్తు మానవనాథా!
ధారుణి జనకుని కోరికఁ
దీరుప జాలంగలేని దేబెలు సుతులే

178. మ. అనుచున్ బుత్రుడు తండ్రినిట్లడుగగా నాశంతనుండాత్మజున్
గని లజ్జానత శీర్షుడై యిటులనెన్ గాంగేయ! నామానసం
బనయంబున్ గడు దాశరాజు సుతపై వ్యామోహమున్ బొందె;న
వ్వనితన్ గూర్చియె చింతసేయుదును తత్పాణిగ్రహాపేక్షినై

179. మ. సుతుడొక్కండవె నీవునాకు తనయా! శూరుండవై యుద్ధ సం
గతులందున్ గడుమేటివంచు జగతిన్ ఖ్యాతిన్ వహింపంగ నిన్
సతతంబున్ మదిమెచ్చుకొందు, నయినన్ సత్పుత్రునింకొక్కనిన్
మతిమంతున్ బడయంగ నెంచెదను సంభావ్యప్రతాపోదయున్

180. కం. ఒక సుతుడు సుతుడు గాడని
ప్రకటించిరి పూర్వమందు ప్రాజ్ఞులు జగతిన్
అకలంకవీరుడవు నీ
కొకవేళన్ జరుగరాని దొకటి జరిగినన్

181. కం॥ సైరింపగలనె మనమున
నౌరా! ననుచూచువార లవని యెవరికన్
యీరాజ్యము పరివారము
లేరీతిన్ సమములౌనె యిల పుత్రునకున్

182. మ. అనినన్ దేవ నదీ సుతుండు విని తానాలోచనా మగ్ను డై
తనయాంతర్యమితండు చెప్పడనుచున్ ధర్మజ్ఞులౌ మంత్రులన్
గని మీరల్ సని తండ్రి మానసమునన్ గారించు చున్నట్టి వే
దన యేమోతెలియుండటంచు పలుకన్ దామంతటన్ శీఘ్రమే!

183. చని యతని బాధ నెఱిగియు
వెనువెంటనె వచ్చి విన్నవించిరి మంత్రుల్
జనకుని కోర్కెను దీర్చుటె
తనధర్మం బంచు సుతుడు దలచి యటు పయిన్.

## భీష్మ ప్రతిజ్ఞ

184. మ. పటువేగమ్మున దాశరాజు కడకున్ పౌరోహితుల్ మంత్రులున్
స్ఫుట సంరంభముతోడ వెంటనడువన్ భూపాల పుత్రుండు ను
త్కటమౌ సంతసమొప్ప నేగి తగు సత్కారంబులన్ బొంది యం
తట సందేహములేక పల్కెనిటులన్ తద్దాశ భూపాలుతోన్

185. కం. మా తండ్రి కోర్కె దీరగ
మీ తనయను నతనికిమ్ము మిము ప్రార్థింతున్
నాతల్లిగఁ జూచుకొనెద
నీ తరుణిన్ దాశరాజ! యెల్ల విధములన్

186. కం. కోరను నేరాజ్యము, నీ
కోరిక తీరంగ నీమె కూర్మితనయుడే
ధారుణి నేలగ గలడో
సారమతీ! నమ్ముమయ్య! సత్కృపతోడన్

187. శా. ఆమాటల్ విని దాశరాజు కురువంశాంభోధి చంద్రున్ మహా
ధీమంతున్ గని యించుకంత మది సందేహమ్ము దోపంగ నో
భూమీశాగ్రణి! నిన్ను నమ్మెదను నీపుత్రుల్ భవిష్యత్తునం,
దీమాటన్ దగ గౌరవింతురని యేదీ నమ్మ కంబున్నదే!

188. చం. అన విని స్వర్ణదీ తనయు డాతనికిట్లనె నట్టు లైనచో
నిన శశి తారకాళియు మహేంద్రుడు మున్నగు లోకపాలకుల్





దనరెడు పంచభూతములు దప్పక సాక్షులు గాగఁ జేసెదన్
వినుడు ప్రతిజ్ఞ, నేనసలు పెండిలియాడ దలంప నింకపై

189. కం. అని భీష్మమైన సమయం
బునుజేయగ వినియతండు మోదముతోడన్
తనకూతునిచ్చి శంతన
జనపాలున కపుడు పెండ్లి జరిపించె వడిన్

190. కం. యోజన గంధికి గౌరవ
భాజనుడగు సుతుడు మున్నె ప్రభవించె నటం
చాజనపతి యెఱుగ డనుచు
తేజోనిధి సూతుడిట్లు తెలిపె మునులకున్

191. ధృత రాష్ట్రాదుల జననము
వితతంబుగ మీకు మున్ను వివరించితి, స
న్నతి, దెల్పెద వినుమిక మీ
రతి శ్రద్ధాభక్తులమర నాపై గాథల్

192. ఆతడు గ్రుడ్డివాడగుట నర్హతలేదని యంబికాసుతున్
భూతల నాథుఁ జేయ తలపోయక భీష్ముడు పాండురాజుకే
ప్రీతిగఁగట్టెపట్టమును విజ్ఞులు మంత్రి పురోహితుల్ ప్రజల్
చేతములందు మెచ్చ గుణసింధుడు వీరవరేణ్యుడయ్యెడన్

193. కం. విదురుని ధర్మవిధిజ్ఞుని
మృదుమధుర వచోవిలాసు మేధా నిధినిన్
ముదమున మంత్రిగఁ జేసెను
సదమల గుణసాంద్రు నిత్య సత్య చరిత్రున్

194. కం. ధృత రాష్ట్రమహీపతికిన్
సతు లిరువురు గలరు శీల సంపద లొప్పన్
సితతామరసానన లౌ
యతివలు “గాంధారి” “వైశ్య” యనునామములన్

195. తే.గీ. తనయులను నూర్గురఁ గనె గాంధారి; వైశ్య
యొక్కనిఁ బడసె సుతుని యుయుత్సుడనగ

వీరలెల్లరు కౌరవ వీరులైరి
ధాత్రి ధృత రాష్ట్రునకు ప్రీతి పాత్రులగుచు.

196. కుంతియు మాద్రి నాఁ బరగి కూరిమి తోడుత భార్యలిర్వు ర
త్యంతము భక్తిఁ బాండు విభు నాదర మొప్ప భజింతురెప్డు న
క్కుంతికి పెండ్లికిన్ మును నిగూఢముగా జనియించె కర్ణు, డీ
వింత యెఱుంగ రెవ్వరు దివిన్ గల భానుడు నామె దక్కినన్

197. కం. అని సూతుడిట్లు పలుకన్
మునులాశ్చర్యమ్ముఁ జెంది మును కర్ణుడు పు
ట్టిన విధమెల్లను మాకున్
వినిపింపుడటంచు వేడ వేడుక నతడున్

## కర్ణుని పుట్టుక

198. చం. వినుడు మునీంద్రులార! మును వీర వరేణ్యుడు శూర సేనుడన్
జనపతి యుండె సద్గుణ విశాలుడు యాదవ వంశ భూషణుం
డనఘుడు, వాని పుత్రి వినయాన్వితయై తగ నొప్పుచుండు ఁ దా
ననయము వృద్ధసేవలఁ బృథాఖ్య నలేఖ్య తనూవిలాసయై

199. తే.గీ. శూర సేనుని మేనత్త సుతుడు కుంతి
భోజు డనపత్యుడగుట నీ పువ్వుఁ బోణిఁ
బెంచె చిననాటి నుండియు ప్రేమ తోడ
కాన నీయమ కుంతియై ఖ్యాతిఁ బడసె

200. తే.గీ. కుంతి భోజునియింట నీకోమలాంగి
యాట పాటల గడపుచు నప్పుడపుడు
నచటికేతెంచు నతిథుల కాదరమున
సేవ లొనరించుచుండె సద్భావ మలర.

201. ఉ. ఆసమయంబునం దచటి కత్రి తనూ భవుడేగుఁదెంచె దు
ర్వాసుడు రుద్రునంశజు డవారిత కోపుడు దీక్షతో చతు
ర్మాసములున్ వ్రతంబును తిరంబుగ నచ్చట సల్ప నెంచి సం
భాసిత దీప్తితో వర కమండల దండ విభూష హస్తుడై





202. ఉ. వచ్చిన యామునీంద్రునకు పాయక భక్తి ప్రపత్తులొప్ప తా
నిచ్చలు సేవఁజేసె తరుణీమణి కుంతి; మునీంద్రుడున్ మదిన్
హెచ్చిన వేడ్కతోడ శరదిందు ముఖిన్ గని దివ్య మంత్ర మొం
డిచ్చి "యనంత శక్తియుత మియ్యది దీని జపించి భక్తితో
నచ్చిన దేవతన్ దలప నాతిరో! తీర్చు మనోరథం" బనెన్

203. కం. అని పలికి మునీంద్రుడు తాఁ
జనినంతనె కుంతి మంత్రశక్తి నెఱుంగన్
తన మదిఁ దలంచి దానిన్
మననం బొనరించి భాను మంతుని గనుచున్.

204. కం. తనకొక తనయుడు కావలె
ననుచున్బ్రార్థింప నంత నాదిత్యుండున్
గొనకొని ప్రత్యక్షంబై
వనజాక్షిని గాంచి సుతునిఁ బడయు మటన్నన్

205. కం. వడకెను సర్వాంగంబులు
తడబడియెను మాట తీరు, ధైర్యము సడలెన్,
ఒడలెల్ల స్వేద జలములు
పొడమెన్ దినకరుని గాంచి పొలతికి నంతన్

206. చ. భయమున భానునిన్ గనుచు భామినియిట్లనె నోమహాత్మ!క
న్నియనగు నేను తల్లినయి నిందల బొందుట యుక్తమౌనె నన్
దయగని వెళ్ళుమయ్య! ముని నాథుడొసంగిన మంత్రశక్తి ని
శ్చయముగ సత్యమో! మఱి యసత్యమొ తేల్చుట కిట్లుచేసితిన్

207. ఆ.వె. బాల్య చేష్ట లనుచు భావించి నన్వీడి
వెళ్ళుమయ్య! నిన్ను వేడుకొందు
ననుచు దీనవదనయై పల్కుకుంతిని
గాంచి యిట్టులనియె కమలహితుడు

208. మ. అరవిందానన! యింత మాత్రమున కీవత్యంత దివ్యంబునున్
వరమౌనీంద్రు డొసంగి నట్టిది యునై భాసించు మంత్రమ్ముతో

స్థిరచిత్తమ్మున నన్నుఁ బిల్వఁదగునే సిద్ధాత్ముఁడైయెప్పు భూ
సురవర్యుం డిడినట్టి మంత్రము నిటుల్ స్తోకంబటం చెంతువా!

209. కం. కాటుక కన్నుల బాలా!
యేటికి పలుమాటలింక హృదయమునందున్
గాటంబుగ ప్రేమాంకుర
మోటిల్లక నాటు కొనియె నొడఁబడుము సఖీ!

210. మ. అనినన్ గుంతి కరాబ్జముల్ ముడిచి యయ్యా! నీకు ధర్మమ్ములన్
వినిపింపంగల దాననే? సకల సంవేద్యుండవై యివ్విధిన్
ననువేధించుట నీకు ధర్మమగునే నా వంశమర్యాదలన్
గనవో! వానికి మచ్చఁగూర్పఁదగునే కార్పణ్యభావంబునన్

211. మ. అనుచున్ గాళుల వ్రేళులన్ బడుచు తానారీతిఁబ్రార్థింప, న
య్యినుడున్ గుంతినిఁ జూచి యిట్లనియె నోయింతీ! ననున్ జూడుమా!
ముని మంత్రంబున కేనధీనుడను నీ పొందున్ గనన్ లేక నేఁ
జనినన్ దేవతలెల్ల నన్ను పరిహాసం బేర్పడన్ జూడరే!

212. కం. నీ కన్యాత్వంబింతయు
పోకుండన్ వరము నిత్తు ఫుల్లాబ్జాక్షీ!
నా కోరికఁ దీర్పు మికను
కాకున్న శపింతునిన్ను కాఠిన్యమునన్

213. కం. నావంటి సుతునిఁ బడసెద
వేవంకలుసెప్పఁ బోకు మిక నా కనుచున్
భావంబున శంకవిడిచి
భావజు కేళులను దేలె భానుడతివతో

214. చం. వనితకు వీడుకోల్సలిపి పంకజ మిత్రుడునింగిఁ జేరె, న
వ్వనజ దళాక్షి కుంతి యటుపై ధరియించెనుగర్భ, మంతటన్
దినదిన వర్ధమానమయి దేహమునం బరిణామ మేర్పడన్
గని తన దాసి పెద్దలకుఁ గన్పడనీయక దాచె నేర్పునన్.

215. తే.గీ. అంత నవ మాసములు నిండ నామెకపుడు
కవచ కుండల ధారియై కలిగె సుతుడు





దివ్యదీప్తుల తోడ నాదిత్యువోలె
గుండెదిగబడ భయమునఁగుమిలెకుంతి

216. ఉ. శోకిలు చున్న కుంతి నటు చూచి విచారముఁ జెంది దాది, నీ
వాకులపాటు చెందకు మహస్కరు డీతనినెల్ల వేళలన్
జేకొని రక్షణం బొనరఁ జేయగలండని ధైర్యవాక్యముల్
వాకొని మందసం బొకటి వైళమ గైకొనివచ్చి యిట్లనెన్

217. ఉ. నీసుతు నిందునుంచు మిక నేఁగొని పోయి యెట్టైన డింతు; నా
దోసము నెంచఁబో కరయ తోయజబంధుడె దిక్కువీనికిన్
గాసిలకంచు దాది పలుకన్; విధి నిర్ణయ మిట్టులుండెనం
చాసలు మాని దుఃఖమున నాత్మజు మందసమందు నుంచుచున్

218. శా. కన్నా! నాకిక దారిలేక యిటునిన్ గాఠిన్య చిత్తంబుతో
కన్నీటిన్ దిగ మ్రింగు కొంచు విడువంగా నెంచితిన్; లోకమం
దన్నా! యింతటి భాగ్యహీన లెవరయ్యా! గల్గిరే యింతకున్
మున్నో బంగరు కొండ! యింక నిను నోమున్ గాక! నాదైవమే

219. మ. త్రిజగన్మాతయె నీకు దిక్కిక నినున్ దివ్యాంశజున్ నేడిటుల్
కుజనత్వంబున వీడ నెంచితిని యెగ్గున్ సిగ్గులన్ వీడి; ప
ద్మజుడీరీతి విధించె; నేను గతజన్మంబందు దుర్బుద్ధితో
భజియింపన్ దలపోయ లేదొ జగదంబన్, గాక యిట్లేలయౌ

220. మ. అని యీరీతిగ పుత్రుఁజూచి కడుబాహాటమ్ముగా నార్చుచున్
గనులన్ బాష్పము లేరులైయురలగా గాసిల్లు కుంతీ స్థితిన్
గని యాదాదియు నూఱడించి యితరుల్ గన్గొన్నచో నీవు నిం
దను బొందం గల వంచు పల్కుచు వెసన్ దన్మందసంబున్ గొనెన్

221. ఉ. గుండెలు చిక్కఁ బట్టుకొని కుంతియు చేష్టలు దప్పి యట్టులే
యుండెను మందసమ్ముదెస నూరకఁ జూచుచు; దాదియంత నా
కుండల ధారియైన పసికూనను చేకొని మెల్లమెల్లగా
గండముఁ దీర్పనెంచి సనె కావలి వారల కండ్లు గప్పుచున్

222. తే.గీ. అట్టె చూచుచు శోకిలు నట్టి కుంతి
అల్లనల్లనఁ జని స్నాన మాచరించె

దాది మంజూషఁ గైకొని ధైర్యమెసగ
నడచుచుండెను నగరమ్ము వెడలియంత.

223. కం. కనియెను రథచోదకు నొ
క్కని తనసతి రాధతోడ కలసి యెచటికో
జను వానిని; నా రాధయు
గని దాదికి తనకు మున్ను గలనెయ్యమునన్

224. ఉ. ఎక్కడి కేగుచుంటి విదియేమిటి హస్తమునందు మందసం
బొక్కటిఁ దాల్చి, యిందు ధనమున్నదె? బంగరు భూషలున్నవే?
నిక్కముఁ దెల్పుమంచు కడునేర్పునఁ బల్కెడు రాధఁ గాంచి యా
ప్రక్కనఁ జిక్కెనాకు పసిబాలు డెవండొ గలండు దీనియం
దక్కజమంది తెచ్చితి నటంచు నటించుచు దాది పల్కినన్

225. మ. తనకున్ సంతతి లేకయుంట నిపుడాదైవంబె యీరీతిగా
నను ధన్యాత్మను జేయవచ్చెనని యానందంబునన్ మిన్నుసే
కొనుచున్ రాధ తదీయ మందసము గైకొన్నన్ విభుండంతటన్
తనయామోదముఁ దెల్పె; దాదియును మోదంబందె లోలోపలన్

226. ఆ.వె. రాధయింటఁ బెరుగ రాధేయుడనుచును
కర్ణకుండలములు గలిగియుంట
కర్ణుడనుచునతడు ఖ్యాతిని గడియించె
అస్త్ర శస్త్ర విద్యలన్నినేర్చె

## పాండవుల చరిత్ర

227. కం. అనిచెప్పి సూతుడంతట
వినిపింపందొడగె పాండు విభునిచరితమున్
ఘనులగు పాండవుల చరిత
లన ఘాత్ములునైన శౌనకాది మునులకున్

228. తే.గీ. కుంతి భోజుడుతనపుత్రి కుంతి కపుడు
పరిణయమొనర్పతాస్వయం వరము దిశల





ప్రకటనము సేయ పాండు భూపాల వరుడు
పరిణయం బాడెఁ బ్రీతి నప్పద్మముఖిని

229. తే.గీ. మద్ర భూపతి పుత్రిక మాద్రియనగ
నొప్పు నామెను నాపైన నొనరపెండ్లి
యాడియిరువురు భార్యల తోడఁ గూడి
పాలనము సేయు రాజ్యమప్పాండు విభుడు

230. మ. చనె నాతండొకనాడు వేట కొఱకై సాంద్రాటవీ భూమికిన్
తనదేవేరుల తోడఁ గూడి; యచటన్ దానెంతయున్ బ్రొద్దు హె
చ్చినయుత్సాహము తోడ క్రూరమృగరాజిన్ లెక్కకున్ మిక్కిలిన్
ఘన నారాచములన్ వడిన్ దునుముచున్ గారించుచున్నంతటన్

231. కం. ముని వర్యుడొకడు సతితో
ననయమ్ము మృగంబులట్టు లాకారములన్
గొనకొని ధరియించి కడున్
మనసిజకేళులను దేలి మసలుచు నుండన్

232. మ. కనియా పాండు విభుండు నయ్యవియు నిక్కంపున్ మృగంబుల్ బురే
యనుచున్ మానసమందునెంచి వడి నేయన్, మౌని వర్యుండు తత్
ఘన బాణాహతిఁ బ్రాణముల్ విడుచుచున్ గాలానలక్రోధుడై
తన పూర్వాకృతిఁ దాల్చి యిట్లు పలికెన్ ధాత్రీపతిన్ గాంచుచున్

233. శా. సంతోషమ్మున నేను నాదు సతియున్ సయ్యాటలన్ దేలుచున్
గంతుల్ వేయుచునుండ నన్ను నిటులన్ కాండ ప్రహారమ్ముతో
నంతంబొందగఁజేసి, తీవునిటులే యర్ధాంగితోఁ గూడుచున్
సంతోషించెడువేళ నీల్గు దనుచున్ శాపంబిడెన్ రాజుకున్

234. చం. అని శపియించి ప్రాణముల నమ్ముని నాధుడువీడ; పాండుభూ
జనపతి శోకమగ్నుడయి సంతత రాజ్య సుఖోపభోగ జీ
వనమును వీడి యేగె తన భార్యలు తోడయి వచ్చుచుండ తా
వనములకున్ ముని ప్రకర పర్ణకుటీర నివాసకాముడై

235. కం. చనియట గంగాతటమున
ముని వర్యులతోడఁ గూడి ముదమున తపమున్

గొనకొని చేయుచు నుండెన్
వనజేక్షల పొందు వీడి పటు నియమమునన్

236. చం. బహువిధ ధర్మ శాస్త్రముల పాయక తాఁశ్రవణంబుఁ జేయుచున్
విహిత చరిత్రుడైన కురువీరుడు నిష్ఠగ బ్రహ్మచర్యమున్
సహనముగల్గి యాచరణ సల్పుచునుండగ నొక్కనాడటన్
మహితపురాణ వేత్త యొకమౌని యిటుల్ వచియింపగా వినెన్

237. తే.గీ. సుతులు లేని నరునకు సద్గతులు లేవు
కాన నేయుపాయంబుచే నైన నరుడు
పుత్ర సంతాన మొందుటే పాత్రమగును
తనయులను బొందు మార్గముల్ దగవినుండు

238. సీ. తనవలన సతికి తనయుడు గల్గినన్
ఔరసుం డాత్మజుండనగ నొప్పు
పెండ్లైన తనయకు పెనిమిటి వలనన
పుత్రుడు గలుగ దౌహిత్రుడగును
పరపురుషునిఁ గూడి భార్య గర్భముఁ దాల్చి
పుత్రునిఁగన వాడు క్షేత్రజుడగు
విధవకు తన వల్ల వేడ్క జన్మించిన
కొడుకిల తానొప్పు గోళకుడన

గీ. భార్య కుపభర్తవలన సంప్రాప్తమైన
యతడు "కుండు"దన బరగు నవనియందు
పెండ్లికిని మున్నె గర్భానఁ బెరుగుచున్న
యాతడు సహోఢుడను పేర నమరుభువిని
కన్యకును బుట్ట కానీను; దన్యజనుల
యొద్దఁ గొన్న క్రీతుడనగ నొప్పు నతడు
వనముల లభించినన్ వనప్రాప్తుడగును
దత్తతను గొన్న వాడిల దత్తుడగును.

239. కం. వీరలె దశవిధ సుతులన
నౌరసు డిందధికు డింక నాపై వారీ





తీరునక్రమముగ తక్కువ
వారలె యని ముని వరుండు పలికిన యంతన్

240. కం. వినియపుడు పాండు భూపతి
తనమనమునఁ జింతఁ బొంది తద్దయు ప్రొద్దున్
వనరుచు నిద్దుర పట్టక
దినములు యుగములుగ గడపి దీన వదనుడై

241. శా. ఏకాంతంబున నొక్కనా డడలి తా నింతిన్ బృథన్ బిల్చి పృ
థ్వీకాంతుం డిటుపల్కె నామెఁగని యింతీ! నాదు నాజ్ఞన్ మదిన్
జేకొంచున్ ముని వర్యు నొక్కని సదాసేవించి సత్పుత్రునిన్
నాకుం బ్రీతి నొసంగు మిందఘ మొకింతన్ లేదు నాసమ్మతిన్

242. కం. మునుపెన్నియొ యిటువంటివి
కనియుంటిమి ధర్మ శాస్త్ర కావ్యములందున్
గన లేదే సౌదాసుడు
మును తనయుని నా వసిష్ఠ మునివరు వలనన్

243. మ. అనినన్ గుంతియు నాత్మలోఁ దనకు దివ్యాత్ముండు దూర్వాసుడి
చ్చిన మంత్రమ్ముఁదలంచియప్డు పతికిన్ జెప్పంగ నప్పాండు భూ
జనపాలుండును సమ్మతించె; నటు పై శ్రద్ధామతిన్ గుంతి తా
ననఘాత్మున్ యమునిన్ స్మరించె మదిలో నమ్మంత్రమున్ బల్కుచున్

244. కం. దానన సుతు ధర్మజుడను
వానిని గనె కుంతి ధర్మవర్తను ననఘున్
దానపుడు పాండు భూపతి
కానక కనినట్టి సుతుని గని ముదమందెన్.

245. కం. అటుపై ననిలుని దయచే
కుటిలాలక కుంతి కనియె కుంజరబలునిన్
పటురణ ధీరున్ భీమున్
నిటలాక్షసమున్ రిపువన నిశిత కుఠారున్

246. కం. అంతటఁ దనియక యింద్రుని
స్వాంతమునన్ దలచి కుంతి యర్జును కురురాట్

సంతతికి భయంకరునిన్
సంతసమునఁ గనియె చక్రి సంతోషింపన్

247. కం. ఏడాది కొక్క కొమరుని
వేడుక నా కుంతి పడయు విధమునెఱుగుచున్
పోడిమిసెడి తామాద్రియు
వేడెన్ సుతుఁ బొందఁ దలచి విభుఁ జేరి వెసన్

248. ఉ. ఆయమ వేదనన్ గని ధరాధిపు డంతటఁ గుంతిఁ జూచి నీ
వీయుము మంత్రమున్ దనర నీమెకునంచు ననుజ్ఞ యీయగా
తోయజనేత్ర కుంతి యిడెఁ దొయ్యలి మాద్రికి మంత్రరాజమున్
బాయక దానిశ్రద్ధగ జపంబొనరించుచు నామె యంతటన్

249. తే.గీ. అశ్వినీ దేవతలఁ దన యాత్మఁ దలప
వారికృపవల్ల కవలలఁ బడసె మాద్రి
నకుల సహదేవులనియెడి నామములను
దాల్చియొప్పిరి వార లిద్ధరణియందు

250. కం. క్షేత్ర జులై పాండునకున్
పుత్రులు జన్మించి సుగుణపుంత్రోవులు, సత్
పాత్రులు నై పాండవులని
ధాత్రిన్ గీర్తింపఁ బడిరి ధర్మాత్ములనన్

వ. అట్లు కొన్ని దినంబులు సనినయంత

251. చం. వనము చిగిర్చె పచ్చగ; శుభంకరమై పువుగుత్తు లెల్లెడన్
దనర సుగంధముల్ విడిచె; తన్మధు సేవన కాంక్ష షట్పదుల్
నినదము సేసె; కోయిలలు నేర్పున పంచమమౌ స్వరంబునం
దొనరగఁ బాడె; యాడెను మయూరము లామని రాకఁ దెల్పుచున్

252. ఉ. ఆమని రాకతో కురు వరాన్వయు దంగజ భావసంగుడై
ప్రేమదలిర్ప మాద్రియెడ; పెల్చన చెంతకుఁ జేరి యామెతో
కామునికేళికిన్ గడగె, కాదిది కూడదటంచు నామెయున్
వేమరు వేడినన్ వినక వీడక కౌగిలిఁ జేర్చి యంగనన్





253. తే.గీ. శాపవిషయమ్ము నింతయు సరకుఁ గొనక
ముచ్చటలు దీర్చుకొనఁ గోరి పుడమి ఱేడు
వదిలె ప్రాణంబు లక్కట! వ్రాలె నేల
విధి బలీయముగద! యెంత యధికులకును.

254. తే.గీ. మొదలు నరికిన వృక్షముంబోలి యతడు
పుడమి వ్రాలగఁ బూలతన్ బోలి మాద్రి
యతనిపై వ్రాలె బావురు మనుచు నార్చి
కుంతియును వచ్చి దుఃఖించెఁ జెంతఁ జేరి

255. తే.గీ. తండ్రిఁ గోల్పడి పాండవుల్ తల్లడిలిరి
అచ్చటచ్చట నున్నవా రచటఁ జేరి
శోకసాగర మగ్నులై సొమ్మసిలిరి
ఆశ్రమం బయ్యె దైన్య భావాశ్రమముగ

256. చం. తపములు మాని దైన్యమున తాపసులెల్లరువచ్చి వారితో
నుపశమనోక్తులన్ బలికి యూఱడిలంగ నొనర్చి యంత నా
నృపవరు కాయ మగ్ని దహియించుచు నుండగఁజూచి, యిద్దినా
నెపముననే యటంచుఁ దగ నిష్కృతికై చితిఁ జొచ్చె మాద్రియున్

257. తే.గీ. నకుల సహదేవులను మాద్రి నందనులను
కుంతి రక్షణలోనుంచి కూర్మి నచటి
మునివరేణ్యులు హస్తినాపురముఁ జేర్చి
రంత ధర్మజాదులతోడ కుంతి నెలమి

258. శా. గాంగేయుండును నాంబికేయ విదురుల్ కౌంతేయులన్ ప్రేమ లు
ప్పొంగం జేరి కవుంగిలించి, పతిఁ గోల్పోవన్ గడున్ దుఃఖపున్
సాంగత్యమ్మున నున్న కుంతిఁగని యాశ్వాసంబునంబల్కి, ని
స్సంగుల్ మౌనుల కాదరంబున నమస్కారంబులన్ జేసినన్.

259. ఆ.వె. మునులు మోదమంది చనినంతఁ గుంతి తా
సుతులఁగనినయట్టి చొప్పుఁ దెలుప
సంతసించిరంత సభలోని వారెల్ల
అంధనృపుడు వారి నాదరించె

260. కం. కుంతీసుతు లైదుగురును
నింతిన్ గృష్ణను ద్రుపద మహీపాలు సుతన్
గాంతగ సేకొని యొకరొక
రంతంతన్ సుతులఁ బడసి రైదుగురఁ దగన్

261. కం. పాండవ మధ్యమునకువే
రొండుసతి సుభద్రవలన నుదయించె భువిన్
దండి పరాక్రము దభిమ
న్యుండను తనయుండు కురుకులోద్వహుఁడెలమిన్

262. తే.గీ. వాసు దేవుని చెల్లలై వాసిఁ గన్న
తామరసనేత్ర నా సుభద్రను విజయుడు
నంద నందను సాహాయ్య మొంది యపహ
రించి తెచ్చి పెండ్లాడె కామించి మదిని

263. కం. కౌరవ పాండవ రణమున
పోరాడి సుభద్ర కొడుకు పుడమిని వ్రాలెన్
వీరుల నుపపాండవులను
కౌరవ గురుసుతుడు చంపె కఱకుఁ దనమునన్

264. ఉ. ఆ యభిమన్యు భార్య కమలానన యుత్తర గర్భసీమలో
పాయక వృద్ధిఁజెందు కురువంశ వివర్ధను నల్పదేహుఁ గ్రూ
రాయత బుద్ధి ద్రోణసుతు డస్త్రమునన్ విదళింప నప్పుడా
తోయజ నేత్ర గర్భమును తోయజనాభుడు చక్కఁజేసినన్

265. కం. ఉత్తర కుదయించె పరీ
క్షిత్తనుపేర సుతుడు గడు శీలయుతుండున్
చిత్తంబున శ్రీ కృష్ణుని
హత్తించి భజించునట్టి యనఘాత్ముండున్

266. కం. కురుకులము సమూలముగా
ధరను పరిక్షీణ మగుటఁ దానొక్కండే
యిరవుగ పరిరక్షితుడై
స్థిరపడుటఁ పరీక్షితాఖ్యఁ జేకొని వరలెన్





267. చం. తనయులు నూర్గురున్ నరక ధామముఁ జేరగ నంధరాజు త
మ్ముని సుతులైన పాండవుల పొంతనఁ జేరి మరుత్త నూజుచే
ననయము నర్మగర్భమగు నాఱడులం బడుచున్ గ్రమంబునన్
దినములు పుచ్చుచుండె నతి దీనత జీవిత శేషమంతయున్

268. కం. తనపతి తోడిదె లోకం
బనుచున్ గాంధారి తలచి యను దినమును తా
మనమున వేదనఁ జెందుచు
మనుచుండెన్ పవన సుతుని మాటలు వినుచున్

269. తే.గీ. ధర్మతనయుడు తన పెద తండ్రి కెపుడు
శ్రద్ధతోడుత సేవలు సలుపుచుండు
తల్లియట్టుల తన పెద తల్లిపట్ల
పూజ్య భావమ్ము నెఱపు సమ్ముదముతోడ.

270. కం. విదురుడు సకల కళా కో
విదుడు పరమతత్వ విదుడు వినయాన్వితుడున్
వదలక ధృతరాష్ట్రునితో
ముదమున కాలమును బుచ్చు ముచ్చటలఁ దగన్

వ. ఆ ధృతరాష్ట్రునిం జూచి సహింపనోపక భీముండు

271. శా. ఈతం డంధుడు వీనిపుత్రులను నేనే చంపితిన్ మద్గదా
ఘాతశ్రేణుల; దుస్స సేను పయి నేఁ గ్రౌర్యమ్ముగా దూకి వి
ఖ్యాతిన్ గుండియఁ జీల్చిరక్తమును త్రాగన్ బోవుచుండన్ గడున్
భీతిన్ చేష్టలు దక్కి నిల్చిరెదుటన్ వీరాగ్రణుల్ మౌనులై

272. మ. జనుషాంధుండగు నీతడిప్పుడతి నీ చత్వంబునన్ మద్గృహం
బున నేవేసెడి కూటికై యెదురు చూపుల్ చూచుచున్ సిగ్గు నె
గ్గును బోనాడి వసించు తాశునక కాకోలంబులన్ బోలె; పృ
థ్విని పాపాత్ముల కాయువుల్నిలుచుఁ బో దీర్ఘంబులైయెప్పుడున్

273. మ. అనియీరీతిగ భీముడాడు కడు నింద్యంబైన వాక్యంబులన్
వినిదుఃఖించెడి పెద్దతండ్రిఁ గని యుర్వీనాథుడౌ ధర్మనం

దనుడోదార్చుచు; భీమసేను పలుకుల్ తండ్రీ! మదిన్ నిల్పఁబో,
కనయంబున్ గడు మూర్ఖుడాతడని సౌహార్దమ్మునన్ బల్కుచున్

274. కం. ఓదార్చుచుండ నిక ది
క్కేదియుఁగన లేక పదియు నెన్మిది యేడుల్
వేదన మదిలో మ్రింగుచు
కాదనక వసించెనచట కర్మవశమునన్

275. ఉ. ఇవ్విధి నిందలన్ బడుట కింక సహింపక మానసంబునన్
నెవ్వగతోడ ధర్మసుతునిన్ ధృత రాష్ట్రుడుచూచి నాయనా!
దవ్వులకున్ వనంబులకు తాపసవృత్తిని బూని యేగెదన్
నవ్వులుగాదు నన్ను విపినంబులఁ జేర్చుము సంతసంబగున్

276. చం. అనవిని ధర్మజుండు విదురాను మతంబున పుష్కలమ్ముగా
ధనము నొసంగి ప్రీతి పెద తండ్రిని పంపగ నెంచి తమ్ములన్
గనియదుగంగ వారలును కాదనరై రొక భీమసేనుడే
కనలుచు సమ్మతింపక ప్రకంపిత భ్రూకుటితోడ నిట్లనెన్

277. చం. ఇతనికి గ్రుడ్డివాని కొక హీనునకిట్లు ధనమ్మునిత్తువా!
గతముఁ దలంపవేల మనకష్టములన్నిటి కీతడే గదా
సతతము కారణ మ్మదియ చాలును ధర్మజ! నీదు బుద్ధియే
వెతలను దెచ్చి పెట్టె మతి వేయును నేటికి మాకు నెప్పుడున్

278. కం. నీ మంత్రాంగము వలననె
భూమిన్ పడరాని పాట్లుఁ బొందితిమయ్యా!
సామాన్య మానవుల వలె
సామంతుల పంచ బ్రతుకు జరిపితి మకటా!

279. మ. కపట ద్యూత మటంచెటింగియు నయోగ్యంబంచు భావించ కా
కపటుల్ బిల్వగ నేగ నేల? యపు డ క్కార్యమ్ము సాలించినన్
విపరీతమ్ములు గల్గునే? మదిని నావేశమ్ముతో తమ్ములన్
చపలాక్షిన్ సతినోడి పోయితివి నీచత్వంబునన్ ధర్మజా

280. సీ. నీ మూలమున గదా! నిన్న మొన్నటి దాక
నడవుల నిడుములఁ బడుచునుంట





నీ మూలమున గదా! సామీరినౌ నేను
వంటసేయ విరటు నింట నుంట
నీ మూలమునగదా! నిర్జరేంద్రుని సుతు
డతివయై నాట్యమ్ములాడుచుంట
నీ మూలమునగదా! నెట్టన కవలలు
నశ్వ గోరక్షకు లౌచునుంట

గీ. వరము వలనన జన్మించి తరుణులందు
మేటి యననొప్పు కృష్ణ విరాటు నింట
పడని పాట్లెల్లఁ బడుట నీ వలన గాదె
ఇంతకన్నను నవమాన మెద్దియింక

281. తే.గీ. చిత్రరథుడను గంధర్వుచేతఁ జిక్కి
వనరు దుర్యోధనుని నాడు గనుచు నీవు
వాని విడిపించు మనుచు నా కానయిడగ
నేనె విడిపించితిని యట్లు కానియెడల

282. తే.గీ. నాడెయమలోక మేగెడి వాడతండు
నీదు నాలోచనయెయింత వాడుఁ గూర్చె
నట్టి వానికి తండ్రియౌ నల్ప మతికి
ధనమునిచ్చుటకే నొప్ప ననుచుఁ బలికి

283. కం. అనిలజుఁ డతి కోపమ్మునఁ
జనియెను నచ్చోటు వీడి జవమున నంతన్
దన ముప్వురు తమ్ములతో
నొనరగ మంతనములాడి యొప్పించి తగన్

284. చం. ధనము నొసంగె ధర్మజుడు తా పెదతండ్రికి పుష్కలమ్ముగన్
ఘనముగ నాతడున్ విరివిగా తగురీతిని దాన ధర్మముల్
పొనరనొనర్చి యంతఁదన పుత్రుల నెల్ల తిలోద కంబులన్
దనిపి ప్రయాణమయ్యె విపినంబులకున్ దన ధర్మ పత్నితో

285. కం. తడయక ధృత రాష్ట్రునితో
నడచెను కుంతియును బ్రీతి నట్టడవులకున్

కొడుకులు వలదను చున్నను
విడనాడి సుఖోపభోగ విసరములెల్లన్

286. తే.గీ. విదురుడును వెంట నడచెను ముదము తోడ
అన్నవెంటనె వనవాస మర్థిఁ దలచి
ధర్మజాదులు జాహ్నవీ తటము దనుక
సాగనంపిరి వారల సాదరమున

287. మ. ధృతరాష్ట్రాదులు నల్వురున్ సురనదీ తీరంబునందున్న యా
శతరూపాశ్రమ భూమిఁ జేరి యచటన్ సౌకర్యమైయొప్పు నొ
క్క తృణాచ్ఛాదితమౌ కుటీరమును చక్కన్ నిల్పి యేకాగ్రతన్
మతిమంతుల్ తపమాచరించిరి తగన్ బ్రహ్మాత్మ భావోన్నతిన్

288. తే.గీ. సాగె నిట్టుల నాఱేండ్లు సంతసమున
పెద్ద తండ్రిని తల్లుల విదురుఁ జూడఁ
గోరి ధర్మజు డొక నాడు కూర్మితోడ
తమ్ములను బిల్చి చెప్పెను తనదు కోర్కె

289. ఉ. చెప్పినఁ దమ్ములందరును చిత్తములన్ గడు సంతసించుచున్
తప్పకపోయి వత్తమన; ద్రౌపది, యుత్తర, యాసుభద్రయున్
ముప్పిరిఁగొన్న వేడుకలు మోములఁ దోపగ వారి వెంట తా
మప్పుడ యేగ సిద్ధ పడిరంత వనంబులకున్ గడున్ వడిన్

290. ఉ. పౌరులు కొందరున్ మఱియు ప్రాజ్ఞుడు సంజయుడప్డు వారితో
జేరగ నెల్లవారు గడు శీఘ్రముగా విపినమ్ముఁ జేరి గాం
ధారిని, నాంబికేయు, తమతల్లినిఁ గాంచిరి, కాని యచ్చటన్
వారలు గాంచ రైరి బుధవంద్యుని నావిదురున్ మహాశయున్

291. తే.గీ. అంతఁదల్లులకునుఁదండ్రి కంజలించి
వారి యాశీస్సులను ముదమారఁ బొంది
రపుడు విదురుని విషయమ్ము నడిగె ధర్మ
తనయుడు పెద తండ్రిఁ గని తా వినయమెసగ

292. చం. అడిగిన నాతడిట్లనియె నయ్యమనందనుతో కుమార! త
మ్ముడు విదురుండు తాఁ జనియె ముక్తిని గోరి విరక్తుడై తపం





బెడపకఁ జేయ నేయెడకొ; యెల్ల సుఖంబులు భోజనంబులున్
విడిచి; పరాత్పరున్ మదిని వీడక నిత్యమనన్య చిత్తుడై

293. కం. అనితెలుప ధర్మతనయుడు
మనమున నొకకొంత వడికి మౌనయుతుండై
వనమందలి యాశ్రమమున
తనవారలతోడ గడపె తానారాత్రిన్

294. క. మరు దినమున ధర్మసుతుడు
సురగంగాతీరమందు చూచెన్ విదురున్
పరమతపోనిష్ఠున్ భా
సుర జీర్ణ శరీరుని పరిశుద్ధ చరిత్రున్

295. చం. పటుతర నిష్ఠలన్ దపము పాయకఁ జేయుట దేహమస్థి సం
ఘటిత జటావృతంబగుచుఁ గర్వలిఁ దూలగ దివ్యకాంతితో
నటమట యింతయున్ గనని యవ్విదురున్ గని ధర్మజుండు సం
పుటిత కరాబ్జుడై వినయ పూర్వక వాక్కుల నంజలించినన్

296. ఉ. ధ్యాననిమీలితాక్షుడగు నావిదురుం డిసుమంత యేనియున్
వాని వినమ్రతోక్తులకు ప్రత్యభిభాషణ సల్పడయ్యె; భూ
జానియు నాత్మలో మిగుల సంభ్రమ మొప్పగఁ జూచుచుండె వి
జ్ఞాన పయోధి నాతనిని; చయ్యన నంతట నద్భుతమ్ముగన్

297. కం. విదురుని ముఖమున వెల్వడి
పదిలంబుగ నొక్కకాంతి భాసుర లీలన్
ఉదయార్కతేజు ధర్మజు
సదమల దేహంబు నందు సరగునఁ జొచ్చెన్

298. కం. యమ ధర్మాంశజు లిరువురు
సమతేజులు గాననిపుడు సమవర్తి నిభుం
డమలుడు విదురుని తేజం
బమరగ ధర్మాంశయందె యైక్యం బయ్యెన్

299. చం. విదురుని దేహమంతటఁ భువిన్ మెల మెల్లగ వాలి పోయె; గ
ద్గదిత గళంబునన్ బొగిలె ధర్మతనూజుడు; వేదనా భరం

బెదను దహింప సోదరుల నెల్లను బిల్చి తదీయ దేహమున్
బదపడి మీరలెల్లరును పావక కీలల సంస్కరింపుడీ!

300. చం. అని పలుకంగ తమ్ములును నాతని యాజ్ఞవహించి, యట్టులే
యనుచుఁ దదీయ దేహమును నగ్నికి నర్పణసేయఁ బూన, ని
య్యనఘుని సన్యసించిన మహాత్ముని కాల్చుట కూడదంచు తా
వినిచెను దివ్య వాణి కడు విస్మయ మందగ పాండునందనుల్

301. ఆ.వె. వేల్పుపలుకులపుడు విని వారలెల్లరు
నమర నదిని స్నానమాచరించి
శవము నచట విడిచి చనిరి వేగమ్మున
నాంబికేయుఁ గనగ నాశ్రమమున

302. చం. చని తమ పెద్ద తండ్రికి విషాదముతో విదురుండు ముక్తిఁ బొం
దిన విషయమ్ముఁ దెల్పిరి; మదిన్ గడుదుఃఖముఁ జెంది తమ్మునిన్
మనమున నొక్కకొంతవడి మౌనముగాఁ దలపోసి వెంటనే
మునిగె తపమ్మునన్ కనులు మూయుచు కౌరవ వృద్ధు డంతటన్

303. ఉ. సాగెను కొంతకాలమటు, సాత్యవతేయుడు వ్యాసుడున్ మహా
త్యాగధనుల్ మహర్షులును దైవమునీంద్రునిఁ గూడి యొక్కనా
డాగమనమ్ము సేసిరట, కంతట వారును నాతిథేయముల్
బాగుగఁ జేసి నమ్రులయి భక్తియెలర్పగ స్వాగతించినన్

304. తే.గి. అంతటఁ గుంతి వ్యాసుఁ గని యార్యనుతా! వినుమయ్య, కర్ణుదే
సంతతమున్ మదిన్ మెదలు; సత్కృపనాతని నొక్కసారి చూ
పింతువెనాకు; నామనము వేదనతో దహియించుచుండు; నే
నెంతయుద్రోహబుద్ధిఁ జరియించితి నాతని పట్ల పాపినై

305. తే.గీ. వాని ముఖమును జూడంగ వలయుననుచు
కోర్కెజనియించె నిపుడని కుంతి వేడ
తా సుయోధనుఁ జూడఁ గాంధారికోరె
ననుజ సహితంబుగానపు డార్తితోడ

306. తే.గీ. తనయు నభిమన్యుఁ జూడగా మనమునందు
కోర్కెగలుగ సుభద్రయు కోరెనపుడు





పేగుబంధమ్ములోనున్న ప్రేమనెఱిగి
వ్యాసముని గంగలో స్నాన మాచరించి

307. మ. అది సాయం సమయమ్ముగాన నట సంధ్యావందనం బాచరిం
చి దయా సాగరు డైన వ్యాసముని తాశ్రీదేవి నాత్మన్ గడున్
బదిలంబైన విధంబునన్ స్థిరముగా భావించి కీర్తించె స
త్పద సంయుక్త కవిత్వ ధారలురలన్ భక్తి ప్రయుక్తంబుగా

308. కం. నీ కనుసన్నల నిరతము
లోకంబులు మెలగు చుండు; లోకేశ్వరులున్
నీకు విధేయులు తల్లీ!
నీకన్నను నధికులెవరు? నిఖిలారాధ్యా!

309. కం. జగములు జగతీ నాథులు
త్రిగుణములు త్రిమూర్తు లష్ట దిక్పాలకులున్
ఖగనవకము భూతతతులు
దెగినను వెలుగొందు దీవె దీవ్యత్ప్రభలన్

310. కం. త్రిగుణాతీతవు జననీ!
త్రిగుణంబుల నొప్పునట్టి త్రివిధాకృతులన్
త్రిగతుల నొనర్చుకొఱకై
యగణితముగ సృష్టిఁ జేసి తమ్మా! నీవే.

311. కం. నీవే స్వతంత్రురాలవు
భావింపగ నితరమెల్ల పరతంత్రంబే
దేవీ! నిను తెలియఁ దరమె
యేవారలకైన; నిన్ను నెఱుగుదు వీవే!

312. ఉ. వీరలు దీనురాండ్రు కదువేదుచునుండిరినన్ను; స్వర్గమున్
జేరిన వీరి పుత్రులను చెచ్చెఱఁ జూపు మటంచు; నైన నా
కారయ నంత శక్తి గలదా! దయతో కరుణించి వీరికిన్
నేరము లెంచకాత్మజుల నెమ్మిఁ గనంబడఁ జేయు మమ్మరో!

313. ఉ. వ్యాసుని ప్రార్థనన్ వినిన యంబ దయాపరిపూర్ణచిత్తయై
వాసిగ స్వర్గమందుఁగల వారల నెల్లను బిల్చి తెచ్చి వి

శ్వాసముగల్గఁ జూప, కదు సంభ్రమమందుచు కౌరవాంగనల్
త్రాసముఁ దోప మూర్ఛిలిరి తక్షణమయ్యెడ మోహితాత్మలై

314. తే.గీ. అంతఁ గర్ణాదులును మాయమై సనంగ
తేరు కొని యింతులెల్లరు తెలివిఁ గలిగి
ఇంద్రజాలంబు వలెనున్న దేయటంచు
వ్యాసు మహిమమ్ముఁ గొనియాడి రద్భుతముగ.

315. ఉ. అంతట ధర్మజాదులును నాశ్రమ భూమిని వీడి యెంతయున్
సంతసమొప్ప వ్యాసముని సచ్చరితంబును తన్మహత్వమున్
వింతలు వింతలౌనటుల వీనుల విందుగఁ జెప్పు కొంచు సా
యంతన వేళకున్ జనిరి హస్తినకున్ దగ నశ్రమమ్మునన్

316. ఉ. అంతట మూడునాళ్ళకు దవానల మా శతయూపు నాశ్రమ
ప్రాంతము నందు విస్తరిల పాండవకౌరవ మాతృమూర్తులున్
శంతన పౌత్రుడున్ దహన సంభృతకీలల దగ్ధమైరటం
చింతయు నారదుండు వచియింపఁ గలంగిరి పాండునందనుల్

317. కం. భూసుర శాపవశంబున
నాసుర కృత్యముల యాదవాన్వయు లటుపై
నాసవముల సేవించుచు
వాసరములఁ గడపుచున్ ప్రభాసము నందున్

318. కం. భారత యుద్ధము జరిగిన
యారున్ ముప్పదియు నేండ్ల కయ్యదు వీరుల్
వారును వా రన్యోన్యము
పోరాడుచుఁ జనిరి యమునిపురమున కంతన్

319. మ. బలరాముండును వీడెఁ బ్రాణముల; నాపై వాసుదేవుండు భూ
స్థలిఁ జాలించెను దివ్య దేహము నిశాతంబైన బాణమ్ముతో
బలిమిన్ బోయ యొకండు కొట్ట; నిటు లావంశంబునం దెల్లవా
రలు ప్రాణంబులు వీడ పార్థు దపుడారాటించుచున్ వేదనన్

320. కం. చనియెన్ బ్రభాస తీర్థము,
జని వారలకెల్ల నంత్య సంస్కారములన్





గొనకొని సలిపిన యంతటఁ
జనియెన్ ద్వారకకు మరలి సరభస వృత్తిన్

321. ఉ. చని తక్కుంగల వారలన్ మిగుల నాశ్వాసించి వెన్వెంటనే
చనుడీ ద్వారక వీడి వెల్పల కనన్ సంరంభులై తత్పురం
బును వారెల్లరు వీడి పోవ;నుదధిన్ మున్గెన్ గడున్ విస్మయం
బును భీతిన్ గలిగించుచున్ బురము సంపూర్ణంబుగా నయ్యెడన్

322. ఉ. తక్కిన గోప కామినులఁ దామరసాక్షుని పత్నులన్, పురిన్
జిక్కిన పౌరులన్ గొనుచు చెచ్చెఱ హస్తినకేగు పార్థునిన్
బెక్కురు తస్కరాధములు పెల్చనెదిర్చి సువర్ణభూషలన్
చక్కగ దోచుచుండినను శక్రసుతుండెదిరింప డయ్యెడన్

323. సీ. మత్స్యయంత్రముఁ గొట్టి మచ్చె కంటిని చెట్ట
బట్టిన దిట్ట యీ పగిది యయ్యె
పశుపతి నెదిరించి పాశు పతముఁగొన్న
వీరుడిప్పుడు కడు భీరుడయ్యె
కాలకేయులఁ బట్టి కసిమసంగినయట్టి
వీరుడియ్యెడల నిర్వీర్యుడయ్యె
కర్ణాది వీరుల కలన నిర్జించిన,
జెట్టి తంతుల గట్టి నట్టులయ్యె

గీ. ఖాండవం బేర్చు నప్పుడా ఖండలు నకు
చెమటఁ బట్టించినట్టి సుస్థిరయశుండు
నేడు చోరులఁ జూచుచు నిలిచియుండె
ఎవరి కేవేళ నే మౌనొ యెఱుగఁ దరమె

324. చం. తన యసమర్థతన్ గని పృథాసుతుడాత్మ విచారమంది వ
జ్రున, కనిరుద్ధ పుత్రునకు శూరున కయ్యదువంశరాజ్యమున్
ఘనముగ నిచ్చియంతట యెకాయెకి నేగెను హస్తినాపురం
బునకు మురారిఁ గోలుపడి పోడిమిఁ దప్పిన యాననాబ్జుడై

325. తే.గీ. అతని వదనమ్ముఁ జూచుచు వ్యాసుడనియె
చింతిలన్ బోకుమయ్య యాశ్రీవిభుండు

వీడినంతనె శక్తియు విడిచెనిన్ను
ఆత దవతార మెత్తిన యంతమరల
పూర్వవైభవ మప్పుడు పొందునిన్ను
ఊరడిల్లు మటంచు తానొయ్యc బలికె

326. కం. యదుకుల తిలకుడు కృష్ణుడు
యదువీరులు పుడమి వీడి యరిగి రటంచున్
హృదయ విదారక విషయం
బదివిన్న పృథాగ్ర పుత్రు డార్తిమునింగెన్

327. ఉ. ధర్మసుతుండు తమ్ములును ద్రౌపదియున్ ధర యాదవాన్వయం
బూర్మినశించె నంచు విని యొల్లక రాజ్య సుఖంబులెల్ల తా
మోర్మి విరాగులై వెడలి రుత్తరదిక్కుకు నుత్తరాసుతున్
గూర్మి పరీక్షితున్ మహితుc గుంభిని నేలగ నిల్పియందరున్

328. కం. చని హిమవత్పర్వతమున
ననయముcదప మాచరించి యంత్యమునందున్
ఘనయోగ మార్గరతులై
తనువుల విడిచనిరి దివికిc దామారుగురున్

## పరీక్షిత్తు వృత్తాంతము

329. ఉ. అంచిత ధర్మ మార్గమున నర్జున పౌత్రుడనంత తేజుడై
మించిన పుణ్య కార్యముల మెల్పునc జేయుచు నర్వదేండ్లు గా
వించెను రాజ్యపాలనము వేడుక; నంతట నొక్కనాడు భా
వించెను వేటలాడ మది విస్తృత సాంద్ర వనాంతరమ్మునన్

330. తే.గీ. తలచి తనసైన్యములు వెంటc దగిలినడువ
దుర్గమంబగు వనముల దూరి యచట
క్రూర సత్వంబులను పెక్కుc గూల్చిమిగుల
నలసెనాతడు మధ్యాహ్నమగుట వలన

331. ఉ. ఆతపబాధc జెంది యధికాధికమైన పిపాస నొక్కెడన్
శీతల వృక్షమూలమును జేరగ నంతట నాప్రదేశమం





దాతత దీక్షతో తప మనన్య మనంబునc బూని చేయు వి
ఖ్యాతు, నిమీలితాక్షుc బొడగాంచె నతండొక మౌనిపుంగవున్

332. ఉ. కాంచి వినమ్ర చిత్తుడయి కౌరవనాథుడు పల్కెనిట్లు లో
సంచిత పుణ్య! మౌనికుల చంద్ర! వనంబున వేట లాడగా
మించిన వేడ్కవచ్చియిటు మిమ్ములc గంటిని భూమి నాధుడన్
ప్రాంచిత కీర్తిశాలియగు పార్థుని పౌత్రుడ నౌత్తరేయుడన్.

333. ఉ. అలసితి వేటలాడి, తడి యాఱెను నాల్కః శరీర మంతయున్
సొలసెను, నీర మిచ్చి దయc జూడుము నన్నిపుడంచు వేడినన్
పలుకును నుల్కు లేక మునివర్యుడు ధ్యాన నిమీలి తాక్షుడై
యులియక యున్నc జూచి మదినుబ్బిన కోపముతోడ నంతటన్

334. చం. మనుజ విభుండు దీని నవమాన మటంచుc దలంచి యెంతయున్
గనలుచు ముందు వెన్కలను గాంచక యొక్క మృతాహిc దద్దను
స్సునకుc దగిల్చితెచ్చి విధిచోదితుడై ముని యంసభాగమం
దునిచి చనెన్ రయంబున మహోద్ధతుడై తన రాజధానికిన్

335. కం. ధ్యాన నిమగ్నుండగు నా
మౌనియు చలియింపడయ్యె మరుమాటైనన్
పూని పలుకc బోడక్కట!
యానృపుడిది తెలియడయ్యె యౌద్ధత్యమునన్

336. కం. అది చూచిన ముని బాలకు
లిది యెక్కడి దౌష్ట్యమనుచు నీ విషయంబున్
పొదిగొనుచు వెళ్ళి ముని సుతు
నెద కెక్కగc దెల్పి రప్పు డెంతయు భీతిన్

337. చం. అదివిని యా శమీక సుతుడాగ్రహమంది కమండలంబులో
నుదకము హస్తమందిడి మహోగ్రతరాకృతిc దాల్చి పల్కెః దు
ర్మదమున నెవ్వ డివ్విధి సమాధిగతుండగు నాదు తండ్రిపై
బెదరక వైచె సర్పమును వీడక వాడిదె యేడు నాళ్ళలో
పదపడి తక్షకాహి విషవహ్నిc దగుల్కొనిచచ్చుc గావుతన్

338. చం. అనియిటు శృంగి శాపమిడ నమ్ముని వర్యుడు మేలు కొంచు త
త్తనయుని శాపవార్త విని తద్దయు వేదనఁ జెంది వెంటనే
మునిసుతు నొక్కనిన్ బిలిచి "భూపతి చెంతకు సత్వరంబునన్
జని విషయమ్ము నంతయును సన్మతిఁదెల్పు" మటంచుఁబల్కినన్

339. తే.గీ. ముని సుతుండును వేగమే చని ధరాధి
పతికి విన్నవించెను శాపవార్తనెల్ల
శాప మనివార్యమని యెంచి భూపతియును
తనదు కృత్యమ్ము నిందించు కొనుచునంత

340. ఉ. పెద్దల, మంత్రులన్, మరియు పేర్మివహించిన విప్రవర్యులన్
వద్దకుఁబిల్చి తాను ముని వర్యున కెగ్గొనరించినట్టి యా
సుద్దియు, శాపవృత్తమును చొప్పడగా వివరించి యిప్పు నా
కెద్దియొ మార్గమొక్కటి వచింపుడు మీరు దయార్ద్రచిత్తులై

341. మ. అనివార్యంబది మృత్యు వెల్లరకు నట్లయ్యున్ బ్రయత్నంబుతో
తనకున్ గల్గెడి యాపదన్ స్థిరమతిన్ దప్పింపగా నౌనటం
చనియెన్ శాస్త్రములెల్ల; విజ్ఞుల యుపాయంబైన యాలోచనల్
వినినన్ గార్యములెల్లఁ జక్కఁబడు నేవేళైన నెవ్వారికిన్

342. మ. మణి మంత్రౌషధ సిద్ధులెల్లరకు సంభావ్యంబు, లవ్వానిచే
గుణముల్ బెక్కులు గల్గు, మున్ను వినమే కుంభీనసోద్యుక్త దా
రుణ దంష్ట్రా పరిదష్టయైన సతికాయుస్సున్ స్వకీయంబు తా
గణుతింపన్ సగమిచ్చి మౌనియొక డక్కాంతామణిన్ బ్రోచుటన్

343. ఉ. కావున భావికాల మెఱుగంగ నశక్యమదెంతవారికేన్
చావును బొందియున్ బ్రతుక సాధ్యమగున్ దగుయత్నమున్నచో
దేవునిపైన భారమిడి దీనతఁబొంది ప్రయత్నహీనుడౌ
దేవురు గొట్టు కబ్బునె మదిన్ బరికింపగ సత్ఫలంబిలన్

344. తే.గీ. సర్వ సంగమ్ములనువీడి జడలు దాల్చి
వనములందున్న మునులైన ప్రాణములను
నిలుపఁగాయ గసురులు దుంపలకునైన
యత్నమొనరింప వలెఁగాదె యార్యులార!





345. తే.గీ. పుణ్య సతు లెవ్వరైనను పొల్పుమీఱ
పిలిచి రుచిరాన్నముల నెల్లఁ బెట్టవచ్చు
తినుటకైనను తాఁప్రయత్నింపవలదె
కాక అది పోవునే నోటికడకునైన

346. తే.గీ. కాన కార్యము సిద్ధింపఁ గడవరకును
తాను యత్నింప వలయు సంతాపపడక
అంతకును ఫల మింతయు నందకున్న
ఊఱటం బొందియుండుటే యుత్తమంబు

347. కం. అని పలుకు పరీక్షిత్తును
గని మంత్రులు భూమి సురులు కౌరవనాథా!
వినిపింపు మయ్య మునివరు
డెనయన్ దన యాయువెట్టు లిచ్చెనొ సతికిన్

348. ఆ.వె. ఆమె యెట్లు బ్రతికె, నాముని యెవ్వరు?
వినగఁగోర్కె కలిగె వీనులలర
తెలియఁజెప్పు మనిన స్థిరచిత్తుడై నెమ్మిఁ
బలికెనిట్లు భూమి పతియునంత

## ప్రమద్వరా రురువుల వృత్తాంతము

349. చం. అవని పులోమకున్ భృగు మహర్షికిఁ బ్రీతి జనించె పుత్రుడై
చ్యవనుడు, వానికిన్ ప్రమతి యాత్మజుడయ్యె సుకన్యయందు నా
చ్యవనజుడున్ ప్రతాపి యను సాధ్విని పెండిలియై రురుండనన్
ప్రవిమల తేజునిన్ గనె తపస్వి నొక్క సుపుత్రు నర్మిలిన్

350. కం. మేనక విశ్వావసువను
మౌనివలన కూతుఁబొంది మంజులదేహన్,
దానిని తావదలెను చం
ద్రానన నా స్థూలకేశు నాశ్రమమందున్

351. చం. తనయను వీడి మేనకయు తావెడలెన్దివి, కంత మౌనియున్
తనకిది దైవయోగమని దానిని గైకొని ప్రేమతోడ తా

మనమలరంగఁ బెంచెను ప్రమద్వరనామమొసంగి, యామెయున్
దిన దిన వర్ధమానయయి తేజరిలెన్ దగయౌవనంబునన్

352. వ. అంతట నొక్కదినంబున రురుండు స్థూలకేశునాశ్రమప్రాంతమందు సంచరించుచుండ

353. చం. అమరగ నాప్రమద్వరయు నాశ్రమ మందు చరించు చుండగా
ప్రమతి కుమారుడౌ రురుడు పాయని కూరిమి నామెఁగాంచి, తా
క్రమమున కామ వశ్యుడయి కాంతను మానస మందునిల్పియా
శ్రమమున కేగి యుండె నిజసత్క్రియలన్ విడనాడి యొంటిగన్

354. చం. అది గని వానితండ్రి తన యాత్మజు చెంతకుఁ జేరి వత్స! నీ
మది నిసుమంత యేనియు శమంబును బొందక యుంటివేల? స
మ్ముదమున నిత్యకృత్యములఁ బొందికగా నొనరింపఁ బోవు, నీ
హృదయమునందు దైన్యమున కేమి కతంబొ యెఱుంగఁజెప్పుమా!

355. కం. అనియడుగ నా రురుండును
తన మదిఁగల కోర్కెనపుడు తండ్రికిఁ దెలుపన్
విని యా ప్రమతియు వేగమె
చనియెను తాస్థూలకేశసన్ముని కడకున్

356. కం. చని స్థూలకేశునకు తన
తనయుని మదిలోని కోర్కె తగవివరింపన్
మనమున ముదమందియతడు
తన సుత నిచ్చుటకు సమ్మతంబును దెల్పెన్.

357. ఉ. అంతట మంచి మూరుతమునందు వివాహము సేయనెంచి ధీ
మంతులు మౌనులిర్వురును మానుగ వస్తుచయమ్ముఁ గూర్పగా
నెంతయు సంతసమ్మొదవ నేగిరి యవ్వనసీమ; కప్పుడా
చెంతకు సర్పమొండు గడు శీఘ్రగతిన్ బఱతెంచి క్రుద్ధయై

358. తే.గీ. ఆశ్రమప్రాంత మందపు దట్టు నిట్టు
తిరుగు చుండెడి యాప్రమద్వరను కాటు
వేయ నురుగులన్ గ్రక్కుచుఁ బృథ్వినొరగి
ప్రాణముల్ వీడె నకట! యప్పంకజాక్షి





359. చం. అపుడట నున్నమౌనులు తదాత్మజులున్ మునిపత్నులెల్లరున్
గృపకలుగంగ నచ్చటకు ఖిన్నులునై జనుదెంచి రంతటన్
విపినమునుండి తండ్రియును వేగమె యాశ్రమ భూమిఁజేరి తా
నపరిమితంపు దుఃఖమున నాకుల మానసుడయ్యె నయ్యెడన్

360. చం. రురుడును వచ్చి బోరుమని రోదనఁ జెందుచు నాప్రమద్వరన్
ధరఁబడియున్నదానిఁగని తన్మునివర్యుల, స్థూలకేశునిన్
మరి మరిగాంచి దైవమును మాటికి మాటికి దూఱుచున్ గడున్
దొరలగ బాష్ప ధార లటు దూరముగన్ జని యేక తంబునన్

361. మ. అకటా! దైవమె సర్పరూపమున నన్యాయంబుగా నివ్విధిన్
ప్రకటంబై గొని పోయె నాప్రియను, నాప్రాణంబు లేరీతిగా
నికనిల్వంగల, వేమిసేతు, నొకనాడేనిన్ మనః స్ఫూర్తిగా
నొకపల్కైనను పల్కనైతిఁగద! నేనుత్ఫుల్ల కంజాక్షితో

362. తే.గీ. మంద భాగ్యుడనగు నేను మగువ మేను
నొక్కనాడైన స్పృశియింప నొప్పిదముగ
ఎంతపాపమ్ముఁ జేసితి నేమొమున్ను
నామెఁ జేపట్ట లేనైతి నకట! యిపుడు

363. శా. నా యాలోచనలెల్లనీటఁ గలిసెం దథ్యంబుగా నింకనే
నా యబ్జాక్షిని వీడి ప్రాణముల మేనన్ దాల్చుటల్ సాధ్యమే
నూయో! గొయ్యియొ, యగ్నియో, విషమొ యిందున్ గూడినా ప్రాణముల్
దీయం జాలినమేలు గాదె! యపుడే తీరున్ గదా! దుఃఖముల్

364. మ. అని దుఃఖించుచు నారురుండు కడకిట్లాలోచనల్ సల్పె, నీ
తనువున్ గోల్పడి లాభమేమి? పితరుల్ దైన్యంబునన్ గ్రుంగరే
ఘన పాపంబగు నాత్మహత్యవలనన్, కాయంబునే వీడినన్
గనునే నాప్రియురాలొకింతయును సౌఖ్యంబూర్ధ్వలోకంబునన్

365. తే.గీ. బ్రతికియుండిన శుభములు వడయు నరుడు
నేడు గాకున్న తేపైన నిక్కమిద్ది
యనుచు నదిలోన తాస్నాన మాచరించి
వార్చి జలముల నఱచేతఁ జేర్చియపుడు

366. చం. నిరతము దైవకార్యముల నే,మును శ్రద్ధగ సల్పియుండినన్
కరము జపాగ్ని హోత్రములఁ గాలము దప్పక సల్పుదేనియున్
గురువులపట్ల భక్తియును కూరిమి గల్గి చరించి యుంటినే
నిరవుగ నీ ప్రమద్వర చరించెడు గావుత! ప్రాణయుక్తయై

367. తే.గీ. ఆమె బ్రతుకకయుండిన నాక్షణంబె
నేను మరణించెదనుగాక! నిశ్చయముగ
ననుచు తన హస్తమందలి యంబువులను
పృథ్విపై విసరె రురుడా భీల గతిని

368. ఉ. అంతట విస్మయమ్మొదవ నాకసమందొక దేవదూత యా
చెంతన నిల్చి యిట్లువినిచెన్ మునిపుత్రక! యాగుమయ్య!నీ
కింతటి సాహసమ్ము వల దెచ్చటనైన గతించినట్టి వా
రింతకు నెప్పుడైన చరియించిరె? ప్రాణముగల్గి చెప్పుమా!

369. కం. పుట్టిన వారెయ్యెడలన్
గిట్టుట సహజమ్ముగాదె కినియగనేలా?
పట్టుదల యేల యుడుగుము
కట్టుకొనుము మఱియొక ముని కన్యను వేడ్కన్

370. కం. అని దేవదూత పలుకగ
విని ముని తనయుండు వల్కె వినయమున నిటుల్
విను మింతుల నేనొరులను
మనమున భావింపనెపుడు మాన్యచరిత్రా!

371. తే.గీ. ఈమె జీవించుటయొ లేక యీమెతోడ
నేను మరణించుట యొగాని నిశ్చయముగ
నొరుల పెండ్లాడుటకు మది నొప్పనింక
మాటలేటికి నాతుది మాటయిదియె

372. చం. అని తన నిశ్చయమ్ము రురుడచ్చుగఁ దెల్పిన దేవదూతయున్
మనమున సంతసంపడి కుమార! యొకింతయు సందియమ్ము సే
కొనక త్వదాయువున్ సగము కూరిమి నీమె కొసంగుదేని యీ
వనితకు ప్రాణముల్ గలుగు వైళమ పెండిలి యాడుమంతటన్





373. కం. ఆమాటలు వినినంతనె
మోమోట మొకింతలేక ముని తనయుడు తా
నామోదించుచుఁ దడయక
నామెకొసంగెను నిజాయు వర్థం బెలమిన్

374. కం. తన సుత మరణించిన దని
విని విశ్వావసుడు వచ్చి వివరమెఱుగుచున్
దనవెంట దేవ దూతను
గొని చనియెను యమునికడకు గొబ్బున నంతన్

375. కం. నరకాధి పతినిఁగనుచున్
సురదూత వచించె రురుని చొప్పది యెల్లన్
కరమచ్చెరు వందియపుడు
తిరముగ యముడిట్లు పలికె దివ్య పురుషుతోన్

376. చం. అమరవరేణ్య! నీమదికి నైన విధంబున నాప్రమద్వరన్
విమల చరిత్ర నిప్పుడతివేగముగన్ బ్రతికింపు మయ్య!సే
మమును రురుండుఁ బొందు, ననుమాన మొకింతయు లేదటంచు నా
యముడు వచింప నాక్షణమె యాశ్రమ భూమికిఁజేరియాతడున్

377. కం. బ్రతికించెఁబ్రమద్వర నపు
డతి ముదమునఁబెండ్లియాడె నారురుడామెన్
మతిమంతులార! మానవు
డతియత్నము సలిపెనేని నగుకార్యంబుల్

378. వ. అనియివ్విధంబున పరీక్షిన్మహారాజు తన మంత్రి పురోహితులకున్
బ్రమద్వరారురుల వృత్తాంతంబుఁదెల్పి మఱియునిట్లనియె

379. ఉ. ఆపదలందు భూమి పతి కార్యులు, మంత్రి పురోహితుల్ దగన్
బ్రాపుగనుండి చక్కని యుపాయములన్ వివరించి, వాని, న
య్యాపదనుండి ప్రోవఁదగు, నయ్యలు మీరలుఁ బ్రీతి నాదుసం
తాప మడంగఁ జేయుడు ముదంబొన గూర్పుడు నాకు నియ్యెడన్

380. కం. అని యతడు వేఁడ మంత్రులు
ననఘులు పౌరోహితులును నాసమయమునన్

మనముల కేమియుc దోపక
వినిపింపంజాలరైరి వెరవొకటైనన్

381. చం. అదిగని యౌత్తరేయుడు ప్రయత్నపరుండయి యాత్మరక్షణన్
బదిలము సేయనెంచి భటవర్గములన్ మదికెక్కువారలన్
బొదిగొననిల్పి యాపయి నపూర్వగతిన్ దివినంటుచున్నయ
ట్లొదవుచు నొంటికంబమున నుండెడు దానిని యద్భుతంబుగన్

382. కం. ఏడంతస్తులు గలిగిన
మేడను నిర్మింపజేసి మిత్రులు మంత్రుల్
గూడి చరింపగ నాతం
డోడక నివసించెనందు నుత్సాహమునన్

383. చం. భవనము చుట్టుముట్టుకొని భద్ర గజాశ్వపదాతివర్గముల్
దివిరి నిరంతరమ్ము కడుదీక్షగ కావలి గాయుచుండ, వే
రెవరును లోనికేగ నొకయింతయు సాధ్యముగానియట్లు తా
నవని విభుండు వాసరములచ్చట పుచ్చుచునుండె నిచ్చమై

384. కం. మణి మంత్రౌషధ సిద్ధుల
గణుతింపం దగిన వారు గములైరియటన్
ఫణివిషము నడచి మిక్కిలి
మణిభూషలు బొందనెంచి మనుజవిభునిచే

385. చం. అరిగె దినమ్ములిట్టు లొకయారు, భయమ్మున నెట్టు లెట్టులో
సరియగు సప్తమాహ్నమున సర్పకులాగ్రణి తక్షకుండు తా
పరుగున వచ్చుచుండె నరపాలు నిజోగ్ర విషాగ్నికీలలన్
బరపి దహింపనెంచి మునిబాలకు వాక్కు ఫలించునట్లుగన్

386. కం. సరిగా నా సమయమ్మున
నరుదెంచుచునుండె కశ్యపాఖ్యుడు, విప్రుం
డిరవుగcదన మంత్రముచే
నరపతి బ్రతికించి బహు ధనమ్ములcబడయన్

387. ఉ. భోగికులేంద్రుడున్ మఱియు భూసురవర్యుడు తీవ్రవేగులై
యేగుచునుండ నొక్కెడ నహీంద్రుడు గాంచెను మార్గమధ్యమం





దాగిన మంత్రసిద్ధుని ధరామరు, నిత్యజపాగ్ని హోత్రు, ది
వ్యాగమ శాస్త్ర విత్తము, గతాగతకర్మవివేచనా చణున్

## తక్షక కశ్యప సంభాషణము

388. చం. కని యెటకేగుచుంటివని గౌరవమొప్పగc బల్కరింప న
య్యనఘుడు కశ్యపుండనియె హస్తిన కేగుచు నుంటి నచ్చటన్
మనుజవిభున్ పరీక్షితుని మాన్యుని తక్షకుడిప్డు క్రూరుడై
కనలుపcబోవునంచెఱిగి క్రమ్మఱ నే బ్రతికింప నెంచుచున్

389. తే.గీ. తక్షకుడెకాదతని తలcదన్నువాడు
కాటువేసిన నైన తక్షణమె యతని
మరల బ్రతికింపc గలయట్టి మంత్రమహిమ
కలదు నాకంచు విప్రుడు పలికినంత

390. మ. మది నాశ్చర్యముcజెంది సర్పకుల సంభావ్యుండు తద్విప్రునిన్
గదియన్ బిల్చి ధరామరా! వినుమిదే! కౌరవ్యునిన్ గాటువే
సిదహింపన్ జనుచున్న తక్షకుడ నేcజింతింపుమా! మద్విషం
బది త్రిప్పన్ దరమౌనె నీకుcజనుమయ్యా! వెన్కకున్ క్షేమమౌ

391. చం. అన విని విప్రుడిట్లనియె నయ్యురగేంద్రునిc జూచి తక్షకా!
ముని వరు శాపవాక్యమునుcబొంది మహీపతి దేహమున్ భవత్
ఘన విషవహ్నికీల లతి కష్టగతిన్ దహియించెనేని, నేc
జని బ్రతికింతు నాతని వెసన్ బరమాద్భుత మంత్రశక్తిచే

392. మ. అని పంతంబునcబల్కు భూసురునితో నా తక్షకుం డిట్లనెన్
వనజాతాసన వంశసంభవ! భవద్వాక్యంబు సత్యంబె యై
నను నేనీ వట వృక్షమున్ క్షణములోనన్ గాల్చి భస్మంబొన
ర్తును నీవున్ బ్రతికింపcజాలినను సంతోషింతు నిక్కమ్ముగన్

393. కం. అనిపలికి పన్నగేంద్రుడు
తన విష వహ్నుల వటమును దహనము సేయన్
గనగనమండుచు నదియును
గనుచుండగ భస్మమయ్యె క్షణకాలమునన్

394. చం. అదిగని కశ్యపుండు దరహాసము సేయుచు భస్మమొక్కచోన్
గదియగఁ జేర్చి యంత నుదకంబు కరంబున నింపి మంత్రమున్
మదిఁజపియించి చిల్కె బసుమంబు పయిన్ వడినప్డు విస్మయం
బొదవ మహీరుహంబు కడునొప్పెను పూర్వవిధంబునన్ బురే!

395. తే.గీ. అతని మహిమకు నాశ్చర్యమంది యపుడు
పన్నగేంద్రుండు మెల్లగఁ బల్కెనిట్లు
భూసు రోత్తమ! నీశక్తి, బొగడఁదరమె
సంతసం బందితిని మానసంబు నందు

396. ఉ. భూసురశాపవాక్యమున భూపతిఁ జంపగఁ బోవుచుంటి, నా
యాసము నీకదేల? యత దంతమునొందుట తప్పదయ్య! దే
వాసుర సంఘమొక్కటిగ నడ్డము నిల్చిననైన, కానిచో
భూసుర వాక్శిశాత శరముల్ ధర పొల్లగునే తలంచుమా!

397. కం. "అతనిని బ్రతికించిన నా
కతులిత ముగ ధనమునొసగు" ననియెదవేమో!
అతనికి రెండింతలిడుదు
వెత దీఱ ధనమ్ముఁగొంచు వెన్కకుఁజనుమా!

398. కం. అని తక్షకుండు పలుకగ
విని భూమీ సురుడపుడు వివిధ భంగుల తా
మనమున నాలోచించెను
వెనుకొని మది సందియములు వెలువడు చుండన్

399. మ. ధనలోభంబున నా ప్రయత్నమిటులన్ దప్పించి నేవెన్కకున్
జనినన్ నాకపకీర్తిగల్గదె! భువిన్ సత్కీర్తి లేనట్టి యా
ధనమున్నన్ ఫలమేమి? మున్ను వినమే! ధర్మాత్ములౌ భూధవుల్
ధనముల్ సర్వము యాచకాళికిడరే! ధాత్రిన్ యశఃకాములై

400. కం. వరతంతు మునీంద్రునకున్
గురుదక్షిణనీయనెంచి కోరిన కౌత్సున్
పరితృప్తి నొందఁ జేయడె
ధర రఘుపతి దానమొసగి తన సర్వంబున్





401. కం. ముని విశ్వామిత్రునకున్
ధనమిచ్చెద నన్న మాటఁ దప్పక తీర్పన్
ఇనకులుడు హరిశ్చంద్రుం
డనయము కష్టములఁ బడడె యతి దైన్యమునన్

402. కం. తనకవచ కుండలములను
దినకర సుతుడిచ్చెఁ గాదె దివిజాధీశుం
డొనరగ బ్రాహ్మణ వేషం
బునవచ్చి యడిగినయంత మోదముతోడన్

403. చం. అదియునుఁగాక భూపతి విషాగ్నుల కాహుతి యౌచునుండనే
నెద సహియించియుండఁ గలనే! కడు దక్షతఁగల్గియుండియున్
వదలి ధనమ్ము కాసపడి పార్థివచంద్రునిఁ గోలుపోయినన్
పొదలు నరాజకంబయిన భూమి నధర్మపువృత్తులెల్లెడన్

404. మ. అని తర్కించుచు నెట్టులైన కడు ధర్మాత్మున్ పరీక్షిన్మహా
జననాథున్ బ్రతికించుటే ప్రజలకున్ స్వాస్థ్యంబటంచెంచుచున్
దన దివ్యంబగు దృష్టిఁగాంచె నవనీ నాథా గ్రణీ భావి జీ
వనమెట్లున్నదొ చూతమంచపుడు తత్‌బ్రహ్మజ్ఞు దుత్కంఠుడై

405. కం. కని, యారాజునకికపై
దినములు చెల్లె నని తలచి దీనవదనుడై
మనమిక చేయునదేమియు
గనరాదను కొనుచు విఫల కార్యోన్ముఖుడై

406. కం. తక్షకుని మాట చొప్పున
నీక్షణమునఁ దిరిగి యింటి కేగిన యెడలన్
నిక్షేపంబుగ నాకత
దక్షయ సంపదల నిచ్చునని తలచి మదిన్

407. కం. చనియెను తక్షకుడొసగిన
ధనములఁ గొని సంతసమున ధరణీసురుడున్
మనమున తనకార్యంబిక
నొనఁగూడు నటంచుఁదలచె నురగేంద్రుండున్

408 ఉ. సంతసమంది తక్షకుడు చయ్యన హస్తినకేగ నచ్చటన్
కుంతల ధారులౌ భటులు గూడి కడుంగడు నప్రమత్తులై
చెంతకు చీమనేనియును చేరగ నీయకయుండ, మార్గ మొ
క్కింతయు లేకపోయెను మహీశుని గాంచుటకైన నత్తటిన్

409. తే.గీ. ఒంటికంబపు మేడపై నూర్ధ్వమందు
మంత్రమణిసిద్ధులౌ మేటి మాంత్రికులను
గూర్చి కడుజాగ రూకుడై కురుకులేశు
డున్నవాడని యెఱిగి యయ్యురగ పతియు

410. ఉ. లోపలికేగుమార్గ మెటులోకద! నేనిపుడీ నరాధిపున్
శాపహతున్ మదీయ విషసంహతులన్ దహియించుటెట్లు, తా
పాపపు కార్యమున్ సలిపి బ్రాహ్మణ వాక్కును ధిక్కరించి యి
ట్లీపగిదిన్ స్థిరంబుగ మహిన్ నివసింపఁ దలంచెమూఢుడై

411. కం. అనివార్యము శాపంబని
తన మదిలోతలపఁ బోక తామృత్యువునే
కను గప్పఁ జూచుచుండెను
జననాథుం డెంత మోహ సంకలితుండో!

412. మ. తన వంశంబున మున్ను వీరవరు లిద్ధాత్రిన్ బ్రసిద్ధుల్ గడన్
తనువుల్ వాసి దివంబుఁ జేరిరనియున్ దల్పండు, తానొక్కడే
తనువున్ దాల్చి చిరంబు సౌఖ్యములఁబొందన్ జూచెడున్ దైవమా!
తనలోనం దలపోయ డింతయును సత్కార్యంబులన్ జేయగన్

413. తే.గీ. ఉన్న సమయంబునం దుపయుక్తమైన
పుణ్య కార్యమ్ములను చేయఁబోక యకట!
ప్రాణ రక్షణ కొఱకిట్లు ప్రాకులాడు
చున్న వాడెంత యజ్ఞాని సుమ్మితండు

414. తే.గీ. ధర్మకార్యమ్ములను, జేయఁదగ్గు వ్యాధు
లాయువుల్ బెరుగు ననుచు నందురార్యు
లట్లు మరణింప స్వర్గ సౌఖ్యమును గలుగు
నిరయమును బొందు నివ్విధి మరణమొంద





415. చం. అని తలపోసి పన్నగ కులాగ్రణి యొక్క యుపాయ మాత్మలో
నొనరఁగుదిర్చి కౌరవకులోద్వహునిన్ గడతేర్పనెంచి వె
న్కనఁ జనుదెంచుచున్న యురగంబులఁ గొన్నిటి నాక్షణంబ స
న్మని వరులట్లు, బ్రాహ్మణుల పోలిక కొన్నిటి మార్చి యాపయిన్

416. చం. ఫలములఁగొన్ని వారికిడి భద్రముగా నరపాలు చెంతకున్
గలత యొకింత యేనియు ముఖంబునఁ జూపక వెళ్లుడంచు తా
బలుకుచు సూక్ష్మరూపమున వారికరంబుల నొక్కశ్రేష్ఠమౌ
ఫలమున దూరియుండె తన వాంఛితమున్ నెరవేర్పఁ బూనుచున్

417. వ. వారును నాతక్షకుండు నుడివిన విధంబునఁ జనుచుండ

418. సీ. కపట వేషంబుల నృప దర్శనము సేయఁ
జనుచున్న వారలఁ జనగ నీక
ద్వారపాలకులప్డు వారించి యడ్డమై
నిలిచిన వారిని కలయఁజూచి
"ఇది యేమి వింత మమ్మేల వారింతురు
మంత్రవేత్తలము బ్రాహ్మణుల మయ్య!
రాజును బ్రతికింప రయమునఁ జనుచుంటి
మర్థి సత్ఫలముల నతని కొసగ

గీ. మమ్ముఁ జననిందు లేనిచో మాదు విధము
రాజు కెఱిగింపు" దనుచుగర్వంబు మెరయఁ
బలుక, భటులంత నృపతి కీవార్తఁ దెలిపి
రవని పతియును వారి కిట్లానతిచ్చె

419. చం. "ఇనుడస్తంగతు డౌచునుండె భయమింకేలా? మణుల్ మంత్రముల్
పనిలేదైనను వారలిచ్చు ఫలముల్ పాటించి గైకొండు ద
ర్శనమున్ జేయగ ఱేపురండనుచు మర్యాద ప్రయుక్తంబుగా
వినిపింపుం"డని తెల్పె భూపతి కడున్ విశ్రాంత చేతస్కుడై

420. కం. భటులంతట వడినటఁజని
కుటిలురు వారంచు తెలిసి కొనఁజాలక త

చ్చటుల కరపుటమ్ములఁ బ్ర
స్ఫుట రసఫలములను దెచ్చి భూపతికిడినన్

421. తే.గీ. ఔత్తరేయుండు ఫలముల నాత్మమెచ్చి
మంత్రివర్యుల కొక్కొక్క మంచి పండు
నొసగి, తానును నొకదాని నొలిచి చూడ
నందుఁ గన్పట్టె పురువొక్క టణువు వోలె

422. తే.గీ. ఏడు రోజుల గడువు నాకింక తీఱె
విప్రశాపమ్మునేటితో వీగి పోయె
నైనశాపమ్ము మన్నింప నౌనటంచు
చిన్ని పురువును తనపైనఁ జేర్చినృపుడు

423. తే.గీ. ఉరగమునకు బదులునను నొప్పిదముగ
కాటువేయును గాక యీ కీటకంబు
చూడు డంచును మంత్రులఁ జూచి పలుక
నేమిచెప్పుదు తక్షణ మెదిగియదియు

424. చం. మెఱపు వలెన్‌దళుక్కుమని మించిన కాంతులు దిక్కులంతటన్
బఱగుచు నుండ నప్పు డనివార్యగతిన్ గడు వృద్ధి నొంది చూ
పఱులకు నద్భుతం బెసగ పన్నగరూపముఁ దాల్చి భూవిభున్
గఱచి విషాగ్నికీలలను గ్రక్కుచు తక్షకుడేగె నార్భటిన్

425. తే.గీ. అగ్ని గోళమ్మువలె సర్ప మరుగుచుండ
ప్రళయ కాలంబొయేమొయీపగిదిఁజూడ
జగములింతట నశియించు సమయమనుచు
తలచి భీతిల్లి రెల్లరుఁ దల్లడిలుచు

426. తే.గీ. మొదలు నరికిన వృక్షముంబోలినృపుడు
కుప్ప గూలంగ నచ్చటఁ గూడియున్న
రక్షకులు మంత్రిసత్తము లాక్షితీశు
దుస్థితిన్ గని మిక్కిలి దుఃఖ పడిరి

427. చం. అతని సుతుండు బ్రాయమున నర్భకుడౌట పురోహితుల్ పరీ
క్షితునకు శాస్త్ర యుక్తముగఁ జేసిరి సంస్కరణమ్ములెల్ల, పం





డితులును పేదవారు తమ డెందములన్ గడు సంతసింప, గో
తతులను నన్నవస్త్రముల దానమొసంగిరి పుష్కలమ్ముగన్

428. ఉ. అంతట మంచి మూరుతము నందొకనాడు పరీక్షితాత్మజున్
చింతలు చీకులున్ గనని స్నిగ్ధశరీరుని చిన్నవాని న
త్యంతముదమ్మునన్ నిలిపిరార్యులు మంత్రి పురోహితుల్ ధరా
కాంతుని పీఠమం దుచితగౌరవ మొప్పగ, మెచ్చగన్ బ్రజల్

429. కం. జనమే జయుడను పేరన్
దినదిన వర్ధిష్ణు డౌచు తేజంబెసగన్
గొనకొని లౌకికవిద్యల
తన పౌరోహితుల చెంతఁ దద్దయు నేర్చెన్

430. కం. సకలాస్త్ర శస్త్ర విద్యల
నకలంకుడు కృపుడు నేర్పె నాచార్యుండై
త్రికరణశుద్ధిగఁ నటుపై
ప్రకటంబగు వేదశాస్త్ర ఫణితుల నేర్చెన్

431. కం. కాశీపురాధి పతియై
ప్రాశస్త్యముఁగన్న స్వర్ణవర్ణాక్షు సుతన్
ధీశాలి పరీక్షిత్ సుతు
డాశించి వివాహ మాడె నతివ వపుష్టన్

432. కం. దంపతు లిరువురు మిక్కిలి
యింపగు వనములను గిరుల నెల్లెడలఁగడున్
సొంపులు గుల్కగఁ దిరుగుచు
దాంపత్య సుఖంబులందుఁ దనిసిరి మఱియున్

433. చం. తనరగ సత్యధర్మ పరతన్ సకలోర్వర నేలుచుండె తా
ననయము ధర్మరాజువలె నందఱి మెప్పులు వొందుచున్, బ్రజా
ధనముల పక్షపాతరహితంబుగఁబంచుచు వేడ్కనెల్ల భూ
జనులిక నన్యు నొల్లక ప్రశంసలు సేయ జితేంద్రియుండునై

## ఉదంకోపాఖ్యానము

434. వ. ఇట్లు జనమే జయుండు సకల జనరంజకంబుగా రాజ్యంబు నేలుచుండ

435. చం. అనుపమ సత్తపో నిరతు డార్య విధేయుడుదంకుడన్ మహా
మునివరు డొక్కనాడటకు మోదమునంజనుదెంచె సత్వరం
బున జనమేజయాధిపుని పుణ్య చరిత్రుని జూడ, మానసం
బున తనపట్ల తక్షకుడు మున్ను చరించిన రీతి నెంచుచున్

436. ఉ. వచ్చిన యాతనింగని నృపాల వరేణ్యుడు లేచినిల్చి, బల్
మెచ్చుగ స్వాగతించి, యెలమిన్ సరసాన్నములన్ గడున్ గడున్
నచ్చిన రీతిఁదృప్తి నిడినన్ మునివర్యుడు సంతసించి, తా
నిచ్చకమౌమృదూక్తుల మహీపతిఁగాంచుచుఁ బల్కె నివ్విధిన్

437. చం. నిను గన జాలియౌను, గన నేరవు యుక్తములైన కార్యముల్
పనుగొన నీవయుక్తములు పాయక చేయుచు నుందు, విట్టినీ
మనుగడఁ జూడ పౌరుషముమాని చరించెడిరీతిఁ దోచు, నే
నెనయ వచింప లాభమె? మహీశ! యెఱుంగవు మంత్ర తంత్రముల్

438. కం. బాలుని పగిది చరింతువు
బేలవు, నీవారలెవరొ? పెఱవారెవరో?
పోలుచుకొనలేవైతివి
యీలాగుననైన పుడమి నెట్లేలెదవో?

439. చం. అనవిని యానృపాలుడు మహర్షినిగాంచి వివేకసత్తమా!
నెనరున నిష్ఠు వ్యంగ్యముగ నీవు వచించిన పల్కులెల్ల, నే
యనువున నేనియున్ మదికి నర్థమొకింతయుఁ గావునాకు, నీ
వనిన విరోధులెవ్వరొ దయార్ద్ర మతిన్ దెలియంగఁజెప్పుమా!

440. చ. అనిన నుదంకుడిట్లనె, నరాధిప నీకెఱుగంగఁదెల్పెదన్
వినుమిక నీదు తండ్రిని వివేక విహీనుడు తక్షకుండు తత్
ఘన విష దంష్ట్రలన్ గఱచి కాలుని ప్రోలుకుఁ బంపెక్రూరుడై
మునిసుతుశాపమన్న నెపమున్ దల దాలిచి నీతిదూరుడై





441. కం. ఈ విషయము నీ మంత్రులు
భావంబుల నెఱిగి నీకు వచియింపరొగిన్
నీ వడుగుమయ్య వారల
నావచనము సత్యమంచు నమ్మకయున్నన్

442. చం. అనవుడు భూవిభుండు తనకాప్తులు వృద్ధులునైన మంత్రులన్
వినయముతోడఁ బిల్చి కదువిజ్ఞులు మీరలు చెప్పుడయ్య! మా
జనకుని తక్షకుండు నిజ శాత విషోరుతరోగ్ర దంష్ట్రలన్
గనికర మింతలేకటులఁ గాటిడి చంప కతంబదేమొకో

443. కం. అని యడిగిన మంత్రివరులు
వినిపించిరపుడు జరిగిన విషయమదెల్లన్
విని జనమేజయు డమ్మునిఁ
గని యిట్లు పలికె వినమిత గాత్రుండౌచున్

444. తే.గీ. ఇందుఁ దక్షకు తప్పేమొ యెఱుగనైతి
విప్రశాపమ్మునవె తండ్రి విడిచె తనువుఁ
గాన వైరంబు నితనిపై బూననేల
యనిన నయ్యుదంకుండు తా ననియెనిట్లు

445. చం. అదియటులైన యాతడు ధరాధిపునిన్ దగకాటువేసి, తా
మదిఁ బరితృప్తిఁజెంది ముని మాన్యుని శాపము దీఱఁబొమ్మటం
చెదఁ దలపోయకక్కట! యదేలొకొ కశ్యపు మంత్రసిద్ధునిన్
బదిలముగా ధనంబొసగి పంపెను వెన్కకు మున్నె దుష్టుడై

446. తే.గీ. అట్టి నీచుని శాత్రవుండనక యెట్లు
హితుని పగిదిగఁ జూతుమో యెఱుగుమయ్య
శత్రువులపైన పగఁదీర్పఁజాలినట్టి
రురుడు నీకంటె మేలౌను ధరణి నాథ!

447. చం. మునిసుతుడైన యారురుడు మున్ దనప్రేయసి యౌప్రమద్వరన్
వనమున సర్పమొండు గఱవన్ వడి దేహము వీడ నంతటన్
మనమున రోషమున్ గని క్రమంబున పాములనెల్ల దండమున్
గొని వెసఁజంపుచుండెఁ బలు కొండల కోనల సంచరించుచున్

448. చం. అలయక నిట్లు కాననములందెదురై కనిపించినట్టి పా
ముల వరుసన్ వధించు మునిపుత్రుని ముందొక వృద్ధసర్ప మా
కులమతి యౌచునుండఁగని క్రుద్ధత నాతడుదగ్ర రూపుడై
జెలగి వధింపఁ బోవ నది చిత్రముగానిటు పల్కె వానితోన్

449. శా. అయ్యా! యెందులకిట్లు నిర్దయుడవై యన్యాయ వృత్తిన్ ననున్
నెయ్యంబింతయు లేక చంపెదకటా! నేనెన్నడైనన్ నినున్
కయ్యంబాడగఁ బిల్చితే, కఱచితే, కాంతారమం దొంటినై
యయ్యా! తిర్గుచునుంటి చంపకుము నన్నాత్మీయుఁగా నెంచుమా!

450. చం. అనిన రురుండు వల్కెనిటు లాయురగమ్మును జూచి, మీకులం
బున నొకరుండు నాప్రియను పూని ప్రమద్వరయన్న కన్యకన్
తన విషవహ్నిఁ జంపఁగని తద్దయు కోపముఁబూని నేను నా
దినముననుండి సర్పములఁ ద్రెక్కొను చుంటిని నిర్దయుండనై

451. ఉ. నావుడు సర్పమిట్లనియె నమ్రత దోప మునీంద్ర పుత్ర! నీ
వీవిధిఁచేయధర్మమె వచింపు ప్రమద్వరఁ జంపినట్టి పా
పావహుడెవ్వడో యెఱుగనయ్య! ననున్ భువిలోననున్న స
ర్పావళి తోడఁ బోల్చకు మనావిలచిత్తుడ శాపదష్టుడన్

452. తే.గీ. అర్థయుక్తంబుగా నిట్టు లనిన యతని
జూచి రురుడు తా మిక్కిలి చోద్యమంది
యిచట నిట్లుండుటకుఁగతమేమొ చెపుమ
సర్పరూపంబు నీకెట్లు సంక్రమించె

453. చం. అనవిని వృద్ధ సర్పమిటులా మునిపుత్రునిఁ గాంచి పల్కె ము
న్ననఘ చరిత్రుడౌ ఖగముఖాఖ్యుడు నాకొక మిత్రుడుండె, తా
నొనరగ నగ్నిహోత్రమును నొక్కదినంబున వ్రేల్చుచుండ, నే
చనవున గడ్డి వెంటిఁ గొని చయ్యన నాతని ముందువైచినన్

454. చం. అది యురగంబటంచు నత డాత్మఁదలంచి కరమ్ము భీతిచే
నదరి పడంగఁ నవ్వు పరిహాసముఁ జేయుచు గంతులేయు, నా
వదనముఁ జూచి కోప పరి వర్ధిత నేత్రయుగారుణోగ్రుడై
యదలిచి సర్పమై తిరుగుమంచు శపించె నవారణక్రియన్





455. చం. సరగున నంతనేనతని చక్కియకుంజని గడ్డి వెంటికే
కరము భయమ్ము జెందితివి కాదిది సర్పమటంచుచెప్పినన్;
తిరముగ కొంత శాంతిఁగొని "త్రిప్పగరాదు మదీయ శాపమున్
తిరుగుచునుండు మిట్లురగ దేహము దాలిచి కొంతకాలమున్"

456. కం. ప్రమతి కుమారుడు రురుడను
విమలాత్ముడు వచ్చు దనుక విధి యిటులనుచున్
శమము దలిర్పగ నుండుము
శమియింపంజేయు నీదు శాపము నతడున్

457. కం. అనిపల్కి ఖగముఖుండును
జనియెను తనయిచ్చ, నేను సద్బ్రాహ్మణుడన్
మనమున నిను రురుడని యిపు
డను కొందును గాన నాకు నాప్తుడవగుటన్

458. చం. విను మొక యుత్తమోత్తమము విజ్ఞుల కాచరణీయ ధర్మమున్
వినిచెద సర్వభూతములఁ బ్రీతిఁగనందగు నెల్ల వారికిన్
అనయము భూతహింస విడనాడుట విప్రులకొప్పుఁగావునన్
గొనకొని చంపఁబోకు మిక గ్రూరత సర్పములన్ ధరామరా!

459. కం. అనిపలికి డుండు భాఖ్యన్
దనరెడి యాసర్పమంత తన నిజరూపం
బునుధరియించి వెడలె, నం
తన రురుడును హింసమాని ధర్మయుతుండై

460. కం. సగమాయువొసగి ప్రేయసిఁ
దగ బ్రతికించుకొని యంతఁదాఁబెండ్లాడెన్
సుగుణ వతిఁబ్రమద్వర న
య్యగణిత దృఢనియమ శీలు డానందమునన్

461. ఉ. కావున విప్రుడయ్యె నురగంబులపై పగఁబూనెనాత, డీ
భూవలయాధినాధుడవు పూరువరాన్వయ సంభవుండవై
చేవఁ దొఱంగి యుండుటిది చెల్లునె నీ జనకుండు స్వర్గమం
దేవిధి శాంతినొందు నిక నెంచుమ! నీమదిలో జనాధిపా!

462. తే.గీ. తండ్రి పగతురఁగడతేర్ప ఁదగని యట్టి
పుత్రుడుండియు ఫలమేమి భూమినాథ!
సర్పయాగమ్ముఁ గావించి సత్వరముగ
సంహరింపుము పన్నగ జాతినెల్ల

463. తే.గీ. పాపమని యెంచఁబోకు మప్పాపతేని
బంధు యుక్తంబుగాఁజంప భావ్యమగును
యజ్ఞ కార్యంబులన్ జేయునట్టిహింస
హింస కాదని పల్కుదు రెల్ల బుధులు

464. మ. అని యుత్తంకుడు వల్క భూమి విభు డత్యంతంబు దుఃఖంబునన్
తన తండ్రిన్ మదిలోఁ దలంచుకొని యంతన్ దక్షకున్ రోయుచున్
మొనసెన్ సర్పకులంబునెల్ల నిల సంపూర్ణంబుగా నాశనం
బొనరింపన్ వెస సర్పయాగమున నయ్యుగ్రానల జ్వాలలన్

465. వ. అయ్యుదంకుండు చెప్పిన విధంబున సర్పయాగంబొనరించి
పితౄణమున్ దీర్చుకొందును

466. చం. అని యోచించుచు మంత్రి పుంగవుల నాహ్వానించి “భాగీరథీ
ఘన తీరంబున యజ్ఞవేదికను సాకల్యంబుగా నిర్మితిన్
గొని చేయింపుడు వస్తు సంచయములన్ గూర్పుండు వేగంబుగా”
నని యాజ్ఞాపన చేసె యాగమును చేయన్ బూని తానంతటన్

467. కం. నిగమాగమ పండితులన్
దగురీతిగఁ బిల్వు, డియ్యుదంకుడు ముఖ్యుం
బగు హోత యగును, బలిపశు
వగు తక్షకుడు పరిజనము లందరి తోడన్

468. కం. అని జనమేజయ భూపతి
తన మంత్రుల కాజ్ఞ యిడగ తాము‌ను వేగన్
పనులెల్ల సక్రమంబునఁ
గొనకొని చేయించిరపుడు కొఱతలు లేకన్

469. చం. మొదలిడిరంతయాగమును, పొల్పుగ వేదనినాదముల్ దిశల్
గదియగ హవ్యవాహన శిఖాఛట ఛిట్ఛిట భీకరార్భటుల్





చదల ధ్వనింప తక్షకుడు స్వాంతమునన్ భయమంది వేగ తా
నదరుచు పాహిమామ్మని దివాధిపు చెంతకుఁ జేరె నంతటన్

470. చం. అమర గణాధినాధుడపు డాతనిఁ జేరగ దీసి యూఱడి
ల్లుమనుచుఁబల్కి మానసములోని భయంబును దీర్చె, నంత స
ర్పములు రయంబునన్ సవన పావక కీలలఁద్రెళ్ళుచున్ గడున్
గమలుచునుండె చుయ్యిమని కష్టగతిన్ గములౌచు నయ్యెడన్

471. చం. అతుల మహోగ్రదేహులును నల్పశరీరులు రక్తనేత్రులున్
వితత నవాష్ట సప్తదశవింశతి సంఖ్యలఁ బొల్చు భోగసం
యుతులు సితాసితారుణ బహూదర వక్త్రులు యజ్ఞకుండమం
దతి చలితాంగులౌచు పవనాశను లొయ్యనఁద్రెళ్ళుచుండగన్

472. కం. తక్షకుడు మహేంద్రునికడ
రక్షింపంబడుట యెఱిగి ప్రాజ్ఞుడుదంకుం
డాక్షణ మామంత్రించెను
చక్షుశ్రవు నింద్రుతోడ సవనాగ్నిఁబడన్

473. కం. అదియెఱిగి తక్షకుండును
మదిలో నాస్తీకుఁదలచె మౌన యుతుండై
ముదమున నాముని బాలుడు
సదయుండైవచ్చె సవన శాలకునంతన్

474. ఉ. వచ్చినయంత తాను నృపవర్యునిగాంచి ” శుభంబు నీకగున్
మెచ్చితినయ్య నేమదిని, మేదిని నింతకు మున్ను నెవ్వరి
ట్లచ్చుగ సర్పయాగము ధరాధిపు లెన్నడుఁ జేయరెచ్చటన్
బొచ్చెముగాదు నీయశము పొల్పెసలారె జగంబులంతటన్

475. చం. అతుల మతుల్ సదస్యులిట నబ్జజ తుల్యులు, హోమకుండముల్
వితత హుతాశనోజ్జ్వల నవీన శిఖల్ వెలయించుచుండె, నీ
క్రతువున యాజకుల్ గడుప్రకాండులు, యజ్ఞ విధానవిద్యలం
జతురులు వారి కెయ్యెడల సాటి యెఱుంగ నృపాలశేఖరా!

476. మ. అని యాస్తీకుడువల్క భూవిభు డమందానందమున్ జెంది యా
ముని పుత్రున్ గడు సత్కరించి పలికెన్ బుణ్యాత్మ! యేయర్థమున్

మనమందెంచితొ తెల్పుమయ్య! కదు సమ్మానంబునందీర్తు నో
యనఘా! సందియమందఁబోకుమన, నయ్యాస్తీకుడున్ బ్రీతుడై

477. కం. జనమేజయ భూనాధా!
వినుమీ! యీహవనమింక విజ్ఞులు మెచ్చున్
కొనసాగింపక నిలుపుము
చననీకుము యమ పురికిక సర్పకులంబున్

478. తే.గీ. అనుచు నాస్తీకు డర్థింప నవని పతియు
సర్పయాగమ్ము మాన్పించె, సాధుజనుల
మాట మన్నించుటదియొప్పు మానవులకు
ననుచు తలపోసి మంత్రులు ననుమతింప

479. తే.గీ. ఒక్కని కొఱకై యిందర
నుక్కడ గించుటది యొప్ప దుర్వి నెవరికేన్
పెక్కెల జాతిమొత్తం
బొక్కట నశియింపజేయు టుచితమె జగతిన్

480. కం. అంతట నాస్తీకుడు తా
సంతోషముఁజెంది భరత సత్కులచరితం
బంతయు వైశంపాయను
చెంతన్ వినుమని నృపునకుఁ జెప్పి వెడలినన్

481. కం. ఆనర పాలుండాతని
యానతితో భారతమ్ము నంతయు వినియున్
మానసమున శాంతి యొకిం
తైనను గనఁ జాలకపుడు వ్యాసునిఁ గనుచున్

482. ఉ. సాత్యవతేయ! నా మనసు శాంతినిఁ బొంద దొకింతయేనియున్
ప్రత్యహమున్ దహించెడు, ప్రభాకరతేజుడు పార్థు పౌత్రు డౌ
న్నత్యముతోడ వీరమరణంబును బొందిన నైన మెత్తు; నా
సత్యపథానుగమ్యుడిటు సర్పముచే మరణింప దుఃఖమౌ

483. ఉ. దారుణ మారణంబునకుఁ దక్షకుడోర్చి యొనర్చె నిట్టు; లే
తీరున దుర్గతుల్ దొలగి దివ్య పదంబొన గూడు తండ్రికిన్





సారమతీ! వచింపుము భృశంబుగ శాంతినిఁ గూర్పుమయ్య; నా
కారయ నంతదన్క మదినాఱవు దుఃఖ దవాగ్ని తాపముల్

484. కం. అని వేదవ్యాసుని తా
జనమే జయుడడిగినంత; సాత్యవ తేయుం
డనియెను సత్కృప నిట్లని
మనమున ముదమొదవ, నృపుని మానస మలరన్

485. చం. వినుము పురాణమొండు వినిపించెద నద్భుతమున్ శుభప్రదం
బును నగుదాని భాగవతమున్; గడు గుహ్యము నైన దీని నా
తనయునకున్ శుకర్షికి ముదంబునఁ దెల్పితిమున్ను; విన్నచో
ననయము మానవాళి పురుషార్థములన్ బడయంగనౌనిలన్

486. కం. అని భాగవతముఁ దెలుపగ
ముని వంద్యుడు వ్యాసుడపుడు మొదలిడినంతన్
జనమేజయు డడ్డు పడుచు
"మునిసుతు నాస్తీకు చరితమును వినఁదలతున్"

487. ఎవరీ యాస్తీకుడు తా
నెవరి కొఱకు సర్పయాగ మిటు మాన్పించెన్
వివరించి తెలుపు మనినన్
వివరింపఁ దొడంగె నతని వృత్తాంతంబున్

## ఆస్తీక వృత్తాంతము

488. మ. కలదత్యంత తపోధనుండిల జరత్కారుండనన్ మున్నొకం
డలఘు స్వాంతుడు బ్రహ్మచర్య దృఢ నిష్ఠాత్ముండు హృష్టాత్ముడై
బలు తీర్థంబులు క్షేత్రముల్ దిరుగుచున్ బ్రహ్మాత్మ భావంబుతో
నెలమిన్ సాంద్రవనంబునందొక దినంబిచ్ఛా గతిన్ బోవుచున్

489. మ. కనియెన్ దాఁ దనవంశపూర్వుల నటన్ గర్తంబునందొక్కచో
ననయంబున్ దలక్రిందు లౌచుఁ దృణ మూలాప్త స్వపాద స్థితిన్
విను వీధిన్ గనుచున్ విచారమతులై వ్రేలాడు వారిన్ సదా
తనకై తెన్నులు చూచువారల నిజాత్మన్ విస్మయంబందుచున్

490 కం. వారలఁ జూచిన యాతడు
దారుణ మిది యేమిటయ్య! తారిచ్చోటన్
వారకఁ దల క్రిందులుగా
నీ రీతి వసింపఁ గతమదేమని యడుగన్

491. చం. పితరులు వల్కిరి ట్లతనిఁ బ్రీతిఁగనుంగొని వత్స! మాకు దు
ర్గతులిక తప్పవయ్య! విను, కన్నియ నొక్కతెఁ జూచి నీవు స
మ్మతిని వివాహమైయొక కుమారుని బొందెదు దన్క; కాన స
ద్గతులను మా కొసంగుము ముదంబునఁ బుత్రులఁ బొంది నీవికన్

492. తే. అనిన నా జరత్కారు డిట్లనియె నపుడు
నామ భేదమ్ము లేనట్టి లేమ నాకు
నవని దొరకినఁ బెండిలి యాడుదనుచు
పలికి తీర్ధయాత్రలకుఁదా బయలు దేరె

493. వ. అదియట్లుండ

494. కం. ఒనరగ కశ్యప పత్నులు
వినతాకద్రువలు మున్ను విహరింపంగన్
జనిరొక సాయంకాలము
వననిధి తటమునకు వేడ్క వారిజనేత్రల్

495. ఉ. శారద చంద్రికన్ బలెను సజ్జన మానస మన్నరీతిగన్
నీరధి ఫేనమో యనగ నిర్మల హాస విలాసమన్నటుల్
ధీరుని కీర్తి నానెసగు దివ్య హయమ్మును శ్వేత వర్ణమున్
దూరము నందు గాంచిరట తోయజ నేత్రలు కశ్యపాంగనల్

496. తే.గీ. చూచి కద్రువ యిట్లనె చూడు మక్క!
అశ్వదేహమ్ము ధవళమై యమరి యుండి
చంద్ర బింబమ్ము నందలి ఛాయఁ బోలె
పుచ్ఛ భాగమ్ము నల్లనై పొలుచు నదిగొ

497. తే.గీ. అనిన వినతయు నాశ్చర్యమంది యనియె
ధవళ వర్ణంబునన్ బొల్చు దాని నిట్లు





తోక నలుపంచు చెప్పుట నీకు తగునె
కన్నులేమైన మసకలు గ్రమ్మె నేమొ.

498. తే.గీ. అంత కద్రువ యిట్లనె నామెఁ జూచి
ధవళ మదియైన నే నీకు దాసి నౌదు
నలుపు గలిగిన దాస్యమ్ము నాకు నెఱపు
మనిన వినతయు సమ్మతం బనినయంత

499. మ. అని పందెమ్ములు వేసి కొంచు నినుడస్త్రాద్రిన్ బడన్ భర్త సే
వనమున్ జేయగ వేళయయ్యె ననుచున్ వారిర్వురున్ ఱేపు సూ
ర్యుని కాంతుల్ పయికొన్నవేళ మన మయ్యుచ్చైశ్రవంబున్ గనన్
జనవచ్చున్ బదమంచు వెళ్ళిరపు డా శాతోదరుల్ సమ్మతిన్

500. మ. అంతన్ గద్రువ యింటికేగి యట నే కాంత ప్రదేశమ్మునన్
చెంతన్ బుత్రులనెల్లఁ జేర్చి వినుడీ చిన్నారులౌ మీరు నా
చింతన్ బాపగనౌను సాగరతటిన్ శ్వేతాశ్వపుచ్ఛంబునం
దింతైనన్ ధవళత్వమున్ గనని యట్లెట్లైనఁ జేయన్ వలెన్

501. తే.గీ. దాని పుచ్ఛంబు నలుపయ్యె నేని నాకు
వినత దాస్యంబుసేయును; వెల్లయైన
నేను దానికి దాస్యంబు నెఱపవలయు
పందె మాడితి మయ్య యీ పగిది మేము

502. కం. ఱేపకడ యొక్క డీపని
చేపట్టన్ వలయునంచు చెప్పినయంతన్
కాపథమగు నీ యోచన
పాపంబని పాములెల్ల పలుకకయుండెన్

503. కం. వినయంబున కర్కోటకు
డను సర్పం బొకటి తల్లి యానతిఁ గొని తా
జని యాగుఱ్ఱపుతోకన్
గనిపించక చుట్టియుండె కార్పణ్యమతిన్

504. కం. మరుసటి యుదయంబందా
తరుణులు సని చూడ నుదధి తటమునఁగల యా

తురగంపు పుచ్ఛ భాగము
కరమరుదుగ నల్ల నౌచుఁ గానంబడియెన్

505. కం. పందెము నోడితి నని యర
విందానన వినత యపుడు విధి వంచిత యై
పొందెను దాసీత్వము, ధర
నెందును విధి నిర్ణయమ్ము నెదురగఁ దరమే!

506. కం. తనమాట వినని కతమున
జనమే జయు డాచరించు సర్పమఖాగ్నిన్
కనలుచు నీల్గుండనుచున్
తనయులకున్ శాపమొసగెఁ దా కద్రువయున్

507. మ. వినతాపుత్రుడు పక్షిరాణ్మణి మహావీరుండు తానొక్కనా
డనియెన్ దల్లినిఁ జూచి నీకిటుల దాస్యం బేలఁ బ్రాప్తించె; నీ
తనయుండుండగ నీవు దాసివయి నిత్యంబిట్టులీ కద్రువన్
వినయంబొప్పగ సేవఁ జేయఁ దగునే భీతిల్లకే చెప్పుమా

508. కం. అని గరుడు డడుగ వినతయు
తనకును తన సవతి కైన తన్నియ మంబున్
వినిపించి దాని కతమున
మనవలసెన్ దాస్యవృత్తి మానక యనుచున్

509. ఉ. ఆయమ యేది చెప్పినను నడ్డము చెప్పక యాచరించుచున్
పాయక చెంత నుండవలె;పాముల నెల్లను నామె పుత్రులన్
మోయ వలెన్ బ్రమోదమున; పూర్వ భవంబున పుణ్య కార్యముల్
సేయక యుంటినేమొ యిటు చేసెను దైవము నేటి జన్మకున్

510. చం. అనిన ఖగేంద్రుడిట్లనియె నమ్మరో! నేనిక నీదు దాస్యమున్
గొనకొని చేయ బూనెదను కొందల మందకు మంచుఁబల్కి తా
తన పినతల్లినిన్ మఱియు తత్సుతులన్ గని మీకునింక నే
ననయముసేవఁ జేయుదు మదంబకు మారుగ నంచుఁ బల్కినన్

511. ఉ. వారును సమ్మతిందెలుప వాయుజవంబునఁ గాత్ర వేయులన్
భూరినిజాంస భాగమునఁ బొల్పుగ నిల్పి నిరంతరమ్ము తా





వారిధి పై నభంబున నవారితరీతినిఁ ద్రిప్పుచుండె పెం
పారెడు సంతసమ్మొదవ నయ్యహివైరి యనంత తేజుడై

512. తే.గీ. అంత నొకనాడు పినతల్లి నడిగెనతడు
తల్లి దాస్యమ్ముఁ దీర్పంగఁ దలపు కలిగె
కోర్కెఁ దీర్చెద మీరెద్ది కోరుకొనిన
సంశయింపకు మది కష్ట సాధ్యమనుచు

513. మ. అనినన్ గద్రువ పల్కెనిట్లు వినుమయ్యా! నీవు నిక్కంబుగా
జననీ దాస్య విముక్తిఁ గోరు నెడలన్ స్వర్గాధి నాధున్ రణం
బున నోడించి ప్రశస్తమైన యమృతంబున్ దెచ్చి మాకిచ్చినన్
వినతా దాస్యము తీరు నంతటఁగడున్ స్వేచ్ఛాగతిన్ వెళ్ళుడీ

514. చం. అనవిని వైనతేయు డమరాధిపతిన్ వడిఁ దాక నేగె తా
ననిల జవంబునన్ దివిజు లక్కిలిఁజెందగ, పక్షయుగ్మ సం
జనిత మహోగ్ర వాయుఘన సంహతి నిద్ది యుగాంతమన్నటుల్
మనములఁ గొందలంపడుచు మ్రాన్పడ నెల్ల దిశాధి నాధులున్

515. చం. అమర పురంబుఁ జేరి యమృతాశన పంక్తుల తోడ ఘోర మౌ
సమర మొనర్చి; దేవ విభు శాత శరవ్యధ కోర్చి, వజ్ర ఘా
తమునకు సైతమున్ హృదయ తాపముఁ జెందక విక్రమోర్జిత
క్రమమున కశ్యపాత్మజుడు గైకొని వచ్చె సుధన్ రయంబునన్

516. తే.గీ. తెచ్చి యమృతపు భాండమ్ము నిచ్చకమున
కద్రువకుఁ జూపి దర్భ సంకలితమైన
పుడమిపై నుంచి మీరిక తడవు లేక
యారగింపుడు స్నానమ్ము లాచరించి.

517. కం. అనితెల్పి యాతడంతట
తనతల్లిన్ వెంటఁ గొనుచుఁ దద్దయుఁ బ్రీతిన్
జనియెను గరుడుడు స్వేచ్ఛగ,
ననఘాత్ములు పొందరాని దవనిన్ గలదే!

518. చం. గరుడుడు చెప్పినట్టు లురగంబులు గంగకునేగి స్నానముల్
సరగునఁ జేసి వత్తమని సాగి క్రమంబున స్నాన మాడి వెన్

దిరిగెడు నంతలోపలనె దేవ విభుండమృతంపు భాండమున్
దిరముగ సంగ్రహించుకొని తీవ్ర రయంబునఁ జేరె నాకమున్

519. ఆ.వె. స్నాన మాచరించి సర్పమ్ములన్నియు
వచ్చి చూడ నమృత భాండ మచటఁ
గానరాకయున్నఁ గడు దుఃఖమును జెంది
కోరి నాకి రచటి కుశ దళముల

520. ఆ.వె. నాకినందు వలన నాల్కలు రెండుగా
చీలి యుండుటన్ ద్విజిహ్వలనగ
వాసిఁ గాంచె ధరణి వాతాశనకులమ్ము
సుధ నొకింత యేని చూడ రైరి

521. తే.గీ. జనని శాపమ్ముఁ బొందిన సర్పకులము
వాసుకిన్ మునుకొని యబ్జ భవుని కడకు
నేగి శరణమ్ము వేడిరి యెల్లవారు
అహిమఖమ్మును మాన్పింపు మనుచువేగ

522. ఉ. వారల వేదనల్ వినిన వారిజగర్భుడు వల్కెనిట్లు, మీ
రోరిమిఁ దాల్చియుండు డిక నొక్క యుపాయముఁజెప్పెదన్ జర
త్కారుడనంగ నొక్కముని కాశ్యపిఁ దీర్థములందుఁగ్రుంకుచున్
ధీరత బ్రహ్మచర్యదృఢ దీక్షవహించి చరించు నెప్పుడున్.

523. చం. అతడు సనామధేయ యగు నబ్జదళేక్షణఁ బెండ్లి యాడ సం
తతమును కోరుచుండు మది; తథ్యము; వాసుకి చెల్లెలైన య
య్యతివ సనామధేయ నిపుడాతనికిచ్చిన, వారికంతటన్
సుతుడుదయించు; మానుపును సుమ్మత దమ్మఖమున్ ధ్రువంబుగన్

524. కం. ఆతండాస్తీకుండన
భూతలమునగణుతి కెక్కు పొండికఁగదువి
ఖ్యాతు జరత్కారునిఁ గని
ప్రీతి జరత్కారువునిడి పెండ్లి జరుపుడీ!

525. కం. అనిపలికి బ్రహ్మయంతటఁ
జనియెను నిజవాసమునకు; సర్పములంతన్
వనజాసను నుతియించుచు
మనముల సంప్రీతిఁ జెంది మరలిరి వేగన్

526. ఉ. బోరననేగి వాసుకియు పూత చరిత్రు మునీంద్రు నా జర
త్కారునిఁ జూచె నొక్క యెడ కానన సీమల; చూచి వానికిన్
కూరిమి తత్సహోదరిని కోమల గాత్రిని కన్నియన్ జర
త్కారువుఁ గూర్చి తెల్పగ ముదంబున నాతడు సమ్మతించుచున్

527. తే.గీ. నాకు నచ్చని యట్లు తా నడచుకొనిన
వదలివేయుదు నయ్యమ నది మొదలుగ
దీని కంగీకరించితి వేని నేను
పెండ్లి యాడుదు నామెను బ్రీతితోడ.

528. చం. అని నియమంబు వెట్టినను నయ్యహి వర్యుడు సమ్మతించుచున్
వినయ మెసంగ సోదరిని వేడుక నిచ్చి వివాహమున్ గడున్
ఘనముగఁ జేసి యెల్లరకు కానుకలన్ దగనిచ్చె, నంతటన్
మునివరుడున్ ముదంబొదవ ముద్దియతో ప్రణయానురాగుడై

529. చం. ఒనరగ పర్ణశాల యొక టొయ్యన నిర్మితిఁ జేసి, కాపుర
మ్మనయముఁ బ్రీతితోడఁ బ్రణయాబ్ధిమునుంగుచు జేయుచుండ, న
మ్ముని వరుడొక్కనాడు తన ముద్దియతోనని నెట్టి వేళలన్
ననుఁ గడు నిద్రఁ గూరు తఱి నాతిరో! లేపకు మంచు నిశ్చితిన్

530. కం. తనసతి కాజ్ఞ యొసగి య
మ్ముని మధ్యాహ్న సమయమున భుజియించితగన్
గనియెను గాటఁపుఁ గూరుకు
నిను దస్తమయమ్ముఁ జెందు టేని యెఱుగకే

531. చం. అతనికి సంధ్యవార్చు సమయం బని యెంచి తదీయ పత్ని స
న్మతిఁ దలపోసెనిట్లు; ముని మాన్యుని నిద్దుర లేపి తేని న
న్నతడిక వీడు నప్రియమటంచుఁ దలంచుచు; లేపకుండినన్
బతికగు ధర్మ హాని, యది పాయక దుర్గతి హేతు వౌగదా!

532. చం. వదలిననేమి యౌననుచు వైళమ యాతనిఁజేరి నాథ! మీ
కదనిది సంధ్యవార్చుటకు, హాయిగ నిద్దురవోవు చుంటిరే!

పదపడి లెమ్ము లెమ్మనుచుఁ బల్కి మునీంద్రుని తట్టి లేప; తా
నదరుచు లేచి యామెఁ గని యాగ్రహ మొందుచుఁబల్కెనివ్విధిన్

533. తే.గీ. గాఢనిద్ర లేపి కాని కార్యంబిట్లు
చేసి తీవుగాన శీఘ్రగతిని
నిన్ను విడిచి పోదు నీ సోదరుని చెంత
కరిగి యుండు మనుచు నతడు వల్క

534. కం. ఆమాటలు వినినంతనె
యామానిని భయముఁ జెంది యదరి పడుచు తా
నామాన్యుని గని మనమున
నామోదింపకయె యిట్టు లనియెను మెల్లన్

535. చం. మునివర! నన్ను మీకిడి ప్రమోదమునన్ దగ పెండ్లిచేసె మున్
ఘనముగ నాసహోదరు డొకానొకయల్లునిఁ జూడఁగోరి; మీ
రనఘులు నేడిటుల్ పలుక నాతని కోరిక యెట్లు తీరునో
మనమున నెంచుమా! యొక కుమారుని నాకు ననుగ్రహింపుమా.

536. చం. అని యడుగన్ మునీంద్రుడపు డామెను జూచి 'తదస్తి' యంచుఁ దా
జనియెను మారు వల్కక; ప్రసన్న ముఖాంబుజ యౌచు నంత న
వ్వనితయుఁ జేరె వాసుకి నివాస,మ తండును విస్మయంబునన్
గనుగొని యిట్లు వచ్చుటకు కారణమేమని పృచ్ఛ సేయగన్.

537. కం. జరిగిన విషయం బంతయు
నరుదుగఁ దెలిపెన్ 'దదస్తి' యనియెడు దనుకన్
పరితోషంబున వాసుకి
కరమనురక్తిఁ జెలియలినిఁ గనుగొనుచుండెన్

538. కం. నవమాసంబులు నిండగ
ప్రవిమల తేజుండు పుట్టె పంకజ ముఖికిన్
భువి నాస్తీకుడనగ నత
దవిరళ యశమందె ముని కులాభరణంబై





539. కం. తన తల్లి వైపుబంధువు
లను రక్షింపగ దలచి యలఘుమతియగు న
మ్ముని యర్థించెను నిను మఖ
మును మాన్పింపు మనుచు నతి ముదముదలిర్పన్

540. ఉ. వాసుకి యల్లు డౌ నతని వాంఛను. దీర్చి యనంత పుణ్యమున్
వాసిగఁ గొంటివయ్య కురువంశ విభూషణ! నీకు మేలగున్
భాసిల మత్కృతంబయిన భారత మెల్లనువింటి, వైన నా
యాసము వీడి శాంతిఁ గొన దయ్యెను నీమన సింతయేనియున్

541. కం. జనమేజయ భూపా! నీ
జనకునకున్ గలుగ దయ్యె సద్గతి గానన్
మనమున శ్రీదేవిని నీ
వనవరతము భక్తిఁ గలిగి యర్చింపు మొగిన్

542. కం. శ్రీ దేవి కొక్క యాలయ
మాదృతిఁ గట్టించి యింక ననునిత్యంబున్
మోదంబున నర్చింపుము
భూదయితుడ! పొందఁ గలవు పూర్ణ సుఖంబుల్

543. శా. నీ వంశమ్మును వృద్ధియౌను; స్థిరమౌ నీ రాజ్యమున్, భూపతీ!
దేవీ యజ్ఞము సేయుమయ్య!; విను మా దేవీ పురాణంబికన్
ఏ విన్పించెద; లేదు దానికి సమంబెందేని; శ్రద్ధాగతిన్
భావంబందున నిల్పి విన్నయెడలన్ బ్రాప్తించు కైవల్యమున్.

544. త. సకల ప్రాణుల హృద్గుహాంతర సంస్థి తైక విరాజితా!
ప్రకటితమ్ముగ నిన్ను భక్తి నిబద్ధులై భజియింపరేన్
సుకరమై భవదుఃఖముల్ గడు చుట్టి నొంపవె యెల్లరన్
త్రికరణమ్ముగనిన్ భజించినఁ దెల్లమౌ సుఖశాంతులున్

545. వ. ఇది శ్రీదేవీ కరుణాకటాక్ష లబ్ధ విభవుండును, కమలాంబా, సుబ్బరాయుల ద్వితీయ పుత్రుండును, కౌశిక సగోత్రుండును అగస్త్యరాజు వంశోద్భవుండును నగు సుబ్బారావు కవి ప్రణీతంబగు శ్రీ దేవీ భాగవతమను మహా పురాణము

నందు వ్యాసమహర్షిపుట్టుక, గంగాశంతనుల చరిత్ర, శంతన మత్స్యగంధుల వృత్తాంతంబును, భీష్మ ప్రతిజ్ఞయు, కర్ణుని పుట్టుక, పాండవులచరిత్ర, పరిక్షిత్తు వృత్తాంతము, ప్రమద్వరా రురువుల వృత్తాంతము, తక్షక కశ్యప సంవాదంబును, ఉదంకో పాఖ్యానంబును, ఆస్తీక వృత్తాంతంబును ననుకథలు గల ద్వితీయ స్కంధము

**స్వస్తి**





## శ్రీదేవీ భాగవతము

# తృతీయ స్కంధము

1. కం. శ్రీవాణీ గిరిజాపతు
లేవేళల మనములందు నేపరశక్తిన్
భావించి స్వకృత్యంబుల
గావింతురొాయట్టి తల్లి కాచుత! నన్నున్

2. ఉ. సూతుడు శౌనకాదులను జూచి కడుంగడు మోదమంది మీ
రాతత భక్తి నా పలుకు లన్నియు వింటిరి సావధానులై
చేతము లుల్లసిల్ల నిక చెప్పెద నిశ్చల చిత్తులౌచు సం
ప్రీతి వినుండు తిన్ననగు మీదికథల్ పరదేవతాప్తముల్

3. ఉ. వ్యాసుని మాటలన్ వినిన యన్నరపాలుడొకింత శాంతుడై
భాసుర తేజ! నీవతి కృపామతిఁబల్కిన పల్కులెల్ల వి
శ్వాసముతోడ వింటి;ఁ గడు శాంతిని బొందితి నింకనాకు నం
బాసవనంబు నెట్లు జరుపన్ వలెనో యెఱిగింపుమింపునన్

4. కం. దేవీ యజ్ఞంబనగా
నేవిధి జరుపంగవలయు నెవ్వి నియమముల్
భావింప దాని ఫలితముఁ
గావలసిన వస్తుచయము క్రమమునఁజెపుమా!

5. చం. అదియునుఁగాక సారసభవాంబుజనాభ మహేశ్వరుల్ గడున్
ముదమున మూడు మూర్తులనఁ బొల్చుచు సృష్టియు, పుష్టి, నాశముల్
సదమల వృత్తిఁ జేతురని సత్పురుషుల్ వివరించి రైనచో
ముదుసలులై రుజామరణముల్ గననేరరొ వారలెన్నడున్

6. కం. సగుణులొ నిర్గుణులో వా
రగణితముగ దుఃఖమతులొ యవ్వలివారో
తగనెపుడు నస్వతంత్రులొ
యొగి స్వేచ్ఛాయుతులొ తెలుపు మురుధర్మజ్ఞా!

7. తే.గీ. అష్ట దిక్పాలకులనగ, నమర నాథు
డనగ, విందును వారల జననములను,

లక్షణములను, కృత్యములను గుఱించి
తెలియఁ జెప్పుము గృప వినఁదలతునయ్య!

8. ఉ. ఆకలి దప్పికల్ మఱియు నార్తియు సౌఖ్యము భోజనాదులున్
నీకును నాకునున్ బలెను నెమ్మిని వారికిఁ గూడఁ గల్గునే
ప్రాకట సప్తధాతుమయ పార్థివతత్త్వములై కృశించునో
కాక నిరంతరోజ్జ్వల వికాస యుతంబులొ వారి దేహముల్

9. తే.గీ. వేయు నేటికి యవ్వారి వివరములను
సాంగముగఁ దెల్పుమయ్య! యో సంయమీంద్ర!
అనుచు జనమేజయు డడుగ నమ్మునీంద్రు
డిట్లు తెలిపెను పూరు కులేంద్రుఁజూచి

10. మ. అతి గుహ్యంబులు కష్టసాధ్యములు నౌనయ్యా! భవత్ ప్రశ్నముల్
చతురత్వంబున నేనెఱింగిన గతిన్ సర్వం బెఱింగింతు, నీ
వతి శ్రద్ధన్ విను మొక్కనాడు మును భవ్యంబైన గంగా తటిన్
చతురాస్యాత్మజుడైన నారదమునిన్ సంప్రీతి దర్శించితిన్

11. మ. కడు భక్తిన్ సురమౌని కంతట నమస్కారంబు గావించి, య
య్యెడఁ గూర్చుంటిని తత్సమీపమున నేహృష్టుండనై; ప్రీతి యే
ర్పడ మౌనీంద్రుడు నంతటన్ గుశలముల్ బ్రశ్నించె నన్ జూచుచున్
తడబాటొందక యప్డు నేనడిగితిన్ తన్మౌని నీరీతిగన్

12. మ. అతి విస్తారములై కనంబడెడు బ్రహ్మాండ ప్రకాండంబు లే
గతి నిర్మాణములయ్యె? కర్త యెవరింకన్? గారణంబేమిటీ
స్థితికిన్? కర్తయొకండొ? పెక్కురొ? మహర్షీ తెల్పు మిద్ధాత్రి స
న్మతి యోచింపగ కర్తలేక క్రియ లెన్నండేనియున్ గల్గెనే!

13. చం. శివుడని కొందరున్ మఱియు శ్రీపతి యంచును నింకకొందరున్
ధ్రువముగ బ్రహ్మయంచు, నల తోయజ బంధుడు నింద్రుడంచు నీ
యవని ననేకరీతులుగ నార్యులు వల్కెదరయ్య కర్తలన్
బ్రవిమల తేజ! సృష్టి పరివర్తనకున్ దగ వేరు వేరుగన్

14. తే.గీ. ఇందరన్ గాదనుచుఁ గొంద రిద్ధ చరితు
లాదిశక్తిని జగదంబ నఖిల మునకు





కర్త గానెంచి కొలుతురు గౌరవమున
నాది మాయాస్వరూపిణి యామెయనుచు

15. కం. వారుణి, శాంకరి, బ్రాహ్మీ,
వారాహియు, వాసవియును, వైష్ణవి యనుచున్
చారుతరాహ్వయముల నీ
ధారుణి జగదంబ నెపుడుఁ దలతురు భక్తుల్

16. కం. భావింప బ్రహ్మమయమౌ
నీ విశ్వము, దీనికితరు లెవరును కర్తల్
వావిరి లేరిది సహజం
బేవిధిఁ దలపోయ ననుచు నెంతురు సాంఖ్యుల్

17. చం. సతమతమౌచు నుంటి ముని సత్తమ! యిన్నిట నేదసత్యమో,
సతమదియేదొ, యెంచుకొనఁజాలక నామది నెల్ల వేళలన్
చతురత ధర్మనిర్ణయము సల్పెడు నప్పుడుఁ గూడ నిట్టులే
మతి కొనఁగూడు శంకలతిమాత్రములై యిదియేమిచిత్రమో

18. చం. నిరతము సత్యసంధులును, నిర్మల సత్త్వగుణాల వాలురౌ
సురలను దుష్ట దానవులు స్రుక్కగఁ జేయుచు నుంట చిత్రమౌ
నరయగ ధర్మ శీలురు వియచ్చర తుల్యులు పాండవేయులున్
ధర నిడుముల్ బడంగనమె ధర్మ విదూరుల దుష్టచేష్టలన్

19. కం. కావున ధర్మమునకు సుఖ
మేవిధిఁ దర్కించిచూడ నెఱుగగ నైతిన్
నీవివి యెల్లయెఱుంగుదు
వోవనజాసనకుమార! యురుతత్త్వజ్ఞా!

20. కం. నిరతము మోహంబనియెడి
యురుతరమగు నుదధి మున్గుచుండెడినన్నున్
పరతత్త్వజ్ఞాన మనెడి
తరణిన్ నను నుద్ధరింపు దాక్షిణ్యనిధీ!

21. కం. అని నీవడిగిన యట్లే
జనమేజయ! నేనుఁగూడ సన్ముని వర్యున్

వినయమున నడుగ నాతం
డనునయమునఁ దెల్పెనెట్టు లట్లెతిగింతున్

22. కం. నారదు డిట్లనియెను, "ముని
నీరజ భవుఁ జూచి నేను నీవలెనడుగన్
కారుణ్యమ్మున నాతం
డీరీతి వచించె" నంచునెతిగించెఁ గృపన్

23. చం. స్థిరముగ నీదు ప్రశ్నలతి శ్రేష్ఠము లయ్యవి గుహ్యముల్, గడున్
దురవగతంబు లజ్ఞులకు; తోరపు సంసరణాబ్ధి మున్గుచున్
పొరిపొరి దుఃఖముల్ గనెడి మూఢులెఱుంగగ జాలరెన్నడున్,
విరహితరాగ మత్సరులు విజ్ఞుల కివ్వియెఱుంగ శక్యమౌ

24. చం. జగములు మున్ మహా ప్రళయ సంభవవేళ నశించి సర్వమున్
విగత నిజస్థితిన్ గనగ, విస్తరిలెన్ జల మబ్ధులేకమై
తొగచెలికాడు తారకలు తోయజ బంధుడు పృథ్వియున్ మహా
నగములు వృక్షముల్ భువన నాథులు సైతము రూపు మాయగన్

25. తే.గీ. అంబువులు నిండి సర్వ మేకార్ణవముగఁ
దోచు సమయాన తామరదుద్దునందు
నొంటినై నేను కూర్చొని యుండి మదిని
బహువిధంబులఁ దలచి తీపగిది నపుడు

26. ఉ. సాగర సప్తకంబొకట సంగమమై యిటు లున్నవేళ నే
నేగతి నుద్భవించితిని యెయ్యది కారణ మిట్టులుంటకున్
ఈగతి పంకజంబిచట నెట్లు జనించెను? పంకమేది? భూ
భాగ మొకింత యేనియును పైకి కనంబడ దంచునెంచుచున్

27. తే.గీ. దీని మూలంబదేదియో తెలియవలయు
ననుచు నుదకంబులన్ మున్గి యన్నిదిశల
వెదకితిని నేను వెయ్యేడు లుదధియెల్ల
కానరాదయ్యె మొదలును కడయునెచట

28. చం. తిరిగి జలోపరిస్థలము తిన్ననఁ జేరిన యంతలోన న
చ్చెరువుగ దివ్యవాక్కులు వచించె "తపంబొనరింపు" మంచు సు





స్వరమున; సమ్మతించి యట పద్మమునందె సహస్ర వర్షముల్
స్థిరముగఁ గూరు చుండి కడు తీవ్రముగా తప మాచరించితిన్

29. తే.గీ. అంత నశరీర వాణి తా ననియెమరల
"సృజ" యనెడి యక్షరమ్ముల చిత్రగతిని
ఎవరి నెట్టుల సృజియింతు నేమి సేతు
ననుచు మదిలోనఁ దలచుచు నట్టెయుండ

30. కం. మధుకైటభులను రాక్షసు
లధిక బలాఢ్యులపుడు నను నాలమునకు తా
మధరములు రదనముల న
త్యధికమ్ముగ నొక్కిపిలిచి రత్యుద్ధతులై

31. చం. కడుభయమంది నే జలజ కాండమునుండి జలమ్ములోనికిన్
వడివడి చాల దూరమటుఁ బర్విడగా కనిపించెనాకు న
య్యెడ నొక దివ్యపూరుషు డహీన నవోత్పల నీలదేహుడున్
సడలని యోగనిద్ర నహిశయ్యఁబరుండిన నిశ్చలాత్ముడున్

32. సీ. కమనీయ నీలాభ కలిత దేహమువాడు
పట్టు పీతాంబర భవ్యధరుడు
గజ తుండ నిభ దీర్ఘ ఘనచతుర్బాహుండు
వనమాలికా భూష లెనయు వాడు
నలిన పత్రాయత నయన యుగ్మము వాడు
కమలాత్త విపుల వక్షమ్మువాడు
సితశేష పర్యంక గత యోగనిద్రుండు
శరదిందు చంద్రికా సమముఖుండు

గీ. శంఖ చక్ర గదాపద్మ శార్ఙ్గధారి
కౌస్తుభాలంకృతుడు జగత్కారణుండు
నైన నచ్యుతు వైకుంఠు నచటఁగాంచి
నిద్రలేపంగ మదిలోన నిశ్చయించి

33. కం. పలు గతుల సంస్తుతించితి
నలిన దళేక్షునపుడు కడు నమ్రత తోడన్

పలుకడు కదలండైనను,
తలపున కడు కలతఁజెంది తగనవ్వేళన్

34. కం. నిద్రా దేవిని మనసున
భద్రముగా నిల్పినేను భక్తి భజింపన్
భద్రాకృతి నామెయు నా
భద్రాకారుని విడివడి బయలున నిలిచెన్

35. ఆ.వె. యోగ నిద్ర వీడి భోగీంద్ర శయనుండు
ఐదువేల యేడు లాహవమునఁ
బోరి రాక్షసులను నూరువులందుంచి
యుక్కడించె నప్పు డుగ్రగతిని

36. కం. సరిగా నా సమయమ్మున
కరుదెంచెను రుద్రుడచటి కానందమునన్
వరయోగమాయ నప్పుడు
స్థిరముగ మువ్వురము సన్నుతించితిమి కడున్

37. ఉ. ఆ జగదంబ మానుతుల కాత్మఁ గడుంగడు సంతసించి య
వ్యాజ కృపావిలోకన సుధాకర దీప్త లెసంగు చుండ వి
భ్రాజిత దివ్యరూపమున పల్కెనిటుల్ మముఁజూచి యింక మీ
రోజ నొనర్పుడయ్య! భయమొందక మీవిధులెల్ల నిత్యమున్

38. కం. అసురుల మధుకైటభులను
కసిమసగెను విష్ణు వింక కమలాసన! పెం
పెసలార సృష్టికార్యము
వెస జరుపుమటంచు నన్ను వినియోగించెన్

39. తే. ఆమె యాజ్ఞను వినియిట్టులంటి నేను
శక్తి హీనులము సృజింపఁ జాలమమ్మ
స్థలము కన్పింప దంతయు జలమయమ్ము
ఎచట గావింతు మింక మేమెల్ల సృష్టి

40. చం. కనఁబడదేపదార్థమునుఁ గన్పడవెచ్చట పంచభూతముల్
కనఁబడ వింద్రియమ్ములెటఁ గన్పడ వయ్యెను నింద్రియార్థముల్





కనఁబడు చుండె నొక్కయుదకంబులు మాత్రమె; యిట్టులైన నే
యనువున సృష్టిఁ జేయగల మమ్మ! కృపన్ దెలియంగజెప్పుమా;

41. మ. అనినన్ దా చిఱునవ్వునవ్వుచు మహాహ్లాదంబునన్ మమ్ములన్
గనుచుండంగ విమానమొందు గడువేగన్ విస్మయంబేర్పడన్
వినువీధిన్ బఱతెంచి నిల్చెయచటన్ విఖ్యాత శోభాకృతిన్
దనరన్ దివ్య సువర్ణ రత్నమణి ముక్తా హార భాస్వంతమై

## త్రిమూర్తులగగన యానము - సర్వలోక సందర్శనము

42. కం. సందేహింపక మీరిపు;
డిందధిరోహింతురేని యేఁ జూపింతున్
బొందుగ నద్భుతమొక్కటి;
యందంబొదవగనని జగదంబపలుకగన్

43. కం. సంతోషించుచు మేమును
నంతన్ జని వ్యోమయాన మందు వడివడిన్
చింతలు వీడుచు నెక్కితి
మంతట నాదేవి దాని నధిరోహించెన్

44. చం. అనిల జవంబునన్ నడపె నా జగదంబ విమాన మాకసం
బున నిజశక్తిచే, నటుల పోవుచునుండగ నొక్కచోట మా
మనముల కద్భుతమ్మొదవ మంజుల పుష్ప ఫలానతంబులౌ
ఘనతరు సంతతిన్ హరిత కాంతుల నొప్పు వనమ్ము గన్పడెన్

45. సీ. ఒక వైపు నిరతమ్ము పికగేయ నినదమ్ము
లొకచెంత మధురమౌ శుకరవమ్ము
లొకచోట నెమళుల యొప్పగు నాట్యమ్ము
లొక్కెడ సెలయేరు లొకట నదులు
ఒక తటి మిధునమ్ము లొక చెంత మృగతతు
లొక్కెడ కూపమ్ము లొకట కొలను
లొకచాయ వృక్షమ్ము లొక క్రేవ పూలత
లొకవైపు షట్పద ప్రకరగాన

తే.గీ. మక్షి యుగ్మమ్ములకును మా చక్షువులకు
పండువులు సేయుచుండె నా(ప్రాంతమందు
కొంత దవ్వేగ నచ్చట వింతయైన
నగర మొక్కటి కన్పించె నవ్యముగను

46. కం. అచ్చటి (ప్రాకారమ్ములు
నచ్చటి కనకంపుమేడ లచ్చటి శోభల్
ముచ్చటలై కనిపింపగ
నచ్చమ్ముగ నదియు స్వర్గ మనుకొనుచుండన్

47. ఉ. కంటిమి ముందు నొక్కయెడఁ గన్నులకున్ దగవేడ్కగల్గ వే
గంటికి నింపునింపు నొక కమ్ర వనమ్మును నందనమ్ము, వా
ల్గంటుల కాకరమ్ము; సుమగంధయుతమ్మగు కల్పవృక్షమున్
గంటిమి వేల్పుటేనుగును, కంటి మటన్ దివిజాధినాధునిన్

48. ఉ. ఇంకను దూరమేగ కనిపించెను మాకొక (బ్రహ్మలోక; మం
దింకొక (బ్రహ్మ; వాని సభనెల్లెడ వేదములున్ దదంగముల్
పొంకములై కనంబడియె; పుణ్యనదీ గిరి సాగరాధిపుల్
పంకజగర్భు చెంత కడు భక్తి మెలంగుటయున్ గనంబడెన్

49. కం. ఈ పంకేరుహగర్భుడు
నీపోలిక నున్నవాడు నీవెఱుగుదువే
యోపంకజాసనా! యని
శ్రీపతి యును శివుడు నన్నుఁ జేరియడిగినన్

50. కం. ఇది యేమో నేనెఱుగను
మదికిని వి(భ్రాంతి యయ్యె మధు సూదన! యో
మదనారి! యనుచు నేనపు
డెద కలవరమంది పల్కి తిరువుర తోడన్

51. చం. అని యనుచుండగన్ గగనయానము చేరె మరుక్షణమ్ములో
ననిల జవమ్మునన్ (ప్రమథ యక్ష మునీంద్ర గణోపశోభితం
బును పికకీర నిస్వన సముచ్చయ మంజు వనాభిరామమున్
ఘన శిఖరోజ్జ్వలంబునగు కామవిరోధి నివాసశైలమున్





52. వ. ఆకైలాస పర్వత శోభను తిలకించుచుండ నప్పుడు

53. సీ. సిగలోన నెలవంక సింగారమైయొప్ప
చెంత దివిజగంగ చెలువుమెఱయ
ముఖ పంచకమ్మును భుజ దశకమ్మును
(త్రినయనమ్ములు కడు తేజమెసగ
పులితోలు చీరయు వలెవాటు కరిచర్మ
మహిరాజు భూషణమై వెలుంగ
మైపూత బూదియై మహిత రు(ద్రాక్షలు
కంఠమాలిక లౌచుఁ(గాలుచుండ

తే.గీ. గజ షడానను లంగ రక్షకులు గాగ
(ప్రమథ గణములు జేజేలు వలుకుచుండ
వృషభవాహన మెక్కితావిషధరుండు
భవనమందుండి వచ్చె వి(భ్రాంతిగలుగ

54. శా. ఆ వింతన్ గనుచుండ తక్షణమునం దా వ్యోమ యానంబొగిన్
శ్రీ వైకుంఠ పురోపకంఠమునుఁ జేరెన్; పద్మనాభుండు తా
నా వింతన్ గని విస్మయమ్మున తదీయైశ్వర్య శోభాద్యుతిన్
భావంబందున మెచ్చు కొంచు కడు వి(భ్రాంతాత్ముడై యుండగన్

55. మ. అతసీ పుష్ప నిభాభ దేహుడును పద్మాక్షుండు పీతాంబర
ద్యుతి సంశోభితు, దండజ(ప్రవర విద్యోతాంస భాస్వంతు, డు
న్నత దీర్ఘోరు చతుర్భుజుండు విలసన్మాణిక్య భూషాన్వితుం
డతి సౌందర్యయుతుం డొకం డగపడెన్ హర్మ్యాంతరోద్భాసియై

56. కం. అలివేణి కమల యతనికి
మెలమెల్లగ చామరముల మెల్పున వీవన్
నలినాననమున షట్పద
ముల భాతిఁగదలె నటునిటు ముంగురులెలమిన్

57. కం. ఇది యేమీ చి(త్రంబని
మదనారియు నేను నపుడు మాధవు ముఖమున్

గదియుచుఁ జూడగ నతడున్
మది నక్కజమంది చూచె మాదెస కంతన్

## త్రిమూర్తులకు దేవీ దర్శనము

58. మ. ఇటు లత్యంతము నక్కజంపడుచు నట్లే చూచుచుండన్ మహో
ద్భట వేగమ్మున నా విమానమరిగెన్ ధావళ్యఫేనాంచితో
త్కట తుంగోర్మి విరాజమాన మగుచున్ గన్పట్టు దుగ్ధాంబుధిన్
స్ఫుటమై పూర్ణ సుధాకరాభ నిభమై పొల్పొందు ద్వీపానకున్

59. సీ. పారిజాతమ్ములు భవ్యమందారము
లందమ్ములై కను విందుసేయ
అతిచిత్ర గతులొప్ప నాస్తరణమ్ములు
దివ్య కాంతుల తోడ తేజరిలగ
ముత్యాల దండలు పుత్తడిపేరులు
వరుసలై వ్రేలుచు వరలుచుండ
మొగలి సంపెగ మల్లె పొదల పూగంధముల్
గొనివచ్చి తెమ్మెరల్ కూర్మిసేయ

గీ. చందనాశోక వకుళ వృక్షంపుతతుల
శుకపికాదుల శ్రుతి హిత సుస్వరముల
మధుకరమ్ముల ఝుంకార మధురిమముల
ముచ్చటలు గొల్పు నా ద్వీప మచ్చముగను

60. కం. అచ్చట నొక పర్యంకం
బచ్చముగా శివునిరూప మన్నటులుండెన్
పచ్చలు మాణిక్యమ్ములు
గ్రుచ్చిన హరి ధనువుతోడఁగొమరు మిగులుచున్

61. సీ. రక్తాంబరమ్ములు, రక్తమాల్యమ్ములు
రక్త గంధమ్ములు రాజిలంగ
రక్త నేత్రమ్ములు, రక్తాధరోష్ఠముల్
కోటి విద్యుత్ప్రభల్ కొమరు మిగుల
శశి కాంతులను మించు చక్కనౌ వదనమ్ము
దరహాస చంద్రికల్ గురియు చుండ
వరదాభయాంకుశ పాశయుక్తమ్ములౌ
హస్త కంజాతమ్ము లందమెసగ

గీ. పూర్వమెన్నడుఁగనని సంపూర్ణమైన
దివ్యతారుణ్య విగ్రహ దీప్తులమర
నా శివాకార పర్యంకమందు నొక్క
మహిళ కన్పించె భువనైక మాతయనగ

62. సీ. హ్రీంకార జపముల నేకాగ్ర మతిసల్పు
నండజమ్ముల సేవ లందుకొనుచు
నవయౌవ నాంగియై నవ్య శృంగారమై
కరుణాంతరంగయై పరిఢవిలుచు
కనకాంగద కిరీట కాంచన మణిమయ
భూషణాలంకృతిన్ బొలుపుమిగిలి
షట్కోణ యంత్ర రాజమ్మునఁ గూర్చుండి
శ్రీచక్ర తాటంక రోచులమర

గీ. చెలులు హృల్లేఖ! భువనేశి! కలిత నామ
జపముల నిరతమ్ము నుతులు సల్పుచుండ
సకల భువనాభిరామయై ప్రకటమగుచు
మాకుఁ గననయ్యె నయ్యంబ మహిమఁ దనర

63. ఉ. ఆమెను గాంచిమేముఁ గడు నచ్చెరు వందుచు నెవ్వరౌనొకో?
ఈమె శుభాఖ్య యెయ్యదియో? యిచ్చట నుండ కతంబదేమియో?
శ్రీమహనీయ తేజమున చెన్నుఁదలిర్చుచు నున్న దంచు నే
మేమియొ సందియమ్ము లిటులేచగ నిల్చొని యుంటి మంతటన్

64. కం. అప్పుడు విమాన మందున
నొప్పుగ మముఁ గూడి వచ్చుచుండెడి యంబన్
దెప్పున గనుఁగొని వెన్నుం
డిప్పగిదిన్ బలికె నేర్పు లేర్పడ నెలమిన్

65. చం. కనఁబడు చున్న యీ మహిళ కారణమౌను సమస్త సృష్టికిన్
కనుఁగొనఁజాల రల్పు లతి కష్టమతుల్; ఘనయోగగమ్యయై

జనన వికార నాశముల చాయలెఱుంగక శాశ్వతస్థితిన్
తనకును దానె నిచ్చమెయిఁ దాల్చుచునుండు ననేకరూపముల్

66. తే.గీ. ఆదిశక్తియు విశ్వేశి; యఖిలలోక
ములను తనలోన నిలుపుచు ముదముతోడ
నొంటి యైయుండు ప్రళయాంత మొదవి నపుడు
దేవి, శివ, వేదగర్భ, సద్భావగమ్య

67. కం. అని పలికి పద్మనాభుం
డనియెను మముఁజూచి యిట్టు లబ్జాసన! యో
మునిజననుత శంకర! కను
డనఘాత్ములు మీరలిప్పు డా జగదంబన్

68. ఉ. ధన్యుల మైతి మయ్య! యిదె దర్శన మిచ్చెను దివ్య శక్తి సౌ
జన్యముతోడ; నేడు మన సత్తపముల్ ఫలియించె; లేనిచో
నన్యులకౌనె యింతటి మహత్తరభాగ్యము; యోగులున్ తపో
మాన్యులునౌ విరాగులకు మాత్రమె సాధ్యము దర్శనంబిటుల్

69. కం. నిరతము తనపతిచెంతన్
పరమానందమ్ముతోడ బ్రహ్మాండములన్
స్థిరముగ నతనికిఁ జూపుచు
పరివారము తోడ నుండు బంధురభంగిన్

70. కం. కనఁబడు బ్రహ్మాండంబులు
కనఁబడు నీ దేవతలును కార్యములెల్లన్
తనకున్ దృశ్యములైనన్
తను మాత్రమె ద్రష్టయౌచుఁ దనరుచునుండున్

71. ఉ. నేనును నీవు రుద్రుడును నిక్కము లక్ష్మియు నెల్ల దేవతల్
మానుగ నీమె యందు నణు మాత్రము నైనను సాటి యౌదుమే
ధీనిధులార! యీమె పరదేవతయౌ జగదేకమాతయం
చేను మనంబు నందెఱిగి తేర్పడ సందియ మింక నేటికిన్

72. ఉ. అంబుజగర్భ! మున్ను ప్రళయాంతమునందతి శైశవంబునం
దంబుధి లోన పాద ప్రథమాంగుళమున్ వటపత్ర శాయినై





చుంబన మొప్పఁ జేయు నను జోలల నూయల లూపినట్టి యా
యంబయె యీమెయంచు మదికయ్యెను; నేడిటుదర్శనంబిడెన్

73. కం. అని పలికె పద్మనాభుడు
మును ముందుగ నామెవిధము పూర్ణముగ మదిన్
గని; మేమును కడు వేడుకఁ
జని యామెకు నంజలింప సాగితిమనుచున్

74. వ. పలికి నాతండ్రియగు విధాత మీదివృత్తాంతంబు నిట్లు చెప్పదొడంగె.

75. కం. విను నారద! నిర్భయమున
జనితిమి మువ్వురము నపుడు సరగున నయ్యం
బను నుతియింప దలంచి, గ
గనయానము దిగి యచటకు కౌతుక మొదవన్

76. మ. చని తద్ద్వారము చెంతనిల్వగనె మాస్వాంతమ్ములొక్కుమ్మడిన్
గనియెన్ శాంతిని; లోకమాతయు జగత్కల్యాణ సంధాత్రియున్
ఘన విద్యున్నిభ గాత్రయై యలరు నక్కంజాక్షి నీక్షించినం
తనె; సందేహముగల్గె లోనికిఁ జనన్ దథ్యమ్ము మాకయ్యెడన్

77. ఉ. అంతట మమ్ముఁ గాంచి దరహాసము సేయుచు నామె పిల్చినన్
వింత యదేమొగాని కడువేగమె మువ్వుర మొక్కసారిగా
కాంతల మైతి మందముగ కాంచన భూషణ దివ్య మాల ల
త్యంతము కంఠసీమల విహారము సల్పుచునుండ హృద్యమై

78. ఉ. అక్కజ పాటుఁ జెందుచుఁ బ్రయత్నముతోఁ జని మెల్ల మెల్ల నా
చక్కియ నిల్చి యామె పద సారసయుగ్మము సోక శీర్షముల్
గ్రక్కున నుంచి నిల్వగనె కామద యౌభువనైక మాత మా
ప్రక్కకుఁ జూచె ప్రేమ రసరమ్య విలోకన పంక్తు లేర్పడన్

79. తే.గీ. ఆమె చూపులు మాపైన నావరింప
భక్తి యుక్తుల నామెకుఁబ్రణతులిడుచు
నొకరి ముఖముల నొకరము ప్రకట గతిని
చూచు కొను చుంటి మట్టులే చోద్యముగను.

80. మ. నవరత్నాంచిత కాంతివంతమును నానా భూషణాలంకృతో
త్సవమున్ గోటి దినాధినాథ సమ తేజః పుంజ సంయుక్తమున్
భువనేశీ పదపీఠమున్ మిగుల సమ్మోదమ్ముతో నట్టులే
న వలోకించుచు నుంటిమయ్య మునివర్యా! పెద్దయుంబ్రొద్దటన్

81. ఉ. ఆమెను చుట్టియున్న చెలులందరు దివ్యసువర్ణ భూషణ
స్వామిను, లందగత్తెలు, ప్రశాంతలు, రక్త వినీల పీత వ
ర్ణామల వస్త్ర ధారిణులునై మధురంబగు గాన మంజుల
స్తోమములన్ మహేశ్వరిని చొక్కి నుతించుచు నుండి రింపునన్

82. శా. దేవీపీఠము నట్టె చూచుచుఁ గడున్ దిగ్భ్రాంతి చిత్తంబులం
దావేశింపగ మేము నామె పద పద్మాంగుష్ఠమున్ జూడగన్
భావాతీతము నౌచు తన్నఖమునన్ బ్రహ్మాండముల్ గన్పడెన్
భావింపన్ దగ దర్పణాంతరమునన్ స్పష్టార్థ సామ్యమ్ములై

83. సీ. అష్ట దిక్పాలకు లాదిత్య చంద్రులు
సాగరమ్ములు నదుల్ సకల గిరులు
అప్సరో గంధర్వు లశ్వినీదేవత
లష్టవసువులు చిత్రాంగదుడును
విశ్వావసుండును శ్వేతకేతుండును
నారద తుంబురుల్ నాకగణము
వైకుంఠ కైలాస బ్రహ్మాది లోకముల్
నాగ కిన్నర యక్ష యోగి వరులు

గీ. నలిన నాభుండు నేను పినాకపాణి
యొక్కటేమిటి సకలమ్ము చక్కనౌచు
నామె పదనఖ దర్పణమందు మాకు
నపుడు గన్పించె నారద! యద్భుతముగ

84. శా. స్త్రీరూపమ్ముల నట్లె యుంటి మచటన్ దివ్యాంగనల్ మమ్ములన్
గారామారగఁ జూచుచుండ శతసంఖ్యన్ గల్గు వర్షంబు ల
క్కారుణ్యాలయ రూపమున్ గనుచు సౌకర్యంబునన్; నిత్యమున్
మా రూపమ్ములకేమె సిగ్గు పడుచున్ మాహేశ్వరీ సన్నిధిన్





85. తే.గీ. అంత నొకనాడు వెన్ను డయ్యంబఁ గాంచి
హృద్యమౌ భావసంపద లేర్పడంగ
విశ్వమాతను నుతియించె వివిధ గతుల
నద్భుతంబుగ మృదు మధురాక్షరముల

## త్రిమూర్తులు దేవిని స్తుతించుట (విష్ణువు)

86. కం. దేవికి; వృద్ధికి, సిద్ధికి
భావాతీతకు ప్రకృతికి పరమేశ్వరికిన్
భావించి నమస్కారము
గావింతున్ కామదకును కరుణాలయకున్

87. తే.గీ. పంచకృత్య విధాత్రికి పరమగతికి
సచ్చిదానంద రూపకు, సంసరణ మ
హాబ్ధి తరణికి, కూటస్థ, కాదిశక్తి
కర్థ మాత్రార్థ భూతకు నంజలింతు

88. కం. అమ్మా! కనఁబడు సకలము
నిమ్ముగ నీయందె నిల్పి యిచ్ఛామతివై
క్రమ్మఱ సృష్టి స్థితి విల
యమ్ములఁ గావించుచుందు వంచు నెఱిగితిన్

89. ఆ.వె. సకల లోకమయివి సకలాంతరంగవు
విస్తరింపఁజేసి విశ్వమెల్ల
తగిన సమయమందుఁదగ నీదు పురుషున
కమరఁ జూపుచుందు వవికలమున

90. చం. ఇరువది మూడు తత్త్వముల నింపుగ నీవొక యింద్రజాలమ
ట్లరయగ వెల్గుచుందువు గదమ్మ! వినోదము మాకుఁజేయ; సు
స్థిరముగ నీవులేని యెడ జీవముగల్గునె దేనికైన వి
స్తరమగు నీదు శక్తిఁ గనఁ జాలని వార లశక్తులేగదా!

91. శా. సంతృప్తిన్ బడయంగఁ జేయుదువు విశ్వంబున్ భవచ్ఛక్తిచే;
సంతోషమ్మున దానినెల్లఁ గడు విస్పష్టంబు గావింతు వ

త్యంతంబైయలరారు తేజముల; ందథ్యం బాపయిన్ దానినే
యంతంబొందగఁ జేయు దీవ ప్రతి కల్పాంతమ్మునన్ గామదా!

92. శా. దేవీ! నీ విభవమ్ములున్ జరితముల్ దివ్యాకృతుల్ పూర్తిగా
భావంబం దెఱుగంగఁ జాలరెవరున్ బ్రఖ్యాతిగా మమ్ములన్
నీ వమ్మా! మధుకైటభాసురుల మున్నీటన్ దగం ద్రుంచి స
ద్భావంబొప్పగ నాడు గాచితివి నిత్యా! దుఃఖ హంత్రీ! శివా!

93. ఉ. ఈ భువనంబునం దిపుడె యేర్పడ ముప్వుర నిద్ధమూర్తులన్
బ్రాభవమొప్పఁ జూచితి; మపార మచింత్యము నీ ప్రభావ మ
మ్మా! భవదీయ సృష్టి పరమాద్భుత; మందికనెన్ని లోకముల్
శోభిలునో! త్రిమూర్తు లతి చోద్యముగా నిక నెందరుందురో!

94. శా. అమ్మా! నీపద పద్మముల్ గొలుతు సాష్టాంగ ప్రణామమ్ముతో
నిమ్మైయొప్పెడి నీస్వరూపమును నా హృత్ సీమలో నిల్పెదన్
సుమ్మా! నారసనాగ్రమం దనిశమున్ శోభిల్ల నీనామ మం
త్రమ్మున్ జేర్చెద నీయనుగ్రహమె యున్నన్ నిష్కళంకా! పరా!

95. మ. నను భృత్యుండని నీవు నెమ్మనమునన్ భావింపు మోయమ్మ! నే
ననయంబున్ యజమానురాలిగ మహాహ్లాదంబునన్ మానసం
బున నెంతున్నిను; నీకు నాకును సతంబున్ దల్లితో బిడ్డకా
ననుబంధమ్మును నిల్పుమెప్డు; విడనీకమ్మా జగత్పావనీ!

96. శా. నీకున్ దెల్లము లన్నియున్; జగములన్ నీకంటె సర్వజ్ఞ లే
లోకంబందునులేరు; నాకు నెది మేలోయెంచి యిమ్మీవ; త
ల్లీ! కోరన్నిను; సర్వకార్యములు నీలీలల్ గదా! నీకృపల్
మాకున్ గల్గనినాడు మేము తగమమ్మా! సృష్టికృత్యాలకున్

97. చం. ఒనరగ నీ ప్రపంచమును నుర్వియె మోయుచు నున్నదంచు చె
ప్పిన యదియెల్ల మిథ్యయనిపించును; భారము సర్వమెప్డు నీ
కనుఁగవ సన్నలన్ దవిలి గాదె నిలంబడియుంట; చంద్రుడున్
దినకర తారకావళియు దీప్తులఁబొందుట త్వత్ప్రభావమౌ

98. ఉ. నేనె గురుండ, నీశుడ, ననీహుడ, విశ్వమయుండ నంచు గ
ర్వాన మెలంగు చుంటిని; భవద్విభుతోనినుఁ గన్నయంత నా





మానసమందుఁ గల్గు నభిమానముఁ దీఱెను; నీవె నిత్యమం;
చేనును బ్రహ్మరుద్రులును నెల్ల రనిత్యములం చెఱింగితిన్

99. తే.గీ. బుద్ధిమంతుల యందలి బుద్ధివీవ
శక్తిమంతుల యందలి శక్తివీవ
కీర్తిమంతుల యందలి కీర్తివీవ
కాంతిమంతుల యందలి కాంతివీవ!

100. కం. సావిత్రివి, గాయత్రివి
భావింపగ వేదకళవు, భగవతి వీవే!
నీవే స్వాహా స్వధలును
నీవే పరదేవి వమ్మ నిఖిలారాధ్యా!

101. కం. సకలము నీలో పుట్టును
ప్రకటంబగు నవియె వివిధ భంగుల నీలో,
నిక విలయాంతంబున తత్
సకలము నీలోన నడగు సదసద్రూపా!

102. ఉ. సాగర తీరమందెగయు సాంద్రతరంగములట్లు సృష్టిలో
సాగు చరాచరంబులు ప్రశస్తిగ నీపర మాంశలే గదా!
బాగుగ నీరహస్యమును ప్రజ్ఞనెఱింగిన జీవులన్ గదున్
వేగమె మాయనుండి విడిపింతువు ముక్తి నొసంగు దంతటన్

103. కం. నను నుద్ధరింపు మమ్మా!
ఘన మోహాబ్ధిన్ మునింగి కడు దుఃఖముతో
ననవరత మ్మును మెలఁగుచుఁ
గనఁజాలక యుంటి సుఖము గగనాంతస్థా!

104. కం. అని యురగ శయను డివ్విధి
నొనరగ నుతియించి నిలువ నురగాభరణుం
డును నివ్విధమున నుతియిం
చెను నయ్యంబ నతిభక్తి చెలువొందంగన్

**(శివుడు)**

105. మ. జలజాతాసన పద్మనాభులె నినున్ సంపూర్ణ భావంబునన్
దెలియం జాలరటన్న నాకుఁ దరమే దివ్యంపు నీలీలలన్
గలనైనన్ దెలియంగఁజాలుటకు నీకార్యంబు లన్నింటికిన్
దలపన్ గర్తవు నీవెయంచుఁదెలిసెన్ దత్త్వాసనా! హ్రీమతీ!

106. తే.గీ. పాంచభౌతిక మైన ప్రపంచ మందు
జీవకళ వీవె యౌదువు, నీవులేక
కలుగునే చేతనత్వమ్ము కంజజునకు
వెన్నునకు, నాకునేనియు విశ్వజనని!

107. ఆ.వె. నీవు తలతువేని నిఖిలమ్ము సృష్టింతు
వాపి వేయు దెప్పుడైనఁగాని
నీదు నాజ్ఞ మేము నిరతమ్ము కార్యముల్
నిర్వహింతు మమ్మ నియతితోడ

108. కం. త్రిగుణములు మాకు ముప్వుర
కగణితముగ నొసగి మమ్ము నాయాపనులం
దొగి నియమించితి వమ్మా!
సగుణవు నిర్గుణవు నీవె సర్వాధారా!

109. చం. ఇచటకు మేము వచ్చునపు డెన్నియొ లోకములన్ ద్రిమూర్తులన్
ప్రచురితతేజులన్ దివిజవంద్యులఁ గంటిమి చిత్రమమ్మ! ని
ర్వచనముసేయ సాధ్యమె భవత్కృత సృష్టిని; నీదు భర్త కీ
యచరచరాళిఁ జూపుచు ప్రియంబొనరించుచు నుందు వీశ్వరీ!

110. ఉ. ఇంతులఁ జేసి మమ్ము జననీ! యిటులిచ్చట నిల్పినీవు మా
కెంతయు సంతసంబుఁగలిగించితి, వియ్యది నీయనుగ్రహం
బంతియె తల్లి! నిన్విడచునట్టి పరిస్థితి యైన నొల్ల నే
స్వాంతమునన్ ద్రిలోక పరిపాలన మేనియు పూరుషత్వమేన్

111. ఉ. నన్నిటు లుండనిమ్ము భువనమ్ముల యందిది గర్వకారణం
బెన్నగ నాకు; "నిట్లు పరమేశ్వరుడే యొక యింతియై కడున్





బన్నుగ నాది శక్తి పదపద్మములన్ భజియించుచున్నవా"
దన్నయశంబు గల్గుటది యార్త జనావన! పాపనాశినీ!

112. శా. నీ సాన్నిధ్యము లేకయున్న క్షణమేనిన్ నాకు పెక్కేండ్లగున్
నీ సాన్నిధ్యము వీడి చేయు జపముల్ నిక్కమ్ము వ్యర్థమ్మెలే
వాసిన్ నీపద పద్మరేణువుల సంపన్నమ్ముగా నౌదలల్
భాసిల్లన్ దగ నిల్పలేని తపముల్ పాత్రంబులే ముక్తికిన్

113. మ. పరగన్ నాకు నిరంతరమ్ము జపియింపన్ మంత్రమొండిమ్ము, నే
తరియింతున్; మును పూర్వజన్మమున శస్తంబైన మంత్రంబు, స
త్కరుణన్ నాకు నవాక్షరిన్ దగనొసంగన్ లేదె, నేడద్ది సు
స్థిరమై జ్ఞప్తికి రాదు తల్లి! భువనేశీ! నిత్యముక్తా! శివా!

114. కం. అనివేడిన యా శివునకు
నొనరగ నాదేవి యొసగె నురు మంత్రంబున్
మునివర! నవాక్షరిని, న
య్యనఘాత్ముం డభవుడంత నానందమునన్

115. కం. జపియించుచుఁదన్మంత్రము
నపగతదోషుండు పరవశాత్ముం డగుచున్
ద్రిపురాంతకు డుండగ, నే
నపరిమితంబైన భక్తి నపు డయ్యంబన్

**(బ్రహ్మ)**

116. కం. నుతియించితిఁగల్యాణిన్
చతురంగ బలేశ్వరిని ప్రశస్తను పూర్ణన్
శ్రుతి మహిళా సీమంత
స్థిత తిలకాంఘ్రిద్వయ సరసీరుహ ధూళిన్

117. కం. వేదములేనియు నిన్నిటు
లాదృతి దర్శింపఁ జేయ నౌనే జననీ!
నీ దివ్యాహ్వయములె య
జ్ఞాదులఁ దొలిపల్కువల్కు స్వాహాస్వధలున్

118. నిరతము నబ్జ జాండముల నేనె సృజించుచు నుంటినంచు సు
స్థిరముగ నెంచి గర్వపడితిన్ భవసాగరమందు మున్గుచున్;
పరమదయానిధానమ! భవత్ పదపంకజ రేణువుల్ తలన్
బొరిఁ బొరి సోక గర్వమది పూర్ణముగా నశియించె నేటితో

119. ఉ. నీదయ గల్గి నేనిపుడు నిక్కము ధన్యుడ నైతినమ్మ! నీ
పాద సరోరుహమ్ములను బాయక నామది నిల్పియెప్పుడున్
మోదమెలర్ప నిన్ గొలిచి పొల్చెడి భక్తిని సుస్థిరమ్ముగా
పాదు కొనంగఁ జేయుము కృపన్; విదళింపుము మోహపాశముల్

120. కం. నీయాజ్ఞను పాటించుచుఁ
బాయక నీసేవఁ జేయు భాగ్యంబొకటే
నాయెఱిగిన ధర్మము, నీ
వేయది యొనరింతు వదియె యిష్టమునాకున్

121. తే.గీ. వేద వేత్తలు యజ్ఞ యాగాది క్రియల
నిరతమొనరించు వారయ్యు నీదుశక్తి
నెఱుఁగఁ జాలక విభుడ నేనే యటంచు
భ్రాంతిఁ బొందుట విడ్డూర మంతెగాదె!

122. శా. నీశక్తిన్ గనలేక వారు ప్రభుడన్ నేనంచు భావించుచున్
బ్రాశస్త్యంబును నాకొసంగుదురు; సర్వంబీవె సృష్టించి, వి
శ్వేశీ! నాలుగు రీతులన్ దనర నీసృష్టిన్ విభాగింప, న
న్నాశాసించుచు నిల్పితం చెఱుగరై రావేద విద్వాంసులున్

123. కం. అష్టాంగయోగ గతులన్
కష్టంబులఁ బడెడివారిఁ గన జాలియగున్
హృష్టుండై నీ నామం
బిష్టంబునఁ బలుక ముక్తి నిత్తువుగాదే!

124. చం. సకలము నిర్వహింపఁగల శక్తివి నీవయి మమ్ము మువ్వురన్
ప్రకటమొనర్చి ముచ్విధులఁ బాయకఁ జేయుడటంచుఁ జెప్పి నీ
వొకటియుఁ జేయనట్టులిటులుండుట నీ విభవమ్ముగాదె, యీ
సకలముఁ జూచుచుండెదవు సాక్షిణివై నిరతమ్ము భోగినీ!





125. తే.గీ. అబ్జ నాభుని పోషకుండనుట; నన్ను
సృష్టికర్త యనుటయును, శివుని విలయ
కారుడనుటయు మర్యాద కాకయున్న
సాధ్యమే మాకు నివి నీదు శక్తిలేక

126. శా. నీ జన్మమ్మును నీ మహత్త్వమును నీనీ దివ్య రూపమ్ము లీ
ప్రాజాపత్యము లెవ్వరున్ దెలియ రీబ్రహ్మాండ భాండమ్ములన్
రాజీవాంబక! నీ వనాదియును నిర్ద్వంద్వంబు నేకంబునై
రాజిల్లన్ నినుఁ బొందఁ దంత్రములు మంత్రంబుల్ గదా మార్గముల్

127. ఉ. నీ విభు డాద్యు, డీశ్వరు, డనింద్యు, డనీహు, డుపాధిశూన్యుడై
నీ వివిధాద్భుతక్రియల నిత్యముఁ గాంచుచు సంతసంపదున్
ఈవగుదమ్మ దృష్ట మత డేమొ యదృష్టము, లేదు తావలం
బేవిధి నెంచ నింకొకరి కీ భువనమ్ముల నెందునేనియున్

128. శా. ఏకంబున్ మఱి యద్వితీయ మనుచున్ హృద్యమ్ముగా వేదముల్
నీకై చెప్పెనొ నీదు పూరుషునకో నిక్కంబెఱింగింపుమా!
నాకున్ సందియ మయ్యెఁ బ్రాఁబలుకు భిన్నంబౌగదా! తల్లి! యీ
వాకుల్ సెందును మీకు నిర్వురకు సంభావ్యంబుగా నన్నచో

129. కం. ఈ విషయంబున నెపుడున్
భావమ్మున నిశ్చయమ్ము పదిలమ్ముగ నే
భావింపఁ జాలనైతిని
నీవే వివరింపు మమ్మ! నిస్త్రైగుణ్యా!

130. కం. అని వేడిన యబ్జాసను
ననుకంపన్ జూచియిట్టు లయ్యంబయనెన్
వినుమయ్య! సంగ్రహమ్ముగ
వినిపించెద ననుచు మదిని వేడుక కలుగన్

## దేవియొనర్చిన తత్త్వోపదేశం

131. మ. అరవిందాసన! భేదమించుకయు లేదయ్యా! సదామాకు; సు
స్థిరమై యెప్పుదు మేక తత్త్వమున సందిగ్ధంబు లేదింతయున్

పరుడౌనాతని నన్నుఁ జూతు రతి విభ్రాంతిన్ విభిన్నంబుగా
నరయంజాలరు సూక్ష్మమున్ మిగుల విద్యావంతులేనిన్ విధీ!

132. ఉ. దీని నెఱుంగు నట్టి కడు ధీరుడెపో భవసాగరమ్ము శీ
ఘ్రానఁదరించి ముక్తి నిధిఁ గాంచును; బ్రహ్మమొకండె యెప్పుడున్
మానుగ నద్వితీయ మనుమానము లేదిక, సృష్టి కార్యమం
దేను నుపాధి భేదమున నింగల మట్లు ద్వితీయ మయ్యెదన్

133. కం. బింబం బద్దంబున ప్రతి
బింబంబుగఁ దోచునట్లు ద్వివిధ భ్రాంతిన్
సంబోధింతురు మము సృజ
నంబొనరించు సమయమ్మునన్ ద్వివిధముగన్

134. కం. అదియును దృశ్యాదృశ్యమె
మదినెంచగ భేదమెల్ల మతి విభ్రమమే
తుద నుపసంహారమునం
దొదవదు ద్వైతంబు బ్రహ్మమొకటై యుండున్

135. కం. స్త్రీ పుం నపుంసకత్వము
లాపై లేవింక బ్రహ్మమై నేనుందున్
ఏపగు నీసృష్టినిఁ గనఁ
బ్రాపుగ నేఁగాని దేది భావింపుమజా!

136. సీ. బుద్ధియు శ్రీయును బొల్పొంద స్మృతియును
కాంతియు శ్రద్ధయు శాంతి ధృతియు
మేధయు దయయును మెలకువల్ నిద్రయు
యౌవనమ్ముజరయు నాకలియును
శక్త్యశక్తులు నోర్పు సకలేంద్రియమ్ములు
విద్యయు స్పృహయు నవిద్య లజ్జ
వాంఛయు సృష్టియు వసయును మజ్జయు
ఋత మనృతంబును వృద్ధిలయలు

గీ. వివిధ నాడులు వాక్కులు వేయునేల
"సర్వమేవాహ" మనుట నిశ్చయముగాన





వితత రూపమ్ము నాదంచు సతముఁ దెలియు
మబ్జభవ! నేను కాని దెయ్యదియులేదు.

137. కం. గౌరియు బ్రాహ్మియు రౌద్రియు
వారాహియు వైష్ణవియును వాసవియనగా
వారుణి, కౌబేరియునా
నీ రీతిగ నాహ్వయముల నేను చరింతున్

138. ఉ. అంతియెగాక నాహ్వయములన్నియు నావె యెఱుంగుమయ్య! నే
సంతత మెల్ల దేవ నర జాతుల యందును, తిర్యగాదులం
దంతర శక్తినై నిలిచి యాకృతులన్ గదలించుచుందు, చే
యింతును సర్వకార్యముల నెప్డు నిమిత్తులఁ జేసి యెల్లరన్

139. ఉ. అంబువులందు చల్లఁదన, మగ్నిని వేడియు, నిందు చంద్రికల్
కంబళజాప్తు తేజమును, కార్యములున్ మఱికారణంబు లో
యంబుజ గర్భ! నేనె యగుదయ్య! చరాచర సృష్టిలోన స
ర్వంబును నేను లేక యణువంతయునేని చలింపదెన్నడున్

140. తే.గీ. ఇంత యేటికి వెన్నుందు నీశివుందు
నేను లేకున్న వధియింప నేర రెలమి
దుష్ట రాక్షస గణముల దోర్బలమున,
శక్తి హీనున కెయ్యది సాధ్యమగును

141. తే.గీ. సకల జగములుఁగదలు నాశక్తివలన
శక్తి హీనుడు వీడను నుక్తివిందు,
వెందు రుద్రహీనుడు విష్ణు హీనుడనెడి
పలుకులున్నవె యరయ నోపద్మగర్భ!

142. ఉ. ఈవిటు సృష్టిఁ జేయుటయు నెల్లర భూమియు మోయుచుంటయున్
దేవ విభుండు, దిక్పతులు, దిగ్గజసంతతి, సూర్యచంద్ర తా
రావళి తేజరిల్లుట, యనంతము నైన మదీయశక్తి సం
భావన చేతనేయనుచు భావము నం దలపోయుమబ్జజా!

143. తే.గీ. ప్రాగభావాది స్థితుల కావలిదియైన
నాదు తత్త్వమ్ము చిత్రమ్ము నలినగర్భ

జగదభావమ్మె యుండును శక్త్యభావ
మెపుడు నుండదు మృద్ఘటంబెట్లొ యట్లు

144. పృథివి లేకున్న సృష్టి నేవిధి నొనర్తు
ననుచు పరితాప మందకు మబ్జ గర్భ!
పృథ్వ్యభావంబుఁ దలపోసి బెంగపడకు
కలదె పరమాణ్వభావ మేకాలముననను

145. కం. పరమాణు రూపమున నీ
ధరయెల్లను నున్నదనుచుఁ దలపోయు మజా!
పరమాణ్వభావముండదు
పరికింపగ పృథ్వ్యభావ పరిణామమునన్

146. కం. నీకిపుడు మహత్తత్త్వం
బే నిచ్చెద స్వీకరింపు మిద్ధ చరిత్రా!
దాన నహంకారంబును
మానుగ జనియించు నింక మానుముశంకన్

147. తే.గీ. ఆ యహంకారము వలన నఖిల సృష్టి
పూర్వవిధమున నొనరింపఁ బూనుమయ్య!
సాయమొనరింప నింకొక శక్తి నిత్తు
స్వీకరింపుము కమలజా! క్షేమమగును

148. చం. ఇదె గొనుమయ్య సారస దళేక్షణ నబ్జజ! చంద్రకాంతి సం
పదల నధఃకరించు తనువల్లిని, శ్వేత వరాంబరన్, సుధా
సదమల హాసినిన్, విమల చారు సువర్ణ సుభూషణాంచితన్
చదువుల తల్లియన్న శుభ సంజ్ఞ నెసంగు మహాసరస్వతిన్

149. కం. ఈయమ రజో గుణంబున
నీ యర్ధాంగిగ వసించు నిత్యంబనఘా!
నాయంశ యైన యీమెను
నే యెడలను నిందసేయ నెదఁ దలపకుమీ!

150. ఉ. నీకును నెల్ల వారికి గణింపగ నీయమ పూజనీయ, నీ
వీ కమలాక్షిఁగైకొని యహీన జవంబున సత్యలోకమున్





దేకువఁ జేరి చేయుమికఁ దేజ మెలర్పగ సృష్టి కార్యమున్
జేకుఱు నీకు నామహిమచే సృజియింపగ నేర్పులున్నతిన్

151. కం. ఆయా కర్మమ్ములతో
నాయా జీవులకుఁదగిన యట్టి గురుతులున్
బాయక కాలోదరమున
ప్రాయికముగ నుండునయ్య! బహు సూక్ష్మముగన్

152. కం. కాలము కర్మము గుణములు
పోలన్ కారణములగుచు పూర్వపురీతిన్
కాలంబందుండు జగము,
నాలుగు రీతులుగ సృష్టి నడిపింపుమికన్

153. ఉ. ఈతడు మాననీయుడు సహిష్ణుడు సత్వగుణప్రధానుడున్
భాతిగ మీకు నిర్వురకుఁ బ్రాపయియుండును కష్టకాలమం,
దాతత విక్రమంబున సురారులఁద్రుంచు, ననేక రూపుడై
ప్రీతియొనర్చు సర్వులకు విష్ణు వనంత గుణాన్వితుండునై

154. చం. శివుడును నీకు నెల్లపుడుఁ జేయు సహాయము;ఁ దాఁదమోగుణ
ప్రవరుడటంచు నెంచి పరిభావము సేయకు మెప్పుడేనియున్
సవనములం దతండుఁగడు సత్కృతికిన్ దగపాత్రుడౌను; నా
ప్రవిమల నామముల్ దలచు వారికిఁ దృప్తియొసంగు దెప్పుడున్

155. కం. సురలకు నసురుల వలనన
కరము భయము గల్గ వారి ఖండించి వెసన్
సురలను రక్షించుటకై
సరగున పంపెదను నాదు శక్తులనటకున్

156. తే.గీ. అవియు వారాహి వైష్ణవి యనగ నార
సింహియనగ రూపములను స్వీకరించి
రాక్షసులఁజంపి సురల సురక్షితముగఁ
గాచు చుండెదును ప్రతియుగమ్ములందు

157. మ. అనియీరీతిగ నాకుఁ దెల్పి కడు నాహ్లాదమ్ముతో వెన్నునిన్
గని సంభాషణసల్పి యాతనికి విఖ్యాతిన్ మహాలక్ష్మిని

చ్చిన నాతండును వక్షమందు నిలిపెన్ శ్రీలక్ష్మి నంతన్ గడున్
వినయంబొప్పగ నున్న విష్ణుఁగని యావిశ్వేశి తానిట్లనెన్

158. తే.గీ. ఇదియు నాశక్తి నీకిప్పు డిచ్చితయ్య
సకల సంపద్విభూతి యీ సారసాక్షి
ఈమె నవమాన పఱచకు మెప్పుడేని
యనుచు నాజ్ఞాపన మొసంగి యనియె మరల

159. ఉ. నీవును బ్రహ్మయున్ శివుడు నిక్కము పూజ్యులు; మీరలెన్నడేన్
భావములందు భేదములఁ బన్నక సఖ్యముతో మెలంగుడీ!
యేవిధినేని భేదముల నెంచెడి మూఢుల కౌను దుర్గతుల్
గావున మువ్వురన్ సమముగా నెఱుగందగు నెల్లవారికిన్

160. ఉ. అంబుజనాభ! సత్వగుణమందు చరించెద వీవు నిత్యమున్;
డంబములేక స్వల్పముగ డాగి రజస్తమముల్వసించు; పు
ష్పాంబకు డేచు వేళల త్వదంగనతోఁ బ్రణయానురాగ వీ
థింబచరించు నప్పుడు ప్రదీప్తముఁ జెందు రజంబునీమదిన్

161. కం. స్థిరముగ వాగ్బీజంబును
స్మర బీజము పరమమైన మాయాబీజం
బిరవై యొప్పెడి మంత్రం
బరవిందాక్షా! యొసగెద నర్థింగొనుమా!

162. ఉ. దీనిని నిత్యమున్ మిగుల దీక్షజపింపుము, మృత్యుభీతియున్
దానన వీడు; వార్ధకముఁ దప్పును; లోకవిహారమెల్ల నే
మానిన వేళ సర్వమును మాయమొనర్చెద, మీరుమువ్వురున్
మానుగ నైక్యమయ్యెదరు మామక తత్వమునన్ ధ్రువంబుగన్

163. ఉ. పంకజనాభ! నీకిక శుభంబగుఁ గావున వెళ్ళుమయ్య! యీ
పంకజ నేత్ర లక్ష్మిఁగొని భద్రముగా; కడుదీప్తిమంతమున్
పొంకమునౌ వికుంఠమును పొల్పుగ నిర్మితిఁ జేసి యందులో
సంకట మింతలేక మది శాంతివహించి వసింపుడింపునన్

164. కం. అనిపలికి యామెమరలన్
మునివర! యాచెంతనున్న ముక్కంటిని తాఁ





గనుచు ననియె నివ్విధమున
ననుపమ మృదుమధుర ఫణితి నానందమునన్

165. ఉ. శంకర! నీకు నేడిదె ప్రశస్త మనోహర గాత్రనిత్తు ని
ష్పంక చరిత్ర గౌరిఁ దగ సన్మతిఁ గైకొను మయ్య! యీమెతో
నింక విహారముల్ సలుపుమేర్పడ నారజతాద్రిపైన; ని
శ్శంక వధింపు మెల్లర నిశాచరులన్ గడువిక్రమంబునన్

166. చం. తమమున నుందు వీవెపుడుఁ దథ్యము, సాత్విక రాజసంబులున్
గ్రమమున నప్రధానముగఁ గన్పడు; రాక్షస నాశనంబునన్
దమము రజంబులుండును ప్రధానముగా; మది నన్ను నిల్పియో
గమున చరించు నప్పుడు వికాసముఁ జెందును సత్వమున్నతిన్

167. కం. త్రిగుణాతీతం బైనది
జగములఁ గన్పింపదేది సత్యంబనఘా!
సగుణను నిర్గుణనై నే
నగణితముగఁబొల్చుచుందు నయ్యెయెడలన్

168. కం. కారణ రూపంబున నే
మారుదు సగుణాత్మనౌచు, మఱి నిర్గుణనై
పూరుషుని చెంతనుండెద
నారయ కార్యంబు నాయహంకారమగున్

169. తే.గీ. ఆ యహంకారమది త్రిగుణాత్మకమ్ము
పరగ తన్మాత్రలును భూతపంచకమ్ము
జ్ఞాన కర్మేంద్రియములును మానసంబు
ననగ పదునారు తత్వమ్ము లమరియుండు

170. తే.గీ. కార్యకారణ గుణములఁ గలిగియుండు
నీ పదియునారు తత్వమ్ము లెలమి జగతి;
ఆదిపురుషుండు పరమాత్మ యేదికాక
ద్రష్టయై యుండు సకలమౌ సృష్టి కెపుడు

171. కం. ఈ సృష్టి రహస్యంబును
నేసంగ్రహమైనరీతి నిపుడు తెలిపితిన్

భాసుర విమానమందిక
నాసీనుల రౌచు వెడలు డానందమునన్

172. కం. అని పల్కె జగన్మాతయు
వినయమ్మున నంత నామెవీడ్కొని వెలికిన్
జనినంతనె పురుషులమై
యొనరగ మేముంటి మయ్య! యుత్సవమొదవన్

173. కం. లేదచట సుధాసింధువు,
లేదా జగదేకమాత, లేరెవ్వారల్,
లేదా శ్వేతద్వీపము
సౌదామిని తెఱగునఁ జనె సర్వంబంతన్

174. కం. ఆదేవీమాహాత్మ్యము
మోదంబునఁ జెప్పికొంచు మువ్వుర మంతన్
మాదేవేరులఁ గూడుచు
శ్రీదయితుని వాసమునకుఁ జేరితిమి వడిన్

175. మ. అని నాతండ్రి విరించిపల్క నిటులేనంటిన్ వినమ్రుండనై
జనకా! నిర్గుణు దచ్యుతుండు, గడు ప్రజ్ఞారూపుడౌ నాది దే
వుని మాహాత్మ్యములింకయున్ మిగుల సంపూర్ణంబుగాఁ దెల్పుమో
యనఘా! నిర్గుణ శక్తి తా సగుణ యెట్లయ్యెన్ వినం గోరెదన్

176. కం. అని ప్రార్థించిన నలువయు
ననుఁగని చిర్నగవుమెఱయ నలువంకలఁదా
గనుగొని యిట్లని పలికెను
మునివర్యా! వినుమటంచు మోదముతోడన్

## బ్రహ్మ వివరించిన గుణనిరూపణము

177. మ. వినుమోనారద! నిర్గుణంబది కనన్ వీల్గాదు నేత్రంబులన్;
తనకున్ రూపమొకండులేదు గనుకన్ దభ్యంబు; జ్ఞానమ్ముచే
గననౌ; నింక గుణంబొ దృశ్యమగు నిక్కంబద్ది నశ్యంబు; చి
ద్ఘన చైతన్యము నిర్గుణంబెపుడు సత్యంబై ప్రకాశించెడున్





178. ఉ. వేదము లభ్యసించినను విస్తృతమైన ప్రసిద్ధ శాస్త్రముల్
చోదనఁ జేసినన్ మదికిఁ జొప్పడునే పరమాత్మతత్త్వముల్
భేదములెంచఁబోకఁ గడు విజ్ఞత తోడ విరాగభావ భా
గ్యోదయులైన వారలకె యొప్పగ సూక్ష్మమెఱుంగ సాధ్యమౌ

179. చం. సగుణము నిర్గుణంబుఁ గనజాలదు; స్థావరజంగ మాత్మకం
బగు జగమంతయున్ సగుణమై విలసిల్లు చునుందు; నందులో
పగలును రేయి మున్కలిడు వారలు నిత్య గుణాను బద్ధులై
యగణిత నిర్గుణత్వమును నాత్మనెఱుంగ సమర్థులౌదురే!

180. ఆ.వె. పైత్య మెక్కుడైన పరమాన్నరుచి నాల్క
తెలియఁ జాలనట్లు దివ్యమైన
నిర్గుణాత్మనెపుడు నెమ్మదిఁ దెలియంగ
జాలరెల్ల జగతి సగుణ యుతులు

181. వ. అనిన పద్మగర్భుంజూచి మరల నేనిట్లడిగితిని

182. తే.గీ. ఆ యహంకారమది త్రిగుణాత్మకమని
పల్కితివి త్రిగుణములును, వాని లక్ష
ణములు, నవితొలగు విధము నాకుఁదెలుపు
మయ్య! వినదలఁతునన తాననియె నిట్లు

183. ఉ. చక్కగఁ బృచ్ఛ సేసితివి సంయమివర్య! మనంబునందు నా
కెక్కుడు సంతసంబొదవె, నీత్రిగుణంబుల తత్త్వమెల్ల, నీ
కొక్కొక దానిఁ గూర్చి యిపుడొయ్యనఁ దెల్పెద నాలకింపుమీ!
యెక్కుడు శ్రద్ధ తోడ నవియెవ్విధి నుండునొ యేమి సేయునో!

184. సీ. త్రిగుణమ్ములెల్లెడఁ దేజరిల్లుచునుండు
సత్త్వరజస్తమ స్సంజ్ఞలొప్ప
అందు సాత్త్వికమున నలరారు చిచ్ఛక్తి
క్రియయు రాజసమునఁ గెరలు చుండు
తమమున విలసిల్లు ద్రవ్యశక్తియు నింక
వాని కార్యములను వరుస వినుదు

తామసమున నుండి తన్మాత్రలుదయించు
నందుశబ్దగుణక మాకసమ్ము

గీ. వాయువున కొప్పుచుండును స్పర్శగుణము
రూపమది యగ్నికొప్పును రోచులమర
రసగుణక మొచు జలములుఁ బొసగుచుండు
గంధమొప్పును పృథ్వికిఁ గ్రమముతోడ

185. సీ. పంచభూతమ్ములు పంచతన్మాత్రలు
తామసగుణ సముద్భవములగుచు
ద్రవ్యశక్తులనగ తామసవర్గమై
పిలువంగఁ బడియె నీవిశ్వమందు
ఇంద్రియ దశకమ్ము నింపగు ప్రాణముల్
రాజసోద్భవములై భ్రాజితముగ
రాజసవర్గమం చోజస్సుతో నొప్పి
తనరె క్రియాశక్తులనగ నింక

గీ. సత్త్వగుణమున దిగ్వాయు చంద్ర సూర్యు
లశ్వినీదేవతలు వరుణాదులెల్ల
జ్ఞానశక్తిని జనియించి సరసగతిని
ఇంద్రియాధిదేవతలైరి యేర్పడంగ

186. కం. తామస రాజస సర్గల
సామూహిక శక్తివలన సర్వజగములన్
నేమమున స్థూల దేహము
లేమియును కొఱంత లేక యేర్పడుచుండున్

187. మ. తనరన్ సూక్ష్మము స్థూలమంచు పరమాత్మన్ దృష్టి భేదమ్మునన్
వినుతింపందగు నందుసూక్ష్మ మదియున్ విజ్ఞానమే రూపమై
కన దుస్సాధ్యము నేత్రయుగ్మమున; చక్కన్ జ్ఞాన నేత్రంబునన్
గననౌ, స్థూలమొ ధ్యాన సాధనము విఖ్యాతంపు రూపమ్మునన్

188. తే.గీ. పంచతన్మాత్ర లింద్రియ ప్రాణములును
కలియు కతమున స్థూలమౌ కాయమగును





ఇదియె పంచీకరణ మందురెల్ల వారు
దీని నెఱిగిన సర్వమ్ముఁ దెలియ వచ్చు

189. సీ. ఐక్యమైయున్నట్టి యైదు భూతమ్ముల
విడఁదీసి ముందుగా విమలమైన
రసమాత్రను గ్రహించి పొసగంగ నంబువు
లగునట్లు మనసునఁ దగిన రీతి
సంకల్ప మొనరించి సరిగ తక్కిన భూత
తతుల యంశమ్ములఁ దానఁ జేర్చి
చైతన్య మమరింప చెలువుగ "నేనౌ"ను
భూతతన్మాత్రల పొందికయిది

గీ. స్థూల రూపమ్ముతోఁ గడు చోద్యమగుచు
నిదెయె బ్రహ్మాండమై యొప్పు; నిందు మిగుల
యాదరంబుండుటం జేసి యాది పురుషు
డాదినారాయణుడు పరమాత్మయయ్యె

190. కం. భూతమ్ములుఁ దన్మాత్రలు
భాతిగ నీరీతిఁ గలిసి పరగ ఘనంబై
యేతత్ గుణకర్మలతో
నాతత గతి విస్తరిల్లు నధికంబౌచున్

191. తే.గీ. ఆకసము శబ్ద గుణకమై యమరియుండు
అనిలమున స్పర్శ శబ్దము లొనరి యుండు
స్పర్శ, శబ్ద, రూపములొప్పు పావకునకు,
స్పర్శ, శబ్దము, రూప రసమ్ము లప్పు
లకును; గంధయుతముగ భూమికిని నైదు
గుణములుఁ దనరు చుండు నకుంఠితముగ

192. కం. స్థూలమ్ముగ బ్రహ్మాండం
బీ లీలగ నుద్భవించు నెల్లయుగములం
దోలిని తదంశగతులన్
బోలుచుఁ బ్రాణులు నిరతముఁ బుట్టుచు నుండున్

193. కం. ఎనుబది నాలుగులక్షలు
నసయము గుణరూప భేద మమరగఁ బ్రాణుల్
దినదినము వృద్ధియగు నిదె
యనఁబడు "సర్గం" బటంచు నార్యవరులచే

194. ఉ. నారద! నీకు నిప్డు త్రిగుణంబుల తత్త్వమునెల్లఁ జెప్పెదన్
దోరపు శ్రద్ధతో వినుము; దొల్త వచించిన సృష్టి తత్త్వ మిం
పారగ నీదు సంశయములం దొక కొన్నిటినైనఁ దీర్చెనం
చారయనేఁ దలంచెద వియచ్చర మౌనివరా! ధ్రువంబుగన్

195. సీ. సాత్వికంబది ప్రీతి తత్త్వమ్ముతోనొప్పు
ప్రీతి సౌఖ్యము నుండి వృద్ధియగును
సాత్విక ప్రీతినా సకల జగంబుల
నుతిఁగాంచు నిద్ది సన్మతిఁ దలంప
సత్యమ్ము శౌచమ్ము శ్రద్ధయున్క్షమయును
నార్జవము ధృతియు నమర దయయు
శాంతియున్ లజ్జయు సంతోషములనంగ
సాత్వికమునకు లక్షణ ములయ్యె

గీ. నిర్మలంబౌచు నిశ్చల నియతినొప్పు
సాత్వికశ్రద్ధయిది ధర్మ సమ్మతమ్ము
మంచి పనులకు మనసును మరలఁ జేయు
ధవళ వర్ణమ్ముతోనిది తనరుచుండు

196. సీ. రాజసంబయ్యది రక్త వర్ణాంచిత
మద్భుతావహమును నప్రియమ్ము
దుఃఖయోగమ్మున దురతిక్రమమ్మునై
యప్రీతిఁగలిగించు నంతమందు
ద్వేషమ్ము, ద్రోహమ్ము, తీరని మాత్సర్య,
మలసత్వ, మభిమాన, మతిమదమ్ము,
వర్ధిల్లు చుండును వరుస రాజసమున
తామసంబిక నల్లఁ దనముగల్గి





గీ. అలసతయును, నజ్ఞానమ్ము, నమితనిద్ర,
భయము, దైన్యమ్ము, కార్పణ్య భావములును
వాదశీలమ్ము, దోషమ్ము, వక్రబుద్ధి,
నాస్తికత్వమ్ము, పరుల సంతాపమొంద
జేయుటయు నను గుణములఁ బాయకుండు

197. కం. ఈమూడింటను నెప్పుడు
నామోదింపంగ దగిన యది సత్వంబే!
తామసమును వర్జించుచు
నేమంబున రాజసమును నియమింపవలెన్

## త్రిగుణముల సమ్మేళనము

198. చం. త్రిగుణము లప్పుడప్పుడు హృదిన్ జెలరేగి రణంబొనర్చు; బా
గుగ నొకదాని నొండొకటి గూడి పరస్పర మాశ్రయంబులై
జగములనొప్పు; కేవలము సత్వరజస్తమముల్ నిరాశ్రయం
బుగ మన జాలవెప్డు పొలు పొందెడి పద్మభవాండమం దెటన్

199. చం. తెలిసిన దాని యందెపుడు తీవ్రతరంబగు శ్రద్ధ యున్ననే
కలుగును సత్ఫలం, బటులగాక నిరర్థక మౌను; నెద్దియున్
ఫలితమొసంగ దింతయును పల్కిన విన్నను చూచినంతనే;
తెలియ వలెన్గ్రమంబున హృదిన్ గడు స్వానుభవమ్ముఁ బొందుచున్

200. శా. తీర్థక్షేత్ర మహత్వముల్ బుధవరుల్ దెల్పంగ నాసక్తితో
నర్థంబంతయు ఖర్చుచేసి కడుపుణ్యంబున్ గొనన్గోరి తా
నర్థిన్ దీర్థములందుఁ గ్రుంకిడిన, దివ్యక్షేత్రముల్ సూచినన్
వ్యర్థంబేగద లోని దుర్గుణములన్ బాయంగ లేకుండినన్

201. ఆ.వె. కర్షకుండు మిగుల కష్టించి పొలమెల్ల
దున్ని పైరు వేసి వెన్నుదీయు
సమయమందుఁ దగిన శ్రద్ధఁ జూపకయున్న
ఫలమదెట్లు దక్కు కలతతప్ప

202. ఆ.వె. కానతీర్థములను కలపుణ్యభూములన్
తిరిగి తిరిగి యింటి కరిగినంత

పూర్వ భంగినున్న పొందునే ఫలితమ్ము
స్వానుభవము దనుక శ్రద్ధలేక

203. శా. స్వాధ్యాయాదుల వల్ల మానసమునన్ సత్వంబు పెంపొందగా
నధ్యాత్మస్థితి గల్గు; లోనఁ గల ద్వేషాదుల్నశించున్ గృషిన్,
మధ్యన్ రాజస తామసంబులవి సంపర్కంబులై ఘర్షణన్
స్వాధ్యాయాదుల మాన్పు నెన్నడయినన్ సత్వచ్యుతిన్ బొందినన్

204. ఉ. సత్వము వృద్ధిఁజెందిన విచారణసేయుచు బుద్ధియెప్పుడున్
తాత్విక ధర్మమార్గమునఁ దానడిపించు; తమోరజంబులన్
స త్వమడంచుఁ; దృప్తినిడు; సజ్జన సంగతిఁ గల్గఁ జేయు, పూ
ర్ణత్వమొసంగుఁ; దక్కిన గుణంబుల వృద్ధి నడంచు నెప్పుడున్

205 ఉ. రాజస బుద్ధి కెక్కు దనురాగము నిత్య మధర్మ వృత్తిపై;
రాజిత వేదధర్మ పరిరక్షణ సేయఁ దలంప దెప్పుడున్;
వ్యాజ గుణంబికన్ తమస మత్యధికంబుగ నున్నబుద్ధికిన్
దేజముఁ దప్పు వక్రగతి తీవరిలున్ బ్రియమౌను దుష్క్రియల్

206. తే.గీ. నిర్మలంబైన సత్వంపు నిజగుణమును
మలిన మొనరించును రజస్తమమ్ము లెలమి
వానిధాటికి నెదురొడ్డి ప్రబలమౌచు
సత్వమదినిల్వ యవియుండు సద్దుమడగి

207. కం. కేవల సత్వగుణంబది
భావింపగ నుండ దెపుడు, ప్రక్కగుణములన్
సేవింపగ మదినెంచదు
పావనసతి సవతిపొత్తు భావించనటుల్

208. సత్వమ్ము బలమైన సవతు లేడ్చినయట్టు
లేడ్చు తక్కినరెండు నెల్లవేళ
అవకాశ మెప్పుడా! యని పొంచి యుండును
తోడుదొంగలవలె జాడనరసి
భార్యసేవలకును భర్త మోదముఁ జెంద
సవతులేడ్చుచు నుంట సత్యమెచట





సత్క్షత్రియుని గాంచి సజ్జనుల్ ముదమంద
దుర్జనుల్ వగతురు తోరముగను
వర్ష మధికమైన కర్షకుం డలరును
పూరిగుడిసెవాడు పొగిలి యేడ్చు

గీ. గుణము లివి యవస్థలఁ బట్టి కూడి, యొకట
దుఃఖమును, మఱియొకట సంతోష మొదవ
జేయుట యిది సహజమనఁ జెల్లుచుండుఁ
గాన కడు జాగరూకతన్ బూనవలయు

209. కం. వత్తియు, నూనెయు, మంటయు
పొత్తయి వెలుగులనుజిమ్ము పోలిక గుణముల్
చిత్తమునఁ జేరి తమతమ
వృత్తుల వెలయించుచుండు విశ్వంబందున్

210. వ. అని విరించి తనకుఁ దెల్పిన విషయంబంతయు నారదుండు
నాకు వివరించెనని వ్యాసుడు జనమే జయునితోపల్కి
మరల నిట్లు చెప్పఁదొడంగె.

211. ఉ. ఇంతకుఁ గారణంబయిన యీశ్వరి నా జగదేకమాత న
త్యంతము భక్తితోఁ గొలిచి యజ్ఞ మొనర్పుము సమ్మతమ్మునన్
శాంతియు దాంతియున్ సకల సంపదలున్ వరియించునిన్ను, నీ
వంతలు చింతలున్ దొలగు వాంఛితముల్ నెరవేరు భూపతీ!

212. చం. భయమున నైన మిక్కుటపు భక్తిని నైన నచంచల స్థితిన్
దయకు నిధానమున్ పరమ తత్వమునౌ జగదంబ నామమున్
ప్రియముగ నుచ్చరింపఁగదు పెంపొదవున్ నృపవర్య! కావునన్
నయమున నీవునున్ దినదినమ్మును దేవినిఁగొల్వుమింతటన్

213. తే.గీ. వెనుక సత్యవ్రతుండను విప్రు డొకడు
బాణఘాతమ్మునన్ బద్ధ పందియఱపు
నం దొదిగియున్న 'ఐ'యను నక్షరమును
జపముసేయంగ జగదంబ సంతసించి
యతనిఁగవి వరుఁ జేసె నత్యాదరమున

214. కం. అనవిని జనమే జయుడా
ముని వర్యునిఁ జూచి మిగుల మోదము తోడన్
వినిపింపు మయ్య నా క
య్యనఘుని చరితమ్ము విపుల మయ్యేదురీతిన్

## సత్యవ్రతుని చరిత్ర

215. వ. అని జనమేజయుండు ప్రార్థింప వ్యాసుండు మనంబున సంతసించి
సత్యవ్రతుని వృత్తాంతబిట్లు చెప్పందొడంగెనని సూతుండు
శౌనకాదుల కిట్లనియె

216. కం. వినుమో! జనమేజయ, నే
ననయముఁ దీర్థంబు లెల్ల నమితాసక్తిన్
గనుచును దిరుగుచు చివరకుఁ
జనితిని యొకనాడు నైమిశమునకు వేడ్కన్

217. ఉ. అచ్చటి మౌని వర్యుల ననంత తపోవిభవాభిరాములన్
ముచ్చట దీరఁ జూచి కడు మోదమునన్ గుశలంబులడ్గి, వా
రిచ్చిన యాతిథేయముల నింపునగైకొనియుండ, వారలున్
హెచ్చుగు సంతసంబున మహేశ్వరతత్వముఁ జర్చసేయగన్

218. తే.గీ. అపుడు జమదగ్నిలేచి తా ననియెనిట్లు
మౌనివరులార! పెద్దలు, మాననీయు
లైన మీరలు దీర్పు డత్యాదరమున
సందియం బొండుగల్గె నాడెందమందు

219. చం. అరయఁద్రిమూర్తులున్ మఱియునష్టదిగీశులు సూర్యచంద్రులున్
గరిముఖ షణ్ముఖాశ్వులు జగమ్ములలోఁ గడుసుప్రసిద్ధులై
స్థిరముగ నుందు, రందుఁ గడు శీఘ్రగతిన్ గరుణించి కోర్కెలన్
బరువడిఁ దీర్పఁ జాలెడి శుభంకర మూర్తినిఁ దెల్పుడొక్కనిన్

220. చం. అని జమదగ్ని తానడుగ నంతట లోమశుడ న్మునీంద్రుడి
ట్లనియెను, నీదు ప్రశ్నమున కాత్మఁగడుంగడు మోదమందితిన్





వినుము చరాచరంబయిన విశ్వమునన్ దగ పూజనీయురా
లనయము నాదిశక్తియగు నంచుఁ దలంచుము శంకయేటికిన్

221. తే.గీ. ఆద్యయును పరాప్రకృతియునైన తల్లి
ముగురు మూర్తుల కనరాదు మూడు కోట్ల
దేవతలకును తల్లియై దీప్తిఁ గాంచు
విశ్వమునకెల్ల మూలమై వినుతికెక్కు

222. తే.గీ. ఆమె నామమ్ము నొకసారి యాత్మఁదలచి
నంతమాత్రాన భక్తుల యార్తులుడుగు
ఇంతయేల పరాకున నేని యామె
నామ బీజాక్షరముఁ దల్ప క్షేమమౌను

223. కం. దీనికి నొక సాక్ష్యంబును
నే నెఱిగినయట్టి దాని నెఱిగించెద నో
మౌనీంద్రులార! మీరలు
మానసముల శంకలెల్ల మాని వినుడికన్

224. తే.గీ. వేద వేదాంత వేత్తయౌ విప్రుడొకడు
దేవదత్తాఖ్యుఁ గోసల దేశమందు
కాపురంబుండె మున్నొక కాలమందు
సర్వ ధర్మజ్ఞుడన్న ప్రశస్తి గలిగి

225. చం. అతనికి నెంతకాలమున కాత్మజు డొక్కడయేనిఁ గల్గమిన్
వితత విచార చిత్తుడయి వేద విధిజ్ఞుల నెల్లఁ బిల్చి సం
తతి వడయంగ నొక్కసవనం బొనరింపుడు మీరలంచుఁ దా
నతులిత భక్తి వేడ నపుడందరు నాతనికోర్కెకుందగన్

226. తే.గీ. పుత్ర కామేష్టి జరుపంగఁ బూనిరపుడు
దేవదత్తుండు సంతోష మావహింప
వేగ తమసానదీతీర విపుల దేశ
మందు మంటప మొక్కటి పొందుపరచి

227. వ. సుహోత్రుండు బ్రహ్మగా యాజ్ఞవల్క్యుం డధ్వర్యుండుగా
బృహస్పతి హోతగా పైలుదు ప్రస్తోతగా, గోభిలు దుద్గాతగా

తక్కుంగల మహామునులు సభ్యులుంగా సంభావించి యజ్ఞంబుం
బ్రారంభించె నాసమయంబున

228. ఉ. వీనుల కింపుగా వివిధ వేదవిదుల్ బహుమంత్ర గానముల్
బూని యొనర్చు చుండ నట భూసుర వర్యులకెల్లఁ దృప్తిగాఁ
గానుక లిచ్చుచున్ దనిపె గౌరవమొప్పగ దేవదత్తుడున్
మానుగ యజ్ఞమున్ పరిసమాప్తమొనర్పఁ దలంచుచుండగన్

229. ఉ. అంతట సామవేదము ననన్యమతిన్ స్వర సమ్మతమ్ముగా
పొంతమొనర్చి గోభిలుడు పూని పఠించుచునుండ శ్వాసకున్
సుంత నిరోధమేర్పడగ సుస్వర మొక్కెడ భంగమయ్యె; తా
నంతయు దేవదత్తు, డిది యాత్మనెఱింగి వివృద్ధకోపుడై

230. తే.గీ. సుతుని బడయంగఁ గోరి నే సుగుణయుతుని
పుత్రకామేష్టి శ్రద్ధతో పూని చేయ
స్వరము భంగమ్ముఁ గావించి సవనమెల్ల
వ్యర్థమొనరించితివి యిట్లు భయమువీడి

231. మ. ముని ముఖ్యుండవు సామవేదమును సంపూర్ణమ్ముగా సుస్వరం
బున గానంబొనరింప నేర్పరివి; నే పుత్రార్థినై యజ్ఞ మి
ట్లనయంబున్ జరిపించుచుండ నిటు లీ వశ్రద్ధ నుచ్చారణం
బున దోషం బొనరింపఁ జెల్లునె కడున్ మూర్ఖుండవై దుర్మతీ!

232. మ. అనినన్ గోభిలు డంతఁ గ్రుద్ధుడయి నీ వత్యంత గర్వోద్ధతిన్
నను నిందించితి; దీర్ఘకాలమిటు మంత్రంబున్ స్వరంబింతయున్
జననీ కేను పఠించి శ్వాసనెగ బీల్చన్ లేక యొక్కింత త
ప్పిన నంతన్ మదిలో గ్రహింప కిటులన్ బ్రేలంగ నీకొప్పునే

233. ఆ.వె. మూర్ఖయంచు నన్ను ముక్కడి పల్కుల
నిందఁజేసితీవు నియతిఁ దప్పి
కాన మాటరాని కడుమూర్ఖు డుదయించు
ననుచు శాపమొసగె నాగ్రహమున

234. మ. అనిశాపం బిడ దేవదత్తుడపు డత్యంతమ్ము దుఃఖించుచున్
దనతప్పున్ క్షమి యింపుమంచు ముని పాదంబుల్ వడిన్బట్టి యో





యనఘా! యింతటి శాపమిచ్చితివి, నాయజ్ఞానమున్ సైపుమా!
తనయుల్ లేరని కుందు నాపయిన నిర్దాక్షిణ్య మిట్లొప్పునే!

235. ఆ.వె. మొఱకుడైన సుతునిఁ బొందుట కంటెను
సుతులు లేకయుంట సుఖముగాదె
అదియుఁగాక విప్రు డతి మూర్ఖుడైనచో
వాడు హీనుడౌను పశువుకన్న

236. ఉ. పూజ కనర్హుడౌనతడు, పొందఁదగండిక దానముల్; విధుల్
యోజనసేయలేడు, కడు నోరిమి వేదము లభ్యసింపగా
భాజను డౌనె మూగయయి; బ్రాహ్మణు డిద్ధర వేద విద్యలన్
రాజిల నేర్వకుండినఁ దిరంబుగ సేమము గాదు రాజుకున్

237. తే.గీ. దైవ కార్యమ్ముసేయంగఁ దగడతండు
అపర కర్మలకైన ననర్హుడగును
అట్టికొమరుని వలన నా కౌనదేమి
కూలిపని నైనఁ జేయంగ జాలడకట!

238. తే.గీ. ధర నపండితున కిడెడి దానమునను
దాత నరకమ్మునకు నేగు తప్పదనుచు
నార్యు లనవింటి; నతనికి నన్నమొకటె
దానమీయంగఁ దగును వదాన్యులెలమి

239. తే.గీ. అట్టి మూర్ఖుని పూజించు నధిపుడున్న
వాని రాజ్యమ్మురాజ్యమే! వల్ల కాదు
అతడు పాలనసేయ ననర్హుడౌను
పండితున కచట వసింపఁ బాడిగాదు

240. ఉ. కావున గోభిలా! కనియొ కానకయో యొక తప్పుచేసితిన్,
గావుమునన్ను, శాపమును గ్రమ్మఱుపన్ దగ నీవెయోపు దో
పావన మూర్తి! నీదు పదపద్మములంటి నమస్కరింతు, స
ద్భావముతోడ శాపమును బాయగఁ జేయు మటంచువేడినన్

241. తే.గీ. అతని ప్రార్థన మాలించి యమ్మునియు, ద
యార్ద్రమతియయ్యె, నెచట మహాత్ములెలమి

క్షణిక కోపనులంచుఁ బ్రశస్తిగలదు
పాపులతి దీర్ఘ కోపస్వభావు లగుట

242. చం. జలమున కెందు శీతలము సాజము, దానికి నగ్ని కూడినన్
పెలుచన వేడియౌను, నటు పిమ్మట నగ్నిఁ దొలంగఁ జేసినన్
దొలగును నుష్ణ మంతటనె; దొడ్డ గుణాఢ్యుల చిత్తముల్ సదా
జలములవంటి వెన్నగ; ప్రశాంతత నైజగుణంబువారికిన్

243. వ. గోభిలుండంత నతని ప్రార్థన మాలకించి దయార్ద్ర హృదయుండై యిట్లు పలికె.

244. ఉ. నా వచనమ్ము తప్ప దయినన్ విను మయ్య! సుతుండు గల్గు నీ
కా విధి మూర్ఖుడిప్డు; తదనంతర కాలమునందు వాడె స
ద్భావ విశారదుండయిన పండితుడౌను, భయమ్మువీడు, భూ
దేవ! యటంచుఁ బల్కగ మదిన్ ముదమందుచు దేవదత్తుడున్

245. తే.గీ. భూసురులకెల్ల దక్షిణల్ బొసగ నొసగ
నెల్లవారలు వీడ్కొని యేగి నంత
కొంత కాలమ్ము సనగ తత్ కూర్మిపత్ని
గర్భవతి యయ్యె రోహిణీ కాంతప్రీతి

246. కం. సంతస మందుచు భూసురు
డంతన్ పుంసవన మాది యాచారములన్
సాంతమ్ముగ జరిపించుచు
కాంతన్ మురిపించె నర్మ గర్భోక్తులచే

247. ఆ.వె. నెలలు నిండినంత నెలత రోహిణికొక్క
శుభ ముహూర్తమందు సుతుడు పుట్టె
జాత కర్మ లెల్లజరిపించి తండ్రియుఁ
దగ నొసంగె దాన ధర్మములను

248. కం. ఆతని కుతథ్యు డనగా
ప్రీతిని శుభనామ మొసగి పెంచుచు నంతన్
భాతిగ నష్టమ వర్షం
బేతెంచిన నుపనయనము నేర్పడఁ జేసెన్





249. ఉ. అంతట వేదమున్ సుతున కాదర మొప్పగ నేర్పనెంచి తా
చెంతకుఁ బిల్చి భూసురుడు స్నేహమెలర్పగ వేద పాఠ మ
త్యంతము శ్రద్ధతో నుడివి యాతనిఁ బల్కుమటంచుఁ దెల్పఁ దా
సుంతయుఁ బల్కడయ్యె పరిశోషిత దీన ముఖావలోకుడై

250. కం. ఎన్నో విధముల నిట్లా
చిన్ని కుమారున కతండు చెప్పఁ దొడగినన్
మన్ననఁ జూపడు పలుకడు
పన్నుగ తా యౌవనంపుఁ బ్రాయము దనుకన్

251. ఉ. ఆతడు మూర్ఖుడన్న విషయంబు గ్రహించిన లోకమంతయున్
యాతన వెట్టుచుండ పరిహాసముసేయుచు; నచ్చుటచ్చుటన్
ప్రేత మటుల్ జరించు సుతు వేదనతోఁగని తల్లిదండ్రులున్
చేతములం బరాభవము సెందుచు మించిన తీవ్ర కోపులై

252. ఉ. తిట్టిరి నోటికబ్బినటు తీవ్ర తరంపుఁ బదంబులన్; గడున్
గొట్టిరి దేహమెల్లయును గ్రుంగగ; నన్న మొకింతయేనియున్
బెట్టక కొన్నినాళ్ళు కడువేదనఁబెట్టిరి, కాని యాతడున్
పట్టున నొక్క యక్షరము వల్కక యుల్కకయుండె నక్కటా!

253. తే.గీ. కుంటియైనను వీడొక గ్రుడ్డియైన
యిన్ని బాధలు గలుగునే? యిట్టి మూర్ఖ
పుత్రునొసగితే దైవమా! పూర్వజన్మ
దుష్కృతంబది యెట్టిదో తొలగదయ్యె

254. కం. అనియిట్లు కన్నవారును
తన బాంధవులెల్ల తనను తగనిందింపన్
గని యా యుతథ్యుడంతన్
మనమున వైరాగ్యమొదవ మరుదివసమునన్

255. ఉ. కానన భూమికేగి యట గాంగతటిన్ దృణపర్ణ బంధురం
బైన కుటీరమున్ నిలిపి యందు నివాసముసేయుచుండె నెం
దేని వనంబునందు లభియించిన పక్వఫలంబులన్ సదా
ప్రాణము నిల్పుకొంచు ముని వర్యుని పోలిక మూగయౌటచే

256. ఆ.వె. మాట రాని కతనఁబాటిల్లె నతనికి
సత్యనియమ ఫలము సహజముగను
బ్రహ్మచర్యవ్రతముఁ బరగ శోభిల్లెను
ఇచ్ఛలేని కతన నితర మందు

257. ఉ. లేదొక మంత్రమున్ జపము; లేవిక సాంధ్య విధుల్ దపంబులున్,
లేదొక యజ్ఞకార్యమును, లేదొక హోమము, లేదునిష్ఠ; సూ
ర్యోదయ వేళ లేచుటయు నొప్పుగ నప్పుల పుక్కిలించి స్నా
నాదులొనర్చుటల్ దగ క్షుధార్తి నెఱుంగుట తప్ప వానికిన్

258. మ. పలుకండెవ్వరితోడఁ బేరడిగినన్ భావించి చెప్పంగ లే
దులుకంబోదు మృగాళిఁ జూచినను; "సద్యోగీశ్వరుండౌనుబో
నలఘు స్వాంతుడితండు, మౌనమున నిత్యానందసంధానుడై
మెలగున్ నిష్ఠ"నటంచు సంతసమునం బేర్కొందు రచ్ఛోమునుల్

259. శా. నాకున్ మృత్యువు రాకపోయెఁ గద! యెన్నాళ్ళిట్లు మూర్ఖుండనై
లోకంబందుఁ జరింతు, దైవమిటు లాలోకించ వేరెవ్వరో
సాకౌనంచుఁ దలంపనేల, నొసగెన్ సద్బ్రాహ్మణత్వంబు, గా
నీ కర్మంబది యిట్టులుండె ఫలితం బీనట్టి వృక్షంబటుల్

260. మ. తొలి జన్మంబుల నెట్టి పాపముల నస్తోకంబుగాఁ జేసితో
కలిగెన్ నాకిపు డిట్టి దుస్థితి, సదాఖ్యానంబులన్ బ్రీతితో
కలనైనన్ విని యుండనేమొ, యిక సద్గ్రంథమ్మునే నొక్కటేన్
దలపన్ దానమొసంగ నైతినొగదా,! తథ్యంబుగా నేరికిన్

261. చం. తపమొనరించి ముక్తిని ముదంబునఁ బొందెదమన్న నెద్దియున్
జపమొనరింప లేనకట! సత్కృప నక్షర మొక్కటైన నా
కిపుడు పరాత్పరుండిడిన నేనతి శ్రద్ధజపించి ముక్తి మా
ర్గపుదరిఁ జేరుదున్ గద! విరాగమతిన్ దగ యోగసాధనన్

262. చం. ఇదియును నాభ్రమంబె చదువెంతయు నేర్చినమాత్రఁదక్కునే
పదిలమునొచు ముక్తినిధి పాయక దైవమనుగ్రహింపకే;
మదిఁ దలపోయ దైవమది మానుగ సత్కృపఁ జూడకున్న నే
యదనుననైన పౌరుష మనర్థఫలమ్ముల నందఁజేయునే





263. కం. అరయగఁ ద్రిమూర్తు లైనను
సురపతియు దిగీశులైన సుస్థిరముగ నా
పరమాత్మరూప మనుచున్
పరిగణనముసేయు కాలవశ్యులె యెపుడున్

264. వ. అనియిట్లయ్యుతథ్యుండు పూర్వపుణ్యపరిపాక జ్ఞానంబున
వితర్కించుచుండె–నివ్విధంబున పదునాలుగేండ్లు గడచినయంత
నొక్కనాడు

265. శా. క్రూరాకారుడొకండు తద్వనమునన్ ఘోరంపు సత్వంబులన్
నారాచమ్ములఁ ద్రుంచుచున్ బరువిడెన్ దత్పర్ణశాలా సమీ
పారణ్యమ్మున దిర్గు సూకరమునేయన్ దీర్ఘ చాపమ్మునన్
ధీరుండై యొక బాణమున్ దొడిగి యుద్రేకమ్ముగా నార్చుచున్

266. ఆ.వె. ఆ నిషాదు డప్పు డాసూకరమ్మును
విశిఖమునను వేగ వేసినంత
భయము తోడ నదియు పరువెత్తి యటునిటు
తిరిగెఁగరము రక్త మురలుచుండ

267. ఉ. బిత్తర చూపులన్ మిగుల భీతిలి క్రోడము బిట్టు నార్చుచున్
దత్తర పాటుతోడఁ గడు దైన్యము నొందుచు పర్ణశాలలో
నత్తరి దూరి నంతటనె యట్టె నుతథ్యుడు దానిఁ గాంచి తా
చిత్తములోఁ గలంగుచు విచేష్టలుదక్కె దయాప్రపూర్ణుడై

268. ఆ.వె. కనుల నిండ నీరు కదువడిఁ బ్రవహించె
పులకరించె రోమములును మిగుల
జ్వరము తీవ్రమయ్యె, సర్వాంగము లవెల్ల
వణకె పూనకమ్ము వచ్చినట్లు

269. ఉ. ఆ సమయమ్ము నందతని యాస్యమువెల్వడి యప్రయత్నతన్
భాసిలె నక్షరమ్మొకటి వాగ్వర మంత్రపు బీజ వర్ణమై
వాసిగ నాతడంతఁ దనపట్ల ననుగ్రహమంది దైవ మి
ట్లే సుకృతంబొయేమొ యిపుడిచ్చెను మంత్రమటంచు నెంచుచున్

270. కం. 'ఐ'యను నావర్ణంబును
బాయక పలుమార్లు నిష్ఠఁబఠియించుచుఁదా
నేయదియు మదినిఁ దలపక
నా యాశ్రమమందె యుండె నానందమునన్

271. ఉ. అంతట సూకరమ్ము భయమందుచు వేగమె పర్వువెట్టి యా
చెంతన నున్న యొక్క పొదఁ జేర, నిషాదుడు నుగ్రరూపుడై
యంతకు నట్లు వచ్చి యట నాశ్రమమందు వసించుచున్ గడున్
సంతస మొప్ప నున్న ద్విజసత్తముఁ గాంచి నమస్కరించుచున్

272. శా. ఓ విప్రోత్తమ! నాదు బాణ హతిచే నుగ్రమ్ముగా నార్చుచున్
బ్రావృణ్మేఘ మనంగఁ గ్రోడ మొకటీ ప్రాంతమ్మునన్ జొచ్చె, నా
కీవేళన్ గమలోద్భవుం డొసగె స్వామీ! భోజనార్థంబుగన్
నీవద్దాని నెఱుంగుదేనిఁ జెపు మెందేనున్నచోనిచ్చటన్

273. చం. అనవిని యాయుతథ్యుడపు డాత్మ వితర్కముఁజేసి యీ నిషా
దునకు నిజంబుఁ దెల్పుటయు దోసమె దానివధించుఁగావునన్,
గనియును గానలేదనుచుఁ గల్లవచింప నసత్యదోషమౌ
ననుచుఁ దలంచి సందియము నందుచు నుండె నిమేషకాలమున్

274. కం. అని సంకట పడునతనికి
మనమున మును నార్యులనిన మాటలు స్మృతికిన్
గనవచ్చినంత ముదమున
తనలో ననుకొనియె నిట్లు తార్కికదృష్టిన్

275. తే.గీ. సత్యమే యౌను ధాత్రి నసత్యమయ్యు
నొరుల ప్రాణమ్ము రక్షించు తరుణమందు
సత్యమయ్యును హింసకు సాక్ష్యమేని
యది యసత్యమె యౌనందు రార్యులెలమి

276. కం. అదియును నొక దుర్మార్గుని
మదమునఁ జరియించునట్టి మానవ మృగమున్
బదపడి శిక్షించునపుడు
పదిలంబుగ సత్యమొకటె పలుకగవలయున్





277. ఉ. కావున నిప్డు నేను సరిగా హితమిర్వురఁ జెందునట్టులన్
భావనఁ జేసిచెప్పుటయె భావ్యమటంచుఁ దలంచి బ్రాహ్మణుం
డేవిధిఁ జెప్పుదంచు మదినేర్పడ యోచనసేయుచుండ వా
గ్దేవి యనుగ్రహించి పలికించెను నాతని నోట నివ్విధిన్

278. కం. నిరతము వాగ్బీజంబును
కరము మదిని నిల్పి యతడు కడు నిష్ఠ జపం
బిరవుగఁ జేయుట నతనికి
సరసంపు కవిత్వశక్తి చక్కగ నబ్బెన్

279. ఆ.వె. కనులు చూచు గాని వినిపింప లేవెందు
నాడఁగలుగు నోరు చూడదెదియు
నేమి చెప్పుదింక నెచ్చోటి కేనియు
నరుగుఁ దెంచి భోజ్య మరసి కొనుము

280. కం. అనిపలుక నిషాదుడు తాఁ
జనియెను మరుమాట పల్కఁజాలక; యంతన్
ముని వాల్మీకి విధంబున
ననఘు డుతథ్యుండు కవివరాగ్రణి యయ్యెన్

281. శా. నాటన్గోలె నతండుఁ బొందెఁ గడు సన్మానంబు లుర్వీస్థలిన్
సాటెవ్వారలు లేరు వీని కనుచున్ సత్యవ్రతాఖ్యున్ బుధుల్
వీటన్ వీటను బల్కు చుండ విని సంప్రీతిన్ మదిన్ నెయ్యముల్
వాటిల్లన్ గొనిపోయె తండ్రియు నిజావాసానకున్ బుత్రునిన్

282. కం. అనియిట్లు లోమశుండను
ముని వర్యుడు నైమిశమున మునులకునెల్లన్
వినిపించుచుండ నేనున్
వినియుంటి నుతథ్య కథను వీనులలరగన్

283. ఉ. కావున నీవు నెల్లపుడు కామిత సత్ఫలదాయినిన్ మహా
దేవిని నాదిశక్తిని మదిన్ నియమంబున నిల్పి భక్తి సం
భావనతో భజింపుము, నిబద్ధిగ నామె సమస్తసౌఖ్యముల్
వావిరి నీ కొసంగునని వ్యాసుడు వల్కగ సంతసించుచున్

284. కం. జనమేజయుడును వ్యాసుని
వినయమ్మునఁ జూచి పల్కె వేదవిధిజ్ఞా!
వినఁదలతునింక దేవీ
ఘనయజ్ఞములను గుఱించి కరుణాంభోధీ!

## దేవీయజ్ఞభేదములు

285. కం. దేవీ యజ్ఞంబులకున్
గావలసిన ద్రవ్యములను, గ్రతు నిర్వహణం
బేవిధిఁ జేయగ వలయునొ
నావిధమును నాకుఁ దెల్పుమయ్యా! కరుణన్

286. మ. అనినన్ వ్యాసుడు సంతసించి నృపవర్యా! యజ్ఞకార్యమ్ములన్
మునులౌవారలు సాత్వికంబన, నృపుల్ బొల్పొందగా రాజసం
బన, దైత్యాదులు తామసంబు ననగా నామోదమౌ రీతులన్
దనరన్ జేయుచు నుందు రివ్విధమునన్ ధాత్రిన్ ద్రిమార్గంబులన్

287. ఉ. జ్ఞానులు మోక్షకాంక్షులును సాత్వికమాదిగ యజ్ఞకార్యముల్
బూనక యంతరంగమున పూర్ణమునౌ పరతత్వమున్ సదా
ధ్యాన మొనర్చుచుందు రదెయజ్ఞముగాఁ దలపోసి వస్తు సం
తానము లెవ్వియున్ గొనక తద్దయుయోగసమాధి నిష్ఠులై

288. తే.గీ. దేశకాలాను గుణ్యమై దివ్యమంత్ర
తంత్రములను, ద్విజులు, వస్తు తతియు గలిగి
త్రివిధ శుద్ధుల సాత్విక రీతిఁ జేయ (ద్రవ్యశుద్ధి, క్రియాశుద్ధి, మంత్రశుద్ధి)
నదియె సాత్విక యజ్ఞమంచనిరి బుధులు

289. శా. అన్యాయార్జితమైన ద్రవ్యమది యజ్ఞార్థంబు సేకూర్చినన్
ధన్యంబౌనె తదీయకార్యమిక నింద్యంబేయగున్ గర్తకున్,
శూన్యంబౌ నిహముం బరంబులు, గడున్ శుద్ధాంతరంగమ్మునన్
మాన్యుల్ మెచ్చగఁ జేయనట్టి క్రతు సంబంధమునన్ భూవరా!

290. కం. దీనికొక యుదాహరణము
నేనెఱిగించెదను వినుము నీవంశమునన్
మానుగ పాండు కుమారులు
భూనాథులనెల్ల నడచి పూర్వమునందున్

291. ఉ. చేసిరి రాజసూయమును శ్రీవసుదేవసుతున్ బరాత్పరున్
వాసిగ నర్చసేసి, బహుభంగుల దక్షిణలిచ్చి తృప్తులన్
జేసిరి భూసురోత్తములఁ జెల్వుగ సద్యశ మెల్ల దిక్కులన్
భాసిలఁ జేసి రైనఁ బలు పాట్లు పడన్ గతమేమొ యెంచుమా

292. ఉ. ఓడిరి జూదమందు, కులయోషను కౌరవపాంసనుండు నో
నాడుచు నుండ చిత్తరువు లట్టులఁ జూచుచునుండి రందరున్,
బోడిమిఁ దప్పి, ఘోరవనభూముల వాసముఁజేసి యాపయిన్
గూడి విరాటభూపతిని గొల్చిరి హేయమటంచు నెంచకే

293. ఆ.వె. యాగఫల మదేమియయ్యె, నా భూసుర
వాక్కులేమి యయ్యె, వాసుదేవు
దేమిచేయఁ గల్గె, నింతయుఁ జూచుచు,
దీని కారణమ్ముఁ దెలిసికొనుము

294. మ. నుదుటన్ బ్రహ్మ డిట్లు వ్రాసెననుచున్ దూఱంగరా, దట్టులేన్
పదిలం బయ్యెడు వేద మంత్రములకున్ బ్రామాణ్యతల్గల్గునే
మదిలోనం దలపంగ రాదెపుడు సంభావించి యారీతిగన్
సదసద్యోచన చేసి చూడవలయున్ సద్బుద్ధితో నెప్పుడున్

295. మ. ఒక సత్కార్యము నాచరింప ఫలితంబొక్కొకచో నింద్యమై
ప్రకటంబైన తదీయ కారణము ద్రవ్యంబౌనొ, లేకున్న యా
జకులో! కర్తయొ యౌనటంచు కడు విజ్ఞానమ్ముతో నిశ్చయం
బొక టూహించుట యొప్పుఁబండితులకున్ యోచింప రాజోత్తమా!

296. మ. సురనాథుండొక కాలమం దసురులన్ ద్రుక్కింపగానెంచి సు
స్థిరుడై యజ్ఞమునొక్క దాని జరిపించెన్ విశ్వరూపున్ దగన్
గురు పీఠంబున నుంచి; యాతడును తా గోరెన్ సదారాక్షసుల్
సురలున్ వర్ధిల స్వస్తి మంత్రముల రక్షోవీర రక్షామతిన్

297. కం. అంతట రక్కసులెల్లరు
సంతసమునఁ దల్లి చెంత సరసక్రీడల్

వింతగ సలుపుచు వర్ధిల
నెంతయుఁ దానాగ్రహించి యింద్రుండంతన్

298. ఆ.వె. విషయ మెల్ల యెఱిగి విశ్వరూపు తలలు
నరికె వజ్రమెత్తి నాకవిభుడు
కర్తృ దోషమునన కలిగె నిట్లని యెంచి
కరుణయింత లేక కనలి యపుడు

299. కం. త్రివిధాశుద్ధుల ద్రుపదుడు
ప్రవిమల గతిఁ జేసి యజ్ఞ ఫలములఁబడసెన్
అవనిపతి దశరథుండును
స్తవనీయుల సుతులఁబడసె తాకోరినటుల్

300. చం. పనివడి పాండుసూనులు నవక్రపరాక్రమమొప్ప నెత్తి యా
వననిధి శీతశైల పరివర్తిత భూతల నాథులన్ వడిన్
గొనకొని యోర్చి విత్తములఁ గొల్లలు గాఁగొని వచ్చి యజ్ఞమ
ట్లనితరరీతి సల్పిరది యక్రమ సంపదగాదె యెంచగన్

301. ఉ. కావున రాజ సూయమున ఖర్చొనరించిన విత్తమెల్ల యీ
భూవలయమ్మునందుఁగల భూపతులన్ దగఁగొల్లఁగొట్టి ద
ర్పావహులై యొనర్చినదియౌట నిరర్థకమయ్యె; కష్టముల్
వావిరి బొంది రట్టి భగవంతుడు గృష్ణుడు నండ నుండియున్

302. మ. భువి వైఖానస మౌని వర్యులకె యౌఁబో ధాత్రి సాధ్యంబు స
త్వవిధిన్ యజ్ఞమొనర్ప; నెల్లపుడు, సత్వంబైన యాహారముల్
నవవన్యంబులుగొంచు, వస్తు తతియున్ న్యాయంబుగాఁగూర్చుచున్
త్రివిధాశుద్ధుల పుణ్య కార్యరతులై దీపించువారౌటచే

303. కం. యూపస్తంభము లుండక
పాపపు పశుబలులు లేక పరమ విశిష్టం
బైపొలుచు పురోడాశమె
యేపగు మంత్రముల వ్రేల్చ నిలసాత్వికమౌ

304. కం. యూపంబులు ద్రవ్యంబులు
నాపై బలిపశువు లమర నాటోపమునన్





జేపట్టు యజ్ఞమదియే
ప్రాపై రాజసమనంగ పరగున్ భువిపై

305. కం. క్రూరంబుగ మదయుతమై
దారుణ మారణముఁదలచి తగనొనరింపన్
ధారుణి తామసమనబడు
కోరందగ దెపుడు మనుజకోటులుదానిన్

306. కం. క్షత్రియులకు వైశ్యులకున్
ధాత్రిని రాజసము చెల్లుఁ దగ సేయంగన్
చిత్రముగఁ దామ సంబది
రాత్రించరులకును దగిన యజ్ఞమనబడున్

307. ఆ.వె. మోక్షకాంక్షులైన మునులు విరాగులు
వస్తుచయము విప్రవరులు లేక
ధ్యాన మందు చేయు మానసయజ్ఞమ్ము
పూర్ణయజ్ఞమనగఁ బొల్చెధరణి

308. గుణవర్జితమ్ముగాఁ గూరిచి మనసును
నియమించవలె ముందు నిర్మలముగ
మనసు శుద్ధంబైన మఱి దేహమెల్లను
శుద్ధమైయొప్పును సూనృతముగ
ఇంద్రియార్థమ్ముల నెల్లదూరముసేయ
మనసు శుద్ధం బౌను మరలదెటకు
మానస యజ్ఞమ్ముఁ బూన నర్హుండౌను
ఆత్మశుద్ధినిగన్న యార్యుడొకడె

గీ. యజ్ఞ సాధనము లవెల్ల నాత్మయందె
కల్పనముసేసి చిత్తమున్ గదల నీక
యజ్ఞ కార్యమ్ము చేయుచున్నట్లుఁ దలచి
యాచరించుట యుత్తమ యజ్ఞ మంద్రు

309. చం. శుచియగు ద్రవ్యమున్ గదువిశుద్ధ మనమ్మున కల్పనమ్ము సే
యుచు నిజ మానసంబె దగ హోతగ నద్దియె యజ్ఞకర్తగా

నచల మనస్కుడౌచు పరమాత్మను తత్సవనాధినాధుగా
ప్రచురగతిన్ దలంచి సలుపన్వలె మానస యజ్ఞ మున్నతిన్

310. తే.గీ. బ్రహ్మ విద్యాస్వరూపిణి పరమగతియు
నఖిలమునకు నాధారమౌ నాదిశక్తి
నాత్మఁ దలపోసి ప్రాణాగ్నియందు హవన
మొనరుపవలెఁ దద్ద్రవ్యమ్ము ననవరతము

311. తే.గీ. తనను సకలభూతములందు గనుటయు, తన
యందు నఖిల భూతమ్ముల నరయుటయును
నవని నుత్తమ లక్షణం బైవెలుంగు
నతడె మాహేశ్వరినిఁ జూడ నర్హుడగును

312. తే.గీ. సచ్చి దానందరూపిణి సకల సాక్షి
ణియగు దేవిని దర్శింప నేర్పుగల్గు
నతడె బ్రహ్మవేత్తయగు మాయాదికమ్ము
లతనికిఁ దొలగి మోక్షమ్మునందఁ గలడు

313. కం. కావున మానస యజ్ఞము
జీవులకున్ దగును; ముక్తి చేకుఱు దానన్
భావింప నదియె శ్రేష్ఠం
బేవిధమునవెంచిచూడ నితరముకంటెన్

314. కం. జగదంబన్ భజియించుచు
ప్రగతిన్ బొందంగ వచ్చు పౌరవనాథా!
పగదీర సర్పకులమున్
తెగటార్చితి తామసమున తెలియుము నృపతీ!

315. కం. దేవీ యజ్ఞము సేయుము
గావించెను దీని మున్ను గరుడ గమనుడున్
ఏవిధిఁ జేయగవలెనో
నే వచియించెదను నీకు నిందు కులేంద్రా!

316. ఉ. భూసుర శాపమున్ మఱియు భూసురవర్యు నవజ్ఞసేయుటల్
గాసిలఁ జేసి నీజనకుఁ గాలునిప్రోలికిఁ బంపె; దానముల్





సేసిన వైనమేర్పడదు, చేయడు సత్క్రియలేవి, లేదు ద
ర్భాసనమైనఁ దక్షక విషాగ్నులఁ గాలెను దుర్భర స్థితిన్

317. తే.గీ. మరణ సమయమ్ముఁ దెలియుట యరిది గాదె
అదియుఁ దెలిసిన పిమ్మట నాత్మయందు
పరమ వైరాగ్యమున్ బొంది బ్రహ్మమందె
నిలిచియుండుట తగును మనీషులకును

318. సీ. పాంచభౌతిక దేహ భావమ్ము విడనాడి
సుఖదుఃఖముల్ మదిఁ జొరగ నీక
సంసారి నేగాను సర్వదాముక్తుడ
నిర్గుణుండ నటంచు నియతిగల్గి
కర్మాను బంధముల్ గడచిపోయెను, నేను
సంసారసంకట జలధిదాటి
ముక్తి సామ్రాజ్యమ్ము ముదమునఁ గైకొందు
నని యెంచడింతయు ననవరతము

గీ. దేహరక్షణ కొఱకునై తీవ్రమైన
యత్నమొనరించెఁ గాని దేహాభిమాన
మునువిడువడయ్యె నీతండ్రి పుణ్యకార్య
సంగతులనెల్ల విడనాడి సంభ్రమమున

319. చం. అరయగ మోహసాగరమునందు మునింగి శరీర ధర్మముల్
స్థిరమని నమ్మి దైన్యమున దేహము వీడిన నీదుతండ్రికిన్
నిరయము సంభవించుటది నిక్కము గావున నీవె సద్గతిన్
బొరయగఁ జేయు మాతనికిఁ బూని యొనర్పుము సత్క్రియల్నృపా!

320. వ. అనియివ్విధంబున సూతుండు శౌనకాది మహామునులకుం
జెప్పి మరల యిట్లని చెప్పఁదొడంగె.

321. శా. వేదవ్యాసుని మాటలన్ వినుచు సంవేదాత్ముడై యక్కటా!
నా దౌష్ట్యంబది యేమిచెప్పుదును నన్గన్నట్టి నాతండ్రికిన్
మోదంబందగ సద్గతుల్ గలుగ సంపూర్ణంపు శ్రద్ధామతిన్
వేదోక్తక్రియ లాచరింప నయితిన్ విద్వద్వరుల్ మెచ్చగన్

322. కం. అని జనమేజయుడు మనం
బునఁగుములుచు వ్యాసునిఁ గని మునివర! నీ చె
ప్పిన విధమున నే యజ్ఞం
బొనరించెద నింకపైన నొప్పగు రీతిన్

323. కం. దేవీయజ్ఞంబును మును
భావించి ముకుందుడైన పంకజనాభుం
డేవిధమున నొనరించెనొ
నావిధమదియెల్లఁ దెలుపు మయ్యానాకున్

324. మ. అనినన్ వ్యాసుడు సంతసించి నృపవర్యా! మున్ను స్త్రీమూర్తులై
వనజాతాసన కంజనాభ భవు లంబన్ భక్తి నర్చించి తా
రనయంబున్ బురుషాకృతుల్ గొనిరి దుగ్ధాంభోధి మధ్యంబునం
దొనరన్ దెల్లనిదీవియం దమితమౌ యుత్సాహముల్ బైకొనన్

325. కం. తమకున్ వాణిని లక్ష్మిని
రమణీమణి గౌరినొసగి రయమున మీరల్
క్రమమున మీమీ నెలవుల
కమరన్ జనుడంచుఁ దెలిపె నంబయుఁ గృపతో

326. ఉ. అంతట వారు ముప్పురు నవాంబుజ నేత్రల తోడఁగూడి, ని
శ్చింత మహార్ణవంబునకుఁ జేరి ధరాతలమున్ సృజింప, తా
నెంతయు మోదమంది జగదీశ్వరి నిల్పెను నాత్మశక్తి, నొ
క్కింతయు మేదినిన్ మునుగ నీయక తద్ఘనవార్ధిలోపలన్

327. మ. తనశక్తిన్ జగదంబ భూమికటు లాధారంబుగా నిల్పుటన్
దనరారన్ "ధర" యన్న నామము ప్రశస్తం బయ్యె విశ్వంబునన్,
వనధిన్ ఖండితులైన కైటభ మధు వ్యక్తోగ్రమౌ మేదయున్
ఘనమై దానికిఁ జేర "మేదిని" యనంగా నొప్పె ప్రఖ్యాతిగన్

328. తే.గీ. కడు విశాలమై పృథులమై గ్రాలుకతన
పృథ్వియన, మహియుననగ, పేర్లుగలిగె
నాదిశేషుడు మేదిని నహరహమ్ము
వేయిపడగలపై నుంచి మోయుచుండు





329. కం. అటునిటు నొరగక యుండన్
బటుగతి నావిర్భవించెఁ బర్వత పంక్తుల్
దిటవై పృథివిని తా ము
త్కటముగ ధరియించి "భూమిధరము" లనఁ బడెన్

330. చం. అనుపమ రత్న శృంగముల నద్భుతమై బహుయోజనమ్ములం
దెనయగ విస్తరించిన మహీధర మొక్కటి సృష్టిఁజేసె నా
జనని సమస్తమున్ గనక సంయుతమై యలరారు నట్లు; త
ద్ఘనతర పర్వతంబదియె ధాత్రిని మేరువనంగ నొప్పెడున్

331. వ. మఱియు బ్రహ్మామానస పుత్రులై మరీచియు, నారదుండును నత్రియు, పులస్త్యుండు, పులహుండు, క్రతుడు, దక్షుడు, వశిష్ఠుడు ననువారలుద్భవించిరి మరీచికి కశ్యపుండు జన్మించె. దక్షునకు పదముప్పురు పుత్రికలుద్భవించిరి వానికి ననేక రీతులగు దేవ దైత్యులుదయించిరి. ఇవ్విధంబున సకల సృష్టి జరిగె. ఆసృష్టియే మనుష్య పశుసర్పాది భేదమ్ములతో విస్తరిల్లె.

332. సీ. కమల సంభవు సవ్య కాయంబునందుండి
జనియించె స్వాయంభు వనెడి మనువు
వామభాగంబున వర పుత్రిజనియించె
శతరూప యనగ బ్రశస్తి గలిగి
వారికంతట ప్రియవ్రతుడును నుత్తాన
పాదుడన సుతులు వరుసఁ గలిగి
రటుపైన పుత్రిక లత్యంత శోభలన్
ముప్పురు పుట్టిరి ముదము తోడ

గీ. సూతియును, ప్రసూతియు, దేవ హూతియనగ
కమల భవుడంత మేరుశృంగమ్ము నందు
సత్యలోకమ్ము నిర్మించి సతిని వాణిఁ
గూడి నివసించు చుండెను కొమరుమిగుల

333. తే.గీ. కమల నాభుడు సకల లోకములకన్న
పైన వైకుంఠమును నిల్పి దానియందు
వేడ్క లక్ష్మిని గూడి తా వివిధగతుల
ననిశమును సల్పుచుండు విహారములను

334. కం. శివుడును కైలాసమ్మును
ప్రవిమలగతి సిద్ధపరచి పార్వతి తోడన్
స్తవముల భూతగణమ్ములు
నవిరళగతిఁ సల్పుచుండ నందు వసించెన్

335. తే.గీ. మేరు శిఖరమ్ములందొక్క మేటి శిఖర
మందు స్వర్గమ్ము నిర్మించి యమర విభున
కొసగ నాతడు సంతసమొదవ నచట
దేవ గణములతో నుండె దీప్తులొలయ

336. సీ. సాగర మథనమ్ము జరిపెడి వేళల
జన్మించి నట్టి యుచ్చైశ్రవమ్ముఁ
బారిజాతమ్మును బరగ రంభాదుల
నైరావతము దివిజాధి పతికి
నొసగిరి మఱియునా యుడు పతియును నెమ్మి
ధన్వంతరియు దేవతలను గూడి
స్వర్గలోకమునందె సర్వభోగమ్ముల
ననుభవించుచు నుండి రనుపమగతి

గీ. దేవ తిర్యఙ్మను ష్యాది త్రివిధగతుల
సృష్టి జరిగెను వరుసఁ బ్రసిద్ధిగలిగి
జీవులెల్లను కర్మాను సేవితముగ
నండజమ్ములు స్వేద జరాయుజములు
నుద్భిజమ్ము లనంగ సముద్భ వించె
నాల్గురీతుల పృథ్వి యంతటను వరుస

337. ఉ. ఇవ్విధి సృష్టికార్యముల నెల్లఁగడున్ గడు నేర్పుతోడ నా
మువ్వురు మూర్తులున్ జరిపి మోదముతోఁ జని, రంతనొక్కనా
డవ్వన జోదరుండు నయనాబ్జములన్ ముకుళించియుండగన్
జివ్వునఁ దళ్కుమంచు మెఱసెన్ జగదీశ్వరి మానసంబునన్

338. శా. శ్వేతద్వీపమునందు మంటపమునన్ శ్రీదేవి రూపమ్ము సం
ప్రీతిన్ గాంచిన యంత తాము వరుసన్ స్త్రీ రూపముల్ సెందుటల్





మాతన్ స్తోత్రమొనర్చి పుంస్త్వముల సమ్మానమ్ములన్ బొందుటల్
భాతిన్ మంత్రయుతమ్ముగా సిరియు సంప్రాప్తించుటల్ గన్పడెన్

## విష్ణు వొనర్చిన దేవీ యజ్ఞము

339. వ. అంతట నావిష్ణు మూర్తి

340. శా. దేవీయజ్ఞముఁ జేయఁబూని నలువన్, దీక్షేక్షు, దిక్పాలురన్
దేవానీకముఁ, గుంభసంభవుని, బ్రీతిన్ గశ్యపున్, దక్షు, స
ద్భావంబొప్పగ స్వాగతించి తగుసంభారమ్ములన్ గూర్చి తా
గావించెన్ సవనంబు నద్భుతగతిన్ గంజోదరుండత్తఱిన్

341. చం. అపుడొక దివ్యవాణి మధురామృతవాక్కులతోడఁ బల్కె నో
రిపుజన భంజనా, సకల రీతుల దేవతలందు మిన్నవై
యపరిమితోరు తేజమున నందరిపూజలఁ గొంచునుందు, వీ
వెపుడును; నేటి నుండి భువినెల్లరు నిన్నుభజింతురార్తితో

342. సీ. బ్రహ్మరుద్రాదులు పాకారియును దేవ
గణములు మానవుల్ గరము భక్తి
నర్చించు చుందురో యబ్జనాభా నిన్ను
వరదుడ వీవె యవ్వారి కెపుడు
యజ్ఞ కార్యములందు యాజ్ఞికుల్ మున్ముందు
పూజించెదరు నిన్నె పూర్ణభక్తి
పురుషోత్తముడవంచు బొల్పుగా కీర్తించు
నిగమాగమములెల్ల నిన్నుఁగూర్చి

గీ. అవని ధర్మ్మునకు హానియైన వేళ
యుగయుగమ్ముల నవతార మూని నీవు
ధర్మరక్షణ సేయ నీ ధర్మమయ్య
భూరిగుణ సాంద్ర! దైత్యసంహార! ధీర!

343. ఉ. నీ యవతార రూపముల నిర్మల భక్తి భజింతురెల్లరున్
బాయక నాదు శక్తియును బ్రాపయి నీవెనువెంట నుందు, స

ర్వాయుధముల్ ధరించి వివిధాభరణాంచిత దేహులై సదా
సాయ మొనర్చుచుందురు ప్రశస్తిగ మత్పరశక్తి రూపిణుల్

344. కం. వారియెడల నవమానపు
ధోరణిఁ జరియింపఁ బోకు తోయజనాభా!
గౌరవభావమ్మున స
త్కారము సలుపంగ వలయుఁ దద్దయుభక్తిన్

345. చం. అని యశరీర వాణి ప్రియ మారగఁబల్కి యదృశ్యమయ్యె, నె
మ్మనమున సంతసంపడియెమాధవు; డంతట యాజకోత్తముల్
వినయ మెసంగ యజ్ఞమును వెన్నుని యాన సమాప్తిఁ జేసి, యొ
య్యన జని రబ్జగర్భుని విషాభరణున్ మును సేసి యందరున్

346. కం. గరుడ గమనుడును నంతట
నరిగెన్ తనమందిరమున కానందమునన్
పరిపరి విధముల నెల్లరు
నిరతముఁ దమవిధులలోన నిల్చిరి వేడ్కన్

347. కం. మునులును నీ విషయమ్మును
విని తమ యాశ్రమములందు విస్తృతరీతిన్
వినయమున శక్తి పూజల
ననిశముఁ గావింపఁదొడగి రవనీనాథా!

348. చం. అన జనమేజయుం డపుడు వ్యాసునిఁగాంచి మహాను భావ! నా
మనమున విశ్వసించితిని మానుగ దేవిని గూర్చి యజ్ఞమున్
ఘనతర భక్తిఁ జేయ సమకట్టెద శీఘ్రమె, యైనఁబ్రీతిమై
వినగఁదలంతు తన్మహిమ వీనులకింపు దలిర్పఁ దెల్పుమా!

349. వ. అనిప్రార్థింప వ్యాసుండు దేవీయజ్ఞమహిమంబును నిట్లు చెప్పందొడంగె

## సుదర్శనోపాఖ్యానము

350. మ. ఇనవంశమ్మున మున్ను నొక్కరుడు భూమీశుండు ధర్మాత్ముడై
ఘనకీర్తిన్ "ధ్రువసంధి" నామమున సత్కారుణ్య చిత్తమ్ముతో





తన దేశస్థులఁగన్న బిడ్డలటు వాత్సల్యమ్మునన్ జూచుచున్
ధనధాన్యాది సమృద్ధి నెల్లరును మోదంబంద నేలెన్ భువిన్

351. తే.గీ. అత డయోధ్యను దుర్భేద్యమైనదాని
రాజధానిగఁ గోసలరాజ్యమెల్ల
నేలుచుండెను ప్రజలెల్ల యితని కితడె
సాటియన సర్వవిద్యల మేటియనగ

352. ఉ. లేరెటఁ జూడ తస్కరులు, లేరెట ధూర్తులు లేరు లోభులున్
లేరు కృతఘ్నులెచ్చటను, లేరెట మూర్ఖులు, మోసగాండ్రు, వి
స్తారమునైన రాజ్యమున ధర్మముఁ దప్పక నావిభుండు దు
ర్వార పరాక్రముం డుదయభాను నిభానను డేలుచుండగన్

353. కం. అతనికి నిరువురు భార్యలు
పతికిని ననుకూల వతులు భావజు సతికిన్
ప్రతియనదగువారు సము
న్నత గుణ సంయుతలు గలరు నయతత్వజ్ఞల్

354. తే.గీ. ప్రథమ భార్య మనోరమ పట్టమహిషి
పరగ లీలావతి కనిష్ఠ భార్యగాగ
వారి సేవలఁ గొనుచు తా వైభవమున
నిరువురన్ గూడి రాజు సుఖించుచుండె

355. చం. నుతగుణ శోభితుండయి మనోరమ కొక్క సుతుండు పుట్టె, భూ
పతియు సుదర్శనుండను శుభంకర నామ మొసంగె వానికిన్;
రతిపతిఁ బోలు సుందరుడు రమ్యగుణుండు ద్వితీయ పత్నికిన్
చతురుడు పుట్ట నాతనికి శత్రుజితాఖ్యనిడెన్ బ్రియంబునన్

356. కం. ఇరువుర సమదృష్టిని తా
నరయుచు భూరమణు డంత ననురాగమునన్
పరిపోషణ మొనరించుచు
వెరవున నేర్పించె సకల విద్యల వరుసన్

357. ఆ.వె. శత్రుజిత్తు వాక్యచాతుర్యమున నెల్ల
వారి మన్ననలను బడయు చుండె

అతని చురుకుఁ దనము నాత్మనెఱిగి తండ్రి
కధికమయ్యె ప్రీతి యాతడనిన

358. కం. తొలిబిడ్డ సుదర్శనునకు
తెలియవు లౌకికములైన తీరులు, పెఱలం
గలియడు పలుకడు శాంతము
నెలకొన్న మనమ్ముతోడ నిరతస్థిరుడై

359. మ. ఒకనా డా ధ్రువసంధి వేట కొఱకై యుగ్రాటవిన్‌జొచ్చి వా
రక మధ్యాహ్నపు వేళదన్కఁ గడుఁగ్రూరంబైన సత్వంబులన్
ప్రకటోగ్ర స్థిరవిక్రమంబున యమావాసానకున్ బంపుచున్
వికలత్వంబొనరించెఁ దక్కుమృగముల్ భీతిల్లఁ దత్ప్రాంతమున్

360. ఉ. అంతట నొక్కసింహము రయంబున జూలు విదిల్చిక్రుద్ధయై
చెంతన వంశగుల్మినిని చీల్చుచు వెల్వడి గర్జనమ్ము లా
శాంతములందు నిండునటు లార్చుచు వచ్చుటఁ గాంచి యాత డా
వంతయు సంచలింపకొక యంబకమున్ గొని దానినేసినన్

361. కం. అదియును కందుక మట్లుల
బెదరక పైకెగిరి మిగుల భీకర భంగిన్
చదలదర నరచి తనపై
నుదుటున దుముకంగ యత్న మొనరించుతఱిన్

362. చం. తన నిశితాసిఁగైకొని యుదగ్ర రవమ్మొనరించి సింహమున్
జనవిభుడుగ్రుడై పొడువ చయ్యన నయ్యది తీవ్రకోప సం
జనిత రయమ్మునన్ దన నిశాత నఖమ్ములఁ జీల్చివైచె నా
యినకుల నాథు, నంతట మహిన్‌బడి కూలిరి యిర్వురొక్కటన్

363. కం. ఈ విషయ మొక్క క్షణమున
దావానల మట్లు రాజధానికిఁ జేరన్
బావురుమని రంతఃపుర
దేవేరులు తీవ్ర దుఃఖ దీనాననలై

364. కం. భూపతి ప్రాణముల్ వదలె భూరిమృగేంద్రముతోడఁ బోరి, క
ట్టా! పదచూతమోయని హుటాహుటి మంత్రి పురోహితుల్ ప్రజల్
వేపిత చిత్తులై జనిరి వేగ వనమ్మున కార్తనాదముల్
వ్యాపనమొంద నల్దిశల; బాష్పములున్‌వడిఁ బాఱనేరులై

365. కం. కులగురువు వసిష్ఠుని యా
జ్ఞలఁగొని యంత్యక్రియలను జరిపించి కడున్
గలగెడి చిత్తమ్ములతో
నలయుచుఁదమరాజధాని కరిగిరి వారల్

366. ఆ.వె. పట్టమహిషి సుతుడు ప్రథమ పుత్రుండౌట
నతని రాజుఁ జేయ నౌ నటంచు
మంత్రి వరులు గురులు మంత్రమ్ములన్ సల్పి
యొక్క నిర్ణయమ్ము నొనరఁ జేయ

367. వ ఇవ్విషయంబుజ్జయనీ నగరాధిపతియు, లీలావతి తండ్రియునైన యుధాజిత్తునకుందెలియ

368. తే.గీ. అంతలీలావతీ పుత్రు నవనిపతిగఁ
జేయ మదినెంచి యా యుధాజిత్తు వేగఁ
జనె నయోధ్యకు సైన్యముల్ వెనుక నడువ
నాకృతిన్ గొన్న విక్రమ మన్నయట్లు

369. వ. అంత కళింగదేశాధిపతియు

370. మ. తన యల్లుండట కన్నుమూసెనను వార్తన్ గూఢచారుల్‌వడిన్
వినిపింపంగ సుదర్శనున్ మనుమనిన్ వెన్వెంట రాజ్యానకున్
దనరన్ పట్టముఁ గట్ట నెంచుచు నయోధ్యన్‌జేరె సైన్యమ్ముతో
జననాథుండగు శూరసేనుడు సుతన్ సంతప్త నోదార్చగన్

371. చం. వయసునఁ బెద్దయున్ మఱియు భవ్యగుణుండు సుదర్శనుండు ని
శ్చయముగ రాజ్యమేలుటకు సర్వవిధమ్ముల నర్హుడంచుఁ దా
నయగతి శూరసేను డతి నమ్రతదోప సభాంతరమ్మునన్
స్వయముగఁ బల్కెమంత్రులును పౌరులు విప్రులు నాలకింపగన్

372. తే.గీ. అన'యుధాజిత్తు'లేచి తాననియెనిట్లు
గుణగరిష్ఠుడు యోగ్యుడు కులవిభూష

ఖుండు'శత్రుజిత్తు' ధరణీ మండలమున
కధిపుడౌటకుఁ దగియుండ నన్యులేల

373. మ. అని యీరీతిగ నిర్వురున్ మిగుల క్రోధావేశవాక్యంబులన్
ఘనగర్జప్రతిరోధ కంఠములతో గాత్రంబు లూటాడగన్
గనులున్ జేవురు కాంతులీన సభికుల్ గంపంబులన్ బొంద తెం
పున వాదంబులు సేయుచుండ పలుకంబోరైరి యెవ్వారటన్

374. తే.గీ. అంత నా "యుధాజిత్తు" సభాంతరమున
మౌన ముద్రను బొందిన మంత్రివరుల
గాంచి యిట్లని పల్కె నాగ్రహము గదుర
తీక్ష్ణ పదజాలములతోడఁ దీవ్రగతిని

375. ఉ. మీరలు దుష్టబుద్ధులయి మీఱిన స్వార్థముతో సుదర్శనున్
నేరిమి లేనివాని ధరణీపతిఁ జేయగఁ బూనినారు మీ
కోరికలెల్లఁ దీర్చుకొనఁ గోరితి రాతని నడ్డుపెట్టి, తత్
భీరుని రాజుఁ జేసి యిక స్వేచ్ఛఁ జరింపగ నెంచుచుంటిరా!

376. ఉ. వీరవరేణ్యుడంచు భువిఁ బేర్మివహించిన శత్రుజిత్తు ధా
త్రీరమణుండెయైనఁ దమ తీఁపురముల్ కొనసాగవేమొ యం
చారసి యిట్లు దుర్బలుని యందల మెక్కగఁ జేయఁ జూతురా!
ఊరక నిష్ప్రయోజనపు టూహలు మానుడు మీకుసేమమౌ

377. చం. ఇదె వినుడింక మీరలొక హెచ్చరికన్ దగఁజేయుచుంటి దు
ర్మదమున శత్రుజిత్తును పరాక్రమవంతుని విస్మరించి మీ
హృదయములన్ సుదర్శనుని యేలికఁ జేయగ నెంతురేని నే
కదనమునందు నెల్లరను కాలుని ప్రోలికి సాగనంపెదన్

378. తే.గీ. జ్యేష్ఠుడని వాని రాజును జేతురేని
విదళన మొనర్తు నసిధారఁ బృథ్వినెల్ల
మీరలేపాటి యికయెంత మీబలమ్ము
దిక్కుగల చోట కేగుడు తెల్పుకొనుడు

379. చం. అనవిని శూరసేనుడపు డాగ్రహ మొందక శాంతచిత్తుడై
మన మనుమండ్రు నిర్వురు సమానులు విద్యల వీర్యమందు నై





నను వినుమీసుదర్శనుడె న్యాయముగాఁ దగ నర్హుడౌను తా
జనపతి యౌటకున్ బ్రథమ సంతతియౌట, వివాదమేటికిన్

380. కం. ఈ విధమున వారించుచు
నావిభు లిర్వురును తుదకు నావేశములన్
దీవరిలిరి, సర్వజనుల
భావమ్ముల యుద్ధభయము పరిరంభింపన్

381. ఉ. పంతముఁ బూని యుద్ధములఁ బాయక మున్గుచుఁ దేలుచుండు సా
మంతు లయోధ్యఁజేరిరి క్రమంబున నొండొరు రెచ్చగొట్ట; నా
చెంతన నున్న బోయలును జేరిరటన్ సమరంబెయైన శ్రీ
మంతులఁ దోచి సంపదల మానుగఁ గైకొన నెంచి క్రూరులై

382. కం. చోరులు గుములై వచ్చిరి
తోరంబుగ నగర మెల్ల దోచుకొనుటకై
వీరెవరౌ వారలెవరో
పౌరులు తెలియంగ లేక పడిరిక్కట్టుల్

383. తే.గీ. అంత నాయుధాజిత్తు సైన్యములనెల్ల
సిద్ధమొనరించి ధనువును చేతఁబూని
యుద్ధ సన్నద్ధుడై నిల్చి యుండె వరుస
రథగజ తురగ సైన్య వర్గములతోడ

384. ఉ. క్షత్రియ ధర్మమున్దలచి కయ్యముసేయగ శూరసేనుడున్
మిత్రులకెల్లఁ దెల్పి రణమేదిని యందు ధనుర్ధరుండునై
శాత్రవసైన్య వాహినికి చండమయూఖునిఁబోలె నిల్చె దౌ
హిత్రుని నెట్టులైన పృథివీశునిఁ జేయ చమూసమేతుడై

385. చం. సురముని సంఘముల్ ప్రజలు చోద్యముగా తిలకించుచుండ, త
ద్ద్విరద రథాశ్వ వీరభట తీవ్రతరాద్భుత పాదఘట్టనల్
త్వరితగతిన్ వివృద్ధమయి; బాణ పరంపర లొక్కపెట్టునన్
బరపి రొకళ్లొకళ్ళు పెఱవారలపై నిమిషాంతరమ్మునన్

386. కం. తెగిపడిన కాళ్ళు చేతులు
సగమూపిరితోడ నొఱగు సైనికవీరుల్

నగ సమ కరి తురగమ్ముల
యగణితదేహములు దోచె నాస్థలమందున్

387. కం. పలలము కొఱకై గ్రద్దలు
పలు రాబందులును మూగి పడిన శవములన్
పలువిధముల చంచువులన్
బలిమిన్ విదళించు చుండెఁ బాయకనచటన్

388. మ. రణరంగోద్భవ పాంశువుల్ గగన మార్గంబందు పైకేగి భీ
షణమై భానునిఁ గప్పివేయగ నిశాసంభ్రాంతితో నెల్లరున్
రణమున్ నిల్పినయంత కొంతవడికిన్ రంజిల్లు నాధూళియున్
రణభూమిన్ బడి రక్త సిక్తమయి సూర్యచ్ఛాయ నొప్పెన్ భువిన్

389. తే.గీ. పూని యాయుధాజిత్ శూరసేను లప్పు
డరిభయంకర రీతి నయ్యాహవమున
పోరుచుండిరి తక్కిన వీరులెల్ల
భ్రమనుపడి చూచు చుండ విభ్రాంతితోడ

390. తే.గీ. అంత నాయుధాజిత్తు దశాంబకముల
నారికెక్కించి విడువ నాశూరసేను
డవనిపైఁ గూలె దారుణ మైనరీతి
మొదలు నఱకిన పాదపమో యనంగ

391. ఉ. ఆతని పాటుఁగాంచి సమరావని నున్న చమూసమూహముల్
భీతిలి పర్వులెత్తెను విభిన్నపథమ్ములఁ బట్టి యట్టిటుల్,
కూతున కా మనోరమకు గొబ్బున నీవిషయమ్ముఁ దెల్పి రా
భూతల నాథు సేవకులు పొంగెడి దుఃఖ సముద్రమగ్నులై

392. ఆ.వె. జనకు మరణ వార్త విని మనోరమయును
కొంతవడికి మూర్ఛఁ గూరియంత
లేచి భయముతోడ యోచించె మదిలోన
నేమి చేయవలయు నిపుడటంచు

393. మ. జనకున్ బట్టి వధించె నాతడు గడున్ స్వార్థమ్ముతోనేడు, క్రో
ధనుడై నన్నును నాకుమారు నిక మీదన్ జంపఁ బోకుండునే





ధనరాజ్యాధిక లోభముల్ దమకు విద్యావంతునేనిన్ వశం
బొనరించున్వెస, నెంత నీచమునకే నుద్యుక్తుఁ జేయించుఁ బో!

394. కం. తల్లిని తండ్రిని తనయుల
నిల్లాలిని సద్గురువుల నెవ్వరి నైనన్
గొల్లంగొను నాయువులను
నెల్లెడ ధనరాజ్య లోభ మెక్కువయైనన్

395. కం. ధర్మము నడగంద్రొక్కును
దుర్మదమునఁ జేయు నెల్ల దుష్కృత్యములన్
నర్మిలి మధుమాంసాదుల
కొర్మిన్ వశుడౌను లోభమూనిన యెడలన్

396. ఉ. ఇచ్చట నాకు సాయమొనరించెడి వారిక నెవ్వరక్కటా!
ఇచ్చకమూని నాసవతి యెప్పటియట్టుల మమ్ముఁ జూచునే
పొచ్చెముగాదు తత్సతియుఁ బొందక యుండునె రాజ్యలోభమున్
మెచ్చునెయింక నాసుతుని, మేనునఁ బ్రాణములుండ నిచ్చునే

397. తే.గీ. ఆ యుధాజిత్తు యుద్ధమ్ము నాపియిటకు
వచ్చెనేనియు మేమింక పాఱిపోవ
వీలుకలుగునె? బంధించి వేయకున్నె?
ఎన్ని వినలేదు మున్నిట్టి వీ ధరిత్రి

398. మ. అమరాధీశుని యంత వాడె మును లోభాత్ముండునై తల్లి గ
ర్భమునన్ వర్ధిలుచున్న సోదరునిఁ జంపన్లేదె; యోచింప నీ
కమలాప్తాన్వయమందె తా సవతికిన్ గర్భమ్మువోఁ గాలకూ
టము నిచ్చెన్ గద రాణియొక్కతె యదృష్టంబుండి యాబాలుడున్

399. కం. గరళపు ముద్దను గైకొని
యరవిందాననకుఁ బుట్టె నాశ్చర్యముగన్
ధరనాతడె సగరుండై
యురుతర యశమందలేదె యుర్విన్ బేర్మిన్

400. కం. తనసుతుని రాజుఁ జేయగ
నినకుల భూషణుని రాము నిలువెడలగఁ జే

సెనుగద కైకయు నిర్దయ
వనములఁ బదునాలుగేండ్లు వసియింపంగన్

401. కం. మును నాపుత్రుని పక్షం
బున నున్న యమాత్యులైనఁ బూర్వపుభంగిన్
గొనకొని వర్తింతురె తా
మనయము వశులౌట తథ్య మరి వీరులకున్

402. శా. నా పక్షమ్మున నిల్చి సాయమొకయింతన్ జేయువారెవ్వరే
నీ పృథ్విన్ గలరే? సహోదరుడొకండేన్ లేక పోయెంగదా!
యేపాపంబులు సేసితో మును కటా! యింకేటికిన్ జింతిలన్
నా పుత్రున్ బ్రతికించుకొందు నెటులైనన్ దీవ్రయత్నమ్మునన్

403. మ. అని యీరీతిఁ దలంచి యామె తనకత్యంతాప్తుదున్ గార్య సా
ధనదక్షుండును నౌ విదల్లుడను మేధావిన్ గడున్ సత్వరం
బున రావించి యుపాయమున్ దెలుపుమో పుణ్యాత్మ! నేడెట్లు నా
తనయున్ శత్రుల బారినుండి వడిగాఁ దప్పింతు సేమంబుగన్

404. కం. అని దుఃఖించుచు పలుకగ
వినియా మంత్రి వరు డిట్లు వినిపించెఁ గడున్
వినయముఁ దోపగఁ జేయఁ ద
గిన కార్యంబును దనమదికిన్ దోచినటుల్

405. చం. తగ దిటనుండ తల్లి! యికఁ దక్షణమే వనభూమికేగి తి
న్నగ నటనుండి యెట్టులో సనన్ వలె వేగమె వారణాసికిన్
బ్రగతి వహించినట్టి బలవంతుడు నాకును మేనమామయున్
సుగుణయుతుండటన్గలడు సుమ్ము! సుబాహుడనంగ నొప్పుచున్

406. కం. ఆతడు గడు ధనవంతుడు
బ్రీతిన్ మిము నాదరించు భీతిల్లకుడీ!
మీతోడు నేను వత్తును
నాతో రండికను మీరు నమ్మికతోడన్

407. వ. అని పలికినంత





408. చం. కడుసుకుమారుడున్ బురుష కాయముఁ గల్గియు స్త్రీస్వభావుడై
దడియకఁ బల్కువానిని విదల్లుని మానస మందుమెచ్చుచున్
వడివడి నామనోరమయు వానినిఁ గూడిసనంగనెంచి తాఁ
గడిది నెఱింగి తత్సవతిఁ గాంచగ నేగె సుతుండు వెంటరాన్

409. కం. చని తా లీలావతిఁ గని
కనులన్ బాష్పములు రాల గద్గదయై నా
జనకుని శవమును గని వ
త్తునని పలికి వచ్చెను సుతుతో నతివేగన్

410. ఉ. వచ్చి విదల్లునిన్ గలిసి వైళమ యొక్క రథంబునెక్కి తాఁ
జెచ్చెర యుద్ధ భూమికినిఁ జేరి యటన్ దన తండ్రి దేహమున్
గ్రుచ్చి కవుంగిలించి కడుఁ గుంది యమాత్యుని సాయమంది తా
నచ్చట నగ్నిసంస్క్రియల నాత్మజుచే జరిపించి వెండియున్

411. వ. రథంబధిరోహించి ముప్పురును

412. కం. చని చని దినద్వయంబున
కనిమిషనది కడకుఁ జేర నా ప్రాంతమునన్
వనసంచారులు చోరులు
గని వారల నడ్డగించి కాఠిన్యమునన్

413. తే.గీ. మిగుల హింసించి మేలైన నగలనెల్ల
దోచుకొని వెళ్ళి రరదమ్ముతోడఁ దుదకు
నంత వారలు తెప్పపై నమర నదిని
దాటి మెలమెల్ల నావలి దరికిఁ జేరి

414. ఉ. రాజిత భూధరమ్ము ముని రాజనివాసముఁ జిత్రకూటమున్
యాజక ధామమున్ గని ప్రయాసనటన్ జని చెంతనే భర
ద్వాజుని యాశ్రమంబును ముదంబునఁ జేరి తదీయ దివ్యమౌ
తేజముఁ గాంచి తాపములు దీఱఁ బ్రశాంతతనొందిరొయ్యనన్

415. ఉ. ఆ మునివర్యుఁ గాంచి హృదయంబున సంతసమంది రాణియున్
నేమముతో తదీయ పద నీరజయుగ్మము సోక నౌదలన్

భూమికి వ్రాల్చి మ్రొక్కినఁ బ్రమోదమునన్ మునివర్యుడప్పుడా
తామరసాక్షి శీర్షమును దట్టుచు లేపి దయార్ద్ర చిత్తుడై

416. ఉ. ఎవ్వతెవమ్మ! నీవు మదినేమి ప్రయోజన మాసచేసి యి
ట్లివ్వన భూమిఁ జేరితివి యీతడు నీసుతుడే? యితండు నీ
కెవ్విధమౌను, దుఃఖమున నేల తపింతువు నీదువాలకం
బెవ్విధిఁ జూడ నొక్క యవనీశుని పత్నివనంగఁ దోచెడున్

417. చం. తెలుపుము నీదు వృత్తమది తెల్లముగానని యా మునీంద్రు ద
య్యలికులవేణిఁ జూచి కదు నాదర మొప్పగఁ బృచ్ఛసేయఁదొ
య్యలియును తీవ్ర దుఃఖ వివశాత్మకయై వచియింపలేక ని
శ్చలముగ నావిదల్లు గని సంజ్ఞయొనర్చెను విన్నవింపగన్

418. చం. అది గని యా విదల్లుడును నమ్మహనీయున కెల్లవృత్తమున్
మది కెఱుగంగఁ దెల్పి యిక మమ్ము విపద్ఘన వార్ధినుండి మీ
రె దరికిఁ జేర్పగాఁ దగుదు రెల్ల విధంబుల; నార్తులన్ సదా
ముదమునఁ బ్రోచు తత్ఫలమె పొల్చును యజ్ఞ ఫలమ్ము కెక్కుడై

419. కం. అని ప్రార్థింపగ నపుడా
మునివరుడు మనోరమ నతి ముదమునఁగని తా
ననియె సుధాపూరంబగు
ననునయ వాక్యముల నిట్టు లాదరమొప్పన్

420. శా. తల్లీ! భీతిలకమ్మ! నీవిక మదిన్ దైన్యంబు వీడంగనౌ
నుల్లంబందతి ధైర్యమూని గతమున్ యోచింప కీపుత్రునిన్
ఫుల్లాబ్జాక్షుని శ్రద్ధగాఁ బెనుపుమీ, పూర్వంపు పుణ్యంబులున్
గల్లల్గా వితడౌను భూమిపతి నిక్కంబిందు బింబాననా!

421. కం. ఇదెయొక పర్ణకుటీరము
పదిలముగా నుండు డిందు భావములందున్
మెదలగ నీ కన్యంబులు
సదమల చిత్తముల తోడ శాంతియెలర్పన్

422. వ. అనిపలికె, అదియట్లుండనచట నయోధ్యానగరంబున





423. శా. ఆ లీలావతి తండ్రియున్ విజయ గర్వాధిక్యమున్ బూని, యా
భీలాకారుడునై యయోధ్యకరిగెన్ వేవేగ దౌహిత్రు భూ
పాలున్ జేసి సుదర్శనున్ దునిమి నిర్వైరంబుగావింతు నం
చాలోచించుచు మంత్రివర్యు లెదురై యాహ్వానముల్ వల్కగన్

424. తే.గీ. వచ్చి యంతః పురమ్మును జొచ్చి వెదుకఁ
దనకుఁ గన్పింపడయ్యె సుదర్శనుండు
అతని తల్లియు లేదయ్యె నచటఁ జూడ
నాగ్రహోదగ్రుడౌచుఁ దానంత వేగ

425. కం. భటులను నాజ్ఞాపించెను
పటురయమున మీరలెల్ల పట్టణమున నె
చ్చట నున్నను గని కొనితెం
డిట కా తల్లిని కొడుకును నెల్లవిధములన్

426. అనియాజ్ఞాపించి యా యుధాజిత్తు

427. ఉ. అంతట నొక్క మూరుతమునందున నాతడు శత్రుజిత్తు క
త్యంతము వైభవంబున ప్రధానులు మంత్రి పురోహితుల్ గనన్
స్వాంతముపొంగ కూతురును సమ్మతిఁ దెల్పగఁ గట్టె పట్టమున్
సంతస మందిరెల్లరును సత్కృతులంది విశేష రీతులన్

428. మ. కదు యోగ్యుండగు నాసుదర్శనుడు నక్కాంతారమం దమ్మతో!
పదరానట్టి యనేక కష్టముల నేప్రాంతంబునన్ బొందుచున్
గుడువన్ గట్టగ లేక యుండునొ కదా! ఘోరంబటంచున్ బురిన్
గడలే కెంతయు దుఃఖమంది రట సఖ్యంబేర్పడన్ సజ్జనుల్

429. తే.గీ. ఆ యుధాజిత్తు తానెంతొ యక్రమమున
శూరసేనుని ఖండించి క్రూరగతిని
మనుమనికిఁ గట్టె పట్టంబు మానవత్వ
మింత యైనను లేక యిదేమి చిత్ర
మనుచు లోలోనఁ గుమిలిరి యచట జనులు

430. చం. మనుమని పాలనంబునకు మార్గమునెంతయుఁ జక్కఁ బెట్టి తా
జనియెను తాత దెందమున సంతసమంది నిజోర్వికిన్; బ్రజల్

ఘనముగ స్వాగతించిరట; కాలమిటుల్సనె కొంత యంతటన్
వినిచిరి చారు లాపతికి విస్మయ మందగ నివ్విధంబునన్

431. మ. ధరణీ నాథ! సుదర్శనుండు నిజమాతన్ గూడి సాంద్రాటవిన్
వరమౌనీంద్రుడనంగ నొప్పెడి భరద్వాజాశ్ర మోపాంతమం
దిరవందన్ నివసించుచుండె నిదె మే మీక్షించి మీ చెంతకున్
ద్వరగా వచ్చితిమయ్య! మీ కెఱుగఁ జెప్పన్ వీరవంశాగ్రణీ!

432. కం. ఆ మాటలు వినినంతనె
భూమీశుం డాగ్రహించి పుత్రయుతముగా
నామెనుఁ జంపెద నేఁజని
యా ముని యాశ్రమమునందె యని వేగముగన్

433. వ. ససైన్యంబుగా భరద్వాజాశ్రమమునకుఁ జేరువనేయున్న శృంగ బేర
పురాధీశుండైన దుర్దర్శుండను కోయరాజు కడకున్ జని యాతనితో
కర్తవ్యం బాలోచించుచుండె నంత

434. ఉ. అచ్చట నట్టు నిట్టు తిరుగాడెడి యా ముని బాలకుల్ వడిన్
వచ్చి మనోరమన్ గని శుభంబగు గావుత! మంచుబల్కి, తా
మచ్చట శృంగబేర పురమందుఁగనుంగొనినట్టి వార్తలన్
బొచ్చెములేకఁ బల్కిరి ప్రభూత భయాధిక కంపితాంగులై

435. చం. అనవిని యామనోరమయు నాత్మఁ గడుంగడు భీతిఁ జెంది య
మ్మునివరు చెంతకేగి శిరమున్ దగవంచి నమస్కరించి యో
యనఘ! మదీయ పుత్రుఁ దును మాడగ నెంచుచు శృంగబేరికిన్
దన బలమెల్లఁగైకొని యుధాజితు వచ్చెను తీవ్రకోపుడై

436. చం. గతమున నిట్టి ఘట్టములఁ గానమె; మున్ను జయద్రథుండు తా
పతు లటలేని వేళఁ గని పర్ణకుటీరమునన్ వనమ్ములో
నుతగుణయైన ద్రౌపదిని నొవ్వగఁ జేసెను గాదె నీచుడై
మతిఁ బరికింప లోకమున మాన్యుల సైతము నమ్మరాదొకో!

437. మ. మఖమున్ జూచు నెపమ్ముతో నరిగి సమ్మానమ్ములన్ బొందియున్
సుఖముల్ నీకగు నంచు దీవనల నస్తోకంబు గానిచ్చి, య





య్యఖిలారాధ్యుడు విష్ణుమూర్తి యును మున్నా దైత్యవర్యున్ బలిన్
నిఖిలాచార్యులుఁ జూడఁ జేర్చెను గదా! నేమించి పాతాళమున్

438. కం. కావున లోభం బెప్పుడు
భావింపగ నెంత గొప్పవారల నైనన్
గావించు నీతి దూరుల
నేవిధమున నెంచి చూడ నిద్ధచరిత్రా!

439. తే.గీ. లోభగుణమది హృదయమ్ములోనఁ జేర
పాపభీతియును నరకభయము దయము
నేపగిదిఁ గానరావెందు నేరికైన
పరుల సొమ్మును హరియించు కరణిదప్ప

440. చం. మనుజుల యూహలందె ముని మాన్య! నిరంతర మన్యసంపదల్
గొనవలెనన్న భావములు గొల్లలుగాఁ గనిపించుచుండు, వా
రనయము వేడు చుందురు ధనాదికముల్ గడు వృద్ధిఁ జేయుమం
చెనయగ నెల్లదేవతల, నెచ్చుటఁ దెత్తురు వారలేనియున్

441. చం. దివిజగణమ్ము లేమయినఁ దెప్పలు గుప్పలుగా ధనమ్ములన్
భువిపయిఁ దాచియుంచిరె ప్రమోదముతోడుత వేడినంతనే
యవిరళరీతి సంపదల నర్థుల కీయగ; వారలైన తా
మెవరి ధనంబులేని గొని యీయవలెన్ గద నిక్కువంబుగన్

442. తే.గీ. అట్లు గాకున్న వ్యాపారమైన చేయ
వలయు, చౌర్యమైన యొనర్పవలయుఁ గాక
యెవరితోనైన దాన మిప్పింపవలయుఁ
గాని యీయంగ వారి కేకరణి వచ్చు

443. చం. అనయము వర్తకుల్ ధనసమార్జనకై యుపయుక్త వస్తువుల్
గొనెదరు రైతునొద్దఁ గడుఁ గొద్ది ధనమ్ముల వారికిచ్చి, యం
తన కడు హెచ్చులాభములఁ దద్దయుఁ బొందుచు విక్రయించుచున్
మనములఁ దృప్తిఁ జెందరు క్రమంబునఁ గోట్లకుఁ గోట్లుకూర్చుచున్

444. తే.గీ. తానుఁ గొనువేళఁ దక్కువ ధరనుగోరు
నమ్మ కొనువేళ నధిక ధనమ్ముఁ గోరు

పరుల సొమ్మును గోరెడు వారె కాని
ధర్మపథమున నడచు సత్కర్ములేరి?

445. తే.గీ. కాన నోతండ్రి! మమ్ములఁ గావుమయ్య
ఆ యుధాజిత్తు తక్షణ మచట నుండి
పోవునట్టులఁ జూడుము పుత్రుఁగూడి
జానకిని బోలె నుందు నాశ్రమమునందె

446. తే.గీ. ఆమె ప్రార్థన మాలించి యమ్మునీంద్రు
డా యుధాజిత్తు కడకేగి యాజ్ఞనిడియె
తక్షణంబున నిందుండి తరలివెళ్ళు
మాలసింపక నీదు సైన్యములతోడ

447. కం. అని యాజ్ఞ నొసగ నాతడు
మనమున విభ్రాంతిఁ జెంది మౌనీంద్రుని తో
వినయమ్ము నటించి పలికె
తన కరయుగ్మమ్ము మోడ్చి తలను నిలుపుచున్

448. మ. మునివర్యా! యిది ధర్మమౌనె యిటునన్ బొమ్మంచుఁ బల్కంగ, నో
యనఘా! మిమ్ముల నాడితే? మఱియు భవ్యంబైన మీయాశ్రమం
బునకున్ వచ్చితినే? సుదూరమగు నీభూమిన్ వసింపంగ మీ
మనమందేలొకొ బాధ? యట్లయినచో మాఱాడ కేబోయెదన్

449. చం. నుడివెద నొక్కమాటయు మనోరమ నాత్మజు తోడ నిప్పుడే
విడువుము నేనుఁ బోయెదను, వీడక యుండిన నిందె యుందు; మీ
రొడఁ బడ రేని సైన్యముల నొయ్యనఁ బంపి మదీయ కార్య మె
య్యెడలను చక్కఁ బెట్టుకొను దెల్లరు మీరలు చూచుచుండగన్

450. మ. అనినన్ మౌనివరుండు మానసమునం దత్యంత రోషంబు పై
కొన నోక్షత్రియ! నీకుఁ జేతనయినన్ గొంపొమ్ము మున్నా వసి
ష్ఠుని చెంతన్ గల కామధేనువును నాటోపంబుఁ జూపించి చే
కొని పోజాలెనె గాధి రాట్సుతుడు దక్కున్ మాటలింకేటికిన్

451. కం. నీకునుఁ దద్గతి యేయగుఁ
జేకొని పొమ్మింక నీకు చేవ గలిగినన్





వాకొననేల యటంచున్
భూకాంతుని తోడఁ బల్కి మునివరు దరిగెన్

452. ఉ. భూవిభుడంత మంత్రిని సుబుద్ధినిఁ జేరి యమాత్యవర్య! న
న్నేవిధిఁ జేయమందువిపు డెల్ల విధంబుల మంచిచెడ్డలన్
భావమునందలంచి తెలుపన్ దగు; శత్రువు చిన్నవాడెయౌఁ
బో! వదలంగ రాదనెడి పూర్వపు సూక్తి యెఱుంగవే మదిన్

453. తే.గీ. శత్రు శేషమ్ము క్షయ రోగ సమముగాదె
తగునె దాని నుపేక్షింప ధరణియందు
కాన బలవంతమున వారి ప్రాణములను
దీతు, నాకడ్డపడఁ గల ధీరుడెవరు?

454. శా. ఆమాటల్ విని మంత్రివర్యుడును దీర్ఘాలోచనల్ సల్పి; యో
భూమీశాగ్రణి! సాహసమ్మిటుల నీపుణ్యాశ్రమంబందు నీ
కేమాత్రంబును యోగ్యమౌనె? వినలేదే మౌని వాక్యంబులన్
క్షేమంబౌనిక వెన్కకున్ జనుటయే సేనాసమేతంబుగా

455. కం. ముని చెప్పిన దృష్టాంతము
వినిపించెద వినుము మున్ను విశ్వామిత్రుం
డనునొక భూవిభుడు వసి
ష్ఠుని యాశ్రమమునకు నేగె జోరుదలిర్పన్

456. ఉ. తా నపు డానృపాలునకుఁ దద్భటకోటికి నెల్ల నందినీ
ధేనువనుగ్రహింపఁ గడు దివ్య పదార్థములన్ వసిష్ఠు డెం
తేనియు శీఘ్రమే యొసగె నింపుఁ దలిర్పగ, భూమి నాథుడున్
మానసమందు గోవు మహిమంబును మెచ్చి మునీంద్రుఁ జూచుచున్

457. ఉ. సంతసమయ్యె మౌనివర! సత్కృప మీరిడినట్టి భోజ్య మ
త్యంతము హృద్యమైయొసగె నన్ని పదార్థములెల్ల మీర లే
చెంతన నెట్లు శీఘ్రగతి సిద్ధమొనర్పగఁ జేసినార లీ
వింత యదేమొ తెల్పుమని వేడ మునీంద్రుడు వల్కె నివ్విధిన్

458. తే.గీ. నందినీ కామధేనువు నాదుచెంత
నాశ్రమంబునఁ గలదయ్య యవని నాథ!

తత్ప్రభావంబువలన నే తగిన రీతి
నాతిథేయంబులొసగితి నధిప! మీకు

459. మ. అని బ్రహ్మర్షి వచింపగా మనమునం దానందముంజెంది యా
మనుజాధీశుడు మౌని వర్యుఁగని సంప్రార్థించె నీరీతి నో
యనఘా! యిట్టి విశిష్ట ధేనువిది నాయాధీన్యమం దుండగా
జనుఁగానీ, తమ బోంట్ల కేల చెపుమా సార్థక్యమేమున్నదో

460. ఉ. కావున దీని నాకొసగఁ గల్గితివేని మునీంద్ర! వేనవేల్
గోవుల నిత్తునీకు కడుఁ గూరిమి నాకిడుమన్న మౌనియున్
భూవిభుఁ జూచి దీని సరిపోలవు లక్షలు గోవులేని నే
నేవిధినైన నీకిడుట కియ్యకొనన్ మది హోమధేనువున్

461. చం. అని ముని పల్క భూపతియు నాగ్రహమంది బలాత్కరించి యై
నను గొని పోదు నేననఁ; గొనన్ దగ జాలుదువేని నీవు గై
కొను మని పల్కె నమ్మునియు;ఁ గొంకక తానును సేనకెల్ల నా
జ్ఞనొసగె దాని గైకొని వెసన్జనుడంచు ధరాధినాధుడున్

462. కం. ఆ విశ్వామిత్రుని యా
జ్ఞా వశవర్తులయి సైన్యసంఘములెల్లన్
వేవేగన్ జని యంతట
గోవున్ గొని వచ్చిరటకుఁ గొంటె తనమునన్

463. ఉ. అంతట హోమధేనువు మహర్షి వసిష్ఠునిఁ గాంచి దీనయై
స్వాంతమునన్ గలంగుచు నృపాలున కేల యొసంగితయ్యా! మీ
కింతకు నే యకార్యమొనరించితి నేనని పల్క, మౌనియున్
చింతిలి ధేనువున్ గని వచించెను మెల్లన దుర్విచివ్విధిన్

464. కం. అమ్మా! నిను నేనిత్తునె
యిమ్మెయి బలవంతపఱచి యీభూపాలుం
డిమ్ముగఁ గొనిపోఁ దలచెను
నెమ్మదిఁ దలపోయు మిదియు నిక్కము తల్లీ!

465. ఉ. ఏనిపు డేమి సేయఁ గల నీజనపాలుని, కాదుకూడదం
చాన యొనర్పలే నతిథి నంచు మునీంద్రుడు పల్క నప్పుడా





ధేనువు తీవ్ర కోపమున దేహమునెల్ల విదిల్చి దిక్కులెం
తేనియు పిక్కటిల్లగ నహీన గతిన్ నినదించె బిట్టుగన్

466. శా. అంభారావ మొనర్చ ధేనుతను రోమానేక మూలమ్ములన్
గుంభీతుల్య మహోగ్ర రూపములతోఁ గ్రూరాసురా నీకముల్
జృంభించెన్ వరశూల ముద్గర గదా సీరాదులన్ దాల్చి సం
రంభంబొప్పగఁ బెక్కుకోట్లు వరుసన్ రౌద్రోద్ధతిన్బుట్టుచున్

467. ఉ. ఆ నృపవర్యు సైన్యముల నడ్డి రణంబొనరింప, వారలున్
దీనతఁ దోప నుక్కుసెడి తీవ్రరయంబున వెన్నుఁ జూపి యా
కానన మార్గముల్ గదిసి గట్టుకుఁ జెట్టుకు నొక్కరొక్కరై
సేనలు పర్వులెత్తఁ గని సిగ్గున గాధిసుతుండు నంతటన్

468. తే.గీ. బ్రతికి యుండిన శుభములఁ బడయవచ్చు
ననుచు నాతడు రయమున నశ్వమెక్కి
రాజధానికిఁ జనియె నాశ్రమము వీడి
క్షాత్రబలమును నిందించి సంభ్రమమున

469. తే.గీ. బ్రహ్మబల మది నిజమైన బలముగాని
క్షాత్రబలమేల యంచు నాక్షత్రియుండు
రాజ్యమును వీడి తపమొనర్పంగ వెడలె
సాంద్రవనసీమ కెట్టి సంశయములేక

470. కం. చని ఘోరతపం బొనరిచి
దినదినమును దివ్యమైన తేజంబెసగన్
దనరెను బ్రహ్మర్షియనగ
మునివర్యులు దివిజవరులు పొగడువిధమునన్

471. ఉ. కాన మహర్షి మాటలను కాదని సాహసమైన కార్యమున్
బూనిన నిష్ఫలంబెయగు భూవర! వంశము నాశనంబగున్
మానుము పౌరుషమ్ము ముని మాన్యుఁ బ్రసన్నునొనర్చి వెన్కకున్
మౌనము తోడ నుజ్జయని మార్గముఁ బట్టిన క్షేమమయ్యెడున్

472. మ. పసిబాలుండగు నాసుదర్శనుని జంపన్ బోవ ధర్మంబె, యే
దొసగుల్ నీకొనరించు నాతడని యీదుష్కృత్యమున్ బూనుటల్

వసుధన్ మెత్తురె యెవ్వరైన; జగముల్ భావింప సర్వమ్ము వి
శ్వసనీయమ్ముగ నాపరాత్పరుని యాజ్ఞన్ వర్తిలున్ నిత్యమున్

473. ఆ.వె. జరుగ నున్న దెపుడు జరుగక మానదు
కాన నొరుల కీర్ష్యఁ బూనఁ దగదు
ఈర్ష్య పడియునైన నేమియు నొరుగదు
దానఁజేయఁ దగిన దైనలేదు.

474. మ. పవియైనన్ దృణమౌను దైవబల మావంతైన లేకుండినన్
పవియౌ నాతృణమే యొకప్డు పరికింపన్ దైవయోగంబునన్
భువి శార్దూలమునైన తా శశము చంపున్; జంపు నేనుంగునే
నవలీలన్ మశకం బొకండు సమయం బాసన్నమైనన్ నృపా!

475. కం. అనియా సుబుద్ధి పలుకగ
తన దుడుకుందనము మాని ధరణీ పాలుం
డొనరగ ముని వర్యునిపద
వనజములకు మ్రొక్కి పురికి వైళమ చనియెన్

476. చం. అనయము నాసుదర్శనుడు నమ్ముని బాలురతోడఁ గూడి యా
వనముల నాటలాడుచు వివర్ధనుడై సకలంపువిద్యలన్
వినయ విధేయతల్ దనర వేడుక తోడుత నేర్చుచుండె న
మ్మునివరు డక్కజంపడగ మోదముఁ జెందగ మాతృదేవియున్

477. మ. ఒకనా డందఱఁ గూడి యాతడును గ్రీడోత్సాహియైయుండగా
నొక బాలుండు విదల్లునిన్ గనుచు నోహోక్లీబయంచున్గడున్
బ్రకటంబౌనటుఁ బిల్వ నాపలుకులన్ భావమ్ములో నిల్పి తా
నకలంకుండయి యాసుదర్శనుడు సద్యః స్ఫూర్తితోనత్తఱిన్

478. తే.గీ. అమర బిందువుఁ జేర్చి యాద్యక్షరమున
కతడు పలుమార్లు దానినే యాత్మనిల్పి
అర్థమింతయుఁ దెలియక ననవరతము
నుచ్చరించుచునుండె తానుత్సహించి

479. తే.గీ. అది మహారాజ కామరాజాఖ్య బీజ
మంత్రమని యాతడింతయు మదినెఱుంగ





కనిశము జపించు చుండె క్లీమ్మనుచు నదియు
భావియోగమ్మొ బాల్యచాపల్యమౌనొ!

480. తే.గీ. అంత నొక కొంత కాల మట్లరిగినంత
పదునొకండవయేట నా బాలకునకు
మునులు జరిపించి రుపనయమ్మును కరము, ము
దమున నాశ్రమంబున భరద్వాజునాజ్ఞ

481. శా. వేదాభ్యాసమొనర్ప సాగెను, ధనుర్వేదమ్ము శాస్త్రమ్ములన్
మోదం బొప్పగ నేర్చె, సర్వమును సంపూర్ణంబుగా దోచె నా
శ్రీదేవీ మహిమమ్ముచే క్షణములో చేతమ్మునందట్టె, ని
ర్వాదాంశమ్ముగ నెల్లరున్ మిగుల విభ్రాంతిన్ బ్రశంసింపగన్

482. కం. ఒకనా డేకాంతమ్మున
నకలంక మనమ్ముతోడ నాతండుండన్
సకలాంతర్యామిని తా
ప్రకటితమై కానుపించె బంధుర భంగిన్

483. కం. అరుణాంబర ధారిణి యును
నరుణాంచిత దేహయు నరుణాభరణయునై
వర వైష్ణవశక్తి యనగ
గరుడునిపై నధివసించి కన్పడినంతన్

484. చం. కడు ముదమంది యాతడు ముఖమ్మునఁ జిర్నగ వొప్ప కన్నులం
దెడపక మోద బాష్పము లహీనగతిన్ స్రవియింపఁ బుల్క లె
ల్లెడల శరీర మందెసగ నిచ్చమెయిన్ పరదేవినప్డు తా
వడివడి వేద సూక్తములఁ బ్రబ్బిన భక్తినుతించె వేడుకన్

485. కం. అదిమొదలుగ నాతడు తా
ముదమున నాశ్రమము చెంతఁ బూర్ణేందుముఖిన్
సదమల గాత్రిన్ దేవిన్
మదినిలిపి భజించుచుండె మానక భక్తిన్

486. సీ. ఒకదినమ్మున నాత దుత్సాహభరితుడై
జాహ్నవీ సైకతస్థలము నందు

సంచరించుచునుండ చక్కనౌదివ్యంపు
    విశిఖాసనముఁ గాంచి వేడ్కఁ గొనుచు
ముందుకు సాగంగ పొందైన రత్నంపు
    కాంతు లీనెడు శిలా కఠినమైన
యంబకంబుల నొప్పు నరుదైన తూణీర
    మును వజ్రకవచమున్ గనిముదమున

గీ. నివియు దేవీప్రసాదంబు లెంత భాగ్య
మనుచు వానిని గైకొని యాశ్రమమున
కరిగి తనతల్లికిని ముని వరున కిద్ది
యంతయుఁ దెలిపె వారు విభ్రాంతినొంద

## శశికళతో సుదర్శనునకు పరిచయము

487. శా. కాశీపట్టణ మేలు రాజునకు సత్కల్యాణ సౌందర్యయై
ప్రాశస్త్యంబగు సద్గుణాంచితయునై భాసిల్లుచున్ చంద్ర సం
కాశంబౌ నగుమోముతో శశికళాఖ్యన్ వృద్ధియౌచుండెఁ బృ
థ్వీశుల్ మెచ్చగ కూతు రొక్కతె పురంబెల్లన్ బ్రశంసింపగన్

488. ఉ. ఆమె మనోరమాసుతుని నంగజ సుందరు నాసుదర్శనున్
శ్రీమహిమోన్నతంబులయి చెన్నలరారు గుణాల వాలునిన్
వేమరుఁ తండ్రి గేహమున విప్రులు చారులు వల్కుచుండగా
ప్రేమదలిర్ప తావినుచు వీడక నెమ్మది నిల్పె నాతనిన్

489. చం. తనమది నెల్ల వేళల సుదర్శనునే తలపోయు నామెకున్
దనరగ స్వప్నమందొక దినంబున నాజగదంబ వచ్చి యో
వనజ దళాక్షి! నీవిక వివాహముఁ గమ్ము సుదర్శనున్ దగన్
మనమలరంగ సౌఖ్యముల మానుగఁ బొందెద వంచుఁ బల్కినన్

490. కం. నిద్దుర మేల్కొని శశికళ
పెద్దయు సంతోషమంది ప్రేమోత్సేకం
బద్దిన మనమున సకియల
యొద్దన నైనను నిలువక యొంటిగ నుండెన్





491. కం. అదిగని చెలికత్తియ లో
ముదితా! యిది యేలనీవు ముదమున మాతో
సదమల గతిచరియింపవు
నెదలో సంతోషమందు దీవే నీలో

492. కం. ఏమికతంబని యడిగిన
నేమియు బదులీయఁ బోక హీహీయనుచున్
వేమరు సిగ్గున నవ్వుచు
తా మోమున్ ముడుచుకొనుచుఁ దలగుచు మెలగున్

493. మ. ఒకనా డామె విహారమేగి సఖితో నుత్సాహ ముప్పొంగఁద
న్నికటం బౌ వనభూమి నచ్చటచటన్ నిండారుపూతీవెలన్
బ్రకటంబౌ విరితావులన్ మిగుల నాఘ్రాణించుచున్ గోయుచున్
సకియన్ జేరుచు ముచ్చటల్ సలుపు నాసందర్భమం దొయ్యనన్

494. మ. తనకున్ స్వప్నమునందు దేవి ముదమందన్ దర్శనంబిచ్చి చె
ప్పిన వైనంబది యెల్లఁ జెప్పెఁగడు సంప్రీతిన్ సఖిన్ జూచుచున్
విని తా విప్రు డొకండు మార్గమున వేవేగన్ సమీపంబునన్
జనుచున్ వారలఁజూచి సుంత నిలిచెన్ సంతోషియై యచ్చటన్

495. శా. ఆ విప్రోత్తముఁగాంచి యాశశియు తానానందమున్ బొందుచున్
భావంబందతి భక్తియుక్తు లలరన్ పాదాలకున్ మ్రొక్కి భూ
దేవా! యెచ్చటనుండి వచ్చితిరి యేదేశంబుఁజేరంగ మీ
రీవేళన్ జనుచుంటిరయ్య! చెపుమా యే వేడెదన్ భూసురా!

496. మ. అనినన్ విప్రుడు వల్కెనిట్లు విను కల్యాణీ! భరద్వాజ స
న్ముని దివ్యాశ్రమ భూమినుండి యిటువైపున్ బోవుచున్ మిమ్ములన్
గని యిచ్చో నిలుచుంటి నంచుఁదెలుపన్ గన్యాలలామంబు తా
వినయంబొప్ప వినంగఁగోరెనచటన్ వింతల్ విశేషంబులన్

497. ఉ. అంతట భూసురుండనియె నబ్జదళాక్షి! తదాశ్రమంబునన్
వింతలు పెక్కులున్ గలవు విన్పెద నొక్కటి నాలకింపుమా!
కంతు సమాన సుందరు డొకండు సుదర్శన నామధేయు డ
త్యంత గుణోన్నతుండు గల దద్భుత తేజుడు దర్శనీయుడున్

498. తే.గీ. అత డయోధ్యాపురాధీశు డార్యవినుతు
డైన ధ్రువసంధి సుతుడు గుణాల వాలు
డతనిఁజూడని వారల యక్షియుగ్మ
ముండియును నుండ నట్టులే యుత్పలాక్షి!

499. కం. జగములఁగల సద్గుణముల
నగణితముగ నొక్కచోట నద్భుతరీతిన్
దగఁ జూడఁ గోరి యబ్జజు
డొగి సృజియించె నన నాతడొప్పున్ ధరణిన్

500. ఉ. నా మదిలోని మాట విను నాతిరో! తెల్పెద నెల్లభంగులన్
భూమి నతండె నీకు సరిపోలెదు వాడని యెంతు, నిక్కమో
కామిని! మీ సమాగమము కాంచన సౌరభ మేళనంబెయో
నేమియు శంకలేదు వరియింపుము వాని నటంచుఁదెల్పుచున్

501. చం. చకచక వెళ్లె విప్రుడును సన్ముని వర్యుల యాశ్రమంబు లో
క్కొకటియుఁ జూడనెంచి యిటు లొయ్యన బోదు నటంచుఁబల్కి, యి
చ్చకమున రాకుమారియును స్వాంతమునం దనురాగ పల్లవం
బొకటన మొగ్గలన్ దొడుగ నుత్సవమొప్పుగఁ జేరెనింటికిన్

502. చం. మదనుడు పుష్పబాణముల మానక వేమరు నాటసాగె న
మ్ముదిత హృదంబుజమ్మున, విమోహిత చిత్తయునౌచు నామె తా
నెదఁగడు తాపమున్ గలుగ నెంతయు సైపగఁజాలకుండె నె
య్యదియునుఁ గోరదయ్యె, గొనదయ్యెను నెచ్చెలు లేమియిచ్చినన్

503. సీ. చందనంబలదిన చందనంబిదికాదు
విషమంచుఁ బల్కు మేన్ విఱుచుకొనుచు
వెండి వెన్నెలఁ గాంచి వెన్నెల కాదిది
మండుటగ్నియటంచు మరలుచుండు
సౌధాంతరమునందు సౌఖ్యం బొకింతయు
లేదంచు వెలుపలఁ బోఁదలంచు
ఉద్యాన వనమున నుండ నొల్లదు మధు
ఫలరసంబుల నిష్టపడకయుండు





గీ. పగలు రేయును నిద్దుర పట్టదయ్యె
శ్రావ్యగీతమ్ములన్ వినఁ జాలకుండె
నిరత మాసుదర్శను మీద నెమ్మనమ్ము
నిలిపి యాశశికళ యన్యములను వదలి

504. చం. అటఁజని యాశ్రమంబున నెటైన సుదర్శనుఁ జూతమన్న నా
కెటుల సుసాధ్యమౌ,జనకు డెట్టు లనుజ్ఞనొసంగు, లేక నే
నెటులయినన్ స్వతంత్రముగ నేగినచో నపవాదుగల్గు, సం
కటములు సంభవించు, ధర కాంతలకెయ్యవి స్వేచ్ఛలెంచగన్

505. ఉ. ఎందరు రాకుమారులు మహిన్ గడు సుందరులుండ, రైన నా
డెందమునం దతండె కడు డెప్పరమౌ మదన జ్వరంబు పెం
పొందగఁ జేసె, రాజ్యసుఖముల్, పరివారము, నెల్ల సంపదల్,
వందిజనమ్ములన్, సఖులఁ బాసి వనాంతర సీమ నుండియున్

506. కం. అని యివ్విధమున శశికళ
మనమున పరితప్త యౌచు మానక యతనిన్
తన హృదయమ్మున నిల్పుచు
దినములు సాగించుచుండె తీరని వ్యధతో

507. కం. అనిపలికి బాద రాయణు
డనియెన్ దా మరల నిట్టు లవనీపతియౌ
జనమేజయునిం గాంచుచు
మునిజన వంద్యుండు మదికి మోదమెలర్పన్

508. మ. పరివారమ్మును, రాజ్యభోగములు, సర్వంబున్ దొలంగన్ మనం
బెరియన్ వన్యములన్ భుజించు నతడా యిందీవరాక్షిన్ నిరం
తరమున్ నిద్దురఁ గూరనీయ దనినన్ దథ్యంబు నద్దానికిన్
పరదేవీ వరమంత్ర వర్ణ జపమే భావింపగా హేతువౌ!

509. కం. ఆతడు మాత్రము నిరతముఁ
బ్రీతిన్ మంత్రాక్షరమును రేయుంబవలున్
జేతమున నిల్పి జపమును
ఖ్యాతిన్ గావించుచుండె నానందమునన్

510. శా. ఈరీతిన్ జన కొంతకాల మొకనా దేతెంచె దుర్దర్శనుం
డా రాపట్టి సుదర్శనున్ గనగ నాహ్లాదమ్మునన్ జక్కనౌ
తేరున్ గాంచన మాలికా సరణితో దివ్యాశ్వ సంశోభితం
బై రాజిల్లెడు దానిఁగైకొని నిషాదాధీశు డచ్చోటకున్

511. మ. అతడా జైత్రరథమ్ము నశ్వయుతమున్ హారధ్వజాకీర్ణ శో
భితమున్‌దెచ్చి మనోరమాసుతునకున్ ప్రేమాతిరేకంబునన్
సుతవాత్సల్యముతో నొసంగ మునులచ్చో నెల్లరున్ గాంచి వి
స్మృతమౌ దీవెన లిచ్చి రాతనికి వాసిన్ వేద మంత్రమ్ములన్

512. తే.గీ. ఆ సుదర్శనుడంత నయ్యరద మిచ్చఁ
గైకొని యతని కతిథి సత్కారముల నొ
సంగి పంపె మునివరులు సంతసించి
పలికి రివ్విధిఁప్రేమతో వానిఁ గాంచి

513. . రాజకుమార! శీఘ్రముగ రాజ్యము నేలెదవయ్య! నీవు, నీ
తేజము,ఁగీర్తి నల్దిశల దీప్తి వహించి జగత్ప్రసిద్ధియౌ
నా జగదంబయున్ ముదమునంది వరమ్ముల నిచ్చు చుండె; నిన్
రాజుగఁ జూచి తల్లియు కరంబు ముదంబునుఁ బొందుఁబొమ్మికన్

514. శా. ఆ మాటల్ విని యా మనోరమయుఁ దానానందమున్ బొందుచున్
మీ మాటల్ నిజ మంచు నమ్మెద మదిన్ మీదాసు డీతండు,దే
వీ మంత్రాక్షరమున్ జపించిన శుభంబే యౌనుగాదే! నిజం
బో మౌనీశ్వరులార! మాకెపుడు మీ యుక్తుల్ తనుత్రాణముల్

515. ఉ. సైన్యములేదు మంత్రులును సాయమొనర్చెడి వారులేరు, లే
రన్యులు బంధువుల్ దగిన యర్థమొసంగెడి వారలైన, సా
మాన్యుడు రాజుకాగలడె మానుగ మీ వచనంబు లే యికన్
మాన్యునిఁ జేయు వీని ననుమాన మొకింతయు లేదు నామదిన్

516. వ. అనిపలికి మునివరులకు నమస్కరించె నంత

517. కం. అరదము నెక్కి సుదర్శను
డరమరికలు లేక యెటకు నరిగిన నైనన్
స్థిరముగ నొక యక్షౌహిణి
వరసైన్యముతోడ నున్న పగిదిన్ బొలుచున్

518. కం. ధర కామరాజ బీజా
క్షర జపము నెపుడు వదలక జపియించిన వా
డిరవుగ సకల సుఖంబుల
త్వరిత గతిన్ బొందు నధిప! తన్మహి మమునన్

519. కం. తన సృష్టి వైభవమ్మును
తనపతి కఖిలాత్మునకు ముదంబున నిరతం
బును జూపించు జగన్మా
తను భజియించుచును నా సుదర్శనుడుండెన్

520. కం. అచ్చట కాశీపతిసుత
యచ్చపు విరహాగ్నితోడ ననవరతంబున్
నెచ్చెలుల సేవ లేమియు
మెచ్చక దుఃఖించుచుండె మేను గృశింపన్

521. ఉ. ఆ విషయమ్మెఱింగి తన యాత్మజకున్ దగఁ బెండ్లిసేయ భూ
పావలి నెల్లరన్ బిలువ నంపె సుబాహుడు భృత్యవర్గమున్,
భావజ సుందరున్ దగినవానిని మెచ్చి స్వయంవరమ్మునన్
దా వరియించు నొక్కని సుదారగుణాఢ్యు నటంచు నెంచుచున్

522. సీ. ధాత్రి ముప్పిధములై తరుణీ మణులకెల్ల
ప్రకటింపఁబడు స్వయం వరములెలమి
వధువు తామెచ్చిన వానిని వరియించు
టరయ నిచ్ఛా స్వయంవర మదౌను
పందె మొక్కటి యొడ్డి యందు గెల్చినవాని
బడయ పణ స్వయంవర మదయ్యె
వీరవర్యులనెల్ల ధీరుడై యోడించి
కన్నియన్ బొంద సుక్షత్రియుండు

గీ. వీర్యశుల్క స్వయంవర విధమనంగ
నదియు నొప్పును భూపాల! యవనియందు

ఇందు మొదటిది తానెంచి యేర్పరించె
నా సుబాహుడు తన సుత కమర నపుడు

523. ఆ.వె. శిల్పులెల్ల వచ్చి మెల్పున వేవేగ
నా స్వయంవర సభ నద్భుతముగ
తీర్చి దిద్దిరపుడు దివిజ సభ యనంగఁ
బొల్చునట్లు మెచ్చ భూమిపతులు

524. చం. వరుసగ రాకుమారులు ప్రభాకరతేజులు సైన్యసంఘముల్
బరువడి వెంటరాఁదరలివచ్చిరి రాజస మేర్పడన్ స్వయం
వరసభ కెల్లరున్ గడు నిబద్ధిగ "రాజకుమారి నేడు నన్
బరగ వరించునంచుఁ దమభావములన్ దలపోయుచున్ గడున్

525. చం. తన మదిలోని మాట తలిదండ్రులకున్ వినిపింప నిద్దియే
యనువగు వేళయంచు తన యాప్త సఖిన్ బిలిపించి నెచ్చెలీ!
వినుము మదంబ కిప్డు వినిపింపుము నే ధ్రువసంధి పుత్రునిన్
దనర సుదర్శనున్ మనమునన్ వరియించితి నంచు మెల్లగన్

526. కం. ఆతనిఁగాదని వేరొక
భూతల నాథుని వరింపఁ బోనని చెపుమా
చేతమలర జగదంబయు
నాతనినే పెండ్లియాడు మనె స్వప్నమునన్

527. కం. అని శశికళ చెప్పగ తా
వినినది విన్నట్లు సకియ వినిపించెను త
జ్జననికి వైదర్భికి నా
వనజాక్షియు విషయమెల్ల భర్తకుఁ దెలిపెన్

528. చం. తెలిపిన నా సుబాహుడును తెల్లమొగంబునువైచి నవ్వుచున్
కలదె యెటైన నిట్టి సరికాని యసంగతమైన యూహలో
నలినదళాయతాక్షి! యిది నామది కిష్టమొకింతలేదు, నే
తలపగఁజాల నల్లునిగఁ దథ్యము వాని నయోగ్యు నెన్నడున్

529. ఉ. రాజ్యములేదు వానికి, నరణ్యములన్ బడి కందమూలముల్
భోజ్యములై మునీశ్వరుల పొత్తున పర్ణకుటీరమందు సా





యుజ్యముఁగోరు చందమున నొంటిగఁదల్లిని గూడియున్న యా
రాజ్యవిహీను నెవ్విధిఁదిరంబుగఁదా వరియించు భర్తగా

530. తే.గీ. కాన శశికళ నిప్పుడే కలిసి నీవు
నా సుదర్శను మరచి పొమ్మనుచుఁజెప్పు
మదె సకలభూమి పతు లోలి నరుగుఁదెంచు
చున్నవారలు కల్యాణ శోభలలర

531. కం. అని యాజ్ఞాపింపగ న
వ్వనితయుఁగడువేగ నరిగి వనజదళేక్షన్
తన తనయను నొడిఁజేర్చుక
ననురాగము తోడఁబలికె ననునయ మొప్పన్

532. శా. తల్లీ! యేమిటికమ్మ! నీవిటుల వ్యర్థంబైన తాపంబుతో
నుల్లంబందతి శోకవహ్ని రవులన్ యుత్సాహమున్ వీడి మ
మ్మెల్లన్ గాసిలఁ జేతువిట్లు తగునే యీరీతి మీతండ్రి తా
నొల్లంబోవని వానికై మిగుల ప్రేమోన్మాదమున్ జెందుటల్

533. ఉ. ఆతడు రాజ్యహీనుడు వనాంతర సీమల పర్ణశాలలో
భూతల శాయియై మునుల పోలిక వన్యములన్ భుజించుచున్
యాతనఁజెందుచుండె హితులాప్తులు బంధులు లేరు, గవ్వయున్
చేత ధనమ్ములే దెటులఁ జెందితి వాతని మీదమోహమున్

534. తే.గీ. నీకు సరిపోలు యోగ్యుడౌ రాకుమారు
నొకనివరియింపు మెందరీ యుర్విలేరు
రాజ్యహీనుని కొఱకు నారాట మేల
కొనగ నేటికి కష్టముల్ గోరి కోరి

535. మ. అదిగాకుండిన వానిసోదరుడు రాజ్యంబేలు చున్నాడు, నీ
మది నొక్కింతయు శంకలేక వినుమమ్మా! శత్రుజిత్తున్ గుణా
స్పదు నీకున్ సరియైనవాని వరియింపన్ వచ్చు, నీతండ్రియున్
మదిలో సంతసమందు నట్లయినసుమ్మా! నీకు మేలయ్యెడున్

536. సీ. మఱి యొక్క విషయమ్ము నెఱిగింతు వినుమమ్మ
శత్రుజిత్తుని తాత చండశాస

నుడు యుధాజిత్తు మనుమనికి రాజ్యముఁ
గట్టఁబెట్టగనెంచి కర్కశముగ
నా సుదర్శను తాతయౌ శూరజిన్నర
పతినిఁజంపె మరియు పగగొని యిపు
డీ సుదర్శనుఁ జంప నెదఁ దలపోయుచు
నున్నవా డదనుకై యోలతాంగి!

గీ. ఆద మరచిన సమయమ్ము నరసి యాత
డంతపని చేసి యాపైన నవనియందు
శత్రుశేషమ్ముమాపి దౌహిత్రు రాజ్య
మెల్ల నిష్కంటకముఁ జేయు నెప్పుడైన

537. కం. కావున నల్పా యుష్కుని
నీవు వరింపన్ దగదని నెయ్యము మీరన్
దా వైదర్భి వచింపగ
భావమ్మున మెచ్చకిట్లు పలికెన్ శశియున్

538. కం. అడవులనైనఁ, గష్టము లనంతములై యొడిఁ జేరెనేనియున్
విడువ సుదర్శనున్ వినుము వేయును నేల యతండెనాకు నీ
పుడమిని భర్తయౌను సుఖముల్ మతిభోగము లేల? పత్ని కె
య్యెడలను భర్త సేవయె మహిన్ సకలంబు గదమ్మయెంచగన్

539. ఉ. ఆ జగదంబ స్వప్నమున నాజ్ఞ యొసంగె "సుదర్శనుండు ని
ర్వ్యాజ గుణోన్నతుండుఁగడు భక్తుడునాకు, వరింపువాని, నీ
వోజలజాక్షి! వాంఛితములొయ్యన నీకొనఁగూడు, నాతడున్
రాజగు నింక"యంచు నను రాగముతో మదికింపు నింపుచున్

540. తే.గీ. చిత్త భిత్తిక మీద సుస్థిరమునౌచు
వాని చిత్రమ్ము ముద్రింపఁబడియెఁగాన
నతని విడనాడి యన్యుల నాత్మయందు
నిష్టపడనంచు లోనికినేగె వేగ

541. కం. అదివిని వైదర్భియు తా
నెదఁగడు పరితాపమంది యెల్లవిషయమున్





మదికెక్కఁజెప్పెనప్పుడు
పదములు తడబడగ నేగి భర్తకు వేగన్

542. ఆ.వె. ఇంతచేసి యిప్పు డిట్లయ్యె నేమని
యా సుబాహు డప్పు డాత్మలోన
కలతఁజెంది యింక కర్తవ్యమేమని
మిన్నుఁజూడ సాగె తెన్నుకొఱకు

543. చం. శశికళ యంత నొక్క బుధసత్తము నాప్తుని బ్రాహ్మణోత్తమున్
కుశలునిఁ బిల్చి పాదములకున్ దగ పూజలొనర్చి యంతయున్
విశదమొనర్చి మీరు కడువేగమె యాశ్రమ భూమికేగి, యా
శశిముఖుడౌ సుదర్శనుని సత్కృపఁ దోడ్కొని రమ్ము వేడెదన్

544. చం. అతనికిఁదెల్పుమయ్య యిటులంటిని నేనని నాదుమాటగా
"నితరుల నెవ్వరిన్ బతిగ నేవరియింపను నిన్నుఁ దప్ప, నీ
యతులిత రూపసంపదయు యౌవనమున్ గుణవైభవంబులున్
ప్రతి దినమేను చిత్తమునఁ బాయక నిల్పుదు నిశ్చయంబుగన్"

545. చం. "ఇది జగదంబ యాజ్ఞ యనియెంచుము నా కొకనాడు స్వప్నమం
దుదయదినాధి పాభ! మహితోజ్జ్వలయై యగుపించి దేవి, నీ
సదమల రూపమున్ సుగుణసంపదయున్ వివరించి యాతనిన్
ముదమునఁ బెండ్లియాడుమని పొందుగఁ బల్కియదృశ్యమైచనెన్".

546. కం. "నామనసు మీదు కట్టితి
నీ మంగళ రూపమునకె నిర్మల చరితా!
యేమరక రమ్ము ఱేపే
స్వామీ! యేర్పరుపఁబడియె సభ వరియింపన్

547. తే.గీ. ఎదురు చూచుచు నుండెద నెల్లినేను
నీవు రాకున్న విషమింతఁ ద్రావి యంత
నగ్ని దూకుదుఁ గాని నే నన్యపురుషు
నొల్లఁబోనయ్య ధ్రువ మిది కల్లగాదు

548. మ. అని నామాటగఁ జెప్పి యాతనికి నెట్టైనన్ గడున్ నేర్పుతో
వినిపింపందగు మాటలున్నయెడలన్ విన్పించి యిచ్చోట క

య్యనఘున్ దోడ్కొని రమ్ము భూసుర వరేణ్యా! నీకుఁబుణ్యంబగున్
ఘనసత్కార మొనర్తు నేనని నమస్కారంబు గావించినన్

549. తే.గీ. అతడు శశికళ మాటల నాలకించి
ఆభరద్వాజ సన్ముని యాశ్రమమున
కరిగి యట సుదర్శనుఁ గాంచి యాదరమున
విషయమెల్లను విన్పించె వివరముగను

550. శా. ఆ విప్రోత్తము వాక్యముల్ విని యతం డత్యంతసంతోషియై
వేవేగన్ జన నిశ్చయించె, మునియున్ బ్రీతిన్ శుభంబౌనటుల్
దీవించెన్, దన తల్లి మాత్ర మెద సందేహించుచున్ పుత్రకా!
నీ విట్లొంటిగ నేగుటెల్ల శుభమౌనే సుంత యోచింపుమా

551. కం. అచ్చటకు యుధాజిత్తును
వచ్చున్ గద! యొంటి వౌచు వాని కగపడన్
కచ్చితముగ చంపక పో
నిచ్చునె నిన్ను నత డిదియు నెఱుగుము తనయా!

552. ఉ. కావున వెళ్ళకయ్య నినుఁ గంటికి ఱెప్పయు వోలె నిన్నినా
శ్లీవనమందుఁ బెంచితిని యిప్పుడు నీకొక యెగ్గుగల్గ నే
నేవిధి ప్రాణముల్ నిలుపుదింక శరీరమునందు, పెద్దయై
నీవుచరింపఁ జూచుకొని నెమ్మిసుఖింపఁ దలంచితిన్సుతా!

553. కం. నా యాసల నడియాసలు
చేయకుమో తండ్రి! నీవు చెంతన యున్నన్
బాయుదు దుఃఖములెల్లను
నా యాన వసింపు మిందె నాకున్ దోడై

554. మ. అనినన్ నవ్విసుదర్శనుండు భయమేలాతల్లి! యీసృష్టిలో
ననయంబున్ సకలంబు లోకజననీ యాజ్ఞానుకూలంబు, లె
వ్వని కేరీతి విధించెనో యదియు తప్పున్ బోవునే యింతకున్
వినుమమ్మా! జగదంబ యాజ్ఞయిది సంప్రీతిన్ ననున్ బంపుమా!

555. తే.గీ. క్షత్రియాంగన వైయుండి క్షాత్రగుణము
నూరిపోయంగఁ దగుఁగాని యూరకిట్లు





భయముఁ జెందుట నీకిది పాడి యౌనె
నన్ను దీవించి పంపు మానంద మొలయ

556. మ. అని ధైర్యమ్మును స్థైర్యమున్ గలుగ నాఖ్యానించు సత్పుత్రునిన్
గని విశ్వాసముతో మనోరమయు తా "కల్యాణమస్తం"చు దీ
వెనలన్ బూర్ణముగా నొసంగి "నిను నా విశ్వేశి యెల్లప్పుడున్
గనుచుండున్ శుభమౌను పొ"మ్మనుచు సంజ్ఞన్ జేసె మోదమ్ముతో

557. మ. మఱియును నిన్ను

558. సీ. కుడియెడమల నిల్చి యెడపక పార్వతీ
పరమేశ్వరులొగి కాపాడఁగలరు.
మార్గమధ్యంబున మానక వారాహి,
దుర్గమ దుర్గాల దుర్గమాంబ,
కలహరంగమ్మున కాళికాదేవియు,
మాతంగి కల్యాణ మంటపమున,
రాజమండలిలోన రంజిల్లెడు భవాని,
గిరి దుర్గమ్ములఁ బరగ గిరిజ,

గీ. సరిగ చాముండి యెల్లప్డు చత్వరముల,
కాననమ్ములఁగామాక్షి, కలహములను
వైష్ణవి, సమర మందున భైరవియును,
నంతటన్ భువనేశ్వరి యహరహమ్ము
నిన్ను కాపాడగలరు నాచిన్నికన్న!

559. మ. అని యిట్లాయమ దీవెనల్ వలుకగా నాతండు సంతోషియై
మునులన్ వీడ్కొని తల్లి పాద వనజమ్ముల్ శీర్షమున్ సోకగా
వినయమ్మేర్పడ మ్రొక్కి యెక్కెరథమున్ విశ్వేశ్వరిన్ మానసం
బునభావించుచు, సాగెనంత యరదంబున్ ముందుకున్ మెల్లగన్

560. మ. అరదంబించుక ముందుకేగ,ఁ గడు శోకావేశ సంరంభయై
మరలన్ బావురుమంచు నేడ్చుచు సుతా! మారాడబోకయ్య; నే
నరుదెంతున్ రథమెక్కి సుంతనిలుమయ్యా! నీవులేకుండినన్
ధర నే ప్రాణము తోడ నిల్వనికఁ ధర్మ్యం బర్కవంశోద్భవా!

561. కం. అని పల్కి మనోరమ తా
తన సఖియగు ధాత్రిఁ గూడి తద్దయు వేగం
బునఁజని యరదము నెక్కెన్
ముని వరులును మోదమంది ముదల నొసంగన్

562. చం. అరదము సాగె నెమ్మదిగ, నచ్చట నచ్చట సేదఁదేఱుచున్
బురములఁ బల్లెలన్ మఱియుఁబుణ్యనదీనద భూములన్ మునీ
శ్వరులను జూచుచున్ దుదకు వారలు చేరిరి కాశికాపురిన్
సురతటినీ తటాంచల సుశోభితమున్ శివశక్తి ధామమున్

563. కం. ఆ రఘు వంశోద్భవునిన్
దోరంబగు నాదరమునఁ దోడ్కొని వచ్చెన్
భూరమణుండు సుబాహుఁడు
కూరిమి నెదురేగి భటులు గూడి నడువగన్

564. కం. వారల కొక విడిదిగృహం
బేరుపడగఁ జేసి యంత నిరవుగ భటులన్
జీరి తగినసేవలఁదని
వారగఁ జేయఁబనిచి యతడరిగె నిజేచ్ఛన్

565. మ. పలు దేశమ్ములనుండి వచ్చిరటకున్ బద్మాక్షిఁ జేపట్ట సే
నలు నక్షౌహిణు లొక్కటన్ గదిసి వెన్కన్ వచ్చుచుండన్ మహా
బలసంపన్నులు రాకుమారు లతి దర్పంబుల్ బ్రదర్శించుచున్;
స్థలమొక్కింతయు లేదు నిల్వనయినన్ దత్ప్రాంతమం దయ్యెడన్

566. మ. అంత తనమనుమడైన శత్రుజిత్తును వెంటఁబెట్టుకొని
యుధాజిన్నరేంద్రుండునునటకు వచ్చె.

567. ఆ.వె. విడిది గృహములెల్ల వేవేగ నిండెను
ప్రేక్షకులను లెక్కపెట్టలేము
నేల యీనినట్లు, నింగి వర్షించిన
ట్లచటిజనులు వొలిచి రక్కజముగ

568. ఉ. అమ్మను వెంటఁబెట్టుకొని యాత్రమునన్ బరువెత్తెనంట తా
కొమ్మను బెండ్లియాడ మదిఁగోరి సుదర్శను డేమిచిత్రమో





కొమ్ములు దిర్గినట్టి నృపకుంజరు లిందరు గూడియుండ నా
దిమ్మరి నెవ్విధిన్ వలచు దీనుని కన్యక రాజ్యహీనునిన్

569. ఆ.వె. ఆశయెంత దనుచు నాశ్చర్యమునఁజేరి
రాకుమారులెల్ల రాజసమున
ముచ్చటించుకొనుచు మూతులు ద్రిప్పుచు
నతని పరిహసించి రచట నచట

570. మ. విడువన్ వీని సుదర్శనున్ దునిమెదన్ వీరాగ్రణుల్ చూడుడీ!
తడబాటింతయులేక కన్నియయు నా దౌహిత్రునే గోరు నం
చడపన్ జాలని తీవ్రకోపమున నోనాడెన్ యుధాజిన్నరేం
ద్రుడు భూపాలుర నెల్లరన్ గనుచు నుగ్రుండై బుసల్గొట్టుచున్

571. ఉ. అంతట కేరళాధిపతి యాతనిఁగాంచి ధరాధినాథ! నీ
వింతటి తీవ్రకోపమున నిట్టులఁబల్కుట నీతిగాదు. తా
నింతకు నెవ్వరిన్ శశి వరించునొ నీవెఱుగంగఁ జాలుదే
యింతటి పంతమేల వధియించుట ధర్మమె యాసుదర్శనున్

572. కం. ఇచ్ఛాస్వయంవరం బిది
స్వేచ్ఛగ వరియింపవచ్చు వేరెవ్వరినేన్
స్వచ్ఛంబిది దీనికిటుల
మ్లేచ్ఛత్వముఁబూనుటెల్ల మేల్గాదయ్యా!

573. చం. అదియునుఁగాక నీవు మును నాతని తాతను మట్టువెట్టి దు
ర్మదమున నీదుమన్మనికి రాజ్యమునెల్లను నప్పగించి సం
పదల హరించి నట్టడవిపాలొనరించితిగాదె యంతటన్
వదలక యొంటిఁజిక్కెనని వానివధించుట నీకు ధర్మమా!

574. శా. నీ పాపంబునకైన దుష్ఫలము నిన్నేబొందు నేనాటికేన్
పాపంబుల్ మనపుణ్యముల్ గనుచు పైవాడొక్కడున్నాడు, తా
నోపండెన్న దధర్మవృత్తి నిజమున్ యోచింపు, మెల్లప్పుడున్
పాపంబేయడగున్ జయంబెపుడు సంప్రాప్తించు ధర్మానకున్

575. తే.గీ. కాన నీ దురాలోచన మానుకొనుము
సమరమొనరింపఁ గాదిది సమయమయ్య

ఇష్టపడునేమొ నీదుదౌహిత్రు నీమె
ఎన్నుకొనునేమొ యితరుల నెవరికెఱుక

576. కం. అని నయ భయములు మొనయగ
వినిపించిన యతనిఁ జూచి పెల్లగు కోపం
బెనయ యుధాజిన్నరపతి
యనియెన్ దా నిట్లు సభ్యులదరి పడునటుల్

577. శా. చాలున్‌జాలును నీతి వాక్యములికన్ జర్చింపఁ బోకయ్య! భూ
పాలా! మాకును కొద్ది గొప్పలుగ నీపాండిత్యముల్ గల్గుఁ బో!
ప్రేలంబోకుము యోగ్యులిందరు మహావీరాగ్రణుల్‌గల్గ, నా
వాలుంగంటి దరిద్రునొక్కని వరింపన్ జూచి సైరింతుమే

578. చం. మృగపతిపాలి సొమ్ము దిగమ్రింగఁదలంచెడు జంబుకంబు నా
నెగసి సుదర్శనుండు గొనుటెంతయు భావ్యమె కన్యకామణిన్
నిగమము భూసురాళికిని, నిక్కము భూపతికిన్ శరాసనం
బగణితమౌ బలంబులగు నంచు వచింపవె నీతిశాస్త్రముల్

579. వ. మఱియు

580. తే.గీ. బలముగల వాడె కన్యఁజేపట్టవలయు
బలమె పణముగఁ బెట్టి సుబాహుడిపుడు
ప్రకటనము సేయఁ దగు స్వయంవరము; కాక
సంగరము తప్పదనుచు భుజమ్ముఁదట్టె

581. ఉ. ఆతని పల్కులన్ వినిన యచ్చటి రాజకుమారులెల్ల శౌ
ర్యాతిశయమ్మునన్ దమ శరాసనముల్ ధరియించినిల్చి ని
ర్ఘాత నిపాత రావ పరికంపిత దేహులునౌచు లేచి, యా
భూతల నాథుపై సమరమున్ బ్రకటించి రుద్రగ్రతేజులై

582. ఉ. అంతటఁ బెద్ద లెల్లరును నచ్చటఁ జేరి వివేక మేర్పడన్
శాంతిలఁజేసి వారలను, సమ్మతి నప్డు సుబాహుతోడ చ
ర్చింత మటంచు నెంచి కడుశీఘ్రమె యాతనిఁ బిల్వఁబంచినన్
చింతిత మానసుండగుచుఁ జేరె సభాస్థలి కాతడున్ వడిన్





583. ఉ. వచ్చిన వానిఁగాంచి నృపవర్యకుమారులు వల్కిరిట్లు, మే
మిచ్చట కేగుదెంచితిమి స్వేచ్ఛగ కన్నియ యొక్కనిన్ దగన్
మెచ్చి వరించునంచు, మఱి మీమది నెద్ది తలంచు చుంటిరో
పొచ్చెములేక తెల్పుము నృపుల్ వినునట్లుగ నేడు భూపతీ!

584. చం. అని యడుగన్ సుబాహుడపు డందరఁ జూచుచు నెట్టకేలకున్
దనమదిలోని భావమును దాచక తా నెఱిగించెనిట్లు, మా
తనయ సుదర్శనున్ మదిని దద్దయుఁ గోరుచునుండె, నిద్దియున్
మును తెలియంగనైతి నిట మోసమొకింతయులేదు నమ్ముడీ!

585. చం. వలదని యెంత చెప్పినను పాయక నాతనిపై మనమ్ము ని
శ్చలముగ నిల్పియున్నయది క్షత్రియవంశజులార! యాతనిన్
బిలువగలేదు రమ్మనుచు, వేడ్కఁదనంతటఁదానెవచ్చె, కా
వలసిన కార్యమెల్ల భగవానుడె తా నెరవేర్చు నింకపై

586. కం. అనిపల్కి సుబాహుడపుడు
తన యాసనమందు మిగుల దైన్యస్థితితో
వినమిత శీర్షుండయి కూ
ర్చొనియెన్ దగ మౌనవృత్తి చొప్పడురీతిన్

587. ఉ. ఆతని మాటలన్ విని ధరాధిపసూనులు మంతనమ్ము ల
త్యాతతరీతి సల్పి తుదకందరుఁ గూడి మనోరమాసుతున్
వీతభయున్ సభాస్థలికి వేగమె పిల్వగ బంచిరంత, సం
ప్రీతినతండు వచ్చె తన వెన్క నొకండునులేక యొంటిగన్

## సుదర్శన-రాజపుత్ర సంవాదము

588. ఉ. వచ్చిన యాతనిన్ గని సభాసదు లోయి నరేంద్ర పుత్ర! నీ
విచ్చట కేలవచ్చితివి? యెవ్వరు పిల్చిరి? మంత్రివర్యులున్
హెచ్చగు సంపదల్ మఱి యహీన బలంబులు లేక యొంటిగా
నచ్చునలాడ వచ్చితివొ! యంగనఁబెండిలియాడ వచ్చితో

589. ఉ. కన్నియ కోసమై యిచట కయ్యముసేయగ సర్వసైన్య సం
పన్నుల మౌచు వచ్చితి మపార ధనమ్ములతోడమేము, మా

కన్నను పెక్కుసైన్యములఁ గైకొని వచ్చెను శత్రుజిత్తు తాఁ
గ్రన్నన తాత గారి సహకారముతో విజయాభిలాషియై

590. ఉ. దాచక యున్నదున్నటులఁ దథ్యముగా వివరించినారమో
రాచకుమార! నీవిక తిరంబుగ వేడుకఁ జూడనిచ్చటన్
కాచుక యుందువో యటులఁ గాక నిజేచ్ఛఁజనందలంతువో
యోచనఁజేసికొమ్మొకటి యొంటిగ నుంట ప్రమాద మర్భకా!

591. చం. అనవిని యాసుదర్శను డహంకరణం బొకయింతలేక, తా
ననియెను వారిఁజూచి దరహాసముసేయుచు రాకుమారకుల్
వినుడిదె మీరు తెల్పెదను వేరొకరెవ్వరు లేరు సాయమున్
గొనకొని చేయువారు, ననుఁ గూర్మి నెవండును పిల్వరైరిటన్

592. చం. ఇది జగదంబ యాజ్ఞ, వచియించెను స్వప్నమునందు వైష్ణవీ
సదమల రూపమేర్పడ ప్రశస్తిగ నాకగుపించి, "నాయనా!
ముదమున కాశికాపురికి పొమ్ము సుబాహుడు వానిపట్టికిన్
పదిలముగాగ నేర్పరచె ప్రాభవమొప్ప స్వయంవరంబటన్

593. కం. అని యాజ్ఞాపింపగ నేఁ
జనుదెంచితి నిటకు నామె సంకల్పంబే
ఘన సైన్యసంపదలు నా
కనఘాత్మకులార! బలము లన్యములేలా!

594. తే.గీ. ఆమె సంకల్ప మెద్దియో అదియె జరుగు
సంశయంబేల నాకు నీ జగతియందు
అంబయొక్కతె కన్పించు నఖిలమునను
శత్రువొక్కడులేడు నిశ్చయము సుమ్ము

595. ఉ. నాయెడ నెవ్వరైనను మనంబున వైరముఁ బూని యున్న నన్
బాయక వెంటనంటి యరి వర్గము నెల్లను నుక్కడంచి ని
శ్రేయస మిద్ధరన్ గలుగఁ జేయుటకై జగదంబ యుండ, నా
కేయది దుఃఖమింక, ధన మేటికి, సైన్యసమూహమేటికిన్

596. కం. ఏనాటి కేది జరుగునొ
ఆనాటికి నదియె జరుగు నన్నిజగములన్





కాన నిక చింత యేటికి
భూనాధకుమారులార! పోరులుడుగుడీ!

597. తే.గీ. ఆ జగన్మాత తలచిన నాఢ్యుడైన
పేదయగును మఱియు నిరుపేదయైన
నాఢ్యుడగు, రాజు బంటగు, నందలమును
నెక్కు బంటైన ధ్రువమిది యెల్లజగతి

598. చం. హరిహర పంకజాసన సురాధిపులున్ జగదంబశక్తి చే
తిరుగుచునుందు రెల్లపుడు తేజములన్, దదనుగ్రహంబు సు
స్థిరముగ లేక యున్న కడు దీనత వార లొకింతయేనియున్
జరుగగఁ జాలరట్టిటు, నిజంబిది నమ్ముడు వాదమేటికిన్

599. ఉ. చావును పుట్టుకల్ మరియు సౌఖ్యము దైన్యము లెల్లవేళలన్
దైవవశంబునన్ జరుగు, తానది యట్లయియుండ, మానవుం
దేవిధిఁజంపుఁ జంపఁబడు, నెల్లవిధమ్ముల కర్మబద్ధులై
జీవులు సంచరించుటది సిద్ధము గావున నేల చింతిలన్

600. కం. సంచితము వర్తమానం
బంచున్ బ్రారబ్ధమనియు నార్యులచే ని
ర్లొంచఁబడియె కర్మలు ప్రా
పంచిక జీవులకు త్రివిధ భాగమ్ములుగన్

601. చం. హతుడును హంతయున్ మదిని నారయ వారు నిమిత్తమాత్రులే
సతతము కాలకర్మముల సంగతిచే త్రిజగంబులందు జీ
వతతి మెలంగు చుండ నిక వాడని వీడని కర్తలన్ సదా
వెతకుట యెల్ల భ్రాంతియగు విజ్ఞతతో మదినెంచిచూచినన్

602. చం. జనకుని సింహమొక్కటి నిశాత నఖమ్ముల, జీల్చె, తాతనో
తన నిశితాసిఁ జంపెను యుధాజితు, కర్తలు వీరలౌదురే
కనఁగ నిమిత్తమాత్రులగు, కాలమె వారిని సంహరించె, నే
యనువున నైన కాలగతి నాపగ సాధ్యమె యెంతవారికిన్

603. ఆ.వె. కాలయోగ మింత కలసి రాకున్నచో
బ్రతుక దెన్నిపాట్లు పడిన గాని

కలసి వచ్చు నపుడు కలకాలమైనను
బ్రతుకఁగలడు యత్న పరుడుగాక

604. . కావున నే భయంపడను, కాగలయట్టిది కాకయుండునే!
దైవమె సర్వమంచు దృఢ తత్వమునన్ మది నమ్మియుంటి, నా
దేవియె నాకు సౌఖ్యముల, దృప్తి నొసంగును, గాన నామెనే
భావమునందు నిల్పి కడు భక్తి భజించుచు నుందునెప్పుడున్.

605. మ. తన దుష్కర్మఫలమ్ములన్ దవిలి చింతన్ బొందుచున్, దానికిన్
మనుజుం డొక్క నిమిత్త మాత్రు నెడదన్ భావించుచున్ గర్తగా
ఘనవైరమ్మును బెంచుకొంచు మిగులన్ గష్టంబులన్ బొందు టె
ల్లను నజ్ఞానముగాదె, యిట్లునికిమేలా! సుంత యోచింపుడీ!

606. కం. సౌఖ్యములిచ్చిన మేలే
సౌఖ్యములటు లీయకున్న సంతోషంబే
సౌఖ్యమ్మునఁ బొంగుటయు, న
సౌఖ్యమ్మునఁ గ్రుంగి యుంట జరుగవు నాలో

607. మ. మది సంకోచములేక ధైర్యమును నిర్మాత్సర్యమున్ స్థైర్యమున్
గదురన్ బల్కిన యా సుదర్శనుని వాక్చాతుర్యమున్ మెచ్చుచున్
ముదముల్ జెందుచు వారి వారి భవనంబుల్ సొచ్చి యుత్సాహులై
హృదయంబుల్ శశిపైన నిల్పుకొని రేయింబుచ్చి రా రాట్సుతుల్

608. వ. అంత

609. తే.గీ. పద్మరాగంపు మణులను పలుచనైన
కావిగుడ్డనఁగట్టి సాగర విభుండు
ప్రాగ్దిశాసతికి మిగుల ప్రణయ రాగ
ముట్టిపడ నొసగెనన సూర్యుండు వొలిచె

610. ఉ. అంతట మంచి మూరుతమునందు స్వయంవర మంటపమ్మునం
దెంతయుభక్తిఁ బూజలొనరించి సుబాహుడు రాకుమారులన్
సంతస మొప్ప నెల్లరను సాదరపూర్వక వాక్యపద్ధతిన్
శాంతమనస్కుడై పిలిచె సమ్మతి మంటప సీమకయ్యెడన్





611. సీ. సువిశాల మంటప సుందర ప్రాంగణం
బమర సభాశోభ నలరు చుండ
చమ్కీలు, చాందినీల్ సౌరభ సుమమాల
లందమ్ముగా చుట్టు నమరియుండ
పన్నీరు లత్తరుల్ బరగ జవ్వాజియు
కలిపి చల్లిన నీటి గాడ్పులమర
కాంచన మణిమయ కమనీయ సింహాస
నముల యమరిక లానందమొసగ

గీ. సుందరీమణు లటనట సొంపుమీర
చామరల్ వీచుచుండంగ సరసగతిని
రాకుమారులు తమకు నర్హంబులైన
ఆసనములందుఁ గూర్చుండి రంచితముగ

612. కం. కన్నియ యెప్పుడు వచ్చునొ
మన్ననతో నెవరిఁ దాను మదిఁ గోరునొయం
చన్నరపాల కుమారులు
తెన్నులు గనుచుండి రపుడు తీవ్రాసక్తిన్

613. చం. శశికళ తా సుదర్శనుని సమ్మతితో వరియించెనేనియున్
భృశముగ సంగరంబె యగు పెంపులు దప్పునటంచు నయ్యెడన్
ప్రశమిత శాంతచిత్తులయి వారును వారును రాకుమారకుల్
నిశితగతిన్ దలంచుచు ననిశ్చితులై రతి సంశయమ్ములన్

614. వ. ఆసమయమ్మున

615. ఉ. మంగళ వాద్యఘోషము లమందగతిన్ గగనమ్ముముట్ట,న
య్యంగన మెల్లమెల్లగ స్వయంవర వేదిక నెక్కి తండ్రికిన్
చెంగట నిల్చె ముంగురులు స్నిగ్ధ ముఖాంబుజ సీమయందు సా
రంగములట్లు వ్రాలగ విరాజిత శారద చంద్రికంబలెన్

616. చం. మిలమిల లాడుచున్దనరె మేలి ముసుంగున జాలువాఱు న
య్యలికుల వేణి కంఠ గత హార వినిర్గత కాంతి పుంజముల్,

కలిత మధూక మాలికను గైకొని సాగరకన్యభంగి తా
నిలిచెను శంబరారి కరనీరజ శాత సుమాస్త్రమోయనన్

617. ఆ.వె. ఆ సుబాహు డప్పు డాత్మజన్ గనుగొని
పలికెనిట్లు మృదుల ఫణితి, నచట
సముచితాసనములఁ జక్కగ కూర్చొని
చూచుచున్న రాజసుతులఁ జూపి

618. చం. ఇరుగెడలందు రాకొమరు లెల్లరు భూరిమయాసనంబులన్
బరగ సువర్ణరత్నమణి భాసుర భూషణ భూషితాంగులై
యిరవుగ నున్న వారలదె యేర్పడఁ జూడుము పుత్రి! నీవికన్
వరునిగ నెన్ను కొమ్మిచటి వారల యందొకనిన్ నిజేచ్ఛమై

619. కం. అనవిని శశికళయును తా
జనకునిఁగని యిట్టులనియె సముచితరీతిన్
వినయానత గాత్రయగుచు
తనమనమున మెచ్చఁబోక తండ్రి పలుకులన్

620. మ. జనకా! వీరల వక్రదృష్టి పథముల్ సైరించి దర్శింప నే
మనమం దియ్యకొనంగఁజాల, క్షమియింపన్ వేడెదన్ వీర లి
ట్లనయంబున్ ననుఁ జూచుచుందురతి కామాసక్తితో జారిణిన్
గనుచున్నట్లుగ, నెట్లు సైపగల నింకన్ మీరు యోచింపుడీ!

621. తే.గీ. వరుడు గాదగు వానినే తరుణి యెపుడు
చూడఁదగు, నాతడే తగ చూడవలయు
నామె, నని ధర్మశాస్త్రము లనుచునుండ
తగునె నన్నిట్లు పురికొల్ప, దండ్రి! నీకు

622. మ. విరిదండన్ గొని నేనుకన్య నిటులన్ వేర్వేరుగానున్న యీ
నరపాలాత్మజులన్ గనన్ జనుటయన్నన్ యెంచి చూడంగ సు
స్థిర చిత్తంబొక యింతలేక విటులన్ జీరంగనేతెంచు దు
ర్భర వారాంగన రీతి యౌను గద! సంభావ్యంబె యోచింపుమా!

623. ఉ. నేను సుదర్శనున్ మదిని నిల్పితి, తక్కిన వారినెట్లు నా
మానసమొప్పు తండ్రి! యనుమానము లేదిది నిశ్చయంబు, మే





లైనముహూర్తమెంచి ననునాతనికిచ్చి వివాహయత్నమున్
బూనుము నాదు సౌఖ్యమునుఁ బొందుగఁ జూడ మదిన్దలంతువేన్

624. చం. అని తగురీతిఁ బల్కిన నిజాత్మజ పల్కుల కా సుబాహుడున్
మనమున సంతసించియును, క్ష్మాపతు లిందరు వచ్చియుండి, రే
మని వచియింతు వీరికిపుడంచు మనంబునఁదీవ్రదుఃఖ సం
జనిత నవీన వేదనలు సైపగ లేకఁ దలంచె నివ్విధిన్

625. ఉ. "అన్యుల మధ్యకున్ గుసుమ హారముఁగైకొని రానటంచు మత్
కన్యవచించె నిప్పుడిక కష్టమెయౌను స్వయం వరమ్ము రా
జన్యకుమారులార!" యని చాటిన నన్ బ్రతుకంగ నిత్తురే
సైన్యసమేతు లాహవము సల్పరె వీర లుదగ్ర కోపులై

626. ఉ. ఇందర నొక్కసారి యెదిరించగఁ జాలు చమూసమూహముల్
పొందగనైతి దుర్గబలముల్ మఱి యర్థబలమ్ములేవి? యే
చందమునన్ దలంచినను చాలను వీరినెదుర్కొనంగ, నే
నెందుల కేగువాడనిక నెద్దియుపాయము నాకు నిత్తఱిన్

627. తే.గీ. ఆ సుదర్శనుడైన నన్నాదుకొను న
టన్న, యొంటివాడును నిస్సహాయుడాత,
డింక దిక్కెది నాకిపు డేమిసేతు
కోరి దుఃఖముల్ గొని తెచ్చుకొంటినకట!

628. చం. అని యిటులాసుబాహు దసహాయుడునై మదిఁ గుందికుంది నె
ట్టన నొక నిశ్చయంబును నెడందఁ దిరంబుగ నిల్పి యెట్టు లై
నను నగుగాక దైవమిక నాకు సహాయ మొనర్చుఁ బొమ్మటం
చనుకొని తత్సభాసదుల నందరఁగాంచి నమస్కరించినన్

629. చం. తడవిటు లింతయయ్యెఁగద తామరసాక్షి యదేల రాదొకో!
యెడపక తండ్రితోఁ గలసి యింత రహస్యపు మాటలేమియో!
విడువని వాద్యఘోషముల వీనుల కెక్కవు వారిపల్కు లం
చడగిన యోర్పులన్ విసిగి రచ్చటి రాజకుమారులయ్యెడన్.

630. వ. ఆసమ యంబున సభామధ్యంబున కరుదెంచి

631. చం. పలికె సుబాహుడిట్లు నృపవర్య కుమారకులార! నెయ్యముల్
గలుగ వినుండు, నాయెడలఁ గల్గదు దోసమొకింతయేని, యీ
యలికులవేణి మత్తనయ యందరి ముందుకు రానుపొమ్మటం
చలుక వహించియున్న, దిటు లౌనని మున్ను నెఱుంగ నమ్ముడీ!

632. ఉ. తల్లియు నేనునున్ బలు విధమ్ములఁ జెప్పితి మైనఁగాని తా
నుల్లమునందు పట్టు విడకుండెను నేనిక యేమి సేయుదున్
కల్ల యటంచు నెంచకుడు, గల్గిన తప్పుకు నన్ క్షమించి, మీ
చల్లని చూపులన్ గనుడు సాగిలి పాదములంటి మ్రొక్కెదన్

633. ఉ. దాసుని తప్పులన్నియును దండముతో సరియంచు నెంచి యా
యాస మటంచుఁదల్పక మదర్పిత చందనగంధముల్ గృపో
ద్భాసిత చిత్తులై గొనుడు, ధన్యుఁనొనర్పుడు, దివ్యరత్నముల్
వాసిగ వారణాశ్వముల వస్త్ర చయమ్ముల నిచ్చిపుచ్చెదన్

634. ఉ. కానక కన్న కూతురిది, కాదని నేనిటు పట్టుపట్టినన్
ప్రాణ వియుక్తయైన నిక ప్రాణములుండునె నాదుమేన, నే
దీనుడ, మీకు నెల్లరకుఁ దెల్లముగా వచియించి తంతయున్
గాన నవశ్యమున్ జనుడు కాదనఁబోక ప్రశాంతచిత్తులై

635. తర. అనుచు దైన్యముతోడ వేడెడి యాతనిన్ గని యెల్లరున్
మనములన్ గడు సమ్మతించుచు మానవత్వము లేర్పడన్
వెనుకకున్ జన నిశ్చయించిరి వేగ సైన్యసమేతులై
ఘనగుణోన్నతులైనవారల కార్యముల్ దగనిట్టులౌ!

636. తే.గీ. అంత నాయుధాజిత్తు తామ్రాక్షుడౌచు
వ్రేటువడినట్టి యురగంపు విధము దోప
ఆజ్యధారల మిన్నంటు నగ్నికీల
యనగ లేచి యిట్లనియె తా నాగ్రహించి

637. శా. ఓరీ! మూర్ఖుడ! నంగనాచివలె మమ్మొప్పింపగాఁ జూతువా
నీరేజాక్షి ప్రవర్తనమ్ము మది సందేహింపలేవైతివే?
యారీతిన్ మము నెల్లరన్ బిలువ నీకెట్లొప్పెనో చెప్పుమా
చేరన్ బిల్చి పరాభవించితివి యిస్సీ మమ్ము దుర్బుద్ధివై





638. ఉ. వీరుల నిందరన్ వదలి వేరొక పంద కొసంగనెంచితే!
కూరిమి పట్టి యౌశశిని, కూడునె నీకిటువంటి కృత్యముల్
సైరణ సేయఁజాలనిది, చంపెద నిన్నును నా సుదర్శనున్
మేరలు మీరి వర్తిలిన, మీకిక నడ్డమెవండొ చూచెదన్

639. కం. నిను, నీసుదర్శనుని నే
గొనకొని వధియించి యిపుడె కూర్చెదపో, నా
మనుమడగు శత్రుజిత్తుకు
వనజముఖిన్ శశిని యెల్లవారలు చూడన్

640. తే.గీ. ఆ భరద్వాజు నాశ్రమ మందె మున్ను
నీ సుదర్శను శిరము ఖండించి యుందు
దైవ వశమున నమ్ముని తల్లజుండు
నన్ను వారింప, బ్రతికె తా నిన్నినాళ్ళు

641. ఉ. కన్నియ నిచ్చువాడు తనకంటె మహోన్నతుడైనవాని సం
పన్నునిఁజూచి యిచ్చుటయె పాడియగున్ నరనాథ! యిట్లు నీ
కన్నకుమార్తె నీతనికి కష్టగతిన్ ధనరాజ్యహీనుడై
యున్న సుదర్శనాఖ్యునకు నొప్పి యొసంగిన నేమి సౌఖ్యమౌ?

642. తే.గీ. కులము విత్తము రాజ్యము బలము గుణము
రూప యౌవనములఁ గడు రూఢికెక్కు
వరున కీయంగ వలయును వధువునంచు
శాస్త్రవాక్యమ్ము వినవె రాజన్య!నీవు

643. ఉ. కావున నీ సుదర్శనుడు కాదగ దల్లుడునీకు, నింతగా
నే వచియించుటెల్ల యునునీదు సుఖంబును గోరియే కదా!
నా వచనమ్ములన్ వినుము నచ్చిన వేరొక రాకుమారునిన్
దా వరియించునట్లు మదినాటగఁ జెప్పుము నీసుపుత్రితో

644. కం. నామాట వినకయుండిన
మోమోటంబేల నీదు ముద్దుల పట్టిన్
భూమీశులెల్లఁజూడగ
నేమియు సంశయములేక యెత్తుక పోదున్

645. కం. ఆపైన శత్రుజిత్తున
కీ పంకజనేత్రినిచ్చి యేజరిపింతున్
భూపాల! వివాహంబిక,
నేపగిది యొనర్పఁబూని తేర్పఁడఁ జెపుమా!

646. మ. కడు దర్పమ్మున నిట్లు వల్కు నవనీకాంతున్ యుధాజిత్తు న
ప్పుడు చూడంగ సుబాహుడెంతయు భయంబున్ బొందె లోలోన, నొ
క్కెడ దౌర్జన్యము నొక్కచోట మిగులన్ హేయంబులౌవాక్యముల్
దడియన్ జేయుచునుండ స్వేదములు విస్తారంబులై యేర్పడన్

647. కం. తనపట్టి స్వయంవరమిటు
లనుకొనని విధమ్ముతోడ నల్లరియైనన్
జనపతు లందరి ముందర
ననయము తలయెత్తి యెట్టు లరిగెద నింకన్

648. ఉ. "ఒక్క సుదర్శనున్ వదలి యొండొకనిన్ వరియించెనేని నే
నెక్కుడు సంతసింతు, వనజేక్షణ యాతనినే వరించినన్
నిక్కము యుద్ధమౌ నిదియు నిశ్చయ"మంచు వచించెనాత డిం
కెక్కడ దూకువాడ నిక యెయ్యది మార్గము నాకు నిత్తఱిన్

649. కం. వరియింతు సుదర్శనునే
నరపతుల నితరులను మది నచ్చను పొమ్మం
చరమరిక లేక పలికెడు
సరసిజ ముఖిశశియు పట్టు సడలక యుండెన్

650. మ. అని దుఃఖించుచు నాసుబాహుడపు డర్ధాంగిన్ సమీపించి యో
వనజాక్షీ! సమరంబు తప్పదిక సాప్రాణాలకే ముప్పువ
చ్చెను, నీవేయిక నాకు దిక్కు, పతికిన్ శ్రేయంబు గూర్పంగ జా
లిన భార్యామణి జన్మధన్యమగు, జాలిన్ జూపవే నాయెడన్

## శశికళా మాతాపితృ సంభాషణము

651. కం. అనవిని వైదర్భి యపుడు
తనపతికిన్ బ్రియము గూర్ప దద్దయు వేగన్





జని యిట్లని పలికెను నిజ
తనయున్ గని సంభ్రమమున తగిన విధమునన్

652. శా. తల్లీ! నీజనకుండు మానసమునన్ దైన్యస్థితిన్ బొంది యే
కల్లోలంబగునో యటంచు మిగులన్ కంగారుగా నుండె, నీ
వల్లన్ యుద్ధము సంభవించిన నికన్ వంశంపు మర్యాదలున్
కొల్లంబోవె నిజోర్వికిన్ శుభమె నీకున్ క్షేమమే చెప్పుమా

653. ఉ. కావున నీవు మాసుఖ వికాసము గోరెదు దానవైన నీ
భావమునన్ సుదర్శనుని పైగల మోహము వీడి యన్యునిన్
జేవగలట్టి వీరుని ప్రసిద్ధిగ నొక్కని నెన్ను కొమ్ము స
ద్భావముతోడ నీకును శుభంబగు మాకును చింత తీఱెడున్

654. సీ. నా మాట కాదని నీమది చొప్పున
నా సుదర్శను వీడ నందువేని
యా యుధాజిత్తిప్డె అతనిని ఖండించు
నపుడైన వేరొక్క నృపకుమారు
వరియింప వలె గాన వదలి వేయుము వాని
వరియింపు మన్యుని వరగుణాఢ్యు
నటులైన తప్పును నాహవంబిప్పుడు
నీదు సుఖము గోరి నే వచింతు

గీ. ప్రేమ మీరంగ నిను మేము పెంచినాము
ఒక్కగానొక్క బిడ్డవో యుత్పలాక్షి
మొండి సేయకు మమ్మ! నీ మొఱకుఁదనము
విడిచి సుఖమును శాంతియుఁబడయుమమ్మ

655. కం. తనతల్లి యీ విధంబున
ననునయమునఁ బల్కు పలుకు లాలించియుఁదా
వినిపించు కొనక యుండెన్
వనితలు తమ పట్టుదలలు వదలరు తలపన్

656. చం. అదిగని తండ్రియున్ మరల నర్మిలిఁ గూతునిఁ జూచి యెంతయున్
పదిలముగా వచించె తనభార్య వచించిన యట్లె, కానియ

మ్ముదిత తదీయ వాక్యముల పూర్ణముగావిని నిర్భయమ్మునన్
బదులిడె నొక్కనిశ్చయము భావమునన్‌దలపోసి తండ్రితో

657. మ. జనకా! మీరలు వల్కినట్టి పలుకుల్ సత్యంబె కావచ్చు నై
నను నా దీక్షయె నాకు ముఖ్యముగదా! నన్నేటికిన్ మీరలో
యనఘా! యిష్టములేని కార్యమున కిట్లంగీకరింపంగ బో
ధనలన్ జేయుచునుంటి రిద్ది తగునే ధర్మంబె యోచింపుడీ!

658. సీ. ఈ రాజలోకమ్ము నెల్లరం గనుగొని
భయముఁ జెందుట నీకు పాడిగాదు
ఆయుధాజిత్తున కాత్మలో వెఱగంది
యిట్టులంటివి గాని యెంచి చూడ
నా సుదర్శనుడు మీ యల్లుడౌటకు తగి
యుండడా యోచింపు మోర్మితోడ
ఇదె నాదు నిశ్చయ మెఱిగింతు వినుడయ్య
అతనిఁ గాదనిమెచ్చ నన్యపురుషు

గీ. నంతభయమైన ననువాని కప్పగించి
పట్టణమ్మును దాటించి పంపు మవల
జరుగనున్నది జరుగును జంకనేల
దైవనిర్ణయ మెట్టిన దాట వశమె

659. చం. అనిశశిపల్క తండ్రి తన యాత్మజ నక్కునఁ జేర్చి తల్లిరో!
వినవది యేల మేమిటుల వేయివిధంబులఁ జెప్పిచూచినన్
మనమున మొండిపట్టుదల మానక యుంటివి మీదికష్టముల్
గనుగొనఁ జాలకుంటివి సుఖంబిది యెట్టులొ లోఁదలంపుమా!

660. ఉ. ఇందర తోడ వైరమును నిట్టులఁ బూనుట సేమమౌనె నీ
డెందమునన్ దలంపుము కడింది బలాఢ్యులు చుట్టు ముట్టి మి
మ్మందరు నొక్కటన్ గలసి యాహవమం దెదురొడ్డి నిల్చినన్
పొందుగ నాసుదర్శనుడు పోరి జయింపగలాడె యొంటిగన్

661. ఆ.వె. అట్లు గాన తల్లి! అంగీకరింపుము
వేరు మార్గమొండు విశద పరతు





పణమునొకటి పెట్టి ప్రకటింతు నే స్వయం
వరము నిపుడు దాన భయములేదు.

662. ఉ. అప్పుడు నిన్ను తత్పణమునందు సుదర్శనుడే పరాక్రమం
బొప్పగ గెల్చినన్ మదిని యూఱటఁ జెందుము, తా నశక్తుడై
తప్పిన యొక్కవేళ, నిను తప్పక యోగ్యుడు వీరుడొక్కరుం
డెప్పగిదిన్ గ్రహింపగల డియ్యది నిశ్చయ మొప్పుకొమ్మికన్

663. ఆ.వె. శివధనుస్సు విరచి శ్రీరామ చంద్రుండు
జనకరాజసుతను గొనిన యట్లు
వీరుడెవ్వడైన వీర్యమ్ముఁ జూపించి
నిన్నుఁ గొనగ వచ్చు సన్నుతాంగి

664. ఉ. దాన వివాద మెంతయును దప్పును రాజకుమారులెల్లరున్
దీనికి సమ్మతింతు, రిక నీదు వివాహము వైభవమ్ముగా
బూని ప్రశాంతచిత్తమున భూపతులెల్లరు మెచ్చునట్లు స
మ్మానముతోడ సల్పెదను మానుము నీ మదిలో విచారమున్

665. చం. అనిజనకుండు వల్క శశియాతని పల్కుల కాత్మమెచ్చ కి
ట్లనియెను తండ్రితోడ ననఘా! భవదీయ హితోక్తులెంతయున్
వినుటకు చక్కనై యెసగు విజ్ఞత తోడుతనొప్పు, నైన నా
మనమున నాసుదర్శనుని మానక నిల్పితి సుస్థిరంబుగన్

666. ఆ.వె. అతని విడిచి యన్యు నాత్మలోగోరుట
కంటె పాప మొందు గలదె తండ్రి!
అది యసంభవమ్ము పదివేలు చెప్పిన
నన్యు నొల్ల నిశ్చయమ్ముసుమ్ము

667. కం. పాపములకు పుణ్యములకు
నేపగిదిఁ దలంచి చూడ నెల్లయుగములన్
భూపాలా! మనసొకటియె
యేపారున్ గారణమయి యిద్ధరలోనన్

668. చం. అనయము పుణ్యపాపముల నాత్మఁదలంచుచు వాని కార్యముల్
గొనకొని చేయకుండినను కూడి తమంతట తామెవచ్చు త

ధ్వన ఫలితంబు లెట్లయిన; కావున నిత్యము పాపచింతనల్
మనుజుడు చేయుటయ్యదె ప్రమాదమటంచు నెఱుంగు టొప్పగున్

669. ఉ. నన్ను పణంబువెట్టి నృప నందను లందరి ముందు నీవిటుల్
పన్నుగ మత్స్వయంవరము పద్ధతితో జరిపించి తేని, నే
నిన్నరపాల నందనుల కెల్లరకున్ వశమైన యట్లె యం
చెన్నుము నీమనంబున మహీశ్వర! మానుము తత్ప్రయత్నమున్

670. తే.గీ. పణమున నొకండె గెలిచిన బాధలేదు
మువురు నలువురు గెలిచిన మొదటి కెసరె
యౌను నదియును మూల మనర్థములకు
సంశయాస్పద కార్యముల్ జరుపనేల?

671. ఉ. కాన నొకింత సందియము గైకొనఁబోవక నన్ను నిప్పు డె
ట్లైనను నాసుదర్శనున కర్పణ సేయుము మీదికార్యమున్
దానొనరించు సర్వభువ నమ్ముల నేలెడి లోక మాత; దుః
ఖానల కీలలాఱవె తదంబిక నామము నుచ్చరించినన్

672. సీ. ఆది పరాశక్తి నాత్మలో స్మరియించి
ధైర్యమ్ముతో మీది కార్యమెల్ల
నడపింపుమోతండ్రి! సడియు చప్పుడులేక
జరుగఁగలదియెల్ల జరుపునామె
రాజ సభకు నేగి రాకుమారుల కెల్ల
ప్రాంజలించుచు స్వయం వరము తేపు
జరుగును విడుదుల కరుగుడిపు డటంచు
ప్రకటించి వారలఁ బనుపు మయ్య

గీ. అవల రాత్రికి మావివాహమ్ము మిగుల
వేడ్కఁ జరిపించి పంపుము వేదమంత్ర
విహిత మౌరీతి క్లుప్త మౌ విధముతోడ
ఆ సుదర్శను గూడి నే నరుగుదాన

673. ఉ. ఈ వనుకొన్న యట్టు లవనీశకుమారులు గూడి యొక్కటన్
చేవదలిర్ప సంగరము సేతకు నిన్నెదిరించిరేని శ్రీ





దేవియె సాయమైనిలుచు తేజమెసంగగ నాసుదర్శనుం
దేవిధి నైన వారల జయించును దైవసహాయ సంపదన్

674. కం. అని తన సుత పలుకగ విని
జనపతి ధైర్యమ్ముతోడ సరగునఁ జని తా
వినయమున రాకుమారులఁ
గనుగొని యిట్లనియె మోడ్చి కరయుగ్మమ్మున్

675. ఉ. రాజకుమారులార! మిము ప్రార్థనఁ జేతు స్వయంవరమ్ము నే
డే జరిపింపఁజాల విను డెల్లి శుభోదయవేళ వేడ్కమై
నే జరిపింతు, శాంతము వహించి మదర్పిత భాజనమ్ములౌ
భోజనముల్ గ్రహించి కడుపున్నెము నాకొనరంగఁజేయుడీ!

676. కం. రేపే ప్రకటింతును నే
నేపగిది స్వయం వరమ్ము నేర్పరతునొ? మీ
రోపిక పట్టుడు రాత్రికి
నాపైనన్ గృప వహించి నమ్మిక తోడన్

677. శా. నేడేమైనదొ యేమొ నాతనయ రానేరాను పొమ్మంచు తా
మోడిన్ వేయుచునుండె రేపటికి నామోదింపగాఁ జేతు న
న్నాడంబోవక నాదు విన్నపము యోగ్యంబంచు భావింతురేన్
దోడై యెల్లరు నేడు నిల్చుడిట సంతోషంబు చేకూర్చుచున్

678. వ. అనియిట్లా సుబాహుండతి దీనగతిం బ్రార్థింప

679. ఉ. వల్లెయటంచు పల్కుచు సుబాహుని వీడ్కొని రాజనందనుల్
మెల్లగ నేగి యెల్లరును మేలగువిందుల నారగించి తా
ముల్లములందు మెచ్చుచు పరుండిరి స్వప్న జగత్తులందు ను
త్ఫుల్ల దళాయతాక్షి వలపున్ దలపోయుచు రాత్రియంతయున్

## శశికళా సుదర్శనుల పరిణయము

680. ఉ. అచ్చట నాసుబాహుడును నార్యపురోహితులైన వారిచే
నిచ్చక మొప్ప నాత్మజ కహీన గతిన్ నిజమందిరమ్మునన్

నచ్చినరీతి పెండిలి వినమ్రతతో జరిపించె బంధువుల్
మెచ్చెడు రీతి కానుకలు మెండుగ నల్లునకిచ్చి గుట్టుగన్

681. ఉ. పెండిలి యైనయంతఁ గడు విజ్ఞత దోపగ నమ్రుడై సుబా
హుండు మనోరమన్ గదిసి యోరగ నిల్చి నమస్కరించి నే
కొండొక దాసుడన్ దమకు, కోరిక లింకను నేమి కోరెదో
దండి మనమ్ముతోఁ దెలిపి ధన్యునిఁ జేయుము నన్ను నాతిరో!

682. మ. అనినన్ గన్నుల మోద బాష్పములు నిండారన్ మదిన్ బొంగుచున్
దన వియ్యంకునిఁ జూచి యిట్లనియె నాతన్వీలలామంబు, నో
యనఘా! మీకు శుభమ్ములౌత! వర కన్యారత్నమున్ మా కుమా
రున కర్పించితి రింక యేమి వలయున్ రొక్కంబులున్ గిక్కముల్

683. శా. నే నిన్నున్ స్తుతియింపగన్ దగిన వందిన్ మాగధిన్గాను సు
మ్మైనన్ బంధుజనమ్ములన్ బొగడుటల్ న్యాయంబుగా దెన్నడున్
భూ నాధా! తమపుత్రికన్ గొనిన నాపుత్రుండు యోచింపగా
తానయ్యెన్ గనకాద్రి తుల్యుడవనిన్ దథ్యంబు వేయేటికిన్

684. తే.గీ. వీరు లైనట్టి రాజ కుమార వరుల
నెల్లరన్ గాదు కాదని యిచ్చకమున
రాజ్యహీనుడై దుర్భరారణ్య భూమి
సన్మునీంద్రుల యాశ్రమ స్థలములందు
కందమూలమ్ములన్ దిని కాలమెల్లఁ
గడపు వానికి నుత్తమ కన్యనిచ్చి
పెండ్లి జరిపించు టదియెంత పెద్దతనము
ఇంతకన్నను మాకింక యేమి వలయు

685. కం. ఇందరు బలవంతులతో
సందియ మొకయింత లేక సమరమ్మునకేన్
గొందలమందక పెండిలి
పొందుగఁ జరిపించుటెంత పుణ్యంబొక్కో!

686. కం. ఇంతటి మీసౌజన్యము
నెంతటికిని మరువఁ జాల నిద్ధచరిత్రా!





సంతసమగు మదికిని భూ
కాంతుడ! కైమోడ్తునయ్య కరకమలములన్

687. మ. అని యిట్లాయమ ప్రస్తుతింపగ మహాహ్లాదంబు సంతృప్తియున్
దనలోఁ బొంది సుబాహుడున్ మరల హస్తంబుల్ శిరంబానగా
వినతుండై ముకుళించి మ్రొక్కి పలికెన్ విఖ్యాతిగన్ దల్లిరో!
మనవిన్ జేసెద నొక్కమాట వినుమీ! మాఱాడఁబోకన్ గృపన్

688. కం. ఈ కాశీ రాజ్యంబున్
మీకిచ్చెద యేలుకొండు మెల్పున నింకన్
మీ కనుసన్నల నేనును
శ్రీకరముగ నిలిచి యుందు సేనాపతినై

689. ఆ.వె. అట్లుగాక యున్న నర్ధరాజ్యమునైన
నొసగు వాడ దీని కొప్పు కొనుడు
అడవులందు దుంప లాహారముగఁ గొని
యుండనేల రాజ్యముండ నిచట

690. చం. పడితిరి కష్టముల్ మిగుల ప్రాక్తన కర్మవశంబు చేత, మీ
రిడుములఁ బొందనేల యిక నీప్సిత భోగములెల్లఁ బొందుడీ!
జడియక రాకుమారులకు సొంతముగా విషయమ్ము నెల్ల నే
నుడివెద, నంతకున్ వినక నోరు మెదల్చిన సంగరమ్మె యౌ

691. ఉ. ఏ నొనరించినట్టి పని యెంతయు ధర్మమటంచు నెంచి భూ
జానులు, వారి పుత్రులును సవ్వడి సేయక వెళ్ళవచ్చు, లే
దేని రణంబొనర్చెద నహీనగతిన్, దుద గెల్పు నోటముల్
గాన వశంబె యిర్వురకు, కాగల దౌను విచారమేటికిన్

692. చం. అనవిని తా మనోరమయు నాత్మఁ గడుంగడు సంతసించి యో
జననుత! భీతిఁ జెందకుము సన్మతి నాజగదంబికన్ సదా
మనమున నిల్పి ధ్యానమును మానక చేయుము తత్కృపా రసం
బున విజయంబు సేకుఱును బొమ్ము సుఖాంతమె యౌధ్రువంబుగన్

693. శా. ఆ దేవీ కరుణాకటాక్షమున తానత్యంత తేజమ్ముతో
భూదేవుల్ మఱి మంత్రి పుంగవులు నామోదింప నాపుత్రు డా

మీదన్ రాజగు మాయయోధ్యకు, శుభమ్మే యౌను మాకింక, సం
వాదంబేటికి మీర లేలు కొనుడీ! వాసిన్స్వరాజ్యంబికన్

694. తే.గీ. ఆదిశక్తిని నిరతమ్ము నాత్మ నిలిపి
ధ్యాన మొనరించు కొనుచు మే మరుగువార,
మంతయును చక్కc బడునింక చింతయేల
పోయివత్తుము సెలవిమ్ము భూపవర్య!

695. వ. అనిపలికెనంత

696. తే.గీ. ఇడుము లనియెడి చీకట్లు గడచి పోవ
సౌఖ్యకాంతుల వెదజల్లు చందమొప్ప
నా మనోరమ యానంద మంద నంత
భాను డుదయించె ప్రాగ్దిశా భాగమందు

697. చం. ఇతరుల కింతయున్ దెలియ నీయక నంతి పురంబునందు తా
సుతకటు పెండ్లి చేసినను, చోద్యమదేమియొ, రాజపుత్ర సం
తతి కదియెల్ల తెల్లమయినన్, గములై వడిcజేరి రెల్ల రా
యతగతిcగ్రుద్ధు లౌచు నగరంబును వీడి పురోపకంఠమున్

698. ఉ. వారలలోనc గొందరు సుబాహుడొనర్చిన కార్యమందు నే
నేరము లేదు. యుక్తమని నెమ్మి దలంచుచు నేగిరంత; క్రో
ధారుణ నేత్రులై యతని నాతని యల్లుని సంహరించి య
వ్వారిజ నేత్రయౌ శశి నవారణ గైకొని పోదమంచు తా
మోరిమి! దప్పి కొందరట నుగ్ర గతిన్ జరియించుచుండగన్

699. ఉ. మంగళ వాద్యముల్ మొరసె మానిసి తేని గృహాంతరమ్మునం
దంగన లెల్లరున్గలసి యంపకముల్ జరిపించిరంత, హృ
ద్యంగమమై వివాహము సుఖాంతమునౌట సుహృజ్జనమ్ముతో
పొంగెడు వేడ్క నానృపుడు భూపతు లున్నెడకేగి నమ్రుడై

700. చం. కర కమలమ్ములన్ మొగిచి "క్షత్రియ వంశజులార! మీర లె
ల్లరును మనంబులన్ గృప దలంచి సహించి ముదమ్ముతోడ మా
పురమున కేగుదెండు కడు పున్నెము మీకగు, నా సుదర్శనున్
బరిణయ మాడె మత్తనయ పట్టును వీడక యెంతచెప్పినన్





701.తే.గీ. "ఇదియు నిచ్చా స్వయంవర మెల్లభంగి
నేను వరియింతు నామది కిష్టమైన
వాని" ననియామె నాతోడ వాదులాడ
నేమి చేయుదు నేనందు కిష్టపడితి

702. చం. ఇది యహితమ్మొ కాక హితమే యగునో యది నేనెఱుంగ, స
మ్మదమున కోప తాపములు మాని పురమ్మున కింకరందు నా
హృదయము తృప్తిc జెందుc గద! యెల్లరుc గూడిమదర్పితమ్ములౌ
సదమల భోజనంబులను చక్కగ గైకొని యేగు దెంచినన్

703. మ. అనినన్ రాజకుమారు లిట్లనిరి "యోగ్యంబైన కార్యంబు నీ
వనఘా! చేసితివయ్య! యింక దయసేయన్ వచ్చు మీ వీటికిన్
పనులేమైనను తక్కియున్న నెరవేర్పన్ బొమ్ము;మమ్మింతటన్
జననిమ్మింక" యనన్ సుబాహుడు మదిన్ శంకించుచున్ మెల్లగన్

704.చం. వెనుకకుcదిర్గి చూచుచు విభిన్న విధంబుల నూహసేయుచున్
జనియెనతండు నంత నృప సంఘములెల్లరు గూడి యొక్కటై
ఘనముగc జర్చ చేసిరట క్రౌర్యగతిన్ దగ మార్గ మధ్య మం
దనయము నాసుదర్శనుని యంతమొనర్చి గ్రహింపcదత్సుతిన్

705. తే.గీ. ఆ యుధాజిత్తు నందరు నగ్రగామిc
జేసి సైన్యమ్ములంగొని శీఘ్రు గతిని
ముని భరద్వాజు నాశ్రమంబునకు పోవు
మార్గమందున నిలిచిరి మాటువేసి

706. ఉ. అచ్చట వారణాసి పురమందు సుబాహుడు కూతునల్లునిన్
ముచ్చట దీరునట్టు లిరుమూడు దినంబులు వైభవమ్ముగన్
బుచ్చగc జేసె; నంతనట భూపతులెల్లరుc గూడి కుత్రతో
హెచ్చుగ నిల్చి యుండిరని యేర్పడ చారు లెఱుంగ జెప్పినన్

707. చం. అతడును జంకు లేక చతురంగ బలమ్ములతోడ నల్లునిన్
సుతను మనోరమన్ బనిచి శూర వరేణ్యుల నింకకొందరన్
చతురత తోడ వెంటc గొని సాగెను సాంద్ర వనంబులందు భూ
పతు లెదిరించిరేని తన పౌరుషమున్ బ్రకటింప నెంచుచున్

## సుదర్శన యుధాజిత్తుల సంగ్రామము

708. ఉ. అంతట నా సుదర్శను శతాంగము తీవ్ర రయంబునన్ దటిత్
కాంతుల జిమ్ముచున్ జనగ కానన భూముల; మార్గమధ్యమం
దెంతయు రోసమూని యెదిరించిరి శత్రు ధరాధి నాథుల
త్యంత పరాక్రమంబెసగ నడ్డము వచ్చి భయంకరార్భటిన్

709. ఉ. దాసిన వారిఁ జూచియు సుదర్శను డాత్మ నొకింత యేనియున్
గాసిలఁ బోక వాడియగు కాండములన్ ధనురాసనంబునన్
వాసిగఁ గూర్చి నిల్చె సుర వర్యుని భంగి నవక్ర విక్రమో
ద్భాసితుడై రణంబొనరుపన్ బెఱవారల గుండె లూడగన్.

710. ఉ. ముందుగ శత్రుజిత్తు తన మోముబిగించి శరాసనంబు, చే
నంది యిషుద్వయంబుఁ గొని యార్చుచు నేసె వడిన్ సహోదరున్,
పొందిక నా సుదర్శనుడు భూరితరోగ్ర నిశాత బాణముల్
గ్రందిల వ్రేసి ద్రుంచె పెఱ కాండములన్ గడు నేర్పు జూపుచున్

711. కం. తన మనుమనికి సహాయం
బొనరింపఁ దలంచి యంత నుగ్రుండై తా
కనలుచు డాసి యుధాజి
జ్జనపతి యొనరించె తీవ్ర సంగ్రామంబున్

712. వ. ఆయుధాజిత్తు తత్సమ యంబున

713. చం. సరగున వెంటవెంటఁబలు సాయకముల్ గడుతీవ్ర సంగతిన్
బరప; సుదర్శ నుండును వివర్ధిత చండ మహోగ్రరూపుడై
వెరవున వానినెల్ల వడి భిన్నముసేయుచు నుండె; నిట్టు ల
య్యిరువురు హెచ్చు తగ్గులొకయించుక లేక జయాభిలాషులై

714. చం. బవరము సేయుచుండగ సుబాహుడు చయ్యన నల్లువాని కా
హవమున సాయమేర్పడగ నచ్చటకున్ జనుదేర; "నాకు వే
రెవరి సహాయ మిందు వల దెక్కటినై యతి విక్ర మంబునన్
బవతుల నుక్కడంచెదఁ గృపన్ జను"డంచు వచించె నాతడున్





715. కం. అంతట సుబాహు దరిగిన
నంతక సముడౌచు నల్లు డాహవరంగం
బెంతయు భీతిల్లెడు గతి
పంతమ్మున విక్రమించి బవర మొనర్చెన్

716. తే.గీ. శత్రుజిద్యుధాజిత్తుల స్థైర్యమడగ
సంగరముసేయు నాసుదర్శనునిఁ జూచి
తక్కువారెల్ల చేష్టలు దప్పి యపుడు
ప్రేక్షకుల వోలె నిల్చిరి పెంపు సెడగ

717. వ. ఆసమయమ్మున

718. సీ. మందార సుమమాల లందమ్ముగా కంఠ
సీమన వ్రేలుచు చెలువు మిగుల
దివ్య కాంతులతోడఁ దేజరిల్లెడి సింహ
వాహనారూఢయై వాసిగాంచి
కోటి సూర్యప్రభల్ కొలువైన రీతిగా
ఘన విభూషలు మేనఁ గ్రాలుచుండ
నానా విధములైన నవ్వాయు ధమ్ములు
హస్త పద్మమ్ముల నమరియుండ

గీ. అరుణ దివ్యాంబరాంచిత, యాదిశక్తి
సకల భువనైకమాత, యా సమయమందు
నంత దూరాన కన్పించె నాకసమున
అద్భు తమ్మును నాశ్చర్యమావహిల్ల.

719. మ. కలయో! మాయయొ! విభ్రమంబొ! యిదినిక్కంబౌనొ! కాకుండునో
యిలపై నెన్నడు చూచి యుండముగదా! యీ దివ్యరూపమ్ము, ని
స్తుల తేజమ్మున వెల్గుచుండె ననుచున్ జోద్యంబుగా చూచుచున్
గలగన్ జొచ్చి రొకళ్లొకళ్ళితరులన్ గన్గొంచు నాభూపతుల్

720. మ. జగదంబన్ గని యా సుదర్శనుడు విశ్వాసంబునన్ మ్రొక్కి తా
నొగి తల్లిన్ శశిఁ గూడి మ్రొక్కుచు సుబాహున్ గూడ మ్రొక్కించి యొ

ప్పుగ పల్కెన్ వినుమయ్య! సుంతయు భయంబున్ బొందనింకేల య
చ్చుగ నాదేవియె దర్శనంబిడెఁ గదా! శోభాకృతిన్ బొల్చుచున్

721. కం. అనిపల్కి సుస్థిరమ్ముగ
మనమున శ్రీ కామరాజ మంత్రాక్షరమున్
గొనకొని నిల్పి సుదర్శను
డొనరన్ గడు భక్తి జపము నొనరించె నటన్

722. కం. అపుడతి భీకరమ్మయి దిశావలి యెల్ల ప్రతిధ్వనింప త
ద్రిపుతతి గుండియల్ వగుల తీవ్ర తరమ్ముగ సింహ వాహనం
బపర యుగాంత మేఘ జనితార్భటియోయన గర్జసేసె న
వ్విపిన మృగమ్ములెల్లఁ గడుభీతిలి పర్వగ నాల్గుదిక్కులన్

723. కం. ఆ సింహగర్జనము విని
వేసరిలెను శత్రుసేన వేయివిధములన్
గాసిలి వేదండాశ్వము
లోసరిలుచు పరువులెత్తె నురుగతి నపుడున్

724. కం. ఒక్కట ఝంఝూమారుత
మెక్కుడుగావీచి ధూళి యెగురుట కతనన్
దిక్కులు తెలియక సైనికు
లక్కట! నేత్రములు మూసి యట్టులెయుండన్

725. మ. తనసేనాపతిఁ జేరఁబిల్చి కడు నిర్ద్వంద్వంబుగా నా సుద
ర్శను డాలోచన చేసిపల్కె వినుడీ! సైన్యంబులంగొంచుఁ జ
య్యన నేతెంతము. దేవియున్ మనకు సాహాయ్యంబుగానిల్చెఁ బొ
మ్మనినన్ వేగమె స్యందనంబులును శీఘ్రాయత్తమై సాగినన్

726. కం. అంత యుధాజిజ్జనపతి
వింతగ నిలుచుండి యున్న వీరులఁగని తా
నెంతయుఁగ్రుద్ధుండై యపు
డంతక సముడౌచు బిట్టు నార్చి యిటులనెన్

727. శా. ఏమీ! మీరలు కుడ్యచిత్రముల యట్లీరీతి వీక్షించుచున్
మీ మీ చేష్టలు మాని యుండుట శుభంబే సుంతయోచింపుమా





సామాన్యుండగు నాసుదర్శనుడదే సంరంభుడై కన్యకన్
భూమీశాగ్రణు లిందరుండ నిటు గొంపోఁ జూచుటాశ్చర్యమౌ

728. కం. హరి వాహన యై వచ్చిన
హరిణాక్షిని గాంచి యిట్టులదరి పడితిరా!
హరి! హరి! పిరికిందనమును
సరగున విడనాడి వానిఁ జంపఁ గడఁగుడీ!

729. మ. అరయన్ సింహము పాలి సొమ్ముఁ గొనగా నాశించు గోమాయు వ
ట్లరవాయిన్ మదిఁ జెంద కీతడిదె కన్యారత్నమున్ గొంచు తా
నరెరే! పోయెడు నంచుఁ బల్కి యత దత్యంతాగ్రహోదగ్రుడై
శరవృష్టిన్ గురిసెన్ సుదర్శను పయిన్ శౌర్యాతిరేకంబునన్

730. ఉ. దానికి! జంకఁ బోవక సుదర్శనుడున్ ద్విగుణీకృతంబుగా
వేనకు వేలు బాణములు భీకర వృత్తిని వేయుచుండె, సుం
తైన నెడమ్ములేక; యపుడాతని చేతి శరాసనమ్ము ని
త్యానత మౌట చూడ నలరారె పరిస్ఫుట మండలాకృతిన్

731. కం. ఆతని దక్షిణహస్తం
బేతతిఁ బరికింప చెవికి నెంతయు దాపై
భాతిగ నగపడుచుండెను
చేతములలరంగ నెల్ల సేనలు చూడన్

732. ఉ. ఆ సమయంబు నందు జగదంబ విలాసముతోడ నింగి పై
హాసముసేయుచున్ రణమునట్టులె చూచుచు తెప్పపాటునన్
వేసె శరద్వయంబు కడు భీకర రావము లుప్పతిల్లగా
వేసరిసైన్య సంఘములు వీడ్వడి పర్వ ననేక రీతులన్

733. తే.గీ. అంబ విడిచిన బాణద్వయంబు దగిలి
శత్రుజిద్యుధా జిత్తులు సత్వరమున
నేల కొరిగిరి యూపిరుల్ గోలు పోయి
ఆ సుబాహుడు సంతస మంది యపుడు.

## సుబాహుడొసర్చిన దేవీస్తుతి

734. వ. దేవినిట్లని స్తుతియించె.

735. మ. కరపద్మమ్ములు మోడ్చి నమ్రత నమస్కారంబు గావించి యో
పరదేవీ! త్రిగుణాత్మ కుండనగు నే భావించి నాబుద్ధితో
నరయంజాలను నిర్గుణంబవగు నిన్నమ్మా! కడున్ భక్తి సు
స్థిరులై గొల్చెడి వారి కష్టముల నర్థిన్ దీర్తువెల్లప్పుడున్

736. మ. తెలిసెన్ నేడిటు నీ ప్రభావము కడున్ దివ్యంబునై యొప్పుచున్
వలంతిన్గాను స్తుతింప నీ మహిమలన్ వాగ్దేవివై నీవె యీ
కల రూపంబులలోన నుండ నిక నీకారుణ్యమున్ బొందలే
కెలమిన్ నిన్ గొనియాడ సాధ్యమగునే యిచ్ఛామతిన్ శాంకరీ!

737. చం. హరిహర పద్మ గర్భులు నిరంతరమున్ భవదీయ సద్గుణో
త్కరముల నాత్మనిల్పుకొని ధ్యాన మొనర్చుచు నుందు, రైన వా
రిరవుగ నేటికిన్ భవదహీన మహత్వ మెఱుంగరన్న, నే
నరయగ నెంతవాడను త్వదంఘ్రి సరోజ పరాగమేన్ గనన్

738. తే.గీ. ఎఱుగ సజ్జన సాంగత్య మింతదనుక
చిత్త శుద్ధియులేదు నిన్ జేరికొలువ
ఈ సుదర్శను డల్లుడై వాసిఁ గనుట
నీదు రూపమ్ము దర్శించి తీ దినమ్ము

739. ఉ. ధన్యుడనైతి నోజనని! తామరసోద్భవ ముఖ్య దేవతల్
మాన్యులు యోగి పుంగవులు మానక నిన్ దరిసింపఁ గోరి సౌ
జన్యులు నై తపించియును చాలరు నిన్గన, నట్టులుండ, రా
జన్యుడనైన నాకు నిటు సత్కృప దర్శనమిచ్చి బ్రోచుటన్

740. మ. ధన రాజ్యాది విహీనతన్ వనములన్ దారాడుచున్ గష్ట జీ
వనుడైయున్న సుదర్శనున్ గరుణఁ బ్రోవన్ జూచి యుద్ధావనిన్
తన శత్రు ద్వయమున్ వధించితివి, నిత్యంబీవు భక్తావళిన్
గని రక్షించెద వన్నమాట కిదె తార్కాణంబుగా నెంచెదన్





741. తే.గీ. భక్త జనముల కాపాడు భరముఁ దాల్చి
జనన మరణాది భయములఁ గనగనీక
వారి కీర్తుల దిక్కులఁ బర్వఁ జేయు
టదియె నీ నైజగుణమమ్మ! యనవరతము

742. కం. కదు భక్తి నాతడివ్విధి
జడియక స్తుతియింప సంత సంబున తా న
ప్పుడమి మగనిఁగని యొకవర
మడుగుము నే నిత్తు ననుచు నంబపలుకగన్

743. శా. అమ్మా! యేమని నిన్నుఁ గోరెదను బ్రహ్మాండ ప్రకర్షంబు లే
కమ్మై యొక్కట నిల్చినన్ సరిపడంగా జాలవేనాటికిన్
సుమ్మీ! నీదగు దివ్యరూపమునకున్; చోద్యంబుగానేడు నీ
విమ్మాడ్కిన్ గనిపించితింక యితరంబేలా! నినున్ గోరగన్

744. ఉ. ఐనను కోరు కొమ్మని దయా మతిఁ బల్కితి గాన నిత్యమున్
మానక నే మనంబున క్రమంబున నీ పయి భక్తి భావమున్
బూని వసించు నట్లు వరమున్ దయ సేయుము; దుర్గవైయికన్
మా నగరంబునన్ నిలిచి మాకు ముదంబును గల్గఁ జేయుమా!

745. ఉ. నన్నును నాదు వంశమును నాప్రజలన్ ధరణీ విభాగమున్
బన్నుగఁ బ్రోవుమమ్మ యెడఁ బాయకయిందె వసించి; దీనికిన్
మిన్నగ కోరనేమియును, మెల్పున నీకను సన్నలందె సం
పన్నత వారణాసి ధర వర్ధిలునట్టు లనుగ్రహింపుమా!

746. తే.గీ. అని సుబాహుడువేడ నయ్యంబయపుడు
వాని ప్రార్థనమాలించి వారణాసి
యందె వసియింతు నింకనే ననవరతము
ధరణియున్నంతదనుక సుస్థిరముగాగ

747. కం. అనిపల్క నాసుబాహుడు
తన మనమున సంతసించి తద్దయుభక్తిన్
వినమిత గాత్రుండై యా
జననికి సాష్టాంగ పడియె సంరంభమునన్

748. చం. అదిగని యాసుదర్శను డనంత ముదంబును బొంది భక్తి సం
పదలొదవన్ జగజ్జనని పాద సరోరుహయుగ్మమున్ మదిన్
వదలక నిల్పి శీర్షమును వంచి నమస్కృతులందఁ జేసి తా
పదిలముగానుతించె ననవద్యగతిన్ హృదయంగ మంబుగన్

749. చం. అవధులు లేవు తల్లి! భవదాదరవృత్తికి, భక్తబృందమున్
జవమునఁ బ్రోచు కార్యమున సాటి యొకింతయురారునీకు నే
దివిజ వరేణ్యులైన, నిది తెల్లము; దీనుడనైన నన్గృపా
ప్రవిమల దృష్టిఁ బ్రోచితివి ప్రాభవమొప్పగ సర్వకామదా!

750. చం. జగముల సృష్టిఁ జేయుచు ప్రశస్తిగఁ బుష్టి యొనర్చుచున్దుదన్
దగ విలయంబొనర్తు విది తావక నిత్యవిలాసమే యగున్
సగుణవు నిర్గుణంబవన సన్నుతి కెక్కిన నీమహత్వ మే
పగిది నుతించెదన్ పరమ పావని యజ్ఞుడ నీకు దాసుడన్

751. తే.గీ. నీవు చెప్పిన యట్టుల నేను చేయు
దెచటి కేగంగవలయు నో యెఱుగఁ దెల్పు
మమ్మ! నీయాజ్ఞ మేరకు నరుగు వాడ
అడుగు ముందుకిడను భవదాజ్ఞ లేక

752. చ. అనినఁ బ్రసన్నయై పలికె నాజగదీశ్వరి యోసుదర్శనా!
వినుమిక నీ వయోధ్య కతి వేగమె యేగి ప్రజానురంజకం
బున ధరనేలు మయ్యా! శుభముల్ గలుగంగల వింక; నీ ప్రజల్
ధన కనకాది భోగముల ధర్మయుతంబుగ నుందు రెల్లెడన్

753 సీ. అష్టమి నవముల నవల చతుర్దశి
తిథుల యందెల్లప్డు దీక్షతోడ
విధివిధానమ్మున వేడ్కతో నర్చనల్
జరిపింపుమిక మూడు సంధ్యలందు
శారద నవరాత్రు లారడమ్మున సల్పు
డాగమ శాస్త్రోక్తమైనరీతి
బహుళచతుర్దశి పర్వదినమ్మది
ప్రీతి పాత్రము నాకు పెంపెసంగ





గీ. నర్చనాదులు జరిపింపు డాదినమ్ము
చైత్ర మాషాఢ మాశ్వయుజమ్ము మాఘ
ముల మహోత్సవ ములఁ గడు మోదమలర
జరుపుచుండుడు ప్రతి యేట జరుగు శుభము.

754. తే.గీ. అని పలికి జగన్మాత తానాక్షణంబ
అక్కజంబుగ మాయమై యరిగినంత
పరుగు పరుగున వచ్చి భూపాల పుత్రు
లా సుదర్శునునకు భక్తి నంజలించి

755. చం. తెలియక మేము నీ యెడలఁ దెప్పతి కంపు టవజ్ఞ సేయగా
దలచితిమయ్య! మమ్ముల నుదారమతిన్ క్షమియింపుమయ్య! నీ
వలన మహేశ్వరిన్ గనెడి భాగ్యములబ్బెను మాకు నేడు; ధ
న్యులము సుదర్శనా! భవదనూన మహత్వమెఱుంగ శక్యమే

756. మ. నినురక్షింపగ లోకమాతయె యిటుల్ నేడాదృతిన్ వచ్చెనం
చనినన్ పృథ్విని నిన్నుమించి కడుపుణ్యాత్ముండొకండేనియు
న్గనిపింపండని మే మెఱింగితిమి! అజ్ఞానాంధకారమ్ముచే
నినుగుర్తింపము నేటిదన్క నకటా! నీ వెంత బోధించినన్

757. ఆ.వె. ఆది శక్తి యైన అయ్యంబయాజ్ఞచే
వచ్చితేనటంచు నచ్చికమున
నీవు చెప్పినట్టి నిజమెఱుంగక మూఢ
మతులమైతి మయ్యా! మాన్యచరిత!

758. కం. అరిషడ్వర్గము లనియెడి
యురు నక్ర తిమింగిలముల నుగ్రంబౌ సం
సరణాబ్ధిన్ మునిగిన మము
తరియింపగఁ జేయుమయ్య! దండి మనమునన్

759. తే.గీ. నీవ సర్వజ్ఞుడవు చూడ నిశ్చయముగ
మాకు శ్రీదేవి మహిమమ్ము ప్రాకటముగ
చెప్పి సరగున తరియింపఁ జేయుమయ్య!
సంసృతి విషాబ్ధి నుండి యో సదమ లాత్మ!

## సుదర్శనుడుచెప్పిన దేవీ మహిమ

760. చం. అని కడుదీనులై యడుగు నానృప నందను లందరన్ గృపన్
గనుగొని యాసుదర్శనుడు కామిత దాయిని యైన యీశ్వరిన్
మనమున సంస్మరించి బహుమాన పురస్కృత మంజు భాషలన్
దనర వచించె నిట్లని యుదారగతిన్ నమితోత్తమాంగుడై

761. ఉ. రాజకుమారు లార! వివరంబుగ తన్మహిమంబుఁ జెప్ప నం
భోజ భవాదు లేనియునుఁ బోలరటన్న వివేక హీనుడన్
నే జగదంబ తత్వమెటు లేర్పడఁ దెల్పుదు, నెంచి చూడ న
వ్యాజ తపః ప్రభావులకె యౌనెఱుగన్ నిజయోగదృష్టులన్

762. తే.గీ. అన్నిటికి మూలమై యొప్పు నాదిశక్తి
సత్వగుణమున లక్ష్మియై సకల జగము
లేలుచుండును నిరతమ్ము నెట్టి కొఱత
లేక సకల సంపద్విభ వైక యగుచు.

763. తే.గీ. ఆమెయే రజో గుణమున నఖిలసృష్టి
జేయుచు సరస్వతియనఁ బ్రసిద్ధి వడసె
విలయమొనరించుఁ దమమున విశ్వమెల్ల
అంతమున శ్రీమహాకాళి యనగ నొప్పి

764. కం. త్రిగుణ స్వరూపములతో
నగణితయైయొప్పి యిట్టు లాయావిధులం
దొగి వర్తిలు నాదేవియె
యగపడ దంతమున నిర్గుణాత్మస్థితయై

765.తే.గీ. గుణరహితయైన దేవిని కొల్చుటెల్ల
కష్టసాధ్యము కావున నిష్టమైన
సగుణ రూపమున్ గొలుచుటె సమ్మతమ్ము
నేను నిత్యమ్ము సేవింతు నియమగతిని
సాత్వికంబైన వైష్టవిన్ సవినయముగ.

766. చం. అనవిని రాకుమారులపు డాతనిఁ గాంచుచు నో సుదర్శనా!
వినుటకు చిత్రమయ్యెఁ గడు పిన్నవయస్సున నేగుదెంచి యా
వనముల నున్న నీ వెటు లుపాసన చేసి మహేశ్వరిన్ మదిన్
గనుగొనఁ జాలితో తెలియఁ గౌతుకముల్ జనియించె జెప్పుమా

767. తే.గీ. ఆదిశక్తిని తెలియుట కహరహమ్ము
నెట్టి మంత్రమ్ము జపియించి తెవరు గురువు
లెవ్వి నియమమ్ము లవియెల్ల యెఱుగఁదెల్పు
మయ్య!మాదు పుట్టువులు ధన్యమ్ములౌను

768. తే.గీ. అనుచు వేడిన నతడు ధరాధిపతుల
గాంచి యిట్లనిపల్కె భూకాంతులార!
ఒక్క మంత్రాక్షరంబిటఁ జిక్కెనాకు
నదియు కామ భీజాక్షరం బనుచునేను
తెలియ నైనను మదినిల్పి దీక్షతోడ
పదియు రెండేండ్లు నిరతమ్ముఁ బాయకెపుడు
భక్తి విశ్వాసములు మదిఁ బదిల పరచి
జపమొనర్చితి పూర్వ సంస్కార మొదవ.

769. ఉ. అంతకుమించి నేనెఱుగ నాజగదంబ గుఱించి, యాశ్రమ
ప్రాంతమునందు నున్న ఋషి వర్యు లొకింత తదీయ వైభవం
బెంతయు సంతసంబున వచింపగ వింటిని నంతెగాని యా
వంతయు లేదు నామహిమ యంచెఱిగింపగ సంతసించుచున్

770. చం. చనిరి నృపాల నందనులు సమ్మతి నాజగదంబ దివ్య ద
ర్శనమును గూర్చి పల్మరు విచారణ సేయుచు, నాసుదర్శనున్
ఘనముగ మెచ్చుకొంచు బలగంబులఁ దోడ్కొని; యాసుబాహుడున్
జనియెను కాశికాపురికి సైన్యసమేతముగా ముదంబునన్

771. కం. జననిన్ భార్యను గైకొని
చనెనంత సుదర్శనుండు సంతోషమునన్
తన నగరియౌ నయోధ్యకు
వినుతించుచు నంబమహిమ వేయివిధములన్

772. ఉ. అంతకు మున్నె యీవిషయ మంతయు చారుల వల్ల విన్న సా
మంతులు దండ నాయకులు మంత్రులు కోసల దేశవాసులున్

సంతసమొప్పకానుకలు సమ్మతిగైకొని వచ్చియిచ్చి పూ
బంతుల స్వాగతించి గొని వచ్చి రయోధ్యకు వారి ముప్వురన్

## సుదర్శనుడు లీలావతి నూఱడించుట

773. ఉ. అంత సుదర్శనుండు వడి నంతిపురంబును జేరి లోన నే
కాంతమునందు దుఃఖమతియై విలపించెడు పిన్నతల్లి క
త్యంతము భక్తి మ్రొక్కి క్షణమట్టులె చెంతన నిల్చి యామెకున్
స్వాంతము శాంతిలంగఁదగు సాంత్వన వాక్కులఁ బల్కెనివ్విధిన్

774. శా. తల్లీ! నేవధియింప లేదరయ నీతండ్రిన్ సుతున్ నమ్ముమా!
యుల్లంబందున నన్ను దోషియని నీ వూహింపఁబోకెన్నడున్
కల్లల్ గావు మదీయ వాక్యములు నిక్కం బామహాదేవియే
చెల్లన్ జేసెను వారిప్రాణముల, నిచ్చెన్ ముక్తి సామ్రాజ్యమున్

775. ఉ. కావున చింతిలన్ వలదు కాగలదెన్నడు కాకమానునే?
జీవుడు కర్మబద్ధుడయి చేకొనుచుండు శుభాశుభమ్ములన్
భావమునం దొకింతయును బాధపడందగ దెద్దిగల్గినన్
దైవము కారణంబు ఫలితంబుల కంచుఁ దలంచు టొప్పగున్.

776. తే.గీ. నిన్ను నాతల్లి నొకటిగ నేఁదలంతు.
భేద మిసుమంత యైనను లేదు తల్లి!
కాన దీవింపుమమ్మ! నన్ గరుణతోడ
తల్లు లిర్వురు నాకంచుఁ దలతునెపుడు.

777. ఉ. జీవుడు చెక్క బొమ్మవలె చేసిన కర్మను బట్టియాడునం
చీవు తలంపుమమ్మ! యిదియెల్ల యెఱింగినవారు దుఃఖిలన్
బోవరు, నేను మున్ సకల భోగములన్ విడనాడి తల్లితో,
చేవఁ దొఱంగి యుగ్ర వన సీమ వసించియుఁ బొంద దుఃఖమున్

778. తే.గీ. తాత వధియింపఁ బడగ నా తల్లి యపుడు
నన్ను పసివానిఁ గొని యరణ్యముల కరిగె
దోచుకొని రెల్ల ధనముల దొంగలచట
కట్టు బట్టలు మాత్రమే కడకు మిగిలె.





779. చం. తినుటకు తిండిలేక కదు దీనత నన్ బసి వాని చంకలో
నునుచుక నుస్సురుస్సురయి యోర్పు వహించి విదల్లుగూడి తా
వనములయందు గ్రుమ్మరుచు వన్యములన్ భుజియించుచున్ దుదన్
జనియెను నెట్టకేల కొక సన్ముని వర్యుని పర్ణశాలకున్

780. తే.గీ. అది భరద్వాజు నాశ్రమంబని యెఱింగి
లోని కరుగగ నందున్న మౌని వర్యు
డామె దుఃఖమ్ము నెఱిగి తా నాదరించె
అచటి మునులును మముఁ జూచి రాదరమున

781. తే.గీ. అట్టి సమయమ్ము నందైన నాత్మయందు
దుఃఖమును జెంద, నన్యుల దూఱనెపుడు
భోగ భాగ్యము లిప్పుడు పొంది తంచు
నింగి కెగయుటయును లేదు నేల విడిచి.

782. కం. నీవార భక్షణంబే
భావింపగ శ్రేష్ఠమౌను పావనమదియే
నీవరియన్నము తినువా
రేవారలు నైన స్వర్గ మేగుదురమ్మా!

783. తే.గీ. భోగ భాగ్యాలఁ దులదూగు పూరుషుండు
యముని పురమునకేగునం చార్యులనిరి
ఆర్జవమ్మున మానవుండహరహమ్ము.
ఇంద్రియాదుల నడచి జీవింపవలయు.

784. ఉ. మానవ జన్మదుర్లభము మానుగ నందును భారతాంబ గ
ర్భాన జనించు టెంతయును భాగ్యము కావున నిందు నెల్లరున్
బూని నిరంతరమ్ముఁగడు పుణ్యపు కార్యము లాచరించి వి
జ్ఞాన నిధానులై పరమ శాంతిని బొంది తరింపగా నగున్

785. తే.గీ. ధర్మ సాధన చేయ నీ ధరణియందు
మనుజ జన్మంబె యోగ్యంబు మదిఁ దలంప
తిర్యగాదుల కీధర్మ దృష్టి లేదు
దీని మరువంగ రాదెప్డు మానవుండు

786. ఉ. ఈ విధి ధర్మ సంగతుల నేర్పడఁ బల్కు మనోరమాసుతున్
భావము నందు మెచ్చుకొని బాధల నెల్లఁ దొలంగఁ జేసి లీ
లావతి పూర్వ సంఘటనలన్ దల పోయుచు సిగ్గు చెంది ధై
ర్యావహయై వచించె నిటు లాతనితో తలవంచి మెల్లగన్

787. చం. వయసున పిన్నవయ్యుఁ గడు భావ్యముగా వచియించి తయ్య దు
ర్నయమున నీదుతాతను రణంబున మజ్జనకుండు చంపి నీ
దయిన వసుంధరన్ మిగుల నక్రమరీతినిఁ బొంది మత్సుతున్
ప్రియమునరాజుఁ జేసి యొనరించెను మీకు మహాపరాధమున్

788. ఉ. ఆతని కృత్యముల్ దలచి నంతఁ గడుంగడు సిగ్గుగల్గు నే
నాతఁడి వారి కడ్డుపడ నైతి భయమ్మున;ఁ గాని యిందులో
నా తనయుండు కారణమనందగ, దైనను దోసమే యగున్
తాత యొనర్చు కార్యము లధర్మములంచు వచింపకుండుటన్

789. తే.గీ. ఏది యేమైనఁ గాని నే డిర్వురవని
గూలి రవ్వారి కర్మాను కూల గతిని
వారి కొఱకేను మదిలోన వగవనయ్య!
వగతు నెంతయు వారి నిర్వాకములకు.

790. కం. నీ పట్ల మత్సరంబును
కోపంబును లేవునాకు కూరిమి మీరన్
నే పుత్రుగ నిన్‌దలచెద
నా పాపము లెంచకయ్య నమ్మిక నికపై

791. ఉ. పోయిన రాజ్యమున్ మరలఁ బొందితి వా జగదీశ్వరీకృపన్
హాయిగ రాజ్యమేలుము ప్రజావళి మెచ్చగ; ధర్మకార్యముల్
సేయుము, మోదమున్ గలుగఁ జేయుము నాకును నీదుతల్లికిన్
నా యనుగుం గుమార! కరుణన్ పరదేవియు నిన్ను బ్రోచుతన్

792.ఉ. అనిపల్కు పిన్నతల్లికి
వినయమున నమస్కరించి వీడ్కొని యంతన్
తన మంత్రిపురోహితులను
గొని చనియెను తల్లికడకు కూరిమితోడన్





## కాశీ-అయోధ్యలలో దేవీమందిర నిర్మాణములు

793. చం. అట తన తల్లి యాజ్ఞఁ గొని యార్యపురోహితు లొక్కమూర్తమున్
బటు గతి నిర్ణయింప, చెలువంబగు నాలయ మొక్కటయ్యెడన్
దిటవుగ నిర్మితిన్ సలిపి దివ్య సువర్ణమయాసనంబు నొ
క్కటి రచియింపఁ బంపెను జగద్ధితబుద్ధి నమాత్యవర్యులన్

794. తే.గీ. అతని యాజ్ఞానుసారమ్ము నాలయమును
వేగ నిర్మింపఁ జేసి యా పిదప నందు
కనక సింహాస నమ్ము నక్కజముఁగొల్ప
రూప కల్పన చేయించి చూపిరపుడు
మంత్రిపుంగవు లెల్ల సంభావితముగ.

795. మ. స్థిర చిత్తంబున నా సుదర్శనుడు తత్ సింహాస నంబందు తా
పరదేవిన్ వరవైష్ణవిన్ నిలిపి దివ్యంబైన మంత్రమ్ములన్
బరగన్ విప్రులు సుస్వరంబున పఠింపంగన్ బ్రతిష్ఠన్ విధిన్
జరిపించెన్ బుధుదాన ధర్మములతో సంతర్పణల్ సేయుచున్

796. కం. ఆ దినము రాజ్యమంతట
వేదాధ్యయ నములతోడ వేడుక మీరన్
శ్రీదేవీ యుత్సవముల
భూదయితుడు జరుపఁ బంచె పొలుపు మిగులగన్

797. కం. మంగళ వాద్యమ్ములతో
సంగీతములెల్ల దిశల సంరంభమునన్
నింగినిఁ దాకుచు మ్రోగెన్
పొంగారెడు వేడ్క నచటి భూభాగమునన్

798. కం. ఆనాటి నుండి నిరతం
బానాటన్ బ్రజలకెల్ల నంబయె యిలవే
ల్పై నానావిధ సంపద
లేనాటన్ దఱుగ కుండ నిచ్చుచునుండెన్

799. చం. ఇనకుల నాధులౌ రఘుమహీశుడు, రాముడు, నా దిలీపుడున్
ఘనముగ రాజ్యమేలిన ప్రకారము సంతత ధర్మబద్ధుడై

యనయము నేలె కాదనక నర్థుల కోర్కెలు దీర్చుచున్సుద
ర్శన జననాథు డీతనికి సాటి యితండన కోసలావనిన్.

800. ఉ. అచ్చట కాశికాపురమునందు సుబాహుడు సైత మంబకున్
ముచ్చటఁ గొల్పు నాలయముఁ బొందుగ నిర్మితిఁ జేసి యంత నా
డచ్చట దర్శనంబిడిన యట్టులె యాజగదంబ రూపమున్
మెచ్చుగఁ జేయఁ బంచి యొక మేలగు లగ్నమునన్ బ్రతిష్ఠఁ దా
నిచ్చ నొనర్పఁ జేసె ప్రజలెల్లరు మెచ్చగ భక్తి యుక్తుడై

801. తే.గీ వాడవాడల వెలసెను వరుస నంత
నాలయమ్ములు దేవికి నంచి తముగ
నిత్యపూజల జరుపుచు నిఖిల జనులు
భక్త వరులైరి దేవి కా ప్రాంతమందు.

802. వ. శౌనకాది మహామునులారా! పైవిధంబున వ్యాసుండు దేవీ మాహాత్మ్యంబెఱింగించిన విని జనమే జయుడు మరల వ్యాసుని యిట్లభ్యర్థించె వినుండు.

## దేవీనవరాత్రులు

803. కం. దేవీ నవరాత్రంబుల
నేవిధమున చేయవలయు నె వ్విఫలితముల్
భావించి చెప్పుమయ్యా!
శ్రీవేదవ్యాస ముని వరేణ్యా! నాకున్

804. కం. అనియడిగిన జనమేజయుఁ
గని మునివరు డిట్లు పలికె కాలంబున నా
మనియు శరత్సమయంబులు
గన మనుజుల కెపుడు కష్ట కాలము లనఘా!

805. కం. యమదంష్ట్రలట్టు లవి రో
గములను గలిగించుచుండుఁ గావున జనులా
సమయమ్ముల నుత్సవములఁ
గ్రమమున శ్రీదేవి కొఱకుఁ గావింతు రిలన్





806. తే.గీ. వలయు సంభారముల మున్నె వరుసఁ గూర్చి
చైత్ర మందైన నాశ్వయుజమున నైన
ప్రథమ దినమున మొదలిడి భక్తితోడ
దేవి నర్చింప వలయును దీక్షఁ బూని.

807. సీ. సమతలమంటపం బమరించి దానిని
గోమయమ్మున మట్టిఁ గూర్చియలికి
దానిపై నొక వేది తగ నన్ని కొలతలు
బారెడైనను రెండు మూరలైన
నుండు నట్లొనరించి యొప్పుగ జగదంబ
పీఠమ్ము నందుంచి ప్రీతి తోడ
పూల తోరణముల పొలుపొందగా గూర్చి
పాల వెల్లిని పైన పదిల పరచి

గీ. వేద విదులైన విప్రుల నాదరించి
శుద్ధ పాడ్యమి మొదలు విశుద్ధమతిని
వేకువన లేచి స్నానాది విధుల జరిపి
వ్రతము నారంభమొనరింప వలయు భక్తి

808. సీ. శాంత స్వభావుల సద్బ్రాహ్మణుల నర్ఘ్య
పాద్యాది విధుల సద్భక్తి పూజ
సల్పి వినూత్న వస్త్రమ్ముల నిడి వార
లందొక్కరినినైన నైదుగురను
నైన తొమ్మిదిమందినైన మంత్రజపము
సేయంగ నియమించి చెలువు మీర
నాచారమును వీడ కార్జవమ్మునుగల్గి
నక్తమైనను నేక భుక్తమైన

గీ. స్వీకరించుచు నేకాగ్రచిత్తమలర
బ్రహ్మచర్యవ్రత నియమ పరుడునౌచు
పూజలొనరింప వలయు సద్బుద్ధితోడ
ననుదినమ్మును శాస్త్రోక్త మైన విధిని

809. ఉ. వేదికమీది పీఠమున వెల్లదనంపు నవీన వస్త్ర మా
చ్ఛాదన చేసి, దానిపయి చక్కని యాసనముంచి యందులో
మోదమెలర్ప నాల్గు బుజముల్గల యంబను సింహవాహనన్
శ్రీదను వేదమంత్రములచేఁదగ నిల్పవలెన్ బ్రసిద్ధిగన్

810. కం. కలశంబొక్కటి శుచియగు
జలములతోనింపి రత్నచాంపేయమణుల్
కలిగిన యవి యందునునిచి
వలనొప్పగ పంచ పల్లవముల నిడవలెన్
(మామిడి, నేరేడు, వెలగ, మాదీఫలం, బిల్వం) పంచపల్లవములు

811. కం. ముక్కోణపు కుండ మొకటి
చక్కగ నేర్పాటు చేసి సమ్మతితోడన్
దక్కక తొమ్మిది దినములు
నక్కుఱఁజరుపంగ వలయు నట హోమంబున్

812. తే.గీ. చివరి దినమున ప్రజలను చేరఁబిలిచి
అన్నసంతర్పణమును చేయంగవలయు
అట్లు చేసిన వారి కయ్యంబ కరుణ
శీఘ్రగతిఁగల్గు;మోక్ష సంసిద్ధియౌను

## కుమారీ పూజ

813. వ. ఇదికాక నిత్యమును కన్యలను యథాశక్తి నొకరి నుంచి తొమ్మండు
గురను నాహ్వానించి కుమారీ పూజ సేయవలయును అదియెట్లనిన

814. కం. కన్నియలకు వస్త్రములను
మన్ననతో నొసగి వేద మంత్రమ్ముల సం
పన్నతఁ బూజింపవలయు
పిన్నలనుచు మదిఁ దలపక ప్రియమారంగన్

815. కం. రెండేండ్ల వయసు నుండియు
నిండుగ పదియేడులున్న నిర్మలచిత్తల్
దండిగ నీ పూజలయం
దుండం దగ నర్హ లితరు లుండ ననర్హల్

816. వ. ఈ కుమారీ పూజయందు రెండేడ్లనుండి పదియేండ్ల వరకు వయసుగల
ఆడపిల్లలను వరుసగా కుమారి, త్రిమూర్తి, కల్యాణి, రోహిణి, కాళిక,
చండిక, శాంభవి, దుర్గ, సుభద్ర, అనునామములతో వ్యవహరింతురు.
వివిధ వయస్సులున్నవారు దొరకనిచో ఒకే వయసు వారినైనను
ఏర్పాటు చేసికొనవచ్చును. ఒక్కొక్కరిని పూజించుటవలన కలుగు
ఫలితములు చెప్పెదను వినుము.

817. సీ. దారిద్ర్య దుఃఖముల్ దలఁగి దీర్ఘాయువుల్
గలుగు కుమారిని కొలిచినంత
ధనధాన్య పుత్ర పౌత్ర సమృద్ధియు త్రివర్గ
ఫలముగల్గు త్రిమూర్తి భజన వలన
విద్యాభివృద్ధియు విభవమ్ములున్ గల్గు
కల్యాణిఁ బూజించు కారణమున
కాళికఁ బూజింపఁగలుగును విజయమ్ము
చండికాపూజ యైశ్వర్యమొసగు

గీ. శాంభవీపూజ మోహమున్ సలిపి నృపుల
వశమొనర్చుట కుపయోగపడెడి మందు
రౌద్రగతి దుర్గఁ బూజింప రణమునందు
శత్రు నాశన మౌను నిస్సంశయముగ

818. తే.గీ. సౌమ్యగతి దుర్గఁ బూజింప సౌఖ్యమబ్బు
రోహిణీపూజ లడగించు రోగములను
వాంఛితార్థ ప్రదాయి సుభద్రయౌను
అంబ ప్రతిరూపములటంచు నాత్మఁదలచి
కన్నియలఁగొల్చు భక్తి సంపన్నులకును

819. వ. మరియు నీకుమారీపూజకు సంబంధించిన స్తోత్రశ్లోకములు
చెప్పెద నాకర్ణింపుము

1. కుమారీ స్తోత్రము

శ్లో. కుమారస్యచ తత్త్వాని యాసృజత్యపి లీలయా
కాదీనపిచ దేవాన్ తాంకుమారీం పూజయామ్యహమ్

2. త్రిమూర్తి స్తోత్రము

శ్లో. సత్త్వాదిభిస్త్రిమూర్తిర్యా తైర్హి నానాస్వరూపిణీ
త్రికాల వ్యాపినీ శక్తి స్త్రిమూర్తిం పూజయామ్యహమ్

3. కల్యాణీ స్తోత్రము

శ్లో. కల్యాణ కారిణీ నిత్యం భక్తానాంపూజతానిశమ్
పూజయామిచ తాం భక్త్యా కల్యాణీం సర్వకామదామ్

4. రోహిణీ స్తోత్రము

శ్లో. రోహయంతీచ బీజాని ప్రాగ్జన్మ సంచితానివై
యాదేవీ సర్వభూతానాం రోహిణీంపూజయామ్యహమ్

5. కాళికాస్తోత్రము

శ్లో. కాళీ కాళయతే సర్వం బ్రహ్మాండం సచరాచరమ్
కల్పాంతసమయే యాతాం కాళికాంపూజయామ్యహమ్

6. చండికాస్తోత్రము

శ్లో. చండికాం చండ రూపాంచ చండముండ వినాశినీమ్
తాం చండ పాప హరిణీం చండికాం పూజయామ్యహమ్

7. శాంభవీ స్తోత్రము

శ్లో. అకారణాత్సముత్పత్తిః యన్మయైః పరికీర్తితా
యస్యాస్తాం సుఖదాందేవీం శాంభవీం పూజయామ్యహమ్

8. దుర్గా స్తోత్రము

శ్లో. దుర్గా త్రాయతిభక్తం యా సదా దుర్గతినాశినీ
దుర్జ్ఞేయా సర్వదేవానాం తాం దుర్గాం పూజయామ్యహమ్

9. సుభద్రా స్తోత్రము

శ్లో. సుభద్రాణిచ భక్తానాం కురుతేపూజితా సదా
అభద్ర నాశినీం దేవీం సుభద్రాం పూజయామ్యహం





820. తే.గీ. రోగములఁ గుందువారిఁ గురూపిణులను
కులవిహీనల, వికలాంగినుల, కులటల
వలన జనన మందిన బాలికలను, నిందు
పూజ సల్పంగరాదని బుధుల మతము.

821. సీ. బ్రాహ్మణకన్యలఁ బాటించి పూజింప
కార్యసంసిద్ధి శీఘ్రముగ నౌను
క్షత్రియ కన్యల సాదరమ్మున పూజ
సల్పిన వారికి జయముగల్గు
వైశ్యకన్యల శూద్ర బాలికలన్ బూజ
సల్పిన లాభమ్ము జరుగునంద్రు
బ్రాహ్మణుల్ క్షత్రియుల్ బ్రాహ్మణకన్యల,
బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కన్య

గీ. కలను వైశ్యులు, పూజింప వలయునంద్రు
నాల్గువర్ణాలకన్యల నయముతోడ
శూద్రు లర్పింపఁదగునంద్రు సూరివర్యు
లనుదినమ్మును నవరాత్రులందు భక్తి

822. కం. తొమ్మిది దినములు పూజల
నిమ్ముగ సలుపంగ లేని యెడ నష్టమినా
డమ్మను కాళిని నైవే
ద్యమ్ముల సంతృప్తిపరచి యర్చింపఁదగున్

823. గీ. ఆ దినము భద్రకాళిక యవతరించి
దక్షుడొనరించుచున్న యధ్వరమునెల్ల
ధ్వంస మొనరించెఁ గాన దివ్యంబటంచు
నెంచి దేవిని యర్చింతు రిష్టగతుల

824. గీ. అన్నిదినములు నుపవాస మాచరింప
శక్తి లేనట్టి వారలు భక్తిఁ గడమ
మూడుదినముల యందైన ముదముతోడ
పూజ సేయంగఁ దగు నేక భుక్తమూని

825. ఉ. దానము లెన్నియైనను వ్రతంబులు తక్కిన వెన్ని యేనియున్
దీనికి సాటిరావు కడుదివ్య ఫలప్రద మిద్దియొక్కటే
యౌను జగంబులందుఁ దగ నర్థ సమృద్ధియు మోక్ష సిద్ధియున్
మానుగఁగల్గు దీనిని క్రమంబునఁ బూని యొనర్చు చుండినన్

826. తే.గీ. ఆయు రారోగ్యములను విద్యాభివృద్ధి
పుత్ర సంతానమును రాజ్యభోగములను
బడయ వచ్చును దీనిని భక్తితోడ
నాచరించిన యత దెవ్వడైన జగతి

## సుశీలుడికథ

827. చం. నిరతము సత్యసంధుడును నిర్మల చిత్తుడు ధర్మశీలుడున్
పరహితసువ్రతుండునగు వైశ్యుడు మున్ వసియించుచుండె దు
ర్భర నిరుపేదయై సుగుణరాశియనందగి కోసలావనిన్
సరస గతిన్ సుశీలుడను సార్థకనామముఁ దాల్చి శాంతుడై

828. మ. తన దౌర్భాగ్యముతోడు నెక్కుడగు సంతానంబు చేకూరుటన్
వనమున్ జొచ్చి ఫలంబులున్ మరియు దుంపల్ దెచ్చి యవ్వారికిన్
దినగా నిచ్చుచు, చాలినంతఁగడు తృప్తిన్ బెట్టలే కట్టులే
దినముల్ పుచ్చు నతండు దైవమె యికన్ దిక్కంచు లోనెంచుచున్

829. తే.గీ. పెద్దకూతున కెట్టులో పెండ్లిసేయ
నల్లునిన్ గూడి యామెయు నిల్లు విడక
నచటనే యుండ నదిచాల దన్నయట్లు
పుట్టె వారల కాపైన పుత్రుడొకడు
పెరిగి యైదేండ్లబాలుడై తిరుగసాగె

830. చం. మనుమని యాకలిం గనుచు మౌనముగా నటులుండలేక కో
రినయది యీయగా తగిన రీతియుఁగానక వారి దుఃఖమున్
గనుగొనలేక కోపమున గట్టిగ దండన సేయ నాతడున్
వెనుకకుఁజూడఁబోక విలపించుచు దవ్వులకేగె పర్వునన్

831. కం. బాలుండెంతకు నింటికి
రాలేదని యెంచి వారు రాత్రింబవలున్
గాలించి వెదకి రైనను
తేల దతనిజాడ యెన్నిదినముల కేనిన్

832. మ. ఇది యిట్లుండ మరొక్క కూతునకు పెండ్లీడేర్పడన్ దానికిన్
పదు నొక్కేండ్లకు మున్ వివాహ మొనరింపన్‌లేక యున్నన్ ఫలం
బొదవన్ జాలదటంచు నెంచి యతడెంతో కుందుచున్ చేయ నె
య్యదియున్ దోచక యుండ బ్రాహ్మణుడొకండా వీధిలో గన్పడెన్

833. చం. అతనిని గాంచి వైశ్యుడు రయంబుననేగి నమస్కరించి యో
యతుల మహానుభావ! భవదాననమున్ దిలకించి నంత నా
వెతలను సర్వమున్ దమకు వేగమె తెల్పగ నిచ్చగల్గె స
న్మతి వినుమంచుఁదెల్పెఁ గడునమ్రత తచ్చరితంబు నంతయున్

834. ఆ.వె. తనదు దీనగాథ వినిపించి వైశ్యుడు
మరల పల్కె భూమి సురునిగాంచి
అయ్య! నాకు నింక నాశ లేమియులేవు
కోట్లు కూడఁ బెట్టు కోర్కెలేదు

835. ఉ. నాకును నాదు సంతతికి నాసతికిన్ బ్రతినిత్య మెక్కుడౌ
నాకలి తీరినన్ మనము నందు ముదమ్మును బొందు దయ్య! నా
పై కరుణించి యొక్కటి యుపాయముసెప్పుము, సర్వవిద్యలున్
మీకు మనోగతంబులు సుమీ! జలజాసనవంశ మండనా!

836. తే.గీ. మంత్రమైనను లేకున్న తంత్రమైన
శ్రేష్ఠమైనట్టి వ్రతమైన చెప్పుమయ్య!
అనుచు సాష్టాంగ పడియె నయ్యవని సురుని
పాదపద్మమ్ములన్ సోక ఫాలతలము

837. చం. అనికడు దీనుడై యడుగు నాతనిఁ గన్గొని బ్రాహ్మణుండు నె
మ్మనమునఁ జాలిఁ బొంది నియమంబును నిష్ఠయుఁ బూని యింకపై
ననయము చేయుమయ్య పరమాద్భుతమౌ నవరాత్రిపూజ లొ
య్యన జగదంబఁ గూర్చి యని యంతట తత్క్రమమెల్ల చెప్పినన్

838. చం. కదు సంతోషమునంది వైశ్యుడపు డక్కంజాత గర్భాన్వయున్
వడిఁబ్రార్థించి మహానుభావ తమరే ప్రాజ్ఞుల్ ననున్ దీనునిన్
గడు మూఢాత్ముని శిష్యుగాఁగొని మహా కారుణ్యభావంబు చొ
ప్పడ చేయింపుము తద్వ్రతంబు గురుభావంబొప్ప నాచే విధిన్

839. కం. అనియడిగిన వైశ్యున క
వ్వనజాసన వంశభవుడు పరమానందం
బున దేవీ మంత్రమ్మును
మును నుపదేశించి యంత పొలుపొందంగన్

840. కం. దేవీ నవరాత్రములం
దా వైశ్యునిచేత వ్రతము నానందముతో
నా విప్రుడు చేయించెను
నేవిధమగు కొఱతలేక యేకాగ్రమతిన్

841. తే.గీ. అంత ప్రతియేట నాత దత్యంతభక్తి
తొమ్మిదేండ్లట్లు వ్రతమును నమ్మిసలుప
తొమ్మిదవయేట నంబ సంతోషమంది
యెనిమిదవనాటి రాత్రి దర్శనమొసంగి

842. కం. కోరిన వరముల నొసగెను
తీరెను తనబాధలెల్ల దేవీ మహిమన్
చేరెను మనుమం డింటికి
కూరెను సంపదలు నింట కోకొల్లలుగా

843. ఉ. శ్రీరఘురాము డీవ్రతము చేయు కతంబున నేగదా! మహా
వీరులు వానరోత్తములు వెంబడిరా మును రావణాసురున్
బోర జయించి జానకిని పూతచరిత్రను దెచ్చె; నా జగ
త్కారిణి యండనుండ ఫలితంబుల కింక కొఱంతయుండునే

844. వ. అనియివ్విధంబున దేవీనవరాత్రి మాహాత్మ్యంబును గూర్చి
వేదవ్యాసుండు జనమేజయున కెఱింగించెనని సూతుండు
శౌనకాది మునులకుంజెప్పె.





845. కం. జయమగు నాజగదంబను
నయమునఁ బూజించు దేవ నరముఖ్యులకున్
జయమగును భాగ వతమును
భయభక్తులతోడ చదువు భాగవతులకున్

846. వ. ఇది శ్రీదేవీ కరుణాకటాక్షలబ్ధ విభవుండును కమలాంబా సుబ్బరాయుల ద్వితీయ పుత్రుండును కౌశికస గోత్రుండును అగస్త్యరాజ వంశోద్భవుండునునగు సుబ్బారావు కవి ప్రణీ తంబగు దేవీభాగవతమను మహాపురాణమునందు త్రిమూర్తుల గగనయానము, సర్వలోక సందర్శనము, త్రిమూర్తులకు దేవీ దర్శనము, త్రిమూర్తులు దేవిని స్తుతించుట, దేవియొనర్చిన తత్త్వోపదేశము, బ్రహ్మవివరించిన గుణ నిరూపణము, త్రిగుణముల సమ్మేళనము, సత్యవ్రతుని చరిత్ర, దేవీయజ్ఞ భేదములు, విష్ణువొనర్చిన దేవీ యజ్ఞము, సుదర్శనో పాఖ్యానము, సుదర్శన రాజపుత్ర సంవాదము, శశికళమాతా పితృ సంభాషణము, శశికళా సుదర్శనుల పరిచయము, సుదర్శన యుధాజిత్తుల సంగ్రామము, సుబాహు డొనర్చిన దేవీస్తుతి, సుదర్శనుడు చెప్పిన దేవీ మహిమ, సుదర్శనుడు లీలావతి నూఱడించుట, కాశీ అయోధ్యలలో దేవీ మందిర నిర్మాణములు, దేవీ నవరాత్రులు, కుమారీ పూజ, సుశీలుడి కథయు నను కథలు గల తృతీయస్కంధము.

**శుభం**



శ్రీదేవీ భాగవతము

# చతుర్థ స్కంధము

1. కం. శ్రీమన్ముకుంద వక్షో
భూమిన్ వసియించి మించు పూర్ణేందుముఖిన్
లేముల్ బాపెడు తల్లిని
కామితవరదాయిఁ గొల్తు కమలన్ విమలన్

2. కం. ఆతత పురాణ విజ్ఞుడు
పూతచరిత్రుండు మౌని పుంగవుడౌ నా
సూతుం డిట్లని పలికెను
ప్రీతిన్‌గని శౌనకాది విబుధ గణములన్

3. చం. మునివరులార! వ్యాస మునిముఖ్యుని వేదవిభాగునిన్ గనుం
గొని జనమేజయుండు తనకున్ గల సందియముల్ వినమ్రతన్
వినిచెను నొక్కటొక్కటి నివృత్తియొనర్పు మటంచు మానసం
బునఁ గడు సంభ్రమంబెగయ పూరువరాన్వయు డివ్విధంబునన్

4. మ. మును వైకుంఠుడు యాదవాన్వయమునన్ బూర్ణావ తారుండునై
జననంబందెనటంచు వింటిని ప్రశస్తం బైన కృష్ణాఖ్య; నో
యనఘా! తన్మహనీయ వృత్తమును నాద్యంతంబు మోదంబునన్
వినగా కోర్కెజనించె నాకిపుడు సంప్రీతిన్ వచింపంగదే!

5. కం. కారాగారంబున నే
కారణమునఁ గంసుడుంచె కాలపురుషునే
కూరిమిసుతుగాఁ బడసిన
వారిన్ దేవకిని మరియు వసుదేవాఖ్యున్

6. కం. వారల కుదయించిన సుతు
లారుగురన్ గరుణలేక అంతమొనర్పన్
కారణమేమిటి కంసున,
కోరిమితో చెప్పుమయ్య యురు తత్త్వజ్ఞా

7. కం. అష్టమ గర్భోద్భవు, దు
ర్ఘేష్టలు నేర్వంగలేని చిన్నకుమారున్





కష్టగతిన్ వసుదేవుం
డిష్టంబుగ గొల్లపల్లె కెందుకు చేర్చెన్

8. కం. వారలకొక యాడ శిశువు
కూరిమి జన్మించినంత క్రూరంబుగ తా
చేరువఁ జని యాకంసుం
డేరీతి వధించె తెల్పు మేర్పడ ననఘా!

9. ఉ. ఆ పసిబిడ్డ యెవ్వతె వియత్తల మందొక యోగమాయగా
రూపముదాల్చి యంతట నిరూఢిగ కన్మరుగయ్యెనంట, ల
క్ష్మీపతి లీలలెవ్వి? యదుసింహుని వంశమదెట్లు విప్ర శా
పోపహతంబుఁ జెందెఁ గడు నోరిమి నాకివియెల్ల దెల్పుమా!

10. తే.గీ. ఇంతయేటికి వైకుంఠు డేల ధరణి
నవతరించెను బాల్యమున్ యౌవనమ్ము
నెట్లుగడిపెను నవతార మే విధాన
ముగిసె నివియెల్లఁ దెల్పుమో మునివరేణ్య!

11. మ. వరసంజాతులు కృష్ణభక్తులు రణవ్యాపారపారీణులున్
ధర నప్పాండుతనూజు లెల్ల, రదియున్ దథ్యంబు, నవ్వారికే
కరణిన్ గల్గె ననేక కష్టములు తత్కాంతామణిన్ ద్రౌపదిన్
గురు నాధుండటు నొంప చిత్తరువులై కూర్చుండనేలా పతుల్

12. మ. కడు ధర్మజ్ఞులు సత్పథానుచరులౌ కౌంతేయు లట్లేలొకో
జడియంబోవక ద్రోణ భీష్ములను రోసంబూని మోసంబునన్
వడిఖండించిరి నశ్వరంబయిన యైశ్వర్యంబుఁ గాంక్షించి, య
య్యెడఁగృష్ణుండును సమ్మతించుటది యెంతేఁ జిత్రమౌనెంచగన్

13. మ. ధర విచ్ఛిన్నముఁ జెందు మాకులము నౌదార్యంబునన్ నిల్పితో
పరమర్షీ! మును నీవ; నేడదియె నిర్భాగ్యస్థితిన్‌బొంది యూ
పిరు లెట్టెట్టులొ పట్టి యుండెఁ గడునిర్వేదంబునన్; మానసం
బెరియున్ మద్గురు నీచకృత్యమది యూహింపంగ రేయుంబవల్

14. ఆ.వె. తపముఁజేసి కొనుచు తన ధర్మమున నుండు
మునికి హాని సలుప జనకుడెట్లు

పాలుపడె నటంచు పరిపరి విధముల
కలతఁ జెందుచుందు తలపునందు

15. వ. కావున మహానుభావా! నామనంబున ననయంబుఁ బొడమునిట్టి సంది
యంబులందీర్చి నన్నుఁ గృతార్థుంజేయుమని యడిగిన జనమేజయుం
జూచి కృష్ణ ద్వైపాయనుండిట్లు పలికె

## కర్మనుగూర్చిన వ్యాసుని ప్రబోధము

16. ఉ. ఏమని చెప్పుదున్ గురుకులేశ్వర! జీవులు కర్మబద్ధులై
వేమరు జన్మలెత్తుచు విభిన్నగుణమ్ములతో జగమ్ములన్
దా మొనరించు కర్మలకుఁ దగ్గ ఫలంబులఁ బొందు చుందు రిం
కేమియు లేదు; కార్యముల కెల్ల స్వకర్మలె కారణంబులౌ

17. తే.గీ. కర్మగతి విలాసములు సూక్ష్మమ్ము లరయ
దివిజులైనను దీనిని తెలియరనగ
మానవులకౌనె సాధ్యము దీనిఁ దెలియ
కర్మవలననె దేహముల్ గలుగుచుండు

18. కం. పుణ్యములని పాపములని
పుణ్యాపుణ్యమ్ము లనియు ముప్పిధములచే
గణ్యంబగు నీకర్మ ల
గణ్యంబులు జగములందు కౌరవనాథా!

19. కం. సంచితములు ప్రారబ్ధము
లెంచగ నాగామి లనగ నీజగముల ప్రా
పంచిక కర్మము లొప్పును
పంచుచు సుఖదుఃఖ తతిని ప్రాణులకెల్లన్

20. తే.గీ. జరయు, రుజయును, శోకమ్ము, సంతసమ్ము
కామమాదిగ శత్రు వర్గమ్ములెల్ల
దేహగత గుణములను సందేహమొదవు,
కాని కర్మలే వీనికి కారణములు





21. ఉ. స్థావర జంగమాత్మక విశాల జగంబులలోన నెప్పుడున్
భూవర! యెల్ల జీవులును పుట్టిన దాదిగ గిట్టుదన్క నే
యేవిధులన్ జరింతు రవియెల్లను కర్మ ఫలంబులంచు నీ
భావమునం దెఱుంగుము నిబద్ధిగ బ్రహ్మపిపీలికాంతమున్

22. కం. కర్మంబనాది నిధనము,
కర్మంబది నిత్యమయ్య! కలకాలంబున్
మర్మంబెఱిగిన వారికి
కర్మలు బంధములుఁ గావు కౌరవనాథా!

23. తే.గీ. మాయలోపలఁ జిక్కిన మనుజులకును
కాని పించును సత్యమై కలజగమ్ము
నిత్యకారణ మీ మాయ నిఖిలమునకు
కారణంబుండ కార్యముల్ గలుగకున్నె

24. మ. త్రిజగద్వంద్యుఁడు శేషశాయి యురు దైతేయాంతకుం డైన పం
కజ నాభుండె వికుంఠ భోగవితతిన్ గాదంచు మత్స్యాదియో
నిజుడై పల్మరు సంచరించెనననన్ నిందాస్తుతుల్ బొందుచున్;
నిజకర్మంబె తదీయకారణమగున్ నిక్కంబు యోచించినన్

25. మ. మలమూత్రాది పదార్థ పంకయుతమున్ మాలిన్యమున్ ధ్వాంతసం
కలితంబున్ గద గర్భవాస; మది యోగ్యంబంచు నెవ్వారలేన్
గల నైనన్ మదిఁ గోరు కొందురె?,యికన్ గారాగృహంబెద్దియేన్
గలదే దానికి మించి ముజ్జగములన్ గౌరవ్యవంశోత్తమా.

26. చం. యమపురిఁ బోలు గర్భమున నంగములన్ ముకుళించి యెట్టులో
శ్రమమున మాసముల్ గడచిరాగ భువిన్ బడి శైశవస్థితిన్
క్రిములును కీటకంబులు పొరింబొరి స్రుక్కగఁ జేయ నేడ్చుచున్
గ్రమమున క్షుత్పిపాసలకుఁ గందెడి దుస్థితి యెంతహేయమో!

27. తే.గీ. కాన విజ్ఞులు మరల నీగర్భవాస
మెన్నడున్ గోర, రందు నేమున్నదనుచు,
నట్టిచో విష్ణుమూర్తి తానవతరించు
టెల్ల కర్మప్రభావమం చెఱుగుమయ్య!

28. చం. జగముల సౌఖ్యముల్ మఱియసౌఖ్యములున్ సతతంబు మానవుం
డొగి మదిఁ గోరి నంత తలయూపుచు వచ్చుట కవ్వి తత్కర
స్థగితములే; తలంపుమ! భృశంబుగ జీవులకెల్ల నెల్లెడన్
దగులుచు వీడుచుండు నవి తత్కృత కర్మఫల ప్రదంబులై

29. చం. తపములు దానధర్మములు ద్రవ్యమయంబగు యజ్ఞయాగముల్
నృపవర! స్వర్గసౌఖ్య సరణిన్ గలిగించును; నంతకంతకున్
వ్యపగత పుణ్యుడౌనెడ ధ్రువంబుగ మానవ లోకమందు తాఁ
గృపణత పుట్టుచున్ మరల గిట్టుచునుండు మహేంద్రుడేనియున్

30. సీ. దశరథ రాముడై ధాత్రిజన్మించిన
పద్మాక్షునకు సాయపడగనెంచి
వానర వీరులై వరుస జన్మించిరి
దివిజ గణములెల్లఁ తేజమెసగ
వసుదేవపుత్రుడై వర్ధిల్లు కృష్ణున
కనుచరగణములై యమరులెల్ల
యాదవవంశమం దసహాయశూరులై
జన్మించి మిగుల ప్రశస్తిఁ గనిరి

గీ. యుగయుగమ్ముల ధర్మమ్ము నుద్ధరింప
జన్మలెత్తుట వెన్నుని సహజగుణము
నంద నందనుఁ గూర్చి వినంగ మదిని
కోరితివిగాన వినుమయ్య కువలయేశ!

## దేవకీ వసుదేవుల చరిత్రము

31. తే.గీ. కమల గర్భుని మనుమడౌ కశ్యపుండు
మున్ను యజ్ఞమ్ము సేయుచు ముదలఁ గొనక
వరుణదేవుని గోవును పట్టితెచ్చె
విషయమెఱిఁగిన యాతండు వేగవచ్చి

32. చం. సురభినొసంగు మయ్య! యనుచున్ బ్రతిమాలిన నైన నమ్మునీ
శ్వరు డొకయింతయేని మది సందియ మందక దాని నీయ నం





చురువుచుఁ బల్క నవ్వరుణు డుగ్రగతిన్ గడు కోపమూని యు
ర్వర జనియింతు వీవు వ్రజ పాలుడవై యిక నిశ్చయంబుగన్

33. ఉ. నీ సతు లిర్వురున్ వరుస నీ వెను వెంటనె మర్త్యకాంతలై
వాసిగ జన్మమెత్తెదరు పాడిఁ దొఅంగి మదీయ ధేనువున్
వేసటఁ బెట్టి తెచ్చితివి బిడ్డలకున్ గడు దవ్వుసేసి; య
ట్లే సుతశోక మెక్కుడయి యేడ్చెద వీవును తథ్యమాపయిన్

34. కం. అని శాపమిచ్చి వడివడి
జని వరుణుడు విషయమెల్ల సాంతమ్ముగ తా
వినిపించె బ్రహ్మ కంతట
తన మనుమని పిలిచి నలువ తగ నిట్లనియెన్

35. చం. వరుణుని గోవునేల గొని వచ్చితి వియ్యది నీకు ధర్మమా!
పరమ భయంకరమ్ముఁ గడు పాపపు హేతువునైన లోభమున్
సరగున వీడు మంచుఁ గడు సౌమ్యగతిన్ హితమున్ వచించి తా
మరల శపించె నట్లె తనమన్మని పృథ్విజనించు నట్టులన్

36. కం. దితియును నదితియు ననగా
సతులు గలరు కశ్యపునకు సతతము వారల్
పతిభక్తిఁ గలిగి యుండియు
ప్రతి విషయమునందు కలహపడుచు మెలగుచున్

37. కం. దినములు పుచ్చుచునుండన్
వనితామణి యదితి గర్భవతియై యటుపై
దినకరతేజుని నింద్రుని
తనయునిగాఁ బొంద, దితియు దైన్యముతోడన్

38. చం. తనపతిఁ జేరి దుఃఖ పరితాపమునన్ బదయుగ్మమంటి యో
యనఘ! మహేంద్రతుల్యుడగు నాత్మజు నొక్కని నాకునిమ్ము నే
మనమున సంతసింతునన మౌనియు సమ్మతిఁ దెల్పి నీకునున్
తనయుడు గల్గు నింద్రునకుఁ దగ్గ పరాక్రమశాలి పొమ్మనెన్

39. కం. అనిపల్కి యామె గర్భం
బున తనవీర్యమ్మునునిచె ముదితయు నంతన్

దినదినము తేజమెసగగఁ
గనిపించెన్ వృద్ధినొందు గర్భము తోడన్

40. చం. అది గమనించి యయ్యదితి యాత్మఁ గడుంగడు నీర్ష్యఁ జెంది య
మ్మదితకు పుత్రుడొక్కరుడు పుట్టుటకున్ మదినోర్వలేక తా
నదను నెఱింగి యొక్క దివసాంతమునన్ దనపుత్రు నింద్రునిన్
గదిసి కుమార! నా సవతిగర్భము భిన్నమొనర్పు మీవనెన్

41. తే.గీ. పుట్టి పెరిగిన మీదట పోరనేల
యుదరమందున్న శత్రువు నుక్కడంచి
సౌఖ్యమందుము పుత్రకా! శంకలేక
గోటితో పోవుదానికి గొడ్డలేల

42. కం. క్షయరోగమువలె శత్రువు
రయమునఁ బెంపొంది మిగుల రాయిడి పెట్టున్
దయఁబూనక యిదికడు దు
ర్నయమని యనఁబోక చంపిరమ్మిక వానిన్

43. చం. అని తన తల్లి పల్క దివిజాధిపు డద్ది యవశ్య కార్యమౌ
నని మదినెంచి వల్లెయని యమ్మను వీడ్కొని భక్తి యుక్తులున్
దనరగ నేగి యాసవతితల్లి పదద్వయ మంటి మ్రొక్కి యో
జనని! శుభంబె నీకు కడు సంతసమొప్పచరించు చుంటివే!

44. కం. చూలాలివైన నీవిటు
లేలా కడునీరసించి యెల్ల విధములన్
దూలుచు నుంటివి నినుఁ గని
జాలిన్గొని వచ్చితమ్మ! సలుపగ సేవల్

45. కం. పరమ పతివ్రతవగు నీ
చరణంబుల పూజసల్పు సత్కృతికన్నన్
కరమెక్కుడైన పున్నెం
బరయన్మఱి యొండు గలదె యంభోజాక్షీ!

46. కం. నా తల్లియట్లె నిన్నును
నే తలచెద నమ్మ! నిజము నీ సేమంబే





చేతంబున మఱిమఱి వి
ఖ్యాతిన్ దలపోయుచుందు మమ్మయు నేనున్

47. తే.గీ. అనుచు వినయంబు నటియించి యమరనాధు
డామె చెంతనఁ గూర్చుండి యల్ల నల్ల
చరణములు పట్టి యొత్తుచు చల్లనైన
పల్కులను బల్కుచుండగ పరవశమున

48. ఉ. ఆతని పల్కులన్నియు యథార్థములంచుఁదలంచి యామె సం
ప్రీతినిబొంది నిద్రగొనె మెల్లన నంతట యోగవృత్తి సూ
క్ష్మాతి తరంపు రూపమున నయ్యమ గర్భమునందు వజ్రమున్
చేత ధరించి చొచ్చె కడు శీఘ్రగతిన్ సురనాధుడయ్యెడన్

49. కం. చని తన వజ్రాయుధమున
జననీ గర్భమున నామిషంబును బోలెన్
గనపడు బాలుని తమ్ముని
నెనరూనక సంహరించె నిర్భీతుండై

50. కం. ఖండించె నేడు గతులన్
పిండంబును, నంతఁబోక ద్వివిధంబులుగా
ఖండించె మరల నొక్కొక
ఖండమ్మును పదియునాల్గు ఖండమ్ములుగన్

51. కం. ఈ పదునాలుగు ముక్కలు
నేపుగ దితికుద్భవించి యిరవుగ జగతిన్
దీపించి రెల్ల యెడలను
నాపైన మరుద్గణమ్ములన విఖ్యాతిన్

52. కం. తన యుదరగోళమున ని
ట్లనుకొనని విధమ్ముతోడ నలజడికలుగన్
కనుయుగముఁదెరచి మెల్లన
కనుగొనె సురనాధు దుష్ట కార్యము నెల్లన్

53. మ. తన గర్భమ్మున వృద్ధి యొసుతుని నిర్దాక్షిణ్యభావమ్మునన్
తునియల్ సేయగ ప్రోత్సహించి తన పుత్రున్ బంపె నేడక్కటా!

ఘన మాత్సర్యముఁబూని నాసవతి, తత్కాంతన్ సుతున్ మిన్నకుం
డిన మేల్గాదని యెంచి యాదితియు వేణిన్ జుట్టి యుద్వేగ యై

54. చం. ప్రకటిత తీవ్ర కోపమున ఫాలము లాస్యము సేయుచుండ, తా
రకల నధఃకరించు గతి రక్తకణమ్ములు కన్ను దోయియం
దొకటయి తేజరిల్ల దితి యుగ్రగతిన్ జనుదెంచి పుత్రునిన్
జికురము దువ్వుచున్ ముదముఁ జెందెడు నయ్యదితిన్ గనుంగొనెన్

55. చం. కనుఁగొని యోపిశాచి! యిటు క్రౌర్యమునన్ భవదీయ పుత్రునిన్
మనమెరియంగ మత్సుతుని మానుగ గర్భమునన్ వసించువా
నిని వధియింపఁ బంపితివి నీకిది ధర్మమె, యింకపైన నీ
తనయుని వైభవం బడగు తప్పనుబో త్రిదివాధిపత్యమున్

56. చం. శిశువును సప్తఖండములు సేసెను నీసుతు, డట్లె నీకునున్
శిశువులు పుట్టి పుట్టగనె చేరుదు రింక యమాధివాసమున్
భృశముగ పుత్రశోకమున వేదనఁజెందెద వీవటంచు తా
నశని సమాన శాపమిడె నయ్యదితిన్ గని యాగ్రహమ్మునన్

57. తే.గీ. అంత కశ్యపు డచ్చట కరుగు దెంచి
దితిని వారించి యోదార్చి తీవ్రమైన
శాపముల్ చాలు చాలింక శాంతిఁ బూని
యుండు మో దేవి! కోపమ్మునుడిపి మదిని

58. కం. పదునల్గురు పుత్రులు నీ
కుదయించెదరింక మదికి నుత్సవమొదవన్
పదిలముగ మరుత్తులునా
నదితిసుతున కెనయనఁదగి యన్ని విధములన్

59. కం. అదితియు నిక నిరువది యె
న్మిదవదియగు ద్వాపరమున మేదినిపై తా
నుదయించి నీదు శాపము
వదలక యపుడనుభవించు వగవకు మింకన్

60. కం. వరుణుని శాపము వలనన్
తిరముగ మన మిర్వురమును దివ్యాంశలతో





ధర నత్తఱి జన్మింతుము
వరుసగ నని కశ్యపుండు పలికిన యంతన్

61. వ. దితి యూఱడిల్లె, నటుపై నిరువదియెనిమిదవద్వాపరము ప్రవేశించె

62. తే.గీ. అంత వరుణుని శాప వాక్యముల వలన
యదు కులమ్మున వసుదేవుడనగ నొప్పి
జనన మందెను ధాత్రి కశ్యప మునీంద్రు
డతని భార్యలు తోడొచు నవనిఁజేర

63. తే.గీ. అదితి దేవకియైపుట్టె యదు కులమున
దితియు రోహిణి యనుపేర తేజరిల్లె
ఇరువురును భార్యలై యొప్పి రిద్దరిత్రి
ప్రీతి చేకూర్ప వసుదేవు చేతమునకు

## జనమేజయుని ధర్మసందేహాలు

64. కం. అని కృష్ణ ద్వైపాయన
ముని వినిపించిన కురుకుల పుంగవు డపు డ
ల్లన మతిపోయిన యట్లై
వినయమ్మున మరల నిట్లు పృచ్ఛ యొనర్చెన్

65. చం. వెరవిది యౌనొ కాదొ? నిను వేడెద తెల్పుము వ్యాససన్మునీ!
తిరముగ నామనంబునకు తెల్లముగాదిట యేదిధర్మమో?
యరయ నధర్మమేదియొ?మహాత్ము లనందగు వారలెవ్వరో?
యిరవుగ విశ్వసింపఁదగు నెవ్వరి? నెవ్వరి నమ్మగూడదో?

66. శా. ఈ సంసారమె పాపకూపమకటా! యిందెవ్వరేన్ మున్గినన్
వీసంబైనఁదలంగఁజాలరుగదా! విజ్ఞుండునై కశ్యపుం
డాసంజెంది దిగీశు గోవునటు లన్యాయంబుగా దెచ్చె నా
యాసంబం చెఱుగంగఁబోక ననగా నాశ్చర్యమౌ నెంతయున్

67. ఉ. దోసము నెంచఁబోక కడు దుర్మతియైచని కల్ల బొల్లియౌ
బాసలు పల్కుచున్ దితిని పాదములొత్తుచు నిద్రఁగూర్చి బల్

మోసమునన్ మహేంద్రుడటు ముద్దియ గర్భములోనఁ జొచ్చి తా
నీసున పిండమున్ దునిమె నెంతటి దారుణ కార్యమక్కటా!

68. మ. త్రిదివాధీశుడు ధర్మరక్షకుడునౌ దేవేంద్రుడే యివ్విధిన్
మదిలో నియ్యది దుష్టకార్యమనుచున్ భావింప కౌన్నత్య సం
పదలోలిన్ దల పోయ కాదితిసుతున్ పైశాచి కత్వంబునన్
విదళించెన్, గతియేది ధర్మమునకున్ విశ్వంబునం దట్టిచో

69. మ. అరయన్ భారత యుద్ధరంగమున ద్రోణాచార్యుడున్ భీష్ముడున్
కురురాజేంద్రుడు కర్ణధర్మజులు తక్కుంగల్గు వీరాగ్రణుల్
కరమున్ ధర్మముఁ దప్పి పోరిరి గదా కాలానుగుణ్యంబుగా
నరెరే! యెంతయుఁజిత్ర మౌను మునివర్యా!యార్యు లిట్టైరనన్

70. కం. పరమాత్ముడైన కృష్ణుడె
ధర నింద్యంబైన యిట్టి దౌష్ట్యములను ని
బ్బరమున ప్రేరేపించుట
యరుదౌఁగద సంయమీంద్ర! యాత్మఁదలంపన్

71. ఆ.వె. ఇన్ని వినిన పిదప నెవ్వారికైనను
శ్రద్ధ యున్నె ధర్మ శాస్త్రమందు
ధర్మమెద్దియౌనొ ధర్మబాహ్య మెదియొ
నిర్ణయింపఁ దరమె నిర్మలాత్మ!

72. ఉ. మానుగ నాప్తవాక్యమె ప్రమాణమనన్ మఱియాప్తుడెవ్వడో
కానము, దేహధారి త్రిజగంబులలో విషయానురక్తుడే
యౌను దలంచి చూడగ, ప్రియంబది సాజము వానికెయ్యెడన్
దానన తారతమ్యములు తప్పవికన్ స్వపరానుచింతనన్

73. కం. రాగోద్భవమే ద్వేషము
రాగంబది యొకరిపట్ల రంజిలుచున్నన్
వేగమె మఱియొక్కరియెడ
సాగున్ ద్వేషంబు నిదియ సహజము తలపన్

74. కం. పెరుగదె యసత్యవచనము
స్థిరమగు ద్వేషంబు వలన త్రిజగములందున్





బరగ జరాసంధుఁ దునుమ
ధరణీసురు డయ్యెఁగాదె దామోదరుడున్

75. సీ. సత్యమ్ము శౌచమ్ము నిత్యమ్ము దయయును
దానమ్ములనునవి ధర్మమునకు
నాల్గు పాదములంచు నయమున వేదమ్ము
పలికెఁగావున నివి తొలగెనేని
ధర్మమ్మునకు నింక స్థానమెచ్చట నుండు
ధర్మదూరంబైన కర్మలెల్ల
సత్ఫలంబుల నీయఁజాలవు జగముల
నింద్రునకేని యుపేంద్రుకైన

గీ. తలప ధర్మమ్ముపట్ల శ్రద్ధయును భక్తి
కలవె యెవ్వారికైన నెక్కాలమందు
ఎవరి నాదర్శముగ గ్రహియించ వలెనొ
యెఱుగనైతిని మునివరా! యెల్లగతుల

76. మ. శత యజ్ఞమ్ము లొనర్చి నట్టి బలినే సాక్షాత్తు వైకుంఠు డు
న్నతిఁ బోనాడుచు వామనాకృతిని విన్నాణంబుగా దాల్చి స
న్మతి దానంబును గోరు వ్యాజమున నన్యాయంబుగాఁబంపె తా
నతి నైచ్యస్థితి సర్వలోకమున కాహా! యెంత మోసంబొకో

77. తే.గీ. ధర్మ మేనాడు తప్పడు దాన శీలి
వేదవిధులను పాలించు వినయగుణుడు
శమము దమమును గల్గిన సత్యవాది
యైన బలినేల కంజాక్షు డడచెనకట!

78. కం. వారిరువురిలో నెవ రె
వ్వారిని నడగించి నట్లు వ్యాసమహర్షీ!
నేరక యుంటిని తెలుపుము
నేరంబని యెంచఁబోక, నినుఁబ్రార్థింతున్

79. వ. అనవిని వ్యాసుండు జనమేజయుంగని

80. ఉ. సందియ మేలనయ్య నృప సత్తమ! యాబలి చక్రవర్తినే
పొందునుబో జయమ్ము, కడు మోదమునన్ ధరనెల్లనిచ్చె గో
విందున కంతకంటె మరి వేరొక డెవ్వడు త్యాగశీలి, యిం
కెందులకయ్య మోసమునకే హరి వామనుడయ్యె నయ్యెడన్

81. ఉ. అంతియెకాక నాబలికి నంబుజ నాభుడు ద్వార పాలుడై
సంతత మాతనిన్ గనుచు సమ్మతి రక్షణ సేయుచుండు, శ్రీ
కాంతుడు గౌరవార్థమె జగంబులలోన త్రివిక్రముండునా
నెంతయు పేరు గాంచె నిజమెంచగ నోడిన దాతడేయగున్

82. తే.గీ. ధర్మములకెల్ల మూలమ్ముఁ దలచిచూడ
సత్యమేయగు నైన నాచరణ మదియు
దేహధారుల కెల్లను సాహసమ్మె
మాయ యనునది మిగుల బలీయమగుట

83. చం. త్రిగుణయుతంబు మాయయన, దీని సమాశ్రయ కారణంబునన్
జగములు భిన్నభిన్నగతి సాగుచునున్న విధంబు దోచు, ప
న్నగమది రజ్జువందునఁ గనంబడు రీతి నసత్యమెల్ల తా
నగపడు సత్యమై, తెలియనయ్యెడు సత్య మసత్యమన్నటుల్

84. తే.గీ. అవని వైఖానసాది మహర్షులనగ,
సంగరహితులునా, నిత్య సత్యవాదు
లనగ, నిష్పరిగ్రహులన, వినుటె గాని
కలరె కేవల దృష్టాంతములకునైన

85. ఉ. వేదములన్ దదంగముల విస్తృతమైన పురాణగాథలన్
బ్రోదిగ ధర్మశాస్త్రముల మున్ రచియించిన వారలెల్లరున్
మేదినిఁ జూచినన్ గుణసమేతులెయౌ, నటుగాన నిర్గుణం
బాదట వచ్చునే గుణవిహారుల వాక్కులలోన నెంచగన్

86. తే.గీ. ఏకవాక్యతాసిద్ధిలే దెంచి చూడ
వేదశాస్త్రాదులవియెల్ల వివిధగతుల
గోచరించుచు మనసు నాకులముసేయు
సగుణచిత్తుల రచనలై సాగు కతన





87. ఉ. మానవ దేహధారికిల మాయదొఱంగుట కష్టమౌటచే
వానికి ధర్మమందు నొకపట్టుననైన స్థిరత్వముండ దో
మానవనాథ! మానసము మానక పర్విడు నింద్రియాలకున్
బానిసయౌచు; నట్టి యెడ ప్రస్ఫుట మౌనె స్థిరత్వమెన్నడున్?

88. కం. కామక్రోధాదు లనెడి
భీమంబగు విమతు లెపుడు ప్రేరేపింపన్
సేమంబులు తొలగి చెడును
సామాన్యుండైన పద్మసంభవుడైనన్

89. ఉ. కోరినయర్థమెల్ల నొనగూడక యున్న నసత్యముల్ కడున్
నేరుపునన్ వచించు,ఁ గడు నింద్యయుతంబగు వక్రమార్గ సం
చారుడునై యధోగతికి జారును, మంచియు చెడ్డయున్ గనన్
నేరడు, మిన్నుమన్నులగణింప డహంకరణంపుఁ బెంపునన్

90. కం. ఈసు, నసూయయు, ద్వేషము,
నాసయు, దైన్యమ్ముఁ, దృషయు, నమితాటోపం,
బేసర నధర్మపరుడై
దోసంబులఁ బొందు మాయ దోచుట కతనన్

91. మ. ధనసంపన్నులు గొందరార్భటమునన్ దానంబులున్ ధర్మముల్
ఘనయజ్ఞంబులొనర్తు రెక్కుడు నహంకారంబునన్ గీర్తి చే
కొనగానెంచుచు, నట్టివారికృతముల్ గూలంకషోద్యత్ జలం
బునఁ బిండించిన తింత్రిణీఫల రసంబుల్ వోలె వ్యర్థంబు లౌ

92. చం. నిరతము స్వార్థ పూరితుడు నిక్కము మానవు, డెల్ల పాపముల్
విరివిగఁ జేయుచుండుఁ గడు వేడుకతోఁభువి; వేద వాక్యముల్
స్థిరముగఁ బల్కు, సత్త్వమున దేవతలున్, మఱి రాజసంబునన్
నరులును, రాక్షసుల్ దమమునన్ జరియింతురటంచు భిన్నులై

93. కం. నర సుర రాక్షసులు పర
స్పరమున్ గల హింత్రు త్రిగుణ సంగతిఁ గానన్
సురలును నసురులు మనుజుల
వరతపముల నెపుడు భంగ పరతురు మిగులన్

94. కం. రాగద్వేష విదూరులు
భోగములం దిచ్ఛలేని పుణ్యపురుషులున్
యోగులు నిరహంకారులు
నేగతిc బరికింపc గలరె యేయుగములనేన్

95. కం. అపకారము చేయునతని
కపకారము చేయcబూను టదియట్లుండన్
అపకారమెద్ది యెఱుగని
తపసుల నవమానపరుపc దగునేయెందున్

96. కం. దేవేంద్రుడంతవాడే,
యేవిధమగు ద్రోహచింత లెఱుగక మౌనుల్
గావించు తపములను తా
భావింపక మంచిచెడులు భంగమొనర్చున్

97. ఆ.వె. సత్యయుగమె నెలవు సజ్జనాళికెపుడు
మధ్యయుగము తావు మధ్యములకు
కలియుగమ్మునందు కాపురుషులె మెండు
కోటికొకడు తప్ప కువల యేశ!

98. చం. మనుజుని ధర్మ సంస్థితికి మానుగ పూర్వపు జన్మవాసనల్
ఘనమగు కారణంబు;లవి కల్మష మౌనెడ ధర్మహాని యౌ
జననుత! దీనికొక్కటి ప్రశస్తము నౌనితివృత్తమిప్డు నే
వినిచెద శ్రద్ధగా వినుము వీనుల కింపొనగూడునట్లుగన్

## నరనారాయణుల తపస్సు

99. తే.గీ. బ్రహ్మమానస పుత్రుడై ప్రభవమంది
ధర్ముడను పేర ముని వేద ధర్మయుతుడు
సత్యసంపన్నుడన్న యశమ్మునంది
జీవనముసేయు చుండెను చింతలేక

100. ఉ. ఆతడు దక్ష పుత్రికల నర్మిలితో పదుగుంద్రc బెండ్లియై
ప్రీతి గృహస్థ ధర్మమున పెంపెసలారc జరించుచుండ వి





ఖ్యాతిగ వారికిన్ గలిగి రాత్మజు లాఢ్యులు నల్వురింపునన్
భూతల మందు భూరిగుణ పూర్ణులు యోగతపః ప్రభావులై

101. కం. వారలలో హరి, కృష్ణులు
వారక యోగాభ్యసనవివర్ధిత బహుళా
చారులునై యుండగ నర
నారాయణు లురు తపంబొనర్పc దలచుచున్

102. చం. హిమగిరిc జేరి వారలట నిద్ధమునీంద్రుల కాలవాలమై
యమరుచు నున్న యాబదరి కాశ్రమమం దతి దీక్షc బూని య
శ్రమమున వేయి వర్షము లసంగతవృత్తిc దపంబొనర్ప, న
య్యమర విభుండు మానసము నందున భీతిలి వ్యాకులాత్ముడై

103. మ. అపుడైరావతమెక్కి డంబమున ప్రోద్యత్ ఘోర కామాది ష
డ్రిపువర్గంబును లోననిల్పుకొని చేరెన్ శీతశైలంబునన్
విపులంబౌ బదరీవనంబునకు, నిర్భీతిన్ సురేంద్రుండు తా
వ్యపదేశంబున ధర్మసూనుల తపోవ్యాపారముల్ మాన్పగన్

104. వ. అట్లు సని బదరి కాశ్రమంబున

105. మ. అరవిందోద్భవ కంజనాభసము, లుద్యద్భాను తేజుల్ తప
శ్చరణోద్యోగ దృఢవ్రతుల్ విగతతృష్ణా ద్వేష రాగాత్ములన్
నరనారాయణులన్ సురేంద్రుడచటన్ దర్శించి యాశ్చర్య సం
భరితుండై మెలమెల్లగా నరిగి సంభాషించె నీరీతిగన్

106. ఉ. ఓమహనీయులార! యిటు లుగ్రతపం బొనరింప కారణం
బేమిటి? మీమనోరథములెవ్వియొ నాకెఱిcగింపుడీ! కడున్
నేమముతో నొనర్చెదు ననింద్యము లౌభవదీయ కృత్యముల్
నామది కింపుc గొల్పె కరుణన్ దమ కోర్కెలc దీర్ప వచ్చితిన్

107. ఆ.వె. ధర్మసుతులటంచుc దలచెద మిమ్ముల
నాకవిభుడ నేను నమ్ముడింక
వరముc గోరుకొనుడు వలదని యనc బోక
యీయరానిదైన నిచ్చువాడ

108. చం. అని పలుమారు లిట్టు లమరాధిపు డాదరవృత్తిఁ బల్కినన్
కనులను విప్పరైరి పలుకన్ దలపోయరు ధ్యాననిష్ఠులై;
"మనముల నన్యచింతనలు మాని చలింపక కూరుచుండి, రీ
మునివరులం"చు నాత్మఁ దల పోయుచు నాగ్రహమూని యంతటన్

109. చం. భయమున వారిచిత్తముల భంగమొనర్పదలంచి సింహ సం
చయముల పుండరీక వృక సంఘములన్ సృజియించి పంపె దు
ర్నయమున నా సురేంద్రుఁ, డయినన్ దృఢ చిత్తులునైన వార లే
భయమును బొందకట్టులె తపం బొనరించుచు నుండి రున్నతిన్

110. తే.గీ. ఆదిశక్తిని జగదంబ నాత్మనిలిపి
ధ్యానమొనరించు వారల మానసముల
చెఱుపఁ బూనిన యోటమిఁ జెందకున్నె
అల్పమగు మాయ లడచునే యలఘుమతుల

111. ఉ. ఇంత యొనర్చినన్ చలన మింతయుఁ బొందని వారిపైన నా
పంత మికేల యంచు సురవంద్యుడు చేయున దేమిలేక తా
చింతిలి వెన్కకున్ దిరిగి శీఘ్రగతిన్ సురలోకమేగి యే
కాంతమునన్ దలంచె తగినట్టి యుపాయ మొకండు నెమ్మదిన్

112. ఉ. కంతు వసంతులన్ రతిని గ్రన్నన చెంతకుఁ బిల్చి యప్సరః
కాంతలఁ గూడి మీరు వడి కాశ్యపిఁ జేరి హిమాలయంబునం
దెంతయు దీక్షతో తపము లేర్పడ సల్పెడు వారలున్, దృఢ
స్వాంతులు ధర్మపుత్రుల తపమ్ములు భగ్నము చేసిరండనెన్

113. మ. మదనా! నీసుమ బాణసంహతులు నొంపన్ మూడు లోకంబులన్
విదళింపన్ బడనట్టి గుండియ లవేవీ? తెల్పుమూహించి, నీ
కదియున్గాక వసంతు డచ్చరలు తోడైయుండ నీధాటి కిం
కెదురేదీ? మది సంశయం పడక నాయీకార్య మీడేర్పుమా!

114. మ. అనియాజ్ఞాపనసేయ మన్మథుడనంతానంద వార్ధిన్ గడున్
మునుకల్ వేయుచు నీదునాజ్ఞ నిపుడే పొల్పొందఁ బాలింతు నై
నను నవ్వారు త్రిమూర్తులాదిగల యన్యంబైన వారిన్ మదిన్
దనరన్ నిల్పి తపంబుసేయునెడలన్ దథ్యంబు కార్యంబగున్





115. ఆ.వె. అట్లుగాక నంబ నఖిల లోకేశ్వరి
నాత్మ నిల్పివార లంచితముగ
తపముసేయుచున్న తథ్యమవ్వారల
భంగ పఱుప సాధ్యపడదు మాకు

116. కం. అనిపల్కి మదను దంతట
తనవారిన్ గూడి సనియె తద్దయు వేడ్కన్
గొనకొని నరనారాయణు
లనిశము తపమాచరించు నాశ్రమమునకున్

117. ఉ. అంత వసంతు డాబదరి కాశ్రమ భూమికి ముందె చేర, న
త్యంతము శోభతో తరువులల్లఁ జిగిర్చెను, కొమ్మకొమ్మకున్
స్వాంతము లుల్లసిల్ల సుమవల్లికలల్లి సుగంధ బంధురో
పాంతములయ్యె, ఝుమ్మనుచు పైపయి మూగెను షట్పదంబులున్

118. చం. పికయుగళంపు గీతములు పెంపెసలారె, మనోహరంబులై
శుకముల పల్కులెల్లెడల శోభిలె, జీవులవెల్ల నెల్లెడన్
ప్రకటిత కామభావ పరిరంభిత యుగ్మములయ్యె, మౌనులున్
వికల మనస్కులైరట వివృద్ధ వసంత సరాగ రమ్యతన్

119. చం. అదనిదెయంచు నెంచి యమరాంగనలున్ రతిమన్మథుల్ వడిన్
గదలిరి యాశ్రమంబునకు, కాముడు ముందుగ పంచబాణముల్
వదలెను, నచ్చరల్ శ్రవణ పర్వముగా మధురంపు గానముల్
గదుకొని యాలపించిరి పికమ్ములతో శ్రుతిఁ గల్పిచక్కగన్

120. కం. నరనారాయణుల కపుడు
స్థిరమౌ ధ్యానమ్ము చెదరి తిలకింపగ త
త్పరిసరములందు ముందే
యరుదెంచిన విధము దోచె నామనిశోభల్

121. ఉ. కాలముగాని కాలమునఁ గన్పడునేల వసంతశోభ, యీ
జాలమిదేమి? కామవివశత్వమునొందెను జీవకోటి, యి
ట్లేలొకొ? వింతయై ప్రకృతి యెల్లఁ గనంబడు, షట్పదంబులున్
మాలలుగట్టె; మారుతము మందగతిన్ బయనించె హృద్యమై

122. వ. అని ప్రశ్నించిన నరుని చూచి నారాయణుండిట్లనియె

123. కం. స్వపలాశ కుసుమ నఖములఁ
గృపమాలి వసంతకాల కేసరి శిశిర
ద్విపమును చకితను చీల్చుచు
నిపుడే యరుదెంచె నయ్య యింద్రుని యాజ్ఞన్

124. సీ. అరుణ వర్ణాశోక తరు వర హస్తయై
కింశుకాపాద సంకేతయౌచు
నీలి మాశోక వినీల కచభరయై
సితపద్మముఖ కాంతి వితత యౌచు
ఇందీవరాక్షియై కుంద రదనయునై
బిల్వఫల కుచ సంవేద్యయగుచు
మంజరీ కర్ణయై మధు కలకంఠియై
హంస మయూర సుయానయౌచు

గీ. సరసగతి వచ్చి యిపుడు వసంత లక్ష్మి
కలయఁ దిరుగుచునుండె నకాలమందు
భంగపఱుపంగ మనదు తపమ్ములెలమి
నిదియు నింద్రుని కుట్ర యంచేఁ దలంతు

125. మ. అని నారాయణుడిట్లువల్క తన మాయా తంత్ర మీతండు తా
కనిపెట్టెన్ గద యంచు మన్మథుడటన్ గన్పించె రంభాదులున్
దనవెన్కన్ నిలువన్ దటిల్లతలనన్ దళ్కొత్తు శృంగారపున్
ఘనరూపంబుల పోల్కి యక్కజముగల్గన్ దాపస శ్రేణికిన్

126. కం. పదునారువేల యేబది
సుదతుల నచ్చరలఁ గాంచి చోద్యంబున నా
మదనునిగని నారాయణు
డొదవౌ మర్యాదతోడ నొయ్యనఁ బల్కెన్

127. చం. అతిథులు మీరు మాకు; హృదయంగమ గీతములాలపించి యీ
యతివలు మామనంబులకు హాయిని గూర్చిరి, గాన నిప్డు, స
మ్మతమున యాతిథేయముల మాకొనగూడిన యంతవట్టు వ
న్యతతిని స్వీకరించి ముదమారగ నేగుడు మాకుఁ దృప్తి యౌ

128. మ. అనినన్ వారును సమ్మతింప నపుడత్యంతాభిమానమ్ము హె
చ్చిన నారాయణు డాత్మశక్తిని ప్రదర్శింపంగ యోచించి చ
య్యన హస్తమ్మున నూరువున్ చఱచగా నందాల రాశిన్‌బలెన్
వనితారత్నము పుట్టె నచ్చరల గర్వం బంత మొందించుచున్

129. తే.గీ. ఊరు సంభవ యౌనామె కూర్వశియన
రమ్యమగు నామమిడియె నారాయణుండు
అచట నున్నట్టి యచ్చర లందరకును
వరుస నొక్కొకరికి నొక్క సరసిజాక్షి
నిచ్చెసృష్టించి పరిచర్యలిచ్చుఁ జేయ

130. కం. అందరు పరిచారిక లపు
డందముగా నెల్లవార లానందింపన్
పొందగు నాటల పాటల
విందులొసగి రద్భుతముగ వేర్వేరనృపా!

131. మ. నరనారాయణ తాపసేంద్రుల యమందంబౌ తపశ్శక్తి క
చ్చెరువుల్ పొందుచు నప్సరోంగనలటన్ శీర్షంబులన్ వంచి ముం
దర నిల్చుండి కడున్ నుతించి రిటులన్ దర్పంబులన్ వీడి, యు
ర్వర మీబోటి మహాత్ములన్ గనమెటన్ భాస్వత్తపోనిష్ఠులన్

132. ఉ. మాదు విలోకనాస్త్రముల మార్కొని నిల్చియు గెల్చినట్టి వా
రేదరిఁ గాన రారరయ నింతకుమున్ను; మహాత్ములార! మీ
పాదములంటి మ్రొక్కెదము పాకవిరోధికి ప్రీతిసేయగా
కాదనలేక వచ్చితిమి గాని యెఱుంగము మీమహత్త్వముల్

133. శా. మా గర్వంబులడంగె, నోడితిమి సుమ్మా! నేడు మాపూర్వ పు
ణ్యాగారంబులు నిండుటన్ గనెడి భాగ్యంబబ్బెమిమ్మిట్లు, మీ
రాగాతీత మనః ప్రవృత్తులను ధైర్యంబుల్ తపంబుల్ గనన్
యోగిశ్రేష్ఠులటంచు నెంచితిమి మాయుద్వృత్తులన్ సైపుడీ!

134. కం. క్షమి యింపుడయ్య మమ్ముల
తమ బోంట్లకు శాంత గుణమె తగ భూషణమౌ
తమ రొసగిన యాతిథ్యము
లమితానందముల నొసగె నయ్యా! మాకున్

135. వ. అనివినయ వినమితోత్తమాంగులై ప్రార్థించుచున్నయప్సరలంగని
నరనారాయణులు సంతసించి ప్రసన్నవదనులైయిట్లు వల్కిరి.

136. చం. సరసిజ నేత్రలార! కడు సంతసమయ్యెను మీ వినమ్రతా
భరమగు చిత్తవృత్తులకు, భద్రముగా గొని పొందు మీర లీ
తరుణిని యూర్వశిన్ దివికి, తప్పక యింద్రునకిందు కాన్కగా,
వరమొకటెద్దియే నొసగు వారము కోరుడు, నిశ్చయమ్ముగన్

137. చం. అనవిని వార లెల్లరును నాత్మఁ గడున్ గడు బాధఁ జెంది, యో
యనఘ చరిత్రులారఁ భవదాశ్రమమున్ విడనాడి మేమెటన్
జనెదము, మిమ్ముఁ బాయుటకు సమ్మతి నొందవు మాదుడెందముల్
గనుక వరమ్మునిమ్ము కలకాలమిటన్ వసియించునట్టులన్

138. కం. నారాయణమునివర్యా!
కోరెద మెల్లరము నిన్నె కూరిమితో మా
భారమ్ముల భరియింపుము
వేరొకరింకేల నీవె విభుడవు మాకున్

139. కం. మాకొఱకై సృజియించిన
యీ కంజేక్షణలఁబంపు మీ యూర్వశితో
నాకంబున కోమునివర!
మాకిచటన్ స్థానమొసగి మమ్మేలుమికన్

140. కం. సంగమ సుఖముల్ గోరెడి
యంగనల నవజ్ఞసేయు టది ధర్మంబే
పొంగారు మాదు కోర్కెల
కంగీకారమ్ముఁదెలుపు మయ్యా! కృపతో

141. మ. అనియిట్లా దివిజాంగనల్ మిగుల నభ్యర్థింప నారాయణుం
డనియెన్ వారలఁ గాంచి యోరమణు లారా! మేము వేయేండ్లుగా
నయంబున్ దపమాచరించితిమి కామాద్యుగ్ర షట్కంబులన్
గనబో కిప్పటిదన్క తుచ్ఛసుఖ భోగత్యాగ చిత్తంబులన్

142. ఆ.వే. క్షణిక సుఖముఁ గోరి శాశ్వత ఫలమును
భంగపఱుపఁ దగునె పడతులార!
బుద్ధిమంతుడెవడు పూని యిక్కార్యమ్ము
నాచరింపఁ దలప డఖిల జగతి

143. కం. అనిపల్కు నతనిఁ గని యి
ట్లని రా యచ్చరలు తనివినందక; మాకున్
మును నీవొక వర మిచ్చెద
నని యంటివి గాన దాని నడిగెదమిపుడే

144. తే.గీ. ఇంద్రియార్థ సుఖంబులం దెల్ల గతిని
స్పర్శసుఖమును మించిన సౌఖ్యమొందు
గలదె? కావున నదియె కావలయుమాకు
మాట తప్పకు మయ్య! యోమాన్యచరిత!

145. తే.గీ. అనుచు నచ్చరల్ వలుక నారాయణుండు
వీరికిచ్చిన మాటను వీడకున్న
గంగపాలౌను తపమెల్ల; కడకుమమ్ము
నపహసింపరె సాటి ఋష్యాదులెల్ల

146. మ. దివిజాధీశున కీయనంగు నకు నీదివ్యాంగనాకోటికిన్
వివరింపంగ మదీయ శక్తి నిటు లీవిద్యన్ బ్రదర్శించి తే
నవివేకంబున, నాయహంకరణమే యౌదీనికింగారణం,
బవలోకింపక మంచి చెడ్డల వరంబర్థింపు మంటిన్ గదా!

147. కం. తిరముగ సంసరణాటవి
కరమున్ బెంపొందుటకును కత మరయ నహం
కరణమె యగు; నే పన్నిన
యురులందిపుడేఁ దగిలితి నూర్ణాయువటుల్

148. ఉ. ఏనిపుడేమిసేతు వదిలించుట కార్యము వీరినెట్టులేన్
ఐనను వీరినియ్యెడ ననాదరవృత్తిఁ దిరస్కరించినన్

మానుగ శాపమిత్తు రనుమానములే, దటుగాక ముందుగా
నేనె శపింత మన్న తపమెల్లను భంగమగున్ భృశంబుగన్

149. మ. అరిషడ్వర్గములందు క్రోధమది యత్యంతమ్ము నాభీలమై
కరమున్ దుఃఖముఁ బొందఁ జేయు, కడు దుష్కార్యోద్యతుండై మదిన్
గురువున్ దల్పదు, తల్లిదండ్రులని సంకోచింపడెంతేని, దు
ర్భర హింసాత్మకుడౌచు క్రోధను డసంబద్ధ ప్రలాపంబులన్

150. కం. కొమ్మల మధ్యన రగులుచుఁ
గ్రమ్మికొనెడి యగ్ని యుగ్ర గతి విస్తృతమై
కొమ్మల దహించుగతిఁ గ్రో
ధమ్మది యనలమ్మువోలె దహియించు నరున్

151. కం. అని నారాయణు డివ్విధ
మునఁ దలపోయుచు విచారమున నుండ నరుం
డును తనయగ్రజుఁ గనుగొని
వినయంబున నిట్లు వలికె విజ్ఞత దోపన్

152. శా. అన్నా! శాంతమె రూపుఁ గొన్న తమకేలా యీయహంకారపున్
జిన్నెల్ దెల్పుమ! పూర్వమిట్లె తపముల్ చెల్లంగ ప్రహ్లాదుతో
నెన్నోయేండ్లు రణంబుఁ జేసితిమి గాదే! క్రోధ దావాగ్ని సం
ఛన్నంబైన మనః ప్రవృత్తుల నిరస్త స్వాంతశాంత్యున్నతిన్

153. ఉ. కావున క్రోధమున్ వదలి గ్రన్నన శాంతగుణమ్ముఁ బూని స
ద్భావము తోడ వీరికి కృపారసముల్లసిలంగఁ జెప్పుమో
పావన మూర్తి! తాపసుల పాలిట శాంతమె భూషణమ్మటం
చారసి నీతపోవిభవ మాఱడిపెట్టక యుంట మేలగున్

154. కం. అనిపల్కు నరుని మాటలు
విని నారాయణుడు సుంత విజ్ఞత దోపన్
తన మనమున నిక క్రోధం
బనవరతముఁ బూనఁగూడ దనుచుఁ దలంచెన్

155. వ. అనియివ్విధంబున వచించు వేదవ్యాసునకద్దుతగిలి జనమే జయుండు
మరలనిట్లని ప్రశ్నించె





156. మ. అతిధర్మాత్ముడు దైత్యనందనుడు ప్రహ్లాదుండు శాంతుండు సం
స్తుతి పాత్రుండునునయ్యు మౌనివరులన్ శుద్ధాంతరంగుల్ మహో
న్నతులైయొప్పుచుఁ గీర్తిఁ గొన్న నరునిన్ నారాయణున్ గర్వసం
గతి యుద్ధమ్మునకేల పిల్చెనొ యెఱుంగన్ దెల్పుమయ్యా! కృపన్

157. ఆ.వె. వైరమేల కలిగె వీరి మధ్యనమున్ను
హేతువదియ క్రోధమేని యింక
జపములేల వీరి తపములు నవియేల
శ్రమయెగాక కలదె సత్ఫలమ్ము

158. ఉ. అంతటి సత్తపోధను లహంకరణోద్భవమైన క్రోధమున్
సుంతయు వీడరైరియన చోద్యమెయౌ, నిక మమ్ముబోంట్లకె
ట్లంతమగున్ దలంపగ నహంకరణమ్ము మునీంద్ర చంద్ర! భా
స్వంతునిమ్రోల రాత్రివలె బాయు నహంకృతిగల్గ పున్నెముల్

159. తే.గీ. ఇనుప సంకెళ్ల నైన ఛేదింపవచ్చు
గుదియనైనను తొలగించుకొనగవచ్చు
కష్ట మెవ్వారికిని నహంకార సూత్ర
బంధనముఁ ద్రెంప బ్రహ్మాండభాండమందు

160. వ. అనియివ్విధంబునఁ బలుకు జనమే జయుంజూచి వ్యాసుండిట్లనియె

161. తే.గీ. కారణముకంటె కార్యమ్ము వేరుగాదు
అంగుళీయకమైనను హారమైన
స్వర్ణమునకంటె వేరౌనె నిర్ణయింప
ప్రతికంటెను భిన్నమై పటము గలదె

162. తే.గీ. కాన నీసృష్టి యును నహంకార మందు
నుద్భవించిన దౌటచే నున్నదెల్ల
దాని కంటెను భిన్నమెట్లౌను తలప
అగణి తంబగు సర్వమ్ము త్రిగుణయుతము

163. కం. అరయగఁ ద్రిమూర్తులైనను
పరమర్షులునైన, దివిజ వర్యులు నైనన్

చరియింతురు నిరత మహం
కరణ విమోహితులగుచు జగంబులలోనన్

164. కం. త్రిగుణాతీతుడొకండును
జగములఁ గన్పింపదయ్య జనమే జయ! దే
హగతుండగు వాడెపుడును
నొగి సంసరణాబ్ధి మునుగుచుండు నిజముగన్

165. తే.గీ. దేహమున్నంతవరకు సుస్థిరమునౌచు
కామమాదిగ శత్రు వర్గంబులెల్ల
నిలిచి యుండును తథ్యంబు తొలగవెపుడు
పామరునకైన పండిత వరునకైన

166. ఉ. వేద పురాణశాస్త్రముల వేడుక నభ్యసనంబొనర్చుటల్
మోదము తోడఁ దీర్థముల మున్గుచుఁ దేలుట, ధ్యాన దాన ధ
ర్మాదులు, పూజలెల్ల విషయైక సుఖానుభవంబుఁ గోరియే
మేదిని చోరునింబలె శ్రమించుచుఁ జేయు నరుండు నిత్యమున్

167. ఉ. ఐనను కామవర్గమును నాత్మనడంచిన సాధువుల్ భువిన్
గానరనంగ జాలము యుగంబున కొక్కడొ యిర్వురైన కా
లానుగుణంబుగాఁ గల రటంచు నెఱుంగు ముదాహరింప, లే
దేని ప్రపంచమే నిలువదింతకు వారలె లేక యుండినన్

## ప్రహ్లాద చ్యవన సంవాదం

168. తే.గీ. కనక కశ్యపు దరిగిన వెనుక నతని
తనయుడు విభుడయ్యె నల పాతాళమునకు
నఖిల సద్గుణ గణుడు ప్రహ్లాదు డార్య
సమ్మతమ్ముగ పాలన జరుపుచుండె

169. శా. పాతాళంబునఁ బృథ్వియందును గడున్ భావ్యంబుగా ధర్మవి
ఖ్యాతిన్ గూర్చుచు దాన శీలుడయి యోగ్యంబైన మార్గంబునన్
బ్రీతిన్ యజ్ఞము లాచరించుచు బుధుల్ వేనోళ్ళఁ గీర్తింప ని
ర్ణీతంబైన విధాన పాలనమొనర్చెన్ వేడ్కఁ బ్రహ్లాదుడున్





170. వ. అతఁడట్లు రాజ్యపాలన సేయుచుండ నొక్కనాడు

171. తే.గీ. భృగువు తనయుండు చ్యవనుడన్ బేరఁ బరగు
ఋషివరేణ్యుడు స్నానార్థ మేగుదెంచి
నర్మదానదీ జలముల స్నానమాడి
దరికిఁ జనుచుండె మౌనముద్రను ధరించి

172. ఉ. ఆసమయమ్మునందొక భయంకర సర్పము వాని పాదముల్
గాసిలఁ బట్టి యీడ్చుకొని గ్రన్ననఁ జేరెను నాగలోక; మా
యాసముఁ జెంది యమ్మునియు నాత్మఁ గడుంగడుభక్తిఁ గన్నులన్
మూసి జనార్దనున్ మదిని పొందిక నిల్పిభజించె భీతుడై

173. కం. వెన్నుని భజించు కతమున
మున్నీటన్ మునిగి సర్పభువనమ్మునకున్
దిన్నగఁ జేరిన యతనికి
నన్నన్న! యొకింతశ్రమయు నగపడదయ్యెన్

174. తే.గీ. చెక్కుచెదరని చ్యవనుని స్థితినిఁ జూచి
ఈత డెవ్వడొ భువి తాపసేంద్రు డగును
శాపమిడు నేమొయంచు నాసర్పమపుడు
కడుభయమ్మున దేహమ్ము కంపమొంద

175. చం. సతియును తాను సంతతియు సమ్మతినాఋషి వర్యుచెంతకున్
నతులయి చేరి సేవలు ఘనంబుగఁ జేయుచు నుండ నంత న
య్యతుల మహాను భావు దపుడార్ద్రమతిన్ బరికించి వారి స
త్కృతులకు మెచ్చి మిక్కిలి సుఖించుచు కాలము పుచ్చుచుండగన్

176. కం. అదిగని ప్రహ్లాదుండును
ముదమున నాచ్యవనునిఁగడు పుణ్యాత్ముని శాం
తి దయా భూషణు గౌరవ
ముదయింపఁ బిలిచి యొనర్చె నొప్పుగపూజల్

177. ఉ. అంతట నాతనిన్గని సురారి సుతుండు మహర్షి సత్తమా!
యింతకు మీరలిచ్చటకు నేమి కతంబున వచ్చితయ్య! పా

కాంతకుడంప వచ్చితిరె? ఆతడు దైత్యులకెల్ల ద్వేషియౌ
నంతియ, గాక మాభువనమంతయు చూడగఁ గోర్కెగల్గెనా?

178. కం. తెలియం జెప్పుము తండ్రీ!
యలుగకు మిట్లడిగితంచు నసఘా! మాపై,
కలకారణ మది చెప్పిన
పలురీతుల సత్కరించి పంపగలాడన్

179. వ. అని ప్రహ్లాదుండడిగిన భృగు తనయుండిట్లనియె

180. ఉ. ఇంద్రుని తోడ నాకుఁ బనియేమిటి? దౌత్యమునిర్వహింప నే
సాంద్రతరంపు సాగరరసంబుల మున్గెడికష్టమేల? ని
స్తంద్ర తపోధనుండ, భృగు సన్ముని పుత్రుడ, ధార్మికుండ, స
ర్వేంద్రియనిగ్రహుండ, తగదెంతయు నాయెడ సంశయింపగన్

181. తే.గీ. నర్మదా నదీజలముల స్నానమాడు
చుండ నొక్కవిషాహి నన్నొడిసిపట్టి
యీడ్చుకొనిరాగ నిచ్చట కేగుదెంచి
నిన్ను దర్శింపఁ గలిగితి నిర్మలాత్మ!

182. ఉ. నీవును విష్ణు భక్తుడవు నేనును శ్రీహరి భక్తియుక్తుడన్
నీవిక సంశయింపకుము నిర్జరవైరి కులావతంస! నీ
కేవిధమైన హానియును నేఁ దలపోయనటంచుఁ బల్క స
ద్భావము తోడ దైత్యకుల వర్ధనుడమ్మునిఁ గాంచి యిట్లనెన్

183. కం. భువిపైఁ గల తీర్థంబుల
నవి గలిగించు ఫలములను నాయాస్థలముల్
ప్రవిమలతేజా! నాకున్
వివరింపుము వేడ్కననుచు వేడ నతండున్

184. సీ. అడుగఁ దగిన ప్రశ్న నడిగితి విప్పుడు
కనకకశ్యపపుత్ర! వినుతశీల!
త్రికరణ శుద్ధుడై స్థిరచిత్తుడౌనరుం
డడుగిడినది తీర్థ మౌను జగతి





మలిన చిత్తమ్ముల మసలెడి వారికి
భాగీరథియు పాపపంకిలమ్మె
తీర్థమ్ములవియెల్ల దివ్యమ్ములైయొప్పు
పరిశుద్ధచిత్తుడై యరిగి నపుడె

గీ. గంగ కీవల నావలఁ గలుగు వారు
మునుగుచుందురు గాదెయప్పుణ్యనదిని
ముక్తి నొందెనె యందొక్క పురుషుడైన
పాపికేగంగ యైనను ఫలమొకండె

185. ఉ. యాత్రలు సేయ నేగియు నియంత్రిత చిత్తుడు గాక దుష్ట చా
రిత్రుడునై నిరంతర పరిగ్రహణైక మనంబునం గడున్
జిత్రగతిన్ పరార్థములఁ జేకొనఁ బూనుచు నాత్మ వంచనన్
ధాత్రి చరించు హీనునకు దక్కునె ముక్తినిధాన మెన్నగన్

186. ఆ.వె. తీర్థ యాత్రలంచు దేశముల్ దిరుగుచు
పరుల మోసగించు వారికెపుడు
పాపసంచయములు పర్వత సమములై
పెరుగు చుండు గాని విడువ వెపుడు

187. ఆ.వె. ఇంద్ర వారుణమ్ము నిట్టెగైకొని వచ్చి
దినదినమ్ము కోటి తీర్థములను
ముంచి యెత్తు చున్న పోవునే మలినమ్ము
అధమ గుణుని యాత్ర లావిధంబ

188. ఆ.వె. ఆత్మశుద్ధి లేని అన్ని యాత్రల కంటె
భూతదయయె మిన్న భూమినాథ!
తీర్థ రాజములను తెలియఁ జెప్పుమనుచు
అడిగి తీవుగాన నవధరింపు

189. శా. భూలోకంబున లెక్కకున్ మిగులుగా పుణ్యప్రదేశంబులున్
వేలున్ వేలుగ తీర్థముల్ గలవు, భావింపంగనన్నింటిలో
మేలై యొప్పును చక్ర తీర్థమది సుమ్మీ! నైమిశంబందు, నొం
డే లా! నద్దియె పుష్కరంబనియు నీపృథ్విన్ ప్రశస్తిన్ గనెన్

190. ఉ. ఆదర మొప్ప నాచ్యవనుడవ్విధిఁ బల్కగ సంతసించి ప్ర
హ్లాదుడు దైత్యవర్యులను నార్య పురోహిత వర్గమున్ మహా
మోదమెలర్పవెంటఁగొని పొల్పుగఁ జేరెను నైమిశమ్ము, ఋ
ష్యాదుల కాకరమ్ము, విభవాతి శయమ్మును, పుణ్యభూమమున్

191. ఉ. అచ్చట చక్ర తీర్థ విమలాంబువులన్ దగ స్నానమాడి తా
స్వేచ్ఛనటన్ సరస్వతిని చెల్వుగ స్నానము లాచరించి బల్
మెచ్చుగ యాచకాళికి నమేయ ధనమ్ముల నిచ్చియంతటన్
ముచ్చట దీర పుణ్యవన భూములగాంచుచు సంచరించుచున్

## ప్రహ్లాద - నర నారాయణుల యుద్ధం

192. తే.గీ. తీర్థవిధులకు ననువైన దివ్యభూమి
కొఱకు వెదకుచు నట నను కూలమైన
యొక్క వటతరుచ్ఛాయఁ గూర్చుండి తద్వి
ధుల నొనరిచి మదిని పరితోషమంది

193. చం. అటు నిటుఁ జూడ నొక్కయెడ నమ్ములు కొన్ని విభిన్న రీతులన్
పటునిశితత్వముల్ గలిగి పక్షులయాకల తోడనొప్పి త
త్తటమునఁ గానుపింప మదిఁ దద్దయు నచ్చెరు వంది యాతడ
చ్చటకు రయంబునంజని విచారణఁ జేసె మనంబునందిటుల్

194. చం. పరమ పవిత్రమైన మునివర్యుల యాశ్రమ భూమియందు ని
క్కరణి నిశాత సాయక నికాయము లెవ్విధివచ్చె? నివ్వియె
వ్వరివయి యుండవచ్చు? ననిభావనసేయుచు చూచుచుండ నా
పరిసరమందు తాపసుల భాస్కరతేజుల నిర్వురంగనెన్

195. కం. కృష్ణాజినధరులు తప
స్తృష్ణాత్ములు కేశభారదీప్తశరీరుల్
విష్ణుసములు విలువిద్యా
నిష్ణాతులు నైనవారి నియతేంద్రియులన్

196. తే.గీ. అజగవము శార్ఙ్గమనెడి బాణాసనముల
అక్షయంబైన తూణద్వయంబు లెలమి
ముందు నిడుకొని యున్న యమ్మునివరులను
గాంచి ప్రహ్లాదు డమిత యాగ్రహముతోడ

197. వ. వారలు విష్ణ్వంశసంభూతులగు నరనారాయణులని యెఱుంగక
వజ్ర నిపాతసమ గంభీర రవంబున నిట్లనియె.

198. మ. మునివేషమ్ములు దాల్చి దొంగజపముల్ పుణ్యాశ్రమ ప్రాంతమం
దనయం బిట్టుల చేయనేల? కడు నిష్ఠాచారులేయైనచో
ధనువుల్ బాణములేల? యెవ్వరిని యుద్ధంబందునోడించగా
ఘనమౌతాపసవృత్తిఁ బూనితిరి యీకార్యంబు మీకొప్పునే

199. ఆ.వె. వీర వరుల మన్న కీరితి కైమీర
లాస పడిన యెడల నాహవమును
సేయరండు పూను డాయుధమ్ములవేగ
మీ పరాక్రమములఁ జూపుడయ్య!

200. కం. కాదనిన ధనుర్బాణము
లీదరి దాపులను నుండనీయక తపముల్
మోదమున నొనర్చుకొనుడు
కాదిది ధర్మమ్ము రెండుఁ గావలె ననుటల్

201. మ. అని ప్రహ్లాదుడు ధర్మపన్నముల వ్యాఖ్యానించుచున్ బల్క న
య్యన ఘూత్కుండు నరుండు వానిఁ గని మూఢా! నీకు మావల్ల వ
చ్చిన నష్టంబదియేమి? రెంటికిని వాసిన్ మాకు సామర్థ్యముల్
ఘనముల్ గావున మాటలాడకిక చక్కన్ బొమ్ము నీదారినన్

202. శా. సామర్థ్యంబు గలట్టి వానికి ధరన్ సాధ్యంబదేదైన; నీ
వేమైనన్ మముఁ జేయగల్గుదువె, నీకేలా? మహాటోపముల్
సామాన్యుండవు మమ్మెదుర్కొనెదవే! క్షాత్రోచితంబైన నీ
సామర్థ్యంబది బ్రాహ్మ్యమున్ జెనకునే చాలింపు మీడంబముల్

203. మ. అతి నిర్లక్ష్యము తోడఁ బల్కు నరువాక్యంబుల్ శరాఘాత వి
స్రుతమై కర్ణయుగమ్ముఁ దాకఁ గడు నుద్విగ్న ప్రచేతుండునై

దితివంశాగ్రణి యిట్లు వల్కె నతనిన్ దీక్షణంబుగా చూచుచున్
ఘృత సంయోగము చేత పైకెగయు నగ్నిజ్వాల చందమ్మునన్

204. శా. చాలున్ జూలును నీప్రగల్భములు త్వత్ సామర్థ్యమట్లైనచో
జాలంబేటికి రమ్ముచూపుమిక నేసైరింప నీయుద్ధతిన్
వీలొక్కింతయు లేదు మీరిచట నిర్భీతిన్ దపోనిష్ఠులై
కోలల్ వీడక ధర్మదూరులగుచున్ గూర్చుండ మందాత్ములై

205. మ. అని ప్రహ్లాదుడు తీవ్ర కోపమున నుగ్రాకారుడై ముందుగా
తన బాణాసనమెత్తి దిక్తటులు బ్రద్దల్ గాగ బిట్టార్చుచున్
ఘనటంకారమొనర్చి నిల్చెనట సంగ్రామోన్ముఖుండై వడిన్
మునివర్యుల్ దివిజుల్ సురారులు భయమ్ముల్ సెంద నొక్కుమ్మడిన్

206. మ. నరుడున్ దివ్యశరాసనంబుఁ గొని యంతన్ దీవ్ర కోపమ్మునన్
శరవర్షమ్మున ముంచె దైత్యసుతునిన్, సైరింపకాతండు నా
శరజాలంబుల మధ్యనే తునిమె శస్త్రంబుల్ ప్రయోగించి, యి
ట్లిరు పక్షంబుల బాణముల్ గగనమందేపారి కప్పెన్ రవిన్

207. తే.గీ. ద్వంద్వయుద్ధమ్ము తీవ్రమౌ స్థాయికెదిగె
దైత్య సూనుని ధాటికి తాళలేక
సతమతంబౌ నరునకు బాసటగనిల్చె
నపుడు నారాయణుండు శౌర్యమ్ముఁ గదుర

208. కం. నారాయణు డప్పుడు శిత
నారాచమ్ములను వింటి నారికిఁ దొడి తా
నా రాక్షసేంద్రు సుతుపై
నారంభముసేసె యుద్ధ మత్యుగ్రముగన్

209. మ. ప్రళయాభీల వినీల మేఘచయ నిర్యాతార్భటిన్ మించె న
య్యలఘుస్వాంతుడు సల్పుటంకృతులు, తీవ్రాసార సామ్యమ్మునై
కలయన్ బర్వె నిశాతసాయకము లాకాశమ్మునన్ భూమిపై
బలువై యయ్యవి సూర్యచంద్రులను గప్పన్ జూచిప్రహ్లాదుడున్

210. మ. తనధైర్యంబును తగ్గనీక, నిశితాస్త్రంబుల్ ప్రయోగించుచున్
మును నారాయణుడేసినట్టి శరముల్ పోజేసి తానంతటన్





జనితా మర్షణుడై యొనర్చె రణమున్ సంరంభ జృంభత్థితిన్;
ఘన శౌర్యంబున నిర్వురున్ సమముగా గన్పట్టిరప్పట్టునన్

211. ఆ.వె. సురలు పుష్పవృష్టిఁ గురియించి రప్పుడు
సంతసించి వారి సమరమునకు
నారదాది ఋషులు చేరి కీర్తించిరి
వారిపటిమఁ గాంచి బంధురముగ

212. మ. మునుపెన్నం డిటువంటి యుద్ధగరిమంబున్ జూడ లేదెందు; వృ
త్రుని యుద్ధంబును, తారకాసుర మహాయుద్ధంబు; నంభోనిధిన్
ఘనమౌ నా మధుకైట భాసురుల సంగ్రామంబునున్ నేటి యీ
యనికిన్ బోలవటంచు దేవతలు వ్యాఖ్యానించిరుత్సాహులై

213. తే.గీ. అంత నారాయణుండు ప్రహ్లాదుచేతి
ధనువుఁ ద్రుంచగ, మఱియొకధనువుఁ బట్టఁ,
ద్రుంచె దానిని కడునేర్పుతోడ; నట్లె
పెక్కు బాణాసనములను విరుగఁ గొట్టె

214. కం. కోపముతో ప్రహ్లాదుం
దేపున పరిఘాయుధమ్ము నేయగ నదియున్
దాపునకు వచ్చు చుండగ
నాపైఖండించెదాని నంబక సమితిన్

215. కం. అంతట నారాయణు డ
త్యంతము కోపించి తన దశాంబకముల నొ
క్కింతయు నెడమీయక తా
పంతమ్మున నేసెనపుడు ప్రహ్లాదునిపై

216. కం. చలియింపక ప్రహ్లాదుడు
బలువౌనొక యినుపగదను బట్టి యతనిపై
బలమున విసరగ నదియు, న
చలమువలె తగిలెను మౌని జాను యుగంబున్

217. కం. ఆదెబ్బకు సుంతైనను
వేదనఁ జెందకయె నిల్చి వీర్యోన్నతుడై

యెదుటన్ గల వానిఁ గనుచు
మదిలో వెఱగంది దైత్య మండను డంతన్

218. కం. బలమౌ శక్తినిగొని ని
శ్చలమతి విసరినఁ గని ముని చంద్రుడు తనయ
మ్ములతో పదునాలుగు ము
క్కలుగా ఖండించె దాని క్షణమాత్రమునన్

219. మ. కురువంశాధిప! దైత్యసూను డిటులన్ గ్రోధాధికోన్మత్తుడై
నరనారాయణ మౌనివర్యులకు సుంతన్ దీసిపోకట్టులే
దురమున్ దివ్యశతాబ్దముల్ సలిపె నెందున్ సంకటంబంద, క
ట్లిరు పక్షంబులు పోరుచుండఁ గని యెంతేన్ బీతిలెన్ లోకముల్

220. వ. ఆసమయంబున

221. సీ. నలు బుజంబులవాడు నగుమోము గలవాడు
శంఖచక్ర గదోరు శార్ఙ్గ ధరుడు
శ్రీవత్స వక్షుండు శ్రీ రమాకాంతుడు
వనమాలికా భూష లెనయువాడు
భక్తార్తి హరణుండు భావజ జనకుండు
పట్టు పీతాంబర భవ్యధరుడు
యోగి హృద్గమనుండు నాగేంద్ర వరదుండు
దైత్యదానవ గర్వ దారకుండు

గీ. గరుడ గమనుడు వైకుంఠపుర నివాసి
నీలనీరద తనుకాంతి నెక్కొనంగ
నంబుజోదరు డపుడు ప్రత్యక్షమయ్యె
కనకకశ్యప సుతున కక్కజము గల్గ

222. చం. పులకలెసంగ దైత్యకుల పుంగవు డప్పుడు విష్ణు మూర్తికిన్
వలఁగొని యంజలించి, సురవంద్య! రణంబులు సేసియుంటి ము
న్నలయక పెక్కువేలు, విజయంబులెగాని, జితుండఁ గాను, నే
డలసియు వీరి గెల్వఁ దగనైతిని కారణమేమి తెల్పుమా!





223. చం. అనవిని విష్ణు మూర్తి కడు నాదరమొప్పగ వానిఁ జూచి యి
య్యనఘులు జన్మమందిరి మదంశలఁబూని మహర్షివర్యులున్
ఘనవిజితేంద్రియుల్; గెలువఁ గష్టముగావున, నోడిపోతి నం
చనుకొనఁ బోక సంతసము నందుచు నీపురికేగు మింతటన్

224. తే.గీ. ఇట్టి తపసుల తోడ నీవెప్పుడేని
వైరమున్ బూనవలదంచు వనజనాభు
డాజ్ఞసేయంగ ప్రహ్లాదు డాక్షణంబ
అరిగె పాతాళమునకు నాహవము మాని

225. వ. అని పలికి వ్యాస భగవానుడు జనమే జయుంగాంచి మరల
నిట్లనియె

226. ఉ. ఆరయ సృష్టికార్యమున కాదిమ కారణమెంచగా నహం
కారమె; యిద్దియున్ ద్రిగుణ గర్భిత మౌట తదీయకార్యముల్
వేరుగ నుండునే త్రిగుణ విస్మృతినొందక; దేహధారులున్
వేరుగలేరు సృష్టి, కెటు వీడు నహంకృతి యట్టిచోనికన్

227. ఆ.వె. ఎంతవారికైన నీయహంకారమ్ము
తప్పదయ్యా! దేహధారికెపుడు
మునులు సురలెగాదు ముగురు మూర్తులకైన
మూడు జగములందు నాడు నేడు

228. సీ. సాత్త్వికాహంకార సాంగత్య మైనచో
తపమును దానమ్ము ధర్మములును
యజ్ఞ యాగము లప్రయత్నముగా గల్గు
నరునకు యోగ్యంపు సరణియౌను
క్రమమున నన్నియు కలుగు రాజసమున
ఫలములు వేర్వేరఁ బరగు చుండు
కలహముల్ కయ్యముల్ గలుగుచుండును నెప్డు
తామసాహంకృతి తగిలెనేని

గీ. కాన నీజగముల నహంకారమెద్ది
యైన లేకున్న కార్యమింతైన జరుగ

దదియు శుభము నైన నశుభంబైనగాని
దీని మించిన బంధమ్ముఁ గానమెందు

229. కం. పుట్టుటయును పెరుగుటయును
గిట్టుటయును మరల పుట్టి గిట్టుచునుంటల్
నెట్టన కర్మాను గతిని
గట్టిగ బంధమ్ములౌను కల జీవులకున్

230. సీ. మీనజన్మంబెత్తి దానవున్ వధియించి
వేదమ్ములన్ దెచ్చె విక్రమమున
కూర్మావతారుడై కుధరమ్ము ధరియించి
సంద్రమున్‌ద్రచ్చంగ సాయపడెను
నరసింహమూర్తియై సురవైరి వధియించి
ప్రహ్లాదు రక్షించె భక్తవరుని
వామన మూర్తియై బలినడంచెను దాన
మర్థించి సురల యభ్యర్థనమున

గీ. యుగయుగమ్ముల నట్టులే యుద్భవించు
పద్మనాభుడు కర్మసంబంధముననె
అట్టి మహనీయునకె తప్పవయ్యె ననిన
కర్మబంధమ్ము లెవరిని కట్టకుండు

231. కం. భృగు శాపమ్మున వెన్నుం
డగణితమగు జన్మలెత్తె నాశ్చర్యముగన్
తగ నీమన్వంతరమున
నొగి భూభారమ్ము నడప నుద్యుక్తుండై

232. వ. ఆ భృగుశాప వృత్తాంతంబిపుడేను నీకు నెఱింగించెద సావధానుండవై వినుము.

## శుక్రాచార్యునితపస్సు

233. తే.గీ. కనకకశ్యపు దమర వర్గముల తోడ
వైరమున్ బూని వేల సంవత్సరములు





యుద్ధమొనరించి తుదకు తానోడిపోయె
అతడు దేహమ్ము విడిచిన యంతనతని
సుతుడు రాజయ్యె ప్రహ్లాదు డతులగుణడు

234. చం. అతడును తండ్రి యట్టులె నిరంతరమున్ దివిజాళితోడ పో
రితములు సల్పి సల్పి దివిజేంద్రునకోడి విరోచనాత్మజున్
వితత గుణాఢ్యుడౌ బలిని వేడుక నేలికఁ జేసి యేగె స
న్మతి విపినంబులన్ దపమొనర్పగ భోగవిరక్తచిత్తుడై

235. చం. బలియును తాత తండ్రులటు పాయక దేవగణమ్ము తోడ సం
కుల సమరమ్ములన్ సలిపి కుంఠిత సర్వపరాక్రముండునై
నిలువగలేక నోటువడ నిర్జరవైరులు భీతిఁ జెంది కా
నలఁ బడి పర్వులెత్తి భృగునందను శుక్రుని, జేరి రెల్లరున్

236. ఉ. చేరి నమస్కరించి తమ శిష్యుల మౌ మమునుద్ధరింపుమో
భూరిగుణాలవాల! కడు పూజ్యులు మీరలు, మిమ్ము సాయమున్
గోరగ నేగు దెంచితిమి; కూడదనన్ మఱి దిక్కులేదు, మ
మ్మారసి నీవె బ్రోవవలె నంచు విధేయత దోప వేడినన్

237. చం. అతడును నార్ద్ర చిత్తుడయి యయ్యసురాళిని నూఱడించి స
మ్మతి నభయం బొసంగి యిక మానుడు మీభయ సంభ్రమంబులన్
వెతలను దీర్తు మీకిపుడె విస్తృతమౌ భవదీయ దైహిక
క్షతులను మాన్పివైచెద ప్రశస్తతమంబగు వైద్యవిద్యచే

238. ఆ.వె. నాదు బుద్ధి చేత నాతపశ్శక్తిచే
సాయపడుదు మీకు జడియఁ బోకు
డనుచు వల్కి శుక్రు డాదైత్యులకునెల్ల
గాయములను మాన్పె కరుణతోడ

239. చం. దితిసుతులెల్లరున్ మిగుల దీనత శుక్రునియండఁ జేరి య
య్యతుల తపః ప్రభావు నభయంబును బొందిరటన్న వార్త దే
వతలకు గూఢచారు లతి వైళమదెల్ప దివౌకసుల్ మహా
చతురత నొక్కచో గలసి చర్చలొనర్చిరి విస్తృతంబుగన్

240. కం. భృగుతనయుండగు శుక్రుడు
తగ మంత్రాంగములు పన్ని దైత్యుల కొనరన్
మగటిమి పెంపొందించిన
నగచాట్లే యగును తప్పు దంచుఁ దలచుచున్

241. చం. సురపతి నాయకత్వమున సుస్థిర విక్రమమొప్ప దేవతల్
సరగుననేగి యాదితిజ సంఘములన్ వడి చుట్టు ముట్టి, భీ
కరగతిఁద్రుంచిరెందరినొ కాళులు చేతులు మొండెముల్ దలల్
నరుకుచు శోణితమ్ములు ననల్పముగా ప్రవహింప నేరులై

242. కం. చావక మిగిలిన వారలు
బావురు మని కేకలిడుచు పరుగు పరుగునన్
కావుము కావుము గురువర
కావుము మమ్మనుచుఁజనిరి కావ్యుని కడకున్

243. కం. సురలును శుక్రుని గని తా
మరిగిరి యిక చంపవలదటంచు దలచి వెన్
దిరిగి యమర పురమున; కా
సురవైరుల పాట్లు చూచి శుక్రుండంతన్

244. కం. రక్కసులఁ బిలిచి వారిని
పెక్కుగ నోదార్చి యంత ప్రియమారంగన్
స్రుక్కకు డని పలుకుచు తా
నొక్క యుపాయమ్ము మదిని నూహించి వెసన్

245. ఉ. వారలకున్ జనార్దనుడు పాయక సాయమొనర్చుచుండె, నా
సారసనాభు గెల్వఁ దగు చక్కని మార్గము దోచదయ్యె, గౌ
రీ రమణుండె దిక్కిక భరింపగ నెవ్విధినైనఁ గాన, మీ
రోరిమి నుండు డిండె, భవునొద్దకు నేఁ జని వత్తు నిప్పుడే

246. మ. అని కావ్యుండు వచింప దైత్యులని రయ్యా! మీరలిచ్చోట లే
రనినన్ నిర్జరు లూరకుందురె? భయంబౌనయ్యా! వీరాగ్రణుల్
మునుపెక్కండ్రు గతాసులైరి యికపై పూర్ణంబుగా మమ్ము వి
త్తన మేనిన్ గననీక చంపెదరు సత్యంబిద్ది విప్రోత్తమా!





247. మ. కడుదైన్యమ్మున నిట్టు లయ్యసుర సంఘమ్ముల్ భయోద్వేగులై
నుడువన్ వారల గాంచి శుక్రు డనియెన్ దూర్ణంబుగా వెళ్ళి యి
య్యెడకున్ వచ్చెద నంతదన్క నిటనే యెచ్చోటనేనిన్ గనం
బడకుండన్ దలఁ దాచుకొండు తపముల్ భద్రంబుగా జేయుచున్

248. తే.గీ. అభవు మెప్పించి మంత్ర విద్యను గ్రహించి
వచ్చి యుపదేశ మిచ్చెద వగవవలదు
సామదానమ్ములను బూని సమయమునకు
తగిన యట్టుల నుండుటే ధర్మమౌను

249. తే.గీ. అన్ని వేళల పౌరుష మదియు తగదు
దేశకాలాను గుణముగా తిరుగవలయు
శక్తి సమకూరు నందాక, శత్రువులకు
నూడిగమ్మైన చేయుట యుక్తమగును

250. వ. అని వారల నొడంబరచి భృగుతనయుండు నాగాభరణుని
చెంతకుంజనియె నంత

251. సీ. దైత్యులెల్లరుఁ గూడి దానవాగ్రణియైన
ప్రహ్లాదు కడకేగి పలికిరిట్లు
ఉభయ పక్షమ్ముల కొప్పెడి వాడవు
దివిజుల కడకేగి తెల్పుమిట్లు
వల్కలమ్ములు దాల్చి వైరాగ్యమును బూని
ఆయుధమ్ముల వీడి అడవులందు
తపము సేయుదురింక దైత్యులు కావున
వారితో యుద్ధమ్ము వదలు మనుచు

గీ. మాదు సందేశమును నయ్యమరులకెల్ల
వినిచి రమ్మని వేడంగ వేగనతడు
స్వర్గమునకేగి వారల పల్కులెల్ల
వరుస విన్పింప నమరులు వల్లెయనుచు

252. ఉ. తామును పెక్కుయుద్ధములు దానవవీరుల తోడ మున్ను వి
శ్రామము లేక సల్పి కడుశాంతిని బొందఁ దలంచిరేమొ సం

గ్రామపు యత్నముల్ విడచి కాలము పుచ్చుచు నుండిరంత నా
రామములందు నిత్యము సరాగము లొప్పగ నాటపాటలన్

253. తే.గీ. అచట దితిజులు కశ్యపు నాశ్రమమునఁ
దపము లొనరించుచుండిరి దంభవృత్తి
గురుని రాకను నాత్మలఁ గోరు కొనుచు
సురల నోడించుటొక్కటే పరమ గతిగ

254. చం. భృగుతనయుండు శుక్రుడును ప్రీతి దలిర్పగ శంభునొద్ద క
ృత్యగణిత భక్తినేగి తనహస్తయుగమ్ముల మోడ్చిమ్రొక్కి యో
నగవర భవ్యవాస! దితినందనులన్ సురలెల్లఁ గూడి బి
ట్టుగ వధియించుచుండ బెగడుల్ వడివచ్చిరి నాదుచెంతకున్

255. తే.గీ. అభయ మిచ్చితి వారికో యభవ! నేను
దేవగురు నొద్ద లేనట్టి దివ్యమంత్ర
ములను నా కొసంగుము వేగ, భూతనాథ!
ఆదితేయుల గెల్వంగ నవసరమ్ము

256. మ. అని ప్రార్థింపగ శంకరుండతని దుర్వ్యాపారమున్ మానసం
బున యోచించి యితండు దేవతల సంపూర్ణంబుగా నాశనం
బొనరింపన్ దలపోసె; దైత్యులకు తా నొప్పంగ నాచార్యుడై
తన శిష్యాళి జయమ్మె కోరు కొనియెన్ దథ్యమ్ము భావింపగన్

257. కం. కావున నేనును నమరుల
కేవిధమగు హాని కలుగనీయ నటంచున్
భావించి శంకరుం డపు
డావిప్రునిఁ గాంచి యిట్టు లనియెన్ బ్రీతిన్

258. సీ. నీవు కోరిన కోర్కె నెరవేర వలెనన్న
కలదొక్క మార్గమ్ము కఠిన తరము
తలక్రిందుగానొక్క తరుశాఖఁ బాదముల్
గీలించి వ్రేలుచుఁ గ్రిందినుండి
ధూమమ్ము ముఖమున కేమర నీయక
తగులు నట్టులఁ జేసి తపమునిష్ఠ
వెయ్యేండ్లు సలిపిన పిదప నీకోరిన
మంత్రముల్ లభియించు మానితముగ

గీ. కాన యత్నింపుమని నీల కంఠుడనగ
కావ్యుడున్ సమ్మతిన్ దెల్పి కాననముల
కేగి యారీతి తపము నహీన గతిని
సలిపె వెయ్యేండ్లు మిక్కిలి శ్రమకునోర్చి

259. ఉ. ఈ విషయమ్మెఱింగి సురలెల్లరు విస్మయమంది యక్కటా!
భావములందు దైత్యులతి వంచనఁ బూని తపంబులొప్పగా
వావిరిఁ జేయుచుంటిమని పల్కుచు దూతను బంపి నేడు వా
రీవిధి కుట్ర సేయుదురె? యింతకు మించిన ద్రోహమున్నదే?

260. చం. అని కడు తీవ్రకోపులయి యగ్గిని గుగ్గిల ముంచినట్లుగా
కనలుచు నొక్క పెట్టున జగత్ప్రళయాగమనంపు వేళయో
యన దిశలెల్ల పిక్కటిల నార్చుచు వేగమె వచ్చి దైత్యులన్
గొనకొని తాకి రుగ్రగతిఁ గూడి దివౌకసు లెల్లరయ్యెడన్

261. కం. అనుకొనని విధంబున ని
ట్లనుకంపలు మాని దివిజు లాగ్రహమున తా
మని యొనరుప కారణమే
మనుకొనుచు సురారు లిట్టు లనిరి చకితులై

262. ఉ. దేవతలార! మీరిటుల తీవ్ర తరంబుగ నెత్తివచ్చి మ
మ్మీవిధి చంపఁబూనఁ దగునే? వనసీమల నాయుధమ్ములన్
బోవిడి సత్త్వవృత్తి తపముల్ బచరించుచునున్న మేము మీ
త్రోవల కడ్డు వచ్చితిమె దుర్నయ వృత్తికి సాహసింతురే!

263. కం. శరణన్నవాని, భయమున
పరు వెత్తెదువాని, వ్రతము పట్టిన వానిన్
గురునిన్, భీరున్, జంపుట
సరికాదని పల్కు ధర్మ శాస్త్రములెల్లన్

264. కం. దేవతలగు మీరలె దు
ర్భావులునై ధర్మశాస్త్ర పద్ధతి విడి మ

మీ్మవిధిని నిరాయుధులను
తీవరపడి చంపఁదగునె తెప్పతికమునన్

265. వ. అని ప్రార్థింప దేవత లాగ్రహోదగ్రులై

266. శా. ఔరా! యెంతటి నంగనాచులు రణవ్యాపారముల్ మాని సాం
ద్రారణ్యంబులలో తపంబులను సేయం బూనినామంచు నా
డారీతిన్ వచియించి గూఢముగ దివ్యంబైన మంత్రంబు లొ
ప్పారన్ దెండని పంపినారట గదా! యాచార్యుడౌ శుక్రునిన్

267. కం. ఆతడు శంకరు నాజ్ఞన్
ప్రీతిన్ దపమాచరింప వెడలెనటగదా!
భీతిలకుడు మంత్రములను
చేతము లలరంగ మీకు చేకొని వచ్చున్

278. కం. అని యెకసెక్కెము లాడుచు
ననిమిష లతి భీకరమగు నాయుధములతో
దనుజుల పైఁబడ వారును
వనములఁ బడి పరువు లిడిరి భయకంపితులై

279. ఉ. వారటు పర్వులెత్తి భృగు భార్యను చేరి భయాతిరేకులై
మీరె శరణ్యమమ్మ! యనిమేషులు మాపయి నెత్తివచ్చి దు
ర్వార పరాక్రమంబున నుపక్రములై వధియించు చున్నవా
రోరిమిఁ దప్పి తల్లి! యెటులోర్తుము దిక్కెవరింక మాకిటన్

270. కం. అని దైన్యగతిని వేడెడు
దనుజులఁ గని "యుశన" భయముఁ దలగు డటంచున్
నెనరున బల్కుచు వారికి
నొనరన్ దా నభయ మొసగి యూఱటఁ బుచ్చెన్

271. ఉ. ఐనను దేవతల్ వదల కాశ్రమ భూమికి నేగుదెంచి దీ
నాననులైన దైత్యులను హత్యలొనర్చుచు నుండఁ జూచి య
మ్మౌని వరేణ్యపత్ని యిది మంచిది గాదని యెంతచెప్పినన్
వీనుల కెక్కనీయక వివేక విహీనులునై చరింపగన్





272. కం. అది గని భృగుపత్ని "యుశన"
త్రిదివాధీశుడు మొదలుగ దివిజుల నెల్లన్
నిదురల్ గూరగఁ జేసెను
పదిలంబౌ తన తపః ప్రభావముచేతన్

273. మ. సురనాథుండును నిద్రకున్ గడగ విష్ణుం డద్ది వీక్షించి స
త్వరుడై యాతని దేహమున్ దనదు దివ్యంబౌ శరీరమ్ములో
నిరవందన్ నిలుపంగ నయ్యదియు తానీక్షించి యాయిర్వురన్
సరిగా నిద్దురఁ గూర్చె నా "యుశన" యాశ్చర్యమ్ముగా నయ్యెడన్

274. కం. ఇరువురను నిద్రఁ గూర్పగ
సురనాథుండపుడు చక్రిఁ జూచి యిటులనెన్
సురవంద్యా! యింతియనుచు
నరయక వధియింపు మింక నాభృగు పత్నిన్

275. ఆ.వె. చంపకున్న మనల చంపును నిర్వుర
ననుచు పలుక విష్ణుడపుడు వేగ
తన సుదర్శనమును మనమున స్మరియించి
పంపె నామె పైకి పౌరవేంద్ర!

276. చం. అదియును తీవ్రవేగమున నగ్నికణమ్ములఁ జిమ్ముచున్ దిశా
మదగజ సంఘముల్ ప్రిదల క్ష్మాతల మెల్లను కంపమంద గ్ర
క్కదలగ శైల సంఘములు గ్రందిలుచున్ జని యామెకంఠమున్
విదళనఁ జేసె రాక్షసులు భీతిల దివ్యులు మోదమందగన్

277. తే.గీ. నిదుర లేచిరి దేవతల్ ముదముతోడ
చక్రియును, నింద్రుడును, సంతసమును బొంది
రైనను భృగు మహర్షి తా నాగ్రహమున
శాపమిడు నేమొ యనియెడు శంక గలిగె

278. చం. తనసతిఁ జంపె విష్ణుడు సుదర్శన చక్రము చేత నన్న వా
ర్త నపుడెఱింగి యాభృగువు దైన్యమునన్ విలపించి యక్కటా!
వనిత యటంచు, బ్రాహ్మణుని పత్నియు నంచును నెంచఁ బోక య
వ్వనరుహ నాభు డివ్విధిని వక్రగతిన్ వధియింపఁ జెల్లనే

279. ఆ.వె. చంపుమనిన వాడు శక్రుడే యైనను
చంపినట్టి వాడు చక్రిగాన
విడువఁ దగదు వాని వేవురు చెప్పినన్
శాపమిత్తు ననుచు సంభ్రమమున

280. వ. వెన్నుని సమీపించి

281. ఉ. సారసనాభ! నీవు కడు సాత్త్విక వృత్తిఁ జరింతువంచు లో
నారయు వార లెల్లరు ననార్యులె యౌదురు; తామసంబు నీ
లో రమియించు చున్నయది; లోకము ఛీయన దుష్టబుద్ధివై
నారిని సంహరించితివి, నాయెదఁ జిచ్చు రగిల్చి తెంతయున్

282. ఉ. కావున దుస్సహంబయిన గర్భ నివాస దురంత దుఃఖముల్
నీవును పొందు మింక ధరణిన్ బలు మారులు జన్మలెత్తు మం
చా వనజోదరున్ భృగుమహర్షి శపించెను తీవ్రమైన కో
పావిల మానసుండగుచు హస్తమునన్ జలమెత్తి చల్లుచున్

283. కం. ఆ కారణమున విష్ణుం
డీ కాశ్యపి నవతరించి యెల్ల యుగములన్
శ్రీకరముగ ధర్మమ్మును
ప్రాకటముగ నుద్ధరించు పరమాత్ముండై

284. వ. అనిపలికి వేదవ్యాసుండు జనమే జయుంజూచి మరలనిట్లు వచిం
ప దొడంగె.

285. చం. భృగువటు శాపమిచ్చి చని వేగమె భార్య శిరమ్ముఁ దెచ్చి తి
న్నగ నతికించి మొండియమునన్ దగ; "నేనిరతమ్ము ధర్మమున్
దెగి విడకుంటినేని, గణుతింపగ శీలముఁ దప్పనేని, యీ
మగువ మరుక్షణంబుననె మానుగ జీవిత మొందుఁ గావు తన్"

286. కం. అని పలికి శీత జలముల
తన సతిపై చిలకరింప తక్షణమున నా
వనితామణి లేచి నిలిచె
తనమోమున లేత నగవు తగ మొలకెత్తన్

287. కం. సంతసమందెను సృష్టియు
సంతోషము లంది రెల్ల సాధు జనంబుల్
ఎంతటి ప్రేమము సతిపై
నెంత తపశ్శక్తి భృగు మునీంద్రున కనుచున్

288. చం. తపమది పూర్తి యైన యెడ దైత్యగురుండిక నేమి చేయునో
యపకృతి మాకటంచు నమరాధిపు డాత్మఁ దలంచి యెట్టులేన్
గృప విడనాడి తత్తపముఁ గీడ్వడఁ జేయుట యుక్త మంచుఁ దా
నపుడు జయంతినిన్ బిలిచె నాత్మజ నబ్జదళాయ తేక్షణన్

289. క. అమ్మా! నిను మును శుక్రున
కిమ్ముగ దానమ్ము నొసగి తెంతయుఁ బ్రీతిన్
అమ్మహితాత్ముం డిపుడు వ
నమ్ముల ఘోరతర తపమొనర్చుచు నుండెన్

290. ఉ. నీపతిఁ జేసి కొమ్మతని నేర్పున సర్వసపర్య లొప్పుగా
ప్రాపున నుండి చేయుచుఁ దిరమ్ముగ తన్మదిఁ దోచుకొమ్ము, నీ
వీపని చేయ దేవతల కెల్ల విధంబుల సేమమౌను, నీ
కోపిన యట్లు సేయఁ దగు నోతనయా! శుభమౌను పొమ్మికన్

291. మ. అనినన్ సమ్మతిఁ దెల్పి యామెయును శుక్రాచార్యు సేవింపగా
వనమున్ జేరి, యటన్ మహా నియమమున్ బాటించి యేకాగ్రతన్
దన శీర్షంబును క్రిందుగా పదము లూర్ధ్వంబౌనటుల్ జేసి యా
ననసీమన్ బొగ చుట్టుముట్ట తపమున్ గావించు కావ్యున్ గనెన్

292. ఉ. ఏపగు ఘర్మ ధారల సహింపక యుండెడివేళ వానికిన్
బ్రాపయి వీవనన్ విసరు, పాయక శీతజలమ్ము లిచ్చి దా
హోపశమమ్మొనర్చుచు కుచోపరి చేలమునెత్తి భాను సం
తాపమడంగ ఛత్రము విధంబునఁ బట్టుచు ప్రీతిఁగూర్చుచున్

293. సీ. మధురస ఫలముల మానుగఁ గొనివచ్చి
ప్రియమార నతనికిఁ బెట్టు చుండు
సమిధలు కుసుమముల్ సమకూర్చు నిత్యమ్ము
నగ్నిహోత్రాది కార్యములు నెఱప

చిగురు టాకుల తోడ సెజ్జ నేర్పరచును
మెత్తగ నాతడు మేను వాల్చ
స్తుతియించుచుండును హితమైన పల్కుల
మనసు రంజిల్లంగ ననుదినమ్ము

గీ. ఆదరమ్మున దరిఁ జేరి యధిక భక్తి
నిర్వికారంపు భావమ్ము నెక్కొనంగ
బ్రహ్మచర్యవ్రత నియమ పాటవమున
సేవ లొనరించు నిర్మల చిత్తయగుచు

294. చం. చనియె సహస్ర వర్షములు, శక్రున కేమియుఁ దోచదయ్యె శు
క్రుని విధ మెద్దియో? తనయకున్ వశుడయ్యెనొ, లేదొయంచు నె
మ్మనమున సంభ్రమంబు నను మానము హెచ్చగ భృత్య వర్గమున్
బనిచెను నచ్చటన్ గలుగు వార్త లెఱుంగగ గోరి కొందరన్

295. కం. ముగిసెను శుక్రుని తప మటఁ
దిగ కంటియు మెచ్చివచ్చి దితిజ గురునకున్
దగనొసగె నవధ్యత్వం
బొగి సర్వజ్ఞత్వమును మహోత్సాహమునన్

296. కం. వరములొసగి పరమ శివుం
డరిగెను, ముదమంది కావ్యు డా చెంగటనే
దరహసి తానన యౌ నా
సరసిజ ముఖిఁ గాంచి యక్కజమున నిటులనెన్

297. మ. తరుణీ! యెవ్వరి దాన విచ్చిధమునన్ ధైర్యమ్ముతో నొంటిగన్
దిరుగన్ గారణమేమి? నీమదిని దేనిన్ గోరి యీ రీతిగన్
గరమున్ భక్తి సపర్యలెల్లపుడు నాకైచేయు, దింకేటికో
యరవిందానన! సంతసించితి వరంబర్థింపుమీ యిచ్చెదన్

298. చం. అనవిని సంతసంబున జయంతియు నిట్లనె సుంతసిగ్గునన్
మునివర! నే మహేంద్రునకు పుత్రిని, పేరు జయంతి, నీపయిన్
మనసయి వచ్చితిన్, బెఱల మానసమందుఁ దలంప, నాపయిన్
నెనరిడి పెండ్లియాడు మిదె నీకయి వేచితి నింతకాలమున్





299. ఉ. కాదనఁ బోకు మంచు పలుకన్ ముని వర్యుడు నింతిఁ జూచి స
మ్మోదము తోడఁ బల్కె వినుమో వనజేక్షణ! పెండ్లి యాడెదన్
నీదగు కోర్కెఁదీర్తు నది నిక్కమె, యైన పదేండ్లు మాత్రమే
మేదిని సంతసంబున రమింత మదృశ్యులమై సుఖంబుగన్

300. తే.గీ. దీని కంగీకరించిన నేను నిన్ను
పెండ్లియాడుదు ననిన సంప్రీతినామె
యొప్పుకొనె నంత శుక్రుడు నువిదఁ గూడి
యాశ్రమముఁ జేరి పెండిలి యాడెనంత

301. కం. ఇరువురు నదృశ్యరూపము
లిరవందగఁ బొంది ప్రీతి యేర్పడ స్వేచ్ఛన్
దిరుగుచు ననంగ కేళుల
నరమరికలు లేక యుండి రానందమునన్

302. చం. తమగురువైన కావ్యు డతి దక్షత శంభుని మెప్పుఁ బొంది, యు
త్తమమగు మంత్రశక్తుల ముదంబునఁ గైకొని వచ్చెనంచు న
య్యమర విరోధు లెల్లరును నాశ్రమునన్ బరుగెత్తి వచ్చి యా
శ్రమమునఁ జూడగన్ గురుని జాడ కనంబడదయ్యె నెచ్చటన్

303. తే.గీ. అత దదృశ్య రూపమున నర్ధాంగి తోడ
నుల్లసంబునఁ దిరుగుచు నుండె ననుచు
నెఱుగఁ జాలక యాశ్రమ మెల్ల వెదకి
తిరిగి వెనుకకు మరలిరి దీన గతిని

## మాయాశుక్రుడు

304. చం. అమర పురిన్ మహేంద్రుడు బృహస్పతిఁ జేరి వివేక సత్తమా!
యమ నియమాదులన్ విడి జయంతిని గూడి సుఖోపభోగ సం
గమమున శుక్రుడుండెనట కార్యములెల్లను విస్మరించి, యీ
సమయము చూడ యుక్తమగు శాత్రవ వీరుల నుక్కడంపగన్

305. కం. ఇంకను పదేళ్ళు శుక్రుడు
పంకజ ముఖిఁ గూడి భోగ పరవశుడై యే

శంకన్ దలపడు గావున
నంకిలి యిక లేదు మనకు నాలోకింపన్

306\. కం. మంచి యుపాయము చెప్పుము
వంచనతోనైన దైత్య వర్గమునెల్లన్
పంచత్వమొందఁ జేయుట
కెంచన్ దగు సమయమిదియె యిద్ధచరిత్రా!

307\. మ. అనినన్ వల్లె యటంచు గీష్పతియు శుక్రాచార్యరూపమ్మునన్
జనియెన్ దైత్యుల చెంత, కంత నసురుల్ సమ్మానపూర్వంబుగా
మనయాచార్యుడె వచ్చెనంచు గురు సంబంధమ్మునన్ స్వాగతం
బెనయన్ బల్కుచు నర్ఘ్యపాద్యముల నెంతేఁ బూజలన్ సల్పినన్

308\. మ. అతడున్ సంతస మంది దైత్యవరు లారా! మీహితమ్మెంచి యే
నతిదీక్షన్ దపమాచరించి భవు నత్యంతమ్ము మెప్పించి పొం
దితి దివ్యంపు వరంబులన్ జయము మీదే యింక నాదిత్యులన్
వెతలన్ బెట్టుడనంగ దైత్యులతనిన్ వేనోళ్ళఁ గీర్తించుచున్

309\. శా. ఆనందంబున గంతు లేయుచును గీతాలాపముల్ సేయుచున్
మేనున్ మేనును తాక కౌగిళుల మేల్మేలంచు బిట్టార్చుచున్
ప్రాణంబుల్ నిలఁ బెట్టె శుక్రుడని తత్పాదంబులన్ మ్రొక్కుచున్
నానారీతుల దైత్యులెల్లరును వింతల్ సల్పి రప్పట్టునన్

310\. వ. అనియీరీతి వేదవ్యాసుండు వచించుచుండ జనమేజయునకు
మనంబున ననేక సందియమ్ములు వొడమ మునివరుంజూచి
యిట్లనియె

311\. కం. అయ్యా! వ్యాసమహర్షీ!
తియ్యంబున మీరు చెప్పు దివ్యచరిత్రల్
నెయ్యంబున వినుచుండగ
నొయ్యన పలుసంశయమ్ము లొదవెడు మదికిన్

312\. చం. దివిజులకెల్ల పూజ్యుడు, విధిజ్ఞుడు, నంగిరసర్షి పుత్రుడున్
అవిరళ ధర్మవేత్తయు బృహస్పతియే నయవంచనక్రియల్





దివిరి యొనర్పనేల; గణుతింపడె తా పరమాత్మఁ జేరగా
ప్రవిమల సత్యమొక్కటె యుపాయమనంబడు శాస్త్రవాక్యమున్

313\. తే.గీ. ఇన్ని తెలిసిన యాతడే యిట్టులైన
జగతి నితరుల నననేల సాధువర్య!
బుద్ధి చెప్పంగ వలసిన బోద్ధలకట;
పాడిఁ దప్పిన ధర్మ మేపగిది నిలుచు

314\. ఉ. స్వార్థమె ముఖ్యలక్ష్యముగ సన్ముని వర్యులు సైత మివ్విధిన్
స్పర్థలఁ బెంచుచున్ గడు నసత్యవచః పరిపోషులైన వే
దార్థములేమి కావలె? బృహస్పతి కియ్యది నీచకార్యమం
చర్థముగాదొ? ధర్మమున కాదర మెద్దిక? నిట్టులైనచో

315\. కం. దివిజులు సాత్వికులనియును
భువి మనుజులు రాజసమునఁ బొల్తురటంచున్
వివిధములగు తిర్యక్కులు
నవి తమమున నుండు నందు రఖిల మునీంద్రుల్

316\. ఉ. అట్టియెడన్ బృహస్పతి సురావళికిన్ గురుదేవుడయ్యుఁ దా
నిట్టుల సాత్వికమ్మువిడి యీసున సత్యవిదూర మార్గమున్
బట్టిన, నింక సత్యగుణవాదులు రాజస తామసంబులం
దెట్టు లభింత్రు? ధర్మమున కెయ్యది తావల మిట్టులైనచో

317\. మ. అని యావేదన తోడఁ బల్కు నతనిన్ వ్యాసుండు వీక్షించి యో
జననాథా! భువనంబులన్ గడు విశిష్టంబైన వారేనియున్
తనువుల్ దాల్చిన యట్టి యెల్లరును స్వార్థంబొక్కటే లక్ష్యమై
దినముల్ పుచ్చుచు నుందు, రేలయిక సందేహింప రాజాన్వయా!

318\. చం. అరయఁ ద్రిమూర్తులైనను సురాధిపుడాదిగ లోకపాలురేన్
పరివృత రాగసంయుతులె, పైకి విరాగుల వోలె కొందరున్
గరమునటింతు రంతె కలకాలము సాగవు వారి వేషముల్
పొరిపొరి సంకట స్థితులఁ బొల్చును వారి నిజస్వభావముల్

319\. తే.గీ. పరుల కుపదేశ మొనరించు పట్టులందు
నెల్లవారును పెద్దలే యెంచి చూడ

ఆచరించెడు సమయమ్ములందు మాత్ర
మొక్కరైనను స్థిరముగ నుండరెందు

320. మ. ఒకచో నిష్ఠఁ దపం బొనర్చు, నొకచో నొప్పార నర్ధాంగితో
ప్రకటంబౌను, మరొక్క చోట సురలన్ రక్షింప దైత్యాళితో
నకలంకస్థితిఁ బోరి తీవ్ర శర ఘాతాళిన్ జవిన్‌జూచు నొ
క్కొకచో వారలగెల్చు, నోడు నొకచో నూహింప వైకుంఠుడున్

321. కం. లోకక్షేమము కొఱకై
చేకొను సుఖ దుఃఖములను, శేషునిపై న
వ్యాకుల గతి నిద్రించును,
మేకొని తనయంతఁ దానె మేల్కొను చుండున్

322. తే.గీ. అజుడు శివుడును మఱియు పాకారియైన
తనువులన్ వీడి చనుటది తథ్యమధిప
తిరిగి జగదంబ యాజ్ఞచే దేహములను
దాల్చుచుందురు పూర్వ విధమ్ముదోప

323. మ. పర తత్త్వమ్ము నెఱింగి, లోనియరిషడ్వర్గంబులన్ ద్రుంచి, దు
ర్భర సంసార మహాబ్ధి దాటి కడు విశ్రాంతిన్ మదిన్ బొందు వా
డరయన్ గన్పడఁడీ జగంబుల, శరీరాధ్యాసచే దుఃఖ సం
సరణాబ్ధిన్ బడి మున్గువారె యెటఁ గాంచన్ సర్వకాలమ్ములన్

324. చ. తనర గృహస్థ ధర్మమును దాల్చినవారలు సర్వసంగముల్
గొనకొని వీడఁ బూనుటది గొంగళినన్నము నేరుచందమౌ
ననయము నెల్ల యత్నముల నావల నుంచి మనంబునన్ జగ
జ్జననిని నిల్పికొల్చుటది చక్కని మార్గము ముక్తిఁ బొందగన్

325. శా. మాయావాగురఁ జిక్కి వెల్వడ మహామాయార్చనం బొక్కటే
సేయంగాఁ దగు దేహధారులకు, స్వస్తిన్ బొంద సాధ్యంబగున్;
మాయాసృష్టికి కారణంబగుట నంబన్ భక్తి సేవింపకే
పాయన్ వచ్చునె? తత్కృతంబులగు దుర్వారంపుటజ్ఞానముల్

326. క. కరుణానిధాన మగు నా
పరదేవిని నిర్మలంపు భావము తోడన్





పరిపరి నర్చించిన దు
ర్భర దుఃఖములెల్లఁ బాయుఁ బడయుసుఖమ్ముల్

327. వ. అని పల్కి వేదవ్యాసుండు మీది వృత్తాంతంబు జనమేజయున
కిట్లని వచించె.

328. మ. కురువంశాబ్ధి సోమ! గీష్పతి యటుల్ గూఢంబుగా రూపమున్
సరిగా శుక్రుని యట్లు మార్చి యరుగన్, శంకింప కాదైత్యులున్
గురుడీతండె యటంచు నమ్మి యతనిన్ గూర్మిన్ మహోత్సాహులై
కరమున్ సేవలొనర్పసాగి రతి సఖ్యంబొప్ప రేయిన్ బవల్

329. ఆ.వె. గడచి పోవుచుండె కాలమీలాగున
ఒక్క మంత్రమైన నొసగడయ్యె
శ్రమయె మిగిలె దైత్య సంఘమ్ములకునెల్ల
అమర గురుని మోస మరయరైరి

330. చం. అచట జయంతిఁ గూడి యమరారి గురుండు నదృశ్యరూపుడై
ప్రచురిత రాగబంధమున పాయక నిత్య మనంగ కేళులం
దచల మనస్కుడై మునిగి హాయనముల్ పది నిండ పూర్వపున్
వచనము గుర్తురా నిటులఁ బల్కె సరోరుహ నేత్రఁ జూచుచున్

331. ఉ. చారు సరోజ లోచన! విశంకట వృత్తి చరించినార మిం
పారగ నీ ప్రదేశముల హాయిగ నొక్కపదేండ్లు, నాడు నిన్
జేరగఁ దీసినప్పుడు వచించిన యా గడు విప్డు నిండె, నా
వారల, శిష్యవర్గముల వైళమ చూడఁ దలంపు గల్గెడిన్

332. ఉ. నాకొఱ కెల్ల శిష్యులు ననారత మచ్చట చూచుచుందురో
నాకినిఁ బోయి వచ్చెదను నన్ ముదమారగ సాగనంపు మం
చా కమలాక్షితో ననగ; నామెయు వల్లె యటంచుఁ బల్కె నే
నీకయి చూచుచుందు ననునిత్యము వేగమె వెళ్ళి రమ్మనెన్

333. ఉ. అంతట సంతసంబున జయంతిని వీడ్కొని యేగె శుక్రు డ
త్యంతరయంబు తోడ నమరారుల చెంతకు; నచ్చుటన్ గడున్
వింతగ స్వస్వరూపమును వీడి బృహస్పతి తన్నుబోలి ని
శ్చింతగ జైన ధర్మముల శిష్యులకున్ వచియించుచున్ దగన్

334. తే.గీ. దైత్య వరులార వచియింతు సత్యమిదిగొ
ధర్మముల కెల్ల శ్రేష్ఠమౌ ధర్మమనగ
నది యహింసయెకాన నిత్యమ్ము మీర
లెంతదుష్టులనైన వధింప వలదు

335. చం. పసులను యజ్ఞ యాగములఁ బట్టి వధించుట హింసగాదటం
చుసురులు దీసి యద్ది నిగమోక్తి యటంచు వచించుటెల్ల భూ
మిసురుల కల్పనంబెయగు మీరలు నమ్మకుడట్టి వాక్యముల్
శసనము వీడి యెల్లరు ప్రశస్తిగఁ బూను దహింస నింతటన్

336. చం. అని యుపదేశముల్ సలుపు నాతని శుక్రుడు గాంచి యెంతయున్
మనమున నక్కజంపడుచు "మాయికుడీతడు నీచ బుద్ధిచే
దనుజుల మోసగించెఁ గద"! తానిటు, లోభమదెంతహేయమౌ
పనులకునైన నెల్లర నవారణ ప్రేరణసల్పు నక్కటా!

337. చం. దివిజగురుండితండు కదు ద్వేష్యుడు నాకు మదీయ రూపమున్
రవళి ధరించి రాక్షసులడాసి కడుంగడు లోభ బుద్ధిచే
నవిరళరీతి హింస వలదంచును బోధలు చేయుచుండె, ని
ట్లవురు! తలంప లోభమది యాధ్యుల నైనను జేయు వెఱ్ఱులన్

## దైత్యులకు శుక్రునిశాపం

338. చం. అని తల పోసి శుక్రుడు సురారుల చెంతకు వచ్చి నవ్వి తా
ననియెను దైత్యులార! కడు నక్కజమయ్యెడు, నాదు రూపమున్
గొనకొని దాల్చి గీష్పతి నిగూఢముగా జనుదెంచెనంచు మీ
మనముల నెంచరైతిరన; మాయికుడీత డెఱుంగు డింతటన్

339. మ. సురకార్యమ్మును చక్కఁ బెట్టుటకునై చోద్యంబుగా నీత డి
ట్లరుదెంచెన్ సురపూజ్యు డచ్చుగ మదీయాకారమున్ దాల్చి, మీ
గురుడన్ శుక్రుడ నేనె నమ్ము డికపై కూటాత్ముడౌ వీనిపై
గురుభావమ్మును వీడి నాకడకు సంకోచింప కేతెంచుడీ

340. వు. అనినన్ రాక్షసులెల్లరున్ మనములం దాందోళనల్ సెంది మె
ల్లన నయ్యిర్వుర నట్టులేగనుచు తేల్చన్ లేక యిందెవ్వరో
మన యాచార్యుడటంచు సంశయములన్ మారాడ బోకట్టులే
ఘనశిల్పమ్ముల వోలె చేష్టలొగిఁ దక్కన్ నిల్చి రొక్కుమ్మడిన్

341. చం. అదిగని యాబృహస్పతి సురారులతోననె శిష్యులార! మీ
హృదయములందు సందియములేల నిజంబుగ నేనె శుక్రుడన్
త్రిదశుల మేలు గోరి చనుదెంచె బృహస్పతి నాదు వేషమున్
పదిలముగా గ్రహించి, యటు ప్రక్కకుఁ బోకుదు నిల్వుడిచ్చటన్

342. తే.గీ. శంకరుడు నాకొసంగిన సకల విద్య
లెలమి యుపదేశ మొనరింతు నిపుడెమీకు
దేవతా విజయమొదవు దితిజు లార!
సంశయింపకు డిద్ది నిశ్చయము సుమ్ము

343. తే.గీ. అతని మాటలు వినిన సురారులెల్ల
తమ గురుం డితడెయని యాత్మలఁ దలంచి
నిజగురుని విశ్వసింపగ నేరరైరి
యెంత బోధించినను విన నియ్యకొనక

344. ఉ. ఈతడె మాగురుండు తపమీశ్వరుఁ గూర్చి సహస్రవర్షముల్
భాతిగ తానొనర్చి కడు పావన మూర్తి, దయాగుణుండు వి
ఖ్యాతిగ సర్వవిద్యల ననారతమున్ గఱపించుచుండె సం
ప్రీతిగ మాకు, నీవెవరొ? పెక్కులు ప్రేలకుమింక దుర్మతీ

345. కం. నీవెవరొ? మేమెఱుంగము
భావింపగ నీవె మమ్ము వంచింపంగా
నీ విధి శుక్రుని వేషము
తోవచ్చిన గీష్పతివని తోచుచునుండెన్

346. కం. నీ వచ్చిన దారిననే
వేవేగన్ జనుము లేక వేఁదుఱువలె నీ
వీవిధి ప్రేలుచు నుండిన
గావింతుము తగిన శాస్తి గౌరవ ముడుగన్

347. చం. అని సురవైరు లెల్లరొకటై బెదిరించగ నాజ్యధారలన్
గనలెడి యగ్ని కీలయన కావ్యుడు క్రోధ విలోలితాంగుడై

వినుడిదె మూర్ఖులార! య వివేకముతో నను ధిక్కరించి యి
ట్లనుటకు సైపఁ జాల మిమునందర నే శపియింతుఁ జూడుడీ!

348. కం. అని హుంకరించి మీరలు
ఘనమగు నవమానములను గాంచెద; రటుపై
కననౌదు రీబృహస్పతి
యొనరించిన మోసమెల్ల నొకనాటికినేన్

349. కం. అని శాపంబిడి శుక్రుడు
గునగున నేతెంచె తీవ్ర కోపోగ్రుండై
మనమున నానందించెను
ననిమేషాచార్యు డప్పు డతి గూఢముగన్

350. చం. శమము నశింప భార్గవుడె శాపమిడెన్ దితిజాళికెల్ల, కా
ర్యము తనయంత తాముగిసె, నక్కర లేదిట నుండ నింక, యం
చమరగురుండు మానసమునందుఁ దలంచి నిజస్వరూప మ
చ్చముగ గ్రహించి యేగె వడి శక్రపురంబున కుల్ల సంబునన్

351. చం. చని దివిజేంద్రుఁ గాంచి సురసత్తమ! దైత్యులు శాపదగ్ధులై
వనరుచు నున్న వారిపుడు వారికి సాయమొనర్చు నాధుడున్
గనబడదెచ్చటన్, సులభకార్యము గెల్చుట వారి నిత్తఱిన్
చని యెదిరింపు మీవనుచు సంతస మొప్ప వచింప నంతటన్

352. తే.గీ. గురుని పల్కులు వినినంత సురవిభుండు
పట్టగా రాని యానంద ముట్టి పడగ
దివిజ సంఘమ్ములను గూడి తేజమెసఁగ
నెత్తి వచ్చెను దైత్యుల నుత్తరింప

353. వ. ఈ వార్త చారుల వలననెఱింగి రాక్షసులు

## దైత్యుల పశ్చాత్తాపము

354. చం. దివిజు లశేష సైన్యములఁ దేజ మెలర్పగ వచ్చుచుండి, రిం
కెవరిని యాశ్రయింత, మిపుడేది యుపాయము, దుష్టబుద్ధియై





దివిజ గురుండిటుల్ సలిపె; ధిక్కరణంబున శుక్రు మాటలన్
చెవులను బెట్టమైతిమని చింతిలుచున్ దితిపుత్రులెల్లరున్

355. కం. మనగురువని తెలియక య
య్యనఘుని దుర్భాషలాడి యవమానం బ
ట్లొనరించితి మాదినమున
గన నిష్కృతి గలదె మనకు కఠినాత్ములకున్

356. ఉ. ఐనను తప్పు దిప్పు వినయమ్మున శుక్రుని చెంతకున్ గడున్
దీనత దోప నేగి గురుదేవ! మమున్ క్షమియింపుమంచు స
న్మానముతోడ వేడుదము మానుగ పాదములంటిమ్రొక్కి; య
ట్లైన క్షమించునాతడు దయా మయుడంచుఁదలంచియందరున్

357. మ. తమవంశమ్మున పెద్దవాడగు మహాధర్మాత్ముఁబ్రహ్లాదునిన్
తమ ముందుంచుక, దైత్యులెల్లరు ప్రమోదంబొప్ప నేతెంచి, యా
శ్రమభూమిన్ గురుదేవుఁగాంచి వరుసన్ సద్భక్తి తత్పాద ప
ద్మములన్ శీర్షములంట మ్రొక్కి యెలమిం బ్రార్థించి రీరీతిగన్

358. కం. మము మన్నింపుము స్వామీ!
మిమువిడి చనమింకమేము, మీయాజ్ఞలకున్
సుముఖులమై నడచెద మ
య్యమరగురుని మోసమెల్ల నవగత మయ్యెన్

359. మ. అనినన్ శుక్రుడు తీక్ష్ణకోపమున నుగ్రాకారమున్దాల్చి, హు
మ్మని గద్దించుచు, మూర్ఖులార! విశదంబౌరీతి మీకెల్ల నే
వినిపింపన్ గడుబుద్ధి హీనులయి యావేశమ్ముతో నాడు న
న్ననగారాని విధంబునన్ దెగడి నారౌరా! మదోన్మత్తులై

360. కం. దానికి తగిన ఫలంబే
యీనాడిటు సంభవించె నేటికిచింతల్
నేనేమిచేయుదిక మీ
రా నయ వంచకుని వేడు డమరాచార్యున్

361. తే.గీ. అతని మాయలు మంత్రమ్ము లవియెఱుంగఁ
బరుల వంచన సేయ నాతరముగాదు

కాన దయసేయు డచటికే కాలయాప
నమ్ము సేయక స్వర్గ లోకమ్మునకును

362. కం. అనుచున్ దీవ్రస్వరమున
నని యెడి యాచార్యుఁగాంచి యసురులు దిక్కుల్
గనుచుండిరి భయమును, సి
గ్గును, నవమానము పెనగొన కొందల పడుచున్

363. ఉ. వేదనఁజెందు నయ్యసురవీరుల దుస్థితిఁగాంచుచున్న ప్ర
హ్లాదుడు ముందుకేగి వినయంబున శుక్రున కంజలించి, స
మ్మోదమెలర్పఁ బల్కె "గురుపుంగవ వీరు భయాతి రేకులై
మీదరిఁ జేరి, రింకఁ మితిమీరిన శిక్షవిధించ నేటికిన్

364. చం. కొడుకుల వంటి వారు తమకున్ దితి పుత్రులు, వీరిపైన మీ
రుడుగుడు కోప మింక దయయుంచి, తమంతటి వారికిట్లు నే
నుడువఁగలట్టి విజ్ఞుడనె? నొంచుట భావ్యముగాదు వీరలన్
దొడవులుగావె విప్రులకు తోరపు శాంతగుణంబు లెల్లెడన్

365. చం. అదియును గాక మీరలు విషాభరణున్ మది నిల్పి యెంతయున్
సదమల వృత్తి సత్తపము సల్పగ నేగితి రెల్ల మంత్రముల్
ముదమునఁ బొందనెంచి, యదెపో యదనంచు త్వదీయరూప మిం
పొదవ గ్రహించి గీష్పతి యనూహ్యముగా నరుదెంచి యంతటన్

366. కం. నేనే మీగురుడ నటం
చా నాకాచార్యు డనగ నందరమును స
మ్మానించుచు తమరేయని
యానందించితిమి యెఱుగ మన్యం బనఘా!

367. చ. తెలియక చేసినట్టిదిది తెల్లముగావున దోసమంచు మీ
రలుగక మమ్ము నెల్లర దయా మతితో పరికింపుమయ్య! ని
శ్చలముగ మీదు రూపము ప్రశస్తమునై హృదయంబులన్ గడున్
నెలకొనియుంట మీరె యనినెమ్మిఁదలంచితి మయ్య యాతనిన్

368. తే. జలమునకు శీతలత్వము సహజ మెచట
అగ్ని సంపర్కమున నుష్ణమౌను నొకట
అగ్నిఁదొలగింప నవి చల్లనౌను మరల
క్రోధమను నగ్నిఁదొలగించి గురువరేణ్య!
సహజ శాంత స్వభావ విస్తరుడ వగుము

369. తే.గీ. ఇన్ని తెలిసిన మీరలే యిట్లుమమ్ము
వదలి వైచిన నేగతి బ్రతుకఁగలము
వజ్రఘాతమ్ములకు చావ వలయునపుడు
చెప్పుకొననైన నీకొక్క శిష్యుడున్నె?

370. మ. అని ప్రహ్లాదుడు నమ్రుడై పలుకు యోగ్యంబైన వాక్యంబులన్
విని శుక్రుండు ప్రసన్నుడై యసురులన్ వీక్షించి మందస్మితా
ననుడై దానవులార! మీరలిక చింతల్ వీడు డేనుండగా
పనిలేదింక భయమ్ముఁజెంద సురసంబంధమ్మునన్ నమ్ముడీ!

371. తే.గీ. శివుని మెప్పించి తెచ్చిన శ్రేష్ఠమైన
మంత్రరాజమ్ములున్నవి మహిమ గలవి
జరుగవలసిన దెట్టైన జరుగుననుచు
తలచి నిశ్చింతగా నుండవలయు నెపుడు

372. ఉ. కాలము మీకు ప్రస్తుతము కష్టతరమ్ముగ నున్నదయ్య! యి
క్కాలము స్వర్గవాసులకు కామ్యఫలమ్ముల నిచ్చుఁగాన మీ
రాలములందు నోడితిరి, అంతకుమున్ దివిజాళినోర్చి లో
కాలను నెల్ల యేలితిరిగాదె! బలంబయి యోగముండుటన్

373. తే.గీ. వామనాకృతి ధరియించి పద్మనాభు
డెపుడు బలిచక్రవర్తిని నిర్ధచరితు
నాగలోకమ్ముఁ జేర్చెనో నాటినుండి
పతన మారంభమయ్యె మీ వంశమునకు

374. వ. ఆసమయంబున విష్ణుమూర్తి బలికిట్లు వరమొసగియుండెను

375. కం. సావర్ణిక మన్వంతర
మేవేళన్ వచ్చు నపుడె యీరాజ్యంబున్
నీ వేల గలవు మఱియును
నీవే యింద్రుండవపుడు నిశ్చయముబలీ!

376. కం. అని వరమొసగెను గావున
మనమెల్లర మంతదనుక మౌనముతోడన్
దినములు గడపగ వలయును
ననిమిషులకు మంచి కాలమై యుండుటచే

377. వ. అనిపలికి దైత్యకులావతంసుండైన ప్రహ్లాదుంగాంచి

378. శా. పాతాళంబున నీదు పౌత్రుడగు నా వైరోచనుండెంతయున్
భీతిన్ గార్ధభవేషమూని కడు నిర్వేదంబుతో ధ్వాంత సం
వీతంబైన రహస్యమందిరమునన్ పెంపేద జీవించుచున్
భాతిన్ దప్పి మెలంగుచుండఁ జనియెన్ పాకారి యచ్చోటకున్

379. చం. చని పరిహాస మేర్పడు ప్రసంగములన్ బలిఁజూచి "యక్కటా!
మును దితిజాళికెల్లరకు మోదమెలర్పగ నాయకుండవై
ఘన భుజశక్తి నేలితివిగాదె త్రిలోకము, లట్టినీవు నే
డనద విధాన నొంటిగ ఖరాకృతి నుంటకు సిగ్గుఁజెందవా!

380. చ. అని దివిజేంద్రుడిట్లు పరిహాసము సేయగ వానిఁజూచి యి
ట్లనియెను నీదు పౌత్రు "దమరాధిప! దీనికి సిగ్గుఁజెందగా
పనివలదయ్య! పూర్వమల పంకజనాభు డనంతతేజుడే,
గొనకొని పొందలేదె ఝష కూర్మ వరాహ నృసింహరూపముల్

381. ఉ. ఈవును బ్రహ్మహత్యయొనరించి యొకప్పుడు పంకజమ్ములో
చేవ దొఱంగి యుండుట ప్రసిద్ధముగాదె! జగంబులందు నే
జీవులకైన సౌఖ్యములు, చింతలు తప్పవు, దైవ నిర్ణయం
బే విధినుండునో యెఱుగ నెవ్వరికేని యసాధ్య మెన్నగన్"

382. కం. అని బలి పల్కగ విని య
య్యనిమిషపతి మారు పల్క కాంతర్యమునన్
ఘనమగును కాలనిర్ణయ
మనుకొని స్వస్థతను బొంది యరిగె నిజేచ్ఛన్

383. ఉ. కావున దైవ నిర్ణయముఁగాదనఁజాలము దైత్యవర్య! దే
హావరణంబునంగల సురాధిపుడేని త్రిమూర్తు లేనియున్





దైవనియోగమున్ దలను దాల్చి చరించుట తథ్యమన్న నిం
కేవిధిఁ దప్పు దైవగతి యీనర దైత్య దివౌక సాళికిన్

384. వ. కాన ప్రస్తుతము మిన్నకుంట మేలనిన శుక్రుని పల్కులకు ప్రహ్లాదు
డు సమ్మతించె; సమ్మతింపక రాక్షసులిట్లనిరి.

385. ఉ. దేవుడు గీవుడంచు కడు దీనత దోప వచింపనేల, యా
దేవునిఁగన్నవారెవరొ తెల్పుము, వాని స్వరూప మెట్టిదో?
తావల మేదియౌను? భుజదర్పము గల్గిన వీరవర్యులా
దైవము నమ్మనేల? యది ధైర్యవిహీనుల కార్యమెంచగన్

386. ఆ.వె. బలములేని వాడు, భయకంపితాత్ముడు
దైవమంచు మఱియు దయ్యమనుచు
పలుకుచుండుగాని, బల పరాక్రమశాలి
దైవబలము నెపుడు తలపడెందు

387. చం. విజయమొ స్వర్గమో వలయు, వేరొక మార్గము కూడ దియ్యెడన్
త్రిజగము లెత్తి వచ్చినను తీవ్ర రణంబొనరించి శాత్రవ
వ్రజమును నోర్చినల్దెసల పర్విడఁ జేయుదమంతె గాని యీ
ద్విజ సహజంపు పల్కులను వీడి రణంబున కుద్యమింపుడీ

388. తే.గీ. అన్నివిధముల పెద్ద వీవౌట చేత
మమ్ము నడిపింపుమయ్య యోమాన్యచరిత!
యనుచు ప్రహ్లాదునపుడు సేనాధిపతిగ
నెన్నుకొని రెల్లరున్ భేదమింత లేక

389. ఉ. ఆతని నాయకత్వమున నందరు నయ్యమరేంద్రు పట్టణం
బాతత విక్రమ స్ఫురణ నార్భటులన్ పలువాద్యఘోష సం
ఘాతము లొప్పఁ జేరి వడి కయ్యమొనర్చుటకై సుధాశన
వ్రాతముఁబిల్వ, వారు బలభంజనుతో జనుదెంచిరుద్ధతిన్

390. కం. ఇరు వాగుల వారును భీ
కరముగ పోరాడుచుండ గంధర్వులు, కిం
పురుషులు, గరుడులు, మునులున్,
పరికించుచునుండి రమిత భయసంభ్రములై

391. కం. సురపతియును ప్రహ్లాదుడు
శరములు నస్త్రములు మిగుల చాతుర్యమునన్
పరిపరి విధముల వేయుచు
సరియై యొనరించిరపుడు సంగ్రామంబున్

392. మ. అసురాచార్యుని మంత్రశక్తి తమకత్యంతమ్ము సాహాయ్యమై
యొసగన్ దైత్యులు విక్రమించి సురలన్ హింసించుచున్ యుద్ధమం
దసమానప్రతిభావిశేషముల పోరాటంబు సల్పంగ న
య్యసురానీకమె గెల్తురంచచట నూహల్ సల్పి రా ప్రేక్షకుల్

393. కం. శత వర్షంబులు యుద్ధం
బతులితగతి నిట్లు సలుప నాదిత్యులకున్
పతనము తథ్యంబని సుర
పతి తన గురువర్యుఁజేరి ప్రార్థించెనిటుల్

394. కం. గురువర! యుద్ధంబున నీ
సురలెల్లరు నోడిపోవు సూచన మాకున్
దిరముగఁగన్పడు చున్నది
వెరవొక టెఱిగింపు మయ్య! విజయముఁబొందన్

395. కం. అనియడుగ నాది శక్తిని
మనమున ధ్యానింపుమయ్య! మౌనయుతుడవై
నిను విజయము వరియించును
వనరం బని లేదటంచు వాక్పతి పలుకన్

## ఇంద్రుడొనర్చిన దేవీస్తుతి

396. వ. దేవేంద్రుండు వల్లెయని యేకాంతంబునఁ జేరి జగన్మాత నిట్లు స్తుతించె

397. దం. – శ్రీలోకమాతా! పరాశక్తిరూపా! ప్రఫుల్లాబ్జనేత్రా! గదాశంఖ
చక్రాబ్జ శూలాది దివ్యాయు ధోద్దీప్త హస్తా! ప్రశస్తా! జగత్సృష్టికర్త్రీ! జ
గత్పోషిణీ! తోషిణీ! శోషిణీ! దివ్యగాత్రీ! చతుర్వేదముల్ శాస్త్రముల్ మంత్రముల్
తంత్రముల్ నీమహత్వంబొకింతన్ గనన్ నేరవన్నన్ నినున్ సన్నుతింపంగ
నేనెంత వాడన్ మహాబిందురూపీ! భవన్మాయ చేతన్ ద్రిలోకంబులన్





మోహమున్ బొందగాఁజేయుదో సచ్చిదానంద సద్రూపిణీ! దుష్టసం
హారిణీ! శిష్టరక్షాకరీ! బ్రహ్మవిద్యాస్వరూపీ! గుణీ! నిర్గుణీ! పంచ
కోశాంతరస్థా! త్రిమూర్తుల్ సదానిన్ను సేవించుటన్ గాదెసృష్ట్యాది
కార్యంబులన్ నిర్వహింపంగ సామర్థ్యముల్ బొంది రమ్మా! త్రినేత్రీ!
నమస్తే! నమస్తే! నమస్తే! నమః

398. శా. తల్లీ! దిక్కిక నీవెమాకు దితిసంతానంబు మమ్మెల్లరన్
భల్లారే! రణమందు దివ్యబల సంపత్తిన్ జయింపంగ తా
ముల్లాసంబున నున్నవారు గురు మంత్రోద్దీప్త తేజస్వులై,
చెల్లెన్ బ్రాణములింకమాకు జననీ! శ్రీచక్ర సంచారిణీ!

399. శా. మా దుఃఖమ్ములఁబాపు శక్తి గల దమ్మా! నీకె విశ్వమ్ములో
నీ దాక్షిణ్యము గల్గు వారికెగదా నిక్కమ్ము సర్వార్థముల్
మోదంబందగఁగల్గు, నన్యులిక పెంపుల్ దప్పి వర్తింపరే?
నీదౌ ధ్యానమె మోక్షమార్గమగు సందేహమ్ములేదెన్నడున్
శ్రీదా! నిన్ స్మరియింపఁ గల్గుఁగద నిశ్శ్రేయంబు శీఘ్రంబుగన్

400. మ. భవబంధమ్ములఁద్రుంచి భక్తులఁ గృపాపాంగమ్ములన్ నిత్య మీ
వవలోకించెద వన్న సద్యశము నీకబ్బెన్ గదా యీశ్వరీ!
భువనాధీశులు నున్, ద్రిమూర్తులును సంపూర్ణంపు నీతత్త్వమున్
వివరింపన్ దగఁ జాలరమ్మ జననీ విశ్వంభరా! నిస్తులా!

401. శా. మత్తేభంబులపై ధరాధిపులు; సామంతుల్ సమర్పించునా
మత్తేభప్రతిమానయాన లతి సంభావ్యంబునన్ వీవనల్
పొత్తైవీవ, పురంబులన్దిరుగు తద్భోగాదు లేజన్మనో
చిత్తైకాగ్రత నిన్ భజించిన మహాసేవాఫలంబుల్గదా!

402. మ. అని యీరీతి సురాధినాథు డతి భక్త్యా వేశముల్ బొంగ నా
జననిన్ స్తోత్రము సేయ నప్డు మిగులన్ సంతృప్తితో సింహవా
హనయై యొప్పుచు కోటిసూర్య కమనీయంబైన తేజంబునన్
గనుపించెన్ జగదేక మాత తనకున్ గారుణ్య భావంబునన్

403. వ. అట్లు ప్రత్యక్షంబైన జగన్మాతనుగని దేవేంద్రుండు సాష్టాంగదండ
ప్రణామంబులాచరించి నిలుచుండ నప్పుడాదేవి మందస్మిత వదనారవిందయై

404. చం. భయపడకో సురాధిప! కృపామతి మిమ్ము సముద్ధరింతు ని
శ్చయముగనంచుఁ బల్కి తనచారు విలోకన హాససంపదన్
ప్రియమొనరించి, యంత నడిపించెను దైత్యులచెంతకున్ గడున్
రయమున వాహనమ్ము నతిరౌద్రగతిన్ బెగడంద రక్కసుల్

405. కం. అదిగని ప్రహ్లాదుడు తన
మదిలో భయ మంది యామె మనలను నెల్లన్
విదళింప వచ్చుచున్నది
త్రిదశుల గెలిపింపనెంచి తేజో యుతయై

406. చం. మును మధుకైటభాసురుల పోర జయించెను విష్ణుమూర్తి యా
జనని యనుగ్రహంబుననె, సర్వజగంబులకెల్ల మూలమై
యనయము నేలుచున్న జగదంబయెయామె ధృవంబటంచు తా
ననియె హిరణ్యకశ్యపుని యాత్మజు డాదితిజాళిఁ జూచుచున్

407. క. ఆతని పలుకులు విని యా
దైతేయులు భయముఁజెంది దైన్యము దోపన్
చైతన్య విహీనులవలె
నాతురమతు లౌచునుండ నా సమయమునన్

408. కం. మనమిపు డాజగదంబన్
ఘనముగ స్తుతియించి యామె కరుణ బడసినన్
చనునెల్ల కష్టగతులని
వినయమ్మున "నముచి" పల్కె విజ్ఞత దోపన్

## ప్రహ్లాదుడొనర్చిన దేవీస్తుతి

409. తే.గీ. నముచి పల్కుల కెల్ల రానందమొంది
రంత ప్రహ్లాదు డఖిల ధర్మార్థ విదుడు
సన్నుతించెను భక్తి విశ్వాస గతుల
నసుర వర్యుల పక్షాన నంబనిట్లు

410. మ. జననీ! యీ భువనమ్ములన్నియు ప్రశస్తంబైన నీమాయచే
తనరారున్ దగ రజ్జువందు ఫణి చందంబౌచు భ్రాంత్యుక్తమై





అనయంబున్ సృజియించిపెంచి తుద నీయందే లయంబౌనటుల్
కనుకట్టీ వొనరింతు వీజగములన్ గన్పట్టి కన్పట్టకన్

411. ఉ. తల్లుల కెల్ల తల్లివి, విధాత్రివి, తక్కిన సృష్టికర్తలో
తల్లి! నిమిత్త మాత్రులెకదా! పరికింపఁద్రిమూర్తులేని; నీ
కెల్లరు బిడ్డలౌదురు మహేశ్వరి! సర్వజగంబులందు; నీ
యుల్లములోన భేద మొకటున్నదె దైత్యులు దివ్యులంచెటన్

412. ఉ. దానవు లెట్టి వారయిన త్వత్సుతులేగద! లోకమాత! నీ
మానసమందు దైత్యుల నమానుషులంచుఁ దలంతువేని, ధ
ర్మాను గతిన్ జరింతురె సురావళి; స్వార్థము మాకు నెట్లొ య
ట్లొను దలంప వారికిని, నందు సమానమె రెండు పక్షముల్

413. మ॥ ధన దారాది సుఖాను భోగముల భేదంబేది మాయిర్వురన్
ఘను లవ్వారలె భోగ లౌల్యముల మాకంటెన్ దలంపంగ నో
జననీ! యట్టి యెడన్ దివౌకసుల శ్రేష్ఠత్వంబదేదీ? కృపన్
గనుమా! యెక్కువ తక్కువల్ తలఁప బోకన్ మమ్ము దీవింపుమా!

415. కం॥ త్రిగుణాత్మకమగు జగతిన్
త్రిగుణంబుల భేదమెల్ల త్రిగుణులలోనన్
ప్రగతి వహించుట సహజం
బగపడదిక భేద మంత కన్నను మాలో

416. సీ॥ సాగరోద్భవములౌ సకల సంపదలను
గైకొని రమరులు కరుణలేక
లక్ష్మిని విష్ణుండు లక్షణమ్ముగఁ గొని
వక్షస్థలమునందుఁ బరగ నిలిపె
ఐరావతమ్ము తా నమరేంద్రునకు నచ్చె
కామధేనువు కల్పకములతోడ
ధన్వంతరియును తాఁదరలె స్వర్గమునకు
దివ్యమణుల తోడ తేజమెసగ

గీ॥ చివర కమృతమైనను మాకు చెందనీక
మోహినిగమారి విష్ణుండు ముదము తోడ

దివిజులకె పంచె యెంతటి తెగువఁదనము
శ్రమయె మిగిలెను కడకు రాక్షసులకెల్ల.

417. మ॥ ఇటు లన్యాయము లిన్ని చేసినను వారే గొప్పవారంచు ది
క్తటముల్ ముట్టగ వంది మాగధుల చందానన్ బొగడ్తల్ మహో
త్కట హర్షమ్మునఁ జేయుచుందురతి తాదాత్మ్యమ్ములన్ జెందుచున్
కుటిలత్వంబున కిట్లె గౌరవము చేకూరున్ గదా యెప్పుడున్

418. మ॥ తన యావేదన లెల్ల నిట్లు వరుసన్ ధైర్యమ్ముతో చెప్ప నా
దను జాగ్రేసరుతో జగజ్జనని తా దాక్షిణ్య భావమ్ము నె
క్కొనఁ బల్కెన్ దితిజాగ్రణీ! వినుము మీకున్ క్షేమమౌనింక, మీ
రనుమానించక చేరుడయ్య వడి వాతాంధో నివాసానకున్

419. తే.గీ. కష్టసుఖములకెప్పుడు కారణమ్ము
కాలమేయౌను గావున కాలమదియు
మీకు నను కూలమైనంత మేలె జరుగు
వేచి యుండుడు మీరలా వేళ దనుక

420. ఉ॥ కాయము నశ్వరంబగు, సుఖంబులు సంపద లస్థిరంబు లౌ
శ్రేయము లేదటంచు మది చింతయొనర్చు విరాగు లెప్పుడున్
హాయిగ నుందు రెల్లెడల; నన్యులు లోభగుణ ప్రవృత్తిచే
పాయరు దుఃఖముల్ సకల భాగ్యము లబ్బిననైన నెన్నడున్

421. ఉ॥ కావున మీరలెల్లరును గాశ్యపివీడి రసాతలంబు స
ద్భావములన్ జనుండనుచు ప్రాభవ మేర్పడఁ బల్కు నాజగ
త్పావని కెల్లరున్ దలలు వంచి వినమ్రత దోప మ్రొక్కి ధై
ర్యావహ చిత్తులై యరిగిరంత ముదంబులు సెందుచున్ వడిన్

422. కం॥ అంత జగన్మాతయుఁ దా
నంతర్హిత యయ్యె; దివిజు లాత్మలలోనన్
చింతల్ వీడుచు నరిగిరి
సంతసమున స్వర్గమునకు సంరంభమునన్.

423. కం॥ ఈకథ వినినను చదివిన
చీకులు చింతలును తొలగు చిత్తములందున్





ప్రాకటముగ నూర్ధ్వగతులు
చేకూరున్ మౌనులార! స్థిరముగ జగతిన్

424. వ. మునికుల నాథుండైన వ్యాసుడిట్లు వచించుచుండ కురుకులనాథుండగు
జనమేజయుం డతనిం గాంచి మరల నివ్విధంబున ప్రశ్నించె

425. చం॥ భృగువు శపింప పల్మరు భువిన్ మధువైరి జనించెనంటి, వే
యుగముల నెట్టులాతని మహోన్నత మాయవతార రూపముల్
జగముల సన్నుతింపఁబడె? చయ్యన తత్కథలెల్ల విస్తరం
బుగ వినిపింపుమయ్య! ముని పుంగవ! వీనులకింపు గూర్చుచున్

426. కం॥ అనియడుగ సంతసించుచు
వనజోదరు జన్మములను వరుసగ నీకున్
వినిచెదనని వ్యాసుడపుడు
జననాథున కిట్లు చెప్పె సమ్మతితోడన్

427. కం॥ మును చాక్షుష మన్వంతర
మున నరనారాయణులన భువి వెన్నుడు తా
జనియించె ననుచుఁ దెలిపితి;
వినుమిక తెల్పెదను మీది విస్తృత జన్మల్.

428. సీ॥ అవని దత్తా త్రేయు డన్న నామముఁ దాల్చి
వరభక్త కోటికి వరదుడగుచు
నత్రికి ననసూయ కబ్జనాభుడు పుట్టె
వైవస్వతాఖ్య మన్వంతరమున
అవ్వారి కుదయించి రజుడు రుద్రుడు నంత
వరుసగ చంద్ర దూర్వాసులనగ
నరసింహ రూపుడై నాల్గవ మన్వంత
రమున నవతరించి రౌద్ర గతిని

గీ॥ కనక కశ్యపు వధియించె కమల నాభు
డంత త్రేతాయుగమ్మున నవనియందు
కశ్యప సుతుడై వామనా కారమొప్ప
బలిని పాతాళమున కంపెఁ బ్రాకటముగ

429. కం॥ జమదగ్నికి తనయుండై
క్రమమున క్షత్రియులఁ జంపి కశ్యపునకు దా
న మొసగె ధరనెల్లను శ్రీ
రమణుడు తా పరశురామ రమణీయాఖ్యన్

430. కం॥ ఆ త్రేతాయుగ ముననే
ధాత్రిన్ రఘు వంశమందు దశరథసుతుడై
చిత్రగతి రాక్షసుల తా
క్షాత్రమ్మునఁ జంపె రామ చంద్ర వరాఖ్యన్

431. కం॥ నర నారాయణు లిరువురు
కురు యదు వంశముల యందు కుజనుల నడపన్
ధర నర్జున కృష్ణు లనగ
కురువర! జన్మించి కీర్తిఁ గొనిరి ఘనముగన్

432. తే.గీ. ప్రకృతి కోరిన యట్టుల పరిణమించు
సకల జగములు తనకు వశంబు లౌచు
పురుష సంప్రీతి నొనరింపఁ బూనియదియె
సృష్టి యొనరించుచుండు విశేషముగను

433. చం. పురుషుడు నిర్వికారుడు, ప్రపూర్ణుడు, నిస్పృహు, డవ్యయుండు, తత్
పరము డుపాధిసంగతుల బ్రహ్మ ముకుంద, మహేశ్వరాఖ్యులన్
వరలుచునుండు ముువ్వురయి, భాతిగ శక్తియు మూడు మూర్తులై
వరుసగ సృష్టికార్యముల వారికి సాయమొనర్చు నిత్యమున్

434. కం. ఇది మూలతత్వ మనబడు
నిదియే విధి తంత్రమయ్య! యీతంత్రమునన్
పొదిగొని తిరుగుచు జీవులు
వదలక సుఖ దుఃఖతతులఁ బడయుదు రెపుడున్

## అప్సరలను నరనారాయణులనుగ్రహించుట

435. ఉ. పాయక నిట్లు పల్కు మునివర్యుని మాటల కాత్మ సంతసం
బాయత రీతిఁ బొందుచు నరాధిపు, డోమునివర్య! మున్నునా
రాయణు దివ్యశక్తిఁగనియప్సరసల్ గడు మోహితాత్మలై
ఆయననే వరించిరని యద్భుతరీతి వచించి యంతటన్

436. కం. మరియొక కథలోనికి మీ
రరిగితి రటుగాన నిప్డు డాపైవిధమున్
సరసగతిఁదెల్పుడన, నా
పరమర్షి వచించె భూమి పతి కీరితిన్

437. ఉ. ఆ యమరాంగనల్ దనను నర్మిలి భర్తగఁగోరినంత, నా
రాయణు డాగ్రహంబున త దంగనలన్ శపియింపఁబోవ శాం
త్యాయత చిత్తు డౌచు నరు డగ్రజుకోపము మాన్పి శాంతిలన్
జేయగ నాతడున్ వదన సీమన చిర్నగ వంకురింపగన్

438. చం. అనిమిష సుందరీమణుల నట్టెకనుంగొని యింతులార! మే
మనయము దీక్షఁ బూని తప మాదరవృత్తి నొనర్చుచుంటి మీ
జననమునన్ వివాహపుఁ బ్రసక్తిని మాని, వివేకవంతు లే
యనువుననైన తాపసుల యత్నము లాఱడి పోఁదలంతురే

439. తే.గీ. కారణము లేక కార్యమ్ము కానియట్లు
రతియె లేకున్న శృంగార రసమునకును
అనుభవస్థితి రాదని యార్యులనిరి
అట్టి స్థాయి భావమ్ము నాయందులేదు
కాన మిము పెండ్లియాడంగ లేనునేను

440. ఉ. ఇంతటి సుందరీమణుల నిందర నే వలపించితన్న, నా
దెంత యదృష్టమో! సఫల మీజననంబును నాదు రూపమున్
పంతముఁ బూనఁబోకుడు ధృవంబుగ నేను మరొక్కజన్మలో
కాంతుడ నౌదు నెల్లరకు కాదనకేగుడు నేడు సమ్మతిన్

441. కం. ధర నిర్వదెన్మిదవ ద్వా
పరమున జన్మింతు భూమి భారం బడపన్
తిరముగ మీరును భువిపై
ధరణీశుల పుత్రికలుగఁ దాల్తురు జన్మల్

442. ఆ.వె. అపుడు మీకు భర్తనయ్యెద నటుగాన
నంతదనుక స్వర్గమందు మీరు
వేచియుండు డనుచు వివరించిచెప్ప, నా
దివ్యకాంతలెల్ల దివికిఁజనిరి.

443. కం. నారాయణుడు సృజించిన
నారీ మణులెల్ల వెంటనడువగ దివికిన్
బోరనఁజని యెఱిగించిరి
వారీవిషయమ్ము దివిజపతి కేర్పడగన్

444. కం. తన కా నారాయణు డి
చ్చిన యూర్వశినిం గనుఁగొని చిత్తమునం దా
వనితామణి యందమునకు
ననిమిషపతి సంతసించె నత్యంతంబున్

445. తే.గీ. అతడు సృష్టించి పంపిన యందమైన
అంగనలఁగాంచి మురిసె స్వర్గాధినాధు
డంత వారల తపముల కడ్డుపడుట
వ్యర్థమని మిన్నకుండె నే స్పర్థలేక

446. కం. నారాయణుండు నరుడును
ధీరవరు లనంగఁజెల్లి దివ్యాంశల నొ
ప్పారుచు కృష్ణార్జునులన
ధారుణి జన్మించి రంత ద్వాపరమందున్

## భూదేవి మొర

447. ఉ. పాపులు లెక్క కెక్కుడయి భారముసైపక నొక్కనాడు గో
రూపముఁ దాల్చి పృథ్వి కడురోదన చేయుచు మిక్కుటంపు సం
తాపముతోడ నా దివిజనాధుని చెంతకుఁజేర, నాతడున్
దాపునకేగి యిట్లనియె ధాత్రినిగాంచి ప్రియమ్ము మీరగన్

448. ఉ. ఏమిటికమ్మ! దుఃఖిలుచు నిట్లరుదెంచితి, వెవ్వరేనియున్
నీమది నొచ్చునట్టులుగ నిందలు వల్కిరొ, లేకయున్న నే





పామరుడైన హింసలకుఁబాల్పడెనో వివరింపుమమ్మ! నీ
కేమిటికీ భయమ్మనుచు నెంతయుఁబ్రీతిగఁబల్కరించినన్

449. ఉ. బావురు మంచు నేడ్చి సురవర్యుని గాంచి ధరిత్రియిట్లనెన్
నీవెఱుగంగలేవె? కడు నీచగుణుల్ నను నేలుచున్నవా
రేవిధినోర్తు, పాపభరమెట్టుల మోయుదు, ధర్మమెల్లెడన్
తావులు దప్పియున్నయది దస్సిరి సాధువులెల్ల దీనులై

450. మ. మును విష్ణుండు వరాహమూర్తియయి నన్ మున్నీటిలోనుంచి తె
చ్చిన కార్యం బుపకారమేయనుచు నే చేతంబునందెంచి, తై
నను యోచింప మహాపకారమది, యానాడట్లె నన్నుంచినన్
మనుదానన్ గద నాగలోకమున దుర్మార్గంబు లీక్షింపకన్

451. ఉ. ధర్మవిహీనులై తమకుఁదామె రణంబులు సేయుచున్న దు
ష్కర్ములు నేడు భూపతులు, సద్గుణమొక్కటియైనలేదు, స
త్కర్మలెఱుంగ రేమియును, కాలునికిన్ ప్రతిరూపులైరి, నా
యోర్మినశించె నీభరము నోపగఁ జాల సురేంద్ర! నేనికన్

452. చం. కలియుగ మేగుదెంచునదె, క్రౌర్యములింకను పెచ్చరిల్లు, భూ
వలయము దుర్జనాళికి నివాసమెయౌ, నపుడైన నే రసా
తలమున కేగగావలయు తథ్యము కావున నాదుకష్టముల్
దొలగగఁ జేయుమయ్య! కలిదోషము లంటకమున్నె సత్కృపన్

453. వ. అనియిట్లభ్యర్థించెడు భూదేవిన్ గని ఇంద్రుండిట్లనియె

454. శా. అమ్మా! నేనసమర్థుడన్ దొలగఁజేయన్ నీదుకష్టంబులన్
రమ్మా! పోదము బ్రహ్మచెంత కతడే రక్షింపగా యోగ్యుడౌ
సుమ్మీ! నేనునువత్తు నీవెనుక నస్తోకంపు నీ దుఃఖ తా
పమ్ముల్ దానడగించుఁగాన నతనిన్ బ్రార్థింత మెట్లేనియున్

455. కం. ఇంతకు మించిన యుపకృతి
సుంతయు నొనరింపఁ జాల సుమ్మీ! యనినన్
సంతసమున నామె యరిగె
నంతన్ దేవేంద్రుఁగూడి యబ్జజు కడకున్

456. కం. వారలఁగని నలువయు ప్రియ
మారన్ గుశలమ్ములడిగి యానందమునన్
మీరిట్లు నేడు వచ్చిన
కారణమేమనుచు నడిగె గౌరవ ఫణితిన్

457. ఉ. ఆ వనజోద్భవుండు పరమాదర వృత్తిని పల్కరింప భూ
దేవియు దుఃఖమాపుకొని దీన గతిన్ వచియించెనిట్లు వా
ణీవర! మంచి చెడ్డలు గణింపని నీచులు నేడు రాజులై
త్రోవలు దప్పుచున్ నయ విదూరులునై చరియింతు రెల్లెడన్

458. మ. కలికాలంబును వచ్చుచున్నయది కంగారయ్యె నా గుండెలో
అలసుల్ పాపులు మందబుద్ధులును రాజ్యాధీశులై సైన్యముల్
తలకున్ మించినరీతి పెంచుకొని యుద్ధంబుల్ సదా చేయుచున్
కలతల్ వెట్టగ, నెట్టులోర్వఁగలనో కంజోద్భవా! హింసకున్

459. ఉ. కావున దుష్టులన్ దునిమి కావుము నన్ జలజాసనా! శమం
బావ హిలంగఁజేయుము నిరంతర మంచు కడింది వేదు భూ
దేవిని గాంచి యంత తొలిదేవుడొకించుక ధ్యానమగ్నుడై
భావి జగద్విలాసమును భావమునం దలపోసి యిట్లనెన్

460. కం. దేవీ! యీఘనకార్యము
నావలనంగాదు కంజనాభుడె దక్షుం
డావనధిశాయి కిపుడే
యీవిషయము విన్నవించు టెంతయు శుభమౌ

461. కం. అనిపలికి బ్రహ్మదేవుడు
తనతో సురపతిని మరియు ధరణీ దేవిన్
గొనివెడలె కడు రయంబున
వనజోదరు కడకు హంస వాహనము పయిన్

462. వ. అట్లు సని వనజనాభుంగని వనజభవుం డిట్లు స్తుతియించె

463. చం. అగణిత వేదమూర్తివి, సహస్ర ముఖాంబక పాద విస్తృతిన్
జగముల నేలుచుండెదవు, సర్వము నీ వెఱుగంగ రానిదే





యుగమునలేదు, తావక మహోన్నత వైభవ మెన్న శక్యమే?
ఖగవరవాహనా! సృజనకర్తవు భోక్తవు హర్తవీవెగా!

464. చం. అనినుతియించు నానలువ నంబుజనాభు దనుగ్రహించి యే
పనివడి వచ్చినా రిటు శుభం బొనరించెద చెప్పుడన్న నా
వనజభవుండు దెల్పె కరపద్మములన్ ముకుళించి యో దయా
వననిధి! ద్వాపరాంతమిది, వచ్చునికన్ గలి భీకరాకృతిన్

465. ఉ. పాపుల సంఖ్యపెచ్చుగుట భారము హెచ్చెను ధాత్రికెంతయున్
భూపతులెల్ల ధర్మ పథముల్ విడి స్వేచ్ఛఁ జరింతురయ్య! యీ
ద్వాపరమందె భూమిపయి తప్పక మీరవ తారమెత్తి సం
తాప మడంపు మూర్వరకు,ఁ దక్కిన సాధు తపోధనాళికిన్

466. కం. అని పృథ్వీ పక్షమ్మున
వనజభవుడు విష్ణుదేవుఁబ్రార్థింపగ నా
వనజోదరు డవ్వారలఁ
గని యిట్టుల పల్కె మిగుల కారుణ్యమునన్

## విష్ణుమూర్తి నిస్సహాయత

467. ఉ. ఈవిషయమ్ము నందెపుడు నేను స్వతంత్రుడఁగాను, మీరలున్
దేవతలెల్లరున్ మఱియు దిక్పతులున్ రవిచంద్రు లగ్నియున్
నావలె నస్వతంత్రులు, వినంబడరెవ్వరు సర్వ సృష్టిలో
స్థావర జంగమంబుల భృశంబుగ స్వేచ్ఛగలట్టి వారెటన్

468. తే.గీ. ఆ మహా మాయ యాజ్ఞల ననుసరించి
నడచు కొనవలె నెల్లరు నడఁగి జగతి
నెప్పు డయ్యమ సంకల్ప మెట్టులున్నొ
యట్టులే చేయుచుండు నియంతవోలె

469. సీ. నేను స్వతంత్రుడ నేని మున్నారీతి
మత్స్యాది జన్మలంబడయనేల
పశుజన్మలందేవి పరికింప సుఖ భోగ
యశములున్నవె మీర లరయు డయ్య!

ధర వరాహము నైతి నరసింహుడను నైతి
వామనాకృతితోడ వరలి యుంటి
పరశురాముడనైతి పరగ శ్రీరామావ
తారమ్ము నెత్తితి ధాత్రియందు

గీ. యిన్ని జన్మంబులందు నేనేమి సుఖముఁ
బడయ గల్గితి చెప్పుమో పద్మగర్భ!
అన్నిజన్మల నేచేసి నట్టి పనుల
నిష్టపడుదురె చేయంగ నెవ్వరైన

470. ఉ. కావున నోచతుర్ముఖ! జగద్గురు దవ్యయుడౌ పరాత్పరున్
నీవును నేను రుద్రుడును నెల్లరమున్ గ్రహియింపలేక, మా
యావరణంబునంబడి యహంకరణంబున నేను విష్ణుడన్
నేవిధి నేశివుండ ననియెంచుచు నుంటిమి జ్ఞానహీనతన్

471. చం. మును నొక కల్పమందు జగముల్ సృజియింపగ శక్తిలేక యో
చనలనుసేయుచుండ కడుసంభ్రమ మొప్పగ యోగమాయ తా
మనలను వెంటఁబెట్టుక విమానమునన్ గొనిపోయి యా జగ
జ్జననిని నాదిశక్తిని ప్రశస్తను జూపెను విస్మరించితే!

472. కం. పొందుగ క్షీరాంభోధిన్
సుందర మణిగృహమునందు చూడ్కుల కింపౌ
మందార తరుచ్ఛాయల
యందున్ చూచితిమిగాదె యాదిమ శక్తిన్

473. ఉ. కావున నిప్పుడందరము కామదయౌ జగదంబ నొక్కటన్
భావములందు నిల్పి కడుభక్తి భజింత మటంచు బల్కు ల
క్ష్మీవిభు నాదరించి తమచిత్తములన్ స్తుతియించి రప్డు శ్రీ
దేవిని నెల్లవారలును దివ్యములౌ నిగమోక్త సూక్తులన్

474. కం. వారల నుతులకు దేవియు
తోరంబుగ సంతసించి తోఁ తెంచె దర
స్మేర ముఖాంభోరుహయై
తారాధిప సూర్యకోటి తాదృశ దీప్తిన్





475. వ. అట్లు ప్రత్యక్షంబైన జగన్మాతను గాంచి బ్రహ్మాదు లిట్లు స్తుతించిరి

476. ఆ.వె. సాలెపురుగు నుండి సన్నని దారమ్ము
చిన్న నిప్పురవయు చిచ్చునుండి
వెడలి వచ్చునట్లు విశ్వంబు నీ నుండి
వెడలి వచ్చెనమ్మ విశ్వజనని!

477. చం. అచర చరాత్మకంబయిన నబ్జ భవాండములందు నెల్లెడన్
ప్రచురము నీదుమాయ; వశవర్తులు దానికి నెల్లవారు, ని
న్నచల మనంబునం దెలియు నాఢ్యుడె సంసరణాబ్ధిదాటు, ని
ర్వచనము తల్లి! నీమహిమ, పాయక మమ్ము నను గ్రహింపుమా!

478. కం. దివిజారుల శిక్షించుచు
దివిజుల రక్షించు కార్యదీక్షయె నాకున్
బ్రవిమల కర్తవ్యంబని
వివరింపగ లేదె మున్ను విశ్వవిధాత్రీ!

479. చం. అసురుల కాలవాలమయి యారట మందుచు నున్నదమ్మ! యీ
వసుమతినేడు; మిక్కుటపు భారము తా వహియించుచుండె, న
య్యసమబలాఢ్యులన్ రణమునందు వధింపగ మాకు సాధ్యమే
పొసగక మీదుశక్తి; నవపుల్ల సరోరుహ పత్రలోచనీ

480. తే.గీ. ధూమ్రలోచన దుర్ముఖ దుస్సహులను
మహిషు శుంభనిశుంభుల, మరియు రక్త
బీజ చండముండాసుర వీర వరుల
సంహరించితి వొక్కింత శ్రమములేక

481. కం. అవసరమయ్యెను మరలన్
భువిపయి నడయాడుచున్న భూపాలుర, దు
ర్వ్యవసాయుల పీచమడచి
యవనిన్ రక్షింప నిప్పుడంభోజాక్షీ!

482. చం. అని మధుసూదనాదులటు లాజగదంబను సన్నుతింప, త
జ్జననియు నాలకించి కడుసమ్మతినిట్లనె దివ్యులార! యీ

పని యొనరింప నేమదిని బాగుగ యోచన చేసియుంటి, మీ
రనిమిష వర్యులెల్ల భవదంశలతో పృథివిన్ జనింపుడీ!

483. చం. అవసరమైనచో తమకు నన్నివిధంబుల తోడు నిల్చెదన్
భువిపయి కశ్యపుండు నిజపుణ్యసతుల్ తనతో జనింప యా
దవకులమందుఁబుట్టు; భృగుదారుణ శాపవశంబుచేత వి
ష్ణువు తనయంశతో నతని సూనుని గాజనియించు నంతటన్

484. కం. ఆనకదుందుభి యనగా
మానుగ వసుదేవుడనగ మన్ననతోడన్
తానవని పిలువ బడుచున్
పూనిక కశ్యపుడు వొలుచు పున్నెపుఁబ్రోవై

485. ఉ. నేనును గోకులంబున జనింతు యశోదకు పట్టినౌచు, నా
పైన చెఱన్‌జనించి పొలుపారెడు వెన్నునిఁ జేర్తు ఘోషకున్
మానుగ నాదిశేషుడును మానిని రోహిణికిన్ జనించు, భూ
జానుల దుష్టులన్ గసిమసంగుదు రిర్వురు వీరవర్యులై

486. ఉ. ఇంద్రునియంశ తోడ జనియించును కుంతికి నర్జునుండు, తా
సాంద్ర పరాక్రమంబెనయ సైన్యములన్ బరిమార్చు నిర్దయన్,
చంద్రవరాన్వయంబును ప్రశస్తమొనర్చు, జగంబులన్ యశ
శ్చంద్రిక లల్లఁజేయు, కడుసన్నిహితుండగు విష్ణుమూర్తికిన్

487. కం. యమధర్మరాజు నంశన్
విమలాత్ముడు జననమంది విశ్వంభరపై
శమదమ వృత్తుల నొప్పుచు
నమరున్ ధర్మజ, యుధిష్ఠి రాఖ్యల తోడన్

488. కం. అనిలాంశఁ బుట్టు భువిపై
ననితర భుజబలుడు భీముడనియెడి పేరన్
దునుమాడు శత్రుసేనల
ఘనయశ మార్జించు ముజ్జగంబుల యందున్

489. తే.గీ. అశ్వినీ దేవతాంశల నవతరించి
నకుల సహదేవు లనియెడి నామములను
ధరణి నశ్వ గోరక్షణ దక్షులౌచు
యశము నార్జింతు రమిత పరాక్రమముల

490. కం. అష్టమ వసువు ప్రభాసుడు
కష్టగతిన్ శాపవశతఁ గాశ్యపిఁ బుట్టున్
స్పష్టముగ శత్రుసేనల
నష్టంబొనరించు భీష్మ నామముతోడన్

491. ఉ. క్షత్రియ నాశనంబగును కౌరవ పాండవ యుద్ధమందు; నీ
ధాత్రి భరంబడంగునిక తథ్యముకావున మీరలెల్ల మీ
పాత్రలలోచరింపు, డొక బ్రాహ్మణ శాప వశంబునన్ గడున్
చిత్రగతిన్ నశించు యదుసింహుని వంశ మనంతరంబునన్

492. కం. మీరలు నిమిత్త మాత్రులు
భారము నాపైన నుంచి వర్తిలు డింకన్
చేరుడు మీనెలవులకిక
తోరంబుగ నేను మీకు తోడ్పడు చుందున్

## వ్యాసుడు యోగమాయను ప్రశంసించుట

493. కం. అని యోదార్చుచు పలికిన
చనిరెల్లరు వారి వారి స్వస్థలములకున్
వినుమాపై వృత్తాంతము
వినిచెదనని వ్యాసుడిట్లు వివరించెఁగృపన్

494. చం. కురుకుల భూషణా! వినుము కూరిమి నంబ వచించినట్లు ద్వా
పరమున విష్ణుమూర్తి యదువంశమునన్ జనియించెఁ గృష్ణుడై
యురుతర భూభరమ్ముడచు టొక్కటె లక్ష్యముగాఁ దలంచి; య
చ్చెరువుగదయ్యెఁ యాజనని చిత్ర విచిత్రపు లీలలెంతయున్

495. తే.గీ. ఆదిశక్తి త్రిమూర్తులనైనగాని
మోహపాశమ్మునన్ జుట్టి మురియుచుండు
గర్భవాసంపు దుఃఖమ్ము కమల నాభు
నంత వానికె కల్పించు టబ్బురమ్ము

496. చం. అసురవధార్థమై దశరథాత్మజుగా జనియింపఁ జేసి, తా
విసరెను మోహపాశముల వెన్నునిపై; అపుడెన్నొకష్టముల్
పొసగొనె; నాకవాసులును పుట్టిరి యాజగదంబయాజ్ఞచే
వెస కపివర్యులైభువిని, వేదనలందిరిగాదె వారలున్

497. ఆ.వె. ముక్త సంగులైన మునులును సద్యోగి
వరులె యామె మోహపాశములను
త్రుంచఁ గలరుగాని త్రుంచంగ సాధ్యమే
పరుల కామె పాశబంధములను

498. తే.గీ. విద్యయు నవిద్యయన రెండు విధములైన
నామముల నొప్పు నాజగన్మాత యెపుడు
విద్యతో ముక్తుడౌను నవిద్యతోడ
బద్ధుడగు నెవ్వడైనను పౌరవేంద్ర!

499. మ. అరవిందాసన కంజనాభ భవ నాకాధీశులేనిన్ సదా
పరదేవీ వశవర్తులయ్య! తలపన్ బద్మాక్షు దివ్యావతా
ర రహస్యమ్ములు, తత్ ప్రణాళికలు, కార్యంబుల్, జగన్మాతచే
విరచింపంబడినట్టివౌ; కలుగునే స్వేచ్ఛాక్రియల్ వేరుగన్

500. మ. ఒకచో శేషునిపై సుధా జలధియం దొప్పారు, వైకుంఠమం
దొకచో లక్ష్మిని గూడి కష్టములఁ బాయున్; దుష్టదైత్యాళితో
నొకచో పోరులు సల్పు, నొక్కొకయెడన్ యోగేశ్వరుండౌను, వే
రొకచో యజ్ఞము లాచరించు హరి, వశ్యుండౌచు శ్రీదేవికిన్

501. చం. సనక సనందనాదులును సప్తమహర్షులు దిక్పతుల్ జగ
జ్జననికి బొమ్మలట్టుల వశంవదు లౌదురు; ముక్కుతాడు గ
ట్టిన వృషభంబు లంబలె, కడింది భయమ్మున కాలపాశబం
ధనములఁ జిక్కి చెప్పినవిధమ్మునఁ జేయుదు రస్వతంత్రులై

502. తే.గీ. హర్షశోకమ్ములును నిద్ర అలసతయును
మెలకువయు నాకలియును సర్వులకు నొకటె
అమరులనియును నిర్జరులనియు కవులు
వారిఁ గీర్తించుటది మాట వరసకౌను





503. చం. మనుజుల భంగి దేవతలు మానక పుట్టుచు గిట్టుచుందురో
యనఘ! సుఖంబు దుఃఖమును నందర కొక్కటె యౌట, వారినె
ట్లనఁదగు నట్టిచో నమరులంచును దేవతలంచు, కానిచో
కనఁబడు వారిజీవితపు కాలము మానవజాతి కెక్కుడై

504. కం. మనుజుల కంటెన్ దివిజులు
ననిమిషవర్గముల కంటె నజహరిరుద్రుల్
మనుచుందు రధిక కాలము
జనన మరణ దుఃఖములవి సహజంబెందున్

## కంస దౌష్ట్యము

505. చం. మును యమునాతటిన్ వికచ పుష్పలతా తరు గుల్మయుక్తమై
వనజ నవోత్పలాంచిత సువర్ణ సరోవర శోభలొప్పు, నం
దనవనతుల్యమై మధువనంబను నామమునన్ ప్రసిద్ధమై
కనులకు నింపు సేయు నొక క్రమ వనం బలరారు ధారుణిన్

506. కం. మధుసుతుడౌ లవణాసురు
డధిపతియై యేలుచుండె నావనమును, తా
నధిక మదోన్మత్తుండై
వధియించుచు సాధుజనుల వరగర్వమునన్

507. తే.గీ. అతని దుశ్చర్యలంగని యాగ్రహించి
రఘుకులోద్వహుడైన శ్రీరామచంద్రు
డంపె శత్రుఘ్ను సర్వసైన్యముల నొసగి
లవణు వధియించి రమ్మని లాఘవమున

508. చం. అతడును వేగమేజని యనన్య పరాక్రమ విస్తృతిన్ మదో
ద్ధతు లవణాసురున్ దునిమి తద్వన శోభకు మెచ్చుకొంచు, స
మ్మతి మధురాభిధానమున మానుగ నొక్కపురంబు గట్టి తత్
పతులుగ నాత్మనందనుల వాసిగ నిల్పెను పుష్క రాక్షులన్

509. కం. కాలక్రమమున నినకుల
పాలకు లెల్లరును స్వర్గ వాసులు నౌటన్

యేలికలై రంతట నా
ప్రోలికి యాదవులు భూరి భుజబల యుతులై

510. ఉ. ఆ నగరంబు నేలె మును యాదవ వంశ్యుడు "శూరసేన" భూ
జానియనంగ, నాతనికి శాపవశంబున కశ్యపుండు సం
తానముగాజనించి వసుధన్ వసుదేవుడనంగ నొప్పె క
ల్యాణ గుణండునై దశదిగంత వివర్తిత కీర్తి సాంద్రుడై

511. కం. దేవకున కదితి పుట్టెను
దేవకి యనుపేర నంత దేవకుడామెన్
దేవేరిగఁజేసెను వసు
దేవున కతిసంతసమున దివ్యులు మెచ్చన్

512. తే.గీ. ఉగ్రసేనుని పుత్రుడై యుద్భవించె
కంసుడను పేర నొక క్రూరకర్ము డవని
ఉగ్రసేనుడు దేవకు నగ్రజుండె
యొాట కంసుడు దేవకి కన్నయౌను

513. మ. వసుదేవుండును దేవకీసతియు సంపన్నమ్మునన్ బెండ్లియై
యసమానంబగు సంతసంబెనయ తామట్లుండ, నవ్వేళ యా
కసమందుండి వినంబడెన్ దివిజ వాక్యంబుల్ మహాశ్చర్యమున్
బొసగన్ జేయుచు నెల్లవారలు భయంబుల్ బొంద నీరీతిగన్

514. శా. ఓయీ! కంస! భవత్సహోదరికి నెంతో సంతసంబౌనటుల్
చేయం జాలితివయ్య పెండ్లి, యదియున్ శ్రేయంబె యేనాటికే
నీయబ్జాక్షికి పుట్టు నష్టమ సుతుం డెట్లైన నీప్రాణముల్
దీయున్ దథ్యము పొమ్మటంచు పలికెన్ దీవ్రస్వరం బేర్పడన్

515. కం. అని దివ్య వాణి పలుకన్
వినికంసుడు సంభ్రమమున విచలితమతుడై
అనిమిషవాక్కు లసత్యము
లని యెంచం దగదటంచు నాక్షణమందున్

516. ఉ. దేవకి నిప్పుడే తునిమి తీర్చుకొనందగు మృత్యుభీతి, య
ట్లే వధియింతునా? చెలియలిన్ హతమార్చిన పాపమబ్బు, లే





దా వధియించు నన్ను తన యాత్మజు, డెన్నగ ప్రాణరక్షణం
బే విధినైన ధర్మమని యెంచె మనంబున నెట్టకేలకున్

517. చం. అని యొక నిశ్చయమ్ము మనమందుఁ గుదిర్చి మరుక్షణంబునన్
గనలుచు నామెకేశముల గట్టిగ పట్టి శితాసిఁదాల్చి నే
దునిమెద నీమెనంచు నయదూరుడు కంసుడు బిట్టు నార్చినన్
గని యటనున్న బంధువులు కంసున కడ్డమువచ్చి రుగ్రులై

518. కం. ఇరు పక్షమ్ముల వారికి
దుర మధికంబయ్యె, నంత దుస్సహమగుటన్
సరగున యాదవ వృద్ధులు
విరమింపన్ జేసి రపుడు విగ్రహముఁ దగన్

519. శా. కంసా! యేమిది పిచ్చివానివలె నీకల్యాణిఁబూత వ్రతన్
హింసింపన్ సమకట్టి తీవు, తగునే యిక్కార్యమూహింపుమా!
శంసింపన్ దగ విట్టి చేష్ట, లెవరో శత్రుత్వమున్బూని నిన్
హింసాసక్తునిఁజేయఁ నెంచి రదియే యిప్పట్టునన్ సత్యమౌ

520. ఉ. నీ కపకీర్తిఁ దెచ్చుటకొ? నీభగినీధవు మానసంబు చీ
కాకొనరింప నెంచియొ? పగన్ వెలిఁగ్రక్కగలేక యెవ్వరో
ఆకసమం దదృశ్యుడయి యవ్విధి పల్కియు నుండవచ్చు, ని
ట్లాకుల మంద నేటికి మహాబలశాలివి దుర్బలున్ బలెన్

521. తే.గీ. వ్రాసి పెట్టిన యాపద వచ్చుగాని
ఎంత యత్నించినను మార దింతయైన
కాన చింతించ నేటికి కంస! నీవు
పరుల ప్రాణాలు తీయుట పాడిగాదు

522. కం. యదు వీరుల పలుకులకున్
మది కంసుడు సమ్మతించి మౌనముఁబూనెన్
అదనెఱిగిన వసుదేవుం
డదరక నిట్లనియె మెల్ల నాతనితోడన్

523. చం. నిరతము సత్యమున్ మదిని నేనును నమ్ముదు కంస! లోకముల్
తిరముగ సత్యమన్న యొక దివ్యపథంబున నిల్చియున్నవం

చెఱుగుదు, నమ్ము మింకపయి యీమెకు పుట్టిన వారినెల్లరన్
వరుసగcదెచ్చి నీకిడుదు, పల్కను వారల నేమిచేసినన్

524. తే.గీ. మాట తప్పను నేను ముమ్మాటి కయ్య!
అట్లు దప్పిన నాపూర్వు లందరింక
నరక కూపంబునంబడి తిరుగుచుందు
రనుచు ప్రతిన యొనరిచె నయ్యదువరుండు

525. ఉ. అంతట సభ్యులెల్లరును హర్షమునందిరి, కంసుడున్ మదిన్
పంతమువీడి, వీడె తన పట్టిన చెల్లెలి కేశ భారమున్
కాంతను వెంటcబెట్టుకొని కౌతుక మేర్పడ శౌరసేనియున్
శాంతివహించి బంధుజన సంఘముతోcజనె మందిరానకున్

## దేవకీవసుదేవుల సంవాదము

526. చం. తనపతిcగూడి దేవకి ముదంబున కాలము పుచ్చుచుండె పా
యని మరుకేళులన్ మునిగి యంతట కాలము కొంతసాగగన్
వనిత ధరించె గర్భమును, బంధువులెల్లరు సంతసించి, రై
నను వసుదేవు డయ్యెడ మనంబున సంతస మంద డింతయున్

527. కం. పదినెలలు నిండె నంతట
ముదితకు సుతుడుద్భవించె ముద్దులొలుకుచున్
యదువరుడౌ వసుదేవుడు
పదిలంబుగc బల్కె నాటి ప్రతినcదలచుచున్

528. చం. మును శపథమ్మొనర్చితిని పుట్టిన బిడ్డను పుట్టినట్టులే
తన కిడుదంచు కంసునకు, దానికి తగ్గటు లిప్పుడీ సుతున్
మనమున సుంతయేని యనుమానములేక యొసంగెదన్ సతీ!
విను మిది కాల నిర్ణయము వేదనcజెందకు మానసమ్మునన్

529. తే.గీ. కర్మ పరిపాక ఫలమది గడచి పోదు
అశుభమైనను శుభమది యైనగాని
యనుభవింపంగ వలయునో యబ్జనేత్రి!
కాన వగచుట యెల్ల మూర్ఖత్వమగును





530. చం. అనివచియించు భర్తమది నారటమున్ గ్రహియించి యాతనిన్
గనుcగొని దేవకీసతియు కన్నుల బాష్పకణమ్ములొల్క యి
ట్లనియెను స్వామి! యీజగములందు స్వకర్మఫలంబు లేరికేన్
అనుభవమౌను తప్పదని యంటిరి, సందియ మొండు గల్లదున్

531. చం. వ్రతములు తీర్థయాత్రలు తపమ్ములు దానము లన్నియున్ పురా
కృతములు నైన కర్మముల క్లేశములన్ దొలగింపలేనిచో
వ్రతములికేల? తీర్థములc బాయకcగ్రుంకిడనేల? దానముల్
సతతము సేయనేమిటికి? సర్వము వ్యర్థములంచు నెంచెదన్

532. తే.గీ. బ్రహ్మహత్యాదులగు మహాపాతకమ్ము
లైన తొలగును ద్వాదశహాయనములు
వ్రతముకడు నిష్ఠసలిపిన వారి కనుచు
యాజ్ఞ వల్క్యాది ధర్మజ్ఞు లనగ లేదె

533. కం. ఆయా వ్రతములు ధర్మము
లాయాశాస్త్రములు వ్యర్థమనుటే యొప్పున్
ప్రాయశ్చిత్తము తోడన్
పాయవు పాపములటంచుcబల్కిన యెడలన్

534. తే.గీ. జరుగవలసిన దెపుడైన జరుగుననిన
వ్యర్థమే గద శాస్త్రముల్ యత్నములును
పడక తప్పదు రోగంపు బాధయనిన
వైద్యశాస్త్రమ్ము లేటికి? వైద్యులేల

535. ఆ.వె. ప్రాప్తమున్న యెడలc బ్రాపించు స్వర్లోక
మన్న, యజ్ఞమేల? యాగమేల?
ఉద్యమించి ఫలము లొందినవారలు,
గలరు పెక్కుమంది తలచిచూడ

536. ఆ.వె. కాన మనముగూడ కర్తవ్యమిప్పుడు
నిర్ణయించుటొప్పు నిర్మలాత్మ!
మంచిపనియొనర్ప మాట తప్పిన దోష
మనగరాదటంచు నార్యులనరె

537. కం. అని యాదేవకి పలుకగ
విని వసుదేవుండు మరల వివరించెనిటుల్
తన సత్యనిష్ఠ భంగం
బొనరించుట కిష్టపడక యుక్త్యుక్తముగన్

538. మ. వనితా! నీవని నట్టు లుద్యమము సల్పన్ వచ్చు, కానీ ఫలం
బనయంబున్ మన కోర్కెకున్ దగినయట్లందంగ శక్యంబె, పూ
చిన పుష్పంబులు సర్వమున్ ఫలములన్ జేకూర్చలేనట్లు, చే
సిన యత్నంబులవెల్ల నన్నియెడలన్ సిద్ధింప వెవ్వారికిన్

539. తే.గీ. కర్మఫలములు దైవానుగతము లనుచుఁ
దలచి కర్తవ్య మొనరింప వలయునెపుడు
ఫలిత మనుకొన్న విధమున కలుగదెందు
నెంతయత్నించినను, దీని నెఱుగవలయు

540. సీ. ప్రారబ్ధ మాగామి భవసంచితములన
త్రివిధంబులై కర్మ తెలియఁబడును
సంసార మందలి సర్వజీవుల కివి
బీజసమమ్ములై విస్తరిల్లి
జన్మజన్మలకును సాగివచ్చుచు శుభా
శుభములఁగల్పించుచుండు నెపుడు
కర్మానుగతముగా కాయంబు విడనాడి
యన్య దేహమ్మున కరుగుదేహి

గీ. నాక సుఖభోగములకైన, నరకలోక
కష్టములకైన కర్మలే కారణములు
సంచితాగాములవి వీడి చనునుగాని,
చనదు ప్రారబ్ధ మనుభవించిననె తప్ప

541. ఉ. ఆడినమాటఁదప్పి నిరయంబును బొందుట, లోకనిందలన్
గూడుట, శ్రేయమౌనె, యవికోరుదురే యెవరైన, దేహముల్
వాడి నశించునట్టివె ధ్రువంబుగ, కావున దుఃఖమేల, న
న్నాడక పుత్రునిమ్మిక రయంబున కంసున కిచ్చి వచ్చెదన్





542. తే.గీ. కష్టమైనను సుఖమైనఁగలుగవచ్చు
సత్య సంసేవనమె భావి సౌఖ్యదమ్ము
సుకృతకర్మలు కలిగించు శుభములెపుడు
కాన సుతునిమ్ము దేవకీ! కలత వడక

543. మ. అనియర్థించెడు భర్తఁగాంచి సెలయేరై పారుబాష్పంబులన్
తన చేలంబున నద్దుచున్ వరుని సత్యస్ఫూర్తికిన్, ధర్మచిం
తనకున్ మెచ్చి నమస్కరించి యెటులో ధైర్యంబు లో నింపుచున్
తనయున్ మెల్లగ నందఁజేసె కరపద్మంబుల్ చలింపన్గడున్

544. మ. స్థిరచిత్తంబున పుత్రునిన్ గొనుచు వాసిన్ సత్యవాక్పాలనా
పరుడై యా వసుదేవుడప్డు నడచెన్ వైళంబ చిత్తంబులో
పరమాత్మన్ దలపోయుచున్ దురితదుర్వారుండునౌ కంసభూ
వరునిన్ గన్గొని బిడ్డనిచ్చుటకునై పౌరవ్యవంశాగ్రణీ!

545. మ. అరెరే! యెంతటి ధర్మనిష్ఠ, సుతునే యర్పింపఁ జూచెన్గదా
స్థిరుడై మృత్యువు నోటి కీతడనుచున్ జేజేలు వల్కన్ బ్రజల్
సురలాశ్చర్యము బొందుచున్ గుసుమ వృష్టుల్ గుర్వ, నాయాదవుం
డరవాయిన్ గొన కిచ్చె కంసునకు కట్టా! చిన్నవానిన్ సుతున్

546. కం. ఇచ్చిన బిడ్డను గైకొని
యచ్చెరు వందుచును కంసుడావసుదేవున్
మచ్చికఁ గన్గొని యిట్లనె
యచ్చపుఁజిరునవ్వు నవ్వి యాదరమొప్పన్

547. ఉ. ఓ వసుదేవ! తావక మహోన్నత ధీరగుణంబుఁజూడ స
ద్భావము హెచ్చె నామదిని, ధారుణి మాన్యుడవయ్య నీవు, ని
న్నేవిధిఁగష్టపెట్టగల, నీతడు మృత్యువు కాదునాకు, నె
ట్లీ వసవొల్చు బిడ్డను వధించి గడింతును పాపసంహతిన్

548. కం. నీ యష్టమ గర్భజుడే
నా యాయువు లపహరించు ననిపల్కెను నా
డా యమరవాణి కావున
నీ యర్భకుడేల? యతని నిమ్మదిచాలున్

549. కం. అని యుగ్రసేన తనయుం
డనినన్ వసుదేవు డంత నానందమునన్
తన నందనుఁగొని యింటికిఁ
జని యొసగెన్ సుతుని సతికి సద్గుణవతికిన్

550. ఆ.వె. అంతకొంత వడికి నచటికి నారదుం
డరుగుదేర కంసు డతి రయమున
నర్ఘ్యపాద్యవిధుల నతనిని పూజించి
కుశల ప్రశ్నలడిగె కూర్మితోడ

551. చం. అమర మునీంద్రు డప్పుడిటు లాతని తోననె నోయికంస! నే
నమరగ నొక్కనాడు కనకాద్రికి వెళ్ళగ నాప్రదేశమం
దమరగణాల తోడ కమలాసనముఖ్యులు గూడి చర్చలం
గ్రమమున సల్పుచుండి రధికంబుగ నిన్వధియింప నెంచుచున్

552. కం. శ్రీవిష్ణుమూర్తి భువిపై
దేవకికిన్ బుట్టునంట తేజంబలరన్
దా వధియించును నిన్నుని
నే విని వచ్చితిని నీకు నెఱిగింపంగన్

553. ఉ. ఎంతటి బుద్ధి లేని పని నీవొనరించితి విప్టు, తండ్రి యే
చెంతకు వచ్చి బిడ్డనిడ, చెల్లరె! చంపక పంపివైతువా!
ఎంతటి మూర్ఖుడైన నొనరించునె యివ్విధి, శత్రువైనవా
డెంతయు చిన్న వాడయిన నిట్టు లుపేక్షయొనర్పఁజెల్లునే

554. చం. అనవిని కంసుడిట్లనె మహర్షి వరేణ్యా! భయంబదేల, ము
న్ననియెను దివ్యవాణియును నష్టను గర్భజుడే నినున్ వధిం
చునని, వృథాప్రయాస మగుఁజువ్వె జనించిన వారి నెల్లరన్
గొనకొని చంపుటెల్ల, సమకూర్పగనేల దురంత పాపముల్

555. వ. అనియిట్లు పల్కు కంసునింగని దేవర్షి యిట్లనియె

556. తే.గీ. అందుకేకద నిను వెర్రి వంటనేను
దేవతల మాయ లింతయుఁదెలియలేవు





అల్లుడైనను శత్రువు నాదిలోనె
అణచుటది రాజనీతియౌ నయ్యకంస!

557. ఉ. అష్టమ గర్భజుండె నను నంతము సేయు నటంచుఁబల్కె, దా
యష్టమ గర్భమిద్దియని యారయఁగల్గుట నీతరంబె? యీ
కష్టమదేల? యెద్ది యెటుకల్గునొ వీడునొ గుహ్యమద్ది, నీ
యిష్టము వచ్చినట్టు లొనరింపుము చెప్పునదెల్లఁజెప్పితిన్

558. కం. అని పలికి నారదుడు సనె
వెనువెంటనె కంసుడును వివేక రహితుడై
తనవారిఁబంపె శిశువును
గొనితెమ్మని, వారలట్లె గొని తేరంగన్

559. కం. ఆ పసిబిడ్డను గైకొని
కోపమునన్ విసరికొట్టె క్రూరాశ్మముపై
పాపిష్ఠుడైన కంసుం
డేపాపము పున్నెమెఱుగ కేడ్చెడువానిన్

560. వ. అనియిట్లు చెప్పుచున్న వ్యాసుంజూచి జనమేజయుడు తనమదిలో
నారదు వ్యవహారంబు మహాదారుణంబని యెంచి యిట్లు ప్రశ్నించె

561. మ. హరిభక్తుండు, మహర్షి సత్తముడు, ధర్మాధర్మసంవేద్యుడున్,
పరమ జ్ఞానియు నైన నారదుడు పాపంబెట్లు చేయించె?; తా
కరుణన్ వీడి వధింప నేల నిసుగున్ గంసుండు; దౌష్ట్యంబునన్
సరియై యొప్పరె యిర్వురున్ మునివరా! సందేహమున్ దీర్పుమా!

562. మ. అనినన్ వ్యాసుడు వల్కెనిట్లు నృపవర్యా! నారదుం డెప్పుడున్
గనుచుండున్ గలహంబు, లవ్వియు జగత్కల్యాణముల్ గూర్ప చే
కొను, నాదిత్యుల పక్షమై నిలుచు బొంకుల్లేవు, సచ్ఛీలి, స
జ్జన మాన్యుండు తపోధనుండు తగదే సందేహమున్ బొందగన్

563. కం. కలహప్రియుడై యెపుడున్
కలిగించుచు నుండు నతడు కలహము, లైనన్
కలహములని యనిపించును
కలహమ్ములు గావు లోక కల్యాణమ్ముల్

564. చం. అమర మునీంద్రు మాటవిని యంతమొనర్చెను కంసుడంత తా
క్రమమున నార్వురన్ మిగుల క్రౌర్యగతిన్ వసుదేవ పుత్రులన్
విమలచరిత్ర! శాపమున వీరలు దేవకికిన్ జనించి య
శ్రమమున ముక్తిఁ బొందిరిటు, శాపమదెట్లన విన్ముతెల్పెదన్

565. చం. స్వాయంభు వాఖ్య మన్వంతరమున మున్ను
ఊర్ణా మరీచుల కుద్భవించి
రార్గురు సుతులు మహా బలవంతులు
ధర్మతత్పరులు ముదమ్ము గలుగ
బ్రహ్మదేవుడు తన పట్టినే కామింపఁ
దలచినఁగని వారు తగదటంచు
పరిహసింపగ నప్డు బ్రహ్మయు కోపించి
అసురులై జన్మింపుడని శపించె

గీ. అంత వారలు జన్మించి రవని పైన
కాలనేమికి పుత్రులై కర్మవశత
నవల పుట్టిరి కనక కశ్యపున కెలమి
సుగుణ సంపన్నులనగ సంస్తుతులఁగొనుచు

566. ఉ. శాపవశమ్ముచే నసుర జన్మము లెత్తియు శాంత చిత్తులై
తాపసవృత్తిఁజేకొని విధాతను గూర్చి తదేక దీక్ష ను
ద్దీపిత దివ్యతేజముల తీవ్ర తపంబులు సేయ కంజజుం
డేపగు సంతసమ్ము జనియింపగ వచ్చెను వారి చెంతకున్

567. ఉ. వచ్చి ప్రియమ్ముతో నిటులఁబల్కెను బాలకులార! మున్ను మీ
కిచ్చితి శాప మాగ్రహము హెచ్చుట, నైనను నేడు నే మదిన్
మెచ్చితి మీతపమ్ములకు మేలగు నట్టి వరంబులిత్తు, మీ
నచ్చిన వానిఁగోరుడు మనంబుల సందియ మందఁబోకుడీ!

568. ఉ. పంకజగర్భు డాదరము పైకొన నవ్విధిఁబల్క, వారలున్
శంకలు మాని యిట్లనిరి సారసగర్భ! జగంబులందు మా
కంకిలి లేనటుల్ నర సురాసుర సిద్ధగణంబు లెవ్వరే
నింక వధింప లేనియటు లిమ్ము వరమ్ము దయాపయోనిధీ!





569. వ. అట్లు కోరగా చతుర్ముఖుండు "తథాస్తు" ని యదృశ్యుండయ్యెనంత

570. తే.గీ. కనక కశ్యపు డీవార్త వినిన యంత
ఆగ్రహోదగ్రుడై వారి నట్టె చూచి
నన్ను కాదని మీరలు నలిన భవుని
వలన వరములు పొందుట పాడియౌనె

571. చం. నను విడనాడి మీరిటుల నాటక మాడితి, రింక మీద మీ
రనయము నిద్రఁగూరి యనిలాశన లోకమునన్ వసింపుడీ
పనియొకయింతలేక, యటుపై యదువంశము నందు దేవకీ
తనయులుగా జనించెదరు ధాత్రిఁగ్రమంబున నేటికొక్కరై

572. సీ. గత జన్మమున మీకు కన్నతండ్రియునైన
కాలనేమి జనించు కంసునిగను
పుట్టినంతనె మిమ్ము పొలివుచ్చు నాతడు
మీరుగొన్న వరము నీరుగారు
పడియుండుడిక వెళ్ళి పాతాళలోకాన
నిద్రగైకొను డహర్నిశము లచట
అని తండ్రి శపియింప నాపైన వారలు
పాతాళమున నిద్రఁబడసి యుండ

గీ. నంత ప్రతియేట నొక్కొక్క రవని పైన
పుట్టి రార్గురు దేవకీ పుత్రులగుచు
వరుస ఖండించె కంసు డవ్వారి నెల్ల
తొలఁగె వారల శాపముల్ కలిగె ముక్తి

573. తే.గీ. అంత సప్తమ గర్భమం దాది శేషు
నంశ చేరెను దేవకి కక్కజముగ
ఐదునెలలటు గడచిన యంత యోగ
మాయ తత్పిండమున్ దీసి మార్చి రోహి
ణీసతి యుదర మందుంచె నేర్పుతోడ
దేవకీదేవి గర్భమ్ము స్రావమయ్యె
ననెడి విషయము వ్యాపించె నన్నిదిశల
సత్యమని యెంచి కంసుండు శాంతినొందె

574. వ. అంత కొంత కాలమ్మునకు దేవకి మరల గర్భమ్ము ధరించె

575. కం. అష్టమ గర్భమ్మున తా
నిష్టముగా జొచ్చె వెన్ను డీ భువి పైనన్
దుష్టులఁదునుమాడి కడు వి
శిష్టుల రక్షింపనెంచి స్థిరచిత్తుండై

576. శా. వ్యాసుం డివ్విధి గాంగనిర్ఝర సమంబౌ వాక్య చాతుర్యముల్
భాసిల్లన్ బ్రవచించు చుండ కురుభూపాలుండు సంతోషియై
వ్యాసర్షీ! కమలేశ కశ్యప మహా వాతాశనాద్యంశ, ల
త్యాసక్తిన్ వివరించితయ్య! మదిలో నానందమయ్యెన్ గడున్

577. కం. తక్కిన దేవతలిలపై
నెక్కడ జనియించిరయ్య! యెవి నామంబుల్
చక్కగ నాకెఱిగింపుము
నిక్కమ్ము గ్రహించు వాడ నిర్మల చరితా!

578. మ. అని యర్థింపగ వ్యాసు డిట్లనియె రాజా! దేవవర్గంబు నె
ల్లను విస్తారముగా వచించుటది వల్లన్‌గాదు, గానన్ వచిం
తును క్లుప్తంబుగ సావధానగతి సంతోషమ్మునన్ విన్ము, నీ
జననంబున్ గడుధన్యమౌ నవి వినన్ సర్వాఘ సంహారముల్

579. సీ. వసుదేవునిగఁబుట్టె వసుధపై కశ్యపుం
దదితి దేవకి యయ్యె ముదముతోడ
దితి యంత రోహిణీ సతిగ జన్మించెను
బలరామునిగ నయ్యె పాపతేడు
నారాయణుండు తా నవనీత హరుడయ్యె
అర్జునునిగ నరుం దవతరించె
ధర్మరాజయ్యెను ధర యుధిష్ఠిరుడన
అనిలదేవుడు భీముడయ్యె వసుధ

గీ. అశ్వినీ దేవతలు కవలైరి ధాత్రి
యముడు విదురుడై యొప్పె ప్రఖ్యాతిఁగొనుచు
తగ బృహస్పతి ద్రోణుడై ప్రగతిఁగాంచె
ద్రోణ సుతుడయ్యె శివుడతి రుద్రగతిని

580. సీ. సాగరుం దుదయించె శంతను డనుపేర
వసువు భీష్ముండయ్యె వసుధయందు
ధర మరుత్తులు పుట్టి రిరవుగఁగృతవర్మ
విరట కృపు లనంగ వరుసతోడ
హంసు దుద్భవమందె నంధ నృపాలుగా
వరుణుడు ద్రుపదుడై పడసె ఖ్యాతి
కౌరవాగ్రజుడౌచు కలి పురుషుడు పుట్టె
తనర శకుని యయ్యె ద్వాపరుండు

గీ. బుధుడు తా సువర్చసుడన పుట్టె పుడమి
చంద్రు డుదయించె 'రురు' వను సంజ్ఞనొప్పి
పావకుడు ద్రుపదసుతుడై పడసె యశము
నిరృతి పుట్టెశిఖండియై నృప వరేణ్య!

581. గీ. కూర్మి గంధర్వ పతి దేవకునిగ పుట్టె
ద్రౌపదిగ పుట్టె లక్ష్మి ముదమ్ము గలుగ
అప్సరలు కృష్ణ పత్నులై యవతరిలిరి
అసురు లెల్లరు క్షత్రియులైరి వరుస

582. వ. మరియు సనత్కుమారుండు ప్రద్యుమ్నునిగను, విశ్వేదేవతలు ద్రౌపదేయులుగను, సిద్ధి–కుంతిగా, ధృతి–మాద్రిగా,మతి గాంధారిగా, కనకకశ్యపుడు శిశుపాలునిగా, జరాసంధునిగా విప్రజిత్తు, ప్రహ్లాదుండు శల్యునిగను, కాలనేమి కంసునిగను, హయగ్రీవుడు కేశిగా, బలినందనుడైన అరిష్టుడు కకుద్మిగా, అనుహ్లాదుడు ధృష్టకేతునిగా, బాష్కలుడు భగదత్తునిగా, లంబ ప్రలంబకులు ఖర ధేనుకులుగా, వరాహ కిశోరులు చాణూర ముష్టికులుగా, దితిపుత్రుడైన యరిష్టుడు కువలయమను నేనుగుగా, బలిపుత్రిక బకిగా, దాని తమ్ముడు బకాసురునిగా ధారుణిన్ జన్మించిరి. అదియును గాక జనమేజయా! మఱియొక్క విశేషంబు వివరించెద వినుము

583. మ. వనజాతాసన వాసవాది సురలావైకుంఠు మున్ భూ భరం
బనివార్యం, బడగింపగాఁదగు నటంచర్థించినన్ విష్ణుడున్

తన శీర్షంబున నుండి తీసి యొసగెన్ ధావళ్య నీలంబులౌ
ఘన కేశంబుల రెండిటిన్ మిగుల విఖ్యాతంబుగా నయ్యెడన్

584. తే.గీ. అందు ధవళము బలరాము డనగఁబరగె
నీలిమము కృష్ణుడని యంద్రు నృపవరేణ్య
దేవతాంశల సంగ్రహమౌవిధాన
తెలిపితిని మీది వృత్తాంతములను వినుము

585. ఉ. సోదరి కంతటన్ మరలఁ జొప్పడె నష్టమగర్భమంచు తా
వేదనఁజెంది కంసుడు వివృద్ధభయావహుడై రయంబునన్
వేదురువోలె దేవకిని పెంపు నశింపగ 'కార' నుంచె, తా
నాదర మొప్ప భర్తయును నామె కడన్ వసియించె తోడుగా

## కృష్ణజననము

586. కం. అనిమిష వర్గము లెల్లను
ఘనముగ నుతియించుచుండ గర్భమునందున్
దినదినము వృద్ధిఁ జెందుచు
వనజాక్షుండుండె నుదయ భాస్కర సముదై

587. కం. పదినెలలు నిండెపడతికి
కదలెను మెలమెల్ల శిశువు గర్భము వెడలన్
ప్రిదలగ ఖలుల మనంబులు
ముదమందన్ దివిజ సాధుపుంగవు లెల్లన్

588. ఉ. శ్రావణ కృష్ణ పక్షమున సమ్మతి నష్టమి నాటి రోహిణిన్
దేవకి కేర్పడెన్ మిగుల తీవ్ర తరంబగు కాన్పువేదనల్
భావజ సుందరుండు యదు వంశమునన్ హరి యుద్భవించు, భూ
దేవికిఁ దీఱు భారమని దివ్యులు సంతసమంది రయ్యెడన్

589. మ. రవి యస్తంగతుడౌట చీకటులు ప్రారంభమ్ములయ్యెన్, భటుల్
వివిధంబౌ నిశితాయుధమ్ములఁగడున్ విన్నాణులై ద్వారమం
దవరోధించుచునుండి రన్యులను డాయన్ బోవనీ,కంతటన్
నవనీలోత్పలగంధి యిట్లనియె చెంతన్ భర్త నీక్షించుచున్





590. చం. ప్రసవపు వేళయయ్యెను, విరామములేక కృపాణ పాణులై
మసలుదు రచ్చటన్ భటులు మార్గమదేమియుఁదోచదియ్యెడన్
వెస సుతు దుద్భవంబగును వేగమె వార్తనెఱింగి కంసుడున్
గసిమసగున్ గుమారు నెటు గాంచెద నయ్యది ప్రాణవల్లభా!

591. ఉ. ఇంచుక ప్రక్కకేగు, మిపుడెంతయు సిగ్గగుచుండె నామదిన్
సంచిత పుణ్యకర్మ! యని సమ్మతి దేవకి పల్క నాతడున్
కొంచెము ప్రక్కకున్ జనియె కొందల మందుచు కంసు చేష్ట లో
క్కించుక మానసంబును దహింపగ దుఃఖము లోన మ్రింగుచున్

592. ఉ. అంతట నర్ధరాత్రమున నంగజకోటి సమాన సుందరుం
డింతికిఁబుట్టె, కూర్మిసుతు నేర్పడఁ జూచిన తల్లి మానసం
బెంతయు సంతసిల్లె, పులకించెను దేహము, భర్తనంతఁ దా
చెంతకుఁబిల్చి చూపె తనచిన్నికుమారుని శ్యామలాంగునిన్

593. కం. క్రూరుడు కంసుడు వచ్చిన
దారుణముగ సంహరించు, తదనంతర మిం
పారన్ జూడ వశమె, కను
లారన్ జూడు మిపుడె సుతు నానందమునన్

594. వ. అని పలికిన

595. మ. పసికందున్ దనహస్తపద్మములతో భద్రమ్ముగా నెత్తి, త
న్మిసిమిన్ బొల్చెడు దేహమున్, వదనకాంతిన్ జూచి ముగ్ధుండునై
వసుదేవుండపుడాత్మ శోకిలుచు "నిబ్బాలున్ దురాత్ముండు దు
ర్వ్యసనుం డిప్పుడు కంసుడేమి యొనరింపన్ బూనునో దైవమా!

596. కం. ఇతనిని నేనే విధమున
బ్రతికించు కొనంగఁదగుదు పరమాత్మా! దు
ర్మతి యౌ కంసుని పాలన్
సుతునికఁబడవేయకయ్య! శుభవరదాయీ!

597. వ. అని కన్నీరు మున్నీరుగా వసుదేవుండు దుఃఖించుచుండ నింగి
నుండి యశరీర వాణి యిట్లనియె

598. ఉ. ఓ వసుదేవ! నీతనయు నొయ్యన గైకొని శీఘ్రగామివై
పోవలె గోకులంబునకు, పొందుగ నచ్చట నందునింటిలో
పావని యౌ యశోదకడ భద్రముగానిడి, యామె పుత్రికన్
తేవలె యోగమాయను, మదిన్ విడనాడుము సందియమ్ములన్

599. మ. భట వర్గంబుల నిద్రఁగూర్చితిని, నీబంధమ్ములున్ బాయు నం
తట ద్వారంబులు మొత్త మెన్మిది తమంతన్ దాముగా వీడ్వడున్
పటు ధైర్యంబున లెమ్ము, సాగుమిక నీ ప్రాపొచు నేనుందు, న
చ్చట కార్యంబు లవెల్లచక్కఁబడు నిశ్శంకన్ బ్రయాణింపుమా!

600. కం. అని పలుకగ వసుదేవుడు
మనమున సంతసమునందె, మరు నిముసమునన్
తనసంకెలలు తొలంగెను
గొనకొని ద్వారములు తెఱచు కొనియెను వేగన్

601. ఉ. వేలుపు పల్కులన్ మిగుల విజ్ఞతతో తలఁదాల్చి యాత డా
వేళ నిశీథమందు తనబిడ్డను గైకొని వెళ్ళుచుండ నా
జాల మదేమొగాని నడజాడయు స్పష్టమునయ్యె, యేడ్వ డా
బాలుడు, మధ్యలో యమున పాపట వోయి యొసంగె మార్గమున్

602. కం. ఆ నిర్జన మార్గమునన్
దా నడచుచు గోకులమ్ము దరిఁజేరి యటన్
మౌనముగ నందు నింటిని
యానక దుందుభి గనుగొని యానందమునన్

603. తే.గీ. పాడిపంటల శోభిల్లు పసిడి గృహపు
టందమున్ గనుగొంచు తానట్టె యుండ
నచటి కేతెంచె సైరంధ్రి యనగ నొప్పి
యఖిల జగముల నేలెడి యాదిశక్తి

604. ఉ. వచ్చి యశోద చెంతఁగల పాపను గైకొని వానికిచ్చి తా
నచ్చిక దేవకీసుతుని నందునిభార్య యశోద ప్రక్కలో
మెచ్చుగ నుంచి వెళ్ళె నతి మెల్పున, నా వసుదేవు డంతటన్
దెచ్చి యొసంగె బిడ్డనట దేవకికిన్ చెఱసాల లోపలన్





605. కం. ద్వారమ్ములు మూసికొనెను
కారన్, వసుదేవునకును కాళుల బిగిసెన్
బోరన సంకెల లపుడే
వేరెవరును నెఱుగ రచటి విషయ మొకింతన్

606. కం. వసుదేవుడు దేవకి కా
పసికందు నొసంగి నంత పాపయు నపుడే
ప్రసవింప భువికిఁ జేరిన
పసిబిడ్డను బోలి యేడ్చె; భటులును నంతన్

607. కం. నిదురల్ మేల్కొని నట్టుల
బెదరుచుఁ జని కంసుఁజూచి విషయంబెల్లన్
పొదిగొని వివరించిన తా
నదివిని యాకంసు డప్డు డతికోపమునన్

608. మ. కడుసంరంభముతోడ తానచటకున్ గాలానల క్రోధుడై
పడుచున్ లేచుచు వచ్చి యోయి వసుదేవా! తెమ్ము శీఘ్రంబె నీ
కొడుకున్, వానిని సంహరించెదను, నాకున్ మృత్యు వాతండె నే
విడువన్ బొమ్మని హుంకరింప నతడున్ వేవేగ కంపించుచున్

609. మ. కనులన్ బాష్పజలమ్ము గ్రమ్మ నొడలున్ గంపింప శీఘ్రంబుగాఁ
జని తెచ్చెన్ వసుదేవు డాత్మజను, నాశ్చర్యంబునన్ గంసుడున్
గని యేమీ! యిది పుత్రియా! మునుపు నాకాశంబునన్ వేల్పులున్
మునివర్యుండును పల్కినట్టి పలుకుల్ పొచ్చెంబు లయ్యెన్‌గదా!

610. ఉ. ఈ వసుదేవుడే మనల నిట్టుల మోసము చేసె నందమా!
యేవిధి సాధ్యమద్ది, యితడెట్లు సనున్ చెఱసాలనుండి, యే
త్రోవయు లేదు, రక్షకులు తోరములై వెలిఁగాపులుండ తా
నావలకెట్లు పుచ్చగల డాత్మజుడే జనియించి యుండినన్

611. ఉ. కావున సంశయించుటకు కారణ మేదియు కానుపింప, దీ
దేవకి కిప్డు పుట్టినది తెల్లముగా నిదియే యటంచు తా
భావమునం దలంచి వసి వాడని యా పసిబిడ్డ పాదముల్
చే వడిఁబట్టి కొట్టె నతి శీఘ్రగతిన్ గఱినంపు రాతిపై

612. ఉ. కంసుని చేతినుండి వడిగా విడివచ్చిన పాప యంత దౌ
ష్ట్యాంసలుడైన యాతనికి నచ్చెరువున్ గలిగించుచున్ భువిన్
బ్రంసిలఁబోక యిట్లనియె సర్వులకున్ వినిపించు రీతిగన్
శంస లొనర్ప దేవముని సంఘము లంబర వీధి నిల్చుచున్

613. శా. పాపాత్మా! ననుఁజంపినన్ గలదె లాభం బల్లదే నిన్ను దు
ర్వ్యాపారున్ సమయింప దక్షుడగు వీరాగ్రేసరుం డొక్కచో
నేపారన్ పరివృద్ధి యౌచుఁగల, డింకేలా మహాటోపముల్
ఈ పాపంబుల కంత్యకాల మికపై నెన్నాళ్లో లేదెంచగన్

614. కం. అనుచు నదృశ్యం బయ్యెను
విను వీధిన్ యోగమాయ విస్మయ మొప్పన్
వినికంసుడు భీతిల్లుచుఁ
జనియెన్ నిజ వాసమునకు శాంతి నశింపన్

615. కం. ధేనుక బక వత్సకులను
దానవులన్ బూతన యను దనుజాంగన, నా
స్థానమునకు పిలిచి కుపిత
మానసుడై పలికెనిట్లు మరు దివసమునన్

616. ఉ. మీరలు నాదు నాజ్ఞలను మీరక యేగుడు పల్లె పల్లెకున్
నేరక మంచి చెడ్డలను నిష్ఠురతన్ వధియింపు డెల్ల చి
న్నారుల, నిన్న మొన్న జననంబయి వర్ధిలునట్టి బాలురన్,
చేరును గోకులంబునకు చెచ్చెర పూతన నేర్పు చొప్పునన్

617. మ. అని యాజ్ఞాపన సేయ వారలును నాయా ప్రాంతముల్ దిర్గుచున్
కనులంబడ్డ నిసుంగులన్ దునుముచున్ క్రౌర్యమ్ముగానుండ, పూ
తనయున్ గోకులమందు బాలురను నిర్దాక్షిణ్యతన్ జంపుచున్
జనియెన్ నందుని యింటికిన్ తరుణ వేషంబూని యందంబుగా

618. కం. స్తనముల విషముఁ బులుముకొని
యొనరగ నొయ్యారమెల్ల నొలికించుచు, గొ
బ్బున కృష్ణునిఁగైకొని తా
చను గుడుపన్ సాగె యెంత సాహసమౌరా!





619. కం. ముదమున కృష్ణా యనుచున్
మదిలోఁ జింతించి నంత మలినము లెల్లన్
వదిలించు పాప హారికి
సుదతీ విషహరణ మేమి చోద్యము తలపన్

620. కం. పాలిండ్ల విషము తోడన్
పాలను ప్రాణముల శిశువు పాయగఁజేయన్
తూలుచు పూతన శవమై
వ్రాలెను భువిపైన పెద్ద పర్వతమువలెన్

621. ఉ. నంద యశోదలున్, పురమునంగల ముఖ్యులు వేగ వచ్చి యా
చందముఁ జూచి భీతిలుచు సంచలితాత్ములునైరి, యంత నా
చందురు మోమువాని, విలసద్దరహాసము వాని, దేవతా
వందితు చంకఁబెట్టుకొని పర్వుననేగె యశోద లోనికిన్

622. ఉ. నందుని యింటిలోన నొక నల్లని బాలుడు పూతనన్ మహా
నందమునన్ వధించెనట నమ్మగ శక్యమె యంచు చిత్త ని
స్పందితుడైన కంసుడు జవంబున ధేనుక వత్సకాదులన్
కొందరఁబిల్చి పోఁబనిచె గోకుల మందున నందునింటికిన్

623. కం. వారలు కంసుని యాజ్ఞన్
మీరక గోకులముఁ జేరి మృత్యువు పాలై
రోరాజా! నందాత్మజు
మారణ మొనరింపనేగి మంద మతులునై

624. ఉ. దానవు లిందరన్ వరుసఁ దావధియించె యశోదపట్టి, ఆ
కూనయె నాకు మృత్యువనుకొంచు దురాత్ముడు కంసుడుండగా
పూని ధరించె కొండ నొక బొంగరమట్టుల నద్భుతమ్ముగా
దానవుకేశిఁజంపె నతిదర్పముతో నను వార్తలన్ వినెన్

625. కం. విని కంసుడు దీనుండై
తన చావిక తప్పదనుచు తలచి నిరతమున్
కనులను మూయక కుడువక
తనవారలఁ జీరకుండె తద్దయు భీతిన్

## కంసవధ

626. కం. ధనురాహవ మను నెపమున
మనవారిని పంపి మిగుల మన్నన దోపన్
నెనరూని రామకృష్ణుల
పనివడఁబిలిపించి చంప వలయు నెైటెనన్

627. మ. అనియిట్లాత్మఁదలంచి కంసుడటుపై నక్రూరు రావించి చ
య్యన నాయాజ్ఞగ నెంచి గోకులమునం దా నంద పుత్రుండునౌ
వనజేక్షున్, దనయన్న రాము నిటకున్ బాణాసనా యాగమున్
గన రమ్మంచు వచించి యెట్లయిన వేగన్ గొంచు రమ్మా! యనెన్.

628. ఆ.వె. అతని యాజ్ఞఁదాల్చి యక్రూరు డప్పుడ
గోకులమ్ము వెళ్ళి కూర్మితోడ
కంసు డంపి నట్టి కార్యమ్ము వివరింప
రామకృష్ణులపుడె రథములెక్కి

629. సీ. కంసుని చెంతకుఁగాలపురుషు లట్లు
చనుదెంచి ధనువును చక్కవిరిచి
కువలయాపీడమన్ గుంజరమ్మును గూల్చి
శక తోశలులఁబట్టి సంహరించి
ముష్టికున్ జాణూరు ముష్టిహతులఁజంపి
దుష్టకంసు శిరముఁద్రుంచి వైచి
కారాగృహంబున కష్టముల్ వదుచున్న
తల్లిదండ్రుల చెఱన్ దలగఁజేసి

గీ. ఉగ్రసేనుని రాజుగా నునిచి, రంత
తండ్రి యుపనయ కార్యమ్ముఁదగనొనర్చి
విద్య నేర్పంగ వారల వేడ్కఁబంపె
అనఘుడైయొప్పు సాందీపు నాశ్రమమున

630. ఉ. అమ్ముని చెంత వారు వినయమ్మున విద్యలనెల్ల నేర్చి శ్రే
యమ్ముగ దక్షిణల్ గురున కర్మిలినిచ్చి యనుజ్ఞఁబొంది శీ





ఘ్రమ్ముగ వచ్చిరంత మధురాపురి కాత్మసఖుల్ నిజాత్మలం
దిమ్ముగ సంతసం పడ నహీన పరాక్రమ దివ్యతేజులై

631. తే.గీ. పదియు రెండేండ్ల వయసున్న పడుచువారు
రామకృష్ణులు చెల్లరే రాజసమున
జెట్టి మల్లుల నడచిరి, చిన్నికృష్ణ
దరెరె! కంసుఁజంపుట యెంత యక్కజమ్ము

632. చం. అని మదిలోఁదలంచి మగధాధిపుడైన జరాసుతుండు కం
సునకును మాతులుండగుట సుంతయు నోర్వగలేక సైన్యమున్
గొని వడి నెత్తివచ్చెఁగడు క్రోధనుడై బలరామకృష్ణులన్
దునుముదు నేడటంచు కనుదోయిట నిప్పుకణమ్ము లుర్లగన్

633. తే.గీ. అట్లుపదునేడు మార్లుసైన్యములతోడ
నెత్తి వచ్చుచు మగధభూమీశ్వరుండు
రామకృష్ణులతోడ పోరాట సల్పి
జయముసాధింపలేక విషణ్ణుడౌచు

634. తే.గీ. కాలయవనుని పురికొల్పి కలను సేయ
పంపె మధురకు చతురంగ బలము లొసగి
యవనుడేతెంచు వార్త నయ్యదు వరుండు
మున్నె పసికట్టి కర్తవ్యమును దలంచి

635. ఉ. అంబుజ నేత్రుడిట్లనియె యాదవవీరుల నెల్లఁబిల్చి, ని
క్కంబిది శత్రుసైన్యము లకారణ వైరముఁబూని నిత్యమున్
డాంబికవృత్తి నిమ్మధుర దగ్గఱి పోరులు సల్పుచుండ సౌ
ఖ్యంబులు వొందకుంటిమి నిరంతరమున్ సమరోద్యతిన్ గడున్

636. కం. అదె కాలయవను డిప్పుడు
మధురన్ గబళింపఁదలచి మాగధు డంపన్
పదపడి వచ్చుచు నుండెను
కదనం బొనరింప సైన్య గణములతోడన్

637. తే.గీ. ప్రాణరక్షణ మిపుడు కర్తవ్యమౌను
కడలి దరినైన పర్వతాగ్రముననైన

నుంట శ్రేయంబటన్న బుధోక్తివినమె
భయములేనట్టి స్థలమె శుభంబు మనకు

638. ఉ. వెన్నుడు తాసముద్రమున వీడక శేషునిపై పరుండుటల్
పన్నగ భూషణుండెపుడు పర్వతమందు వసించుటల్ మద
చ్ఛన్నులునైన శాత్రవుల సందడికిన్ భయమందిగాదె యిం
కెన్ని దినంబులిట్లు వసియింత మిటన్ రిపువర్గ భీతిచే

639. కం. కావున మనమును మధురను
బోవిడి సాగరతటమున పొలుపొందెడి యా
రైవత కాద్రికి చేరువఁ
బావనమై యొప్పు ద్వారవతికిఁజనఁదగున్

640. మ. అని నందాత్మజు డిట్లు వల్క యదువీరాగ్రేసరుల్ సంతసం
బెనయన్ సమ్మతిఁదెల్పి, రంత పురమందెల్లన్ ప్రజల్బండ్లపై
గొని యేతెంచిరి వస్తుజాలములు సంకోచంబులన్ వీడి చ
య్యన, నగ్రంబున రామకృష్ణులు మహాహ్లాదంబునన్ సాగగన్

641. మ. పయనంబై యటు కొన్ని నాళ్ళు నడువన్ బాథోధి తీరంబునన్
నయనానందకరంబునై, తరులతా నవ్య ప్రసూనాళిచే
ప్రియమౌ రైవత కాద్రిచెంత మిగులన్ విఖ్యాతమున్ పుణ్యసం
చయమున్ ద్వారవతీ పురంబుఁగని రాశ్చర్యంబు మిన్నంటగన్

642. మ. కని యాపట్టణ శోభలన్ దమ మనఃకంజమ్ములన్ మెచ్చుచున్
జని యందుండు గృహమ్ములన్ మఱియు విస్తారంబులౌగేహళుల్
మును శుభ్రంబొనరించి చేరిరట సమ్మోదంబునన్ యాదవవుల్
వన జాక్షుండు వచించి నట్లు కడు సంభావ్యంబునన్ భూవరా!

643. ఉ. అంతట రామకృష్ణ లట నట్టె వసింపక శీఘ్రగాములై
స్వాంతములందు తత్పురము చక్కఁదనమ్మును మెచ్చుకొంచు ని
శ్చింతగ నిర్వురున్ మధురఁజేరి వసించుచు నుండ నొక్కనా
డంతకునట్లు కాలయవనాఖ్యుడు ముట్టడి చేసె నప్పురిన్

644. ఉ. ఆతడు వచ్చు వార్తవిని యబ్జదళాక్షుడు కృష్ణ డొంటిగా
నాతత దివ్య తేజమున నప్పురి వెల్వడి పాదచారియై





కాతరు కైవడిన్ యవనుగాంచి హుటాహుటి పర్వువెట్టె, వే
గాతిశయంబునన్ యవను డాగ్రహమందుచు వెంబడింపగన్

645. తే.గీ. అట్లు పరువెత్తి పరువెత్తి యబ్జనాభు
డతుల బలశాలి రాజర్షి యనగ నొప్పి
నిదుర వోయెడి ముచుకుందు నెలవుగాంచి
మాయమయ్యెను యవనుండు డాయువేళ

646. తే.గీ. కాలయవనుడు వచ్చి యక్కాననమున
నొక్క గుహలోన ముచుకుందు దుంటఁగాంచి
యతడె కృష్ణుం డనుచు ఁదన యాత్మఁదలచి
గట్టిగా తన్నె నాతని కాయ మదర

647. మ. ముచుకుందుండును తీవ్రకోప గతుడై భ్రూభంగ మల్లాడ ని
ర్వచనీయంబుగ విస్ఫులింగములు నేత్రద్వంద్వమందుర్ల నా
ర్చుచు తీవ్రంబగు దృష్టులన్ యవనుపై చొప్పింపగా నాతడున్
విచలద్గాత్రుడునై దహింపఁ బడియెన్ వేగంబె దీనస్థితిన్

648. కం. ఆ వెనువెంటనె యచటకు
శ్రీవరు డేతెంచి నిలువ, చేతమలర తా
నవనతుడై ముచుకుందుడు
స్తవమొనరిచి యంతఁ జనియె సాంద్రాటవికిన్

649. ఉ. అంతట కృష్ణుడున్ జనియె నగ్రజుఁదోడ్కొని మానసంబునన్
సంతసమొప్ప ద్వారకకు, చక్కగ యాదవు లుగ్రసేన భూ
కాంతుని పాలనమ్మున సుఖమ్మున కాలము పుచ్చుచుండి ర
త్యంతము రామకృష్ణులు సహాయులుగా చరియించుచుండగన్

## ప్రద్యుమ్నాపహరణము

650. ఉ. "అన్యులఁగోరఁగృష్ణ! నినె నాత్మ వరించితి" నన్న రుక్మిణీ
కన్య మనం బెఱింగి రిపుగర్వములన్ వెడలించి ఛేది రా
జన్యుని బారినన్ బడక సత్కృప నామెను దెచ్చి క్షాత్ర స
మ్మాన్యముగా గ్రహించె యదుమండను డగ్రసతీ లలామగా!

651. వ. అంతఁగ్రమంబునఁ గృష్ణుండు జాంబవతి, సత్యభామ, మిత్రవింద
కాళింది, లక్షణ, భద్ర, నాగ్నజితి అనుకన్యలను పరిణయంబై
అష్ట మహిషలతో కాలంబు పుచ్చుచుండ

652. కం. వైదర్భికి జన్మించెను
మోదమ్మున పూవిలుతునిఁ బోలుసుతుడు, తా
శ్రీదయితు డతని కిడియెన్
బ్రోదిన్ బ్రద్యుమ్ను డనగఁబొల్చువరాఖ్యన్

653. మ. అతనిన్ శంబరుడొక్కరాత్రమున మాయారూపుడైవచ్చి ని
ద్రితునిన్ గైకొని పోయినంత కడునిర్వేదంబునన్ గృష్ణుడున్
నుతి యించెన్ జగదంబ నివ్విధమునన్ దోరంబుగా దైత్య వి
స్తృతసాంద్రాటవికిన్ దవాగ్నిని మహేశిన్ యోగమాయన్గడున్

654. మ. గత జన్మంబుల నాతపంబులను విఖ్యాతమ్ములన్ మెచ్చి న
న్నతి వాత్సల్యముతోడఁజూచితివి నీవమ్మా! జగత్పావనీ!
సుతునిన్ రక్కసుడెవ్వడో గొని చనెన్ స్రుక్కించునో? చంపునో?
గతి నీవేయిక నీదుభక్తుడఁగృపన్ గాపాడుమా యీశ్వరీ!

655. ఉ. ద్వారక గొప్పదుర్గ, మరివర్గము లోనికిఁజేరసుంతయున్
దారియులేదు, రేఁబవలు తప్పక కావలి కాయుచుందు రే
మారక, మద్గృహమ్ము పుర మధ్యమునంగల, దందులోన చి
న్నారి శయించు చెంతకుఁ జనంగ నసాధ్య మదెంతవారికిన్

656. కం. ఈ మాయను ఛేదింపగ
నే మార్గములేదు తల్లి! యీవే గతియౌ
నీమహిమ దురవగాహ్యము
సామాన్యులు తెలియగలరె సదసద్రూపా!

657. తే.గీ. నేడు నాబిడ్డ మాయమైనా డనంగ
నిదియు నీమాయయే యంచు నేఁదలంతు!
నాడుదేవకీ గర్భమ్మునన్ గలట్టి
శిశుని రోహిణీ గర్భమున్ జేర్చలేదె





658. ఉ. పుట్టిన యాక్షణంబె నను పొత్తికతో గొనివచ్చి యెంతయున్
గుట్టుగ నా యశోదకడ కూరిమి నుంచిన దీవ కాదె? యీ
పట్టున నాదువిన్నపము పట్టని యట్టుల నుండనేల? నిన్
గట్టిగ నమ్మియుంటిని జగజ్జననీ సుతుజాడఁదెల్పుమా!

659. కం. త్రిగుణాత్మకమగు జగముల
నగణితముగ సృష్టిఁజేసి యంతము నందున్
దగ నుపసంహరణంబును
నొగి యొనరుతు విదియు నీకు నొక క్రీడయగున్

660. కం. నిరతము సంసరణాబ్ధిన్
కరము మునిగి యున్న కష్టకర్ముల కెల్లన్
వరుసన్ పుత్రోత్సవముల,
విరహార్తులఁగూర్తు వవియె విందులు నీకున్

661. చం. అటుగనుమమ్మ! రుక్మిణి యనంత తనూజ వియోగశోక సం
కటమది, యూఱడించుటకు కష్టతరం బగుచుండె నాకు, ను
త్కటమగు నామె పుత్ర పరితాపము మాన్పుట కీవెయోర్తు, విం
తట మముఁ బ్రోవు మోజనని! త్వత్పద పద్మములే శరణ్యముల్

662. మ. అని కృష్ణుండిటు ప్రార్ధనల్ సలుపగా నయ్యంబ ప్రత్యక్షమై
తనయా! మున్నొక శాపకారణము చేతన్ భీతుడై శంబరుం
డను దుర్మార్గుడు నీకుమారుఁదన మాయాశక్తిఁ గొంపోయె, నా
తనికై చింతిలఁబోకు డెల్లగతులన్ దావచ్చు క్షేమంబుగన్

663. కం. తన పదునారవ యేటన్
గొనకొని నీ సుతుడు దైత్యుఁ గూలిచి యాపై
నినుఁ జేరు, శంకఁ బూనన్
బనిలే దిది నిజము నమ్ము వనజదళాక్షా!

664. కం. అనిపల్కి జగన్మాతయు
కనుమరుగై చనినయంత కంజేక్షణుడున్
తన వారి నూఱడించుచుఁ
జనియెను తనయంతిపురికి సంతోషమునన్

667. ఉ. ఈకథనాలకించు ధరణీ శ్వరుడా మునివర్యుఁజూచి యో
ప్రాకట కౌరవాన్వయ వివర్ధన! విష్ణుని యంశజుండునై
యా కమలాక్షు దేల తన యాత్మజుకై విలపించె, పుత్రునిన్
గైకొని పోవు రాక్షసుని గర్వము నేల యడంప డయ్యెడన్

668. తే.గీ. అంతిపురమున రక్షణ యందునున్న
చిన్నవానిని ప్రద్యుమ్నుఁజేరుటకును
రక్కసున కెట్లు వీలయ్యె నక్కజమ్ము
దేవదేవున కిది యెట్లు తెలియదయ్యె
సందియమ్మిది తీర్పుమో సన్మునీంద్ర

## మానవ జన్మలో మానుషలక్షణాలే

669. వ. అనియడిగిన జనమేజయుంజూచి వ్యాసుండిట్లనియె

670. మ. ధరణీశాగ్రణి! విన్ముతెల్పెద మహిన్ దథ్యంబు మాయాబలం
బురు మోహంబున ముంచు నేరినయినన్ యూహింపగావిష్ణుడేన్
సురలేనిన్ సుర నాధుడేని తనువుల్ చోద్యంబుగాఁదాల్చి యీ
నరలోకమ్మున నున్నచో నరుల చందంబే యగున్ చేష్టలున్

671. కం. ఆకలిదప్పులు నిద్రా
వ్యాకులతలు శోక మోహ హర్ష భయంబుల్
శ్రీకరునకైన తప్పవు
చేకొని నరజన్మ భువినిఁజేరి వసింపన్

672. సీ. పట్టాభిషేకమ్ము భంగ మౌనని గాని
కాంచన మృగమది కల్లయనియు
అవనిజన్ రావణు డపహరించు ననియు
అల జటాయువు భువిఁబొలియు ననియు
ప్రాణముల్ గోల్పోవు పంక్తి రథుండని
కపిరాజు స్నేహమ్ము కలుగుననియు
పసికట్టఁ గల్గెనే భాస్కర వంశాబ్ధి
సోముడు ముందుగా రాముడవని





గీ. అజ్ఞు నట్టుల నిట్టట్టు లడవియెల్ల
తిరిగె తన భార్య కొఱకునై దీనగతిని
తుదకు కపివీరు దనిల పుత్రుండు గాదె
జలజముఖి జాడ తెలియంగఁ జాలెనౌర!

673. ఉ. సేతువుఁగట్టి వానరులు చెల్వుగ లంకకుఁ జేర్పకున్న తా
సీతను పొందఁగల్గెడినె శ్రీరఘు రాముడు, పంక్తికంథరున్
భాతిగఁగూల్పఁగల్గనె, జవంబున మారుతి యోషధీగిరిన్
చేత ధరించి రానియెడ చెల్లవె లక్ష్మణు ప్రాణవాయువుల్

674. ఉ. ఆతడు విష్ణునంశజుడునయ్యు ధరాసుత శీల సంపదన్
చేతమునన్ గ్రహింపకఁయిసీ! యటులగ్ని పరీక్షవెట్టె నా
సీతకు, నంతతో తనివి సెందక నాపయి కొన్ని నాళ్ళ కా
పూతచరిత్రఁ బంపె వనభూమికి నెవ్వడొ నిందసేయగన్

675. కం. అచ్చట నామెకు లవకుశు
లిచ్చకమునఁ బుట్టిరనుచు నెఱుగ డనినచో
నచ్చెరువౌగద తా న
ట్లచ్చుగ విష్ణ్వంశ జాతు డయ్యును నృపతీ!

676. కం. జానకి పాతాళమునకు
తానరిగె నని యెఱుగక వృథా కోపమునన్
మేను మఱచి తన తమ్ముల
నోనాడెన్ చిత్రమగును నుత చారిత్రా!

677. కం. తన కర్తవ్యము ముగిసిన
దనియును చివరి సమయమిది యనియును మదిలో
గనుగొన డయ్యెను రాముం
డనఘాత్ముడు పద్మనాభు నంశజుడయ్యున్

678. కం. మానవ జన్మము నందున
మానక తల్లక్షణములె మాధవుకైనన్
వాణీ గౌరీ పతులకు
నైనను చేకూరు తథ్యమనఘా! యెందున్

679. వ. అట్లే వసుదేవ నందనుండును

680. సీ. కంసుని భయముచే కారాగృహమునుండి
గోకులమ్మును జేరుకొనియెఁ గాదె
అల జరాసంధున కదరి మధుర వీడి
పారిపోయెను గదా! ద్వారవతికి
అలనాడు రుక్మిణి నపహరించెను గదా
చేది భూవిభునకుఁ జెందనీక
సత్య కోరికఁదీర్ప సంక్రందను నెదిర్చి
పారిజాతముఁగొనివచ్చెఁగాదె

గీ. వ్రతము పేరిట సురముని వర్యునకును
తనను సతి దానమొసగిన, తగదటంచుఁ
దెల్ప "కితడెంత భార్యావిధేయు"డన్న
విధమున చరియించుటయును వింతగాదె!

## కృష్ణుని తపస్సు

681. చం. తన సతులెల్లరున్ గడుముదంబున పుత్రులఁబొంది రైన న
య్యనుపమసాధ్వి జాంబవతి కాత్మజుడెంతకు పుట్టకున్న తా
వనరుచు చెంతఁజేరి యొక పట్టిని నాకు ననుగ్రహింపుమో
వనజదళాక్ష! యన్న, మురవైరి తదంగన కోర్కెఁదీర్పగన్

682. ఉ. ఘోరతపంబొనర్చి సుతుఁగోరి వనంబులయందు కృష్ణుడొ
ప్పారగ శంకరున్ నిరత మాత్మఁ దలంచుచు భక్తి యుక్తుడై
వారక యారుమాసములు భక్తవరుం డుపమన్యుచేత నిం
పారగ దీక్షఁగైకొని ప్రయత్న పరుండయి చిత్తశుద్ధితో

683. కం. ఆతతమగు నత్తపమున
కా తరుణేందుధరుడు ముదితాత్ముడునై వి
ఖ్యాతిగ దర్శనమిడి నీ
చేతమునం గలుగు కోర్కె చెప్పుమటన్నన్

684. మ. వసుదేవాత్మజు డవ్విషాభరణు భవ్యంబౌ పదాంభోజముల్
నొసలన్ దాకగ మ్రొక్కి లేచి కడు సంతోషమ్మునన్ సన్నుతుల్
వెసఁ గావించి మహాత్మ! జాంబవతికిన్ బ్రీతిన్ గలిగింప నా
కొసగన్ గోరెద నొక్క సత్సుతుని సర్వోత్కృష్ట చారిత్రునిన్

685. తే.గీ. అనిన శంకరుడిట్లనె నను నయమున
వినుము వసుదేవ నందనా! వెఱపదేల?
పదియు నార్వేలు భార్యలఁ బడయఁ గలవు
ఒక్కరొకరికి పదిమంది యుద్భవింతు
రధిక బలశాలురగు పుత్రులవని యందు

686. కం. అని శంకరుడన గిరిసుత
యును నిట్లనియెను యదూద్వహుని గాంచుచు నో
వనజాక్ష! నీవు పృథ్విన్
మనగల వొకవంద యేండ్లు మానితరీతిన్

687. కం. అటుపైన నొక్క విప్రు ని
పటుతర శాపమున నీదు వంశంబెల్లన్
పటిమసెడి నశించును ను
ద్భట దర్పులునై నశింత్రు త్వత్సు తులరిదిన్

688. కం. నీవును నీయగ్రజుడును
నావల చాలింతురయ్యా! యవతారములన్
ధీవర! తథ్యంబియ్యది
కావున దుఃఖింపనేల కంజదళాక్షా!

689. మ. అవతారమ్మును వీడి నీవు సనగా నాపైన నీ భార్యలున్
రవళిన్ దొంగల బారినన్ బడుదు రష్టావక్రు శాపంబునన్
భవితవ్యంబిది దీని మార్చుట యసంభావ్యం బటంచున్ గడున్
వివరంబొప్పగఁబల్కి యీశ్వరి చనెన్ విశ్వేశ్వరున్ గూడుచున్

690. ఉ. అంతటఁ గృష్ణుడున్ దనివినందుచు నయ్యుపమన్యుఁజేరి, య
త్యంతము భక్తి మ్రొక్కిచనె నప్పర మేశ్వరునిన్ మహేశ్వరిన్
స్వాంతమునం దలంచుచు నృపాల! నిజమ్ము పిపీలికాది బ్ర
హ్మాంతము మాయకున్ దవిలి యాడుదు రెల్లరుఁ గీలుబొమ్మలై

691. తే.గీ. పూర్వకర్మాను కూలమై సర్వజీవు
లా మహా శక్తికిన్ జిక్కి యాడుచుందు
రంతె, రాగమ్ము ద్వేషమ్ము లామెకెపుడు
నుండ వెవ్వరి పట్ల బ్రహ్మాండములను

692. తే.గీ. శక్తి లేకున్న జగములు జడములౌను
కాన నెల్లరు నామె యధీను లౌచు
నుండ వలయును స్వాతంత్ర్యమొల్లదెందు
ఆమె నర్చించు జన్మలు సార్ధకములు

693. వ. అనివ్యాసుండు జనమే జయునకుంజెప్పెనని సూతుండు
శౌన కాదిమహామునులకుంజెప్పె

694. చం. ఉరుతర ఘోరసంసృతి మహోదధి మున్గి నిరంతరంబు దు
స్తర భవ దుఃఖ సంహతుల చచ్చుచు పుట్టుచునుండు మూఢులౌ
నరులఁ దరింపఁ జేయగల నావ త్వదీయ పదాబ్జయుగ్మ సం
భరమగు భక్తి దక్కఁ గనవచ్చునె యొందు మహేశ్వరీ!యిలన్

695. వ. ఇది శ్రీదేవీ కరుణా కటాక్షలబ్ధవిభవుండును కమలాంబా సుబ్బరాయుల ద్వితీయ పుత్రుండును కౌశిక సగోత్రుండును అగస్త్యరాజ వంశోద్భవుండును నగు సుబ్బారావుకవి ప్రణీతంబగు దేవీభాగవతమను మహాపురాణమునందు వ్యాసుడు చేసిన కర్మప్రబోధంబును, దేవకీ వసుదేవుల చరిత్రంబును, జనమేజయుని ధర్మ సందేహంబులును, నర నారాయణులతపస్సు, ప్రహ్లాదచ్యవన సంవాదంబును, ప్రహ్లాద నర నారాయణుల యుద్ధంబును, శుక్రాచార్యుని తపంబును, మాయాశుక్ర ప్రవేశమ్మును, రాక్షసులకు శుక్రుని శాపంబును, రాక్షసుల పశ్చాత్తాపంబును, ఇంద్రుడొనర్చిన దేవీస్తుతియును, ప్రహ్లాదుడొనర్చిన దేవీస్తుతియును, నరనారాయణులపస్వరల ననుగ్రహించుట యును, భూదేవిమొర విష్ణుమూర్తి నిస్సహాయతయును, వ్యాసుడొనర్చిన యోగ మాయా ప్రశంసయును, కంసదౌష్ట్యంబును, దేవకీ వసుదేవుల సంవా దంబును, కృష్ణజననంబును, ప్రద్యుమ్నాపహరణంబును, కృష్ణుని తపంబును నను కథలు గల చతుర్థస్కందము

ఓం తత్సత్
శుభం



**శ్రీదేవీ భాగవతము**

# పంచమ స్కంధము

1. కం. శ్రీగౌరీ వాణీశ్వర
యోగీంద్రనుతా! స్థిర కరుణోద్దీప్తా! ర
క్షోగణ కుంజలవిత్రా!
ఆగమ నిగమార్థ వినుత! అబ్జదళాక్షీ!

2. కం. శౌనకుడాదిగ మౌనులు
మౌనముగా వినుచు సూత మౌనీంద్రుని పౌ
రాణికుఁ గాంచి దరస్మే
రాననులై పలికిరిట్టు లానందమునన్

3. చం. అమల పురాణ శాస్త్ర వివిధార్థ విదాంవర! సూత సన్మునీ!
క్రమమున దేవకీ సుతుని రమ్య చరిత్రముఁ జెప్పి మాదు జ
న్మములకు సార్థకత్వము నొనర్చితి రైనను నొక్క సందియం
బమరెను మాదు మానసములందు కృపన్ వివరింపు మింపుగన్

4. మ. వసుధన్ దైత్యులఁ ద్రుంచి సాధువులఁ బ్రోవన్ బద్మనాభుండె తా
వసుదేవాత్మజుడై జనించెనని మున్ వాక్రుచ్చి తట్టైన, న
య్యసుర ధ్వంసికి నక్కరేమి యగు తా నర్చింప గౌరీపతిన్
పొసగన్ దా నిడుటేమి పార్వతి వరంబుల్ గృష్ణునిన్ మెచ్చుచున్

5. చం. అన విని సూతు డిట్లనియె నమ్ముని వర్యులతోడ మున్ను స
న్ముని వరుడైన వ్యాసుఁ గని పూరుకులాన్వయు డిట్టి సందియం
బొనరగఁ దెల్ప నమ్మునియు నొప్పుగ నాతని కెట్లుచెప్పె, న
య్యనువున మీకు నేను తెలియన్ దగఁ జెప్పెద నాలకింపుడీ!

6. కం. జనమేజయు డావ్యాసుని
గని మీరడిగిన విధమున కరకమలంబుల్
వినయమున మోడ్చియడుగగ
మునివరు డీరీతిఁ బల్కె ముదితాత్ముండై

7. ఉ. నీ విపుడన్న మాట లవి నిక్కము విష్ణువె కృష్ణుడయ్యె, నిం
దేవిధమైన శంకయును నేర్పడ దైనను, కైటభారి స

ద్భావముతోడ నివ్వసుధఁ దానొక మానవదేహధారియై
దేవ విరోధి సంఘములఁ దేర్చగ నుద్భవ మందె భూవరా!

8. ఉ. కాన మనుష్య భావములఁ గైకొని యాశ్రమ ధర్మరక్షణం
బూనుచు పెద్దలన్ మఱియు నొజ్జల విప్రుల గారవించుచున్
మానక దేవతార్చన లమంద గతిన్ నెరవేర్చుచున్ గృహ
స్థానుగతోరు ధర్మముల నౌదల దాల్చెను గృష్ణు డిద్ధరన్

9. ఆయా వేళల సౌఖ్యము
లాయాకాలముల చింత లయ్యెయెడలన్
బాయదు కామాదిరిపుల
మాయామోహితుడునైన మనుజునిపోల్కిన్

10. కం. గుణమయ మగు దేహంబును
పనిగొని ధరియించి త్రిగుణ భావంబుల కే
యనువున నతీతుడై తా
ననయము చరియించు సాధ్యమౌనే తలపన్

11. కం. నారాయణు డేనియు నా
నారాయణు నంశఁబుట్టు నరుడేనియు తా
నారాధింపక తప్పదు
కారణమై వెలుగు శివుని కామ విరోధిన్

## ఓంకారంలో మహేశ్వరీ తత్వం

12. తగ'న' కారము బ్రహ్మయై తనరు నెపుడు
హరి 'యు' కార మటంచును నార్యు లంద్రు
భద్ర గతి 'మ' కారంబది రుద్రు డగును
అర్థమాత్ర మహేశ్వరి యైవెలుంగు

13. కం. ఒకదాని కంటె మఱియొం
డకలంక బలీయ మౌచు నమరుట కతనన్
ప్రకటముగ నర్ధమాత్రయె
సకలోత్కృష్టం బటంచు సత్కృతులందెన్





14. తే.గీ. బ్రహ్మ కంటెను విష్ణువు పరముడగును
పంక జోదరు కంటెను ఫాలనేత్రు
డధికుడగు జగన్మాత తా నందరకును
నధికు రాలన నొప్పె ధరాధినాథ!

15. చం. నలువ మొగంబు నుండి జననంబును బొందె మరొక్కరుద్రు, డ
య్యలఘుడు మూల రుద్రునకు నంశజుడేయగు నట్టియంశజున్
దలపుల నిల్పి కొల్తురు ముదంబున నెల్లరనంగ నట్టిచో
దలపరె మూల పూరుషుని తద్దయు భక్తిఁ త్రిలోక పాలురేన్

16. మ. పరదేవీ వర సన్నిధాన మహిమన్ బ్రాప్తించె శ్రేష్ఠత్వ మా
పరమాత్ముండగు శ్రీమహేశ్వరున; కంబాసన్నిధానంబుఁ దా
పరిహాసంబునకేని వీడిన యెడన్ బ్రాశస్త్య మొక్కింతయేన్
సరిగాఁ బొందదు శక్తిహీనుడగు నాశ్చర్యంబుగన్ భూవరా!

## నిజమైన బంధనము

17. తే.గీ. అమ్మహా యోగమాయా నియంత్రణమున
ధర్మ సంస్థాపనార్థంబు ధరణియందు
పెక్కు రూపమ్ములను దాల్చి యక్కజముగ
యుగయుగమ్ముల వైకుంఠు డుద్భవించు

18. చం. బొమముడి సన్నతోడ పరిపూర్ణ చరాచర విశ్వమెల్లఁ దా
క్రమమున సృష్టిసల్పి పరిరక్షణ సేయును, నంతమందు న
శ్రమమున లోనికిన్గొనును శాంకరి యాజగదంబ, ప్రాభవం
బమరగ నాజ్ఞలన్ బరపు నౌదలలొగ్గఁ ద్రిమూర్తు లేనియున్

19. సీ. కారాగృహమునుండి కన్నయ్యఁ గొనివచ్చి
గొల్లపల్లె కెవరు కూర్మిఁ జేర్చె?
పదునారువేల యేబది మంది కన్యల
సృష్టించి యెవరిచ్చెఁ గృష్ణునకును
ద్వారకా నగరమ్ముఁ దగినరీతి నెవరు
నిర్మింపఁ జేసి రనింద్యగతిని

తరుణీ మణులకెల్ల నిరవుగఁ గృష్ణుని
దాసుగా నెవ్వరు సేసి రవని

గీ. ఆమె ఆది పరాశక్తి, అఖిలలోక
మాతయని యెఱుంగు మధిప! మౌనివర్యు
లైనను త్రిమూర్తులైన నయ్యాది శక్తి
మోహపాశాను బద్ధులే ముజ్జగముల

20. చం. ప్రియసతి సత్యకోర్కె నెరవేర్పగఁ గృష్ణుడు దేవనాధుకున్
భ్రియమగు పారిజాతమును వేగమె గైకొని వచ్చెగాదె; ని
ర్భయమున నేగి శాత్రవుల బాహుబలమ్మున నోర్చి రుక్మిణిన్
రయమునఁ దెచ్చి రాక్షస వివాహవిధిన్ మును పెండ్లియాడడే

21. తే.గీ. ఇన్ని కార్యమ్ములకు మూల మెంచి చూడ
నొక యహంకారమేయౌను సకల జగతి
అహము వీడక యున్న బ్రహ్మాదులేని
ముక్తిఁ బడయరు శత జన్మములకు నైన

22. చం. ధనమది కాదుబంధనము, దారసుతాదులుకారు బంధముల్
తనయులు బంధువుల్ మఱియు తక్కిన సంపదలెన్నియేనియున్
గనుగొనఁ గావు బంధములు, కల్గునహంకరణం బదొక్కటే
ఘనమగు బంధనంబగు జగంబులలో పరికించి చూడగన్

23. శా. నేనేకర్తను, నేనెదక్షుడను, నేనేచేసి తిక్కార్యమున్
నే నిట్లెన్నియొ ముందు ముందు మిగులన్ నేర్పొప్పఁగావించెదన్
నానా సత్క్రియలంచు నెంచుచు నమందంబౌ నహంకార బం
ధానన్ జిక్కి శరీరిగ్రుంకిడు దురంతంబైన మోహాంబుధిన్

24. ఉ. కార్యముగల్గునే జగతి కారణమెద్దియు లేక; సృష్టిలో
కార్యము లీయహంకృతియె కారణమై విలసిల్లు సర్వమున్;
కార్యములౌఘటంబులకు కారణమిద్ధర మట్టియేగదా!
ఆర్యసుసన్నుతా! విను మహంకృతియే తగబంధనమ్మగున్

25. తే.గీ. మోహమబ్బు నహంకృతి పొడమెనేని
అట్టిమోహమ్ము సంసృతికాలవాల





మయ్యహంకృతి వీడిన యాధ్యునకిల
మోహ సంసారములు వాయు ముక్తికలుగు

26. చం. అరయఁ త్రిమూర్తులేనియు నహంకరణంబునముగ్గి, కార్యముల్
నిరతముఁ జేయు చంద్రు కడునేర్పున; యాజగదంబయాజ్ఞలన్
శిరములఁ దాల్తురెల్లపుడు, శ్రీహరి తా నవతారరూప వి
స్తరముల నెల్ల యామె కనుసన్నలఁ దాల్చును నస్వతంత్రుడై

27. వ. అనియిట్లు వక్కాణించుచున్నమునివరుం జూచి జనవరుం డిట్లనియె

28. ఆ.వె. యోగమాయ యనియు యోగశక్తియునంచు
జగము లామెవలన సంభవించు
ననుచు పలుకుదెపుడు; నయ్యంబ మహిమలన్
తెలుపు మోమునీంద్ర! తియ్యముగను.

29. కం. అని జనమేజయు డడుగగ
మనమున కడు సంతసించి మౌనివరేణ్యుం
డనియెను నో జననాధా!
వినిపించెద తద్విధంబు వినుమా శ్రద్ధన్

30. కం. శ్రద్ధా బుద్ధుల తోడన్
శుద్ధుండును, శాంతుడైన శ్రోత యడిగినన్
బుద్ధికి నెక్కగ తెలుపని
బోద్ధ పరమ మూఢుడౌను పురుషులలోనన్

## మహిషుని పుట్టుక

31. వ. కావున నంబా మహిమంబు తెలిపెద సావధానుండవై యాలకింపుము మున్ను

32. చం. "దను" వను వాని సంతతియె దానవ జాతియనంగనొప్పె, నా
దనువున కాత్మజుల్ గలరు ధారుణి రంభ కరంభనాము, ల
ద్దనుజులు సంతతిన్ గనక తద్దయు దుఃఖ సముద్ర మగ్నులై
వనముల కేగి రిర్వురు తపంబు లొనర్పగ నిశ్చితాత్ములై

33. ఉ. పంచనదంబునన్ మునిగి పాయని వేడ్కఁ గరంభు దుగ్ర దీ
క్షాంచితుడై యొనర్చె తపమద్భుత రీతిని; రంభుడున్ మదిన్
వంచన లేక సాల విటపంబునఁ గూర్చొని నిష్ఠతో నుపా
సించుచు నుండె పావకుని; చేతములన్ సురలెల్ల భీతిలన్

34. కం. సురపతియుఁ గరము భీతిలి
యురు నక్రాకృతిఁ గరంభునొద్ద కరిగి త
చ్చరణంబు లొడిసి పట్టుక
సరగున లోపలికి నీడ్చి చంపె జలమునన్

35. చం. అనుజుడు సంహరింపఁ బడెనంచు నెఱింగిన రంభు దుగ్రుడై
తనశిర మగ్ని దేవునకు దారుణభంగి సమర్పణంబు సే
యను సమకట్టి వామ కరమందు శిరమ్మును జేర్చి ఖడ్గ మె
త్తెను మఱియొండు హస్తమున దేవతలెల్లరు భీతిఁ జెందగన్

36. చం. అదిగని వీతిహోత్రుడు రయంబున తత్క్రియ కడ్డువచ్చి నె
మ్మది నిటువల్కె, నోయి! కడు మందుడవై యిటు లాత్మహత్యకున్
గదలుపడంగ నేమిటికి, కల్గును పాతక మాత్మహత్యచే
నెది ఫలితంబుఁ బొందఁగల విప్విధి ప్రాణమువీడి యంతటన్

37. కం. కావున విరమించుట తగు
నీవీ యత్నమును; వరము లేమివలయునో
భావమున నెంచి కోరుము
దీవించి యొసంగువాడ దివిజ విరోధీ!

38. మ. అనినన్ రంభుడు ఖడ్గమున్ విడి యమందానంద సంయుక్తుడై
వినయంబొప్పగ హస్తముల్ మోగిచి తావేడెన్ శుచిన్ గాంచి యో
యనఘా! నాకొక పుత్రు నిమ్ము దయతో నాదిత్య దైత్యాళికిన్
మనుజశ్రేణికి దుర్జయుండగు నసామాన్య ప్రతాపోద్ధతున్

39. కం. అని యభ్యర్థించిన రం
భుని గని యిట్లనియె నగ్ని, ముందుగ నే కా
మినితోడ రమింతువొ, అ
ద్దాని వలన కలుగు నీకుఁ దనయుడు సుమ్మా!

40. వ. అనివరంబొసంగి అగ్నిదేవుం డదృశ్యంబైనయంత

41. ఉ. రంభుడు నంత నింటికిఁ త్వరన్ జనుచుండగ గాంచె నొక్కచో
జృంభిత పద్మ సౌరభ విశేషము, చక్ర మరాళ భృంగమున్,
శుంభ దభంగ భంగ పరిశోభితమున్ సుమవల్లికావృత
స్తంభిత పాదపోత్కర విశాల తటంబు సరోవరం బటన్

42. ఉ. అచ్చట యక్ష కిన్నర విహాయస చారులు నిల్చి జంటలై
ముచ్చటఁ దీర సౌఖ్యములు పొందుటఁ గాంచుచు నేగు రంభు డా
పచ్చని చెట్ల మధ్యఁ గనెఁ బ్రాయముతో నెదయై విహారముల్
స్వేచ్ఛగసల్పు నొక్క మహిషిన్ గడు నిద్దపు దేహి నొయ్యనన్

43. మ. కని యారంభుడు కామరూపుడగుటన్ గామేచ్ఛ వేగంబ, దు
ర్వినియుక్తిన్ రమియించె నమ్మహిషితో స్వేచ్ఛన్ వనంబందు, నే
మని చెప్పందగు దైవయోగ మకటా! యత్యంత దీక్షామతిన్
ఘనుడై యొప్పియు నీచవృత్తి కిటు సంకల్పించె నుద్రేకియై

44. కం. ఆతడు సంభోగింపగ
నా తిర్యక్కునకు గర్భ మమరుట కతనన్
బ్రీతిన్ రంభుడు దానిని
పాతాళమునకుఁ గొనిచనె భరియింపంగన్

45. కం. దానికిఁ బలు మహిషంబుల
మానుగ కాపుంచి పట్ట మహిషినిఁ బోలెన్
దా ననునిత్యముఁ గనుచున్
మానసమునఁ దృప్తిఁ జెంది మసలుచు నుండున్

46. ఉ. అంతట నొక్కనాడు కడు నాత్రమునన్ మహిషం బొకండు దు
శ్చింతసెలంగ పట్టమహిషిన్ రమియింపగ వెంబడింప త
త్కాంతుడు రంభుడున్ వెనుక తద్దయు వేగమె యేగి దాని న
త్యంతము ముష్టి ఘాతముల నార్చుచు నొంప చలించి యద్దియున్

47. చం. శిరము విదుల్చ శృంగములు శీఘ్ర గతిన్ దనవక్షమందు ని
ష్ఠురగతిఁ దాక రంభుడును సోలుచు పృథ్విని వ్రాలి యట్టిటుల్

దొరలుచు ప్రాణముల్ విడువఁ దోరపుభీతి వికంపమానయై
పరువులు వెట్టె నామహిషి భర్తృవియోగ వివృద్ధ దుఃఖయై

48. చం. అదిగని కామతాపమున నామహిషంబును దానివెన్క పెం
పొదవెడు తీవ్ర వేగమున నుగ్ర గతిన్ జనుదెంచుచుండ తా
నదవదఁ జెంది పాఱి శరణార్థిని కావుమటంచు యక్షులన్
బెదరుచు వేడె నమ్మహిషి వేదనతో పరికంపితాంగయై

49. ఉ. యక్ష గణంబు లంత వివిధాయుధముల్ ధరియించి దాని సం
రక్షణకై గడంగి సమరంబతి ఘోరముగా నొనర్చి రూ
క్షాక్షులఁ గ్రుద్ధయై గదియు నామహిషంబును సంహరించి, భీ
తేక్షణయైన యమ్మహిషి నెంతయు నూఱటఁ బుచ్చి, యాపయిన్

50. కం. గొనకొని రంభుని దేహముఁ
గొనివచ్చి దహించుచుండ కుములుచు భర్తన్
గనుఁగొని యమ్మహిషియు న
య్యనలంబున దూకె యక్షు లచ్చెరువందన్

51. కం. చూలాలగు నయ్యెను మపు
డాలీలన్ జితిని దూక నందుండి మహా
భీలాకృతి మహిషుడనన్
గాలాభ్ర సముండు దీర్ఘ కాయుడు పుట్టెన్

52. తే.గీ. మహిష-రాక్షస రూప సంప్రాప్తుడగుచు
పృథ్వి మహిషాసురుండను పేరఁ బరగె
జనకు రాజ్యమ్మునకు వారసత్వమొంది
రాజ్య మేలుచునుండె పరాక్రమమున

53. ఉ. ఆతని తండ్రి రంభుడును నా మరు జన్మమునందు పుత్రు పై
నాతత వత్సలత్వమున నాత్మసఖుండయి "రక్తబీజు"డన్
ఖ్యాతి వహించి యామహిషునంతిక మందు చరించుచున్ గడున్
బ్రీతి యొనర్చుచుండె తన విశ్వసనీయ విశేష వర్తనన్

54. వ. ఇట్లుండ నామహిషుండు చతుర్ముఖుం గూర్చి తపం బొనరింపనెంచి





55. తే.గీ. మేరుపర్వత శిఖరాన మిగుల నిష్ఠ
బ్రహ్మఁగూరిచి వేల సంవత్సరములు
తపముసేయంగ నలువయుఁగృపవహించి
యెదుట ప్రత్యక్షమై కోర్కె యేమియనిన

56. కం. అమరత్వము నాకిమ్మో
కమలజ! యని మహిషు డడుగఁ గంజజు డపు డ
య్యమరారిఁ గాంచి నవ్వుచు
నమరత్వముఁ గోరఁదగునె యనుచు నిటులనెన్

57. శా. ఓయీ దానవ! యెల్ల లోకములయం దొక్కండు నైనన్ మునున్
కాయంబున్ ధరియించి యట్టె బ్రతుకంగా జాలెనే శాశ్వతుం
డై, యాలోచన సేయుమయ్య! జననంబౌనట్టి యేవస్తువేన్
బాయంగావలె నొక్కనాడు తనువున్ బ్రహ్మాండభాండమ్ములన్

58. తే.గీ. కాన మఱియొక వరము నెద్దానినైన
కోరుకొమ్మన మహిషుడు కూర్మితోడ
పురుషుచే నేను మరణంబుఁ బొందకుండ
వరము నిమ్మని కోరెను బ్రహ్మనపుడు
చెలువ లబలలు నన్నేమి చేయరనుచు

59. చం. అనిన "తథాస్తు"టంచు కమలాసను డిట్లనె నోయి దైత్య! నీ
వనిన విధంబునన్ బహుబలాఢ్యుడు నయ్యును పూరుషుండు నిన్
మొనసి వధింపలే డయినఁ బోర నినున్ వధియించు నెప్పుడేన్
వనరుహ నేత్రయే యని ధ్రువంబుగ బల్కి యదృశ్యమై చనెన్

60. వ. మహిషుండంత సంతోషంబున తనరాజధానికిం జని

61. కం. కమలజు వర గర్వంబునఁ
గ్రమమున భూమండలమునఁ గల భూపతులన్
శ్రమలేక యోర్చి సర్వ
క్షమ కధిపతియయ్యె మిగుల శౌర్యోన్నతుడై

62. సీ. చిక్షురుండను వాని సేనాపతిగఁ జేసి
తామ్రు నధిపుఁ జేసి ధనమునకును

అసిలోము, బాష్కలు, నాత్రినేత్రు, బిడాలు,
కాలబంధకుల సగౌరవమున
దండనాథులఁ జేసి తా చక్రవర్తియై
సామంతులుగఁ జేసి క్ష్మాపతులను
వారిచే కప్పముల్ పాయక గైకొంచు
ధిక్కరించిన వారి నుక్కడంచి

గీ. బ్రాహ్మణుల నెల్లరన్ దన వశమొనర్చి
యజ్ఞభాగమ్ము లమరుల కట్లు తనకు
సైత మర్పింప యాజ్ఞలొసంగి మహిషు
డవని నేలుచునుండె నిరంకుశముగ

63. కం. అంతట నిలువక నాతడు
స్వాంతంబున నిట్లు తలచె స్వర్గం బెల్లన్
స్వంతం బొనరిచి యశము ది
గంతంబుల నిండఁ జేయనగు శౌర్యమునన్

64. కం. అనితలచి యొక్క దూతన్
దనచెంతకుఁ బిలిచి చెప్పఁ దగినది యెల్లన్
మనమున కెక్కంగఁ దెలిపి
వినుచు మనుచు ఁబనిచె దేవవిభుని కిదెల్లన్

65. వ. ఆ దూతయును మహిషుని ఆజ్ఞంగొని దేవనాథు
కడకుంజని యిట్లు వినిపించె

66. మ. అమరేంద్రా! దివి వీడి సత్వరమె నీ వన్య ప్రదేశంబుఁ జే
రుము, కాదేని యహమ్మువీడి నను వీరున్ నిత్యమున్ సేవలన్
గ్రమమున్ దప్పక తన్పుచుండు, మదియున్ గాకున్న వజ్రాయుధం
బమరన్ చేత ధరించి సంగరము సేయన్ రమ్ము వీరుండవేన్

67. కం. అని మా ప్రభువగు మహిషుడు
వినిపింపు మటంచునన్ను వేగమె యిటకున్
బనిచెను నేనది యెల్లన్
వినిచితి నిక నీకుఁ దోచు విధమునఁ జనుమా!





68. మ. అని యా దూత వచింప నింద్రుడును క్రోధావేశుడై యెట్టెటో
తనలో నిగ్రహమూని నవ్వుకొని దూతా! మీ ప్రభుంగూర్చి, యా
తని గర్వోద్ధతిఁ గూర్చి నేనెఱిగితిన్ దర్పంబు తద్గర్వ దు
ర్వనమున్ గాల్చెద వేగమే కులిశ దుర్వారాగ్ని కీలావళిన్

69. ఉ. దూతగ వచ్చినట్టి నిను తొందరపాటున చంపరాదటం
చీ తరుణంబునన్ విడచి తింతియ పొమ్మిక నాదుమాటగా
నాతనితోవచింపుము రయంబున, వానిని వానివంశమున్
శాతతరోగ్ర మత్కులిశ సంహతులన్ దుదముట్టఁ జేసెదన్

70. తే.గీ. గడ్డి తినువాని కింతటి కావరమ్మె
వాని కొమ్ములు విరుగంగ వైచి నేను
ధనువు చేయించు కొందు సంతసము మీఱ
అమరపతితోడ రణమది యాటకాదు

71. చం. అని యవహేళనం బొనర నాడు మహేంద్రుని వీడి దూతయున్
జని తన విన్న దెల్లయు నిశాటు నకున్ వినిపింపలేక యి
ట్లనియె మహానుభావ! యమరాధిపు డెంతయు నీదు నున్నతిన్
గనుఁగొన లేక యుండె నిను కాసునకైన గణింప దుద్ధతిన్

72. ఆతని పల్కులన్ దమకు నట్టె వచింపగలేను, సేవకుల్
చేతము రంజిలన్ బ్రభువు చెంతఁ బ్రియమ్ముగ మాటలాడుటే
నీతియగున్; విరోధులు గణింపక యెగ్గులు వల్కిరేనియున్
వాతెఱ విప్పి చెప్పుటది పద్ధతి కాదిల భృత్యకోటికిన్

73. వ. అని సహేతుకంబుగా పలికిన దూత పల్కులు విని మహిషుండు

74. చం. కనకన మండు నగ్నిగుళికల్ బలె కన్నులు జేవురింప, గ
ర్జనములు సేయుచున్ దనుజ సంఘములన్ వడిఁబిల్చి చూడుడీ
నను గణియింప కాదివిజ నాథుడు పైకొని వచ్చునంట తా
ననియొనరింప నాపయిన నగ్నిని దూకెడు కీటకంబనన్

75. చం. నను నెదిరించి నిల్వఁ గల నాథుడు గల్గెనె ముజ్జగంబులన్
వినుడిదె యింద్రులొక్కటిగ వేవురు వచ్చిన సంహరింతు, తా

ఘనుడగునే? సతమ్ము కులకాంతల పొందును గోరు దుష్ట జీ
వనుడు నశక్తుడున్ కుటిల వర్తను డౌ సురనాధు డెన్నడేన్

76. చం. భయపడఁ బోకుఁడే నొకడఁ బట్టివధించెద వాని, మీరలున్
పయనము గందు కేవలము వైభవమున్ బ్రకటింప నాదు వె
న్కయి, దివిజేశు డాదిగల నాకులెకాదు త్రిమూర్తు లేనియున్
జయమును బొందలేరు త్రిదశంబుల నన్నెదిరించి యెవ్వరేన్

77. సీ. స్వర్గమ్ము మనకెల్ల స్వాధీనమౌ నింక
నందనమ్మున సౌఖ్య మందఁ గలము
కామధేనువు పాలు కడుపార సేవించి
మధుపానమున మేను మఱవ గలము
కమనీయ గంధర్వ గానానుగతి నృత్య
మొనరింపగల మింక మనము లలర
అమృత పానముసేసి యానందమును బొంది
రంభాదులను గూడి రమ్యగతిని

గీ. ఆడవచ్చును భోగమ్ము లందవచ్చు
దనుజవరులార! క్షణములో తరలిరండు
గురు వరేణ్యుని శుక్రునిఁగూడి మనము
ముట్టడింతము సురవర పురము నేడు

78. చం. అని దనుజాళికిన్ మహిషు డాజ్ఞ యొసంగి ముదమ్ముతోడ తాఁ
జనియెను మందిరమ్మునకు; స్వర్గమునన్ దివిజాధినాధుడున్
దనుజుని యత్నమెల్ల విని తానును సర్వ దిగీశులన్ మహా
ఘనులను వీరులన్ బిలిచి కార్యమునేర్పడఁ దెల్పె నివ్విధిన్

## ఇంద్రుడి యుద్ధ సన్నాహము

79. చం. సురవరులార! నేడు మహిషుండతి యుద్ధతి, "మీరుస్వర్గమున్
సరగున వీడి పొమ్మనియు, సమ్మతి కాదన సేవ చేయుచున్
స్థిరముగ నాదు పాదముల చెంతనె యుండు మటంచు, లేక నన్
దురమున గెల్వు"మంచు నయదూరుడు వార్తను బంపె దూతచే





80. ఉ. కావున నిప్డు చేయఁ దగు కార్య మదేమియొ చెప్పుడయ్య! స
ద్భావముతో, నుపేక్ష సలుపందగ దర్పకునైన శత్రువున్;
చేవగలట్టి వాడు, సరసీరుహసంభవు చే వరమ్ము న
త్యావిల బుద్ధిఁ గొన్నయత డౌనె యుపేక్షకు నర్హు డట్టిచో

81. తే.గీ. బాహు సత్వమ్మునకు బుద్ధి బలముఁ గూర్చి
వాని పీడను వదలించ వలయు మనకు
సంధి మంత్రాల కెన్నడు సమ్మతింప
డతడు దుష్టుడు, వరగర్వయుతుడు సుమ్ము!

82. చం. సమర మొనర్త మన్న కడు సాహసమౌనని శంకగల్గు, న
య్యమర విరోధి దేవ దనుజావళిచే మరణంబులేని మా
ర్గమున వరమ్ము పొందెగద! కంజజుచే; నదిగాక సంగర
క్రమమున గెల్పునోటములు గావు వచింపను నిశ్చయంబుగన్

83. చం. ఇరవగు బుద్ధి పెంపున పరేంగితమున్ గ్రహియింపఁగల్గు స
చ్చరితుల విజ్ఞులన్ మఱియు సత్యవిచారుల సంగదూరులన్
సరగున కార్యదక్షులగు చారులఁ బంపి యెఱుంగగా నగున్
పరధన సైన్య సంపదల బాహుబలమ్ముల నెల్ల ముందుగన్

84. ఉ. వారలు వచ్చునంతకు జవంబున స్వర్గమునన్ గలట్టి దు
ర్వారములైన దుర్గముల భద్ర మొనర్పగనౌ నభేద్యమౌ
తీరున, సైన్యమందుకడు ధీరుల బాహుబలాతిరేకులన్
చేరిచి సిద్ధమౌద మనిసేయగ రక్కసు డుక్కుదక్కగన్

85. కం. యుక్తాయుక్తము లెఱుగుచు
యుక్తిన్ నిజశక్తిఁ బరుల యున్నతిఁ దెలియన్
శక్తుండౌవాని వలన
వ్యక్తంబౌ కార్యములవి పడయు ఫలితముల్

86. తే.గీ. అన్నివేళల సాహసం బనువుగాదు
దాన విపరీత ఫలితముల్ దక్కవచ్చు
ఔషధ విషయ మెఱుగని యజ్ఞుడకట!
దానిసేవింప నేమౌను వానియునికి

87. కం. ఈ విధమున దివిజులతో
దేవేంద్రుడు చర్చజరిపి ధీమంతుల సత్
భావుల దక్షుల చారుల
వేవేగన్ బనిచె మహిషు వీటికిఁ జేరన్

## ఇంద్రబృహస్పతి సంవాదం

88. మ. సురనాధుండటుపైన ధర్మవిధి విజ్ఞున్ గీష్పతిన్ జేరి యో
గురువర్యా! మహిషుండు స్వర్గము పయిన్ గ్రూరప్రవృత్తుండు స
త్వరుడై రాఁ దలపెట్టె యుద్ధమొనరింపన్ గాన నాబుద్ధికిన్
సరియౌ మార్గము దోపకివ్విధి భవత్ సాన్నిధ్యమున్ జేరితిన్

89. తే.గీ. దేవ గురుడవు రాజ నీతిజ్ఞుడవును
ఇట్టి సంకట స్థితినుండి యెట్టులైన
నన్ను రక్షింపు మయ్య నీకన్న నాకు
నన్యులెవ్వరు గలరింక నాదుకొనగ

90. వ. అనిపల్కు మఘవున్ జూచి బృహస్పతి యించుక నాలోచించి యిట్లనియె

91. చం. అడలకు మో సురాధిప! జయాపజయమ్ముల నిర్ణయమ్ము లే
యెడలను దైవమే సలుపు; నెవ్వరి కైనను దైవనిర్ణయం
బుడుప నసాధ్యమౌ, జరుగనున్నది కాగల, దట్టులంచు నె
వ్వడును ప్రయత్నమున్ విడచి వైచుట యొప్పదు నిక్కువంబుగన్

92. కం. మునివరు లైనను ముక్తిం
గనుటకు తమయత్నమొందు గావలెఁ గాదే!
అనవరతము ధ్యానంబును
ఘన నిష్ఠయు లేక ముక్తిఁ గాంచతరంబే!

93. తే.గీ. యత్నములు లేక ఫలితమ్ము లందవెందు
అధిక యత్నమ్మునను ఫల మందకున్న
దైవ నిర్ణయ మిదియని తలచి మదిని
ఉపశమమ్మును బొందుట యుక్తమౌను





94. చం. సమరమునందు కేవలము సైన్యబలంబులొ మంత్రయుక్తులో
అమరుపఁ జాల వెన్నడు జయమ్మును, పూర్తిగ దైవయోగ సం
క్రమణమునన్ జయమ్మొదవు, కాని యెడన్ బలవంతు డొక్కచో
శ్రమపడియోడి పోవుట, కశక్తుడు గెల్చుట కేమిహేతువౌ?

95. తే.గీ. దుఃఖ మొదవిన నధికంపు దుఃఖమగ్ను
సౌఖ్యముల యందు నెక్కుడు సౌఖ్యయుతుని
గాంచి పురుషుండు తన నూఅడించుకొనుచు
శాంతిఁ బొందుట యుక్తమ్ము స్వర్గ నాథ!

96. చం. అపజయ మొందినప్పుడు, జయమ్మొనగూడిన యప్పుడేనియున్
ఉపశమ చిత్తుడై యలరు నుత్తమ ధైర్యగుణోన్నతుండు, తాఁ
గృపణతఁ గ్రుంగ డొక్కయెడ గ్లేశము గల్గిన, పొంగడొక్కచో
సఫల మనోరథుండునయి శాంతమె భూరి విభూషణమ్ముగా

97. తే.గీ. ప్రాణమున కేర్పడెడు క్షుత్పిపాస లనగ
మనసులోగల్గు శోక మూర్ఛన లనంగ
మేని కొదవెడు నా జరా మృత్యువులన
నమరు నీయారును షడూర్మ్ము లంద్రు జగతి

98. కం. ఇవియారు దేహగతములు
ధ్రువముగ నివియెల్ల మిగుల దూరము నాకం
చెవడు దలంచునొ స్థిరముగ
ప్రవిమల మౌశాంతినతడె పడయు చిరంబున్

99. కం. మమకార మ్మొకటియె దుః
ఖములకు నెల్లెడల మూల కారణ మగుటన్
మమతన్ వీడిన యెడలన్
సమయును దుఃఖములు, పరమ శాంతి లభించున్

100. కం. ప్రారబ్ధ మనుభవింపక
తీరదు వెయ్యేండ్లకైన దేహధరునకున్
ప్రారబ్ధం బిదియని మది
నేరిచి చింతింపఁదగదు నేర్పరి యెందున్

101. తే.గీ. పరగ పుణ్యమెల్ల సుఖానుభవము వలన
పాప మయ్యది దుఃఖానుభవము చేత
కరగి పోవును గాన సుఖమ్ము నెపుడు
మదిని కోరదు విజ్ఞు డమర్త్యనాథ!

102. ఉ. కాన సురాధిపా! తగిన కార్యము చక్కగ నిర్ణయించి చే
బూనుము, నీ ప్రయత్నమది పొల్లయినన్ సఫలంబెయైన నీ
మానసమందు చింతిలక, మంచికి చెడ్డకు దైవయోగమే
యౌను బలీయ కారణ మటంచు ధృఢంబుగ నెంచుచున్ మదిన్

103. చం. అని గురుదేవు డిట్లన సురాధిపుడున్ గురువర్య! నేనిదే
యని యొనరించి యామహిషు నంతకు పాలికిఁ జేర్తు నిప్పుడే,
తన యతనంబులేక తముఁ దామె సుఖమ్ములు కీర్తి సంపదల్
గొనకొని వెంటరావుగద కోరిన వెంటనె నెట్టివారికేన్

104. కం. యతులకు జ్ఞానము, ద్విజులకు
సతతమ్ము మనమ్ములందు సంతోషంబుల్,
అతులైశ్వర్య రతులు భూ
పతులకు యుద్ధ విజయములె వర భూషణముల్

105. కం. నీవే బుద్ధిబలంబుగ
భావింపన్ వజ్రమదియె బాహుబలముగాఁ
గావించెద సమరము గురు
దేవా! కైమోడ్తు నన్ను దీవింపు మికన్

106. వ. అని పల్కు మహేంద్రుని పల్కులన్ విని బృహస్పతి మరలనిట్లనియె

107. చం. అని యొనరింపు మీవని సురాధిప! నేనతి నిశ్చయమ్ముగా
ననుటయు, మిన్నకుండు మని యంటయుఁ గల్గెనె చెప్పుమయ్యా! పో
రొనరుచు వారలందు జయ మొక్కరినే వరియించుఁ గాని యే
యనువున నే వచింపఁ గలనయ్యా! జయమ్మును నిశ్చయమ్ముగన్

108. ఉ. ఇంతకు మించి నేను వచియింపగలేను సురేంద్ర! ముందుగా
నంతయు చెప్పఁగల్గెడి మహాత్ముడఁ గాను నిజమ్ముసుమ్ము, నే
నంతటి వాడనేయయిన నత్రిసుతుండగు చంద్రుడట్లు నా
చెంతనచేరి శిష్యుడయి చేసిన మోస మెఱుంగ కుందునా

109. చం. అనుపమ బుద్ధి మంతుడు బృహస్పతి యంచు జగంబులందు నే
ఘనతరకీర్తి నందియును కష్టము లవ్విధి రాక తప్పెనే
అనితరమైన జ్ఞానమది అక్కఱ కయ్యెనె నాడు, కాన నీ
వును తగు యత్నమున్ సలుపఁబూనుము కాగల దయ్యెడున్ దుదిన్

110. కం. అని గీష్పతి పల్కగ నా
యనిమిష పతి వినయ వినమితాననుడై యా
తని వీడ్కొని బ్రహ్మకడకుఁ
జనియెను వడివడిగ నతని సాయం బడుగన్

111. చం. చని కడు దీనుడై సరసిజాత భవున్ గని మ్రొక్కి పల్కె, నో
యనఘ! దురాత్ముడౌ మహిషు డత్యధికోద్ధతి స్వర్గసీమపై
నని యొనరింప నెంచి మొననంతయు సిద్ధము చేయుచుండె; న
ద్దనుజుడు తావకీన వరదర్ప యుతుండు నజేయు డబ్జజా!

112. తే.గీ. కాన నన్నిప్డు మీరలే కావవలయు
ననుచుఁ బ్రార్థింప బ్రహ్మయు నతనిఁ గాంచి
పార్వతీశుని గూడి యప్పద్మనాభు
కడకుఁజని విన్నవించుట కార్యమిపుడు

113. ఉ. ఆతని చెంతకేగి మనమందర మొక్క సరైన మార్గమున్
చేతములన్ దలంచి తుదఁ జేయుట యొప్పును కార్య మెద్దియేన్,
భీతిల కయ్య! సాహసము పెంపున శత్రు బలాబలంబు ల
త్యాతత బుద్ధి నెంచని ప్రయత్న పరుండు నశించు నెవ్వడేన్

114. చం. కమలజు డిట్లువల్కి విషకంధరు దోడ్కొని, యష్టదిక్పతుల్
తమ వెనువెంటరాఁ గదలి తామరసాక్షుని చెంతకేగి కా
ర్యము వినిపించినన్ దితిజ హంతయు నిట్లనె తక్షణంబె య
య్యమర విరోధియౌ మహిషు నంతమొనర్చుట యుక్తమిత్తఱిన్

## మహిషునితో యుద్ధం - దేవతల పరాజయం

115. చం. సమరము సేయ సిద్ధపడి సాగుడు, భీతిలఁ బోకుడంచు న
క్కమల దళేక్షణుండు వలుకన్ దివిజుల్ దివిజేంద్రుఁ గూడి శీ
ఘ్రమె తమ సైన్యముల్ గలసిరా నఖిలాయుధ పాణులై కడున్
గమికొని యేగి రాదనుజు గర్వమడంప జయాభిలాషులై

116. చం. మహిషుడునున్ మహోగ్రుడయి మాంసలుఁ జిక్షురు దన్నవాని దు
స్సహుని చమూపతిన్ బనిచె సైన్యము నిచ్చి సురేంద్రుఁదాక, న
య్యహిత భయంకరుండును సురాధిపు నొక్కట పంచశాత బా
ణహతుల నొంప నా దివిజనాథుడు హెచ్చిన రోషమగ్నుడై

117. తే.గీ. కడఁగి యర్ధచంద్రాకార కఠిన కాండ
మొందు గైకొని రాక్షసు గుండెలదర
వేయ నా చిక్షురుండును వేగఁ బృథ్విఁ
బడియె మూర్ఛిలి, యదిగని పాకవైరి

118. ఉ. రక్కసు దంతిపై శర పరంపరలన్ గురియించిచంప; పెం
పెక్కిన క్రుద్ధతన్ మహిషు డింద్రునిపైకి బిడాలుడన్న పే
రెక్కిన దండనాయకు నహీన పరాక్రముఁ బంప, నాతడున్
పెక్కగు సేనతోఁ గదిసె పెల్చన నాదివిజేంద్రు ఁదాకగన్

119. చం. రవరవ లేక డాకొను బిడాలునిపై నమరేంద్రు డుగ్రుడై
జవమున వైచె నంతట నిశాత దశాంబక పంక్తి నొక్కటన్,
దివిజ విరోధియున్ మిగుల తీవ్రతరంబగు బాణపంక్తిచే
నవియఁగఁ జేసె మధ్యనె సురాధిపు దేసిన యంబకమ్ములన్

120. ఉ. అంతట బోక యిర్వదిఁశితాంబకముల్ వడివేసి యార్చి ని
శ్చింతగనుండ, నింద్రుడును చేవదలిర్పగ వానినెల్ల న
త్యంత పరాక్రమంబున విహాయసవీధినఁ ద్రుంచి వానిదొ
దంతినిఁగూల్చె దారుణ గదా ప్రహరమ్ముల తీవ్రకోపుడై

121. ఉ. ఇవ్విధి వారలిర్వురు నహీనగతిన్ విజయాభిలాషులై
చివ్వ యొనర్చు చుండ దరిఁజేరి జయంతుడు తండ్రి కండయై





జివ్వన సజ్యచాపమునఁజేర్చిన యంబక పంచకమ్మునన్
దవ్వులఁగూలనేసె నల దానవు విస్తృత మస్తకం బిలన్

122. కం. దివిజులు జయజయ నినదము
లవిరళగతి సలిపి రంత, నంబర మార్గం
బవియగ దుందుభులు మొఱసె,
నవరోధములేక యాడి రచ్చరలు దివిన్

123. తే.గీ. ఆ బిడాలుడు యమపురి కరిగెనన్న
వార్త విని మహిషుడుఁగడు నార్తిఁజెంది
తామ్రుడను వానిఁ బంపె యుద్ధమ్మొనర్ప
అతడు క్రోధానలోద్దీప్తు డౌచు వచ్చి

124. చం. ప్రళయ పయోధరంబన సుపర్వ బలాయత సాగరమ్మునన్
బెలుచన బాణవృష్టిఁబఱపెన్ బర సైన్యములెల్ల భీతిమై
కళవళమంది పర్వులిడగా; నదిగాంచి యముండు దండమున్
బలముగ వైచె తామ్రుపయిఁ బ్రబ్బిన కోప విరోచనాక్షుడై

125. ఉ. ఆ సమవర్తి దండహతి కాత డొకింతయుఁ జంకఁబోక, బా
ణాసన మెక్కువెట్టి యపు డష్ట దిగీశులపైన, నాక సం
వాసులపైన నాక్షణమ బాణశతంబుల నార్చి వేయుచున్
వేసటఁ బెట్టుచుండఁగని విస్మయమందె వివస్వతీశుడున్

126. తే.గీ. అతని వేగమ్ము నెదిరించి యడ్డుపడగ
నొక్క రొక్కరె చాలక యొక్కటౌచు
అష్ట దిక్పాలు రెల్ల రయ్యసురు నెదిరి
యొక్కపెట్టున కాండమ్ము లొనర నేసి
ధరణిఁ గూల్చిరి తామ్రుని సరభసమున
దనుజవరు లెల్ల రార్త నాదములు సలుప
అమరు లానందమున పాడి యాడ నపుడు
మహిషు డాగ్రహోదగ్ర దుస్సహితు డగుచు

127. చం. గదను ధరించి లోకములు గ్రక్కదలన్ ప్రళయాంబుద స్వనం
బదియన నార్చుచున్ సురల నెల్లర నిప్పుడె మట్టువెట్టి నే

ముదమున స్వర్గలోకమును ముచ్చట దీరగ నేలుకొందు మీ
రిదె గనుడంచు వచ్చె నమరేంద్రు నెదుర్కొన యుద్ధభూమికిన్

128. ఉ. వచ్చి మహేంద్రు నొంపగ జవంబున పెన్ గదవైచి యార్చినన్
చెచ్చెఱ దేవనాథుడును చేవ దలిర్పగ వజ్రమెత్తి యా
మచ్చరి యాయుధమ్ము నట మధ్యనె గూలగనేసె నంతటన్
హెచ్చిన రోసమూని దనుజేంద్రుడు చేత శితాసి దాల్చుచున్

129. చం. ఉఱికె మహేంద్రుపైకి పతదుగ్ర మహాచల సన్నిభుండునై
సురపతియున్ జలింపకొక శూలముఁ గైకొని తాకె రక్కసున్;
దురమతి భీకరంబగుట తోరపు భీతిని దేవదానవుల్
పరువులు వెట్టసాగిరి జవంబున చెట్టుకు పుట్ట కొక్కరై

130. వృ. మహిషుండున్ దన రాక్షసోచిత మహామాయల్ ప్రదర్శించుచున్
మహదాశ్చర్యకరంపు టాయుధములన్ మార్కొంచు,ఁ దా శత్రు దు
స్సహమౌ విద్యను శాంబరిన్ దలపగా సాహస్ర సంఖ్యన్ మహా
మహిమోపేతులు పుట్టి రప్డు మహిషుల్ మాతంగతుంగాకృతుల్

131. ఉ. వారల యుద్ధతిన్ గని దివౌకస నాథుడు కంపితాంగుడై
యూరకనిల్చె; దిక్పతు లయోమయ సంస్థితులౌచు పారిపో
నారయరైరి మార్గ మొకటైనను; నంతఁద్రిమూర్తు లచ్చటన్
జేరిరి, వెన్నుడున్ దనుజసింహుని మాయఁదలంచి యంతటన్

132. తే.గీ. ఇద్ది శాంబరీ విద్యయం చెఱిఁగియతడు
దాని నిర్వీర్య మొనరించె తనదు చక్ర
సంహతుల, నంత దివిజులు సంతసమున
మరలి వచ్చిరి ధైర్య సంభరితు లగుచు

133. మ. ఎవరీ కార్యమొనర్చి రంచు మహిషుండిట్టట్టుఁజూడంగఁ, గ
న్గవకున్ గన్పడి రొక్కెడన్ నలువయున్ గంజాక్షుడున్ రుద్రుడున్
ఛవిమ ద్రూపములన్ సహస్రరవి తేజశ్శ్రీల నొప్పారి; దా
నవవీరుం డది గాంచి రౌద్ర గతిఁ గ్రన్నన్ యుద్ధసన్నద్ధుడై

134. మ. పరిఘున్ జేత ధరించి వారి నెదిరింపన్ వచ్చుచుండన్ ధను
ర్ధరులై వెన్కనె బాష్కల ప్రముఖులౌ తద్దండనాథుల్ భయం





కరులై వచ్చి సహాయమేర్పడ వడిన్ గాండ ప్రకాండమ్ములన్
గురియింపన్ సమరాంగణంబది మహా ఘోరాకృతిన్ గన్పడెన్

135. మ. దివిజానీకములున్ ద్రిమూర్తుల నటన్ దీప్తాంగులన్ జూచి ధై
ర్య వివృద్ధ స్థిర చిత్తులై సెలఁగి హర్యక్షమ్ముల ట్లయ్యెడన్
గవియన్ జొచ్చిరి శత్రుసేనపయి హుంకారమ్ములన్ సల్పుచున్
వివిధాభీల మహాయుధ ప్రకరముల్ వేర్వేర సారించుచున్

136. సీ. అంధకాసురుడు శరాసనం బెక్కిడి
వెన్నునిపై బాణ వృష్టిఁగురియ
వాసుదేవుండంత వానినన్నిటి నొక్క
క్షణమాత్రముననె భగ్నం బొనర్చె
కనలి యాతడు నీల కంధరు మార్కొన
ద్వంద్వయుద్ధంబయ్యె వారిమధ్య
అల త్రినేత్రుండును నసిలోముడును యమ
వరుణులఁ దాకిరి వరుసతోడ

గీ. మహిషు డేసిన గద గరుత్మంతుఁదాక
గట్టిగా మూల్గి నిట్టూర్చె ఖగవరుండు
హస్త పద్మమ్మున నిమిరి యబ్జనాభు
డతని నోదార్చి మహిషుపై నాగ్రహించి

137. మ. తనశార్ఙ్గమ్ముధరించి శాతశర సంధానమ్ము గావించి హె
చ్చిన కోపమ్మున నేసె పెక్కు శరముల్ శ్రీకాంతు డాదైత్యుపై
ఘనగంభీర రవమ్ము పెల్లెసగ దిగ్దంతుల్ ప్రకంపింప దై
త్యుని సేనల్ భయమందగా దివిజు లత్యుత్సాహులై యాడగన్

138. చం. అదిగని యంధకుండు భుజగాభరణున్ విడి యబ్జనాభునిన్
గదియుచు చక్రమున్ విసరె కాలకరాళ మహోగ్రరూపుడై;
చెదరక వెన్నుడంత నతి శీఘ్రగతిన్ సురవైరి గర్వ సం
పద లడఁగన్ గదాయుధము వైచె దివౌకసు లుత్సహింపగన్

139. కం. దామోదరు డేసిన యా
కౌమోదకి శిరముఁ దాకఁ గలఁగి దనుజుడున్

భూమిన్ బడియెను మూర్ఛిలి
సామజ కరహతుల నొరగు సాలము భంగిన్

140. వ. ఆసమయంబున

141. చ. అతులిత కోపవేగమున నమ్మహిషుండును బిట్టునార్చి తా
మతిసెడినట్టులై వడి రమాధవు మార్కొన, పద్మనాభుడున్
చతురత దానవేంద్రుపయి సాయకముల్ పఱపంగ నిశ్చలో
ద్ధతి నతడుండె వర్షజల ధారలకున్ మహిషంబు పోలికన్

142. చం. అడలక దానవుండు పరిఘాయుధమున్ గొని త్రిప్పి రివ్వనన్
గడుకొని విష్ణుమూర్తిపయి క్రౌర్యగతిన్ వడినేయ నద్దియున్
దడుకున వచ్చి శౌరి తలఁ దాకిన మూర్ఛిలె దానవారి, య
య్యెడ గరుడుండు వానిఁ గొని యేగె రణావని వీడి నేర్పునన్

143. కం. హాహా రవముల దేవత,
లోహో భళి! యంచు నసురు లొక్కుమ్మడిగా
నాహవభూమిని నార్చిరి
శ్రీహరి మూర్ఛిల్ల నుభయ సేనలయందున్

144. కం. వారలఁగని శంకరు డో
దారిచి కనలుచుఁద్రిశూల ధరుడై మహిషున్
దారుణగతిఁ బొడువ నతడు
నేరుపునఁ దలంగి యంత నిలకడతోడన్

145. కం. శక్త్యాయుధమున్గొని భుజ
శక్తిన్ శంకరునిపైన సరగున విసరన్
శక్తీశు నురముఁదాకెను
దిక్తటములు పిక్కటిల్ల దివిజు లదరగన్

146. ఉ. అంతట మూర్ఛదేఱి కమలాక్షుడురా దనుజేంద్రుడున్ రమా
కాంతునితోడ శంకరునిఁగాంచి నిజాకృతిఁ దాల్చి వాల మ
త్యంత రయంబునన్ జళిపి యార్చుచు పేర్చుచు వాడికొమ్ములన్
వింతగఁ ద్రిప్పుచున్ గిరుల బెట్టుగఁగ్రుమ్ముచు వచ్చెనుద్ధతిన్





147. ఉ. వచ్చిన వానిపై నిశిత బాణపరంపర లొక్కపెట్టునన్
లచ్చిమగండు వేయగ నలక్ష్యము సేయుచు పర్వతాగ్రమున్
గ్రుచ్చిపెకల్చి వాలమునఁ గూర్చి రయంబున వైచె వారిపై
హెచ్చిన గర్వసంగతి నహీన పరాక్రమమొప్ప దైత్యుడున్

148. కం. ఆగిరి శిఖరమ్మును నతి
వేగమ్మున నుగ్గొనర్చి విష్ణుండంతన్
జాగొనరింపక చక్రము
నా గండుని పైన విసరె నత్యుగ్రగతిన్

149. శా. ఆ చక్రాయుధ మాసురారి ఘన ఫాలాగ్రంబునం దాకినన్
వైచిత్ర్యంబది యేమొగాని యత డావంతైన లెక్కింప కా
రోచిష్ణుండగు విష్ణుమూర్తి పయినన్ రోషించి దూషించుచున్
వైచెన్ బెన్గద కాలమేఘసమ రూపంబొప్ప గర్జించుచున్

150. చం. అతనికి దీటుగా హరియు నంబరవీధి ప్రతిధ్వనింప, న
త్యతులిత భీతి దైత్యులు రయంబునఁ బర్విడ మౌనులున్ సురల్
నుతులొనరింప నూదెను వినూత్నగతిన్ దనపాంచజన్యమున్
వితత విరోధి ధైర్య పరివేదనమున్ ద్రిజగత్ప్రసిద్ధమున్

151. మ. మహిషం డంతట సింహరూప ధరుడై మానాథుపై దూకి ము
న్నహివైరిన్ నఖ తీవ్రఘాతముల రక్తాంగ స్థితున్ జేసి, య
య్యహి శాయిన్ ఘన గర్జనార్భటుల నుగ్రాకారుడై చీరె, దు
స్సహమై వక్షము నుండి శోణితము విస్తారంబుగా వెల్వడన్

152. మ. ఖగనాథుం డపు డంబుజోదరుని యాకారంబు వీక్షించి పె
ల్లగు వేగంబున నాతనిన్గొని రణవ్యాపార మిప్పట్టునన్
దగదంచున్ దలపోసి యేగ, తదవస్థన్ గాంచి శీఘ్రంబుగా
నగజాధీశుడు నేగె నింక రణయత్నంబేల యంచెంచుచున్

153. చం. నలువయు హంసనెక్కి చనె నాకిక నేటికి చిక్కటంచు; ని
శ్చలమతి వజ్రధారియయి శక్రుడు మాత్రమె పోరుచుండ, వై
దొలగక పాశహస్తుడయి తోడుగ నవ్వరుణుండు నిల్వ, తా
వలపలి చేత దండమును బట్టి యముండును నిల్చె సాయమై

154. ఉ. ఐనను నా(త్రిమూర్తులటు లాహవరంగము వీడినంతనే
దానవ సైన్యమం దధిక ధైర్యమునెక్కొన నుత్సహించుచున్
బూని యనేక యాయుధ సమూహములన్ ధరియించి యుద్ధ రం
గాన మహాట్టహాసముల గంతులు వైచుచుఁ గూడిరుద్ధతిన్

155. వ. ఆసమయంబున

156. మ. జయమో స్వర్గమొ యన్నరీతి సమరోత్సాహంబుతోఁ బోరుచున్
భయదుండై మహిషుండు పర్వత శిఖల్ భగ్నంబుగావించి వి
స్మయమొప్పన్ సురకోటిపై విసరుచున్, చక్రంబటుల్ వాలమున్
నియతిన్ ద్రిప్పుచు సేనలన్ గలతఁ జెందించెన్ మహోగ్రంబుగా

157. ఉ. ఆతని పాదతాడనము లగ్గలమై వడిఁదాక దేవతల్
భీతిలి పర్వులెత్తుచు భువింబడి నల్గుచునుండఁ జూచి ని
శ్చేతనుడై సురేంద్రుడును చేయున దేమియులేక వజ్రమున్
చేతధరించి వెన్దిరిగి సిగ్గున పర్విడె భీత చిత్తుడై

158. తే.గీ. దివిజ నాథుండె భయమునఁ దేజముడిగి
పాఱ మనకేల యుద్ధమ్ము బ్రతికియున్న
శుభము గలదంచు నెంచి యచ్చోటువీడి
యరిగి రయ్యమ వరుణాదు లదరి చెదరి

159. కం. దివిజపతి విడిచి వెళ్ళిన
ధవళాశ్వంబును, గజమును తాగైకొని యా
దివిజారి విజయ గర్వో
త్సవమున నేనుంగు నెక్కి చని కడువేగన్

160. ఉ. మానుష రూపమున్ గొని యమర్త్యుల పట్టణ మాక్రమించి యా
దానవ వీరు డెక్కెఁగడు దర్పమునన్ సురనాథు పీఠమున్
దీనతదోప దేవతలు తీవ్రరయంబున కాందిశీకులై
కానన వీథులంబడి కకావికలైచని రెల్ల రంతటన్

161. కం. దివిజుల పదవుల నెల్లన్
దివిజారుల కొసగి యతడు దివినేలుచు న





వ్యవహితగతి నుండ దివిజు
లవమతులై దాగియుండి రడవుల యందున్

## దేవతల వ్యూహము

162. కం. క్రమమున నొకరొక్కరుగా
నమరులు పద్మజుని చేరి యవనత శిరులై
విమల గతుల నుతుల సలిపి
విమతుని దౌష్ట్యములనెల్ల వినిపించిరిటుల్

163. చం. అమరులపట్ల నేమిటిది యబ్జభవా! కడు నిర్దయుండవై
శమము వహించి యుంటివి? నిశాకరు చేష్టలు దుస్సహమ్ములై
మముఁగడు నొంచుచుండె, దయమాలి యతండు సురాళినెల్ల న
క్రమమగు నూడి గమ్ములకు కష్టగతిన్ నియమించు నెప్పుడున్

164. కం. చిక్కిన వానినిఁ బట్టుక
నుక్కు సెడన్ దన్నుచుండె నో వాణీశా!
దిక్కుల పరిపాలింపగ
రక్కసులను నిల్పె కడు నిరంకుశబుద్ధిన్

165. కం. దేవతల కందవలసిన
పావన హవ్యములు గొనుచు, పరమోత్కృష్టం
బై వరలు పారిజాత సు
మావలిఁ దలఁదాల్చుచుండు నానందమునన్

166. తే.గీ. ఇన్ని తెలిసియు నీవిట్టు లేమి యెఱుగ
నట్టులుండఁ దగునె? తమ కాత్మజులము
మమ్ముపేక్షింప మీకు ధర్మమ్మెసెపుమ!
నీవు కాదన్న గతులింక లేవుమాకు

167. కం. అని దివిజులు ప్రార్థింపగ
వనజభవుం డిట్లు పలికె వారల నెల్లం
గని తన హృదయంబున కడు
కనికర మొదవంగ తగిన కర్తవ్యంబున్

168. చం. దివిజ వరేణ్యులార! తమ దీనచరిత్రలు నేనెఱుంగుదున్
దవిలి సహాయమున్ సలుప దక్షుఁడఁ గాను, వరంబుఁ బొందె వా,
డెవడును పూరుషుండు తన నెన్నడుచంపగ లేనియట్లు తా
నవియును నింతిచే రణమునం దొకనాటికి నిశ్చయమ్ముగన్

169. తే.గీ. దీని కేదైన నొకదారి తెలియవలయు
శంకరుని గూడి మనమెల్ల చర్చఁజేసి
యవల వెన్నుని పాలికి నరిగి తగిన
నిర్ణయంబును చేయుట నీతియగును

170. కం. అనిపలికి దివిజవర్యులఁ
దనవెంటన్ గొనుచు నరిగె తారాధిప మం
దనుకడ, కతడును గౌరవ
మున వారల కెదురువచ్చి మోదముతోడన్

171. కం. లోనికిఁ గొనిచని కుశల వి
ధానముల నడిగి తెలిసి యధర్మపరుండౌ
దానవ నాధుని చేష్టల
వాణీ రమణుండు తెలుప పకపక నగుచున్

172. చం. వనజభవా! నిశాటుని తపంబునకున్ గడుమెచ్చి వానికిన్
బొనర వరంబు నీవటుల పూర్వ మొసంగిన కారణంబునన్
మనకిటులాపదల్ గలిగె మానినిచే హతుడౌనుగాని యా
తని వధియింప నాకును సుదర్శన పాణికినైన సాధ్యమే!

173. ఉ. వానిని సంహరింపఁ గల వాడిమి గల్గిన యింతియున్నదే
వాణికి గౌరికిన్ శచికి భార్గవి కేనియు యుద్ధవిద్య లే
మైనను గల్గునే యిక ప్రయాసములేటికి, వాసుదేవునిన్
జ్ఞాన విశిష్టునిన్ గలసి సర్వముఁ దెల్పుట యోగ్యమిత్తఱిన్

174. ఉ. ఆతడు మార్గమేదయిన నారయు నంచు వచింప నా సుర
వ్రాతము లెల్ల శంకరుని బ్రహ్మనుగూడి ప్రయాణమైరి ని
ర్యాత లతాంత మారుత విహారములున్ ఖగ నిస్వనంబులున్
బ్రీతి యొనర్ప నిద్ది శుభవేళ యటంచుఁ దలంచుచున్ వడిన్





175. చం. చని యటఁ గాంచి రెల్లరు నిశాకరకోటి విభాసమానమున్
వనరుహ పుల్లకోకనద బంధుర దివ్యసరోవరమ్ము స
న్మునివర సన్నుతమ్ము సురముఖ్య నిరంతర సేవితమ్ము న
వ్వనజదళాయతాక్షుని నివాసమునైన వికుంఠధామమున్

176. మ. అట వీక్షించిరి దివ్యసుందరతరోద్యాన ప్రదేశంబునన్
స్ఫుటదిందీవర కోమలాంగు నవ సంపుల్లాబ్జనేత్రున్ మహో
త్కట మాణిక్య కిరీట కుండల ధరున్ గంధర్వ దివ్యాంగనా
పటలీ గాన వినోద మగ్ను హరి నిర్వక్రప్రతాపోన్నతున్

177. కం. లోనికిఁ జన యత్నింపగ
నా నలువను శివుని సురల నట జయవిజయుల్
పోనీక నిలువరించిన
మౌనంబున నిల్చిరచట మర్యాదకునై

178. వ. అంత

179. విజయుడు లోనికేగి వినిపించెను వీరలరాక పక్షిరాట్
ధ్వజునకు, నంత తా నతి ముదంబున వచ్చి వినమ్రులైన య
య్యజుని పినాకపాణి నమరాదులఁ గైకొని లోనికేగి యా
భుజగ శయుండు భక్తజనపోషకు డివ్విధిఁ బల్కె వారితోన్

180. ఉ. సేమమె మీకు నెల్లరకు చేరియిటుల్ గడుదైన్య చిత్తులై
యేమికతంబునన్ దరలి యియ్యెడకున్ జనుదెంచినారు, మీ
క్షేమమె గోరుచుందు నతి శీఘ్రమె దెల్పుడు నేను మీకు నై
యేమి యొనర్పగా వలయు నెయ్యవి మీకిపుడైన కష్టముల్

181. చం. అని కరుణాంతరంగుడయి యంబుజనాభుడు వల్క దేవతల్
వినయముతో మహాత్మ! కడు వేఁదుఱుడై మహిషుండు మమ్ములన్
దినదిన ముగ్రకర్మముల తీవ్ర తరంబుగ హింసఁబెట్టుచున్
గొనకొని యజ్ఞభాగములఁ గోరి హరించుచునుండు దుష్టుడై

182. చం. దివిజుల నెల్లఁ బోఁదఱిమి తెంపున నింద్రుని యాసనమ్ముపై
నవిరళరీతి నెక్కి, యసురాధము డెల్ల సుపర్వ రాజ్యమున్

జవమున నాక్రమించె, పరుషంబగు నాతని దుష్టచేష్టలన్
దవిలి సహింపలేక పలు దారులఁ బర్వితి మెల్లవారమున్

183. కం. ప్రాణము లరచేతం గొని
కానన మార్గములఁ బట్టి కష్ట గతుల మా
మానసముల నిను దలచుచు
దీనులమై వచ్చితిమి సుధీజన వంద్యా!

184. మ. వర గర్వంబున నున్నవాడతడు దేవా! వాని నెవ్వారలున్
పురుషుల్ చంపగలేరు, చంపగల యప్పుణ్యాత్ములా లెవ్వరో
అరయన్ జాలక వచ్చినార మిటకోయబ్జాక్ష! మాదుఃఖముల్
పరి మార్పంగల ప్రోడవీవె త్రిజగత్పర్యంత మెక్కాలమున్

185. కం. దేవా! సరియగు మార్గము
భావంబునఁదలచి కార్యభారము నెల్లన్
నీవే వహియించుచు మము
బ్రోవం గోరెదము పుణ్య పురుషశ్రేష్ఠా!

186. చం. తమతమ పడ్డ కష్టముల దైత్యవిరోధికి నిట్లు తెల్పు న
య్యమరులఁ గాంచి నవ్వి కమలాక్షుడు పల్కెను దివ్యులార! మున్
సమరముసేసి యుంటిమి నిశాటునితో మనమెల్ల, నైన న
య్యమర విరోధిఁ జంపఁ దరమయ్యెనె నాకును మీకు నయ్యెడన్

187. కం. మన మన తేజశ్శక్తుల
మనమన యంశలను గలపి మహిళ నొకర్తెన్
జనియింపఁ జేయఁ గల్గిన
ననిలో నాశక్తి మహిషు నంతమొనర్చున్

188. కం. అదియే తరణోపాయము
పదిలముగా మీరలిపుడు ప్రార్థింపుడు మీ
సదమల తేజోంశల స్త్రీ
పదములు గావించి తత్ప్రభావము వలనన్

189. కం. తేజోరాశి జనించును
భ్రాజితముగ సకల శక్తి భాజన యౌచున్





ఆజగదంబ కపుడు మన
మోజన్ మన యాయుధముల నొసగుద మెల్లన్

## దివ్యతేజస్స్వరూపిణి ఆవిర్భావము

190. వ. విష్ణుమూర్తి వచియించిన యీయుపాయంబున కందరు
నంగీకరించి తమతమతేజోంశలను స్త్రీమూర్తులుగా నుపాసించిరంత

191. ఆ.వె. పద్మరాగమణుల ప్రభలు చల్లిన యట్లు
దుస్సహంపు కాంతి దొంతరలుగ
చేరియొక్కచోట శీతోష్ణములఁగూడి
పొడమె జ్యోతి నలువ మొగమునుండి

192. కం. అదిగని సుర లాశ్చర్యం
బొదవగ గనుచుండ శివుని యొడలు వెడలి పెం
పు దలిర్పగ నొక తేజము
చదలెల్ల వెలుంగఁ బుట్టె శంపాభంబై

193. కం. అంతట పంకజనాభుడు
స్వాంతంబునఁ దలప నీల వర్ణముతో నా
శాంతమ్ములు వెలుగగ నొక
వింతఁగొలుపు కాంతి తనువు విడివడి నిలిచెన్

194. కం. దేవేంద్రుండును మదిలో
భావించిన యంత చిత్ర వర్ణాన్వితమై
పావన మగు తేజం బపు
డావిర్భవమయ్యె వెడలి యాతని మేనన్

195. కం. ఆవిధమునఁ బలుతేజము
లావిర్భవమందె వరుస నాశాధిపసత్
భావాశ్రయ దేహములన్
భావాతీతముగ దిశలఁ బర్వన్ కాంతుల్

196. ఆ.వె. సకల దేవతలును స్వాత్మల భావించి
వెలువరించి రంత వివిధగతుల

నొక్క రొక్కరు తమ యుజ్జ్వల తేజమ్ము
లన్ని కలిసి యొప్పె నద్రివోలె

197. ఉ. అక్కజమంద నందరు తదంశ సముద్భవ కాంతి పుంజముల్
చక్కగ రూపుదాల్చె నొక జవ్వనిగా త్రిగుణాత్మయై యటన్
చొక్కపు నీలికన్నులు, విశుద్ధ ముఖమ్మును దివ్యభూషలున్
దిక్కులనిండి భాసిలు ప్రదీప్త సహస్ర రవి ప్రభావలిన్

198. కం. అరుణాధరోష్ఠ, పల్లవ
కరచరణాంచిత, సహస్ర కమనీయ భుజా
పరిరంభిత దివ్యాయుధ,
వరరూపిణి నిలిచె దివిజ వర్యుల యెదుటన్

199. కం. కదుదీక్షగ వ్యాసుండిటు
నుడివెడి వృత్తంబు విను మనుజ విభుడు మదిన్
బొడమిన యొక సందేహం
బడిగెను నీరీతి మునిజనాగ్రణిఁగనుచున్

200. చం. విమల యశోవిశాల బుధవిత్తమ! నా కెఱిగింపుమయ్య! యా
యమరుల తేజముల్ గలసి యద్భుతరూపముఁ బొందెనంటి, వే
యమరుల యంశ లేగతిన నామె శరీరమునందు నాసికా
ద్యమల తనూవిభాగ విభవాకృతులన్ ధరియించి యొప్పెనో

201. వ. అనియడిగిన జనవరుంజూచి మునివరుండిట్లనియె

202. చం. నరవర! తన్మహత్త్వము లనంతము లయ్యవి విప్పిచెప్ప నే
ర్వ రల త్రిమూర్తులైనను తరంబగునే యిక నన్ను బోంట్ల, క
ప్పురమదయా మహాంబుధి శుభంకర రూపము నుగ్గడింప; నే
నెఱుగుదు లోకమాత యుదయించినదన్న నిజంబుమాత్రమే

203. తే.గీ. ఉద్భవించిన దనుటయు నొప్పుగాదు
ఏలయన నా జగన్మాత యెపుడు నిత్యు
రాలు, సకల రూపమ్ములం దధివసించి
వఱలు చున్నది యామెయే అరసిచూడ





204. కం. రంగస్థల నటుడు వివిధ
భంగిమలౌ పాత్రలందు పరవశుడై హృ
ద్యంగమముగ నటియించెడి
భంగిన్ నటియించు నామె పలు రూపములన్

205. కం. రూపము లేని మహేశ్వరి
రూపమ్ము లనేకములను రూఢిగఁ దాల్చున్
రూపములఁ బట్టి నామము
లేపగు గుణములను బొందు నిచ్ఛామతియై

206. కం. ఐనను నీ కోరినటుల
నే నేర్చినయంత నామె నెమ్మేనున నే
యే నిర్జరతేజం బే
స్థానములం దమరె వానిఁ దగ వివరింతున్

207. సీ. శివుని తేజోంశమ్ము శ్వేతవర్ణముతోడ
ముఖపద్మమౌచు పూఁబోణికమరె
యముని తేజంబెల్ల నాయతగతి మేఘ
వర్ణంపు కురులయ్యె పద్మముఖికి
అగ్నితేజం బామె కసితాసితారుణ
కాంతులతో మూడు కన్నులయ్యె
మూడు సంధ్యలు కడు ముచ్చటఁగొల్పగ
కనుబొమలౌచు నక్కాంత కొప్పె

గీ. మదన డోలిక లట్టుల మ్మానవతికి
అనిలతేజము కర్ణమ్ములై వెలింగె
తిలసుమ సదృశంబై యొప్పె తిన్ననగుచు
ధనదతేజము ఘ్రాణమై తన్వికపుడు

208. కం. ప్రాజాపత్యంబగు నా
తేజంబది కుందసుమ సదృశమై గరిమన్
రాజిల్లెను జగదంబకు
నోజన్ రదనంబులౌచు నుద్యత్ ప్రభలన్

209. కం. అరుణారుణ తేజంబును
పరగన్ శ్రీకార్తికేయు వరతేజంబున్
పరదేవి కమరె నయ్యెడ
తిరముగ నోష్ఠంబులౌచు దివిజులు మెచ్చన్

210. కం. వెన్నుని తేజం బంబకు
పన్నుగ పదునెన్మిదింట బాహువులయ్యెన్
చెన్నుగ వసువుల తేజము
లన్నియు వ్రేళ్ళయ్యె చేతులందున వరుసన్

211. తే.గీ. శీతకిరణుని తేజము చెలువుమీర
నమ్మ వక్షోరుహమ్ములై యలవరించె
దివిజనాథుని తేజమ్ము తెలియఁ బడక
అంబ కవలగ్నమయ్యె చిత్రంబు గదుర

212. తే.గీ. వరుణ తేజమ్ము పదములై వాసికెక్కె
జఘన మయ్యెను భూమి తేజంబదెల్ల
ఇట్టు లిందరి తేజమ్ము లెలమిఁ జేరి
సుదతి రూపమ్ముఁ దాల్చి యచ్చో వెలింగె

213. చం. సకల శుభాంగి, సుస్వర, విశాల నవాంబుజ పత్రనేత్ర, ని
చ్చకమునఁ గాంచి దేవతలు సంతసమంది జెజేలు వల్కుచున్
నికట తటాంజలిస్ఫుట వినీతులునై నుతియించిరప్పు,ని
శ్చకిత మనస్కులై యిక నిశాటుని పీడ తొలంగె నన్నటుల్

214. చం. సరసిజనాభు డంత సురసత్తములన్ గని మీరలెల్లరున్
స్థిరముగ మీదు నాయుధ విశేషము లీజగదేక మాతకున్
సరగుననిందు భక్తిమెయి, సర్వము నామెయె నిర్వహించు నం
చిరవుగఁ బల్క వారును మహేశ్వరికిన్ వలగొంచు నయ్యెడన్

215. కం. కమలేశు నాజ్ఞఁగైకొని
క్రమమునఁ దమ యాయుధముల గౌరవ మొప్పన్
కమలాక్షి కొసగి రప్పుడు
విమతుని మరణంబుఁ గోరి వేలుపులెల్లన్





216. ఉ. క్షీరసముద్రు డిచ్చె నొకచెల్వగు సన్నని దివ్యవస్త్రమున్,
చారుతరంపు హారమును, చందమయూఖ నిభాభమైన చూ
డా రమణీయరత్నమును డంబితకుండల కంకణమ్ము, లిం
పారగ నా జగజ్జనని కంచితభక్తి వినమ్రశీర్షుడై

217. కం. శ్రేయంపు రత్నకంకణ
కేయూరము లొసగె భక్తిఁ గేల్మోడ్చుచు ప
ద్మాయత లోచనకు మహా
మాయకు శ్రీవిశ్వకర్మ మందస్మితుడై

218. కం. సుమధుర మంజుల రవముల
నమరెడు నూపురము లొసగె నంబకు భక్తిన్
కమలాప్త మండలములన
నమరులు భ్రమఁ జెందఁ ద్వష్ట యాశ్చర్యముగన్

219. కం. వరుణుం డొసగెను తల్లికి
సరసిజ మాలికను భృంగ సంచరితంబున్
పరిమళ మెన్నడు తఱుగని
యరుదగు మహిమమ్ము వైజయంతిని వేడ్కన్

220. కం. హిమవంతు డొసగె నంతట
రమణీయములైన రత్నరాసుల తోడన్
కమనీయ కనక కాంతుల
నమరెడు సింహమును నంబ కధిరోహింపన్

221. కం. హరి తన సుదర్శనమునకు
సరియగు చక్రమును సృష్టి సల్పి యొసంగెన్
పరదేవికి పర దశశత
శిరముల నొక్కటన దుల్లఁ జేసెడు దానిన్

222. తరుణేందు శేఖరుండును
సర గున నిజ శూలమునకు సరియగు శూలం
బరిహృదయ విభేదనమును
స్థిరముగ శ్రీదేవి కొసగె శ్రేష్ఠతమంబున్

223. కం. వరుణుడు నిజ శంఖమ్మును
నరుణ శిఖల నొప్పునట్టి యగ్ని శతఘ్నిన్
వర తూణీరము లనిలుడు
పరదేవి కొసంగి రధిక భయభక్తులతో

224. కం. సురకరి కలంకరించిన
వర ఘంటికయును నభినవ వజ్రాయుధమున్
సురపతి శ్రీదేవి కొసగె
పరపీడ తొలంగె నన్న భావముహెచ్చన్

225. కం. గాంగజల పూరితంబగు
బంగారు కమండలమును బ్రహ్మ యొసంగెన్
పొంగారు వేడ్క యముడు నొ
సంగెను దండమ్ము నంబ సంతసమందన్

226. ఆ.వె. వివిధ భూషణముల వివిధాయుధమ్ముల
కనులు చెదరునట్లు కానుపించు
లోకమాతను గని నాకవాసు లెలమి
సంస్తుతించి రిట్లు సంభ్రమమున

227. ఉ. సిద్ధికి బుద్ధికిన్ సిరికి చెల్వగు పుష్టికి రౌద్రమూర్తికిన్
వృద్ధికి శాంతికిన్ శచికి వేడుకవైష్ణవికిన్ కరాబ్జముల్
బద్ధమొనర్చి భక్తి నభివందనముల్ పొనరింతు మమ్మ! స
ద్బుద్ధులతో త్వదీయ పరిపూర్ణ శుభాకృతి కోమహేశ్వరీ!

228. ఉ. ఓ జగదేకమాత! కడు నుద్ధతి నమ్మహిషుండు దుష్ట సం
యోజనుడై సుధాంధసుల నుగ్రగతిన్ గదు నొంచుచుండె, ని
స్తేజులమై కకావికలు సెంది పలాయన మొప్పగించి య
వ్యాజగతిన్ త్వదీయ పదపద్మము లంటితిమమ్మ యీశ్వరీ!

229. శా. నీవే దిక్కిక మాకు లోకజననీ! నీచాధముండైన యా
దేవారాతి నశించు నీవలననే తీవ్రంపు మా దుస్థితుల్
దేవీ! పాయగఁ జేయుమమ్మ నిను నుద్దీప్త ప్రభారూపిణిన్
గావన్ వేడెదమమ్మ! అన్యులెవ రింకన్ మమ్ము రక్షింపగన్





230. మ. కడు దైన్యస్థితి నిట్లు దేవతలు వల్కన్ గాంచి యాదేవి తా
నెడదన్ సంతసమంది నవ్వుచు భయంబింకేల మీరెల్లరున్
దడబాటొందక నిర్భయస్థితిని చింతల్ మాని వీక్షింపుడీ
వడి నే నమ్మహిషున్ వధింతునిక నెవ్వారడ్డమై నిల్చినన్

231. చం. ఇదియొక చిత్ర మీజగతి నింద్రుడు బ్రహ్మయు విష్ణుమూర్తియున్
దుదకల రుద్రుడున్ మహిషు దోర్బలమున్ సహియింపలేక యి
ట్లదరుచు పాఱిరన్న కడు నక్కజ మయ్యెడు; దైవనిర్ణయం
బది యెదిరింపరాదిల మహాత్ములకైనను ముజ్జగంబులన్

232. కం. అని పల్కి మహాలక్ష్మియు
క్షణమూరక యుండి దిశలు గ్రక్కదలగ భీ
షణముగ నవ్వెను నెరుపె
క్కిన కను యుగ్మమున నగ్నికీల లురలగన్

## మహిషుని సంభ్రమము - మంత్రిరాయబారం

233. చం. ప్రళయ వినీల మేఘ ఘనరావ సమంబగు నామహేశ్వరీ
గళ గళితాట్టహాస పరికంపితుడై మహిషుండు క్రోధ సం
కలిత విరూక్ష నేత్రుడయి కారణ మెద్దియొ కానరాక భూ
వలయము దద్దరిల్ల పటుపాద విఘట్టన బిట్టు నార్చుచున్

234. మ. తనవారిన్గని యేమిటీ రవము శ్రోత్రంబుల్ విదారించెడున్
దనుజుల్ సేయరు దీని; వాడెవడొ సుత్రామానుకూల్యుండు, చ
య్యనవానిన్ శిఖవట్టి యీడ్చుకొని రండంచున్ ప్రచండాకృతిన్
ఘన హుంకారము సల్ప దూతలు భయోత్కంపొంగ సంరంభులై

235. చం. పరువున నాల్గు దిక్కులకు పర్వి కనుంగొని రొక్కచోట నం
దరును త్రిషట్క భూరిభుజ దర్పితగాత్రను దివ్యభూషణాం
బర వివిధాయుధన్ వర సువర్ణ విరాజిత పాత్రధారిణిన్
హరివర వాహనన్ భయద హాస మహోగ్రముఖిన్ పరాంబికన్

236. చం. కని తమ ప్రాణవాయువులు కంఠములన్ వెలికేగు నట్టులై
కనులకు తేటిచూడ నవకాశములేక భయమ్ముఁ జెంది, నె

ట్టన జవసత్వముల్ గడు దిటంబుగ చిక్కగఁ బట్టి పర్వునన్
జని మహిషాసురున్ గని విషణ్ణులునై వినిపించి రివ్విధిన్

237. చం. దనుజవరేణ్య! ప్రౌఢవనితన్ నవరత్న విభూషణాంచితన్
ఘన మృగరాజ వాహనను గాంచితి మొక్క మనోహరాంగనన్
దనర త్రిషట్క భూరి భుజదర్పను దివ్యమహాయుధోగ్ర హ
స్తను వికటాట్టహాస విలసన్ముఖ దీప్త దిగంత చుంబితన్

238. కం. మానవ దానవ కాంతల
లోనన్ గనిపింప దిట్టి లోలాక్షి యెటన్
దానవకుంజర! దివిజులు
మానక నుతియింతు రామె మాహాత్మ్యంబుల్

239. ఉ. ఎచ్చట నుండి వచ్చెనొ? భరించెడి వాడెవడో,? జగంబులన్
మచ్చుకు నైన మున్ వినము, మానిని రూపము తేఱిచూడగా
నచ్చుపడంగలేదు; భయమై చడి చప్పుడు లేక యీగతిన్
వచ్చితి మయ్య! మీకు తెలుపన్ దనుజేశ్వర! పర్వు పర్వునన్

240. కం. అనిదూతలు వల్కగ నా
దనుజుడు సరకుఁగొనకఁ గడు దర్పోద్ధతుడై
తన మంత్రివర్యు నొకనిని
గని యాజ్ఞాపించె నిట్లు కర్తవ్యంబున్

241. ఓయి యమాత్యవర్య! తడవోర్వక సర్వచమూ సమూహముల్
పాయక వెంటరాఁ జని యుపాయ చతుష్టయ మేర్పడంగ శౌ
ర్యాయతవృత్తి నమ్మహిళ నంతముసేయక, పట్టి తెమ్ము, నే
నాయమఁబెండ్లియాడి ప్రణయాంబుధిఁ దేలుదునిచ్చకంబునన్

242. వ. అనిపలుక

243. కం. మదమత్తుండగు మహిషుని
మదిలోగల భావమెల్ల మంత్రివరుండున్
పదిలముగ నెఱిగి రథగజ
పదభట తురగములఁ గూడి పటుదర్పమునన్





244. చం. చని వినయాతిరేకమున సారసనేత్రకు నంజలించి యో
వనజముఖీ! త్వదీయ శుభవర్ణ సమంచిత నామమెద్ది? యే
పనిఁగొని యిందు వచ్చితివి? వాసమదెయ్యది? నీమనోజ్ఞమౌ
తనువిభవంబు లోఁ దలచి దాస్యమొనర్పని ధీరుడుండునే?

245. చం. మహిషుడు మాప్రభుం, డతని మంత్రిని నేను విశాల విశ్వమం
దహితుల నోర్చినట్టి దనుజాగ్రణి యాత డజేయు డేరికిన్
విహిత తపోవిభూతిఁ దొలివేలుపుచే వరమంది నట్టి దు
స్సహుడు త్వదీయ రూప గుణ సంపదకున్ వశుడయ్యె సుందరీ

246. ఉ. ఆతడు నిన్ను చూడవలె నంచుఁ దపించుచు నున్నవాడు, నిన్
చేతమునన్ వరించె, తన చెంతకు నీ వరుదెంతువేని సం
ప్రీతియె యౌను, కాదనిన వీరవరేణ్యు డతండె వచ్చు వి
ఖ్యాతిగ నీకు నచ్చునటు లాకృతి దాల్చి త్రిలోక సుందరీ!

247. కం. నీ వెటు లాజ్ఞాపించిన
నా విధి తా నాచరించు నరవిందాక్షీ!
కావున నా కెదియో యొక
టీవే యెఱిగింపుమమ్మ! యే నరుదెంతున్

248. కం. అనిపలుకు నయ్యమాత్యునిఁ
గని బిట్టుగ నవ్వి మేఘగంభీర రవం
బున నిట్లనియె మహేశ్వరి
కనుయుగ్మమునందు నిప్పుకణము లురలగన్

249. చం. దివిజులు నన్ను కోరగ మదించిన దైత్యులఁ జంపి నాక సం
భవులకు మేలుసేయుటకు వచ్చితి నివ్విధి; యజ్ఞ భాగముల్
దవిలి హరించుచున్ మిగుల దర్పముతో దివిజాళి, సాధుపుం
గవులను నొంచు మీమహిషు కాలునిప్రోలికి పంపెదన్ వడిన్

250. తే.గీ. శ్రీమహాలక్ష్మి యంద్రు నన్ జెలువు మీర
దేవతలకెల్ల తల్లిని ధీరురాల
నొంటిదానను సైన్యమ్ము లొరులులేరు
జగము లెల్లను నాయాజ్ఞ జరుగుచుండు

251. శా. సామోపాయముచేత నీవిపుడు నన్ సంస్కార పూర్వంబుగా
ధీమంతున్ బలె స్వాగతించితివి మంత్రీ! యట్లె కాకున్నచో
నీ మేనున్ దహియించి యుండెదను మన్నిర్వక్ర కాలాగ్ని ని
ర్ధామంబైన విలోకనోగ్ర శిఖలన్ గ్రూరంబుగా నెప్పుడో

252. వ. కావున నీవు తక్షణంబేగి నామాటలుగా నీ ప్రభువున కిట్లెతింగింపుము

253. ఉ. "ఓ దనుజాధమా! బ్రతుక నోపుదు వేని దివంబువీడి శౌ
ర్యోదయవృత్తి మాని చనుటొక్కటె మార్గము బంధుమిత్ర దా
యాదులఁగూడి భోగవతి, కట్టుల కాదని నిల్తువేని సం
వాదములేల మద్విశిఖ పంక్తులఁ గూల్తు త్వదుత్తమాంగమున్"

254. కం. అటుగాక సమరభూమిన్
పటుసైన్యము తోడ నెదిరి బవరముసేయన్
చటుల గతి వత్తువేనిన్
నిటలాక్షుం డడ్డుపడిన నిన్ను నడంతున్

255. వ. అని మహిషునుద్దేశించి పలుకు నయ్యంబ పల్కులన్ విని మంత్రివర్యుండు
సవినయముగ మరల నిట్లు సంభాషించె

256. శా. దేవీ! అంగనవయ్యు నీవు మది సందేహింప కీరీతిగా
భావోద్రేకముతోడఁ బల్కితివి, సంభావ్యంబెయౌ; కానిచో
నీవిందొంటరిదాన, వెవ్వరును లేనేలేరు సైన్యంబులున్
భావింపన్ గడు పిన్నవీవు తగునే ప్రాగల్భ్యముల్ వల్కగన్

257. ఉ. అమ్మహిషుండు శూరవరు, డబ్జజుచే వరమందె; సైన్యసం
ఘమ్ముల నొప్పువాడు, కడు కర్కశ దీర్ఘశరీరు, డస్త్ర శ
స్త్రమ్ము లనేకముల్ గలిగి శాత్రవ వారణ ఘోటకాటవిన్
గ్రమ్మి దహింపఁజేయఁగల కాల దవానల దీప్త హస్తుడున్

258. కం. సుకుమారివి, కడు పిన్నవు
సకియలతో బంతులాడు చందము కాదో
సకియా! సమరము, హస్తి ల
తికను బలె చిదుము నతండు దేవీ! నిన్నున్





259. కం. శృంగార భావ మించుక
భంగంబగు నంచు సౌమ్య పదజాలము లి
భ్భంగి వచించితిఁగానీ
యంగన! లేకున్న నిన్ను నడగింపనొకో!

260. ఉ. కావున రాజ్య సంపదలు కాదన బోవక మంచి చెడ్డలన్
నీవును నెమ్మదిన్ దలచి నెయ్యము వియ్యము లేర్పడంగ స
ద్భావముతోడ నమ్మహిషుఁబ్రాభవమొప్ప వరింపు మింతటన్
వావిరి నెల్ల లోకముల పాలన సేయుము సౌఖ్యమయ్యెడున్

261. చం. అనుచిత మైన మాటలిటు లాడెడి యద్దనుజేంద్రు మంత్రినిన్
గని జగదంబ యోయి! పలు కాఱులు వల్కకు, నిన్నుబోటి హీ
నుని తనమంత్రిగా గొనిన న్యూనగుణుం డతడెంత మేటియో
కనబడుచుండె యింక పలుకన్ వల దిర్వురునున్ సమానులే

262. చం. పురుషుడఁగాను నేను తనువున్ ధరియించితి నొక్క యింతిగా
నెఱుగవె నీ ప్రభుండు మరణించు నొకానొక యింతిచే నటం
చిరవుగ బ్రహ్మదేవుడపు డిచ్చిన యట్టి వరంబు; గావునన్
మరణము తథ్యమోయి పలుమాట లికేటికి నీదు ఱేనికిన్

263. ఉ. ఆయువు మూడినట్టి యొక యల్పుని నుక్కడగించు యత్నమం
దాయుధ మేమి కావలయు?, నక్కఱయే బలుసేనలైన?, వ
జ్రాయుధమౌ తృణంబె తనకాయువు తీఱిననాడు, వానికే
యాయువు గట్టిదైన తృణమైచను నెంతటి వజ్రమేనియున్

264. శా. నీ తప్పిం దొకయింతలే, దతనికిన్ నీ వొక్క యుద్యోగివై
యాతం డెయ్యది చేయుమన్ననది చేయన్బూను టొప్పౌను, ని
ర్భీతిన్ నీవు రయంబునన్ జను మికన్ విన్పింపు మీ ఱేనికిన్
చాతుర్యంబున యుక్తి యుక్తమగు నస్మద్వాక్యముల్ క్షేమమౌ

265. శా. ఇకపై నింద్రుడు స్వర్గనాధుడగు మీరెల్లన్ దివిన్ వీడి పొం
డిక పాతాళము దారిఁ బట్టి యటుకాదేన్ బ్రాణముల్ వీడుడీ!
సకలంబైన హవిస్సులన్ దివిజులే సంప్రీతిఁగైకొందు రం
చొక మాటన్ వినిపింపు మీప్రభునకున్ యుక్తంబుగా నింతటన్

266. చం. బవరము నందు మొన్న నల పంకజ నాభునిఁదొట్టి నాక సం
భవులను గెల్వలేదె యని భావమునన్ దెగ నిక్కునేమొ యా
దివిజ విరోధి; కాదది తదీయ మహత్త్వము కంజగర్భు ది
వ్యవర విశేష శక్తియని యాతనికిన్ మదికెక్కఁ దెల్పుమా

267. చం. అన విని యయ్యమాత్యుదును నాత్మగతంబున సుంత యోచనన్
దనరగ సల్పి; "యిప్పుడతి దర్పమెసంగ నెదిర్చి యీమెతో
నని యొనరించు టొప్పదు, జయంబును నోటమి సంశయంబులౌ,
గనుక వచింతు తేనికిఁదగన్ విషయంబును నున్న దున్నటుల్"

268. కం. చెప్పినది చేయకుండినఁ
దెప్పరమగు కోపమూను దితిజేశుడు, గా
నిప్పట్టున శాంతమ్మున
చొప్పెల్ల వచించు టొప్పుఁ జువ్వె యతనికిన్

269. చం. అని తలపోసి యాతడు రయంబున వెన్కకునేగి తేనికిన్
వినయముతోడ మ్రొక్కుచు వివేక మెలర్పగఁ బల్కెనిట్టు లో
దనుజవరేణ్య! దివ్య వనితన్ గడుసుందరి నొక్కచోట నే
గని తమ చిత్తవృత్తికిఁ దగన్ వచియించితి నివ్విధంబునన్

270. శా. దేవీ! వీరవరుండు మామహిషు డుద్దీప్తోగ్ర తేజుండు నిన్
భావంబందు వరించె; నీకిదియు సంభావ్యంబు గానోపునేన్
నీవే లోకములెల్ల నేలగల వంతేగాక నీదాసుడై
సేవించున్ నిను మా ప్రభుండు, ప్రియమున్ జేకూర్చు నెల్లప్పుడున్

271. క. అని విన్నవింప నా భా
మిని కడు బిట్టుగ హసించి మిక్కిలి కోపం
బెనయగ తీక్ష్ణముగఁ గనుచు
ననియెను పర్జన్య భీకరార్భటుల నిటుల్

272. చం. అహితుడు దేవతావళికి; ఆకృతియా యెనుబోతు, కావునన్
మహిషియె వానికిన్ దగు, సమంబగు రూప గుణాదు లుంట; నే
మహిషినె వాని మెచ్చ; పలుమాట లికేటికి పెండ్లికాదు దు
స్సహమగు మత్ శరాగ్ని యమసన్నిధిఁ జేర్చెద నద్దురాత్మకున్





273. కం. సరగున పాతాళమునకు
పరువిడు మని చెప్పు మతని బంధుజనులతో
పరువిడ దేనిన్ తప్పదు
మరణంబని తెల్పుమయ్య! మదికెక్కంగన్

274. చం. అనవిని నేనునున్ మిగుల నాగ్రహ మంది మరుక్షణంబ త
ద్వనితను చంపనెంచియును తాల్మి వహించితి నీదు నాజ్ఞ లే
మిని, రసభంగ మౌననుచు మెల్పున వచ్చితి, నింకపైన నే
యనువున కార్యమున్ సఫల మందగఁ జేతువొ నిశ్చయింపుమా!

## మహిషుని-మంత్రాంగము

275. వ. అనియా మంత్రి వరేణ్యుడు తెలుప

276. చం. మహిషుడు వెంటనే తమ యమాత్యుల వృద్ధులఁ గార్యదక్షులన్
విహితులఁ బిల్చి యంతయును బేర్కొని, యాలలితాంగిఁ జూడ దు
స్సహ మహిమాన్వితంబయిన శాంబరి యేమొ యటంచుఁ దోచెడున్
మహిత విధిజ్ఞులౌ తమరె మానిని నోర్చు నుపాయ మెంచరే

277. చం. అనవిని మంత్రులెల్ల రసురాధిపుఁగాంచి ప్రభూ! జగంబులం
దనయము పండితుల్ ప్రియహితాన్వితమై యలరారు సత్య మొ
య్యన వినిపించుటొప్పు; నదియప్రియ మైనను సత్యమొక్కచో
నెనయు హితంబునై; ప్రియమ దెన్నగ తానహితంబు నౌ కడున్

278. ఉ. కావున నన్నివేళలను గల్గు శుభంబొక సత్యవాక్కునన్;
భావన సేయ సత్యమును పల్కెడు వారు, వినంగ నోపువా
రేవిధిఁ జూడ కన్పడ, రికేటికి; లోకమునన్ బ్రియంబులే
కావలె చెప్పు వారికిని, కమ్ర గతిన్ వినువారి కెల్లెడన్

279. చం. ఇది గహనమ్ము చెప్ప దనుజేంద్ర! చటుక్కున నిర్ణయించి మే
మిది శుభ, మిద్ది కాదనుచు నెవ్విధిఁ బల్కగలార, మెప్పు డె
య్యది శుభమౌనొ! కాదొ! తెలియంగల వారలు ముజ్జగంబులన్
వెదకినఁ గానుపింపరు వివేకులు భావి విశేష విత్తముల్

280\. మ. అనినన్ మెల్లగ నవ్వి యమ్మహిషు డొయ్యన్ వారలన్ జూచి యో
దనుజామాత్య వరేణ్యులార! తమకున్ ధర్మంబుగా నెద్ది దో
చిన దానిన్ వినిపింపు డొక్కొకరె, నేచేతంబునం దెద్ది మె
చ్చిన దానిన్ గయికొందు నిప్పుడదియే శ్రేష్ఠంపు మార్గంబగున్

281\. అనినన్ ముందుగ లేచి యిట్లనె విరూపాక్షుండు రాజాగ్రణీ!
మనమిట్లేటికి భీతిలన్ గడు మదోన్మత్త, స్థితిన్ బల్కు న
వ్వనితన్ లెక్కగొనంగనేల! పటు దుర్వారోగ్ర శౌర్యోన్నతుల్
రణకేళీ నిపుణుల్ భవాదృశు లకౌరా! భీతిలన్ జెల్లునే

282\. చం. అనుమతి యిందు నేనొకడ నామె నెదిర్చి విజేతనై వెసన్
దనుజవరేణ్య; వచ్చెదను, దర్పమునన్ గడునిక్కుచున్న య
వ్వనితను సర్ప పాశముల బందిగ గట్టి త్వదంఘ్రి యుగ్మమం
దునిచెద దుస్సహంబగు మదుగ్ర పరాక్రమ మెల్లరున్ గనన్

283\. తే.గీ. ఆ విరూపాక్షు మాటల నాలకించి
దుర్ధరుండను మంత్రి ద్వంద్వార్థ భావ
సంపదలు వొలయగ నిట్లు చర్చఁ జేసె
రసిక శేఖరు డితడన ప్రాకటముగ

284\. సీ. తలపించు నాసతి వలరాజు తూపుల
కోర్వక యటులాడి యుండు ననుచు
భయపెట్టి నినుతాను వశమొనర్పగ నెంచె
పసిగట్టఁ గలరిది రసిక వరులె
బాణాలతో నిను వధియింతునన వాడి
చూపు తూపుల నోర్తు సుమ్మి యనుటె
రణరంగమున నిన్ను నణగింతు నన్నచో
నోడింతు మన్మథ క్రీడ ననుటె.

గీ. ప్రాణములు దీతు ననుమాట పరమ గుహ్య
మధిప! వీర్యమే పురుషుల కరసిచూడ
ప్రాణమని యెఱుగవలయు రసిక జనులు
ఇంతకంటెను వివర మింకేమి వలయు





285\. కం. ననుఁబంపు మిపుడె యామెను
గొని తెత్తును నీదుచెంత కున్ దనుజేశా!
మన మలరిచు మధురోక్తుల
వనితలు మురియుదురుగాని బవరము లేలా!

286\. వ. అంత దుర్ధరుని మాటలను ప్రతిఘటించుచూ తామ్రుడనువాడులేచి యిట్లనియె.

287\. చం. రసములు నీరసంబు, లనురక్తియు, కామము లామెపట్టునన్
బొసగవు, దివ్యతేజమును బొంది నిరాశ్రయయై పరాక్రమం
బెసగగ నంతరిక్షమున నెక్కటి పెక్కగు నాయుధమ్ము లి
ట్లసదృశరీతి దాల్చిన వరాంగనఁ గంటిమె మున్ను నెన్నడేన్

288\. చం. ఇదియొక వైపరీత్యమని యెంచెద దుశ్శకునమ్ములున్ సదా
మెదలుచు నుండె నెల్లరకు, మీద నుపద్రవ మొక్కటేదియో
మదికి నెఱుంగవచ్చె, నది మానవ దానవ కాంతలందు నె
య్యదియునుగాదు, మీరలిటు లల్పముగా మది నెంచఁబోకుడీ!

289\. కం. కలఁలోన వేకువన నొక
లలనామణి నల్ల చీరలను దాలిచి ముం
గిలి నేడ్చుచుఁ గనబడె జా
గిలములఱచె, పక్షులును వికృతముగ కూసెన్

290\. చం. భయ పడి పారి పొమ్మనుచు పల్కెడి భీరుడ గానునేను, దు
ర్జయులగు మీరలున్ మిగుల సంశయ మందగ రాదు కావునన్
జయమొ పరాజయంబొ మనశౌర్యములన్ బ్రకటించి పోరికిన్
నియమిత మౌట యొప్పగును నిర్జరవైరి కులాగ్రణీ! వెసన్

291\. మ. అని తామ్రుండు వచింప మెచ్చి మహిషుం డత్యంత సంతోషమున్
గొని తామ్రా! జయమౌను నీకు నిక సంకోచింప కత్యుద్ధతిన్
జనుమీ సైన్యముతోడ వీరుడవు దుస్సాధ్యంబె నీ కెద్దియున్
రణభేరిన్ ధ్వనియింపఁ జేయుము శుభారంభంబుఁ జేకూర్పుమా!

292\. చం. అనవుడు తామ్రుడున్ ప్రభువు నాజ్ఞను నౌదలఁదాల్చి వెంటనే
దనుజ చమూ సమూహములఁ దద్దయు గైకొని యేగుచుండఁ దా

కనియెను దుర్నిమిత్తములు గార్దభ జంబుక కాక ఘోషముల్
కని తన చావు తప్పదని గట్టిగ నమ్మియు సాగె ముందుకున్.

293. చం. చని వినువీధి నొక్క వనజాతముఖిన్ మృగరాజ వాహనన్
గని వినయమ్ము దోపగ నొకండె సమీపముఁ జేరి మ్రొక్కి మె
ల్లన మధురోక్తులన్ మిగుల లాలన మొప్పగ బల్కరించె న
ద్దనుజుడు తామ్రు డెంతయు ముదంబున వీత మదోద్ధతుండునై

294. శా. దేవీ! దైత్య విభుండు మామహిషు డుద్దీప్త ప్రతాపుండు, నీ
దైవీ సంపద నొప్పు రూప గుణ సౌందర్యంబులన్ మెచ్చి స
ద్భావంబొప్పగ చెట్ట బట్టఁ దలచెన్ పద్మాక్షి! నిన్ బ్రీతితో;
నీ విట్లింతటి సుందరీ మణివి చన్నే యొంటివై యుండగన్?

295. కం. తరుణులు సుఖములె గోరుదు
రురు దుఃఖము లేల నీకు నుత్పలనేత్రా!
తిరముగ నందన వనమున
చరియింపగ వచ్చు మహిషు సంబంధమునన్

296. కం. సరసిజ కోమల కరముల
నరివీర భయంకరమ్ము లగు నాయుధముల్
ధరియింప నేల రమణీ!
విరిబంతులఁగాక, యింక విడువుము వీనిన్

297. కం. కనుబొమ లుండగ వేరొక
ధనువది నీకేల; శాతతర శస్త్రంబుల్
చనునే నీ కోసుందరి!
కనుచూపు లనెడు నిశాత కాండము లుండన్

298. కం. సమరము సేయుట యనగా
రమణీ! సయ్యాట కాదు, రాజ్యసుఖంబుల్
ప్రమదమునఁ గొనుము మహిషుని
రమణునిగాఁ బొంది యశము రాజిల్లంగన్.

299. మ. కడు చాతుర్యము తోడ తామ్రుడిటు వల్కన్ దేవి కోపానలం
బడరన్ గన్నులు జేవురింపగ పరీహాసమ్మునన్ బల్కె మూ





ర్ఖుడవై యిట్టు లనంగ నేటి కిది నీకున్ జెల్లునే, బుద్ధి హీ
నుడు, కామార్తుడు నీ విభుండు విననెందున్ దాదృశున్ మూర్ఖునిన్

300. చం. అతనికి నాకు సామ్యమెటులో! తనతల్లి వలెన్ భుజింప నే
సతతము గడ్డిగాదములు; సాగిన పొట్టయు వాడి కొమ్ములున్
పతిత విలోల వాలమును పాశవికంబును నాకుఁగల్లనే
మతిసెడి యిట్టి యూహలను మానుట యొప్పని చెప్పు వానికిన్

301. తే.గీ. సర్వ సాక్షియు స్థిరుడును సర్వకర్త
నిర్గుణు దకర్త పూర్ణుడు నిస్పృహుండు
నిర్మముడు నిరాశ్రయుడును నిర్మలుండు
నప్రమేయుడు సర్వజ్ఞు దధిక శాంతు
దమిత పావను దఖిలేశుడైన భర్త
నాకుఁ గల; దతని వదలి నయవిదూరు
నితని మూర్ఖుని వరియింతునే! యెఱుంగు

302. చం. బ్రతుకుట కిష్టమైన తనబంధు జనమ్ముల తోడఁగూడి స
మ్మతి నహిలోకమేగుమని మంచిగఁ జెప్పుము; కాకయున్న వి
స్తృత చతురంగ యూధ సమితిన్ రణభూమికి రమ్మటంచు నీ
వతనికిఁ దెల్పు మేఁ బరిణయంబటఁ జేయుదు నంబకమ్ములన్

303. కం. అని హెచ్చరించి ప్రావృట్
ఘన గంభీరధ్వని యన గర్జింపగ న
ద్దనుజుడు తామ్రుడు మతిసెడి
వెనుదిరుగక పరువువెట్టె విభ్రాంతుండై

304. ఉ. దిక్కులవెల్ల పిక్కటిలె దిగ్గజముల్ వడకెన్ మహాంబుధుల్
వెక్కసమైకలంగె, భువి బీటలు వారెను, పర్వతంబులున్
గ్రక్కదలెన్; సురారులకుఁ గర్భ పుటంబులు వ్రస్సె, గర్భముల్
తక్కెను వారి భార్యలకు తజ్జనితోత్కట భీకరార్భటిన్

305. కం. సరిగా నా సమయమ్మున
పరదేవీ వాహనమగు పంచాననమున్

మొరయెత్తి గర్జ యొనరిచె
నరివీరులు పెక్కు రదిరి యసువులు వాయన్

306.చం. పరుగున వచ్చి తామ్రుడటు ప్రక్కన నిల్చి శిరమ్ము వంచి తా
జరిగిన దంతయున్ దెలుప చయ్యన నమ్మహిషుండు మంత్రులన్
పరువడిఁ బిల్చి కార్యమును పల్కుడు, యుద్ధమొనర్చుటో, గిరుల్
దరిసి గుహాంతరావలుల దాఁగుటయో వచియింపు డెద్దియో!

307. కం. ఇతరు లెఱుంగక యెపుడున్
మతి మంతులు మంత్రివరులు మంత్రాంగములన్
చతుర గతి జరుప వలయును
గతి మంత్రమె యేలికలకు కష్టములందున్.

308. చం. అబల యనంగరాదది. సురారులఁ గూల్పగ వచ్చినట్టి దౌ
సబల యనంగఁ దోచు, బలు సైన్యము లేవియులేక యొంటియై
సొబగున చివ్వకున్ గరముఁ జూపుచు నున్నది బాల యయ్యు, దై
వబల విశేషమే తనకు బాసట యన్నటు లక్కజంబుగన్

309. చం. తలపకు డామె యొంటియని; తద్దయు సైన్యము లున్నవంచు ని
శ్చలమతి మీర లుండకుడు; సంగరమందు జయమ్ము నోటముల్
గలుగుట దైవనిర్ణయమె, కన్పడదెందును దైవ, మందుచేఁ
దలతు రుపాయ వాదులటు దాని నదృష్ట మటంచు నోర్పునన్

310. ఉ. ఐనను దుర్బలాత్ములకు నయ్యది యొక్కటె పట్టుఁ గొమ్మయౌ,
మానుగ ధైర్యవృత్తియు నమంద బలంబుల నొప్పు వారలే
బూని ప్రయత్నముల్ సలుపఁ బోదురు, దైవము మాట వారికిన్
మానసమందుఁ దోప దణు మాత్రమునైన మదోత్కట స్థితిన్

311. కం. తనరగ నివ్విధిఁ బల్కెడు
దనుజాధిపు మాటలెల్ల దైత్యామాత్యుల్
విని కొంత తడవు, మునివృ
త్తినిఁ బూని మరల యొకింత తేఱి రటుపయిన్

312. చం. పలికె బిడాలు డద్దనుజ వర్యుని గాంచి ప్రభూ! యెటైన మున్
దెలియవలెన్ తదబ్జదళ నేత్ర విలాస మదేదియో? వరుం





దెలమిని నెవ్వరో? యిటకు నేపనిఁ బూని యవక్ర విక్రమం
బొలయగ నేగు దెంచెనొ బలోన్నతులెవ్వియొ చారదృష్టులన్

313. చం. అజుని వరంబునన్ దమకు నంగనచే మరణంబటన్న యా
నిజము నెఱింగి దేవతలు నెమ్మితదంశలనెల్లఁ గూర్చి, నీ
రజదళనేత్ర నివ్విధిఁ బరాక్రమమొప్పగ సృష్టిఁజేసి నిన్
విజిత విరోధిఁ జంపఁ దలపెట్టి రటంచును విశ్వసించెదన్

314. చం. మనకు జయంబు తథ్యమను మాట యొకించుక సంశయంబె, యై
నను సమరమ్ము మానుటది న్యాయము గాదు, జయమ్మొ స్వర్గమో
మనమున సంశయంపడక మానిత బాహు పరాక్రమోద్ధతిన్
జని యెదిరింత మామెను యశంబగు నెయ్యది సంభవించినన్

315. తే.గీ. జయము గల్గిన సుఖములు సంభవించు
యశము చేకూరు మరణంబె యైన; గాన
భయమునన్ బాఱి యపకీర్తిఁ బడయ నేల
జగతి నపకీర్తి నీచమ్ము చావుకన్న

316. కం. ఆ బిడాలుని మాటల కచట నున్న
వార లెల్లరు వంతలు వల్కి రంత
దుర్ధరుండను వాడు సంతోష మెనయ
నిట్లు వచియించెఁ గడు దర్ప మేర్పడంగ

317. ఉ. దానవ నాథ! విన్ము త్రివిధంబుల లోకమునందు మంత్రులున్
గానగ నౌదు రందు ప్రభుకార్య పరాయణులై చరించుచున్
బూని స్వకార్యముల్ గనుచుఁ బొల్పుగ ధర్మము వీడఁబోని వి
జ్ఞాన విశేష వర్తులగు సత్వగుణుల్ గల రార్జవంబునన్

318. ఉ. కొందరు రాజసంబున నిగూఢముగా నిజ కార్యవర్తులై
నిందలు వల్కుచున్ బ్రభువు నిర్మల బుద్ధికి గండికొట్టుచున్
గందువ నప్పుడప్డు ప్రభుకార్యము లందున చిత్తమూని యం
దందు విభేద భావముల నల్లుచు నుందురు స్వార్థబుద్ధులై

319. ఉ. తామసవృత్తిఁ గొందరు ప్రధానముగా నిజకార్య నిష్ఠులై
స్వామి కృతంబులన్ మరచి శత్రు గణంబులకున్ రహస్యముల్

వేమరుఁ జేర వేయుచు వివేకముఁ గోల్పడి లోభులై నిజ
క్షేమముకై ప్రభూత్తముల సేమము భంగమొనర్తు రొయ్యనన్

320. కం. పరి వృధుల కీడు గోరుచు
పరిపంథుల లంచములకు బానిస లౌచున్
ఒరలో కత్తుల వోలెన్
జరియించెడి తామసులను జనునే నమ్మన్

321. కం. కావున రాజా! నన్నిపు
డీ వాజ్ఞా పింపు మిదియె యెటులైనను నా
దేవిని గొని తెచ్చెద; లే
దా వధియింతును మదుగ్రతర శర హతులన్

## బాష్కల దుర్ముఖ సంహారము

322. మ. కడు దీర్ఘమ్ముగ నిట్లు దుర్ధరుడు వల్కన్ దైత్యనాథుండు తా
నెడదన్ నిశ్చయ మెద్దియున్ గనక యట్లే మౌనమున్ దాల్చినన్
గడిమిన్ బాష్కల దుర్ముఖుల్ బహుళసంఖ్యన్‌సైన్యముల్ తోడరా
వడి నేతెంచిరి యుద్ధభూమి కెదిరింపన్ దేవి నత్యుద్ధతిన్

323. వ. అట్లు కదురయంబునఁ జనుదెంచి యవ్వరాంగనన్ గాంచి

324. శా. దేవీ! మా విభుడైన యమ్మహిషు డుద్దీప్త ప్రతాపుండు నై
దేవేంద్రాదుల నోర్చి స్వర్గపతియై దివ్యోపభోగంబులన్
దా విఖ్యాతిగఁ బొందుచుండె నతనిన్ దైత్యేశ్వరున్ బెండ్లియై
నీవున్ బొందుము స్వర్గ సౌఖ్యముల సందేహింప కోసుందరీ!

325. కం. మానవ రూపంబున నీ
మానసమున కొప్పునట్లు మాల్యాంబరముల్
మేనన్ దాలిచి యాతడు
కానికలన్ గొనుచు వచ్చు గౌరవమొప్పన్

326. మ. అనినన్ దేవి మహోగ్ర రూపమున నుద్యత్ కోటి సూర్యాభయై
ఘన హుంకారము సల్ప వారిరువురున్ గంగారునన్ వెన్కకున్





జన నుంకించియు నెట్టులో మనములన్ స్థైర్యంబు నెక్కొల్పి య
వ్వనితారత్నము పైన నేసిరతి తీవ్రంబైన బాణమ్ములన్

327. ఉ. దేవియు దేవకార్యము మదిన్ దలపోసి ధనుస్సునెత్తి కాం
డావలితోడ శాత్రవుల యంబకముల్ వృథసేయ నంతటన్
చేవదలిర్ప బాష్కలుడు చేరి రణం బొనరింప సాగె న
ద్దేవియు క్రోధమూని కడు తీవ్ర శరంబుల వానిఁగప్పినన్

328. ఉ. మౌనముదాల్చి దుర్ముఖుడు మానిని భంగిమఁ జూచుచుండ న
ద్దానవమంత్రి బాష్కలుడు ధైర్యముఁ బూని శతాధికంబుగా
బాణపరంపరల్ గురిసె; బాలయు వాని మదాతి రేకమున్
మానసమందు నెంచి శిత మార్గణముల్ పరపించె వానిపై

329. ఆ.వె. అంత నూరుకొనక యర్ధచంద్రాకార
బాణ మొకటి వేయ భగ్నమయ్యె
వైరిధనువు; నంత వాడును గదఁ బూని
వేగ నంబపైన విసరివైచి

330. చం. అది గని దేవియున్ గద ననంత రయంబున వైవ నద్దియున్
చదలు ధ్వనింప తీవ్రమగు శబ్దముతోఁజని దైత్యుశీర్షమున్
గదుకొని తాక మూర్ఛిలియు గ్రన్నన నొక్క క్షణంబులోన పెం
పొదవగ తేతి యొందుగద నుద్ధతిఁ బూని మహోగ్ర కోపుడై

331. చం. విసరెను బిట్టునార్చి కడు వేగమునన్ జగదంబపైన న
య్యసురుడు; నంత దేవియును నార్చుచు దాని నిజాంబకమ్ములన్
వెసఁ దునియంగఁ జేసి కడు భీకర వృత్తి త్రిశూలమెత్తి తా
విసరె తదీయ వక్షమున విస్మయ మందగ దేవదానవుల్

332. తే.గీ. ఆ త్రిశూల మెదం దాక నసుర వరుడు
కూలిపడి గిలగిల తన్నుకొనుచు ప్రాణ
ములు వదలె; నంత రక్కసి మూకలెల్ల
బుద్ధిసెప్పిరి కాళ్ళకు పోడిమి సెడి
నింగిఁ జూచెడి దేవతల్ పొంగియాడ

333. ఉ. అంతట దుర్ముఖుండు కదు నాగ్రహమూని రథమ్మునెక్కి రో
దోంతరముల్ ధ్వనింప నిలుమా! యబలా నిలుమంచు నార్చుచున్
చెంతకుఁ జేర దేవియును శీఘ్రగతిన్ దన శంఖమూది దు
శ్చింతుడు దైత్యు దుల్కిపడ చేసెను టంకృతు లొక్కపెట్టునన్

334. ఆ.వే. ఒకరిపైన నొక్క రుగ్ర శరమ్ములఁ
బఱపికొంచు వివిధ భంగిమముల
రణము సేయు చుండ రాక్షస వీరులు
పెక్కు రవనిఁగూలి రక్కజముగ

335. వ. ఆసమయంబున

336. కం. దనుజుల శిరములు తెగిపడి
రణరంగము నందు పారు రక్తపు ఝరులన్
మునుగక తేలుచు నయ్యవి
కన నయ్యెను నక్ర మీన కమఠము లనగన్

337. కం. ఆ కదన రంగ మందున
కాకులు గ్రద్దలును మాంస ఖండంబులకై
కేకలు పెట్టుచు శవముల
పీకుచు నెగురుచును నుండె బీభత్సముగన్

338. ఉ. కాలము మూడె నన్నటుల కత్తిని దూయుచు దుర్ముఖుండు నా
బాలను గాంచి యోయబల! భద్రమునీకగు గాన వెంటనే
యాలము మాని మామహిషు నాథ్యు వరింపుము కానిచో వెసన్
గాలుని బ్రోలి కంపెదను గ్రక్కున నొక్కటి తేల్చుకొమ్మికన్

339. మ. అనుచున్ బ్రేలెడి దుర్ముఖున్ గని పరీహాసమ్మునన్ దేవియున్
ఘనమౌ కత్తిని దాల్చి వాని శిరమున్ ఖండింప తద్దేహ మొ
య్యనఁ గూలెన్ భువిపైన రక్కసులు హాహాకారముల్ సల్ప; స
న్మని సంఘమ్ములు దేవతల్ మిగుల సమ్మోదించి కీర్తింపగన్

340. కం. దనుజపతి కొక్క క్షణమునఁ
జని వినిచిరి చారులపుడు జరిగినదెల్లన్





విని మహిషుడు దుఃఖించుచు
తన మంత్రులనెల్లఁ బిలిచి తా నిట్లనియెన్

341. ఉ. దానవులార! చూచితిరె దైన్యగతిన్ మన వీరులిర్వురున్
మానిని చేతఁ గూలి రవమానము నెట్లు సహింతు, నెప్పుడున్
దానది కాలనిర్ణయము తప్పునె యెంతటి వారికైన; కా
దేని మహోగ్ర వీరు లొకయింతికిఁ గూలుట యెంత చిత్రమౌ

## తామ్ర చిక్షుర సంహారము

342. తే.గీ. ఇట్టి సంకట స్థితియందు నెద్దికార్య
మనుచుఁ బల్కగ చిక్షురుం డనెడి వాడు
లేచి వినయమ్ముతో నంజలిన్ ఘటించి
పలికె నివ్విధి దానవ పతిని గాంచి

343. చం. దనుజవరేణ్య యిట్టులొక తన్విని చంపుట కింతయోచనల్
గొనకొని సల్పనేటి,కిది గొప్పయె దాని వధించుటెల్ల;నన్
బనిగొని పంపు దీక్షణమ భామినిఁ గూలిచి వత్తు నంచుఁదా
జనియె మహోద్ధతిన్ విపుల సైన్యములన్ గొని రాజునానతిన్

344. వ. ఇంతకుమున్ను వెనుదిరిగి వచ్చిన తామ్రుండును వాని ననుసరించె

345. కం. చిక్షురుని గనిన యంతనె
రూక్షేక్షణ యౌచు దేవి క్రోధంబున తా
నాక్షణమ శంఖ మూదెను
రక్షో గణమెల్ల నార్త రవములు సలుపన్

346. కం. హుంకారము తోడ ధను
ష్టంకార మొనర్చి యంత సర్వాత్మిక యౌ
శాంకరి ఘంటా నినదము
పొంకమ్ముగఁ జేసె సురలు ముదమందంగన్

347. చం. త్రివిధములైన శబ్దముల తీవ్రతకున్ దమ గుండెలెల్ల పె
ల్లవియగ దైత్యసేనలు రయంబున పర్వులు వెట్టుచుండ, న

ద్దివిజ విరోధి చిక్షురుడు తీవ్ర తరంబగు కోపమూని “భీ
రువులయి మీర లీగతిని రోసము మాని సనంగ నొప్పునే”

348. కం. నిలువుడు నేనీ వనితను
సులభమ్ముగఁ జంపి మీకు శుభములఁ గూర్తున్
కలతలు సెందక మీరలు
నిలువంబడి చూడు డొక్క నిముసం బోర్మిన్

349. మ. అని ధైర్యమ్మును చెప్పి చిక్షురుడు వీరానీకమున్ నిల్పి బో
రన బాణాసనమెత్తి, యో యబల! శౌర్యంబిట్లు నీకేల నిన్
వనితన్ జంపగనేల యంచు మదిలో భావించి యిట్లుంటి, లే
దనినన్ నిన్వధియింప కింత తడవి ట్లాలస్యమున్ సైతునే

350. శా. నీ కిట్లేటికి యింత కష్ట మబలా! నెమ్మేను పూబంతియేన్
సోకన్ గందెడు నట్టులుండె యెటు లోర్చున్ గ్రూర బాణాహతుల్
నీ కౌగిళ్ళకునై తపించు మహిషున్ నిర్వక్ర శౌర్యోన్నతున్
జేకొమ్మింతతట భర్తగా సుఖమునన్ జీవింపు మశ్రాంతమున్

351. మ. అని యిట్లాతడు వల్క దేవియపు డాజ్యస్పర్శ నుద్ధూతమౌ
యనలజ్వాల యనంగ లేచి యనె మూర్ఖా! పెక్కు దుర్భాష లి
ట్లనయంబున్ దెగఁబ్రేలఁ బోకు మిదె నీయౌద్ధత్యమున్ సైప, మ
ద్ఘన శస్త్రాహతిఁ ద్రుంతు నీ శిరము నిక్కం బిప్డె ఘోరంబుగా

352. కం. నే నిట్లవతారంబును
బూనుట మీవిభుని మిమ్ముఁ బొలియించుటకే
దీనిన్ దెలియవు, మును నీ
మేనున్ ఖండించి యవల మీవిభుఁ ద్రుంతున్

353. చం. అని తన నిశ్చయం బిటుల నంబ వచింపగ చిక్షురుండు సం
జనిత మహోగ్ర కోపుడయి చక్క శరాసన మెక్కువెట్టి యా
జనని పయిన్ నిశాత శర సంఘములన్ గురియింప దేవియున్
దనుజుని బాణముల్ తనను తాకగనీయక త్రుంచి యంతటన్

354. చం. ఘన పవనాశ నోపమిత కాండ పరంపర లొక్కపెట్టునన్
దనుజుని పైన నేయగ నతం డొక యింత చలింపకున్న న





వ్వనరుహ నేత్రి యప్పుడు జవంబునఁ బెన్ గదనెత్తి మోద, స్యం
దనమున నుండి క్రిందఁ బడె దానవు డొక్క గిరీంద్రమున్ బలెన్

355. చం. అదిగని తామ్రు దుగ్రగతి నామె నెదిర్చిన బిట్టు నవ్వి య
మ్ముదితయునిట్లు వల్కె కడు మూర్ఖుడు మీ విభుడిట్లు మిమ్ములన్
కదనముసేయఁ బంపుటకు కారణమారయ ప్రాణభీతిచే
నదను నెఱింగి డాగికొని యాయువు నిల్పు కొనంగ నౌనొకో?

356. చం. అనదల మిమ్ముఁ జంప ఫలమౌనె వృథా శ్రమగాక, మీరికన్
వెనుకకు నేగి మీవిభుని వేగమె తోడ్కొని రండు వాని యా
ననమది యొక్కసారి గని, నాకవిభుండు ముదంబుఁ బొంద మ
ద్ఘన శితకాండ సంహతుల తచ్ఛిర ముర్విని గూలఁ జేసెదన్

357. చం. తిరముగ నిట్లు వల్కు యువతీమణి యుద్ధతిఁగాంచి తామ్రుడున్
వెరవక క్రుద్ధుడై ధనువు వేగమె గైకొని వేనవేలుగా
శరములు దేవిపైఁ బఱప శాంభవి సుంతయు లెక్కసేయ క
చ్చెరువుగ వానిఁ గప్పె నతి శీఘ్రగతిన్ దన కాండపంక్తిచే

358. ఉ. అంతట మూర్ఛఁ దేఱి భయదాకృతి చిక్షురు డేగుదేర, దు
శ్చింతులు నిర్వురున్ గలసి శీఘ్రముగన్ శరవృష్టిఁ గుర్వ న
త్యంతము నుత్సహించి జగదంబ తదంబక పంక్తినెల్ల న
ల్లంతనె ద్రుంచి కూల్చెను నిజాంబకపంక్తి సురారి సైన్యమున్

359. తే.గీ. తామ్ర చిక్షురు లిర్వురి తనువు లపుడు
రక్త సిక్తంబులై పుష్ప రాజితోడఁ
బరగు చున్నట్టి కింశుకా పాదపముల
భంగి నొప్పెను దివిజు లుప్పొంగి యాడ

360. తే.గీ. అంత తామ్రుడు తనశక్తి నంత నెటులో
కూడ గట్టుచు పెను గదతోడ నేగి
అమ్మ వాహనమైన సింహమ్ము శిరము
గుఱియకాఁ గొట్టె నయ్యది కుయ్యిడంగ

361. చం. అదిగని యమ్మవారు కడు నాగ్రహమూని శితాసిఁ బూని దు
ర్మదుడగు తామ్రు శీర్షము ధరంబడ నేయగ వాని మొండెమున్

పదపడి బొంగరమ్మటుల ప్రబ్బిన వేగము తోడఁ దిర్గుచున్
చదలు ధ్వనింపఁ గూలె గిరి చందమునన్ భయమంద రక్కసుల్

362. ఉ. తామ్రుడు గూలుటన్ గని మదంబున చిక్షురు డార్చుచున్ వడిన్
తామ్ర విలోచనుం డగుచుఁ దద్దయువేడ్కఁ గరాళ ఖడ్గమున్
క్రమ గతిన్ ధరించి కడకన్ జగదంబ నెదిర్చి నిల్వ నా
ధూమ్ర విలోల నేత్రయును దుష్ట నిశాటుని గాంచి క్రుద్ధయై

363. మ. వరుసన్ పంచ శితాంబకమ్ము లతి తీవ్రంబైన వేగోద్ధతిన్
బఱపన్ రివ్వునవచ్చి యందొకటి మున్ భగ్నంబుఁ గావించె త
త్కరవాలంబును, నంత వేరొకటి హస్తమ్మున్ వడిన్ ద్రుంపగా
శరముల్ దక్కిన మూడు వాని శిర మాశ్చర్యమ్ముగా డుల్చినన్

364. తే.గీ. అతని మొండెమ్ము క్షణకాల మట్లె నడచి
నేల కొరిగెను నొక భూరి సాల మట్లు
ముని గణమ్ములు దివిజులు మోదమంది
విజయ ఘోషలు సల్పిరి వేడ్కనపుడు

## బిడాల అసిలోమ సంహారము

365. కం. తక్కిన రాక్షస సైన్యము
లుక్కుల్‌సెడి మహిషు చెంత కురికి రయమునన్
వెక్కసమగు శోకంబుల
నిక్కడి విషయమ్ము నెల్ల యేర్పడఁదెలుపన్

366. శా. తోకన్ ద్రొక్కిన పన్నగేంద్రు పగిదిన్ దుర్వార కోపంబునన్
బైకిన్ దిగ్గనలేచి యమ్మహిషు దున్మత్తున్ బలెన్ దిర్గుచున్
వీకన్ దక్కిన దండనాథులఁగడున్ విఖ్యాతులన్ బిల్చి మీ
రా కంజాక్షి నెదిర్చి పట్టుకొని తెండం చుగ్రుడై పల్కినన్

367. కం. అసిలోమ బిడాలాదులు
వెసఁ జని రథికంపుసేన వెంటనడువగా
నసి ముద్గర శూల, గదా
ముసలా ద్యాయుధ సమూహముల చేకొంచున్





368. చం. అటఁజని సింహవాహనము నందు తిరమ్ముగఁగూరుచుండి ది
క్తటముల దివ్యతేజములు గ్రమ్మగ హాసవిలాస సంపదన్
అటునిటుఁ గాంచు నా జనని నంచిత దివ్య విభూషణాంబరన్
చటుల తరోగ్ర కర్కశ నిశాతతరాయుధ హస్తఁగాంచుచున్

369. చం. భయపడి సైన్యమట్టె నిలువన్ గని తా నసిలోము డొక్కడే
రయమున ముందుకున్ జన తిరంబున నంత బిడాలు దేచి ని
ర్భయమున వానివెన్కఁ జనె బాసటయై, యది గాంచి దేవియున్
భయద మహాట్టహాసముల భాసిలె రక్కసు లుక్కు దక్కగన్

370. ఉ. అంత బిడాలు డేదు నిశితాంబకముల్ గొని దేవినేయ, నొ
క్కింతయు సంచలింపక మహేశ్వరియున్ తన బాణపంక్తి న
త్యంత రయంబునన్ దనుజు నంబకముల్ దునియంగఁ జేసి ని
శ్చింతఁ దదీయ శీర్షమును శీఘ్రగతిన్ భువి దుల్లఁ జేసినన్

371. మ. అసిలోముం డది గాంచి ధైర్యమున వీరావేశ ముప్పొంగ న
య్యసురద్వేషినిఁ గాంచి పల్కె నపసవ్యంబైన హస్తంబు పెం
పెసగన్ జూపుచు నిశ్చలస్థితిని దేవీ! యింక నీచేత మా
యసురానీకములెల్ల చచ్చుటది తథ్యంబంచు నూహించెదన్

372. ఉ. ఐనను నే పరాశ్రయుడ నౌట రణమ్మొనరించుటే తగున్
తా నతి మూర్ఖు డమ్మహిష దైత్యు డెఱుంగడు మంచిచెడ్డలన్
వానికి నప్రియమ్ములగు పల్కు లవెంత హితమ్ములేనియున్
బూని వినంగ నోపడన బుద్ధులుసెప్పుట వ్యర్థ మిత్తతిన్

373. తే.గీ. కాన కానున్న దేదియో కాక యున్నె
విజయమో లేక మరణమ్మొ వెఱవ నేల
యనుచు నసిలోము డపుడు శితాంబకముల
నా జగన్మాతపై వైచె నతి రయమున

374. ఉ. ఆమెయుఁ దీవ్ర కోపమున నంబక యుగ్మము జేవురింప భ్రూ
ధామము నాట్యమాడ నిశితంబగు శస్త్రము లప్డు వైచె ను
ద్దామగతిన్ సురారిపయి తత్తను వెల్లను రక్తమొల్క కెం
దామర లద్దినట్టి యొకదంతిని బోలుచు నాతడొప్పగన్

375. చం. అతడును సుంత తేరుకొని యార్చుచుఁ బెన్‌గద చేతబూని దు
ర్మతుడయి యంబ వాహన శిరమ్మును బిట్టుగఁ గొట్ట నద్దియున్
వితత మహాగ్నికీల యన వేగమె లేచి సురారి వక్ష మ
త్యతులిత శాత చండ నఖరాహతిఁ జీరె సుపర్వు లుబ్బగన్

376. తే.గీ. అంత నాతడు తనగద నట్టెపట్టి
బంతివలె లేచి సింహమ్ము పైన దుమికి
అమ్మవారిని కొట్టు యత్నమ్ము సలుప
తళ్కుమనె ఖడ్గ మంబ హస్తమ్మునందు

377. కం. దనుజుని తల యెగిరె నపుడు
వినువీధికి, సింహమంత విసరె శిరంబున్
ఘనమగు నతని కళేబర
మెనయగ నల్లంత దూర మెగసి పడునటుల్

378. కం. దివిజులు సంతోషమ్మున
వివిధ గతుల నుతులు సలిపి భేరీధ్వను ల
త్యవిరళగతి గావించిరి
దివిజేంద్రుడు సంతసింప దితిసుతు లడలన్

379. ఉ. చావక యున్న యయ్యసుర సంఘములన్ మృగరాజు చీల్చి యా
పోవగ నారగించె, రణభూమి శవమ్ముల తోడనిండె, శ్రీ
దేవియు దివ్యతేజములు దిక్కులఁ గప్పగ చూచుచుండె, భీ
తావహుడయ్యె నమ్మహిషు దంతయు చారు లెఱుంగఁ దెల్పగన్

380. తే.గీ. దారుకుని బిల్చి రథము సిద్ధమ్ము సేయ
నాజ్ఞయిడ నతడు కడు రయమ్ముతోడ
సిద్ధమొనరించి తెచ్చెను శ్రేష్ఠమైన
యాయుధమ్ముల నింపిన స్యందనమును

381. కం. వివిధ పతాక ధ్వజముల
ప్రవిలంబిత తోరణముల భాసిలుదానిన్
జవన ఖర సహస్రమ్మును
నవిరళగతిఁబూన్చినట్టి యరదముఁ గనుచున్





## మహాలక్ష్మితో - మహిషుని సంభాషణము

382. చం. మనమున పొంగు దుఃఖమును మాయగఁ జేసి రథంబునెక్కి నె
మ్మనమున నివ్విధిన్ దలచె "మానిని యిట్టి మదీయ రూపమున్
గనిన విరక్తిఁ జెందు నటుగాన కదుంగడు సుందరాకృతిన్
జనుటుచితం" బటంచు విలస న్మనుజాకృతిఁ దాల్చి యంతటన్
దనుజ విభుండు సాగె కడు దర్పమునన్ రణభూమి కొయ్యనన్

383. కం. తన మూల బలము లెల్లన్
తనతో నడువంగ నేగి తద్దయు వేడ్కన్
వనరుహనేత్రను గాంచెన్
మనమలరగ దనుజవరుడు మహిషుండంతన్

384. మ. కడు దర్పోద్ధతి నేగుదెంచు నతనిన్ గన్గొన్న శ్రీదేవియున్
పిడుగుల్ రాలినయట్లు దిక్తటులు కంపింపంగ దైత్యాళియున్
వడఁకన్ శంఖమునూదె, విస్మయము సంప్రాప్తింప దైత్యేశుడున్
జడియన్‌బోక మహేశ్వరిన్ గని యిటుల్ సాగించె సల్లాపముల్

385. శా. దేవీ! లోకమునందు స్త్రీ పురుషు లాదిన్‌దొట్టి, సౌఖ్యమ్ముతో
జీవింపంగ దలంతు, రెల్ల సుఖముల్ స్త్రీ పుంస సంయోగ స
ద్భావావేశములందె వృద్ధియగు నోబాలా! విరాగిన్ బలెన్
నీ విట్లొంటిగ నుంట సౌఖ్యమగునే నిక్కంబు యోచింపుమా!

386. సీ. పరికింప కలయికల్ బహువిధమ్ముల నుండు
నవి రెండు భాగమ్ములై తనర్చు
సహజసిద్ధములైన సంయోగములుకొన్ని
ప్రీతిహేతుకముగ వెలయుకొన్ని
ప్రీతిహేతుకముల వివరించెదను ముందు
నవియు నుత్తమ మధ్య మాధమముల
నొప్పుచుండును మూడు చొప్పులై జగముల
తల్లిదండ్రులతోడ తనయులకును

గీ. కలుగు కలయిక శ్రేష్ఠమౌ కలయిక యగు
నదియె అత్యంత ప్రీతి దాయక మనంగ

బుధులు వచియింతు రమితంపు ముదముతోడ
మదినెఱుంగుము మధ్యమంబది వచింతు

387. కం. తనతో బుట్టువులను కల
సిన యాసమయములయందు చిత్తములోనన్
పెనగొను నానంద మదియె
తనరగ మధ్యమమటంచుఁ దలతురు విబుధుల్

388. కం. భిన్న మనస్తత్వమ్ములు
భిన్నవ్యావృత్తులు గల భిన్నవ్యక్తుల్
మున్నున్ విడి మరల కలియు
టెన్నదు రది యధమ మనుచు నెఱిగిన వారల్

389. కం. స్వాభావిక సుఖముల యం
దోభామా! యుత్తమమ్ము యుక్త వయసునన్
శోభిల్లెడి స్త్రీపురుషుల
శ్రీభరిత సమాగమమ్ము శీతాంశుముఖీ!

390. ఉ. కావున నన్ను వీరు నిటు కాదనఁ బోక వరింతువేని నా
నావిధ భోగ భాగ్యము లనంతముగాఁ బడయంగవచ్చు, స
ద్భావమునన్ సురాళిపయిఁ బాయుదు వైరము, నాదుసంపదల్
నీవ యగున్ దలోదరి! గణింపుము నేనిక నీకు దాసుడన్

391. చం. మదనుని బాణ సంహతులు మానసమున్ గలఁగించు చుండె, నే
నిదివర కెవ్వరిన్ మిగుల హీనగతిన్ చెయిచాచి వేడ, నో
మదవతి! నిన్ను వేడెదను మారుడు తొందర పెట్టుచుండె, నీ
పదముల నంటి పల్కెదను భామిని! నన్ను ననుగ్రహింపుమా!

392. చం. అని కడు దీన చిత్తుడయి యమ్మహిషుం డటు ప్రేలుచుండ నా
జననియు నవ్వుచున్ బలికె సాదర పూర్వక భాషణంబులన్
దనుజకులాధిపా! వినుము తథ్యము నే పరమాత్మఁ దప్ప నె
మ్మనమున కోర నెవ్వరిని మానుగ నాతడె సృష్టికర్తయున్

393. తే.గీ. అతడు పురుషుడు నేను ప్రకృతిని దలప
కలుగు చైతన్య మాతని వలన నాకు





ఇను మయస్కాంత సన్నిధి నెల్లయెడల
చేతనత్వమ్ముఁ బొందెడి రీతినెపుడు

394. కం. శారీరక సుఖములపై
కోరిక లేనాడు లేవు, కుటిలాత్ముడవై
యీరీతి నన్ను నొక సా
ధారణ మహిళయని తలపఁ దగునే నీకున్

395. కం. ఇంతులు పురుషులకును పూ
బంతు లటంచుఁ దలపకుము వారెల్లపుడున్
కాంతులకు శృంఖలములై
యెంతయు బంధింత్రు ముక్తి కెడయగు నట్లున్

396. మ. మలమూత్రమ్ముల కాలవాలమగు కొంపన్ గోరి యారాట మిం
తలు పొందన్ బనియేమి? మూర్ఖ! సుఖమింతన్ లేదు స్త్రీసంగమం
బులయందున్, కడు దుఃఖ సాగరమునన్ ముంచున్, వివేకమ్ముతో
చలమున్ వీడి శమమ్ముఁబొందు మదియే సౌఖ్యమ్ము ముమ్మాటికిన్

397. చం. దివిజుల తోడవైరమును తెంచుక వేగ రసాతలమ్ము పొ
మ్మవిరళరీతి సౌఖ్యముగ నందు వసింపుము, కాదయేని నన్
బవరమునం దెదుర్కొనుము ప్రాణము వీడగ నెంతువేని, నా
యవతరణంబు నిన్నుఁదునుమాడుట కేయని నీవెఱుంగుమా!

398. కం. అని యిట్లెంతయు నోర్పుగ
దనుజునితో దేవి పలుక దానవుడును తా
వినిపించుకొనక వనజా
క్షినిఁగని మరల నిటుల పలికెను చతురగతిన్

399. శా. దేవీ! నీ తనువెల్ల యౌవనమునన్ దివ్యాభ సంపత్తిచే
పూవుల్ సోకిననైన కందునటులన్ బొల్పొందుచుండంగ, నా
భావం బొప్పకయుండె నిన్నిపుడు మద్బాణాహతిన్ గూల్పగా,
నీ వింకేటికి నన్ను నొంచెద విటుల్ నీయత్నమున్ మానుమా!

400. మ. పలుమాటల్ పనిలేదు నీమనమునన్ బద్మాక్షి! నాపైన ని
శ్చలమౌ ప్రేమ జనించి నట్లయిన నన్ శౌర్యోన్నతున్ బెండ్లియై

కలకాలంబు సుఖింపు; మవ్విధమునన్ గాకున్నచో స్వేచ్ఛమై
చలమున్ వీడి రణమ్ము మాని వడిగన్ స్వస్థానమున్ జేరుమా!

401. మ. త్రిజగన్మోహిని వైన నిన్ను నొక నారిన్ జంపి నేసుంతయున్
విజయోత్సాహముఁ బొందఁగల్గుదునె భావింపంగ స్త్రీ, బాల, పం
కజగర్భాన్వయ జాత హత్యలవి లోకంబందు మున్నెంచరే
సుజనుల్, వీడగ రాని పాతకము లంచున్ చంద్రబింబాననా!

402. మ. బలవంతమ్మున నిన్ను నీక్షణమె నేబంధించి గొంపోదు దో
ర్బలమొప్పన్ రమణీ! యదెంతయును సంభావ్యంబు గాదంచు నేఁ
దలతున్, దాన సుఖంబు గల్గ దణు మాత్రంబైన, లోకంబునన్
గలదే యొంటరి జీవితమ్మునకు సౌఖ్యంబెందు యోచించినన్

403. చం. మదనుడు నన్ను వేచినటు మానిని! నిన్నును నొంచదేల నీ
సదమల రూప సంపదకు సమ్మతిఁజెంది యతండు నావలెన్
మదిని దయామయుం డగుచు మానెనొ, నిన్నిటు వీడి నాపయిన్
వదలక వేయుచుండె సుమబాణము లెంతటి క్రూర చిత్తుడో

404. ఉ. నాకు విరోధులైన యల నాక నివాసులు జేరి ప్రార్థనల్
చేకొని సల్పి నీయెడకు చిత్తజు నంపక నిల్పిరేమొ? యో
నాకిని! త్వత్ సుఖంబును వినాశనమున్ బొనరింప నెంచి ర
వ్యాకుల లీల దేవతలు వారల కుట్ర లెఱుంగ వక్కటా!

405. కం. మును మందోదరి యును తన
కనుకూలుండైనవాని నతియోగ్యుని కా
దని శఠు నన్యుని గైకొని
మనమున విలపించెఁబిదప మరు బాణాగ్నిన్

406. కం. అని యిట్లు వలుకు మహిషునిఁ
గని దేవియు సుంత మదిని కలఁగుచు తా న
వ్వనితా వృత్తాంతంబును
వినగోరుచు దైత్యునిట్లు వివరం బడిగెన్

407. కం. దనుజా! మందోదరి యను
వనజేక్షణ యెవతె? యేల వదలెను భర్తన్





గొనికొని యే శఠుని వలచి
ఘన దుఃఖితయయ్యె తెలుపు కల నిజమెల్లన్

408. వ. అని యాదేవి యడుగ మహిషుం డత్యుత్సాహంబున మందోదరీ
వృత్తాంతం బిట్లు చెప్పం దొడంగె

## మందోదరీ చరిత్ర

409. మ. పుడమిన్ సింహళమన్న పేర నమరున్ బూర్వమ్ము చెల్వంపు సం
దడి నొప్పారెడి దేశమొండు ధన ధాన్యశ్రీలకున్ బాదనన్
గడుపేరంది, తదీయ రాజ్యమును ప్రఖ్యాతంబుగా చంద్రసే
నుడు పాలించుచునుండె ధర్మపరతన్ దోర్వీర్య సంపన్నుడై

410. చం. గుణవతి, సుందరాంగి, కడుకూరిమి, నేరిమి నొప్పు సాధ్వియై
గణుతి వహించె తత్సతియు గౌరవ మొప్పగ భర్తృసేవలం
దణగి మణంగి వర్తిలుచు నందరి మన్నన లందుచున్ గడున్
గుణవతి యన్నపేరు తనకున్ దగ సార్థకమయ్యె నన్నటుల్

411. చం. మోదమెలర్ప వారికొక ముద్దుల పట్టి జనింపఁ బ్రీతి మం
దోదరి యన్న నామమిడి యుత్సవమొప్పగఁ బెంచుచుండ శు
క్లాది హిమాంశురేఖవలె నందరకున్ గడు ముద్దు గూర్చుచున్
ప్రోదిగ వృద్ధిఁ జెందె తమ పున్నెపుఁ బంట యనంగ నిత్యమున్

412. ఆ.వె. ఆమె యౌవనమున కడుగిడి నంతనే
తగిన వరుని వెదుకఁదలచి తండ్రి
తత్ప్రయత్నమందు తా నిమగ్నుండయ్యె
గుణవతియును మురిసె కూతుఁజూచి

413. వ. అదియట్లుండ మద్రాధిపుండైన సుధన్వుని కుమారుండగు కంబుగ్రీవుని
విషయ మంతయు నెఱింగి వచ్చిన కొందరు బ్రాహ్మణులు రాజున కిట్లనిరి.

414. మ. అల మద్రాధిపుడౌ సుధన్వు తనయుం డత్యంత వీరుండు ని
స్తుల సౌందర్య వివేక బాహుబల సందోహుండు, యోచింప నీ
చెలికిన్ దగ్గ వరుండటంచు గురువుల్ చెప్పంగ భూపాలుడున్
తెలిపెన్ భార్యకు లోనికిన్ జని కడున్ దెల్లంబుగా నంతయున్

415. కం. అంతట గుణవతియును తా
సంతసమున కూతుకడకు చయ్యనఁజని వృ
త్తాంతంబెల్లఁ దెలుప నా
కాంతయు మది మెచ్చుఁబోక కసుబుసు మనుచున్

416. ఉ. ఇచ్చ యొకింతలేదు జననీ! మదిలోన వివాహమాడ, నే
మెచ్చ మరెవ్వరిన్ విడువుమీ తమ యత్నములెల్ల, యిట్టులే
అచ్చపు కన్యగా బ్రతుకునంతయు తీవ్ర తపఃప్రవృత్తి చే
పుచ్చదలంచితిన్ నియమ పూర్వక సద్వ్రత చింతనా రతిన్

417. కం. పరతంత్రం బీసంసృతి
పరతంత్రము కన్న జగతిఁ బరికింపంగన్
సరి దుఃఖము లేదెచ్చట
నిరతము స్వాతంత్ర్య మొకటె నిర్మల సుఖమౌ

418. చం. "పతికి నిరంతర మ్మడగి వర్తిలు చుండుదు, నత్తమామలన్
సతతము సేవలన్ దనిపి సంతసమున్ గలిగింతు" నంచు స
న్మతిని హుతాశు సన్నిధి ప్రమాణము సేయుట యన్న నాకు సం
తతమును గిట్ట దోజనని! దాస్యమె యెల్లెడ దుఃఖహేతువౌ

419. చం. అదియునుఁగాక వేరొకతె నాలిని తెచ్చి యతండు చెంగటన్
వదలిన దాని పోరుఁబడవచ్చునె? యీర్ష్యలు చీదరింపులున్
మొదలయి చిత్తశాంతి పరిపూర్ణముగా నశియించు, నట్టిచో
నది నరకంబుగాక సుఖమౌనె తలంపుము పెండ్లి యాడినన్

420. ఆ.వె. కట్టుకున్నవాడు కాలయోగంబున
నుసురు వాసెనేని యువిద కింక
అండ యెవరొ తెల్పు మంతకంటెను ఘోర
నరక మెద్దిగలదు సరసి జాక్షి!

421. మ. అని మందోదరి పల్కుమాటలకు తా నాశ్చర్యమున్బొంది, యి
ట్లనగా నేర్చెనె నాదుపుత్రి, యటుగా కన్యల్ ప్రబోధించిరో?
యని చింతించుచు మాటలేటి కని యయ్యబ్జాక్షి మౌనమ్మునన్
తనయంతఃపురమేగి తెల్పె తనభర్తన్ గాంచి యీరీతిగన్





422. కం. అనఘా! పెండిలి వలదని
మనపట్టి వచించుచుండె మంకుఁదనమునన్
వినదయ్యె నాదు మాటలు
ఘన సంసారాబ్ధి దుఃఖ కారణ మనుచున్

423. చం. అనవిని చంద్రసేనుడును నాత్మజ నిర్ణయమున్దలంచి తా
వనరుచు నంతటన్ సుత వివాహపు యత్నములెల్ల మానినన్
వనరుహ నేత్రయున్ జనకు పట్టణ మందె వసించుచుండె నె
మ్మనమున సంతసంబొదవ మచ్చిక నెచ్చెలు లెల్లఁగొల్వగన్

424. వ. అట్లుండ నొక్కనాడు

425. చం. తన చెలికత్తెలన్ గలసి తద్దయు వేడ్క వినోద మేర్పడన్
జనియె విహారముల్ సలుప సారస కైరవ పుష్పగంధ సం
జనిత మరంద పాన మదఝుంకృత భృంగ సరోవరాంచితం
బును, శుకపైక మంజురవ మోదమునౌ వనసీమ కొయ్యనన్

426. తే.గీ. అచటి ప్రకృతి శోభకు మదినలరి చెలులఁ
గూడి పాడుచు నాడుచు కుసుమ చయముఁ
గోయుచు విహరించుచు నుండె కోమలాంగి
పరవశమ్మున వనమెల్ల తిరిగి తిరిగి

427. ఉ. ఆ సమయమ్మునం దచట కంగజతుల్య మనోహరాకృతిన్
గోసల నాథు డవ్వనముఁగ్రుమ్మరు వేడ్క రథమ్ము నెక్కి బా
ణాసన కాండ హస్తుడయి యల్లనవచ్చెను వీరసేను డా
శ్వాసముఁ బొందనెంచి వనసంపదకున్ మది మోద మందుచున్

428. ఉ. ఆ దరి సంచరించు చెలి యాత్రమునన్ బరువెత్తి తెల్పె మం
దోదరి కోమృగాక్షి! వినుమొక్కడు రాజకుమారు డెవ్వడో
మోద మెలర్ప నంగజసముం డురు విక్రమవంతుడల్లదే
నీదగు పూర్వపుణ్యమున నిక్క మిటన్ జనుదెంచె నెచ్చెలీ!

429. ఉ. అని చెలి పల్కునంతటనె అయ్యవనీపతి వీరసేను డ
వ్వనజ దళాక్షి యున్నెడకు వచ్చి తదీయ మనోహరాకృతిన్

గని కడు ముగ్ధుడై రథముంగ్రన్నన డిగ్గి కరాబ్జ సంజ్ఞ నొ
య్యన పరిచారికన్ బిలిచి యాదరమొప్పగఁ బల్కెనివ్విధిన్

430. కం. బాలా! తెల్పుము నాకీ
హేలావతి యెవరొ యే మహీపతి సుతయో
భూలోకవన విహారము
లోలిన్ సలుపంగ దిగిన యూర్వశియౌనో

431. మ. తనకున్ బ్రశ్నలు రాకుమారికి నిశాతంబైన యాలోకముల్
దనరన్ సంధిలఁజేయు నావిభుని యత్నంబెల్ల వీక్షించి యి
ట్లనియెన్ దచ్చెలి వానిగాంచి నృపవర్యా! నీదు వృత్తాంతమున్
వినిపింపన్ దగు ముందు నియ్యెడకు తీవిన్ రాఁగతంబేమియో!

432. మ. అనినన్ భూపతి పల్కెనిట్టు లబలా! యాలింపు మీవెప్పుడేన్
వినవే పృథ్విని కోసలావని యనన్ బేరొంది యందంబునం
దెనలేనట్టిదియైన రాజ్యమును, నేనీశుండ నద్దానికిన్
ఘనసైన్యమ్ములు వచ్చుచున్నయవి వెన్కన్, వీరసేనాఖ్యుడన్

433. తే.గీ. వనము నందున విహరింప వచ్చి యిటుల
దారిగానక మిమ్మిటఁ జేరినార
మీమె వృత్తాంత మెల్లను నెఱుక పరచి
ముదముఁగలిగింపు మింక మా మదికి నిపుడు

434. మ. కడు దర్పమ్మున నిట్లువల్కు నవనీకాంతున్ విలోకించి నే
ర్పడరన్ బల్కె లతాంగి యిట్లు జననాథా! చంద్రసేనాఖ్యు డీ
పుడమిన్ సింహళమేలు, వాని సుత యీ ఫుల్లాబ్జ పత్రాక్షి, యి
య్యెడకేతెంచితి మిప్పుడీ వనవిహారేచ్ఛన్ వినోదంబునన్

435. కం. మందోదరి యనబడు నీ
సుందరి మిక్కిలి గుణవతి సుమ్మీ! మేమీ
యిందుముఖికి సైరంధ్రుల
మెందున్ బెడబాయకుందు మీ కంజాక్షిన్

436. కం. కలికితనంబున నివ్విధి
పలికెడి చెలిఁగాంచి భూమి పతి యిట్లనియెన్





కలికిరో! యీ సరసిజముఖి
వలపున్ గలిగించె నాదు భావమునందున్

437. శా. కాకుత్థ్సాన్వయ సంభవుండనగు నే గాంధర్వరీతిన్ వెసన్
జేకొందున్ మది సమ్మతంబయిన నీ శీతాంశుబింబాననన్
మీకున్ దోచిన యట్లు నెచ్చెలులు నెమ్మిన్ దీని మెప్పించి, మ
మ్మేకంబున్ బొనరింపుడీ సఫలమౌ నెల్లప్డు మీ కోరికల్

438. ఉ. ఏనును బ్రహ్మచారిని మహీపతి నుత్తమ వంశజుండ చం
ద్రానన యైన యీమెపయి నచ్చపుఁబ్రేమ జనించె నాకు, స
మ్మానము తోడ నీమెయును మమ్మువరించు నటంచుఁదోచు నో
మానినులార! సంశయము మాని యొడంబడఁ జేయు మెట్టులేన్

439. తే.గీ. తనకు గాంధర్వవిధి సమ్మతమ్ము గాద
యేని యామె తండ్రినడిగి యెల్లజనులు
చూడ వైభవమున పెండ్లి యాడువాడ
నగ్ని సాక్షిగ పెద్దల యనుమతమున

440. చం. అని కడు నేర్పునన్ బలుకు నవ్విభు పల్కుల కాత్మమెచ్చి యొ
య్యన తన రాకుమారికడ కాపరిచారిక చేరి నవ్వుచున్
వనజముఖీ! కకుత్థ్సవరవంశజు డంగజ తుల్యు డుత్తముం
డనఘుడు కోసలాధిపు డనన్య పరాక్రము డెంచిచూడగన్

441. ఉ. ఆతడు నిన్ను మెచ్చె, సము డన్నిట నీకుఁ దలంచి చూడ సం
ప్రీతిగ నీవునున్ దగ వరింపుమువాని శుభంబు గల్గు తా
చేతమునందు సంతసముజెందు భవజ్జనకుండు, వానిదౌ
యాతన మేమెఱుంగుదు మహర్నిశముల్ భవదీయచింతనన్

442. కం. పతిసేవ యనగ సతులకు
నతినీచం బనుచుఁదలప కంబుజనేత్రీ!
పతిసేవయె యుత్తమమగు
సతులకు గతియనుచు ధర్మశాస్త్రము దెలుపున్

443. ఉ. కావున వీని యోగ్యు నిక కాదనఁబోవక పెండ్లియాడి నీ
జీవితమందు సౌఖ్యమును జెందుము కష్టసుఖంబులన్నచో
వావిరి కాలయోగమున వచ్చుచుఁ బోవుచునుండు సంస్కృతిన్
కావవి శాశ్వతంబులని గట్టిగ నెంచి వివాహ మాడుమా!

444. చం. అని కడు యుక్తియుక్తముగ నాడెడు నెచ్చెలిఁ గాంచి రాజనం
దన చలితాత్మయై మదిని తాలిమిఁ గోల్పడి పల్కె నోసఖీ!
ముసు పలుమార్లు నాకిటుల బోధలొనర్పగ లేదెమీరు, నే
మనమున నిచ్చగించితినె మాటలికేటికి విన్ము తెల్పెదన్

445. మ. ఇకముందెన్నడు నిట్టిమాటలను నీవేకాదు వేరెవ్వరేన్
సకియల్ పల్కకు, దేను నిశ్చలమతిన్ సద్బ్రహ్మచర్యవ్రతం
బకలంకంబుగఁబూని చేయుదు తపం బానందమున్ బొందుచున్
సకలైశ్వర్యము లస్థిరమ్ములవి, నిస్సారంబు సంసారమున్

446. మ. ఇతడెవ్వాడొకొ? సిగ్గులేక యిటు నన్నే చూచుచున్నాడు సం
తతమున్ గన్నుల నప్పగించి, యిదినే తాళంగజాలన్ సుమీ!
మతి హీనుండగు వీని దవ్వులఁ జనన్ మాయాజ్ఞగాఁదెల్పు డం
చతికోపంబున రాకుమారి వడిగన్ వ్యావృత్తయై నిల్చినన్

447. ఉ. చేయునదేమి లేక నృప శేఖరుడున్ వడి మౌన భూషుడై
యాయత పద్మనేత్రఁ దనయాత్మదలంచుచు రాజధానికిన్
సాయుధపాణులౌ తనదు సైన్యములన్ గొని యేగె, భానుడున్
ప్రాయముఁదప్పి చేరుకొనె పశ్చిమ దిక్కున కొయ్యనొయ్యనన్

448. కం. చెలికత్తెల తోడ గలసి
పలుకింతయు లేక నృపుని పట్టియు వేగన్
గలగల నందెల రవళుల
పలికించుచు నేగె తనదు పట్టణమునకున్

449. వ. అంతకొంత కాలంబునకు

450. కం. మందోదరి చెల్లెలయిన
యిందుమతియు యుక్తవయసు కేతేరగ తా
నందందు స్వయంవరమును
పొందుగఁ జాటించె తండ్రి పొలతికి నంతన్

451. ఉ. రాజకుమారు లెల్లరును రాజస ముట్టిపడంగ వచ్చి రం
భోజదళాక్షికై పలు విభూషణపంక్తులఁ దాల్చి, యంత నా
రాజకుమారియున్ వలపు రాజిల నందొక రాజపుత్రు వి
భ్రాజిత శౌర్య రూప గుణ భాసుర తేజుని చూచి మెచ్చినన్

452. ఉ. మోదము తోడ తండ్రియును పొల్పుగ వారి వివాహయత్నముల్
సాదరమొప్పఁ జేయుదని సర్వము మంత్రుల కప్పగించి ని
ర్వేదముఁబాసి యుండగ వివృద్ధమనోజ శరోచ్చయంబు మం
దోదరి మాన సాంబుజము నూపి చలింపగఁజేసె నత్తఱిన్

453. తే.గీ. ఆ స్వయంవర మంటప మందు మద్ర
భూమి పతి చారుదేష్ణుడు కామినులను
వశముఁగావించు కొనుటలో బహుచతురుడు
వచ్చి కూర్చొని యుండె భూపతుల లోన

454. కం. ఆతని యందము మెచ్చెనొ
ఆతని మాటల చతురత కలరెనొయేమో?
చేతమ్మున మందోదరి
కాతని పై ప్రేమ గలిగె నాక్షణమందున్

455. చం. తన మదిలోని కోరికను తండ్రికి చెప్పగ నాతడున్ ముదం
బొనరగ వెన్కముందులను నూహ యొనర్పక యామెకోరిన
ట్లనుపమరీతి పెండిలి మహావిభవంబున కట్నకానుకల్
ఘనముగ నిచ్చిచేసి కడుగౌరవ మొప్పగ సాగనంపినన్

456. తే.గీ. చారుదేష్ణుడు భార్యతో సరసగతిని
మద్రరాజ్యమ్మునకు నేగి మాపురేపు
మదన కేళులఁదేలుచు సుదతిపట్ల
మిగుల యనురాగ మున్నట్లు మెలగుచుండె

457. తే.గీ. అంత నొకనాటి నడిరేయి నల్లనేగి
చారుదేష్ణుడు కడు రహస్యముగ తనదు

భటుని భార్యఁగూడి మిగుల పరవశమున
రతులఁ దేలుచునుండ సైరంధ్రి గాంచి

458. ఉ. వేదనఁజెంది యాక్షణమ వేరొకచో శయనించుచున్న మం
దోదరి కంతయున్ దెలుప, నోర్వక నామెయు కోపమూని యా
దాదిని తిట్టి పంపె మదిఁ దద్విషయంబును నమ్మలేక మ
ర్యాదను బూని, భర్తపయి నామెకు నమ్మిక మెంతగొప్పదో

459. శా. కాలం బిట్టుల సాగుచుండ ధరణీకాంతుండు వేరొక్క నా
డాలోలాక్షి యెఱుంగ కుండఁజనె వేశ్యాసంగమాసక్తి దు
శ్శీలుండై నడిచేయి, భర్తనపు డాచెంతన్ గనన్ లేక తా
నాలోకించుచు వచ్చి యామె గనె వేశ్యాలోలు నాత్మేశునిన్

460. తేగీ. ధనము ధాన్యమ్ము రాజ్యమ్ము తల్లిదండ్రు
లాప్తు లెడఁబాయఁ బొందెడి యార్తికన్న
నధికమౌగాదె తనపతి యన్య సతిని
గలయఁగులసతి పొందు దుఃఖమ్ముఁదలప

461. మ. అరెరే! యెంతటి మోసమయ్యె యితడత్యంతంబు కామాంధుడం
చెఱుగన్ దైవమ! వీనితోడ నిక నేనేరీతి సంసారమున్
దిరమై సల్పుదు వ్యర్థమయ్యె బ్రతుకున్, దెల్లంబుగా నిందు నె
వ్వరి దోషంబును లేదు సర్వముఁ దలంపన్ మత్కృతంబేయగున్

462. ఉ. చేయగ రాని కార్యమును చేసితి నక్కట, పుట్టినింటికిన్
బోయిన చుల్కనౌదు, పరువున్వెలి వోవును, నాత్మహత్యయో
పాయని పాతకంబగును, భర్తృసుఖంబుల కెల్ల దూరమై
యీ యెడ నుంటయేతగు నహీన విరాగ మనః ప్రవృత్తి చే

463. కం. అని తలచుచు మందోదరి
తనసుఖముల నెల్ల వీడి తగ నేకాంతం
బున వసియించుచు నుండెను
తన మందిర మందె మిగుల దైన్యస్థితయై

464. వ. అనియిట్లు మందోదరీ వృత్తాంతం బెల్ల వినిపించి
మహిషుం డాజగజ్జననింగాంచి మరల నిట్లు పలికె.





465. మ. తరుణీ! నీవును కోరివచ్చిన ననున్ దారుణ్య సంపన్ను దు
ర్భర శౌర్యోన్నతు వీడినన్ బిదప తీవ్రంబైన కామార్తిఁగా
పురుషున్ బెండిలి యాడి శోకిలెద వంభోజాక్షి! తథ్యంబు నా
పరిభాషల్ విని నన్వరింపుమిదె సౌభాగ్యంబు నీకయ్యెడున్

466. ఉ. కావర మెక్కి యివ్విధిని కాఱులు ప్రేలెడి వానిపట్ల శ్రీ
దేవికి కోపమెక్కుడయి తీవ్రతరంబుగఁజూచి రాక్షసా!
నీవిక నిట్టి మాటలను నిల్పి రణంబొనరింప రమ్ము, లే
దా! వడినేగుమీ! యురగధామము సౌఖ్యముగల్గు నీకటన్

467. ఉ. రూపము లేని నేనిటుల రూపముఁదాల్చి జనించుటెల్లయున్
పాపుల దైత్యులన్ దునిమి స్వర్గనివాసుల సజ్జనావళిన్
తాపమడంచి బ్రోచుటకె దైత్యకులాధమ! నిశ్చయమ్ము, నీ
పాపముపండె నింతట నిబద్ధిగ నెద్దియొ తేల్చుకొమ్మికన్

468. ఆ.వె. వేయి మాటలేల వేల్పులెల్లరుఁగూడి
నిన్ను చంపుమనుచు సన్నుతింప
అవతరించి తిట్టు లాపని యైనంత
తిరిగి వెడలుదాన దివిజవైరి!

469. చం. అనవిని దానవుండు విషయమ్ము నెఱింగి యికేల మాట లీ
వనరుహనేత్రతోనని జవంబున వింటికి నారిఁగూర్చి ని
స్వన మొనరించి నిష్ఠుర నిశాత శరమ్ముల నొక్కపెట్టునన్
గొన కొని యేసె నామెపయి క్రూరతరంబుగ బిట్టునార్చుచున్

470. ఉ. అమ్మయు తచ్ఛరమ్ముల వియత్తలమందె నిజాంబకమ్ములన్
వమ్మొనరించి భీకర రవమ్ము సెలంగగ కాండపంక్తి చే
నమ్మహిషాసురున్ విచలితాత్మునిఁ జేయుచుఁదత్ చమూ సమూ
హమ్ములనెల్లఁద్రుంచుచు భయానకయై విహరించె నత్తఱిన్

471. చం. అది గని దుర్ధరుండు జగదంబ నెదుర్కొని పెక్కు బాణముల్
వదలిన, రక్తనేత్రయయి పావక కీలలఁ బోలు చూడ్కులన్
బొదువుచు నాజగజ్జనని బోరన నర్ధశశాంక రూపమౌ
పదనగు బాణ ఘాతమున వాని శిరమ్మును దుల్చె పెల్చనన్

472. కం. గిరిశిఖరము తెగిపడిన
ట్లురుదై శిరముర్విఁగూల యాతని మొండెం
బురు పర్వతమట్లు వడియె
నరదముపై సుడి దిరుగుచు నాభీల గతిన్

473. కం. అంతట త్రినేత్రుడనువా
డెంతయు వేగమున వచ్చె నీశ్వరి నెదురన్
కుంతముఁ గదువడిఁద్రిప్పుచు
పంతమ్మున బీరములను పలుకుచు నటకున్

474. ఉ. వచ్చిన వాని నీశ్వరి జవంబున నొక్క త్రిశూల మెత్తి తా
గ్రుచ్చెను వక్షమందు, కడు క్రూర గతిన్ రుధిర ప్రవాహముల్
హెచ్చుగఁ జిమ్మ నాతడును హీనతఁదోప ధరాతలంబునన్
చెచ్చెరఁ గూలె ప్రాణములు చెల్లగ రక్కసు లార్చిపర్వగన్

475. తే.గీ. ఆ త్రినేత్రుడు ధరఁగూల నంధకుండు
పరుగు పరుగున గదతోడ వచ్చి యంబ
వాహనమ్మగు సింహమున్ ఫాలమందు
కొట్టినంతనె నదియును క్రోధ మడర

476. తే.గీ. జూలు విదిలించి గర్జించి వాలు గోళ్ళఁ
జీల్చి యొక ముద్దగా వానిఁజిక్కఁబట్టి
నమిలి మ్రింగెను దనుజగణంబు లదర
మహిషుడది గాంచి తద్దయు మతి చలింప

477. చం. గొనకొని కోపవేగమున క్రూర శరమ్ముల నొక్కపెట్టునన్
దనుజుడు వేయుచుండ నిజదారుణ కాండశతంబువైచి, తు
త్తునియలు సేసె నంబయును దుష్టనిశాటు శరాళి నంబరం
బుననె శ్రమం బొకింతయును బొందక హాసవిలాస సంగతిన్

478. తే.గీ. అంత నాగక పెనుగద నట్టెపట్టి
దనుజు హృదయమ్ము తాకగ దారుణగతి
విసర నతడును మూర్ఛిలి, పృథ్విఁబడియు
తేరుకొని నిల్చె పెనుగదఁ దీసి వేగ





479. చం. జవము బలంబునున్ దనర చయ్యన నామృగరాజుకంఠమున్
దవులగ వేయ నద్దియును తాడిత భూరి భుజంగమోయనన్
గవియుచు వచ్చి శాత నఖకాండములన్ దనుజేంద్రు దేహ మున్
వివరము లేర్పడన్ మిగుల భీకర వృత్తినిఁ జీల్చె మూర్ఛిలన్

480. చం. దనుజుడు సుంత మూర్ఛిలియు తత్క్షణ మాత్రనె లేచినిల్చి తా
మనుజుని యాకృతిన్ వదలి మానుగ నొక్క మృగేంద్రు రూపమున్
గొని జగదంబ వాహనము గొబ్బునఁదాకగ నంబయంతటన్
దన శర జాలముల్ బఱపి దానవ నాధుని నుక్కడించినన్

481. చం. అతడును తాళలేక తన యాకృతి మార్చి మదేభరూపుడై
వితత కరాహతిన్ దివిజవీరుల మిక్కిలి నొంచుచున్ మహో
న్నతగిరి నొక్కటిన్ గరమునన్ బెకలించి రయమ్ము తోడ ను
ద్ధతి జగదంబపై విసరె దానవ వీరులు సంతసింపగన్

482. ఉ. ఆ జగదంబయున్ నిజ శరాహతులన్ గిరి నుగ్గొనర్చి య
వ్యాజ పరాక్రమంబెసగ నా దనుజేంద్రుని పైన వైచె వి
భ్రాజిత బాణసంహతుల ఫాలతలంబును సోక, దైత్యుడున్
తేజముఁదప్పి మూర్ఛిలగ దేవగణంబులు గంతులేయగన్

483. కం. వెస మూర్ఛఁ దేఱి మరలన్
విసుమానంబొప్ప దంతి విధమును విడి య
య్యసురుడు శరభాకృతితో
విసురునఁజనుఁదెంచె మిగుల భీకరవృత్తిన్

484. కం. ఎనిమిది పాదమ్ములతో
ఘన వటవృక్షంబుఁబోలె కలయఁదిరుగుచున్
తన కభిముఖమై వచ్చెడి
దనుజుని గని దేవి క్రోధ తామ్రాక్షియునై

485. కం. తన యర్ధచంద్ర కాండము
లెనిమిదిఁగొని యొక్కసారి హెచ్చిన వేగం
బున నేయగ నాదనుజుని
యెనిమిది కాళులు తెగిపడె నిలపై నొకటన్

486. కం. కాళులు తెగిపడ మహిషుడు
నీలాచల మట్లు కూలి నేలcబడగ న
య్యాలమున నిలువcజాలక
తూలుచు పరువిడిరి భయము తోడన్ దనుజుల్

487. వ. అంత నామహిషుండు

488. సీ. శరభాకృతిని వీడి సహజ సిద్ధంబైన
మహిష రూపముcదాల్చి బహు విధముల
వాలమున్ద్రిప్పుచు వాడి కొమ్ముల తోడ
దివిజులcc గ్రుమ్ముచు దిక్కులదర
అంకెలు వేయుచు రణరంగ మెల్లను
కలయంగc దిరుగుచు కాళ్ళతోడ
నరిసైన్యములనెల్ల నణగంగcద్రొక్కుచు
సుంత వెన్కకు నేగి చూపుడించి

గీ. వాడి కొమ్ముల నిక్కించి పరుగుతోడ
శ్రీమహాదేవిc బొడువంగ సిద్ధమౌచు
బుసలు కొట్టుచు శీర్షమున్ విసరు కొనుచు
ముందు కరుదెంచె నడగొండ చందమొప్ప

489. కం. ఆతని గిట్టల తాకిడి
కాతతగతి నెగయు ధూళి యాకాశమునన్
భాతిగ పృథు మేఘమువలె
దైతేయుని వెన్క నమరె దట్టంబగుచున్

490. ఉ. భీకర రూపుడై మిగుల ప్రేలుచు వచ్చుచునున్న దానవున్
జేకొనc బోక దేవియును చిర్నగ వొల్కగ పల్కెనిట్టు లో
నాక విరోధి! నీ విటుల నన్నెదిరించుట కెన్నివేషముల్
వీcక ధరించి వచ్చితివి! పెక్కులికేటికి విన్ముతెల్పెదన్

491. చం. ఇదె తుదివేషమింక తడవింతయు నోర్వక యీక్షణంబె నీ
మద మడగింతు మన్నిశిత మార్గణ పంక్తుల, దేవతాళికిన్
ముద మొనరింతు, దానవుల పూర్ణముగా వధియించి యింకపై
వదలగc జేతు రాక్షసుల బాధలు సాధుజనాళి కెల్లెడన్

492. కం. అనిపలికి స్వర్ణపాత్రం
బునcగల ద్రాక్షాసవమును పుష్టిగ సేవిం
చెను గుటగుట నచ్చెరువుగ
వనరుహదళనేత్ర యపుడు భయదాకృతితో

493. మ. కనులన్ విప్పి మహోగ్రరూపమున నక్కంజాక్షి యద్దానవున్
ఘన కోపాగ్ని కణంబులుర్లcగనుచున్ ఖ్యాతిన్ త్రిశూలంపు కొ
మ్మున తత్ శృంగయుగమ్ము పై బొడువ సంభూతోగ్ర శబ్దంబుపై
కొన భిన్నంబులునై ధరన్ బడియె దిక్కుల్ మ్రోయ నాశృంగముల్

494. కం. ఆ దెబ్బకు గబ్బుసెడగ
మీదును క్రిందగుచు క్రిందు మీదులు నగుచున్
వేదనతో తల తిరుగగ
నాదనుజుడు పాఱె వెన్క కతి భీతుండై

495. చం. పరువిడు చున్న యమ్మహిషు భంగిమcగాంచిన లోకమాతయున్
తరుముచు వెంటనంటి మద దర్పితయైన గజంబు వెన్క దు
ర్భర తర సింహ మట్టుల, దివౌకసులంబర వీధిపుష్పముల్
గురియగ, దేవదుందుభుల ఘోషలెసంగ మునుల్ నుతింపగన్

496. ఆ.వె. తరిమి తరిమి తుదకు దానవు దరిcజేరి
వాహనమ్మునుండి వడిగ దుమికి
శూలమెత్తి పొడువ సొమ్మసిల్లుచు వేగ
నతడు తూలుచుండ నంబయపుడు

497. మ. తన నూరంచుల చక్రమున్ విసర నాదైత్యేంద్రు శీర్షమ్ము రి
వ్వన శబ్దించుచు దవ్వులన్ బడియె నంబాయంచు దైన్యస్థితిన్
ఘన శైలాకృతి తత్కళేబరము వేగన్ దిర్గుచున్ పృథ్విcగూ
లెను రక్తంబులు నిర్ఝరంబులుగ నోలిన్ ధారలై యొల్కగన్

498. కం. హతశేషులైన దైత్యులు
హతవిధి! యని యరచుకొంచు నన్నిదిశలకున్

మతులుసెడి పరువులెత్తిరి
గతియిక మనకెవ్వరనుచుఁగలగుచు నెదలన్

499. కం. వారలఁగని హర్యక్షము
వారించుచు నన్నిదిశల ప్రత్యక్షంబై
దూరము సననీక యపుడు
కోరిక భక్షించె దనుజ కోటుల నెల్లన్

500. చం. అలసట యింతలేక సమరావని వీడి ప్రసన్నరూపయై
నిలబడె నొక్కచో జనని నిర్మలమౌ దరహాసచంద్రికల్
నలుదెసలందు పర్వ మృగ నాధునిపై, పరికింప నెద్దియున్
తెలియని యట్టులాకసము దిక్కులు సూచుచునిశ్చలస్థితిన్

## బ్రహ్మాదులొనర్చిన దేవీస్తుతి

501. చం. అది గని కంజగర్భ దివిజాధిప ముఖ్యులు నమ్ర గాత్రులై
సదమల భక్తి నమ్మ పదసన్నిధికిన్ జని యోమహేశ్వరీ!
పదిలముగా త్రిమూర్తులు భవన్మహనీయ దురంత శక్తి సం
పదలను బొందకున్న తమబాధ్యతలన్ నెరవేర్ప దక్షులే!

502. కం. మతియును గతియును కీర్తియు
స్మృతియును కరుణయును పుష్టి మేధయు జయమున్
ధృతియును తుష్టియు కాంతియు
మతి పరికింపంగ నీవె మమతాహంత్రీ!

503. కం. కమలయు, గిరిజయు, వసుధయు
రమయును, విద్యయును, కళయు, శ్రద్ధయు, క్షమయున్,
ప్రమయును, నీహయు నుమయును
క్రమమున నిన్నియును నీవె కమల దళాక్షీ!

504. చం. ఎడపక భూరి భూవలయ మెల్ల సహస్ర ఫణాగ్ర సీమలం
దిడుకొని మోయు శక్తిని ఫణీంద్రునకున్, భువి నట్టునిట్టులన్
దడియక పట్టియుంచగల దక్షత దిగ్గజ పంక్తికెల్ల నీ
విడినవి కాక యన్యు లెవరీయ సమర్థులు కామదాయినీ!





505. చం. నిను గణియించ కన్యులను నెమ్మి భజించెడి వారు మూఢులే
యనదగు సర్వదేవతల కాదిమశక్తివి నీవయౌదు వో
వనరుహ నేత్ర! యజ్ఞమది భక్తినొనర్చిన నీదు యజ్ఞమే
యొనరుచుటొప్పు యన్యముల నొప్పి యొనర్చెడి వార లజ్ఞులౌ

506. చం. దయకు నిధాన మీవ, సమతన్ పరిపోషణసేతు వెల్లరన్
నియమముతోడ నోజనని! నీదగు నంశయె సృష్టియెల్ల, దు
ర్నయులగు దైత్యులన్ దునిమి నాకసుఖమ్ముల వారికిచ్చుచున్
జయమును దేవతాళి కిడి సర్వుల బ్రోచెద వెంత చోద్యమో!

507. కం. ఘనమగు నీ సంకల్పమె
దనుజుల పరిమార్పఁగలదు తత్క్షణమున, నై
నను వారలఁజంపుట కి
ట్లొనరగ రూపములు దాల్చు టొక చిత్రంబౌ!

508. కం. హరిహర పంకజగర్భులు
హరిహయుదును దివిజులెల్ల రమ్మా! నీచే
పరిపాలితు లనెడి విషయ
మరయక మముఁగొల్తురెంత యజ్ఞులు మనుజుల్

509. కం. అరయగ విద్యావిద్యలు
వరుసన్ సుఖ దుఃఖ భోగ భాగ్యములెల్లన్
పరదేవీ! నీవేకద
పరమార్థము కొఱకు నిన్ను భజియింపవలెన్

510. కం. ఇతరులగు దేవతల నిల
సతతము పూజింత్రు భోగ సంపదలకునై
మతిలేని మూఢ మనుజులు
గతినీవే భుక్తికైనఁగడ ముక్తికి నేన్

511. ఉ. నీ పద పంకజ ద్వయ వినిర్మల ధూళి తలన్ ధరించి వా
ణీపతి శౌరి శంకరులు నిష్ఠ నొనర్తురు వారి కార్యముల్
శ్రీపరమేశ్వరీ! యిదియు చేతములన్ దలపోయ కెన్నడున్
నీపయి భక్తి నిల్పరవనిన్ జనులెంత విమూఢ చిత్తులో

512. కం. దేవత లైనను నిను వా
గ్దేవిని భజియింపకున్న తిరముగ మాటల్
భావించి పలుకలేరన
దేవీ! మానవులమాట తెల్పగ నేలా!

513. చం. తపములు యజ్ఞ యాగములు ధ్యానములంచు శ్రమంబు లందుచున్
వ్యపగత శక్తులై సమయమంతయు పుత్తురుగాని యెన్నడేన్
విపుల వివేక చిత్తముల పేర్కొని మీ పదపద్మ యుగ్మమున్
నిపుణత లోఁ దలంప జననీ! తలపోయరు మూఢమానవుల్

514. కం. తత్త్వములవి చిద్విరహిత
సత్త్వములై సృష్టి చేయ, జడములగుటచే
తత్త్వమయీ! నీ చిన్మయ
తత్త్వంబది లేకయున్న దక్షములౌనే!

515. కం. మునివర్యులు యజ్ఞములం
దనల ముఖంబున నొసంగు నశనంబులఁదా
మనయము దేవత లొద్దికఁ
గొనుటయు నీమంత్ర మహిమ గూడుటఁగాదే

516. చం. ఇపుడు మహోగ్రుడైన దనుజేంద్రుని యీ మహిషున్ వధించి మా
కుపకృతి నీవొనర్చితివి యొప్పుగ, సర్వజగంబులున్ భవత్
కృపవలనన్ మనన్గలిగె ఖేదములన్ విడి, నీదు తత్త్వమున్
విపులముగా గ్రహింప గల విజ్ఞులమే నిను సన్నుతింపగన్

517. కం. నిరత మ్మీలాగుననే
కరుణన్ మముఁబ్రోవుమమ్మ! కంజదళాక్షీ!
పరపద నిశ్రేణులు నీ
చరణమ్ముల నంటి భక్తి సల్పుదు మెపుడున్

518. కం. వినయముతో నివ్విధమున
వనజాసను డాదిగా సుపర్వులు భక్తిన్
తననెంతయుఁగీర్తింపగ
జననియు ముదమంది యిట్లు సంభాషించెన్





519. చం. అమర వరేణ్యులార! తమ కాపదలెప్పుడు సంభవించినన్
శ్రమయని యెంచనెన్నడును సంతసమొప్పగ వచ్చి తీర్తు, తత్
సమయములందు నన్ను మనసార తలంపుడు చాలు పొండికన్
తమ తమ స్వస్థలమ్ములకు ధర్మము తప్పక సంచరింపుడీ!

520. చం. అని వచియించు నట్టి జగదంబను గాంచి ముదంబుఁబొంది య
వ్వనరుహసంభవాది సురవర్యులు వల్కిరి యోమహేశ్వరీ!
పనివడి నప్డుగాక యెడబాయక త్వత్పద పంకజమ్ములన్
మనముల నిల్పి కొల్చు పరమంబగు భక్తిని మాకొసంగుమా!

521. తే.గీ. సుఖము లందైన దుఃఖముల్ చుట్టుకొనిన
నన్యు లెవరును లేరు మాకంద తల్లి!
అన్నివేళల నీవె మమ్మండఁ జేర్చి
రక్షణము సేయదగు ననురాగ మొదవ

522. కం. అమరు లిటుల వేడుకొనగ
విమలాంతఃకరణయగుచు ప్రియ మారంగన్
కమలాక్షి మందహాసం
బమరగఁజూచుచు నదృశ్యమై చనె నంతన్

523. వ. వేదవ్యాసుడు తెలిపిన యీవృత్తాంతం బెల్ల సావధాన చిత్తుండై
వినుచున్న జనమేజయుండు కడుముదంబంది మరల నిట్లడిగె నని
సూతుండు శౌనకాది మహర్షులకుం జెప్పె.

524. చం. మునికుల భూషణా! మిగుల మోదముఁ గూర్చె భవన్ముఖాబ్జ సం
జనిత కథా సుధారసము చక్కగ గ్రోలుచునుండ, నందులో
నొనరగ లోకమాత మహిమోన్నతి నొప్పెడి వృత్తముల్ వినన్
దనియునె నెమ్మనంబు సతతంబు వినంగ కుతూహలంబగున్

525. కం. ఆ దేవి చనిన పిమ్మట
నా దేవత లేమి చేసి రానందమునన్
శ్రీదేవియు నెట కరిగెను
మోదంబున తెలుపుమయ్య మునిజన వంద్యా!

526. వ. అనియడిగిన జనమేజయుంజూచి వ్యాసుం డిట్లనియె

527. సీ. క్షితినాథ! మునునీకు చెప్పియుంటిని గదా!
క్షీర సాగర మందు చెలువు మీర
నెలకొని యున్న మణిద్వీప మునతాను
విహరించు చుందు సంప్రీతి తోడ
శ్రీదేవి యనుచును, శ్రీపతి నలువయు
శంకరు లటకేగి జననిఁగాంచి
స్త్రీరూపములఁదాల్చి దేవిని పూజించి
పురుషరూపములను పొంది మరల

గీ. తమతమ నెలవులకు వచ్చి తగినరీతి
వారి కర్తవ్యముల యందుఁ జేరి యుందు
రనుచును దెలిపితి, నిపుడయ్యంబ యటకు
జేరి విహరించుచుందు నవారితముగ

## శత్రుఘ్నునిపాలన

528. కం. జనని యదృశ్యంబై చన
ననిమిషులును సంతసించి యవనీపతిగా
నినకుల సంభవు శత్రు
ఘ్నుని యోగ్యుని నిలిపి చనిరి కూరిమితోడన్

529. సీ. నెలమూడు వర్షముల్ నియతిఁగురియుచుండ
పుడమి పండుచు నుండె పుష్కలముగ
పాదపమ్ములు లతల్ ఫల పుష్ప ములతోడ
కళకళ లాడుచుఁగానుపించె
గోవులు నిరతమ్ము కుండల నిండుగా
క్షీరమ్ము లిడుచుండె చిత్ర గతిని
వాహినుల్ నిండుగా వరద లెఱుంగక
ప్రవహించుచుండె నిరంతరమ్ము

గీ. బాధ లెఱుగక ప్రజలెల్ల పరమ శాంతి
గలిగి వర్తిలు చుండి రక్కాలమందు





ధర్మపరుడైన శత్రుఘ్ను డోర్మి తోడ
పాలనము సేయుచుండంగ పౌరవేంద్ర!

530. తే.గీ. పంచ భూతము లన్యోన్య భావములను
సహకరించుచు నుండె నా సార్వభౌము
పాలనమునందు, ప్రజలెల్ల పరమభక్తి
యుక్తులై వర్తిలుచునుందు రున్నతముగ

531. తే.గీ. వేద వేదాంగ విదులైన విప్రవరులు
యజ్ఞ యాగాది క్రతువుల ననవరతము
పుచ్చుచుందురు కాలమ్ము పొచ్చెమింత
యెఱుగ బోవక నాపతి యేలు చుండ

532. ఉ. చోరులు జారు లెచ్చటను సూచనకైనను లేరు, పాపసం
చారులు గానరారెట, నసత్యము లాడుటలేదు, దుఃఖముల్
గూరవు, పైశునంబులును గూడవు, ధర్మము తప్పఁబోక యా
భూరమణుండు రాజ్యమును పొల్పుగ నేలుచునుండ నయ్యెడన్

533. ఆ.వె. వేదవేత్తలైన విప్రవరేణ్యులు
త్రిగుణములను బట్టి త్రివిధములుగ
మెలగుచుందు రచట మెల్పున భూపతి
మేలు గోరి యెల్ల కాలమందు

534. సీ. అప్రతి గ్రహమును నధ్యయనంబును
దయయు ధర్మము శాంతి దాంతిగలిగి
పశువధ లేనట్టి పరమ సాత్విక యజ్ఞ
సత్క్రియా శీలురు సాత్వికులన,
షట్కర్మ నిరతులై క్షత్రియులకు పురో
హితులౌచు వస్తు సంతతుల గొనుచు
విధి విధానమ్మున వివిధ కృత్యములను
జరిపించు వారి రాజసు లనంగ

గీ. లోన రాగమ్ము ద్వేషమ్ము లోభ మోహ
కామ మాదిగ శత్రు వర్గముల విడక

వేద మొక కొంత నేర్చి జీవించు వారి
తామసులని యందురు త్రివిధముల బుధులు

535. తే.గీ. వర్ణ ధర్మాను సరణులై వైశ్యశూద్రు
లమిత ధనవంతులయ్యు నహంకరింప
కనుదినమ్మును శ్రీదేవి నతుల భక్తి
నర్చనలు సేయు చుందు రయ్యవని జనులు

## శుంభ నిశుంభుల వృత్తాంతము

536. కం. మహిషుని పాలనలో దు
స్సహమగు కష్టములు వడిన జనులెల్లరు న
మ్మహిషాసుర మర్దని దయ
విహిత సుఖమ్ములను బొంది వెలయుదు రచటన్

537. చం. కల రొక కాలమందు మును కాశ్యపి శుంభ నిశుంభు లన్న దై
త్యులు, కడు సుందరాకృతులు, దుర్జయులయ్యును వారలిర్వురున్
నలువను గూర్చి పుష్కరము నన్ దపమెంతయు నిగ్రహాత్ములై
సలిపి రనేక వర్షములు సర్వ సుఖంబులు వీడి నిష్ఠగన్

538. కం. వారల తపముల కెంతయు
వారిజ సంభవుడు మెచ్చి ప్రత్యక్షంబై
మీరిక మానుడు తపముల
కోరుడు వరమేదియైనఁ గూరిమి నిత్తున్

539. చం. అని కడుఁబ్రీతిఁబల్కు చతురానను పల్కుల నాలకించి యా
దనుజులు కన్నులన్ దెరచి తద్దయు భక్తి ప్రదక్షిణించి య
వ్వనజజు పాదపద్మములఁబట్టి వినమ్రత మ్రొక్కి లేచి తా
మొనర నుతించి కోరిరిటు లొయ్యన నొక్కవరమ్ము నిమ్మగన్

540. కం. వనజాసన! మాతపముల
కనుమోదము గలిగెనేని యమరత్వంబున్
కనికరమున మాకొసగుము
కన మృత్యువుకంటె భయము కలదే యెందున్





541. శా. ఈ యభ్యర్థన కా సరోజభవు డెంతే నక్కజంబంది, మీ
కీయూహల్ గలుగంగనౌనె? యిటులే నీయంగఁ జాలన్ వరం
బోయీదానవులార! పుట్టినయతం డొక్కప్డు దేదోగతిన్
బాయంగావలె దేహమున్ ధ్రువము తప్పన్ బోల దెవ్వారికిన్

542. కం. ఇది విశ్వకర్త నియమము
పదిలము తొలియుగమునుండి వచ్చుచు నుండెన్
వదలుడు మీరీ కోరిక
నెదియే నితరంబుఁ గోరు డిచ్చెదఁ బ్రీతిన్

543. కం. అని వనజాసను డన నా
దనుజులు యోచించి సుంత తడవైనంతన్
మనముల నిశ్చయ మొక్కటి
గనుఁగొని యిట్లనిరి కంజ గర్భుని తోడన్

544. చ. అమరుల మర్త్యులన్ పురుషు, లండజముల్, పశువుల్ మృగమ్ములున్
సమర మునందెదిర్చి మముఁ జంపగ జాలని యట్టులిమ్ము మా
కమరవరేణ్య! యొక్కవర మంతియ చాలిక, పువ్వు బోండ్లు మా
సముఖము నందు నిల్చుటకుఁ జాలరు వారికి జంకమెన్నడున్

545. వ. అని వేడిన

546. చం. కమలజు డట్టులే యగును గాక! యటంచు మరాళమెక్కి వే
గమె చనె, నంత దానవులు గ్రన్న రసాతల మేగి యచ్చటన్
తమ గురువర్యుడౌ భృగు పదంబుల కున్ బ్రణమిల్లి యంతయున్
గ్రమమునఁ జెప్ప నాతడు ముఖంబున చిర్నగ వంకురింపగన్

547. ఉ. భాసుర తేజు డమ్మునియు వారికి దీవనలిచ్చి స్వర్ణ సిం
హాసనమొండు నేర్పరచి యగ్రజు శుంభుని నందునుంచి తా
వాసిగ నెల్లరన్ బిలిచి పట్టముగట్టెను, దానవుల్ మహో
ల్లాసముతో సమైక్యత చెలంగగ సమ్మతిఁ దెల్పి యాడగన్

548. తే.గీ. సకల దానవ సామ్రాజ్య సార్వభౌము
శుంభుఁ గనవచ్చి దానవ శూరులెల్ల

రతని పక్షాన యుద్ధమ్ములందు నిల్చి
పోర నిశ్శంకఁ బ్రతినలు పూనిరధిప!

549. ఉ. వీరు లపూర్వ సోదరులు భీకర రూపులు చండముండులున్
దారుణ విక్రమోన్నతుడు దైత్య వరుండగు ధూమ్రనేత్రుడున్
దూరిత శాస్త్ర వోద్ధతుడు దోర్బలయుక్తుడు రక్త బీజుడున్
దోరపు సైన్య సంఘములతో జను దెంచిరి వాని కండగన్

550. మ. రణరంగంబున రక్త బీజునకు గాయం బైన తద్రక్తపున్
గణముల్ ధారుణి నెన్ని రాలి పడునో క్రవ్యాదు లాసంఖ్యలో
గణనీయంబుగ నట్టి రూపములతో గర్వోన్నతిన్ బుట్టి తత్
గుణ శౌర్యంబుల నొప్పి పోరుదు రనిన్ గ్రూరాత్ములై భూవరా!

551. ఉ. ఇందరి యండతోడ భువినెల్ల వశంబొనరించి యేలుచున్
పొందుగ స్వర్గమున్ గెలువఁ బూని నిశుంభుడు సేనతోడ తా
ముందుగ స్వర్గమేగి రణమున్ బ్రకటింపగ వజ్రపాణి యా
చందమెఱింగి దిక్పతులు సాయమురాఁ జనె యుద్ధభూమికిన్

552. మ. ఇరు పక్షమ్ముల వారి కయ్యెడల నయ్యెన్ ఘోర సంగ్రామ మ
త్తరి నింద్రుండతి క్రుద్ధుడై పవిని చేతన్ బూని వేగోద్ధతిన్
సరిగా దైత్యుని పెన్నురంబుఁ దగులన్ సారింప, సైరింపలే,
కరదంబందు నిశుంభు డొయ్య నొరిగెన్ వ్యావృత్త దేహుండునై

553. తే.గీ. ఆ నిశుంభుడు మూర్ఛిల్లె ననెడి వార్త
తెలిసి నంతనె శుంభుడు తీవ్ర కోప
సంభ్రమిత చిత్తుడై వచ్చె చండభాను
పగిది దివిజ వరులకు విభ్రాంతి గలుగ

554. ఉ. వచ్చిన యంతనే యత డవారణమౌ శరవర్ష ధారలన్
హెచ్చుగ గుర్వ, దేవతలు, నెల్లదిగీశులు, దేవనాధుడున్
చెచ్చెర నోడి పర్విడిరి, సింహము గర్జిల భీతిఁజెందుచున్
విచ్చి వనంబునందు పరువెత్తెడి తక్కు మృగంబు లోయనన్





555. తే.గీ. అంత శుంభుడు విజయ గర్వాతిశయము
హెచ్చ వికటాట్ట హాసంబు లెసఁగ నేగి
దివిజనాధుని పీఠమం దవిరళగతి
నెక్కి కూర్చొని నాకలోకేశుడయ్యె

556. తే.గీ. కామధేనువుఁ గల్పవృక్షముల మఱియు
నందనమ్మును తన యధీనములఁజేసి
యమృతపానమ్ము సేయుచు నప్సరసలఁ
గూడి విహరించు చుండెను కొమరుమిగుల

557. కం. హతశేషులైన దివిజులు
వెతలఁ బడుచు నడవులందు బిక్కుమనుచు సం
తతమును తరుమూలమ్ముల
వితత గిరి గుహాంతరముల విడిసిరి జడిమన్

558. సీ. నందనోద్యానమ్ము నందెప్డు విహరించు
దివిజు లడవులందు తిరుగ వలసె
రంభాదులను పరిరంభమ్ము లొనరించు
నమరు లాతప బాధలంద వలసె
అమృత పానంబున నాశ్వాసమును బొందు
సురలు ఝురులచెంత కరుగ వలసె
యజ్ఞభాగమ్ముల నాహరించెడు నట్టి
దేవతల్ వన్యముల్ దినగ వలసె

గీ. అకట! దైవయోగమ్ము బ్రహ్మాదులైన
యెఱుఁగఁజాలరు, జగములం దెవరి కెపుడు
కష్టసుఖములు కలుగునో కాన వశమె
అమరులకు నైన మనుజుల కైనఁగాని

559. ఉ. భూపతి బంటగున్, భటుడు భూపతియౌ నొకకాలమందు, తా
నేపగు వీరు డొక్కయెడ హీన బలుండగు, హీను దుగ్రుడౌ,
రూపగు దాత యొక్కపరి రూఢిగ యాచకుడౌను, యాచకుం
డాపయి దాత యౌను మది నారయ దైవగతుల్ విచిత్రముల్

## దేవీ ప్రసన్నత

560. కం. అడవులలో నచట నచట
యెడమై తిరుగాడుచున్న యెల్ల దివిజులున్
గడపటి కొక వెయ్యేండ్లకు
నొడగూడిరి యంతనంత నొకచో నెటులో

561. ఉ. అందరు నొక్కటై చని బృహస్పతికిన్ దగ మ్రొక్కి నిల్చి ని
స్పందిత చిత్తులౌచు గురువర్య! దివంబును నాక్రమించి మ
మ్మందరఁ బారద్రోలెను మదాంధుడు శుంభుడు, మాకు పూర్వపున్
చందము గల్గు మార్గమది చయ్యనఁదెల్పి యనుగ్రహింపుమా!

562. తే.గీ. వాంఛితార్థమ్ములన్ దీర్చు పరమమైన
యజ్ఞ యాగాలు జరిపింపు మయ్య! వేగ
వేదమంత్రమ్ము లవియెల్ల విస్తృతముగ
ఫలము లందించు నని యంద్రు ప్రాజ్ఞులెల్ల

563. కం. సురపతి యాదిగ దేవత
లరమర యొకయింత లేక యట్లడుగుట కా
సురగురువు బృహస్పతియును
దరహాసము చేసి పల్కె తా నీరీతిన్

564. ఉ. దేవతలార! మంత్రములు దివ్యములే యగుఁగాని వానికిన్
లేవు స్వతంత్ర శక్తులు, నిలింపులు మీరలె మంత్రదేవతల్
గావున మీర లీయవలెఁగాదె ఫలంబులు దేనికైన మీ
రీవిధి కష్టముల్ బడితి రేమి యొనర్తును నేను మాత్రమున్

565. తే.గీ. జరుగ వలసిన దెద్దియో జరుగఁగలదు
అనుభవించుటె కర్తవ్య మమరులార!
కష్టముల కంత్యకాలము కలదు, నేడు
గాక యున్నను నొకనాటి కైన నిజము

566. కం. దైవము బలీయ మైనను
కావలయుఁ బ్రయత్నమొండు కాకుండినచో





కేవలము దైవమొకటే
భావింపగఁజాలదయ్య ఫలితములీయన్

567. చం. ముని మహిషుండు మిమ్ములను పోర జయించి దివంబునెల్ల తా
ననయము నేలుచుండ జగదంబ మహేశ్వరి వాని సంహరిం
చెనుగద! జ్ఞప్తిలేదొకొ? ప్రసిద్ధిగ మీనుతు లాలకించి తా
ననిన మృదూక్తులన్ మనములందుఁదలంపుడు కల్గు సౌఖ్యముల్

568. తే.గీ. ఆపదలు కలిగిన సమయమ్ములందు
నన్ను తలచిన యెడల నేఁగ్రన్నవచ్చి
మీదు కష్టమ్ములను దీర్చి పోదుననుచు
నభయమొసగెను గాదె అయ్యంబయపుడు

569. ఉ. కావున మీరలెల్లరు నెకాయెకి నాతుహినాద్రిఁ జేరి స
ద్భావములన్ మహేశ్వరిని పాయని భక్తి నుతింపు డింపుగన్
దేవి ప్రసన్నమౌను భవదీయ మనోవ్యథ లెల్లఁబాపు నో
దేవతలార! పొందు కడతేరును గావుత! మీదు కష్టముల్

570. చం. గురు వచనంబులన్ విని యకుంఠిత భక్తి హిమాద్రిఁజేరి యా
సుర వరు లెల్లరున్ గడు విశుద్ధ మనంబులతో మహేశ్వరిన్
స్థిరముగ సన్నుతించిరి విధేయులునై నిగమోక్త సూక్తులన్
పరమ దయాప్రపూర్ణను శుభంకరి నాద్యను నివ్విధంబునన్

571. శా. తల్లీ! భవ్యములైన తావక మహత్తత్త్వార్థ నామమ్ములున్,
కొల్లల్ కొల్లలు నీ స్వరూపములు మాకున్ సాధ్యమే యెంచగన్
తెల్లంబౌనటు చెప్పజాలవు నినున్ దివ్యంబు లౌవేదముల్,
చెల్లున్ నీకె త్వదున్నతిన్ దెలుపగా శ్రీరాజరాజేశ్వరీ!

572. చం. దివిజులఁబ్రోవ నెప్పు డెటు దీక్షవహించి సముద్భవింతువో
యెవరిని యెట్లు ద్రుంచెదవొ యేపని నెట్టుల చక్కఁబెట్టెదో
యెవరికి సాధ్యమౌ తెలియ, నేమని నిన్ను నుతింతు మింక నో
ప్రవిమల గాత్రి! దేవతలపట్ల భవత్కృప యెంత గొప్పదో

573. శా. నీవే తల్లివి మాకు, మమ్ము సుతులం దీవించి పోషించుటల్
నీవంతేగద! నీవుకాదనిన మన్నింపంగ మాకెయ్యెడన్

దేవీ! లేరిక దక్షులెవ్వరును సందేహింపకమ్మా! దయన్
రావే యీశ్వరి! దీనులైన మము సంరక్షింపవే శాంకరీ!

574. చం. నిను జగదేకమాతను గణించి యుపాసన చేయకున్న "స
న్మునులము యోగివర్యులము ముక్తుల" మంచు వచించు వారికిన్
జనముల చేత పూజలను చక్కగఁ బొందెడి భాగ్యమబ్బునే!
జనని! తదున్నతత్వము నిజంబుగ త్వత్కరుణా కటాక్షమే!

575. శా. నీయంశన్ విలసిల్లు లక్ష్మి కెపుడున్ నీరేజనాభుండు ప్రే
మాయత్తుం డయి లత్తుకల్ పదములన్ హత్తించు, నీశానుడో
డాయన్‌జేరి వహించుచుండుఁగద నిష్ఠన్ దాపసశ్రేణికిన్
ధ్యేయంబైన యుమా పదాబ్జ రజమున్ దీపింప శీర్షంబునన్

576. చం. హరి హర పంకజాసను లహర్నిశమున్ గడు భక్తితోడ నీ
చరణ సరోజయుగ్మమును సమ్మతితో భజియించుచుండ, దు
శ్చరితులు నల్పబుద్ధులు విచారణ సేయరు నీమహత్వమున్
నిరతము భోగ భాగ్యముల నెమ్మిభజింతురు వంచితాత్ములై

577. కం. నిను భజియించని వారల
కనయము రోగములు గాక యబ్బునె సుఖముల్
మును జన్మల నినుగొలువని
మనుజులెపో నేడు దుఃఖమగ్నులు తల్లీ!

578. కం. ఈ విధమున నమరవరులు
భావించి నుతించుచుండ పరమప్రీతిన్
దేవియు ప్రత్యక్షంబై
దేవతలను గాంచి యిట్లు తిన్నగ పలికెన్

579. చం. అమరపురమ్ము వీడి యిటు లాత్రుతరాఁగతమేమి యింతగా
గమికొని నన్ను మీరలతి కంపితచిత్తములన్ నుతింప దు
ర్గమమగు నెట్టి కష్టములు గల్గెను వేగమె నాకుదెల్పుడీ
యమర వరేణ్యులారా! క్షణమాగక మీవెతలెల్లఁదీర్చెదన్

580. చం. అమృత సమాన వాక్కులిటు లంబ వచింప సురాళి యెల్ల సం
క్రమిత మనఃప్రమోదముల గౌరవమొప్పగ తల్లిఁగాంచి యో





సుమధుర భాషిణీ! అదితి సూనుల మౌ మము రాక్షసాధముల్
క్రమమున దుష్టకృత్యములఁగాఱియవెట్టుచు నుందు రెప్పుడున్

581. చం. అతిబలవంతులున్ మఱియు నబ్జజదత్త వరప్రమత్తులున్
వితతమహోగ్ర రూపులును వీరులు శుంభ నిశుంభు లిర్వురున్
ప్రతిహత యజ్ఞకర్ములయి స్వర్గమునెల్లను నాక్రమింప దు
ర్గతి వనసీమలందెటులొ కాలము పుచ్చితి మమ్మ నెట్టనన్

582. ఉ. చందుడు ముండుడున్ మఱియు శాత్రవ భీముడు రక్తబీజుడున్
దండిపరాక్రమోన్నతులు తక్కిన రాక్షస వీరులెల్ల తా
మండగ వచ్చి శుంభుని ప్రయత్నములన్ దగ ప్రోత్సహించుచున్
చండ తరోరు కృత్యముల సల్పిరి మాయెడ నిత్యమంగళా!

583. ఉ. ఇన్నియు నన్నిగావు జననీ! వివరింపగ వారిదౌష్ట్యముల్
విన్నప మాలకించి మము వేగమెబ్రోవుము నీవెఱుంగవే
యిన్నియు, జాలమేల యిక నీశ్వరి! యీత్రిజగంబులందు మా
కెన్నగ నీవుతప్ప మఱియెవ్వరులేరు సముద్ధరింపగన్

## కౌశికీ కాళికల ఆవిర్భావము

584. వ. అనియిట్లు దీనులై ప్రార్థించు దేవతలంగని
యాజగన్మాత కరుణాతరంగితయై యిట్లుపలికె

585. చం. తునిమెద నెల్ల దానవుల, తోరపు భీతిని వీడుడింక మి
మ్మనయముఁబ్రోతునంచు జగదంబ వచించుచు తత్‌క్షణంబునం
దొనరగ నాత్మదేహమున నుండి సృజించె మరొక్క సుందరిన్
వనజ దళేక్షణన్ దివిజ వర్యులు మిక్కిలి యక్కజంపడన్

586. కంద. ఆమెను కౌశికియను శుభ
నామంబున పలువిధముల నాకగణంబుల్
శ్రీమహితంబుగఁ బాడుచు
భూమీశా! యాడిరపుడు పొలుపొందంగన్

587. ఉ. అంతట గౌరి మోదమున నాత్మ శరీరపు రంగు మార్చి బల్
వింతగ నంజనమ్ము వలె పెల్లగు నల్లని కాంతి తోడ తా

నెంతయు నొప్పె సుంత చలియించినచో మసిరాలునన్న వి
భ్రాంతి జనింప నయ్యెడ దివౌకసు లక్కజమంది చూడగన్

588. ఆ.వె. కాళరాత్రి వంటి కాయమ్ముతో నొప్పు
నామెఁగాంచి కాళికాంబ యనుచు
నుతులు సలిపి రమరు లతి సంతసముతోడ
కష్టగతులు తప్పఁగలవటంచు

589. ఉ. కౌశికి యంత దేవతలఁగాంచి దరస్మితయై దయా పయో
రాశియనంగ నొప్పుచుఁదిరంబుగ నిట్లనె దివ్యులార! మీ
క్లేశము లెల్లఁదీఱునిక కీటడగించెద దైత్యవీరులన్
లేశము నైన భీతిలక లెండిక చూడుడు వారి దుస్థితుల్

590. చం. అని తన సింహవాహనమునం దధిరోహణ చేసి పార్శ్వమం
దెనయగ కాళికాంబయును నెక్క సరాసరి శుంభుపట్టణం
బున దిగి రొక్కచోట నవపుల్ల లతాంత పరీమళమ్ములన్
మనముల కింపుగొల్పు వనమధ్యమునన్ గడు సంతసమ్మునన్

591. చం. దిగి యపుడా జగజ్జనని తిన్నగ కంఠము నెత్తిపాడె న
త్యగణిత లీల ముజ్జగము లచ్చెరువంద, పికాళి సిగ్గునన్
మొగములు డించ, లేళ్ళు తమ మోరలనెత్త, పణీంద్రులాడ, శ్రో
తగ తనసమ్ముఖంబున ముదమ్మున కాళిక యొప్పుచుండగన్

592. ఉ. ఆ సమయమ్మునన్ వన విహారము సల్పగనెంచి చండముం
డాసురు లిర్వురున్ గలసి యచ్చటకున్ జనుదెంచి కౌశికిన్
భాసిత దివ్యగాన పరిభావిత సర్వ సుపర్వలోకమున్
వాసిగఁగాంచి ముగ్ధులయి పర్వున నేగిరి శుంభు నొద్దకున్

593. చం. చని తమ యుత్తమాంగముల సమ్మతి వంచి నమస్కరించి య
ద్దనుజులు శుంభుతోననిరి దానవనాథ! హిమాద్రి నుండి వ
చ్చె నొకలతాంగి యియ్యెడకు చెల్వమునన్ దులదూగ రెవ్వ రా
వనితకు మూడు లోకముల బ్రహ్మయొనర్చిన సృష్టియందెటన్

594. ఉ. ఆయమ యంద చందముల కన్వయమౌనటు గానసంపదల్
ప్రేయముఁగూర్చుచుండె, కడువిస్మయమందుచు జంతుజాలముల్





బాయక మేతలన్ వదలి ప్రక్కననిల్చె తదీయగాన సం
ధాయక చిత్తముల్ గలిగి దానవనాథ! విచిత్ర రీతులన్

595. ఉ. ఆవిడ యెవ్వరో తెలియ దైనను నీసరి జోడటంచు మా
భావములందుఁదోచె నల భామినిఁబోలెడి సుందరాంగులన్
నీవిక పొందనేర వది నిక్కము కావున దాన వేంద్ర! యిం
కేవిధమైన సంశయము లేర్పడనీయక యుద్యమింపుమా!

596. మ. బలవంతంబున సంగ్రహించితివి దివ్యంబైన వెన్నో మహో
జ్జ్వలమై యొప్పెడి వస్తుజాలములు; నాచందంబునన్ నిన్ను నీ
లలనారత్నము మెచ్చకుండినను నేలాసంశయం బెట్టులేన్
బలవంతంబున నైన తెమ్మదియె సంభావ్యంబు నీ కీర్తికిన్

## సుగ్రీవ దౌత్యము - కౌశికీ సందేశము

597. ఉ. ఈవిధిఁజండ ముండు లపు డెంతయు మంజుల వాక్యసంపదన్
దేవిని గూర్చి తెల్పగ మదిన్ గడు సంతసమంది శుంభుడున్
భావమునన్ దదంగనను పల్మరు మెచ్చుచు తత్క్షణంబ సు
గ్రీవునిఁబిల్చెస్నేహితుని క్రేవల నుండుటఁగాంచి సంజ్ఞచే

598. చం. పిలిచిన యంతనే యతడు ప్రేమ దలిర్పగ చెంతఁజేర నా
చెలిఁగని యోయి నీ విపుడె శీఘ్రమె యయ్యలివేణిఁజేరి నీ
పలుకుల నేర్పునన్ దగిన పద్ధతితో తరుణీలలామ నన్
వలచెడు నట్లు సేయుము శుభం బొనరింపుము నాకు నెట్టులేన్

599. చం. తరుణుల పట్ల భేదమును దండము నన్న యుపాయముల్ వృథల్,
జరుగవు కార్యముల్, గనుక సామము దానము నన్న మార్గముల్
నిరతము యోగ్యముల్ జలజనేత్రల నాత్మవశంబొనర్ప, నే
వెరవున చేయనేర్చెదవొ వేయును నేటికి చేయు మవ్విధిన్

600. కం. అన విని యాసుగ్రీవుడు
వనమునకుం జేరి సింహవాహనము పయిన్
దనరగ కూర్చొని యుండిన
వన జేక్షణఁగాంచి మిగుల భ్రాంతాత్ముండై

601. కం. దరికేగి తన శిరంబును
సరసిజముఖి పదయుగమ్ము చక్కగ సోకన్
ధరణిన్ సాష్టాంగపడుచు
నరమరికలు లేక పలికె నంబన్గనుచున్

602. మ. అరవిందానన! మావిభుం డమిత వీరాగ్రేసరుం డాతనిన్
స్మర సంకాశుని శుంభునిన్ వినవె? యాశానాథులన్ గెల్చి దు
ర్భర శౌర్యమ్మున ముజ్జగమ్ములను నిర్వక్రంబుగా నేలుచున్
సురభోగమ్ములఁ బొందుచుండు నెపుడున్ శోభాయమానమ్ముగా!

603. ఉ. ఆ దనుజేంద్రుడంప నిటు లబ్జదళేక్షణ! వచ్చినాడ, స
మ్మోదముతోడ నిన్నతడు పొందగఁగోరితపించుచుండె న
న్నాదులుమాని, తా మనసు నచ్చుగ నీపయి నిల్పియుండె, వే
రేదియునొల్లకుండె, వినుమీ తనమాటల నట్టె తెల్పెదన్

604. ఉ. "లోకములన్నియున్ క్షణములోన జయించితి, యజ్ఞభాగముల్
చేకొనుచుంటి, దివ్యుల ప్రసిద్ధములై యలరారు వస్తువుల్
వీఁక పరిగ్రహించితిని, వీరుడ నయ్యును నిట్లు దీనతన్
నీకయి వేడుచుంటి రమణీ! యిక నే భవదీయ దాసుడన్

605. చం. మదనుని బాణముల్ నను క్రమంబున నొంచుచునుండె నింక నో
సదమలగాత్రి! నీపనుపు సమ్మతిఁజేయుదు నన్వరించి స
మ్ముదమున నాకలోక సుఖముల్ గడు తృప్తిగఁబొందు మిచ్చమై
వదలకు మీయదృష్టమును భామిని! నన్ దయఁజూడు మింతటన్"

606. కం. అని మా ప్రభువగు శుంభుడు
వినిపించు మటన్నదెల్ల వినిపించితి నో
వనరుహనేత్రా! నీవే
మనెదవొ తెల్పుమిక నతని కది వినిపింతున్

607. వ. అని సుగ్రీవుడు శుంభుని పల్కులు యథాతథమ్ముగా వినిపింప
నంబిక చిఱునవ్వు నవ్వి యతనితో నిట్లనియె

608. కం. శుంభ నిశుంభుల మదసం
రంభుల నిరువుర నెఱుగుదు, రాక్షస విభు డా





శుంభుడు వీరుండటగద!
జృంభించి త్రిలోకములను చేకొనె నటగా!

609. కం. రూపమ్మున మన్మథుడట
కోపింపఁ ద్రిమూర్తులైన కూలుదురట యే
పాపము లెఱుగండట యు
ద్దీపిత సద్గుణ గణుడట ధీవరుడట గా!

610. ఉ. ఇన్ని యెఱింగి వానిఁగననెంచి రయంబున నిట్లు వచ్చితిన్
వన్నెగలట్టి రత్నము నిబద్ధిగ తా నపరంజి పొందుకై
గ్రన్నన వెళ్ళు చందమునఁకన్యను నేనును భర్త నారయన్
దిన్నగ నన్నిలోకములు దిర్గుచు నేటికి నిట్లు వచ్చితిన్

611. చం. దివిజుల నెల్లఁ జూచితిని, తేజముగల్గిన యక్ష కిన్నర
ప్రవరులఁజూచితిన్, దనుజ వర్యులఁగాంచితి, మానవాళిలో
ప్రవిమల బుద్ధిశాలురను పల్వురఁగాంచి, తదేమి చిత్రమో
యెవరును పెండ్లియాడ మదినెంచరు భీతిలు చుండి రెంతయున్

612. కం. ఇది యేమని యడిగినచో
నదిగో యాశుంభుడనగ నమితభయంబౌ
నిదియేటి పెండ్లి గొడవని
బెదురుచు పల్కుదురు మిగుల భీతావహులై

613. కం. దానన్ గ్రహియించితి మీ
దానవ నాథుని గుణ చరితంబులు పెక్కుల్
మానుగ నా సందేశము
వీనుల కెక్కంగ నిట్లు వినుచు మతనికిన్

614. శా. "ఓయీ దానవ వీర! నీబలము నీ యుత్కృష్ట సౌందర్యమున్,
నీయుత్సాహము, పాండితీ గరిమయున్ నీభోగభాగ్యంబులున్,
వేయేలా సకలం బెఱుంగుదును, సంప్రీతిన్ నినున్ జేరుటే
మా యీరాకకు కారణమ్మగును శుంభా! శౌర్యసంరంభకా!

615. ఉ. ఐనను బాల్యమందు చెలులందరు నా బల వీర్యసంపదల్
పూని నుతించు చుండఁగడుపొంగి ప్రతిజ్ఞనొనర్చి, తెల్లనన్

మానవ దేవ దైత్య కులమందను లెవ్వరు నన్‌జయింతురో
వానిని పెండ్లియాడుదు నవక్ర పరాక్రమునంచు వెట్టినై

616. ఉ. కావున దానవేంద్ర నను కయ్యమునందు జయించితేని స
ద్భావముతోడ నిన్నపుడ భర్తగఁగోరి వరింతు, పోరికిన్
నీవొకరుండ వేనియును నీయనుజన్ముని గూడియైన ర
మ్మేవిధమైన సమ్మతమె యేటికి పల్మరు రాయబారముల్”

617. కం. అని నామాటలుగా నా
దనుజేంద్రునకున్ దెలుపుము తడవింకేలా
నను రణమున కలియుమనుము
తనకున్ సమ్మతమె యైన దానవ దూతా!

618. కం. అనవిని సుగ్రీవుండును
మనమున నాశ్చర్యమంది మాఱాడక తాఁ
జని యున్న దున్నయట్టుల
వినిపించెను శుంభున కతి విస్తారముగన్

619. ఉ. ఆతని మాటలన్ వినినయంతనె శుంభుడు తీవ్రకోప సం
భూత వికంపితాంగుడయి భ్రూయుగ మల్లల నాడ ఖడ్గమున్
చేత ధరించి సోదరుని చెంతకుఁబిల్చి యనుంగు తమ్ముడా!
నాతి యొకర్తు సంగర మొనర్పగ రమ్మను టెంత వింతయో!

620. ఉ. యుద్ధమొనర్ప నీవుచనెదో! యటుఁగాదని యందువేని సం
సిద్ధుడ నౌదు నే నెదియొ చెప్పుము వేగమె యొక్కయింతి ద
ర్పోద్ధతి సైపఁజాలనని యుగ్రగతిన్ బలుకన్ నిశుంభుడున్
బద్ధకరాబ్జ సంఘటిత ఫాలతలుండయి పల్కె నివ్విధిన్

621. చం. అబలలతో రణంబదియు నర్మమె నీకును నాకునైన, న
య్యబల జయింపఁ బంపుమిదె యగ్రజ! వేగమె ధూమ్రలోచనున్
ప్రబల పరాక్రమోద్ధతుని పద్మదళేక్షణఁబట్టి తెచ్చు న
వ్విబుధులు భీతిలన్ దనుజ వీరులు పొంగగ నాత డెమ్మెయిన్

622. ఉ. తమ్ముని మాటలన్ వినిన దానవ నాధుడు సంతసించి సై
న్యమ్ముల మెండుగా గొని రయమ్మునవేగి సరోరుహాక్షిఁబ్రా





ణమ్ముల తోడఁబట్టుకొని నాకడకున్ గొని తెమ్ము నీవు శీ
ఘ్రమ్ముగ నంచుఁబంపె బలగర్వితు నప్పుడ ధూమ్రలోచనున్

## అంబికా ధూమ్రలోచన సంవాదము

623. ఉ. నావుడు ధూమ్రలోచనుడు నమ్రత తేనికి మ్రొక్కి దైత్య సై
న్యావలి వెంటరా నరిగి అంబుజ నేత్రనుఁగాంచె నొక్కచో
దేవిని లోకపావనిని దివ్యవనాంతర సీమయందు సం
భావితరీతి శ్రావ్యముగ పాడుచు కూర్చొని యున్న యంబికన్

624. తే.గీ. చూచి దనుజుండు మ్రొక్కి యోసుందరాంగి!
దానవాగ్రణి భుజబల దర్పితుండు
శుంభు డెంతయు తపియించు చున్నవాడు
నిన్ను పెండ్లాడఁ గోరి యన్నియును వదలి

625. ఉ. ఆతడు నీతి శాస్త్రవిదు డౌట నినున్ దెలియంగ ముందుగా
దూతను పంపెఁగాని కదు దోర్బలయుక్తి రణంబొనర్పగా
భీతి జనించి కాదు, నినుఁబ్రీతి వశంబొనరింప నెంచె, నీ
వాతని చేతమున్ మిగుల నద్భుత రీతి హరించి తెంతయున్,

626. ఉ. కావున యుద్ధమేమిటికి కాదన కింతట నైన నీవు తత్
భావమెఱింగి చేకొనుము వానిని, నీమృదు పాదతాడనన్
మావిభుచిత్త శోకమును మాన్పుము, మానుమునీప్రతిజ్ఞ, శ
స్త్రావలిఁ బూని పోరనొక యంగన నోర్చుట శౌర్యమెట్లగున్

627. వ. అనిపలుకు ధూమ్రలోచనుని పల్కుల కయ్యంబికాదేవి బదులు వల్కక మిన్నకుండె, కాళికాదేవి కల్పించుకొని యిట్లుపలికె

628. శా. ఓరీ జాల్ముడ! కట్టిపెట్టుమిక నీయున్మత్త వాచాటముల్
వీరానీకముతోడ వచ్చితివి, నీ వీరత్వమున్ జూపుమా
తీఱున్ బో యిక నీకు నీ విభునకున్ దేహంబులన్ బ్రాణముల్
మీరల్ మూర్ఖులు గోరగా తగునె నెమ్మిన్ సర్వలోకేశ్వరిన్

629. కం. నక్కను సింహిక కోరునె?
కుక్కుటమును హస్తి కోరుకొనునే జగతిన్?

రక్కసుని మీదు విభునిక
నెక్కరణిన్ గోరునయ్య యీశ్వరి తలపన్

630. చం. అనవిని ధూమ్రలోచను డహంకరణంబున నామెఁగాంచి యి
ట్లనియెను నో కురూపి! నినునంత మొనర్చి యనంతరంబ యీ
వనజదళాక్షి నంబికను బందిగ గైకొని మాదు ఱేనికిన్
ఘనమగు కాన్కగా నిడెదఁగల్లలు గావిక మంత్రయత్నముల్

631. కం. అని బాణాసన మెక్కిడి
ఘనమగు కాండములఁ బరపె కాళికపైనన్
దనుజుని శరముల నామెయు
తునియలు గావించె తనదు తూపులతోడన్

632. ఉ. అంతట మిన్నకుండక నిజాంబక పంక్తుల ధూమ్రలోచనున్
వింతగఁ గప్పి, తద్రథము భిన్నమొనర్చి, ఖరమ్ములన్ వడిన్
కుంతముతోడ ధాత్రిపయిఁ గూలిచి, సారథిఁద్రుంచివైచి, ది
గ్దంతులు భీతిలంగ ఘన గర్జనఁ జేసె భయంకరాకృతిన్

633. ఉ. ఆపయిఁగ్రోధ తామ్ర నయనాంబుజయై లయకాల మేఘమ
ట్లేపగు గర్జనల్ సలిపి యెల్లరు భీతిల తీక్ష్ణదృష్టి సం
తాపము లొక్కటన్ బరపి దారుణరీతిని ధూమ్రలోచనున్
రూపఱఁజేయ నాత డతి రోదనఁజెందుచు భస్మమై పడెన్

634. కం. భయమున రాక్షసు లెల్లరు
రయమున పర్విడిరి యార్త రవముల తోడన్
జయజయ నినదము లెసగగ
ప్రియమున సురగణము పుష్ప వృష్టిన్ గురిసెన్

635. చం. అసుర కళేబరమ్ములును, నామిషఖండము, లంగముల్ భువిన్
విసురుక పద్ద ప్రాంతముల వెక్కసమై రుధిరమ్ములెల్ల నల్
దెసలకు పారుచుండ నరుదెంచిన ఫేరవ కాక గృధ్రముల్
ముసరి చరించుచుండ రణ భూమి కనంబడె దుస్సహంబుగన్

636. కం. క్షతగాత్రులైన దైత్యులు
నతిరయమున శుంభుకడకు నరిగి విషయమున్
వెతలన్ గుందుచు తెలుపగ
ధృతిసెడి శుంభుడును మిగుల దీనత నుండన్

637. ఉ. దానవ నాథ! విన్ము కడుదర్పమునన్ మన ధూమ్రలోచనున్
దీనగతిన్ వధించె, కడతేర్చెను తక్కినసేన నెల్ల న
మ్మానిని కాళికాంబ, యనుమానముగల్గెడు నిద్ది చూడ నీ
దానవజాతి నాశనము తప్పదటం చిక నెంచిచూడగన్

638. ఉ. కేసరి వాహనంబు, పరికింపగ సైన్యము లేదొకింత, యా
వాసముగానరా, దబల, ప్రక్కన నున్నది యొక్కయింతి, తా
వీసము నైన భీతిలక పెల్చన యుద్ధము సేయరందు బల్
రోసము గల్గనేని యని రొప్పున మిమ్ములఁ బిల్చె చిత్రమౌ

639. ఉ. సేనలు లేవుగాని పరిశీలన సేయగ నెల్ల దేవతల్
మానక నిత్యమున్ వివిధమార్గములన్ దగ సాయమౌదు రా
మానిని, కంతెగాదు శివమాధవులైనను వచ్చి నిల్తురో
దానవ నాథ! పోరుటకు తప్పదనన్, పరికింపు మింతయున్

640. తే.గీ. ఒక్క కాళికచాలు నీరక్కసులను
భస్మమొనరింప యికవేరు బలగమేల
కాన యోచింపు మిత్తఱిఁగార్యమొకటి
సమరమో?లేక సంధియో? సత్వరమున

641. కం. అని తనసేవకు లెల్లరు
వినయంబున పలుకుచుండ విని యాశుంభుం
డనుజునిఁదోడ్కొని లోనికి
జని యిట్టుల పలికె మిగుల సంరంభమునన్

642. ఉ. తమ్ముడ! యేమిసేయుదము దానవ వీరుడు ధూమ్రలోచనుం
డమ్మదిరాక్షిచే మడిసె, నాతనిసైన్యము రూపుమాసె, ని
క్కమ్ముగ దైవ యోగమది కాన నశక్య మదెంత వారికేన్,
వమ్మగుఁగాదె దైవమది వక్రగతిన్ బరికింప వజ్రమేన్

643. ఉ. అంబిక దక్కునన్న పలు కట్టులయుంచు మదెల్ల కల్ల, య
య్యంబుజ నేత్రితోడ రణమా! అటుగాదన పారిపోయి ప్రా

ణంబులుమేన నిల్పుటయ! నాకెఱిగింపుము సత్వరంబె దా
చంబనిలేదు నీతలపు సంశయమందకు మో సహోదరా!

644. చం. అనిన నిశుంభు డిట్లనియె నగ్రజ! భీరువులట్లు పారుటల్
మనకుచితంబె? చాలునిక మానుము శత్రుభయమ్ము. యుద్ధమే
యనుపమ వీరలక్షణ మటంచు వినంబడు వృద్ధవాక్యముల్
పనుపుము నన్ను, నయ్యబలఁబట్టి వధించెద నీక్షణంబునన్

645. కం. అనిలో నే గెలిచిన మీ
కొనఁగూడును నామెతోడి యుద్వాహం, బ
వ్వనజాక్షి గెల్చెనేనిన్
జనుడీ మీమదికి నైన సరణిన్ పిదపన్

646. కం. అనవిని శుంభుండిట్లనె
చనునే మదగజము నంప శశమును పట్టన్
పనిచెద చండుని ముండుని
నెనయగుదురు వీరు వారి కెల్లవిధములన్

647. కం. అనిపలికి శుంభు దనుజ
న్ముని గొని వెలుపలికి వచ్చి ముందున్ చండున్
గనుగొని పలికెను మీరలు
చని యమ్మగువలను వేగ చంపుడు పొండీ

648. ఆ.వె. సకల సైన్యతతుల సర్వాయుధమ్ముల
వెంట గొనుడు దయను వీడుడెందు
మదము నెత్తికెక్కి మాటాడు నవ్వారి
చెండి రండు ఖండ ఖండములుగ

## చండముండ సంహారము

649. ఉ. శుంభుని యాజ్ఞ గైకొనిన శూర వరేణ్యులు చండముండు లు
జ్జృంభిత బాహుదర్పముల సేనలు దండిగ వెంటరా దిశా
కుంభిసమూహముల్ బెదర ఘోరరవమ్ము లెసంగ యుద్ధ సం
రంభముమీర వచ్చి యెదురన్ గని రంబిక నొక్క చక్కటిన్





650. తే.గీ. రూపు దాల్చిన చీకటి ప్రోవనంగ
అంజనాద్రియె యిట నిల్చె నన్నయట్టు
లసిత వర్ణంబుతో నొప్పునట్టి కాళి
నంబ చెంతనఁగాంచి రయ్యసురవరులు

651. చం. వినయముదోప వారిఁగని వీర వరేణ్యులు చండముండు లి
ట్లనిరపు డింతులారా! తమరట్టె యెఱుంగని యట్లుఁదోచు మా
దనుజ కులాధి నాధులతి దర్పులు శుంభనిశుంభులిర్వు ర
య్యనిమిషభర్తనే రణమునందు జయించిన బాహువిక్రముల్

652. ఉ. కేసరి వాహనంబని యొకింత మదిన్ చెలరేగెదేమొ, యీ
కేసరు లొక్క కోటియును కించి దపాయము చేయఁజాల వా
భాసుర వీరవర్యులకు, పాపమొకండును మీకు నెవ్వడున్
వీసమునైన నెన్నడును పేర్కొన లేదొకొ వారియుద్ధతుల్

653. ఆ.వె. వారి తోడి రణము వారిజముఖులార!
కోరి చావు తెచ్చుకొనిన యట్లె
తగరు పర్వతమును తాకిన నేమౌను
ప్రాణహానితప్ప ఫలముగలదె

654. ఆ.వె. కష్ట నష్టములను కలిగించు కార్యముల్
వదలి సతము మిగుల ముదముఁగూర్చు
పనులు చేయఁబూను మనుచు పండితులెల్ల
తెల్పలేదె యేల తెగువ చెపుమ

655. ఉ. మిమ్ముల నడ్డుపెట్టుకొని మెల్పున దేవతలెల్ల స్వార్థ త
త్వమ్ముల తోడ మమ్ముగెలువం దల పోతురు, వారు చేయు మో
సమ్ములెఱుంగ రైతిరి, నిజమ్మిది నమ్ముడు, స్వార్థమూని స్నే
హమ్మును గోరు వారల ప్రయత్నములన్ దగ నమ్మరాదెటన్

656. కం. తనపని నెరవేర్చుకొనగ
గొనకొని స్నేహమ్ముసేయు కుటిలుని నెయ్యం
బనయము విడుచుట యుక్తము
చనునెప్పుడు ధర్మమిత్ర సాంగత్యంబుల్

657. చం. చతురుడు సుందరుండు బహుశాస్త్రవిశారదు డాఢ్యుడున్ మహో
న్నత బలశాలి శుంభుని మనంబునఁగోరి వరింపు భర్తగా
సతతమనంతసంపదల సౌఖ్యముఁబొందుము, రమ్ము, నిన్ను స
న్మతి నతడాదరించు నను నమ్ము మికన్ జగదేక సుందరీ!

658. వ. అని పలుకు చండుని చూచి యంబిక కోపించి

659. మ. లయకాలాంబుద నిస్వనంబనగ పెల్చున్ గర్జనల్ సేయుచున్
భయదాకారము దాల్చి నిప్పుకణముల్ పర్వంగ నేత్రంబులన్,
నయదూరా! యికచాలు నీపలుకు, లున్మాదంబు పైకెక్కె నో?
నియతిన్ నేను స్వతంత్రురాలను జగన్నేత్రిన్ గనన్నేరవో!

660. చం. హరిహర పంక జాసనుల నందరఁ గాదని యిప్డు శుంభునిన్
దురిత విచారుఁగోరుదునె దుర్మతి! మున్నిటువంటి వారి నెం
దరినొ వధించితిన్ వినుము తథ్యము శుంభనిశుంభులేని దు
ర్మరణముఁబొందు వారె యిక మాటలు వేయుననేటి కర్భకా!

661. తే.గీ. నీదు ప్రభువుల సంగతుల్ నిలిపి యింక
చేవ గలదేని యుద్ధమ్ము సేయుమయ్య!
యముని పురమున కతిథిగా నరుగ గలవు
వరుస మీవారలెల్లరు వత్తురటకు

662. కం. అని యిటు లంబిక పల్కగ
ననుజన్ముని గూడి చండు డాగ్రహమున నా
వనరుహదళనేత్ర పయిన
ఘన శరములఁబరపె నపుడు కఠినతరముగన్

663. చం. అదిగని యంబ శంఖమును నద్భుత రీతిగ నూద, సింహమున్
విదిలిచె జూలు, గర్జనలు బిట్టుగ సల్పెను, నంత నొక్కటన్
పది శిత మార్గణంబుల నవారణ దైత్యశితాంబకంబులన్
విదళనఁ జేసి నిల్చె కడు విక్రమమొప్పగ లోక మాతయున్

664. చం. మిడుతల దండులో యనగ మింటఁగనంబడె యంబకమ్ము ల
య్యెడ రణరంగమెల్లెడల, నేదియుఁగన్పడరాక చీకటుల్





విడిసెను, దైత్యసైన్యములు విస్మయమందుచు చూచుచుండె సం
దడి విడనాడి యయ్యది గనన్ ప్రళయాంత మటంచు నెంచుచున్

665. తే.గీ. అంబికాదేవి ముఖమపు డాగ్రహమున
నల్లనై యొప్పె, యెరుపెక్కె నయనములును
భ్రుకుటి నొసటన కుటిలమై పొదుగు కొనగ
నందు మఱియొక వనిత తానవతరించె

666. సీ. పులితోలు తన కట్టుపుట్టమై యలరార
గజచర్మమును పైటగా ధరించి
పుఱ్ఱెలు దండగా నఱ్ఱున ధరియించి
పాశమున్ ఖడ్గమున్ బరగ దాల్చి
క్రూరమై రూపమ్ము గుబులు కొల్పుచునుండ
పొట్ట యెండిన బావి యట్టులుండ
పొడవైన నాలుక యెడనెడ కదలుచు
కాలసర్పంబట్లు గ్రాలుచుండ

గీ. కాళ రాత్రిని బోలు నాకారమొప్ప
విపుల కటి తటి తోడ నావిర్భవించె
అపరకాళిక యని యెల్లరదిరి పడగ
యుద్ధరంగమ్ముఁ జొచ్చె నత్యుగ్రగతిని

667. వ. అట్లు యుద్ధరంగమున ప్రవేశించిన యక్కాళిక

668. సీ. దానవ వీరులన్ దనహస్తములఁ బట్టి
గుల్లచేయుచు నుండె కొరికి పెరికి
మదగజమ్ముల నెల్ల పదిలమ్ముగా బట్టి
నమిలి వేయుచునుండె బొమలు ముడిచి
రథముల తోడ సారథుల నెల్లను గూర్చి
పటపట కొరుకుచుఁ బర్వుచుండె
సుడిగాలి యట్టుల వడివడి తిరుగుచు
సేనల సుడివడఁ జేయుచుండె

గీ. ఒక్కక్షణమున పెక్కురు రక్కసులను
తుడిచి పెట్టుటఁ గాంచి చండుదు చలించి
యేమి చేయుట తోచక యిట్టునట్టు
చూచి రథచక్రమును గొని వైచెవేగ

669\. కం. అదిగని యంబిక ధనువును
పదిలముగాఁ బూని యొక్క బాణముచేతన్
విదళించెను తచ్చక్రము
నదరిపడగ చండముండు లత్యంతంబున్

670\. ఆ.వె. అంత నూరుకొనక యంబిక కోపించి
పెక్కు కాండములను వెంట వెంట
వేయ చండు డపుడు వివశుడై మూర్ఛిల్లి
పృథ్విఁబడియె పెద్ద వృక్ష మట్లు

671\. ఉ. అగ్రజు డిట్లు మూర్ఛిలగ నాగ్రహపూర్ణ మనస్కుడౌచు తా
నుగ్రగతిన్ శితాంబకము లొక్కట గైకొని వేసె నప్డు వీ
రాగ్రణి ముండు డామెపయి, నంబికయున్ దనబాణపంక్తి న
త్యుగ్రత వాని కాండముల నొయ్యన భగ్నమొనర్చి యంతటన్

672\. తే.గీ. అర్థ చంద్రాకృతిని నున్న యంబకమున
గుండెలదరగఁ గొట్ట నాముండు డపుడు
నేల కొరిగెను సహియింపఁ జాలకంత
నార్త నాదమ్ములను సల్పె నసుర గణము

673\. కం. ఆ రవమును విని చండుడు
తేరుకొని నిలిచి యినుప గుదియను గొని మహా
దారుణగతి కాళికపై
బోరన విసరగ నది కుడి భుజమున్ దగులన్

674\. ఉ. దానిని వామహస్తమున ధాత్రిపయిన్ బడనీకఁబట్టి య
మ్మానిని యించు కంతయు శ్రమంబును బొందక వంచి వైచె దూ
రానఁ బడంగ, నంతట రయంబున మంత్ర విశుద్ధమైన య
స్త్రాన నిశాటుఁగట్టెను కరంబులు పాదము లాడకుండగన్





675\. ఉ. అంతట మూర్ఛఁదేఱి యొక యాయుధమున్ గొని ముందు దుగ్రుడై
చెంతకు వచ్చు చుండఁగని శీఘ్రమె కాళియు నొక్కయస్త్ర మ
త్యంత రయంబునన్ విసరి యాతనిఁగట్టిగ కట్టివైచి ని
శ్చింతగ నట్ట హాసములు సేయుచు నంబికఁ జేరియిట్లనెన్

676\. కం. మన రణ యజ్ఞము కొఱకై
కొనివచ్చితి పశుయుగమ్ముఁ గొనుమిదె యనుచున్
వినిపింప నంబికయుఁదా
ఘనమగు సంతోషమందె, కాళిక యంతన్

677\. చం. తన కరవాలమున్ బెరికి తద్దయు వేగమె చండ ముండులన్
గనుగొని యోరి! మిమ్మిపుడె కాలుని పాలికి పంపుదాన పొం
డనుచు తదుత్తమాంగముల నవ్వలఁద్రెళ్లెడునట్లు ఖండనం
బొనరిచి వేడినెత్తురుల నుత్సవమొప్పగ త్రావెఁదృప్తిగన్

678\. చం. అదిగని యప్పు డంబికయు నామెను మెచ్చుచుఁబల్కరించి యో
ముదితరో! చండముండుల నపుణ్యులఁ ద్రుంచి సురాళికార్య మిం
పొదవగ నిర్వహించితివహో! నిను నింతట నెల్లలోకముల్
ముదమున "చండ" యంచు మరి "ముండ" యునంచును గొల్చుఖ్యాతిమై

679\. కం. అని వర మిచ్చెను కాళికి
దనుజులు హతశేషులెల్ల తద్దయువేగన్
దనుజాగ్రణి శుంభు కడకు
జని యిట్లని పల్కిరమిత సంరంభమునన్

680\. చం. దనుజ వరేణ్య! నేడు మన దానవ సైన్యములన్ వధించి చ
య్యన తన కుక్షిఁజేర్చుకొనె నందరఁ గాళిక! యామెకెట్టులో
కనబడ కిట్లు వచ్చితిమి కన్పడఁ బోరిక చండ ముండులున్
మునుఁ గన మెన్నడిట్టి రణమున్, బ్రవహించెను రక్త వాహినుల్

681\. ఉ. వేయును నేల యింకపయి వీడుము నీ సమర ప్రయత్నముల్
చేయుము సంధియత్నములు చేయుట కట్టుల సమ్మతింపవేన్
నీ యను జన్మతోఁగలిసి నెమ్మి రసాతల మేగు టొప్పగున్
చేయకుమయ్య వంశము నశేషముగా నశియించునట్టులన్

682. కం. వారల పరాక్రమములను
వారల రణనైపుణముల వారల శక్తుల్
నేరుగఁగని వచ్చుటచే
వారింపఁ దలంచి యిట్లు పలికితిమయ్యా!

683. తే.గీ. అంబికను పొందగానెంచి యాహవమ్ము
సలుపఁబూనిన వంశనాశనమె సుమ్ము
అల్పలాభమ్ము నాశించి యధిక నష్ట
మందఁదలచుట యవివేక మౌనుగాదె

684. చం. మఱచితిరే యొకప్డు గరిమన్ కమలాసనుగూర్చి మీరు పు
ష్కరమున దీక్షతో తపము సల్పుచునుండ సరోజగర్భు డ
చ్చెరువడి వచ్చి మీకు దయచేసె వరం, బొకయింతి చేతనే
మరణముగల్గు మీకనుచు మన్ననఁదానిఁదలంపుడిత్తఱిన్

685. తే.గీ. ఆమె మీపాలి మృత్యువై యరుగుదెంచె
జగములను నెల్ల సృష్టించి సంహరించు
జగదధీశ్వరి యౌను నిస్సంశయముగ
సగుణ, నిర్గుణ, సర్వజ్ఞ సంశయఘ్ని

686. ఉ. దానవవీరు లిట్లు తముదామె కొలంది యెఱుంగ కెద్దియో
పూనక మావహించినటు బుద్ధులు సెప్ప నిశుంభ శుంభు లెం
తేనియు నాగ్రహించి దిశలెల్లను పిక్కటిలంగ నార్చుచున్
మేనువడంక పాదముల మేదినిఁదన్నుచు నూగి రట్టిటుల్

687. కం. అగ్రజుడగు శుంభుడు తా
నిగ్రహమును విడచి యార్చి నిట్టూర్పులతో
వ్యగ్రుండై యాసన మ
త్యుగ్రగతిన్ చేత చఱచి హుంకృతులెసగన్

688. శా. ఓరీ! దానవమూర్ఖులార! యిటు లత్యుత్సాహమున్ బొందుచున్
మేరల్ మీరి పరాంగనామణుల నెమ్మిన్ గొప్పగా చెప్పు మీ
వీరత్వంబులు గాల్పనే! రణమునన్ వెన్నిచ్చి రాఁజెల్లునే
మీరా! వీరులు? పొందు చూపకు డికన్ మీమోములన్ మాకెటన్





689. తే.గీ. ఎల్లకార్యమ్ము లిద్ధర నెంచి చూడ
స్వప్రయత్నమ్ము వలననె చక్కఁబడును
పిష్టకారిణి యున్నంత పిండియగునె
తండులమ్ములు, యత్న మింతయునులేక

## రక్తబీజ సంహారము

690. చం. అని యొక నిశ్చయమ్ము తనయాత్మఁగుదుర్చుక రక్తబీజునిన్
దనుజ చమూపతిన్ బిలిచి తద్దయు సైన్యము వెంట నిచ్చి తాఁ
బనిచెను యుద్ధభూమికి వివర్ధిత కోపుడు శుంభుడంత, నె
మ్మనమున సంతసించి విభు మానస ముబ్బగ రక్తబీజుడున్

691. చం. చనియెద నీక్షణంబుననె సారసలోచన లున్న చోటికిన్
కనికర మింతలేక అలకాళిక నుక్కడగించి యంబికన్
గొని చనుదెంతు నియ్యెడకు కూరిమి నీవిక పెండ్లియాడవ
చ్చనుచు రయమ్మునన్ జనియె నాతడు స్యందనమెక్కి యుద్ధతిన్

692. చం. తన నెదిరింప వచ్చె నదె దర్పమెలర్పగ రక్తబీజుడన్
దనుజుడటంచు నంబిక ముదంబున శంఖమునూదె బిట్టుగన్
దనుజుడునున్ భయంపడక తద్వన జాక్షిని గాంచి మెల్లగా
ననియెను గౌరవమ్ము వినయమ్మును దోపగ నిట్లు నవ్వుచున్

693. శా. హేబాలా! కడుబిట్టు నూదెదవు నీవేలా యిటుల్ శంఖమున్
నీబోంట్లన్ గని పారిపోదుననియా? నేనంత హీనుండనే
డాబుల్ మాని రణంబు సేయుమిక యిష్టంబైన, నిన్నిప్పుడే
పూబోణీ! కొనిపోయి మాప్రభునకున్ బొల్పొందగా నిచ్చెదన్

694. చం. అని మును నిన్నెదిర్చి పడినట్టి పరాక్రమవంతులెల్ల నా
కెనయగు వారుకారు, ననుహీనునిగా మదినెంచఁ బోకు నీ
కెనయగు వాడు మద్విభు డహీన పరాక్రము డాతనిన్ వడిన్
దనుజ వరేణ్యుఁగైకొను ముదారమతిన్ పతిగా తలోదరీ!

695. సీ. నవరస వర్గమ్ము నవలోకనము సేయ
నందు శృంగార మత్యంత ఘనము

హరి హర బ్రహ్మలు నఖిల దిక్పాలకుల్
తరు నర పశు పక్షి తతులునెల్ల
నిరతమీశృంగార వర రసాశ్రయులౌచు
చరియించు చుందు రీజగములందు
శృంగార రసభోగ చింతావిహీనులు
పిరికిపందలు గాదె యరసిచూడ

గీ. శమము దమమంచు నాత్మవంచనల తోడ
యతులు సన్యాసు లను పేర ననవరతము
తిరుగుచుందురు బోద్ధలై స్థిరములేక
రాగ మింతయు తెగని వైరాగ్యమూని

696. ఉ. నీవును నిట్టి వంచనకు నెట్టన లోనయినట్టుఁ దోచు నీ
కీవిధమేల యింక తరుణీ! నవ యౌవనమెల్ల వ్యర్థమై
పోవక మున్నె మావిభునిఁబొందుము భర్తగ రాజ్యభోగ సం
భావనలన్ గ్రహింపుము శుభంబగు జీవిత ముజ్జ్వలంబుగన్

697. కం. అని రక్తబీజుడీగతి
తనకున్ హిత బోధసేయు తద్విధ మెల్లన్
విని పరిహసించి యంబిక
దనుజుని గని పలికె మధుర తరముగ నిట్టుల్

698. ఉ. దానవవీర! యేల యిటు ధర్మములన్ ప్రవచింప, నేను మీ
దానవదూత తోడ మును దర్పమెలర్పగ చెప్పియుంటి, యు
ద్ధాన నెవండు నన్నెదిరి తాను జయింపగ దక్షుడౌనొ య
వ్వాని వివాహమాడుదు నవక్రపరాక్రమునం చెఱుంగవే

699. తే.గీ. శుంభుడైనను మఱియు నిశుంభుడైన
నన్ను రణమందు గెలిచిన నయముతోడ
చెట్టబట్టంగ వచ్చు నన్ జింతవీడి
పొమ్ము వారలఁబంపుము పోరుసలుప

700. చం. అన విని రక్తబీజుడపు డాగ్రహమూని శరాసనంబు చేఁ
గొని గొనయంబు నెక్కిడి యకుంఠిత రీతి నిశాత కాండముల్





మును మృగ నాథుపైఁబఱప ముక్కలుగా నొనరించె వాని న
జ్జనని నిజాంబకంబుల నిశాటుల గుండియలెల్ల దుల్లగన్

701. ఉ. అంతట వజ్రసన్నిభ నిజాంబక పంక్తుల లోక మాత తా
నెంతయు నేర్పు మీర నొక యింతయు గాయము గానియట్లు దు
శ్చింతునిఁగొట్టె వక్షమున, చేష్టలు దక్కి రథంబునన్ మహా
దంతియనంగఁమూర్ఛిలగ దానవసైన్యములార్చి పర్వగన్

702. తే.గీ. దనుజ వీరుల యార్త నాదమ్ములెల్ల
దానవేంద్రుని మందిరాంతరమునందు
వెక్కసముగాగ ధ్వనియింప వేగనతడు
మూల బలముల రణరంగ మునకుఁబంపె

703. తే.గీ. కాలకేయాది వీరులు కదలివచ్చి
రథిక బలములతోడ నాహవము సలుప
అంబికయు వారలను గాంచి యాగ్రహమున
శంఖమొత్తెను దిక్తటుల్ సంచలింప

704. చం. అదిగని కాళికాంబయు నిజాననమున్ వికసింపఁజేసి స
మ్మదమున నిట్టటుల్ దిరిగె భూతలమెల్ల వడంక, సింహమో
విదిలిచి జూలు జృంభణము వేడ్కనొనర్చి సురారి సైన్యముల్
బెదరగ గర్జనల్ సలిపె భీకర రూపముతోడ నయ్యెడన్

705. ఉ. గుండెలు చిక్కఁబట్టు కొని గొంకక దానవనాథుసైన్యముల్
దండిగ కాండముల్ విసర దారుణ భంగి తదంబకమ్ములన్
చండతరోగ్ర రూపమున చక్కగ చిక్కగఁ బట్టి ద్రుంచుచున్
గొండిలి సల్పె కాళిక యకుంఠిత దోర్బల ముల్ల సిల్లగన్

706. ఉ. పంకజగర్భు డాదిగ సుపర్వుల దివ్యములైన శక్తు లే
యంకిలిలేక వచ్చి యపు డంబిక దేహమునందుఁ జొచ్చె, న
ప్పంకజగర్భు రాణియును పంకజనాభుని దేవితోడ న
ప్పంకజనేత్రి యంబికకు బాసటయై వడిఁ జేరిరొయ్యనన్

707. తే.గీ. అర్థచంద్రుడు కొప్పులో నమరియుండ
శూలమున్ దాల్చి రౌద్రమ్ము చొప్పడంగ

వృషభ వాహన మెక్కి వేవేగవచ్చి
శాంకరియు నిల్చె నంబ పక్షమ్మునందు

708. తే.గీ. శక్తి ధరియించి వచ్చెను స్కంద పత్ని (కౌమారి)
నెమలి వాహన మెక్కి వన్నియలు గుల్క
వజ్రమును దాల్చి శచియును వచ్చినిల్చె
నంబ పక్షాన రణభూమి కాక్షణంబ

709. తే.గీ. సూకరాకార మున వచ్చె సూకరియును
నారసింహియు యామ్యయు వారుణియును
అఖిల దిక్పాలకుల కాంత లంతనంత
వచ్చి నిల్చిరి యంబికా పక్షమందు

710. తే.గీ. శంకరుడు వచ్చి సన్నుతుల్ సలిపియింక
నాలసింపక దైత్యుల నడచి సకల
ప్రాణి కోటిని రక్షింప వలయునమ్మ!
యనుచుఁబ్రార్థించె లోక హితార్థియగుచు

711. వ. ఆసమయంబున

712. మ. దరహాసం బొనరించి యంబిక మహోత్సాహంబునన్ నిల్వ, న
య్యరవిందానన దేహమున్ వెడలి యత్యాభీలమై వచ్చి య
చ్చెరువై యొప్పుచు శక్తి యొక్కటి తగన్ శ్రీకంఠుతో నిట్లనెన్
తిరమై మోమున మంద హాసములు సందీప్తిన్ వహింపన్ గడున్

713. ఉ. హైమవతీ మనోహర! సహాయ మొకండొనరింపు మిప్డు, డా
కామవికారులైన వరగర్వుల శుంభ నిశుంభు లిర్వురన్
సామము మీఱఁజేరి "యిక స్వర్గము దివ్యుల కప్పగించి యీ
భూమిని సైతమున్ విడచి పొమ్మ"ని తెల్పుము నాదు మాటగన్

714. తే.గీ. ఏలవలయును స్వర్గమ్ము నింద్రుడింక
యజ్ఞభాగమ్ము లమరుల కంద వలయు
ననుము, వడిరసాతలమున కరుగు మనుము
కాక యుండిన రణభూమిఁగలియు మనుము





715. తే.గీ. అనుచుఁ బ్రార్థింప శంకరు డాక్షణంబ
నందివాహన మెక్కి దానవుని కడకు
నరిగి చూడగ శుంభు డయ్యవసరమున
మంతనము లాడుచుండె సభాంతరమున

716. మ. కనియా శుంభుని శంకరుండనియె మూర్ఖా! నే త్రినేత్రుండ, నన్
బనిచెన్ దూతగ నంబ నీకు హితమున్ బాటించి చెప్పంగ, గ్ర
న్నన స్వర్గమ్మును పృథ్వినిన్ విడచి యానందంబునన్ వాతభో
జన లోకంబున కేగుమీ బ్రతుకనెంచన్ సౌఖ్యమౌ నీకటన్

717. తే.గీ. అట్లు కాదేని యెదిరింపు మాహవమున
నిన్ను నీవారి నెల్లర నిముసమందె
సంహరించెదనని జగజ్జనని నీకు
చెప్పుమని పంపె ననిపల్కి శివుడు వేగ
తిరిగివెళ్ళెను నంబికా దేవికడకు

718. వ. నాటినుండి యంబికాదేవికి 'శివదూతి' యనుపేరు స్థిరమైయొప్పె

719. ఉ. శూలి హితోక్తులన్ వినిన శుంభనిశుంభులు గూడి యోచనల్
చాలయొనర్చి యిప్పుడిక సర్వముఁగోల్పడి లొంగిపోవగా
నేల యటంచు లోఁదలచి యెల్లబలంబులఁబంప వార లు
త్తాల శరాసనంబులను దాల్చి రణాంగణ భూమిఁ జేరగన్

720. ఉ. వచ్చిన సైన్యముల్ గడగి బాణపరంపర లొక్క పెట్టునన్
హెచ్చుగ నేయ నంబిక యొకింతయుఁదగ్గక నింగిఁజూచువా
రచ్చెరువంద పెక్కు నిశితాంబకముల్ వడినేయుచుండ నా
డచ్చట తీవ్రమై యెసగె నాహవ మద్భుత భీమమై వెసన్

721. మ. తనరన్ కాళియు శూలమున్ గొని గడున్ దర్పమ్మునన్ ద్రిప్పుచున్
ఘనరథ్యంబుల స్యందనంబుల మహా గంధేభ యూథంబులన్
తన నోటన్ వడిగ్రుక్కి దంతముల నుద్ఘాటించు చుండంగ, త
జ్జనిత ధ్వానము లాక్రమించె వెస దిగ్జాలంబులం దంతటన్

722. తే.గీ. హంసవాహన మెక్కి బ్రహ్మాణియంత
సమర రంగాన నట్టిట్టు సంచరించి

మంత్ర జలములcజల్ల నున్మత్తులగుచు
ధాత్రిcగూలిరి పెక్కురు దనుజు లపుడు

723. కం. శాంకరి త్రిశూలమును న
ల్వంకలc ద్రిప్పుచు తిరుగగ వడివడి దనుజుల్
వంకలు దిరుగుచు శోణిత
పంకంబులc గూలిరపుడు భండన భూమిన్

724. కం. గరుడుని పై వైష్ణవియును
సరగున సుడిగొనుచు సకల సైన్యము నెల్లన్
పొరిగొను చుండెను సురవరు
లరిదిగcగను చుండ దనుజు లదిరి పడంగన్

725. తే.గీ. ఇట్లె దిక్పాల కాంగన లెల్లరపుడు
కసిమసంగుచునుండ రక్కసుల, నంత
కేసరియుcదక్కువారలc గీటడంచి
భక్షణము సేయుచుండె దుర్వారగతిని

726. కం. దివిజులు సుమవర్షంబుల
నవిరళగతిcగురిసి రప్పు డానందమునన్
ప్రవిమల గతి మునివర్యులు
వివిధగతుల పొగడి రంత ప్రియవచనములన్

727. ఉ. అంతట మూర్ఛcదేఱి కడు నబ్బురపాటున రక్తబీజు డొ
క్కింత శరీరభారమున నిట్టటు చూడగ యుద్ధరంగ మం
దంతట మొండెముల్ శిరము లాయుధముల్ పడియుంట, సూతుడున్
చెంతన కూలి యుంటcగని చేతమునన్ గ్రహియించె దుస్థితిన్

728. మ. వరదర్పంబున రక్తబీజుడపు డావంతైన లెక్కింప, కు
ద్ధర కోపారుణ నేత్రుడై గవిసి యస్తోకాంబక శ్రేణులన్
గురిసెన్ వైష్ణవిపైన నామెయును సంకోచింప కవ్వాని దు
ర్భరకాండంబులcద్రుంచి యంత తన చక్రంబున్ బ్రయోగించినన్

729. చం. అదియు ననంత వేగమున నాతనిcదాకి తదీయ దేహమున్
విదళనc జేయ శోణితపు బిందువు లుర్విని చింది యద్భుతం





బొదవగ వేలు లక్షలు మహోగ్రశరీరులు రక్తబీజు ల
య్యదనునcబుట్టి నిల్చిరి రణావని యప్పుడ యానినట్లుగన్

730. తే.గీ. వైష్ణవియు, నారసింహియు, వాణి, యుమయు
వారి నాశ్చర్యమునcగాంచి వరుస నప్పు
డాయుధమ్ముల గాయముల్ సేయుచుండ
రక్తబిందువు లెక్కుడై రాలి నంత

731. ఉ. పుట్టిరి రక్తబీజు లొక పోలిక లక్షలు కోట్లనంగ, చే
పట్టిరి యాయుధమ్ములు, దివౌకసు లెల్లరు భీతిలంగ చూ
పట్టిరి యుగ్రరూపముల, పాయక నెల్లరు నట్టహాసముల్
బిట్టొనరించుచుండ కడువింతగ చూచుచు నుండి రెల్లరున్

732. ఉ. వారల తోడcబోరుట కుపాయము దోచక కార్యమెద్దియున్
నేరక యుండిరెల్లరును, నిక్కమెఱింగిన యంబ, కాళికన్
చేరగcబిల్చి పల్కెనిటు, చెచ్చెర నేనిక వీరినెల్ల దు
ర్వార మదీయ బాణతతి వ్రచ్చెద, నీవును మున్నుగా తగన్

733. ఆ.వె. సమర భూమియందు చాపి యుంచుము నీదు
నాల్క విస్తృతముగ నలుదెసలకు
రక్తధార లవని రాలనీయక వేగ
చప్పరించి వేయు మప్పళించి

734. చం. అటుపయి రక్తబీజుల ననర్గళ రీతిని రక్తబిందు వొ
క్కటియును రాల నీక వడిగన్ దిగమ్రింగుము, దీనిమించి యు
త్కటమగు మార్గమొండెదియుcగానము కావున విస్తరింపుమీ
పటుతర రీతి నాల్కనని పల్కగ కాళియు సమ్మతించుచున్

735. చం. గిరిగుహవోలె యాస్యము నొగిన్ వివరమ్మొనరంగcజేసి య
చ్చెరువుగ చాచి నిల్చె తన జేవురుమీఱెడి నాల్క నల్దెసల్
పరచుకొనంగ, నంత శితబాణ పరంపర లొక్క పెట్టునన్
బొరిపొరి వైచెనంబికయు బోరన రక్కసు లెల్లcగూలగన్

736\. ఉ. కూలిన వారిఁగూలినటు గొబ్బున మ్రింగుచునుండె కాళి యా
భీలతరంబుగా రుధిరబిందువు లుర్విని(ద్రెళ్ళనీక, వే
యేల నిమేషకాలమున నెల్లర నుక్కడగించి యంతటన్
వాలముఁబెల్చఁగైకొని జవంబునఁజీల్చెను రక్తబీజునిన్

737\. కం. తెగిపడిన దేహభాగము
లెగిరి పడగనీక మ్రింగి యేమియెఱుగన
ట్లగపడు చుండెను కాళిక
మొగమున చిర్నగవులొలయ మోదముతోడన్

## నిశుంభ సంహారము

738\. తే.గీ. రక్త బీజుని మరణ వార్తను గ్రహించి
యింతమందిని గోల్పడి యిప్పుడింక
పారిపోవుట పందల పనియటంచు
సిద్ధమయ్యెను శుంభుడు యుద్ధమునకు

739\. ఉ. అన్న మనోగతం బెఱిగి యద్దము వచ్చి నిశుంభు డాతనిన్
మన్ననఁజూచి యిట్లనియె మానుము నీదు ప్రయత్న మగ్రజా!
క్రన్ననేగి నేనిపుడె కాళిని కాలుని పాలికంపి యా
కన్నియఁదెత్తు నంబికను కాదనఁబోక యొసంగుమానతిన్

740\. మ. అనుచున్ వేగ తదగ్రజాజ్ఞకొఱకై యాలస్యమున్ జేయకా
దనుజుండేగె నిశుంభు డుగ్రగతి నౌద్ధత్యంబునన్ సంగరం
బొనరింపన్ తన సొంత సైన్యములతో నుత్సాహసంరంభముల్
దనరన్ వెంబడి వందిమాగధులు సద్యఃస్ఫూర్తి జైకొట్టగన్

741\. మ. అనుజుండేగిన యంత శుంభుడతి చింతాక్రాంతుడై యట్టిటుల్
తన యంతఃపురమందుఁదిర్గుచు మనఃస్థైర్యమ్ము వీడంగ చ
య్యన యుద్ధావనికేగి ప్రేక్షకుని యట్లల్లంత దూరాన ని
ల్చొని యుండెన్ దివి దేవనాథు డపుడా చోద్యంబు వీక్షింపగన్

742\. చం. తన ధను వెక్కువెట్టి కడుదర్పము మీర నిశుంభు డుగ్రుడై
యనలశిఖా సమంబులగు నంబకముల్ వడివేయుచుండ న
ద్దనుజునిఁగాంచి యంబికయుఁదద్దయు నవ్వుచు, చూడు కాళికా!
యని యొనరింప వచ్చిరి మదాంధులు మూర్ఖులు బుద్ధి హీనులై

743\. చం. అనుచరు లెల్ల యుద్ధమున నంతముఁజెందిరి విక్రమోన్నతుల్,
ఘనుడగు రక్తబీజుడును ఖండితుడయ్యెను, వీరికింతటన్
గనుగొన బుద్ధిరాదు భుజ గర్వము లేర్పడ వచ్చిరన్న, నే
మనియెదు వీర లెంత వశులైరొ యెఱుంగుము నాదు మాయకున్

744\. చం. అరయగ లోభమెంతటి యనర్థముఁగూర్చునొచూడు, మెంతయున్
బెరుగును, వీడదింతయును, పెక్కురు వీరులు సర్వసైన్యముల్
దురమున దిక్కుమాలి కడుదుర్భర వృత్తి నశించు టోర్చియున్
పరువిడ కిట్లు వచ్చిరన పాపము వీరి జయేచ్ఛ లెట్టివో!

745\. చం. అని యుచితోక్తులన్ బలికి యంబిక తక్షణ ముగ్ర మూర్తియై
ధనువును బూని దానవుల దర్పమడంగ నిశాత కాండముల్
గొనకొని వేయుచుండ సుడిఁగొంచు సురారులు విహ్వలాత్ములై
యనిమొన వీడి పర్విడగ, నద్దనుజుండు నిశుంభు డంతటన్

746\. ఉ. వారికి ధైర్యమున్ గఱపి ప్రబ్బిన కోపముతోడ నంత దు
ర్వార రయంబునన్ నిశిత బాణశతంబుల వైచి యార్చుచున్
ఘోరతరాకృతిన్ సమద కుంజరమోయన సంచరింప, సొం
పారగ నప్పు డంబికయు నాతని శస్త్రములెల్లఁద్రుంచుచున్

747\. శా. ప్రావృట్కాల పయోద సంజనిత శంపావల్లరీ తుల్యమై
వేవేగన్ బలుచోట్ల తళ్కుమనుచున్ విన్నాణమున్ జూపుచున్
దేవారాతుల గుండియల్ దిగబడన్ దివ్యాకృతుల్ బొందుచున్
భావాతీతమునౌచు నంబిక యటన్ భాసిల్లె దుర్భేద్యయై

748\. శా. శృంగారంబును రౌద్రమున్ గలిపి రాశిన్ బోసినట్లున్న త
న్వంగిన్ గాంచుచు శుంభుడున్ గదలె నవ్యంబైన యుత్సాహముల్
పొంగన్ యుద్ధమొనర్చి కాళికను నిర్మూలించి యయ్యంబికన్
పొంగారన్ గ్రహియింతు నంచు నెడదన్ బూవిల్తుదేచన్ గడున్

749\. చం. అనితలపోసి శుంభుడపు డంబిక సమ్ముఖమందు నిల్చి త
ద్దినకర తేజమున్ రుధిరదీప్తుల నొప్పెడు నేత్రయుగ్మమున్

గనుగొని భీతిఁజెంది యిక కాలము చెల్లెను నేడునాకు ని
వ్వనితను నే జయింపఁగల వాడనె యంచుఁదలంచి ఖిన్నుడై

750. చం. మరణము తప్పదింక యని మానసమందున నిశ్చయించి తా
కరమున నెట్టెటో ధనువు గట్టిగ పట్టి శరమ్ముఁగూర్పగా
దొరఁకొను చుండ చూపులను తూపుల నంబిక వాని నొంచుచున్
శరద గభీర నిస్వనము చాద్పున బిట్టుగఁబల్కె నిట్టులన్

751. ఉ. ఇంకను బుద్ధిరాదు తమ కేలొకొ? మూర్ఖవరేణ్యులార! నే
నింకొక మారు మీహితము నెంచి వచించెద విన్ము, మీరలీ
మంకుఁదనంబు వీడుచు నమర్త్యుల లోకము వారికిచ్చి ని
శ్శంకఁ జనుండు వేగమె రసాతల, మచ్చట మీకు భద్రమౌ

752. చం. అనిన నిశుంభు డప్పలుకు లాత్మఁదలంపక కత్తిదూసి వై
చెను కడులాఘవం బెనయ సింహము శీర్షముఁదాకునట్లు, తత్
ఘనతరమౌహతిన్ కనుయుగమ్ము వడిన్ చలియింప గిర్రునన్
తనువొక బొంగరమ్మటుల తద్దయు వేగ ప్రదక్షిణింపగన్

753. ఉ. కుమ్మరి సారెపైఁదిరుగు కుందయనన్ జగదంబ దిర్గుచున్
గ్రమ్మిన తీవ్ర కోపమునఁగ్రక్కున నొక్క కుఠారమెత్తి తే
ద్రిమ్మరి బాహు మూలమును ద్రెంపగ నాతడొకింతయేని చే
తమ్మున బాధనొందక మదంబున వాలములాగి యుగ్రతన్

754. చం. తిరిగి మృగేంద్రుపై విసర తేకువ నద్దియు తప్పుకొంచు బి
ట్టొరిగిన యంత నంబిక మహోగ్రత బంగరుపాత్రనెత్తి చూ
పరులతి భీతినొంద మధుపానమొనర్చి హసించి వాలమున్
కరమునఁదాల్చి దానవుని కంఠముఁద్రెంచె నిరర్గళంబుగా

755. చం. తల తెగి తాటిపండువలె ధారుణిపై వడి రాలినంత, యా
వలఁబడె మొండె ముగ్రగతి వజ్రహతిన్ బడు పర్వతంబటుల్,
కలవరమంది యయ్యెడఁగకావికలై చని రెల్లదానవుల్
చలనము దప్పి శుంభు దనుజన్ముని దుస్థితిఁగాంచి చింతిలెన్





## శుంభాసురవధ

756. చం. మరు నిముసంబు నందె తన మానస మందున చింతవీడి దు
ర్భర తర కోపమూని పటురావ మొనర్చె దిశల్ వడంక, ది
క్కరులును ఘీంకరింప, గిరి గహ్వరముల్ ధ్వనియించుచుండ, న
చ్చెరువడి దిక్పతుల్ సురలు చేష్టలుదక్క, యుగాంతమోయనన్

757. వ. అంత నాశుంభుడు తనలో నిట్లు వితర్కించె

758. ఉ. కాలము గొప్పగాదు మదిఁగన్గొన దైవమె యెల్లభంగులన్
జాల విశిష్టమై పరగు, శ్రావణమందున లేని వర్షముల్
కాలము గాని మాఘమున గాడ్పులతోఁగురియున్ విచిత్రమై,
కాలము లస్వతంత్రములు కట్టడ చేయును దైవమెప్పుడున్

759. ఉ. పౌరుష మెల్ల వేళల శుభంబులఁగూర్పదు దైవశక్తి చే
కూరక, సర్వదేవతలఁగొందల మందగఁజేసినట్టి నా
కూరిమి తమ్ము డిప్పుడొక కోమలిచే నతి దారుణమ్ముగా
ధారుణిఁ గూలుటన్‌గన, నిదర్శన మింతకు మించి యెద్దికన్

760. ఉ. వీరుడు రక్తబీజుడును వీరవరేణ్యు లికెందరెందరో
ధారుణిఁ గూలి రీయబల ధాటికి నిల్వగలేక, యింకనే
నూరక నిల్చి యేఫలము నొందఁగలాడను, రాక తప్పునే
యేరికినైన చావు, గణియింపగ కాలము దాపురించినన్

761. చం. హరిహర పంకజాసనుల, కష్టదిగీశులకైన తప్పునే
మరణము, దేహధర్మమది మారదు, నశ్వరమైన దేహమున్
స్థిరమని నమ్మి, యెన్నడు నశింపని కీర్తిని వీడుటొప్పునే
మరణమొ, రాజ్యభోగమొ సమంబుగ నెంచెదఁబోరుసల్పెదన్

762. చం. అని మదినెంచి సారథికి నాజ్ఞయొసంగగ నాత డంతటన్
గొనకొని యంబ సన్నిధికి గొబ్బునఁజేర్చె రథంబు, శుంభుడ
వ్వనితను గాంచినంత సుమబాణపరంపర లొక్కపెట్టునన్
దవుల విమోహి తాత్ముడయి తత్తను శోభల నట్టె గాంచుచున్

763. మ. అరెరే! యెంతటి యంద, మెంత రణవిద్యాకౌశలం, బాపయిన్
పరువం బెంతటి నూతనంబు, నిజమీ బాలామణిన్ జూడగన్
కరమాశ్చర్యమునౌను, భావముల చక్కన్ గెల్చి యిప్పట్టునన్
తిరమై నిల్చిన మన్మథాంగన యనన్ దేదీప్యమై వెల్గెడిన్

764. తే.గీ. ఇంత సుకుమారి యిందర నెట్లుచంపె
నీమె నెటులైన వశ మొనరింతమన్న
మంత్ర తంత్రమ్ము లేవియు మదినెఱుంగ
సామ దానాదు లెవ్వియు సాగవిపుడు

765. కం. ఇమ్ముగ నే దండోపా
యమ్మున నడగింతమన్న నది సాధ్యంబే!
యిమ్మదిరాక్షికిఁదలపగ
నెమ్మెయి నే సాటి యౌదునే వీర్యమునన్?

766. కం. ఏరీతిఁ జూడ నిపుడు
పోరాటము సల్పుటొప్పు పోనీరానీ
పోరాడి చచ్చిరెందరొ
వీరులు నాకొఱకు నింక వెఱవగ నేలా!

767. వ. అనిమదిలో వితర్కించుకొని యయ్యంబికన్ గని

768. మ. తరుణీ నీదు ప్రయత్నమెల్లయిక వ్యర్థంబౌను యోచింపుమా
తరమే నీకు ననున్ జయింప,ఁదగ నీదర్పం బడంగింతు, నీ
చరితంబెల్ల యధర్మ, మింతులిటు శస్త్రంబుల్ ప్రయోగింతురే!
పరగన్ చూపులె తూపులౌ కనుబొమల్ బాణాసనంబుల్ గదా!

769. తే.గీ. హావ భావమ్ము లవియె యస్త్రాదికములు
సమర సన్నాహము లవి స్రక్చందనములు
సరసుడౌ పూరుషుండె లక్ష్యమ్ముదలప
రథము లశ్వంబులును మనోరథము లబల
ఇతర శస్త్రాస్త్రము లవేల యింతుల కిక

770. చం. తలప సరోజనేత్రలకు దండి విభూషణ మౌను లజ్జ, యి
ట్లలయక మాటి మాటికి శరాసన మెక్కిడి యంబకమ్ములన్
బలుగతి వేయునప్పు డటు పయ్యెద వీడ మహోన్నతంబునై
యలరెడు నీదు వక్షమెటు లంబిక! దాచుకొనంగఁజాలెదో!

771. చం. పగతురు నిన్ను వెన్దరుము పట్టున పర్విడు చుండ నీదు హం
స గమన మేమి యౌనొకొ విచారణ సేయుము, కోమలాంగివై
యగపడు నీకు నెచ్చెలిగ నందన నుండుట కెల్లభంగులన్
దగునె కరాళ కాళిక, గనంబడు మాంత్రికురాలి చాడ్పునన్

772. తే.గీ. వాహనముఁజూడ క్రూర సత్వమ్ము, మఱియు
వీనులకు విందుఁగూర్చెడి వీణ వదలి
ఘంట వాయించు టొప్పునే కమల నేత్ర!
సుందరాంగివి నీకు నీ చందమేల?
ఇట్టి సౌందర్యవతిని నిన్నెట్లడంతు

773. చం. సమరముసేయ వచ్చిన నిశాటు డిటుల్ సరసోక్తు లాడుటల్
గ్రమమున విన్న యంబిక ముఖంబున చిర్నగవొల్క మూర్ఖుడా!
శ్రమపడనేల నాపయిన శస్త్రము లేయగఁజాలవేని వి
క్రమమెసగన్ రణంబిపుడె కాళికతో నొనరింపు ముద్యతిన్

774. చం. అని పరిహాసముల్ సలిపి యంబిక యప్పుడ కాళిఁజూచి యీ
దనుజుని సంహరింపుమతి దారుణభంగి ననంగ నామెయున్
ఘన గదనెత్తి భూతతతి కంపిల బిట్టుగ నట్టహాసముల్
పొనరిచి నిల్వ శుంభుడును భూరిగదన్ ధరియించి యుగ్రుడై

775. ఉ. ఆమె నెదిర్చి నిల్వ, నపుడాహవ మద్భుతమై సెలంగె, భూ
వ్యోమములెల్ల దద్దరిలె నుగ్రగదా ప్రహరంబులన్, దిశల్
భీమముగా ప్రతిధ్వనులు పెల్చన సల్పెను, శుంభుడంత సు
త్రాములు బీతిలన్ దనగదన్ వడివైచెను కాళికాంబపై

776. చం. జవమున కాళికాంబయును చాతురి నప్పుడ తత్ప్రహారముల్
దవులగనీక తప్పుకొని దానవనాథు నురంబుపైన బి
ట్టవియగఁగొట్ట సొమ్మసిలి యాతడు మూర్ఛిల నంతనొక్కటన్
దవులుచు గార్దభంబుల రథంబును సూతుని నుగ్గొనర్చినన్

777. చం. దనుజుడు మూర్ఛఁదేతి కడుదర్పమునన్ వికటాట్టహాస ని
స్వనముల నొప్పు కాళికను వక్షముపై గుఱిచూచి పెన్గదన్
గనలి రయంబునన్ విసర, కాళియు దానిని నుగ్గొనర్చి య
ద్దనుజుని వామహస్తమును ధాత్రిఁబడన్ నిశితాసిఁగొట్టినన్

778. కం. తన దక్షిణ హస్తమునన్
గొనకొని నిశితాసిఁగొంచు ఘోరాకారం
బున తన కెదురై వచ్చెడి
దనుజునిఁగని కాళియపుడు తద్దయు వేగన్

779. కం. తన వాలు వాలమును గై
కొని తద్దక్షిణ కరంబుఁ గూలగ నేయన్
దనుజుడు వెఱవక నపుడా
వనితన్ దన్నంగఁజూచె వడి పాదములన్

780. చం. అది గని కాళికాంబయు నిరర్గళవృత్తిఁదదీయ పాదముల్
గదలెడు నంతలోన తన ఖడ్గమునెత్తి తదూరు యుగ్మమున్
విదళనఁ జేసి యంత కడు వేగమె ద్రుంచె తదుత్తమాంగమున్,
మదగజదేహ తుల్యమయి మన్ననఁ గూలెను వానిమొండెమున్

781. కం. హతశేషులైన దానవు
లతిదీనత వచ్చి యప్పు డంబిక యెదుటన్
నతులై శరణంబని స
న్నుతులు సలిపి యాయుధముల నూకి రవనిపై

782. కం. దివిజాధినాథు డాదిగ
దివిజులు వడినటకు వచ్చి దేవీద్వయమున్
వివిధగతుల నుతియించిరి
అవిరళముగ ప్రజ్జ్వలించె యాగాగ్నులొగిన్

783. వ. అనిపలికి వేదవ్యాసుండు జనమేజయుంగాంచి

784. శా. శ్రీదేవీ చరితంబునం దిది మహాశ్రేష్ఠంపు ఘట్టంబు, స
మ్మోదంబంద పఠించినన్ వినిన సంపూర్ణాయురారోగ్యముల్
మీదన్ సంతతి సంపదల్ విజయముల్ మేలై వివృద్ధంబులౌ
నా దేవీకృప చేత నెల్లరకుఁ దథ్యంబిద్ది రాజోత్తమా!

## సమాధి - సురథుల వృత్తాంతము

785. మ. అవధానంబున పౌరవేంద్రు డిటులా వ్యాసుండుదెల్పంగ సం
స్తవ నీయంబగు నంబికా చరిత మాశ్చర్యంబుగా వించు, మౌ
ని వరున్ గాంచి తపోధనా! సఫలతన్ జెందెన్ గదా నేడు నా
భవ మీదివ్యకథల్ వినంగ, నిది నా ప్రాగ్జన్మ పుణ్యంబె యౌ

786. మ. ముసు నెవ్వారలు భక్తి నంబికను సమ్మోదంబునన్ గొల్చిరో?
ఘనమౌ సత్ఫలితంబులన్ గొనిరొ? ప్రఖ్యాతిన్ గనన్ జాలిరో?
విన కౌతూహల మయ్యెడున్ మునివరా! ప్రీతిన్ వచింపంగదే
విని నాకర్ణయుగంబు నిర్మలము గావింతున్ బ్రశస్తంబుగన్

787. మ. అనినన్ వ్యాసుడు సంతసించి కురువర్యా! పూర్వకాలంబునన్
జననాథుండొక డేలుచుండెఁబృథివిన్ సద్ధర్మ యుక్తుండునై
వినయంబున్ గురుభక్తియున్ గలిగి సంప్రీతిన్ బ్రజాక్షేమమే
పనిగా నెమ్మది నెంచుచున్ సురథుడన్ బ్రఖ్యాత నామంబుతో

788. వ. అతడేక పత్నీవ్రతుండై యెల్లవారి మన్ననలంబొందుచూ ధనుర్విద్యా
కౌశలంబున రాజ్యమేలుచుండ

789. చం. వనముల పర్వతంబులను వాసము చేయుచునున్న మ్లేచ్ఛు ల
జ్జనపతి వైభవమ్మునకుఁజాల నసూయను బొంది యెల్లరున్
దనర రథాశ్వ కుంజర పదాతి దళంబుల తోడవచ్చి య
య్యనఘు నెదిర్చి నిల్చిరి భయంకర వృత్తి మదాతిరేకులై

790. వు సురథుండున్ జతురంగ సైన్యముల నస్తోకంబుగాఁగొంచు న
య్యరి సైన్యంబుల తోడ ఘోరముగ పోరాటమ్ముఁగావించి య
స్థిరతన్ వారల గెల్వలేక యపుడుద్వేగంబునన్ బాఱి దు
ర్భర సాంద్రాటవిఁజేరె యొంటరిగ తీవ్రంబైన యావేదనన్

791. మ. తన మంత్రుల్ ధనలోభులై యరుల పొంతన్ జేర, "నెట్టైన నా
యునికిన్ వారికిఁదెల్పి నన్నుగొనిపోనూహింతు, రేమందు నీ

ధనలోభంబది యెంతకార్యమయినన్ దథ్యంబుఁగావించు, నే
యనుబంధమ్ములు గుర్తురా"వనుచు తానాలోచనల్ సేయుచున్

792. చం. చనిచని యొక్కచో విపుల సాంద్రవనాంతర సీమ నొక్క స
న్మునివరు నాశ్రమంబుఁగడు మోదమెలర్చెడి పూ లతాళిచే
పెనగొని యున్న వృక్షములఁ బెంపలరారు నదీతటంబునన్
గనులకు విందుసేయ నటఁగాంచె సుమేధసుడన్ మునీశ్వరున్

793. సీ. సహజ శత్రుత్వమ్ముఁజాలించి మైత్రితో
చరియించు మృగపక్షి చయములొప్ప
వీనుల విందైన వేదఘోషల తోడ
నలరారు శిష్యులు హాయిఁగూర్ప
నీవార ధాన్యముల్ నిలిపి వండెడు వంట
కమ్ముల ఘుమ ఘుమల్ గ్రమ్ముచుండ
హోమధూమమ్ములు వ్యోమవీధులనిండి
జలధరమ్ముల తోడ సంధిసేయ

గీ. సౌరభోత్కరము లగు పుష్పములతోడ
ప్రాణికోటికి శాంతినిఁ బాదు కొల్పు
నాశ్రమముఁగాంచి సురథు డత్యంత ముదము
బొంది తురగమున్ దిగి కడు మందగతిని

794. చం. ఉరుతర సాలమూలమున నుజ్జ్వల దీప్తి మృగాజినంబుపై
తిరముగఁ గూరుచుండి కడుదీక్షగ శిష్యుల కెల్ల వేదముల్
పొరిపొరి చెప్పుచున్ విషయముల్ దరిఁజేరగనీక యింద్రియ
జ్వరము నడంచి యున్న మునివర్యుని చెంతకు నేగి నమ్రతన్

795. తే.గీ. బాష్పజలములు ధారలై పారుచుండ
నామహర్షికి సాష్టాంగ మాచరించి
పాద పద్మమ్ములను తన బాష్పధారఁ
గడుగు చుండెను నట్టులే తడవొకింత

796. ఉ. అంత సుమేధసుండు "శుభమస్తని" లేపుచు శిష్యుఁబిల్చి యా
చెంతన నొక్క యాసనము సిద్ధమొనర్పగఁజేయ భూవరుం





డెంతయుఁబ్రీతి కూర్చొన, మునీశ్వరు డాతని కర్ఘ్యపాద్యముల్
సంతస మందునట్లిడి ప్రశాంత మనంబునఁబల్కె నిట్టులన్

797. చం. తమరెవరయ్య? యిందులకు దైన్యగతిన్ జనుదేరనేల? నీ
గమనము నందెదో కలత గానబడెన్ వివరింపుమయ్య! నా
కమరినరీతి చేయుదు సహాయము, నెమ్మది సంశయింపకన్
గ్రమమునఁదెల్పుమయ్య తమ కష్టములెట్టివొ చెప్పనర్హమేన్

798. చం. అనుచు సుమేధసుండు కడు నాదర మొప్పగఁబల్క సంతసం
బెనయ నరేశ్వరుండనియె నే సురథుండ ధరాధినాధుడన్
మునివర! నన్ను శాత్రవులు పోరజయింపగ దిక్కులేక యీ
వనములఁబట్టి వచ్చితిని భార్యను సైతము వీడి యొంటిగన్

799. చం. శరణముఁగోరి వచ్చితిని సాధు వరాగ్రణి! నాకు నన్యు లి
త్తరుణమునందు నాదుకొను దక్షులు లేరు మహాత్మ! మీరె నా
కరయగ దైవమయ్య! తమరానతియిచ్చిన నెద్దియైన సు
స్థిరమతిఁజేయువాడ, నను దీనునిఁగావుము తాపసోత్తమా!

800. చం. అనిన సుమేధసుండు నభయంబు నొసంగి ధరాధిపోత్తమా!
మనమున చింత వీడు మిక మా కడకున్ జనుదెంచు వారలున్
ఘనులగు తాపసోత్తములె, క్రౌర్యములెందును గానరావు, భో
జనములు కందమూలములె, శాంతుడవై వసియింపు మిచ్చటన్

801. చం. అనవుడు నావిభుండు మునియానతి నౌదలఁదాల్చి యాశ్రమం
బున వసియించు చుండె సుఖమున్ గడు శాంతియుఁ బొంది, యట్టులే
దినములు సాగుచుండగ మదిన్ దనపూర్వపు వైభవంబు లె
ల్లనుఁదలఁకొత్త చింతిలి తలంచెను తానిటు లొక్కప్రొద్దుటన్

802. ఉ. పాపుల చేతి కేగెనటు ప్రాభవమెల్లను, లోకులెట్లు సం
తాపము నొందు చుండిరొగదా! గజముల్ తురగంబు లెవ్విధిన్
పాపము చిక్కి పోయెనో? కృపారహితాత్ముల కొగ్గి భీతిమై
నే పగిదిన్ చరించెదరొ యెగ్గుల కోర్చుచు నెల్ల సేవకుల్

803. తే.గీ. అప్పనముఁ జేసి నాడ ననర్హులకును
నేను కూర్చిన ధనమెల్ల నిండుకొనెనొ?

వ్యర్థమై పోయెనేమొ దుర్వ్యసనములకు
వంత పలుకంగ మంత్రు లవ్వారికెపుడు

804. కం. అనుకూలవతియు, గుణవతి
వనితారత్నంబు నాదు పత్నియు నకటా!
ననుఁగానక యెవ్విధమున
మనమునఁగడుచింతఁబొంది మనుచుండెనొకో

805. కం. పరిపరి విధముల నిటులా
ధరణీపతి తన మనమునఁ దలచుచునుండన్
సరిగా నా మార్గంబున
తెరువరి యొక దరుగుచుండె దీనాననుడై

806. కం. సురథునిఁగని యాతడపుడు
స్థిర చేతస్కుండు నౌచు చెంతకుఁజని ని
బ్బరమున కూర్చుండెను దు
ష్కర కష్టంబులవియెల్లఁ గడచిన యట్టుల్

807. చం. అతనిని గాంచి యాసురథు డాత్మ సఖుండునుఁ బోలెఁ జూచి యి
ట్లతులిత భీతి నియ్యెడకు నార్తిఁగలంగుచు వచ్చితేల? స
మ్మతి నెఱిగింపు మీవెవరొ? మానుము దైన్యము, నన్ను నింక స్నే
హితునిగ నెంచి తెల్పుము సహేతుకమైన యొనర్తు సాయమున్

808. చం. అనియడుగంగ పాంథుడపు డాతని యాదరవృత్తి కెంతయున్
మనమున సంతసించి కడుమందగతిన్ వివరించె నిట్టు, లో
యనఘ! ననున్ "సమాధి"యని యందురు, సంపద గల్గి యొప్పుదున్,
వినయము ధర్మవర్తనము విజ్ఞత గల్గి చరింతు, వైశ్యుడన్

809. తే.గీ. ఇట్టు లయ్యెను నాభ్రాతు కీదినమ్ము
భార్యయున్ బిడ్డలే నన్ను పట్టి కొట్టి
వెడలఁగొట్టిరి లోభులై వివిధగతుల
తూల నాడుచు, నేమందుఁగాల మహిమ

810. తేగీ. దిక్కుతోచక నేనిట్లు దీనగతిని
నడవులంబట్టి వచ్చితి, నంతలోన





తమరి దర్శనమయ్యెను దైవవశత
మీర లెవ్వరొ తెలియంగఁ గోరెదయ్య

811. కం. అన విని యాజనపతియున్
దన వృత్తాంతమ్ము నెల్లఁ దద్దయు వేడ్కన్
వినిపించి యింకమీదన్
మనమిట నేభయము లేక మసలగవచ్చున్

812. చం. జరిగిన దేదియో జరిగె శాంతి వహించి గతంబు స్వప్నమం
చరయుట ధర్మ మింకపయి నాప్త సఖుండవు నీవె నాకు, నే
యరమర లేక యుండుమిట, నాత్మజులంచును, భార్యయంచు వెం
పర లిక నాడనేమిటికి, వారలకంటెను మేలు శాత్రవుల్

813. చం. అని సురథుండు వల్క విని యావణిజుండును పల్కెనిట్టు లో
జనపతి నీవుచెప్పునది సత్యమె యైనను నాదు మానసం
బనయము చంచలంబగుచు నట్టిటుఁ బర్విడుచుండె, నెంతకున్
వినదది, యేమి చేయుదిక వీడుటకష్టము రాగబంధముల్

814. వ. అనిన సురథుండిట్లనియె

815. ఉ. నీకుఁగలట్టి బెంగ యది నెచ్చెలి! నాకును గల్గునయ్య, య
త్యాకుల మౌను చిత్తమది యప్పటి వైభవమెల్ల నాయెదన్
దాకిన యంత, నైనఁబరితాపము నొందక నిగ్రహమ్మునన్
దేఁకువఁగల్గి యుండెదను దేవుని పైననె భారముంచుచున్

816. చం. మనమిపుడీసుమేధసుని, మాన్యు, మహర్షిని చేరి యంతయున్
వినిచితిమేని దుఃఖములు వీడు నుపాయము నెద్దియైన న
య్యనఘుడు చెప్పవచ్చును దయాంబుధి యాత డటంచుఁబల్కి, ద
ర్శనమొనరించి రిర్వురును శాంతుని తక్షణ మాతపోధనున్

817. తే.గీ. అరిగి సాష్టాంగ పడగ మహర్షియంత
వారి నాశీర్వదించి యభయమొసంగి
యుచితమౌ నాసనములఁగూర్చుండఁజేయ
సురథుడిట్లనె ఋషి వర్యుఁజూచి భక్తి

818. చం. పరమతపోధనా! యితడు వైశ్యుడు మిత్రుడు నాకు, వీనిపై
కరుణ యొకింత లేక తన కన్నకుమారులు ధర్మపత్నియున్
పరుషములాడి యిల్వెడలఁబంచిన మిక్కిలి దీనచిత్తుడై
కరముఁదపించి యివ్విధిని కానలలో బడివచ్చె దుస్థితిన్

819. కం. తనయర్ధాంగిని సుతులన్
మనమున నిరతమ్ముఁదలచి మఱి మఱి దుఃఖం
బునఁగుములుచు నుండును, శాం
తినిఁబొందకయుండు మిగుల దీనస్థితుడై

820. చం. ఇతని చరిత్ర మిట్లయిన నేలొకొ నాకును నేడు రాజ్యమున్
సతియును, భూప్రజల్ సుభట సంఘము లశ్వము లేన్గులెల్ల సం
తతమును గుర్తువచ్చుచు నెదన్ విడ వెంతకు, దుఃఖమయ్యె, నీ
స్థితికిని కారణంబెదియొ తెల్పుము తీర్పుము మాదు చింతలన్

821. చం. సురథుని యాత్మ వేదనను చూచి సుమేధసు డిట్లువల్కె నో
నరవర! తెల్పెదన్ వినుము నమ్రుడవై, జగముల్ నిరంతరం
బరయగ పుట్టిగిట్టుటకు నాదియుగంబుల నుండి మాయయే
పరగును హేతువై, బుధులు వల్కిరి 'శక్తి' యటంచు దానినే

822. కం. ఏయుగముల యందైనను
మాయకు మోహితులుగాక మసలెదు వారల్
ధీయుతు లెందునుఁగనరా
రోయవనీ నాథ! పంకజోద్భవు డాదిన్

## పంకజాసన పంకజగర్భుల మోహవిభ్రాంతి

823. చం. అరుదుగ మున్ను సత్యయుగమందు నొకప్పుడు విష్ణుమూర్తి తా
నిరవుగ బ్రహ్మవిద్యఁగొననెంచి తపంబొనరించె పెక్కువ
త్సరములు తెల్ల దీవిపయి, సారసగర్భుడు సైత మొక్కచో
పరసుఖ మాత్మఁగోరుచు తపం బొనరించెను పెద్దకాలమున్

824. చం. అలయక కొంతకాలమటు లర్థితపంబొనరించి వెన్నుడా
స్థలమును వీడి యొందుకడ సల్పఁగడంగె తపంబు, నంతనా
నలువయు నొండుచోటికిఁజనన్ సమకట్టి యరుంగు చుండ, తా
గలిసెను మార్గమధ్యమునఁగంజ దళాక్షు విశాల వక్షునిన్

825. ఆ.వె. నీ వెవండవనుచు నీవె వ్వరనుచును
ఒకరి నొకరు నిట్టు లొత్తి యడుగ
అబ్జగర్భు డంత నఖిల జగతి కేను
సృష్టి కర్త ననుచు చెప్పె వేడ్క

826. చం. అది విని విష్ణుమూర్తి కడు నాగ్రహమందుచు మూర్ఖచిత్తుడా!
వదరెదవేల విశ్వము నవక్రగతిన్ సృజియింతు నేనె నీ
కిది తగదిట్లు వల్క యన, నేమియు లక్ష్యము సేయ కబ్జజుం
డెదిరిచి పల్కె నీకు కలదే సృజియించెడి శక్తి యెన్నడేన్

827. చం. అనిన జనార్దనుండనియె నబ్జజ నీవు రజోగుణంబునన్
మనెదవు నేను సత్వగుణమాన్యుడ మున్ మధుకైట భాసురుల్
నిను వధియింపఁబోవ నటనిల్చి యెదిర్చి వధించి నాడ న
ద్దనుజుల గుర్తు లేదె, యిటు దర్పమునన్ బలుకంగ నేలొకో

828. కం. అని యిట్లిరువురు నేనే
ఘనుడను నేఘనుడనంచు కలహములాడన్
జనియించెను వారల మ
ధ్యన నొకలింగమ్ము దీర్ఘ తరమై యంతన్

829. వ. ఆశ్చర్య చకితులై దానిన్ గనుచున్న పద్మజ
పద్మనాభులంగని యశరీరవాణియిట్లనియె

830. ఉ. చాలిక మీ వివాదములు శ్రద్ధగ నాపలు కాలకింపుడీ!
మేలగు మీకు, దీర్ఘమయి మిన్నులు తాకుచునున్న లింగమున్
మూలము నంతమున్ దెలిసి ముందుగ నెవ్వడువచ్చి యిచ్చుటన్
వాలునొ, యాతడేఘనుడు పందెమువెట్టి తుపక్రమింపుడీ

831. ఉ. వేలుపుఁబల్కులన్ వినిన వెన్నుడు లింగము వెంటనంటి పా
తాళమువైపు, బ్రహ్మయును దానినిఁబట్టుకనింగివైపుకున్
పోలిన యంత దవ్వరిగి, పోవుటకాపయి శక్తిలేక యిం
కేల వృథాశ్రమంబనుచు నిర్వురు వెన్కకు వచ్చు చుండగన్

832\. చం. శివుని శిరమ్మునుండి కడుచిత్రముగా నొక కేతకీదళం
బవనికి జారుచుండఁగని యబ్జజు డప్పుడ దానిఁగొంచు ను
త్సవమున వచ్చి తెల్పె నిదె చయ్యన లింగము వెంటనేగి నే
నవధి నెఱింగితిన్ దొరికె నచ్చట కేతకి యంచుఁజూపినన్

833\. ఉ. సారసనాభు డందుల కసమ్మతిఁదెల్పుచుఁబల్కె దీనికె
వ్వారలు సాక్షి తెల్పుము నిబద్ధిగ నీవటఁ దెచ్చి యున్నచో
సారససంభవా! యనిన సందియ మందక బ్రహ్మదేవుడున్
వేరెవరింక సాక్ష్యమిట, వేడెద దీనినె పల్క సాక్ష్యమున్

834\. చం. అజుని మనోరథంబెఱిగి యప్పుడ కేతకిపల్కె "నన్నుతా
నిజముగ శూలిశీర్షమున నెక్కొని యుండగఁదెచ్చె యిప్పుడీ
యజుడు నిజమ్ము వల్కె నన నంబుజ నాభుడు విశ్వసింప కీ
నిజము శివుండె పల్కవలె నేమది నమ్మను దీనిమాటలన్

835\. కం. అని విష్ణువనగ నంతయు
వినుచుండిన శంకరుండు విస్తృత కోపం
బున కేతకిఁ గని నీకి
ట్లనృతము లాడదగునే దురభిమానమునన్

836\. చం. ఇదె శపియించుచుంటి నిను నింకపయిన్ దగవీవు నాకు స
మ్ముదమున పూజసేయుటకు; పొమ్మని దానిఁ దిరస్కరింప, న
మ్ముదుసలి వేల్పు సిగ్గుపడి మోమటు వంచి నమస్కరించె తా
సదమల భక్తి శూలికిని సారసనాభున కార్ద్ర నేత్రుడై

837\. మ. సురథా! చూచితె యెంతవారలయినన్ జోద్యంబు, తన్మాయకున్
శిరముల్ వంచక తప్పదం చెఱుగుమా! శ్రీకాంతుడున్ బ్రహ్మయున్
పరమ జ్ఞానులటంచు నెంతుముగదా! వారే యిటుల్ మోహవి
స్తరులై వర్తిలిరన్న యింక మనకున్ సాధ్యంబె నిర్మోహముల్

838\. మ. సకల ప్రాణుల యందు విస్తరిలి యాశ్చర్యంబుగా నెల్లరన్
వికలత్వం బొనరించు మాయ యదియే విజ్ఞానమున్ గూర్చునొ
క్కొకచో, కావున బంధమోక్షములకున్ యోచింప నాశక్తియే
ప్రకటింపంబడు కారణంబగుచు నిర్ద్వంద్వంబుగా భూవరా!





839\. శా. మాయాశక్తి యనాది నిత్యము వచింపన్ దుష్కరం బిట్టిదం,
చాయా కారణ కార్యసంఘముల కొయ్యన్ దానె మూలంబగున్
మాయాశక్తి యొకింత లేని యెడలం బ్రాణుల్ శవంబుల్ నిజం,
బాయా ప్రాణుల రూపముల్ గొనుచు తా నారీతులన్ భాసిలున్

840\. ఉ. ఆకృతి లేనిదయ్యు నది యాకృతిఁదాల్చును దేవకార్యముల్
సేకొని దీర్ప, తద్గుణ విశిష్టమునైన శుభాకృతిన్ సదా
లోకులు సంస్తుతింతురు విలోకన పంక్తుల కుత్సవంబుగన్
లోకములన్ సృజించుటయు లోనికిఁగొంటయు నామె చేష్టలే

## సుమేధుడు వచించిన దేవీవ్రతము

841\. వ. ఇట్లు సుమేధసుండు తెల్పిన దేవీ మాహాత్మ్యంబువిని సురథుండు తదర్చనా
విధానంబు తెలియం గోరి వినయ వినమితోత్తమాంగుండై యిట్లభ్యర్థించె

842\. మ. మునివర్యా! జగదంబ వృత్తమును సంపూర్ణంబుగా దెల్పి నా
మనమున్ సంతసమొందఁజేసితిరి, తన్మాహాత్మ్యమున్ వింటి, నా
జననీ పూజల నెట్లు సల్పవలె, తత్సంబంధ మౌ మంత్రముల్
దనరన్ హోమ విధుల్ సవిస్తరముగా ధర్మజ్ఞ తెల్పంగదే!

843\. కం. అని ధాత్రీశుడు వల్కగ
మునివర్యుడు సంతసించి పూజాక్రమమున్
వినిపించె నివ్విధంబున
జననాథుని మనసుకెక్క శాస్త్రోక్తవిధిన్

844\. కం. మానుగ దేవీవ్రతమును
జ్ఞానదమును మఱియు సకల సంపత్ప్రదమున్
పూని కడు భక్తి సలిపిన
దానన్ ముక్తియును గలుగు తలఁగును బాధల్

845\. సీ. ప్రత్యూషమున లేచి పరదేవిఁదలచుచు
నభ్యంగన స్నాన మాచరించి
విమలాంబరమ్ముల వేడ్కతోధరియించి
గోమయమ్మున గృహ భూమి నలికి

ఉన్నతాసనమును నొప్పుగా నటనిల్పి
సామగ్రి నెల్లను సంతరించి
పూతాంబువులతోడ భూతశుద్ధి నొనర్చి
ద్రవ్యాదికముల శుద్ధంబొనర్చి

గీ. అష్టదళ పద్మమందున నంచితముగ
మంత్ర బీజాక్షరముల సమ్మతి రచించి
తామ్ర షట్కోణ యంత్రమ్ము తగిన రీతి
దానిపై ప్రతిష్ఠించి ముదమ్ముతోడ
భక్తి భజియింపవలయు వేదోక్త విధిని

846. కం. దేవీ నవాక్షరిని భూ
దేవులు జపియింప నంత దీక్షాపరతన్
గావింప వలయు హోమము
భావించి దశాంశ మందు భక్తియుతుండై

847. తే.గీ. తద్దశాంశము భోజన తర్పణమ్ము
నంత దేవీచరిత్ర పారాయణమ్ము
వరుసఁగావింప వలయు నవారితముగ
చిత్త మేకాగ్ర మొనరించి చింతవీడి

848. తే.గీ. చైత్రముననైన నాశ్వయుజమున నైన
కలశమును నిల్పి దేవినిఁగొలుతు రటులె
పాయసాన్నములను బెట్టి భక్తితోడ
ప్రథమ దివసమ్ము నుండి నవమి వరకును

849. చం. కలశముపైన యంత్రమును క్రమత నిల్పి యవాంకురమ్ము లిం
పలరగ నుంచి పుష్పతతి నల్లిన చక్కని పాలవెల్లి న
క్కలశముపై నమర్చి సుమగంధములొప్ప గృహంబునెల్ల సొం
పెలయ నలంకరించి వెలయించ వలెన్ దగ ధూపదీపముల్

850. చం. అరుణ సుమంబులే తగును నర్చనసేయ, నవాహ్నముల్ సదా
జరుప వలెన్ త్రికాలముల చక్కగ పూజలు, కల్గినంతలో
నిరవుగ పిండివంటల నహీనగతిన్ పరమాదరంబునన్
వరుసగ నన్నిరోజులును వండి సమర్పణ సేయగా వలెన్





851. సీ. వేద మంత్రమ్ములు వివిధ పురాణముల్
పఠియించ వలెకడు భక్తితోడ
అష్టమి నవములు నాపైన దశమియు
ముఖ్యతిథులు గాన మూడునాళ్ళు
వేదవిదులగు సద్విప్ర వరులఁ బిల్చి
స్వర్ణ రజత భూ వసనము లిచ్చి
గౌరవించవలయు కలిగిన యంతలో
భక్తివెలయగ లోభమ్ము విడిచి

గీ. యెపుడు నవరాత్రి వ్రతముల నెలమిఁజేయు
వార లిహపర సుఖము లవారితముగ
పొందగలరంచు పలికిరి బుధులు నెలమి
వ్రతములం దిది యుత్తమ వ్రతమటంచు

852. మ. సురథా! నీవును నీవ్రతంబు నికపై శుద్ధాంతరంగుండవై
పరదేవిన్ మదినిల్పి చేయు, మదియే భద్రంబు నీ కెప్పుడున్
ధరణీ రాజ్యము నీకు దక్కునిక పైతథ్యంబు నీవారు స
త్వరమే చేరుదు రంతయున్ శుభమగున్ వంశంబు వర్ధిల్లెడున్

853. వ. అనిపల్కి వైశ్యుడైన సమాధింజూచి

854. కం. నీవును దేవీవ్రతమును
భావించి యొనర్పుమయ్య భద్రంబగు, స
ద్భావంబుల నినుఁ జూతురు
నీవారలు, సతియు, సుతులు నిజము సమాధీ!

855. మ. గతజన్మంబున మీర లీవ్రతము చక్కన్ జేయలే, దందుచే
వెతలన్ బొందుచునుంటి రిప్పుడిటు, దేవీపూజ లెవ్వారు స
మ్మతిఁ జేయన్ దల పోయరో దురిత సంబంధంబునన్ వార లు
న్నతిఁ గోల్పోదురు రెంటికిన్ జెడి దురంతంబైన దుఃఖమ్ములన్

856. శా. దేవీ పూజల నిచ్చగింపని జనుల్ తీవ్రామయ గ్రస్తులై
జీవింపంగల, రంతెగాదు మతియున్ క్షీణించు, నాపైన దు

ర్భావంబుల్ పొడసూపు ఘోర నరకావాసంబుఁజేకూరు సం
భావింపంబడ రీ సమాజమున, సంప్రాప్తించు దైన్యస్థితుల్

857. చం. అనుచు సుమేధసుండు జగదంబను గూర్చి యుపన్యసింప, నె
మ్మనముల సంతసించుచు సమాధియు భూరమణుండు నిర్వురున్
మునివరు పాద పద్మములు మూర్ధములంట నమస్కరించి, క
న్గొనల జలంబు లొల్క కడు కూరిమి పల్కుల పల్కిరిట్టులన్

858. చం. పరమ దయానిధే! మిము తపఃపరిశుద్ధునిఁగాంచి నప్పుడే
తిరమగు శాంతి చేకుఱెను, దివ్యతరంగిణి నోలలాడి న
ట్లిరవుగ చక్కనైన హితమిట్టులఁదెల్పి కడున్ పవిత్ర సం
భరితులఁజేసి తయ్య! మము, మాతౌలిజన్మ కృతంబు లెట్టివో!

859. మ. దయతో మాకు ననుగ్రహింపుము మహాత్మా! దివ్యమంత్రంబు, స
న్నియమంబొప్ప జపించుచున్ దమరి సాన్నిధ్యంబు నందిట్లె ని
ర్భయచిత్తంబుల కొంత కాలము వసింపన్ వీలు కల్పింపు, మా
పయినన్ జేరెదమయ్య మాగృహములన్ భవ్యాత్మ! మీయానతిన్

860. వ. వినయ వినమిత గాత్రులై యిట్లభ్యర్థించిన వారలంగని ఋషివర్యుండు సంతసించి వారికి నవాక్షరీ మంత్రోపదేశం బొనరించె, నంతవారును మహర్షి పాదపద్మంబులకు నమస్కరించి

## సమాధి సురథులకు దేవీదర్శనము

861. చం. విమల నదీతటంబున వివిక్త విరాజిత సైకత స్థలిన్
యమ నియమాదు లొప్పగ మహర్షి యొసంగిన మంత్ర రాజమున్
క్రమమున నుచ్చరించుచు విరాగ మనశ్చరులై తపంబు ల
క్షమమునఁ జేయ సాగిరి ప్రశాంతిని బొందుచు కొన్ని మాసముల్

862. తే.గీ. అప్పుడప్పుడు గురువర్యు నంతికమున
కరిగి సాష్టాంగ పడుచు నోగిరము మాని
పర్ణముల నారగించుచు పట్టువిడక
తపమొనర్చిరి కొన్ని వత్సరము లట్లు





863. ఉ. ఇన్ని దినంబులిట్లు తపమేర్పడఁజేసియు వార లీశ్వరిన్
గన్నులఁగానలేక తమకాయములన్ వడి వ్రేల్చనెంచి నె
క్కొన్న మనమ్ములన్ యజనకుండ మొనర్చి త్రికోణ సంగతిన్,
గ్రన్నన నగ్నిఁజేరిచి శిఖల్ వెలయంగ రవుల్పఁజేయుచున్

864. చం. చెరియొక వైపు కూర్చొనిరి చింతయొకింతయు లేక నంతటన్
ఖరతర శస్త్ర ఘాతముల కాయములన్ వడి ద్రెంచి యగ్నిలో
పొరిపొరి మాంసఖండముల బోరన వేయుచునుండ చూచి య
త్తరుణమునన్ దివౌకసులు దన్పిరి వారల పుష్పవృష్టులన్

865. వ. ఆసమయంబున జగదంబ

866. చం. అరుణ సరోజ నేత్ర, అరుణాంబర భూషణ మాలలొప్ప కే
సరిపయి నెక్కి కట్టెదుట సంతసమొప్పగ వచ్చినిల్చి య
య్యిరువురి మానసంబులకు నింపుదలిర్పగ పల్కె, “మీరలే
వరములు గోరు కొందురో నిబద్ధిగ నిచ్చెద తెల్పుడొయ్యనన్”

867. మ. అనినన్ సంతస మంది యా సురథు దయ్యంబన్ జగత్పావనిన్
గనుచున్ బల్కె నమస్కరించి జననీ! గర్వాంధులౌశత్రులన్
దునుమాడన్ గలయట్టు, లాపయిన సంతోషంబునన్ రాజ్య మె
ల్లను నే నేలెడునట్టు లిమ్ము వర మాలస్యంబు లేకుండగన్

868. చం. అని సురథుండు వేడ జగదంబయు సమ్మతిఁదెల్పి భూవరా!
చనుమిక నీదు భూమికి భృశంబుగ శత్రులనోర్చి రాజ్యమున్
ధనమును పొందఁగల్గెదవు ధర్మయుతంబుగ నేలుకొమ్ము, నె
మ్మనముల తప్పు లొప్పుకొని మంత్రులు వత్తురు నీదు చెంతకున్

869. తే.గీ. వేల సంవత్సరమ్ములు వేడ్కతోడ
ధరణి నేలుదు వాపైన తనువు వీడి
యినకులంబున మనువువై జననమంది
యశము నార్జింతు వింక నీ వరుగు మయ్య!

870. వ. అనిపల్క నయ్యంబన్ గని సమాధియు

871. తే.గీ. వినయ వినమిత గాత్రుడై యనియె నిట్లు
సతియు సుతులును గృహములు సంపదలును
నాకు వలదమ్మ యవి బంధనములు దలప
నశ్వరములగు నివి యేల? శాశ్వతమ్ము
నైన మోక్షము నాకీయు మమ్మ! యనుచు
వేడుకొనుచుండ వానికి విశ్వజనని
ముక్తి కనువైన జ్ఞానమ్ము ముదము తోడ
నొసగియంతర్హితంబయ్యె నొయ్య నంత

872. ఉ. క్షత్రియ వైశ్యు లిర్వురును సంతసమందుచు నాశ్రమంబునన్
ఛాత్రుల గూడియున్న ఋషిసత్తముఁజేరి నమస్కరింప, నా
చిత్రమదేమొ మంత్రులటఁ జేరి పదమ్ముల మీద వ్రాలి యా
క్షత్రియ పుంగవున్ గనుచు సాదరమొప్పగఁ బల్కి రివ్విధిన్

873. తే.గీ. అంతరించిరి మ్లేచ్ఛు లో యవని నాథ!
రాజధానికి రమ్ము నీ రాజ్యమెల్ల
వైభవముతోడ నేలు మవారితముగ
ననుచుఁ బ్రార్థింప సురథుండు వినయమెసగ
అంజలించుచు మునివర్యు నానతిఁగొని
యరిగె మంత్రులతోడ రాజ్యమున కపుడ

874. ఉ. అంత సమాధి యాశ్రమమునందె వసించుచు సంగదూరుడై
సంతత మంబికన్ మదిని సమ్మతినిల్పి తపం బొనర్చి, తా
నంతట కొంతకాలమున కాశ్రమమున్ విడి తీర్థ యాత్రలన్
చింతలు మాని చేయుచు ప్రసిద్ధిగ దేవిని సన్నుతించుచున్

875. కం. దేవీ మాహాత్మ్యంబును
భావోద్వేగమున నాడి పాడుచు తుదకున్
జీవన్ముక్తుండై శ్రీ
దేవీ సాయుజ్యమందె దేహాంతమునన్

876. వ. అని పలికి జనమే జయుంజూచి వ్యాసుండిట్లనియె





877. చం. ఇది యొక ముఖ్యఘట్టము నరేశ్వర! దీని నిరంతరమ్ము స
మ్ముదమున వ్రాయు వారలకు పూర్ణముగా బఠియించు వారికిన్
సదమల భక్తి నిత్యమును శ్రావ్యముగా వినిపించు వారికిన్
గొదలు నశించు సంపదలు గూడును మోక్షముఁగల్గు నాపయిన్

878. కం. దీనిని ముద్రించుటకై
పూనికతో ధనము నొసగు పుణ్యాత్ములకున్
మానితముగ సమకూరును
జ్ఞానమ్మును, ధనము సకల సౌభాగ్యంబుల్

879. వ. ఇది శ్రీదేవీ కరుణాకటాక్షలబ్ధ విభవుండును, కమలాంబా సుబ్బరాయుల ద్వితీయ పుత్రుండును కౌశిక సగోత్రుండును అగస్త్యరాజ వంశోద్భవుండును నగు సుబ్బారావుకవి ప్రణీతంబగు శ్రీదేవీ భాగవతమను మహాపురాణమునందు ఓంకారంలో మహేశ్వరీ తత్వం, నిజమైనబంధనము, మహిషుని పుట్టక, ఇంద్రుని యుద్ధసన్నాహము, ఇంద్ర బృహస్పతి సంవాదము, దేవతలకు మహిషునితో యుద్ధము, దేవతల యోటమి, దేవతల వ్యూహము, దివ్యతేజ స్స్వరూపిణి ఆవిర్భావము, మహిషుని సంభ్రమము, మంత్రిరాయబారము, మహిషుని మంత్రాంగము, బాష్కల దుర్ముఖ సంహారము, తామ్రచిక్షుర సంహారము, బిడాల – అసిలోమ సంహారము, మహాలక్ష్మితో మహిషుని సంభాషణము, మందోదరి చరిత్ర, బ్రహ్మాదు లొనర్చినదేవీస్తుతి, శత్రుఘ్నుని పాలన, శుంభనిశుంభుల వృత్తాంతము, దేవీప్రసన్నత, కౌశికీ కాళికల యావిర్భావము, సుగ్రీవ దౌత్యము, కౌశికీ సందేశము అంబికా–ధూమ్ర లోచన సంవాదము, చండ ముండా సురవధ, రక్తబీజ సంహారము, నిశుంభ వధ, శుంభవధ, సమాధి సురథుల వృత్తాంతము, పంకజ నాభ పంకజ గర్భుల విభ్రాంతి, సుమేధసుడు వివరించిన దేవీ వ్రతము, సమాధి–సురథుల దేవీదర్శనము అనుకథలు గల పంచమస్కంధము

**స్వస్తి**



**ఈ గ్రంథ ముద్రణకు తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఇచ్చిన రూ. 30,000/- కాక ఇంకనూ ఆర్థిక సహాయం అందించిన ఈ క్రింది దాతలకు కృతజ్ఞతాభివందనములు.**

| | సర్వశ్రీ | | రూ. |
|---|---|---|---|
| 1. | బొట్లగూడూరు ప్రభాకరరావు - విజయమ్మల ద్వితీయ పుత్రుడు చి॥ శంకర్, హైదరాబాద్ | - | 10,116 |
| 2. | సూరపురాజు వేంకట సుబ్బరాఘవేంద్రరావు గారు శ్రీ భరద్వాజ రుద్రాభిషేక సంఘము, నెల్లూరు | - | 10,000 |
| 3. | అల్లంపాటి వేంకటేశ్వరరెడ్డి గారు, పరికోట | - | 5,116 |
| 4. | చలంచ్యాల వేంకట సుబ్రహ్మణ్య శర్మ గారు, కావలి | - | 5,000 |
| 5. | చలంచ్యాల సూర్యప్రకాశరావుగారు, కావలి | - | 5,000 |
| 6. | దువ్వూరి బాలకృష్ణారెడ్డి గారు, కావలి | - | 5,000 |
| 7. | సురభి వెంకట చలమయ్య గారు, ఆత్మకూరు | - | 3,000 |
| 8. | నందనవనం శ్రీ హరిరావుగారు, కావలి | - | 2,116 |
| 9. | గోనుగుంట వేంకటరామయ్యగారు, కావలి | - | 2,000 |
| 10. | పాలిశెట్టి మాలకొండయ్యగారు, కావలి | - | 1,116 |
| 11. | ఇప్పగుంట మాలకొండయ్య - శ్రీమతి వెంకట సుబ్బమ్మగారలు | - | 1,116 |
| 12. | ధూర్జటి రామసుబ్బారావుగారు, కావలి | - | 1,116 |
| 13. | పొన్నలూరు వెంకట నాగశరద్ ప్రభాకర్ సాయి గారు, కావలి | - | 1,116 |
| 14. | చన్నావెంకట సత్యనారాయణ గారు | - | 1,116 |
| 15. | శ్రీమతి అళహరి రామమ్మ - జయకృష్ణ, కావలి | - | 1,116 |
| 16. | వి. రామబ్రహ్మం శ్రీమతి డి.వి.యస్. రాధ గారలు, కావలి | - | 1,116 |
| 17. | అత్తోటి మాల కొండయ్యగారు, కావలి | - | 1,116 |
| 18. | పోలంరాజు వేంకటనాగేంద్ర బాబూరావు గారు, కావలి | - | 1,116 |
| 19. | పణిదపు వీరబ్రహ్మంగారు, చాకలకొండ | - | 1,116 |
| 20. | వెలిశెట్టి నారాయణరావుగారు, బెడుసుపల్లె | - | 1,116 |
| 21. | ఆత్మకూరు వేంకటసుబ్బయ్యగారు, అనంతసాగరం | - | 1,116 |
| 22. | గునుపూడి వేంకటేశ్వర్లు శ్రీమతి సుబ్బరత్నమ్మగారలు, కావలి | - | 1,116 |
| 23. | బాపట్ల గంగయ్య గారు, కావలి | - | 1,016 |
| 24. | కురుచేటి వేంకటేశ్వర్లు శ్రీమతి కస్తూరిదేవి గారల, కావలి | - | 1,000 |
| 25. | గట్టుపల్లి సుబ్బరాయుడు శ్రీమతి కల్పవల్లి గారలు, కావలి | - | 1,000 |
| 26. | పెళ్ళూరు కోటయ్యగారు, కావలి | - | 1,000 |
| 27. | కసవరాజు రామమూర్తిగారు, కావలి | - | 1,000 |
| 28. | శ్రీమతి తెలబోలు శారదమ్మ గారు, కావలి | - | 516 |